డా॥ మిక్కిలినేని కళాసాహిత్యం

# ఆంధ్ర నాటక రంగ చరిత్ర

కళాప్రపూర్ణ

డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి



సీతారత్నం గ్రంథమాల

జి-2, మధువన అపార్టుమెంటు, ఫోన్ : 476126

మొగల్‌రాజపురం - విజయవాడ - 10

ప్రథమ ముద్రణ 1965

ద్వితీయ ముద్రణ 2002



డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

జి-2, మధువన అపార్టుమెంటు,

మొగల్‌రాజపురం , విజయవాడ - 10

ఫోన్ : 476126

వెల : రు. 300/-

టైటిల్ డిజైన్ : K.U. మహేష్

ప్రతులు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని షాపులలో దొరుకును.

విజ్ఞాన్‌భవన్, 4-1-435

బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 1

ముద్రణ :

నాగార్జున ఎంటర్‌ప్రైజెస్

చంద్రం బిల్డింగ్స్ : విజయవాడ-4

ఫోన్ : 430302

ప్రథమ ముద్రణ

# అంకితం



పద్మభూషణ్, దాదాసాహెబ్ ఫాల్కే అవార్డు గ్రహీత

డా॥ అక్కినేని నాగేశ్వరరావు గారికి

# అంకితం

రైతుబిడ్డగా పుట్టి, రైతు బిడ్డగా పెరిగి, ఆంధ్ర నాటక రంగస్థలం మీద చిన్ననాడే ఆడపిల్ల పాత్రలను అపురూపంగా అభినయించి, ఆంధ్ర ప్రజల మన్ననలందుకుని, చలనచిత్ర పరిశ్రమలో ప్రవేశించి, స్వయంకృషితో పైకి వచ్చి, భిన్న విభిన్న నాయకపాత్రల్లో ఉన్నతంగా జీవించి నటనలో రాణకెక్కి, అశేష ఆంధ్ర ప్రేక్షకుల అపార ఆదరాభిమానాలను చూరగొని, నటసామ్రాట్టని బిరుదుపొంది, కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలచే పరిగణింపబడి, పద్మశ్రీ బిరుదునందుకుని అటు ఆంధ్ర నాటక రంగానికి, ఇటు చలనచిత్ర రంగానికి విశేష కీర్తి నార్జించిపెట్టిన విశాల హృదయులూ, అభ్యుదయ కళోపాసకులూ, మిత్రులూ అయిన నటసామ్రాట్ పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు గారికి వారి చలనచిత్ర జీవిత రజతోత్సవపు కానుకగా ఈ ఆంధ్ర నాటకరంగ చరిత్రను హృదయపూర్వకంగా అంకితమిస్తున్నాను.

కళాప్రపూర్ణ

డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి



# అపూర్వ గ్రంథానికి అక్కినేని కృతజ్ఞతలు

మిత్రులు మిక్కిలినేని రాధాకృష్ణమూర్తిగారు నాకు చాలాకాలంగా తెలుసు. ఏభై సంవత్సరాల క్రితం ఒకనాడు ఉదయం వారు నావద్దకు వచ్చారు. వస్తూ ఎన్నో వందల పేజీలతో వున్న ఒక పెద్ద వ్రాతప్రతిని వెంట తీసుకువచ్చారు.

ఏమిటీ వ్రాతప్రతి అని అడిగాను ఆంధ్ర నాటకరంగం గురించి నేను వ్రాస్తున్న గ్రంథం అన్నారాయన నిజంగా నాకుభయమేసింది. నాకు ఎక్కువగా గ్రంథాలు చదివే అలవాటులేదు. ఇది ఎలా చదవాలా అని.

నాటకరంగాన్ని గూర్చి అందులో ఆంధ్ర నాటకరంగాన్ని గూర్చి నా సహచర నటుడు వ్రాస్తున్నాడంటే నాకు అమితానందం కలిగింది ఎందుకు? నాకీ ఆనందం? నేనీ రోజున సినిమా నటుణ్ణి అయినా ఆడపిల్లగా, ఆంధ్రనాటక రంగస్థలం మీద చిన్ననాడే నటుడిగా "అ ఆలు దిద్దుకున్నాను ఎంతో అనుభవం సంపాదించాను ఆ అనుభవాలే ఈనాటికి ఇంకా నాలో నిలిచివున్నాయి అందుకే ఈ ఆనందం ఆ కారణంగానే, వారిపట్ల, వారి రచనపట్లా ఆసక్తీ, ఆదరణ కలిగింది.

పవిత్రమైన ఆంధ్ర నాటకరంగస్థలంమీద మహానటులెందరో అవతరించారు. భావితరాలకు పునాదులు వేశారు. నాటకరంగానికి ఎంతో గౌరవాన్నీ, ప్రతిష్ఠనూ చేకూర్చిపెట్టారు. మరెంతోమంది నటులు, అభివృద్ధిలోకి వచ్చారు. నవచైతన్యంతో ఔత్సాహిక నాటకరంగం నిత్యనూతనంగా వెలుగొందింది. ఈ రోజున మన కళారంగం నిత్యనూతనంగా వెలుగొందింది. ఈ రోజున మన కళారంగం కళకళలాడుతూవుంది.

ఇది ఆంధ్ర నాటకరంగం గూర్చి వ్రాయబడిన అపూర్వ గ్రంథం. ఎంతో కృషిచేసి వ్రాసిన పరిశోధనా గ్రంథమిది. ఇది నాటక రంగానికీ, నటీనటులకూ ఒక వేదంలాంటిది. ఈ మాత్రం కృషి ఇంతవరకు ఎవరూ చేయలేదని చెప్పడంలో అతిశయోక్తిలేదు.

ముందు తరాల వారికి గడచిన తరాలలో జరిగిందేదో తెలియాలి. దాని పరిణామదశ తెలియాలి. దానిలోవున్న శక్తి తెలియాలి. ఆ రంగంలో కృషిచేసిన మహామహులూ, వారి గొప్పతనమూ తెలియాలి.

ఈ గ్రంథం మన నాటకరంగాన్ని స్థూలంగా కొన్ని వందల సంవత్సరాల పరిణామదశను మనకు చూపుతుంది. ఒక నూరు సంవత్సరాల నాటకరంగ విలువల్ని మనముందుంచుతుంది.

సృష్ట్యాదినుండి మానవుడు ప్రకృతిని అనుకరించి ఆరాధించిన

కళాశీలి కావటంతో ఈ గ్రంథం ప్రారంభమౌతుంది. జీవన సంగ్రామంలో ఆనందోపాసన ఎలా పొందిందీ వివరిస్తుంది. ఆయా కాలాల కళాచరిత్రనూ, సామాజిక అభివృద్ధినీ చిత్రిస్తుంది. మన ప్రాచీన సంప్రదాయాలనూ, వన్నెతరగని శాస్త్రీయ విషయాలనూ విపులీకరిస్తుంది. ఆదిమయుగం నుండి 19వ శతాబ్దం వరకు నిమ్నోన్నతాల్లో పయనించిన కళాచరిత్ర అభివర్ణితమౌతుంది. గడచిన నూరు సంవత్సరాలలో మన నాటకరంగం, లలితకళలు ఎలా పునర్వికాసం చెందిందీ, ఏయే ఘట్టాల్లో ఎక్కడెక్కడ ప్రోజ్వలితమైందీ వివరంగా వుంది. భారత స్వాతంత్ర్యోద్యమానికీ, సాంఘికోద్యమానికీ, మన కళారంగం ఎలా తోడ్పడిందీ విపులీకరించబడింది.

ఇందులో ఒక భాగంగా, పలువురు కళాశీలురు, రచయితల, నటీనటుల జీవితచరిత్రలూ, ఛాయాచిత్రాలూ చేర్చబడ్డాయి. అలాగే అనేక జానపద కళారూపాలకు సంబంధించిన పెక్కు చిత్రాలు సంతరించబడ్డాయి. అలభ్యమైనవీ, అపూర్వమైనవీ కొన్నింటిని సేకరించడం ఎన్నతగినది. ఇది సామాన్య విషయం కాదు.

ఇంతటి మహత్తర కృషి చేయటానికి, అమూల్యమైన ఈ గ్రంథం పూర్తి చేయటానికి, ఒక వ్యక్తికి ఎంతటి కళాదృష్టీ, తృష్ణా వుండివుండాలి? ఎంతటి పరిశోధనాపటిమ, ఎంతశక్తీ, ఓర్పూ, దీక్షా, పట్టుదల కావాలో? ఒకసారి ఆలోచిస్తే మనకే బోధపడుతుంది. అదే మిత్రులు రాధాకృష్ణమూర్తిగారు అపూర్వంగా చేశారు. ఇది నేటి మన కళాకారులందరికీ గర్వకారణం.

నాటకరంగంతో కాస్త పరిచయమున్న వాణ్ణిగా, వారిపట్లా, వారి కృషి పట్లా, గ్రంథంపట్లా, సహచరనటుడుగా నాకు అపారమైన ప్రేమా, ఆదరణా, శ్రద్ధా పెరిగింది. దీనిని ప్రచురించండి మీ ప్రయత్నంలో నేనూ కొంత సహాయకారిగా వుంటాను అని నా సంతోషాన్ని వెల్లడించాను. ఆంధ్ర నాటకరంగం మీద కృతజ్ఞతా భావమున్నవాణ్ణిగా ఈ గ్రంథం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ ద్వారా తెలుగుభాషా సమితి నిర్వహించిన గ్రంథాలపోటీలో ఉత్తమ గ్రంథంగా ఉన్నతస్థాయిలో నిలబడి అవార్డును సంపాదించింది. ఆ తరువాత ఆంధ్రదేశం ఆయన కృషిని గుర్తించి సన్మానించింది.

ఈ రోజు నా చలనచిత్ర జీవిత రజతోత్సవ సందర్భంలో వారు ఈ గ్రంథాన్ని నాకు అంకితమిస్తానన్నారు. ఈ రంగానికి బిడ్డనునేను తల్లిని నావద్ద వుంచమంటే కాదని ఏ పుత్రుడైనా అనగలడా? అందుకే పూజ్యభావంతోనే మహత్తరమైన ఈ ఆంధ్రనాటకరంగ చరిత్రను స్వీకరిస్తూ శ్రీ మిక్కిలినేనివారికి అక్కినేనిగా కృతజ్ఞతలు చెప్పకుంటున్నాను.

- అక్కినేని

## భావి రంగస్థల కళాకారులకు బంగారుదీపిక

## జ్ఞానపీఠ అవార్డు గ్రహీత పద్మభూషణ్

### రాజ్యసభ సభ్యులు

# డా॥ సి. నారాయణరెడ్డి

## అభినందన



మిత్రులు మిక్కిలినేనిగారు ప్రస్తుతం నటులు. కృష్ణవేణి పరిసరాలలో నటనకు తొలిపాఠాలు నేర్చుకుని, ప్రజానాట్యమండలి వేదికపై పదును దిద్దుకుని, మొక్కవోని అభ్యుదయ భావావేశంతో ముక్కాకలుతీరి, క్రమంగా చెన్నపురి చలన చిత్రరంగంలో పదిలంగా స్థిరపడిపోయింది ఆయన బహుముఖ ప్రజ్ఞ.

మిక్కిలినేనిగారి నట జీవితం దాదాపు పాతికేళ్లది. ఈ పాతికేళ్లలో ఆయన ప్రతిభ స్ఫుటంగా ప్రస్ఫుటించింది నటుడుగా, బుర్రకథాగాయకుడుగా, జముకుల కథా గాయక నాయకుడుగా.

ఇన్నేళ్ళూ అంతర్వాహినిలా మరో తపన ప్రవహించింది. అంతస్స్రూతంగా మరో తృష్ణ ఆవరించింది. ఆ తపన, ఆ తృష్ణ, ఆకృతిదాల్చిన అక్షరపాత్ర ఈ ఆంధ్ర నాటకరంగ చరిత్ర.

అలనాటి భరతుడు మొదలుకొని ఈనాటి డా॥ అప్పారావు వరకు వెలువడిన గ్రంథాలను పరిశీలించి, వివిధ నాటకరంగ ప్రయోక్తలు, ప్రవక్తలు అందించిన అనుభవసారాన్ని ఆస్వాదించి, సమస్తాంధ్ర దేశంలోని నాటకరంగ రీతులను, జానపద కళారూపాలను స్వయంగా సమాలోకించి ఎన్నెన్నో విషయాలను దారిబత్తెంగా స్వీకరించి, చివరికి గమ్యం చేరుకున్న అవిశ్రాంత యాత్ర ఈ నాటకరంగ చరిత్ర.

ఈ గ్రంథంలో నాటక రంగానికి సంబంధించిన అచుంబితాంశం లేదు అన్ని ప్రకరణాలలో తలమానికం వివిధ జానపద కళారూపాల వివరణాత్మక వ్యాసం మరి సమస్తాంధ్ర దేశం నలుచెరగులా స్థాపించబడిన నాటక సంస్థల గూర్చి, ప్రదర్శింపబడిన నాటకాలను గూర్చి, నటులను గూర్చి పూసగ్రుచ్చినట్లు చెప్పడం బహుప్రయాసతో కూడుకున్న పని ప్రవాసాంధ్ర నాటక రంగానికి సంబంధించిన వృత్తాంతం సేకరించడం ప్రశంసాత్మకమైన కృషి.

కాలగర్భంలో కలిసిపోయిన ఎందరెందరో మహానటుల ఛాయాచిత్రాలు సేకరించి ప్రచురించడం సమకాలీనులే కాక భావితరాల వారు కూడా కైమోడ్పులందించే ఉత్తమ సంకల్పం.

ఆంధ్ర నాటక రంగం క్రమ పరిణామ పరిమళాలను ఆఘ్రాణించే జిజ్ఞాసువులకు అమ్లాన సుమ కదంబం ఈ గ్రంథం.

ఒకవైపు ఉత్తమనటుడుగా చలనచిత్ర రంగంలో వాసికెక్కుతూ, ఇంకొక వైపు తనలో అంతర్నిహితమైన కళాజిజ్ఞాసకు, రచనా పిపాసకు రూపుకట్టించి, తెలుగునాట తులలేని పంట పండించిన మిక్కిలినేనిగారి కృషీవలత్వాన్ని మనసారా అభినందిస్తున్నాను.

మిక్కిలినేనిగారి ఈ నాటక సమీక్షాకృతి నటసామ్రాట్ అక్కినేని నాగేశ్వరరావుగారికి అంకితం కావడం --

"కలిగె పదియారు వన్నె బంగారమునకు
పద్మరాగమ్ముతోడి సంపర్కలబ్ధి."

హైదరాబాద్ — మనసారా అభినందన

15-8-1969 — - సి. నారాయణరెడ్డి

# సమర్పణ



డా॥ వెలగపూడి బాపూజీరావు సతీమణి డా॥ నళిని



ఆంధ్ర నాటకరంగ ద్వితీయ
ముద్రణకు, ధనసహాయం చేసిన
డా॥ బాపూజీరావుగారికి
శ్రీమతి డా॥ నళినిగారికి,
వారి కుటుంబసభ్యులకూ
అంకితభావంతో
నా ॥ఆంధ్రనాటకరంగ
చరిత్రను.
మనసారా సమర్పిస్తున్నాను.
హృదయపూర్వక
కృతజ్ఞతల్ని తెలియ
చేసుకుంటున్నాను.



## బాపూజీరావు గారి తల్లి-తండ్రి



కీ॥శే॥ వెలగపూడి వీరయ్య గారు కీ॥శే॥ వెలగపూడి సామ్రాజమ్మ



మిలీనియం అవార్డు

2001 - సెప్టెంబరు 15-16

తేదీలలో

ఇంగ్లండులో వేల్సు

ముఖ్యపట్టణం

కార్డిఫ్‌లో జరిగిన యూరోపు

తెలుగు మహాసభల్లో

డా॥ మిక్కిలినేనికి

మిలీనియం సత్కారం.

అధ్యక్షులు

డా॥వెలగపూడి బాపూజీరావు.

# తలవంచి
# తల్లిదండ్రులకు అంజలి



తాను చదువుకోకపోయినా, నన్ను చదివించాలని, నన్ను బంగారుబాటలో నడిపించాలనీ, అందలమెక్కించి తనివితీరా చూసి ఆనందించాలనీ, చదువుకో, చదువుకోమని పదేపదే చెప్పినా, నాన్నమాట పెడచెవినిపెట్టి నాటకాల్లో పాత్రలు ధరించాను. అందులోనే పెరిగి పెద్దనైన నన్ను అమ్మ కళ్లారాచూసి ఆనందించింది.

నన్నూ నా కృషినీ, నా ఉన్నతినీ, నాన్నకు చూపించాలని తీపితీపి కలలుకన్నాను. అయితే నా ఉన్నతిని చూడకుండానే నన్ను కళారంగానికి అంకితంచేసి వెళ్ళిపోయారు.

**నన్ను ఇంత వాణ్ణిచేసి వెళ్ళిపోయిన నా బంగారు తల్లిదండ్రులు శ్రీ॥శే॥ వెంకయ్య, అమ్మ సౌభాగ్యమ్మలకు తలవంచి అంజలి ఘటిస్తున్నాను.**

# వదాన్యతకు వందనాలు

ఇంగ్లండులో వేల్సు ముఖ్యపట్టణం. కార్డిఫ్‌లో 2001-సెప్టెంబర్ 15-16 తేదీలలో జరిగిన ఐరోపా తెలుగు మహాసభలకు అధ్యక్షులైన డా॥ నెలగపూడి బాపూజీరావుగారు మహాసభలకు నన్ను ముఖ్యఅతిథిగా ఆహ్వానించి ఆదరించి కళలకు నేను చేసిన కృషిని గుర్తించి నిండు సభలో, జయజయధ్వానాల మధ్య నాకు మిలీనియం అవార్డునిచ్చి ఘనంగా సత్కరించారు

ఆ వెంటనే తెలుగు అసోసియేషన్‌కు ఆయన సేవలకు స్పందించి నేను వారిని సత్కరించాను సభలు ముగిసిన తరువాత వేల్సులో నున్న స్వస్థలం "అబర్గవెన్నీ" సిటీలోవున్న వారింటికి తీసుకువెళ్ళి అపారమైన ప్రేమాభిమానాలతో ఆతిధ్యమిచ్చారు.

చుట్టుప్రక్కల పట్టణాలలో ఉన్న డాక్టర్లయిన మిత్రులందరినీ ఆహ్వానించి నాకు పరిచయంచేసి డిన్నరిచ్చారు.

అంతేకాక "అబర్గవెన్నీ - సిటీకి చుట్టుప్రక్కలనున్న చారిత్రకస్థలాలను, చరిత్రాత్మకమైన బ్రహ్మాండమైన కోటల్నీ, చర్చిల్నీ, ప్రకృతి సౌందర్యాన్ని చూపించారు వారి శ్రీమతి డా॥ నళిని చెల్లెలు అన్నపూర్ణమ్మగార్ల అతిథిమర్యాదలు మరువలేనివి.

ముఖ్యవిషయం ఏమంటే నా రచనలు- ఆంధ్ర నాటకరంగ చరిత్ర "నటరత్నాలు" గ్రంథాలు. ఇంతకుముందే చదివారు. ఆ గ్రంథాలు నలభై సంవత్సరాల క్రితమే అయిపోయాయనీ, మళ్ళీ ముద్రించే అవకాశం లేదనీ మాటల సందర్భంలో నిరాశను వెలిబుచ్చాను. అంతే.

వారి వద్ద సెలవు తీసుకుని ఇండియాకి బయలుదేరే ముందు "ఆంధ్రనాటకరంగ చరిత్రను" ముద్రించండని. లక్ష రూపాయలకు సరిపోయే పదిహేనువందల పౌన్లు చెక్కును నాకు గిఫ్ట్‌గా ఇచ్చారు. అనూహ్యమైన ఈ సంఘటనకు తట్టుకోలేక కళ్ళవెంట నీరు కార్చాను. బాపూజీరావుగారు నన్ను కౌగలించుకుని ఓదార్చారు. మా స్వంత మనిషి ఇంటినుంచి వెళ్ళిపోతున్న ట్లుందన్నారు. గ్రంథాన్ని ముద్రించండన్నారు. మీరు సభలకు రావటం బాగుందన్నారు.

సెలవు తీసుకుని శ్రీమతి డా॥ నళిని గారికీ, చెల్లెలు అన్నపూర్ణమ్మగారికీ కృతజ్ఞతలు చెప్పి ఆనందంగా బర్మింగ్‌హోమ్ బయలుదేరాను.

నేను బ్రతికుండగా మళ్ళీ ఈ గ్రంథం వెలువడుతుందనుకోలేదు. ఆ అవకాశం కల్పించిన ఆత్మీయమిత్రులు బాపూజీరావుగారి రుణం ఎన్నటికీ తీర్చుకోలేను. ఆంధ్ర నాటకరంగం ఆయనకు రుణపడేవుంటుంది. ఆంధ్రనాటకరంగ చరిత్ర ద్వితీయముద్రణను మీకే సమర్పిస్తానని అప్పడే వాగ్దానం చేశాను. నా వాగ్దానాన్ని నిలబెట్టుకున్నందుకు ఆనందిస్తున్నాను.

వారెవరు? నేనెవరు? వారికీ నాకూ సంబంధమేమిటి? కేవలం సాంస్కృతిక సంబంధమేగదా? నా జీవిత చరమదశలో ఈ సంఘటన అపూర్వంగా నిలిచిపోయింది. బాపూజీరావుగారి వదాన్యతకు వందనాలు అర్పిస్తున్నాను.



నీరాజనం :

# ప్రతిభావంతమైన బాపూజీరావు జీవితం

డా॥ వెలగపూడి బాపూజీరావుగారు, గుంటూరు జిల్లా శెలపాడు గ్రామంలో 28-7-1946న జన్మించారు

విద్యాభ్యాసం, సంగం జాగర్లమూడి పరిషత్ హైస్కూల్‌లో జరిగింది హైస్కూలు విద్య పూర్తి అయిన తరువాత గుంటూరు ఆంధ్ర క్రిస్టియన్ కాలేజీలో పి యు.సి. చదివారు.

ఆ తరువాత గుంటూరు మెడికల్ కాలేజీలో యం బి బి యస్ చదివారు పోస్టు గ్రాడ్యుయేషన్ "జిప్మర్ పాండుచేరి నిమోన్స్‌లో బెంగుళూరు ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ మెడికల్ సైన్సెస్‌లో చదివారు

1999లో "MRC, PSVCH" ఫెలోవ్‌షిప్‌ను అందుకున్నారు.

బాపూజీరావుగారు 1973 నుంచి యునైటెడ్ కింగ్‌డమ్, ఇంగ్లాండు నేషనల్ హెల్త్ సర్వీసులో మానసిక వైద్య నిపుణులుగా ప్రఖ్యాతి వహించారు.

ఆంధ్రా యూనివర్శిటీలో చదివే రోజుల్లో మెడికల్ యూనియన్ సంస్థలో చాలా కాలం కీలకపాత్ర వహించి, బహుముఖ సేవచేసి అందరి మన్ననలు అందుకున్నారు.

అలాగే ఇంగ్లాండులో ఉద్యోగాలు చేసే డాక్టర్లందరినీ ఐక్యపర్చి, ఇండియన్ సైక్రియాటిక్ డాక్టర్సు అసోసియేషన్‌ను, స్థాపించి అత్యంత సమర్థవంతంగా నిర్వహించారు.

అలాగే ఆంధ్రదేశంలో ముఖ్యంగా ఆంధ్రా యూనివర్శిటీ, మెడికల్ గ్రాడ్యుయేట్సు, యూనియన్ స్థాపనకు విశేష కృషి చేశారు.

HEAL అల్జిమాడిసేజ్ సొసైటీ చారిటబుల్ ఆర్గనైజేషన్సు', స్వచ్ఛంద సేవా సంస్థల్లో, కార్యనిర్వాహక సంఘంలో ముఖ్యకార్యకర్తగా వ్యవహరించారు. 2002 సంవత్సరంలో రాయల్ సోస్టేట్ సొసైటీ ఆఫ మెడిసన్ ఫెలోషిప్‌కు ఎన్నికయ్యారు.

అంతేకాక ఇంగ్లాండులోనూ, యూరప్‌లోనూ, వివిధ శాఖల్లో

పనిచేస్తున్న ఆంధ్ర డాక్టర్లనందరినీ సమావేశపర్చి యూరోపియన్

తెలుగు అసోసియేషన్‌ను స్థాపించి ప్రతి సంవత్సరం డాక్టర్లందరినీ ఇంగ్లాండులో, ఒక కాలేజీలో సమావేశపర్చి, వైద్య విజ్ఞాన సాధక బాధకాలను చర్చించి ఆంధ్రదేశం నుంచి ప్రముఖ కళాకారులను రప్పించి సాంస్కృతిక కార్యక్రమాలను కనులవిందుగా ఏర్పాటుచేసి ప్రముఖ వైద్యులనూ, కళాకారులనూ ఘనంగా సత్కరించారు.

రెండు సంవత్సరాలకొకసారి ఇంగ్లాండులోనూ, మరో సంవత్సరం యూరప్‌లోనూ సభలు జరిపే యూరోపియన్ తెలుగు మహాసభలను (ఈటాను), సమైక్యంగానూ, సమర్థవంతంగానూ నడుపుతున్నారు

తెలుగు సంస్కృతిని కాపాడటానికి అక్కడ జరిగే ప్రతి తెలుగు మహాసభకూ ఆంధ్రప్రదేశ్ నుంచి "సంగీత, సాహిత్య, నృత్యనాటక, సినిమా, వైజ్ఞానిక రంగాలలో నిష్ణాతులైన వారిని ఆహ్వానించి వారి ప్రదర్శనలు ఏర్పాటు చేసి యూరోప్ ఆంధ్రులందరిలోనూ తరతరాల తెలుగు వైభవాన్ని ప్రభోదిస్తూ అసోసియేషనుకు గణనీయమైన సేవలు చేస్తున్నారు.

ఐరోపా మహాసభలకూ, డాక్టర్ల అసోసియేషన్ సభలకూ వచ్చిన కళాకారులను, ముఖ్యనగరాలకు ఆహ్వానించి ప్రదర్శనలనిప్పించి, ముఖ్య పట్టణాలను చరిత్రాత్మక ప్రదేశాలనూ చూపిస్తారు. ఆనందపరుస్తారు అప్పటినుంచే తానా తెలుగుసంస్థ మార్గంలో (ఈటా సంస్థను దిగ్విజయంగా నడుపుతున్నారు).

2001 సెప్టెంబరు 15-16 తేదీలలో జరిగిన సభలకు నన్ను ముఖ్యఅతిథిగా ఆహ్వానించారు. ఆ మహాసభలు డా॥ బాపూజీరావుగారి అధ్యక్షతన జరిగాయి.

ఒక ప్రక్కన డాక్టరుగా బాధ్యతలను నిర్విఘ్నంగా నిర్వహిస్తూ మరో ప్రక్క సామాజిక, సాంస్కృతిక వికాసంకోసం ఐరోపా ఇంగ్లాండు ఆంధ్రుల జీవితాలను తీర్చిదిద్దటానికి అవిశ్రాంతంగా పనిచేస్తున్న క్రియాశీలి, ఆదర్శవైద్యుడు బాపూజీరావుగారు.

అలాగే వారి శ్రీమతి డా॥ నళిని ఆయన ఆదర్శాలకు అండగా నిలబడి పనిచేస్తున్నారు. ఇంతకీ చెప్పొచ్చేదేమంటే 'నళిని నాగార్జున, ఉస్మానియా యూనివర్శిటీల మాజీ వైస్ ఛాన్సలర్ డా॥ పిన్నమనేని నరసింహారావుగారి కుమార్తె డా॥ నళిని. అల్లుడు బాపూజీరావుగారు. బాపూజీరావుగారంటే నరసింహారావుగారికి అత్యంత ప్రేమానురాగాలు. ఇటీవలే వారు స్వర్గస్థులయ్యారు.

# ఐరోపా తెలుగు మహాసభలు

## ఆత్మీయ మిత్రులకు కృతజ్ఞతలు

ఐరోపా తెలుగు మహాసభలు 2001, సెప్టెంబర్ 15, 16 తేదీలలో ఇంగ్లండ్‌లోని వేల్స్ ముఖ్యపట్టణం కార్డిఫ్‌లో జయప్రదంగా జరిగాయి

ఆ మహాసభలకు నాకు ఆహ్వానం అందిన తరువాత, ఎనభైఆరు సంవత్సరాల వయస్సులో ఇంగ్లండు ప్రయాణం చేయగలనా? వెళ్ళాలా వద్దా అనే ఊగిసలాటలో ఉన్న నాకు ధైర్యం చెప్పి మద్రాసు తీసుకువెళ్ళి వీసా తెప్పించి నన్ను సభలకు పంపించిన ప్రసిద్ధ సినీ విమర్శకుడు, ప్రియమిత్రుడు కాట్రగడ్డ నర్సయ్యగారికి ప్రథమంగా కృతజ్ఞతలు చెప్పకుంటున్నాను.

సెప్టెంబరు 11వ తేదీన న్యూయార్కులో వరల్డ్ ట్రేడ్ సెంటరు టెర్రరిస్టుల దాడితో మండిపోయే సమయంలో హైదరాబాదు నుండి అరబ్ ఎమిరేట్సు విమానంలో గుంటూరు వాస్తవ్యులు ప్రొఫెసర్ డా॥ వాసుదేవరావుగారితో బయలుదేరాను. వాసుదేవరావుగారు తెలుగు మహాసభలకు రావటమేకాక ఇంగ్లాండులో నేను పర్యటించిన ముఖ్యప్రాంతాలన్నిటిలో నావెంటనే వుండి నాకెంతో సహాయపడిన మిత్రులు.

ఎమిరేట్సు విమానం, ఇంగ్లండులోవున్న అతి పెద్ద సుందర నగరమైన "బర్మింగ్‌హాం"లో దిగింది మా ఇద్దరినీ ఆహ్వానించటానికి విమానాశ్రయానికి వచ్చిన డా॥ పొట్లూరి రమేష్, శ్రీమతి అట్లూరి జయశ్రీ ఆప్యాయతతో ఆహ్వానించి వారింటికి తీసుకువెళ్ళారు. తిరిగివచ్చే వరకూ వారింట్లోనే ఉన్నాను వారిచ్చిన ఆతిథ్యం జీవితంలో మరువరానిది. జయశ్రీ కన్నకూతురులా చూసుకుంది.

ముఖ్యంగా డా॥ రమేష్ ఉద్యోగానికి సెలవుపెట్టి, ఇంగ్లండులో ముఖ్యప్రదేశాలైన లండన్, బర్మింగ్‌హాం, "షేక్స్‌పియర్ జన్మస్థలం వేల్స్‌లో కార్డిఫ్ ఆక్స్‌ఫర్డ్ మొదలైన పట్టణాలనెన్నింటినో చూపించటమేకాక కార్డిఫ్‌లో జరిగిన తెలుగు మహాసభలలో వెన్నంటి వుండి దంపతులిరువురూ చూపించిన అభిమానం, ఆప్యాయతలు ఎన్నటికీ మరువలేనివి.

బర్మింగ్‌హాంలో కళాబంధు "సాహితీమిత్రులు డా॥ చావరాల బాబూరావు గారు, శ్రీమతి భారతి నాతోపాటు మరికొందరు మిత్రులను విందుకు ఆహ్వానించారు. డా॥ బాబూరావుగారు ఐరోపా తెలుగు అసోసియేషన్ స్థాపించిన వారిలో ముఖ్యులు. వారి ఆధ్వర్యంలో

తెలుగు మహాసభలు, సాహిత్య సాంస్కృతిక సభలు ఎన్నో జరిగాయి

తెలుగు అసోసియేషన్ సభలను ఎన్.టి. రామారావుగారితో ప్రారంభింప చేయటమేకాక తదనంతరకాలంలో జరిగిన సభలకు డా॥ అక్కినేని, గుమ్మడి, సినారె, ఆరుద్ర, సోమసుందర్, విశ్వనాథ్, కృష్ణంరాజు, చిరంజీవి, బాపు, రమణ, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు మొదలైన కళాకారులెందరినో ఆహ్వానించి సత్కరించారు ఎంతో మంది గాయకులను, ఆర్కెస్ట్రాలను ఆహ్వానించి ప్రదర్శనలనిప్పించారు ఎందుకీ విషయాలు వ్రాస్తున్నానంటే ఆనాటి సభలకు వచ్చిన కృష్ణ, విజయనిర్మల కూడా విందుకు వచ్చారు. ఆ సందర్భంలో నా రచనలు ప్రస్తావనకు కూడా వచ్చింది. మీ ఆంధ్ర నాటకరంగ చరిత్ర "నటరత్నాలు", విజయవాడలో దొరకలేదు. మరెక్కడ దొరుకుతాయని ప్రశ్నించారు నలభై సంవత్సరాల క్రితమే ఆ గ్రంథాలు అయిపోయాయని, అధిక వ్యయంతో వాటిని నేను ముద్రించలేకపోయానని చెప్పగా అందుకు స్పందించిన డా॥ కోనేరు శేషగిరిరావుగారు, బాబూరావుగారితో ఆపని మనమెందుకు చేయకూడదన్నారు యస్ మనం చేద్దామన్నారు బాబూరావుగారు. "నటరత్నాలు" గ్రంథం ముద్రిస్తాం అంటూ మీరు సభలకు రావటం ఎంతో బాగుంది. అదృష్టంగా భావిస్తున్నామన్నారు.

ఇక వెలుగు చూడవనుకున్న నా రెండు గ్రంథాలూ, వారి సహాయంవల్ల వెలువడుతున్నందుకు, కళారంగానికి నేను చేసిన కృషికి, వారు చూపిన అత్యంత ఆదరాభిమానాలకు చేతులెత్తి నమస్కరిస్తున్నాను.

నా ఆనందానికి అవధులు లేవు. నటరత్నాల గ్రంథం ద్వితీయ ముద్రణను మీకే సమర్పిస్తానని వాగ్దానం చేశాను.

డా॥ బాబూరావుగారు, శ్రీమతి డా॥ భారతిగార్ల ఆతిథ్యాన్ని మరువలేను.

అలాగే లండన్ వెళ్ళినప్పుడు శ్రీ రంగంగారు, డా॥ ఆత్మాజి ఆప్యాయతతో ఆతిథ్యమిచ్చి కానుకలిచ్చారు.

అలాగే డా॥ శాయాజీరావు, డా॥ ఉషగార్లు వారింటికి విందుకు ఆహ్వానించి అత్యంత ఆదరంతో, కానుకలతో సత్కరించారు.

అలాగే బర్మింగ్‌హాంలో కోనేరు శేషగిరిరావు సతీమణి డా॥ ఉష, ధనంజయరావు దంపతులు, డా॥ రామిరెడ్డి దంపతులు వారిళ్ళకు ఆహ్వానించి అభిమానించి విందునిచ్చారు.

అలాగే మిత్రులు కాట్రగడ్డ నరసయ్యగారి అల్లుడు డా॥ శ్రీకాంత్, శ్రీమతి సీత, స్నేహితురాలు సుధ, రోమన్ చక్రవర్తులు పరిపాలించిన "రోమన్‌బాత్" సిటీకి ఆహ్వానించి రోమన్ చక్రవర్తుల చారిత్రక విశేషాలు, ప్రాచీన

భవనాలను, శిల్పకళా వైభవాన్నీ, దగ్గరలోనేవున్న వెల్‌చర్చిని,అలాగే బ్రిస్టల్‌లో ఎప్పుడో ఇండియా నుంచి ఒక కేసులో వాదించటానికి వచ్చి అక్కడే చనిపోయిన సతీసహగమనాన్ని ధిక్కరించిన రాజారామమోహన్‌రాయ్ సమాధి మండపాన్ని, బ్రిస్టల్ సిటీ అందచందాలను చూపించారు

మరో ముఖ్యవిషయం రెండు సంవత్సరాల క్రితం తెలుగు అసోసియేషన్ కార్యదర్శి డా॥ మాటిన రామకృష్ణగారు, విజయవాడలో డా॥ ఇండ్ల రామసుబ్బారెడ్డిగారింటికి వచ్చారు సుబ్బారెడ్డిగారు నన్ను ఆహ్వానించారు. అప్పటికే రామకృష్ణగారు నా గ్రంథాలకోసం షాపులన్నీ తిరిగి చివరికి పాత పుస్తకాలషాపులో అట్టలు ఊడిపోయి, వర్షంలో తడిసిపోయిన నా నాటకరంగ చరిత్రను రు 160కి కొన్నానని, మీ వద్ద పుస్తకాలు వుంటే ఇవ్వండి అన్నారు. లేవని చెప్పాను. నా ఇతర గ్రంథాలు ఇచ్చాను ఆనాటి వారి పరిచయమే నేను ఇంగ్లాండు సభలకు వెళ్ళటానికీ, అక్కడ నా గ్రంథాలు ముద్రణకు జరిగిన సహాయానికీ, ఆయనే సభలకు కార్యదర్శిగా వుండి నన్ను ఆహ్వానించటానికీ ఆయనే కారణమని భావిస్తున్నాను ఇంతగా సహాయపడిన డా॥ రామకృష్ణగారికి కృతజ్ఞతలకంటే ఏమి చెప్పగలను

అలాగే వేల్సులో "అబర్గవెన్నీ" సిటీలోవున్న డా॥ భానుమూర్తిగారు అతిలోక సుందరమైన, రమణీయమైన "నేషనల్ పార్కును, కార్డిఫ్‌లో వున్న అతి పెద్ద నేచురల్ మ్యూజియంను శ్రమ తీసుకుని నాకు చూపించారు. సతీమణి లక్ష్మిఆతిథ్యమిచ్చారు.

గ్రంథ ముద్రణను ముచ్చటగా ముద్రించటమేకాక అన్ని విధాలా సహకారాన్ని అందించిన "నాగార్జున ఎంటర్‌ప్రైజెస్" మేనేజర్ శ్రీ వై. వెంకటేశ్వరరెడ్డిగారికీ, ద్వితీయ ముద్రణను సుందరంగా తీర్చిదిద్దటంలో, ఫిలిమ్స్ తీయించటంలో పేజీల మేకప్‌లో ఎంతో శ్రమతీసుకున్న టెక్నీషియన్ బి.వి దుర్గారావుగారికీ, గ్రంథ ముద్రణలో అడుగడుగునా నాకు సూచనలిచ్చి సహకారాన్ని అందించిన కాట్రగడ్డ నరసయ్యగారికీ కృతజ్ఞతలు చెప్పకుండా వుండలేను.

గ్రంథ ముద్రణకు డి.టి.పి. అందించిన "వీక్‌ఎండ్" సంపాదకులు డి. నాగరాజు గారికి కృతజ్ఞతలు తెలియచేసుకుంటున్నాను.

ముఖ్యంగా గండవరపు సుబ్బరామిరెడ్డిగారికి ప్రత్యేక కృతజ్ఞతలు చెప్పాలి.

నా ఆంధ్ర నాటకరంగ చరిత్ర ప్రథమ ముద్రణ విశేషాలు 1955వ సంవత్సరం వరకే పరిమితమైనాయి. ద్వితీయ ముద్రణలో తదనంతర కాలంలో వచ్చిన నాటక రంగానికి సంబంధించిన అనేక విషయాలు నాకు తెలియచెప్పి, ద్వితీయ ముద్రణ హుందాతనాన్ని పెంచారు. వారికి మనసారా అభినందనలు తెలియచేస్తున్నాను.

# రచయిత

# జీవిత రేఖలు

జననం : 1916 జులై 7వ తేదీ కృష్ణాష్టమినాడు. తల్లిదండ్రులు · సౌభాగ్యమ్మ, వెంకయ్యగారు. పుట్టింది గుంటూరు జిల్లా, అమ్మమేనమామలగారింట, లింగాయపాలెంలో. పెరిగింది : కృష్ణాజిల్లా కోలవెన్నులో.

ప్రాధమిక విద్యాభ్యాసం కోలవెన్నులోనూ, హైస్కూలు విద్య పునాదిపాడులోనూ సాగింది. తరువాత పశువైద్యంలో వెటర్నరీ డిప్లొమా పొందారు.

స్కూలు నాటకాల నుండి నాటకరంగంతో పరిచయం. అనేక నాటక సమాజాల్లో పౌరాణిక నాటకాల్లో స్త్రీ, పురుష పాత్రలు ధరించారు. గాయక నటుడుగా చిన్ననాడే పేరు సంపాదించారు.

కాంగ్రెసు ఉద్యమంలోనూ, కమ్యూనిస్టు ఉద్యమంలోనూ పనిచేసి లాఠీ దెబ్బలకు, జరిమానాలకు గుర్రై, అయిదుసార్లు దారుణమైన శిక్ష అనుభవించారు.

యువజనోద్యమంలోనూ, వైజ్ఞానిక ఉద్యమంలోనూ, గ్రంథాలయోద్యమం లోనూ, వయోజన విద్యాప్రచారంలోనూ, అభ్యుదయ రచయితల సంఘంలోనూ, నాస్తికోద్యమంలోనూ పనిచేశారు.

ప్రజానాట్యమండలి నిర్మాణంలో వ్యవస్థాపక సభ్యుల్లో ఒకరుగావుండి రాష్ట్ర వ్యాప్తంగా అనేక ప్రజా నాట్యమండలి శిక్షణా శిబిరాలను నడిపి ప్రాచీన కళారూపాలైన "బుర్రకథ", జముకుల కథ, వీధినాటకం, పిచ్చుకుంటులకథ, సుద్దులు కోలాటం, డప్పులు, హరికథ, బృందనృత్యం మొదలైన అనేక అపూర్వ కళారూపాల ప్రదర్శనల్లో పాల్గొని అనేక ప్రజానాట్యమండలి దళాలను తయారుచేసి, అభ్యుదయ కళాప్రదర్శనలతో ఆంధ్రదేశపు నాలుగుచెరగులా ప్రదర్శనలిచ్చారు.

ప్రజానాట్యమండలి ద్వారా చరిత్రాత్మకమైన తెలంగాణా పోరాటగాథ "మాభూమి" నాటకంలోనూ, "ముందడుగు" పరివర్తన, ఈనాడు, పోతుగడ్డ, గాలిమేడలు మొదలైన ప్రసిద్ధ నాటకాలలో పాల్గొని రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాల్లో మన్ననలు అందుకున్నారు. వందలకొద్దీ ప్రదర్శనల్లోనూ, రేడియో కార్యక్రమాల్లోనూ పాల్గొన్నారు.

అఖిల భారత ప్రజానాట్యమండలిలోనూ, ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్ర దళంలో ప్రముఖ బాధ్యతలు వహించారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ కమిటీ సభ్యులుగా, మద్రాసు సెంట్రల్ లెదర్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో బొమ్మల విభాగంలో అడ్వైజరుగానూ, ఆంధ్రదేశంలో అనేక నాటక సంస్థలకు గౌరవాధ్యక్షులుగాను, సలహాసంఘ సభ్యులుగాను వున్నారు

ప్రసిద్ధ తెలుగు పత్రికలలో కళలమీద వందలాది వ్యాసాలను వ్రాశారు. నాటక కళమీద ఆంధ్రనాటకరంగ చరిత్ర వెయ్యిపేజీల గ్రంథాన్ని రచించి తెలుగుభాషా సమితి అవార్డును, తెలుగు నాటకరంగంలో వర్ధిల్లిన ప్రసిద్ధ నటీనటుల నాలుగువందల జీవితాలను ఇరవై అయిదు సంవత్సరాలు "ఆంధ్రప్రభ వారపత్రికలో ధారావాహికంగా వ్రాసి "ఎనిమిది వందల పేజీల "నటరత్నాలు" గ్రంథాన్ని ప్రచురించి "ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు"ను అందుకున్నారు

అలాగే ఆంధ్రదేశంలో తరతరాలుగా వర్థిల్లి శిథిలమైపోతున్న "తెలుగువారి జానపద కళారూపాల గురించి వెయ్యిపేజీల గ్రంథాన్ని రచించి, తెలుగు యూనివర్శిటీ అవార్డును అందుకున్నారు. ఆంధ్రదేశంలో అనేక కళాపరిషత్తుల్లోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ, కళలమీద వందలాది ఉపన్యాసాలిచ్చారు. అలాగే "తెలుగువారి చలనచిత్ర కళ", "ఆంధ్రుల నృత్యకళా వికాసం", "ప్రజాపోరాటాల రంగస్థలం", "ప్రజానాట్యమండలి" మొదలైన గ్రంథాలను రచించారు.

నాటకరంగానికీ "జానపద కళలకు కృషి చేసినందుకు ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ డాక్టరేటును అందుకున్నారు. ప్రతిష్టాత్మకమైన 'యన్.టి.ఆర్. ఆత్మగౌరవ అవార్డును" తెలుగు విశ్వవిద్యాలయం, నాగార్జున విశ్వవిద్యాలయం, విశిష్ట పురస్కారాలను, అమెరికా "తానావారి" జానపద కళాపరిశోధక, ఐరోపా తెలుగు మహాసభలలో 'మిలీనియం అవార్డునూ, రాజాలక్ష్మీ అవార్డును, అమెరికన్ బయోగ్రాఫికల్ ఇన్‌స్టిట్యూట్ ద్వారా ఆరు అంతర్జాతీయ అవార్డులను అందుకున్నారు. సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్‌నూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ "తెలుగు వెలుగు" అవార్డును, "సంగీత నాటక అకాడమి "కళాప్రవీణ" అవార్డునూ, బళ్ళారి రాఘవాచారి అవార్డుతోపాటు వివిధ సంస్థల ద్వారా ఇరవై అయిదు ప్రతిష్టాత్మక అవార్డులను అందుకున్నారు. ఎన్నో బిరుదులు అందుకున్నారు. వేలాది సభలలో పాల్గొన్నారు.

1950లో సినిమారంగంలో ప్రవేశించి 1996 వరకు దాదాపు నాలుగువందల చిత్రాలలో, పౌరాణిక, జానపద, సాంఘిక

చిత్రాలలో భిన్న, విభిన్న, విలక్షణ పాత్రలలో అత్యద్భుతంగా నటించి ప్రజల మన్ననలందుకున్నారు నటసార్వభౌమ యన్ టి ఆర్ తో నూటయాభై చిత్రాలలో భిన్న, విభిన్న పాత్రలైన భీష్ముడు, ధర్మరాజు, బలరాముడు, దుశ్శాసనుడు, ఇంద్రుడు, తండ్రిగా, రాజుగా, మంత్రిగా, గురువుగా, సమర్థవంతంగా నటించి క్యారెక్టర్ నటుడనిపించుకున్నారు.

నూట ఇరవై సంవత్సరాల నాటకరంగ చరిత్రలో ప్రఖ్యాత వహించిన ప్రముఖ నటీనటుల "ఫొటోలను" సేకరించి పెద్ద సైజులో ఎన్లార్జ్ చేయించి రెండు వందల ఏభై నటీనటుల, ఎగ్జిబిషన్ తయారుచేసి ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపచేశారు

అలాగే "జానపద కళావైభవం పేరిట రెండువందల జానపద కళారూపాల ఫొటోలను సేకరించి ప్రదర్శింపచేశారు.

అలాగే జానపద కళావైభవం పేరిట రెండువందల జానపద కళారూపాల ఫొటోలను సేకరించి ప్రదర్శింపచేశారు

అలాగే ప్రజాపోరాటాల రంగస్థలం, అలనాటి ప్రజానాట్యమండలి చరిత్రకు సంబంధించిన అపూర్వ ఫొటోలను సేకరించి ఎగ్జిబిషన్ తయారు చేశారు

భార్య సీతారత్నం సహకారంతో కళారంగానికి అవిశ్రాంతంగా, నిస్వార్థంగా పనిచేశారు.

దాదాపు 60 సంవత్సరాలు సాంస్కృతికోద్యమంలో పనిచేశారు. ప్రముఖ సంస్థలూ, వ్యక్తులూ మూడువందల సత్కారాలను అందజేశారు.

అమెరికా, ఇంగ్లాండు, సింగపూర్, మలేషియా, థాయ్‌లాండ్, పటియా, మకావో, హాంకాంగ్ మొదలైన విదేశాలలో సంచారం చేశారు.

87 సంవత్సరాల వయస్సులో కూడా సాంస్కృతికరంగం కోసం పనిచేస్తూవున్న డా॥ మిక్కిలినేని నాటకరంగస్థల, సినీనటుడు, ప్రయోక్త, పరిశోధకుడు, రచయిత, స్వాతంత్ర్య సమరయోధుడు, బడుగుజీవులకు, ప్రజోద్యమాలకు, కళా ఊపిరిలూదిన కమ్యూనిస్టు ప్రజాకళాకారుడు. సినిమారంగంలోవుండి, నాటకరంగంకోసం, కళారూపాల ఉద్ధరణకోసం, నిస్వార్థంగా పాటుపడిన ఆదర్శకళాకారుడు. దేశం నాకేమిచ్చిందనికాక, దేశానికి నేనేమిచ్చాననే స్ఫూర్తితో పనిచేసిన కళాకారుడు. కమ్యూనిస్టు క్రమశిక్షణ, ఆత్మవిమర్శ ఆయనకు ఆరాధ్య దైవాలు.

- జె. చెన్నయ్య

తెలుగు యూనివర్శిటీ పబ్లిక్ రిలేషన్ ఆఫీసరు



ఎన్.టి.ఆర్. జయంతిరోజున ప్రభుత్వమిచ్చే ఎన్.టి.ఆర్. ఆత్మగౌరవ అవార్డును డా॥ మిక్కిలినేనికి అందజేస్తున్న ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు



డా॥ పిన్నమనేని అవార్డునందుకున్న కలాంకు డా॥ చదలవాడ నాగేశ్వరరావు యిచ్చిన విందు సందర్భంలో మిక్కిలినేని కళలకు చేసిన కృషిని వివరించగా అభినందిస్తున్న నేటి రాష్ట్రపతి అబ్దుల్ కలాం



తెలుగువారి జనాపద కళారూపాలు గ్రంధాన్ని ఎన్.టి.ఆర్.కు సమర్పణ చేస్తున్న డా॥ మిక్కిలినేని



ఆంధ్రనాటక రంగచరిత్ర - ప్రధమ ముద్రణ ఆవిష్కరణ
అక్కినేనికి అంకితమిచ్చినప్పడు మిక్కిలినేనికి అక్కినేని బట్టల సమర్పణ



కళాప్రపూర్ణ, డాక్టరేటు అవార్డును ప్రదానం చేస్తున్న ఆంధ్రప్రదేశ గవర్నరు సి. అబ్రహాం

కళారంగానికి నేను చేసిన సేవలను గుర్తించి ఆంధ్ర యూనివర్శిటీ కళాప్రపూర్ణ డాక్టరేటు అవార్డును ప్రదానం చేస్తూన్న నేటి గవర్నరు సి. అబ్రహాం.



తెలుగు యూనివర్శిటి విశిష్ట పురస్కారం, పద్మ భూషణ్ అక్కినేని , వైస్ ఛాన్సలర్ యన్. గోపి. విద్యాశాఖమంత్రి కరణం రామచంద్రరావు, పురస్కార గ్రహీత డా॥ మిక్కిలినేని



# విషయసూచిక

## కళాకారుల జీవితాలు . 565

# డా॥ మిక్కిలినేని కళాసాహిత్యం

1. **ఆంధ్ర నాటకరంగ చరిత్ర :**

1954-55ల్లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ తెలుగు భాషా సమితి నిర్వహించిన నాటక కళా సమీక్షకు సంబంధించిన గ్రంథాల పోటీలో ప్రథమ బహుమతి అందుకున్న రచన.

2. **నటరత్నాలు :**

25 సంవత్సరాలు. ఆంధ్రప్రభ సచిత్రవారపత్రికలో ధారావాహికంగా వెలువడి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి అవార్డును 30-1-1983వ తేదీన అందుకున్న గ్రంథము.

3. **తెలుగువారి జానపద కళారూపాలు :**

పొట్టి శ్రీరాములు, తెలుగు విశ్వవిద్యాలయ గ్రంథాల పోటీలో ఉత్తమ అవార్డు పొందిన గ్రంథం.

4. **ప్రజాపోరాటాల రంగస్థలం :**

ఆంధ్రప్రజా నాట్యమండలి చరిత్ర.

5. **ఆంధ్రుల నృత్య కళావికాసం :**

యస్.వి. యూనివర్శిటి నిర్వహించిన దక్షిణ భారత రాష్ట్రాల జానపద కళాసదస్సు సెమినార్‌లో చదివిన ప్రసంగం.

6. **తెలుగువారి చలన చిత్ర కళ :**

ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో వెలువడిన గ్రంథం.



# నాట్యకళారంభం



తొలి మానవ సంఘం - పురాణ
పురుషులు : నాట్యకళ - నాట్యకళ
ఎలా ఉద్భవించింది? - నటరాజస్వామి -
చెన్నుమీరిన చిదంబరక్షేత్రం

# తొలి మానవ సంఘం

ప్రథమంలో మానవుడు అడవుల్లో చెట్లపై కోతివలె నివాసమేర్పరుచుకుని, స్త్రీ పురుషులు ఎవరి నిలయాలలో వారు నివసిస్తూండేవారు. ఈ విధంగా విడివడి కలుసుకున్న కుటుంబాలే మానవకుటుంబం. ఇదే తొలి మానవ సంఘం. పశువులను సాధుపరచి భూములు సాగుచేసి అడవులు భేదించి కుటీరాలను నిర్మించి నదీకాసార ప్రాంతాల గ్రామాలు నిర్మించి, గ్రామం మధ్యలో ఒక పెద్ద దిబ్బపేర్చి ఒక చెట్టును నాటిగాని, ఒక దేవుని మూర్తి స్థాపించిగాని గ్రామ ప్రజలందరూ ఆరాధనలు, పాటలు, భజనలు, నృత్యాలు, నాటకాలు జరుపుతూ వచ్చారు.

ప్రకృతిలో ప్రతి మనిషికీ, ప్రతి జంతువుకీ గెంతడం, త్రుళ్ళడం, పాడడం, సంతోషించడం, శృంగారించుకోవడం, బాధపడడం మొదలైన సహజ గుణాలున్నాయి. మాట లేకపోయినప్పటికీ అవికూడ దెబ్బ తగిలితే బాధపడుతాయి. ఏడుస్తాయి. మంచి ఆహారం దొరికితే సంతోష పడుతాయి. వర్షం వచ్చేముందు చల్లగాలికి ఎగిరి గంతులేస్తాయి. ఇదే విధంగా ప్రతి మనిషీ ఈ లక్షణాలను కలిగియున్నాడు. మనిషికి సంతోషం కలిగినప్పుడు ఎంతో మందహాసం కనబడుతుంది. అందులోనే కళ ఇమిడివుంది. కళ అనేది ఒక ప్రత్యేక పదార్థం కాదు. ఇది కళ అనికూడ మానవునికి తెలియదు. ఇట్లే కోపం కలిగినప్పుడు ప్రతిఒక్క అవయవమూ, కండ్లూ, ముఖమూ కంపించిపోతాయి. చిహ్నాలు ఎంతో గంభీరంగా వుంటాయి. ఆ ఆకారాన్ని ఇతరులు చూచినప్పుడు ఎంతో భీతి కలుగుతుంది. అతనికి తెలియకుండానే అందులో కళ ఇమిడివుంది. కాని కావాలనుకున్నప్పుడు ఆ కోపం తెప్పించలేరు. నటించలేక పోవచ్చు. సహజంగా అతనిలో వుద్రేకం కలిగినప్పుడే ఆ చిత్రాన్ని మనం చూడగలుగుతాం. సంతోషం, బాధ, క్రోధం, శత్రుత్వం మానవునికి సహజ గుణాలని పైనే తెలుసుకోగలిగాం. ఈ గుణాలను కళా రూపంలో అభివృద్ధి పొందించాలంటే పై వాటి నన్నిటిని అవగాహన చేసుకుని జీర్ణం చేసుకున్నప్పుడే అది సాధ్యమవుతుంది.

**భావయుతమైన నటన :**

ఆదిమ సమాజపు మనుష్యులు జంతు సమానులుగా వుండేవారని తెలుసుకున్నాం అడవులలోనే వాళ్ళ నివాసం అవడంవల్ల వారు జంతువులలాగానే నటించే

వారు. అరుపులు, నడకలు, కూతలు, పోట్లాటలు, గర్జనలు, జంతు విన్యాసాలు జరిగేవి. ఇది చూచే మానవుడు భావయుతమైన నటన మొదలు పెట్టాడు.

నాగ నృత్యం :

భావాన్నిబట్టి నటన సృష్టిలోనే వుంది. పాము వచ్చింది, పరుగెత్తింది, పడగ విప్పింది, మెలికలు తిరిగింది, కాటు వేసింది. ఈ నటనను చూపించాలంటే పాము ఆడటం చూడాలి. దాని అభినయం చెయ్యాలి. మనిషి మెలికలు తిరిగి పోవాలి, కాటుతిన్న మనిషిమాదిరి కండ్లలోను, ముఖంలోను అభినయాన్ని చూపించాలి. దీనినే నాగనృత్యంగా పేర్కొన్నారు.

మయూర నృత్యం :

ఏమకటి రోజుల్లోనేకాక ఈ నాటికీ, మనం అడవులకు వెళ్ళి చూచినట్లయితే, జంతు నాట్యాలు ఎన్నో చూడగలుగుతాం. వాటిలో కూతకు రాజా కోవెల అని ఈనాటికీ చెప్పుకుంటున్నాం. అలాగే నృత్యంలో నెమలి నృత్యం చూడదగింది. పింఛం విప్పి అది త్రొక్కే నృత్యం మనల నెంతో ఉత్తేజపరుస్తుంది, ఆనంద పరుస్తుంది. దాని కూతకూడ వినదగిందే. మేఘాలు పట్టినపుడూ, చల్లని గాలులు వీచేటప్పుడూ ఒడలు పొంగి అది పింఛాన్ని విప్పి మందహాసంతో నాట్యం చేస్తుంది.

అదే విధంగా మనిషి చేతులతో, నడుముతో, ముఖ భావాలతోనే ఆ నృత్యాన్ని చేస్తున్నాడు. ఇది ప్రత్యేకంగా నెమలిని చూచి నేర్చుకున్నదే. ఇదే జంతువుల అనుకరణ. దీనికే భరతనాట్య ప్రముఖులు మయూర నృత్యం అని నామకరణం చేశారు.

ఈ నృత్యాలు చేయాలంటే ఎంతో శరీరసాధన వుండాలి. అవయవాల స్వాధీనత వుండాలి. ఎంతో ముఖ వికాసం వుండాలి. ఇలా ఒకదానికొకటికి అవినాభావ సంబంధమున్నప్పుడే నృత్యంలో రమ్యత కనబడుతుంది. ఇటు వంటి నృత్యాలు శాస్త్రయుక్తంగాను, భావయుక్తంగాను భరతనాట్య శాస్త్రం తెలిసినవారే చక్కగా చేయగలుగుతారు. వారే గరుడనృత్యం, సింహనృత్యం,

మయూర నృత్యం, నాగ నృత్యం, ఇలాంటివి ఎంతో అద్భుతంగా నటిస్తారు. దీనినే భావయుత నటన అంటారు.

భూత నటన :

ఈ నటన దేవతల్ని సంతోష పెట్టడానికి ఏర్పడింది. దుష్ట భూతాలను తృప్తిపరచడానికీ, అంటు జాడ్యాల నిర్మూలన కోసం, వర్షం కోసం, పంటలకోసం, పశువులకోసం ఆనాటినుంచి ఈనాటివరకు ఈ భూత నటన సాగుతూనే వుంది. గ్రామాలలో అమ్మవారి జాతర్లప్పుడు, దేవుళ్ళ వుత్సవాలలో, భజనలయందూ స్త్రీలు, పురుషులు, పిల్లలు అందరూ కలిసి ఎంతో చిత్రవిచిత్రంగా ఆటల్లో, పాటల్లో పాల్గొంటారు. ఎంతో తన్మయత్వంతో, ఒక నిండు నమ్మకంతో, వుత్సాహవుద్రేకాలతో పాత్రలో లీనమై నటిస్తారు. ఇది ఎంతో స్వభావసిద్ధంగావుంటుంది. కారణం: వాళ్ళు ఒక ఫలితాన్ని ఆపిస్తున్నారుగనుక, వారు దానికి అంకితమైపోతారు. వర్షం కురవాలని నాట్యాలు, వుత్సవాలు జరుపుతారు. ఆ నృత్యంలో ఒక ఆవేశం వుంటుంది. అందువలననే దీనిని భూత నటన అన్నారు పెద్దలు. ఈ భూత నటన మానవుని అజ్ఞాన దశను సూచిస్తుంది. ఇది ఈ నాటికీ పాటక జనంలో ప్రచారంలో వుంది.

నేర్చుకున్న నటనలు :

భావయుత నటన, భూత నటన ఇవన్నీ అనాగరిక జాతులనుండి, అడవి జాతుల నుండి వాళ్ళను అనుకరించి మనం నేర్చుకున్నాం. ఈ నాటికీ కొండలలో నివసిస్తూ వున్న చెంచులు, కోయలు, ఖొండులు, సవరలు, పండాలు మొదలైన కొండ జాతులవారి నృత్యాలు మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తూ వుంటాయి. వీరి కీ కళ ఎలా అబ్బిందా అనిపిస్తుంది. ఈ నాటికీ, ఆ ప్రాంతాల్లో నివసిస్తున్న కొండ జాతుల వారందరూ వారి వారి నృత్యాలను పోషించుకుంటున్నారు.

ఆనాడు నాట్యకళకు సంబంధించిన వాచికము, పద్యము, గీతము మొదలైనవన్నీ వివిధ దేశాలలో దేవతారాధన సమయాలందు వుపయోగించుకునేవారు. ఆయా దేశాల నాగరికతనుబట్టీ, మతాలనుబట్టీ గేయాలూ, వాచికమూ మారిపోయాయి. వారివారి పరిస్థితులకు అనుగుణంగా కళను వుపయోగించుకున్నారు. దేవతారాధన

యందు, ఉత్సవాలయందు ఈ నాటికీ ప్రాచీన నాటకాలను చూస్తూనేవున్నాం. అవి అన్నీ పౌరాణిక గాథలకు సంబంధించే వున్నాయి.

ఈ విధంగా ఆనాడు దేవుణ్ణిగూర్చి, దేవతలనుగూర్చి ప్రజలలో ప్రచారం జరిపేవారు. రానురాను లౌకిక విహారార్థం, శ్రీమంతుల ఇండ్లలోను, రాజ మందిరాలలోను వారి తృప్తికొరకు మాత్రమే నాటకాలు వ్రాయటం, చిత్రాలు గీయటం, నృత్యాలు చేయటం, కవిత్వం వ్రాయటంతో నాటకాది లలిత కళలన్నీ ప్రజలనుండి దూరమయ్యాయి. ఎప్పుడైతే జమీందారీ శ్రీమంతుల యుగం వచ్చిందో అప్పుడు ప్రజలను దోచుకోవడం మొదలుపెట్టారు. ప్రజలు అనేక బాధలకు గురి కావడంవల్ల కళలకు దూరమయ్యారు. కళలన్నీ రాజులకొరకూ, వారి భోగభాగ్యాలకొరకూ అంకితమైపోయాయి.

## భాగ్యవంతుల పోషణ :

ఆనాడు దేవకార్యాలన్నీ శ్రీమంతులే చేయిస్తూ వుండేవారు. అందువల్ల ఈ నాట్యా చార్యులూ, గాయకులూ, కవులూ, చిత్రకారులూ, అందరూ రాజమందిరాలకే ఆహ్వానింపబడ్డారు. అందువల్ల సామాన్య ప్రజలలో నానాటికీ కళ దూరమైపోయింది. ప్రజల జీవితం దుర్భరమైపోయింది. ఆనందోత్సవాలు దూరమైనాయి. ఇందువల్ల సామాన్య ప్రజలు రాజమందిరాలకు పోయే అవకాశం లేనందున పూర్తిగా ఆ ఉత్స వాలకు, ఆ ప్రదర్శనాలకు దూరమయ్యారు. రానురాను ఆ కార్యక్రమాల్లో శ్రీమంతు లకూ, మధ్యతరగతి ప్రజలకూ, విద్యావంతులకూ పండితులకూ మాత్రమే స్థానం వుండేది. పేద ప్రజలకు అంటు దోషాలు అంటగట్టి, దేవస్థానాల్లో ప్రవేశం లేకుండా స్వార్థపరులు కళలను దోచుకున్నారు.

ఒకనాడు కళలు జీవితానందం కొరకు వృద్ధిపొందాయి. ఒకనాడు జీవితంలో ఆనందం లేక, కేవలం కష్టాలను మరచిపోవడానికి తప్పత్రాగి ఆ మత్తులో ఆట లాడారు. చిందులు త్రొక్కారు. పాటలు పాడారు. మొత్తంమీద నాట్యకళ దేవ కార్యాలనుండి, మోటు చిందులనుండి. పురాణ కథలనుండి, భజన మేళాలనుండి వృద్ధి పొందిందని నిస్సందేహంగా చెప్పవచ్చు.

బూటకపు కళ :

ప్రజల దారిద్ర్యం హెచ్చినకొద్దీ అజ్ఞానం ఎక్కువ అవడంవల్ల శ్రీమంతులేగాక కొద్దిమంది తెలివిగలవాళ్ళు, వైద్యులు, భూతవైద్యులు, తాంత్రికులూ, భూత స్వరూపాలను ధరించి, మృగ, పక్షి, వికృత వేషాలను భీకరంగా ప్రదర్శించి ప్రజలను భయపెట్టి మంత్ర చికిత్సలు చేసి అతీతులుగా పరిగణింపబడేవారు. ఇందువల్ల అజ్ఞానంగా వున్న ప్రజలు వీళ్ళు వరపుత్రులని, దేవుని బిడ్డలని నమ్మి. మోసపోయేవారు. వీళ్ళు ఆ ప్రజలను దోచుకునేవారు. వీరే ఆనాటి పురోహితులు, మంత్రవేత్తలు, ప్రభువులు.

---

# పురాణ పురుషులు, నాట్యకళ

మన నాట్యకళను శాస్త్రీయ నృత్యంగా రూపొందించిన శివపార్వతులు, హిమాలయపర్వతాలలో నివసించేవారు. నాట్యకళను ఆరాధించిన ఆదిదంపతులు వీరే. శివుడు గంభీరమైన ప్రళయతాండవ నృత్యం చేసి నటరాజుగా ప్రసిద్ధి పొందాడు. పార్వతి లాస్యనృత్యంలో సమర్థురాలుగా రూపొందింది.

సంధ్యా నృత్యం :

శివుడు ప్రతిదినమూ సూర్యాస్తమయ సమయంలో సంధ్యా నృత్యాన్ని చేసేవాడు. ఈ సమయంలో బ్రహ్మదేవుడు తాళాన్ని, విష్ణువు మృదంగాన్ని, ఇంద్రుడు మురళిని, సరస్వతి వీణనూ వాయించేవారు. లక్ష్మీదేవి ప్రధాన గాయకురాలుగా పాటపాడితే నారద తుంబురులు వంతగానాన్ని అందించేవారు. పార్వతితో పాటు దేవతలూ, గంధర్వులూ, యక్షులూ, కిన్నరకింపురుషాదులూ ప్రేక్షకులుగా వుండి ఆ ప్రదర్శనాన్ని ఆనందంతో తిలకించేవారు. ఈ విధంగా మన పురాణ పురుషులు నాట్యాన్ని ఆరాధించారు.

మోహినీ నృత్యం :

అలాగే దేవదానవులు, అమృతంకోసరం పాల సముద్రాన్ని మధించారు. ఈ మథనంలో మందర పర్వతాన్ని కవ్వముగాను. సర్పాన్ని తాడుగాను వుపయోగించి సముద్రాన్ని చిలకగా పుట్టిన అమృతంకోసం దేవతలకు, రాక్షసులకు కలహం చెలరేగింది. ఈ కలహాన్ని తీర్చి, ఆ అమృతాన్ని పంచిపెట్టాలి. ఈ కార్యాన్ని సాధించడానికి విష్ణుదేవుడు మోహినీ అవతారమెత్తి నృత్యంచేస్తూ ఆ దేవ, దానవులకు అమృతాన్ని పంచి తద్వారా దేవదానవులను శాంతింపజేశాడు. మోహిని రూపంలో నాట్యంచేస్తూ ఇరుపక్షాలనూ సమ్మోహితుల్ని చేశాడు.

ఆలాగే కృష్ణుడు వ్రేపల్లెలో కాళీయ మడుగులో ప్రజలను నానావిధాలుగా హింసిస్తూ వచ్చిన క్రూర సర్పరాజు పొగరణచి అతని తలపై ఎక్కి నృత్యాన్ని చేసినట్లు పురాణగాథ తెలియజేస్తూంది.

రాసలీల :

కృష్ణుడు మురళి ఊదితే కృష్ణుని చెలికాండ్రూ, గోపికలూ ఇట్టే హాజరై సమిష్టిగా ఆనంద నృత్యం చేసేవారు. ఈ నాట్యాన్నే ఈనాడు రాసలీల అని పిలుస్తున్నారు.

అర్జునుని ఆటపాటలు :

జూదంలో ఓడిపోయిన పాండవులు పన్నెండేళ్ళ వనవాసమూ, ఒక ఏడు అజ్ఞాతవాసమూ చేశారు. ఈ అజ్ఞాతవాసంలో ఎవరూ గుర్తుపట్టకుండా మారు వేషాలలో విరాటరాజు కొలువులో అజ్ఞాతంగా గడిపే సమయంలో విరాటరాజు కూతురైన ఉత్తరకు బృహన్నల వేషంలో వున్న అర్జునుడు నాట్యం నేర్పాడు. అర్జునుడు ఒక్క విలువిద్యలోనేగాక నృత్య, సంగీత కళలలో. కూడ ఆరితేరిన విద్వాంసుడు.

పార్వతి శిష్యురాలు ఉష :

అలాగే బాణాసుర చక్రవర్తి కుమార్తె ఉషాదేవి. శివభక్తుడైన బాణాసురుడు తపస్సుచేసి శివుని మెప్పించి, పరమశివుడు ఎప్పుడూ తనవద్దనే ఉండేటట్లు వరాన్నిపొంది, శివ, పార్వతులను తన మందిరంలోనే వుంచుకున్నారు.

నిత్యమూ శివ పార్వతుల సేవలో మెలగిన ఉష వారి మెప్పులను పొంది, పార్వతి ద్వారా లాస్యనృత్యాన్ని నేర్చుకుంది.

పార్వతిదగ్గర నాట్యం నేర్చుకున్న ఉష అనతికాలంలోనే నృత్యంలో అపారమైన జ్ఞానాన్ని సంపాదించి గొప్ప నర్తకిగా పేరుపొందింది కృష్ణుని మనమడైన అనిరుద్ధుని వివాహమాడి, ద్వారకలో తన అత్తవారింటియందున్న రాజ కన్యల కందరకూ నాట్యం నేర్పింది. నాట్యకళమీద 'ఉషాభరత'మనే శాస్త్రీయ గ్రంథాన్ని కూడ రచించింది ఉషా దేవి.

ఇక దేవతలకు రాజైన ఇంద్రుడు సంగీత నృత్యాలను ఎంతగానో పోషించాడు. దేవలోకంలో ప్రతినిత్యం ఇంద్రదర్బారులో సంగీత నృత్య ప్రదర్శనాలు జరుగుతూ వుండేవి. దేవతలందరూ ఆసీనులైవుండగా వారి సమక్షంలో రంభ, ఊర్వశి, మేనక మొదలైన అపురూప సుందరీమణులు మనోహరంగా నృత్య ప్రదర్శనాల నిచ్చేవారు.

ఇంద్రుని దర్బారులో జరిగే నృత్యాలను, భరతనాట్యశాస్త్రాన్ని సులభశైలిలో అందరికీ అర్థమయ్యేటట్లు వ్రాయుమని నందికేశ్వరునికోరి అభినయదర్పణం వ్రాయించాడు. అదే నేడు మనకండ్లముందున్న అభినయదర్పణ గ్రంథం, నాట్యంచేసే ప్రతివారూ దీనిని ఆధార గ్రంథంగా పరిస్తున్నారు.

---

# నాట్యకళ ఎలా ఉద్భవించింది?

ఇంతమంది పురాణ పురుషులు ఆరాధించిన ఈ నాట్యకళ అసలు ఎలా వచ్చిందో తెలుసుకోవడం ఎంతైనా అవసరం.

త్రేతాయుగంలో ఇంద్రాది దేవతలు బ్రహ్మవద్దకు వెళ్ళి, కుల, మత, జాతి వివక్షత లేకుండా, సర్వ ప్రజానీకానికీ అందుబాటులో వుండి అందరూ చూడదగినదీ, ఆనందించ దగినదీ ప్రసాదించుమని అడిగారనీ, అందుకు బ్రహ్మ వారి ప్రార్థనను అంగీకరించి, ఋగ్వేదంనుండి సంభాషణలనూ, వాయిద్యాలు వాయించే

విధానాన్నీ, సామవేదంనుండి మృదు మధురమైన గాన పద్ధతినీ, యజుర్వేదంనుండి అభినయాన్నీ, అధర్వణ వేదంనుండి రసాన్నీ—ఇలా చతుర్వేదాలనుంచి సమీక రించి మొట్టమొదటగా భరతమునికి వుపదేశించాడనీ, ఆ తరువాత భరతముని తన నూరుమంది పుత్రులకూ వుపదేశించాడనీ, ఈ విధంగా అది దేశమంతటా వ్యాపించిందనీ ప్రతీతి.

## దేవతలూ దానవుల మధ్య కల్లోలం :

భరతనాట్య శాస్త్రంలో కైశికీ వృత్తి అనే పేరుగల ఒక నాట్యం వుండేది. దీనిని స్త్రీలే నిర్వహించేవారు. ఈ నిర్వహణకు బ్రహ్మ కొంతమంది అప్సరసలను సృష్టించాడు. భరతముని వారిసందరినీ సమీకరించి, మరి కొంతమందినికూడ వారితో జతపరచి తానే దర్శకుడై ఇంద్రధ్వజ మహోత్సవంలో, దేవతలూ, దానవులూ నిండివున్న సభలో మొట్టమొదటి సారిగా ఈ నృత్యాన్ని ప్రవేశపెట్టాడు. దానితో దేవతలూ, దానవుల మధ్య కల్లోలం రేగింది.

ఈ మహోత్సవంలో తమ ఆధిక్య ప్రకటనతో, దేవతల విజయం, తద్వారా దానవుల పరాజయం చూచిన దానవులందరూ భగ్గున మండిపోయి, ప్రదర్శనాన్ని భగ్నం చెయ్యడానికి పూనుకున్నారు.

## బ్రహ్మ సందేశం :

ఒకర్ని దూషించడంగాని, భూషించడంగాని నాట్యకళ యొక్క పరమార్థంకానే కాదనీ, లోకానికి వినోదం కూర్చడానికే ఈ నాట్యాన్ని తాను ప్రదర్శింప చేశాననీ, అన్ని విద్యలూ, కళల సారాంశమే ఈ నాట్యమనీ, ఈ నాట్యకళను మించిన శిల్పంగాని, కళగాని, శిక్షణగాని, శాస్త్రంగాని, యోగంగాని విశ్వంలో ఎక్కడా లేదనీ బ్రహ్మ సమాధానం చెప్పాడు. ఆనాటినుంచీ మనకు దశవిధ రూపకాలూ, వాటి ప్రయోగ పద్ధతులూ ప్రచారం లోకొచ్చాయి.

## భరతముని :

బ్రహ్మ సందేశమందుకున్న భరతముని ఈ నాట్యప్రచారానికి భూలోకంలో తన భరతనాట్య శాస్త్రంద్వారా అమూల్య కృషి చేశాడు. భరతముని తొలిగా నాట్యవేదానికి ప్రథమ నాయకుడైన శివునియొద్ద నాట్యాన్నీ, నందివద్ద

రసాన్నీ అభ్యసించి నాట్యశాస్త్రాన్ని ముప్పయియారు అధ్యాయాలలో వ్రాసి ప్రచారం నిమిత్తం ఈ లోకానికి తీసుకువచ్చి, స్వయంగా అమృతహరణం, అమృత మథనం మొదలైన నాటకాలు వ్రాసి స్వయంగా శిక్షణ యిచ్చి, ప్రదర్శించాడు.

నాట్యశాస్త్ర ప్రాభవం, ప్రభావం :

ఈనాడు ఉత్తర భారతదేశంలోనూ, దక్షిణ భారత దేశంలోనూ అనేక నాట్యకళా సాంప్రదాయాలు ప్రచారంలో వున్నాయి. ఈ నాట్యకళ రూపాలు ఎన్ని విధాలుగా మారినా వీటన్నిటికీ మూల గ్రంథం భరత నాట్యశాస్త్రమే.

ఈ నాట్యశాస్త్రం అనేక శతాబ్దాలనుంచీ భారతీయులందరికీ ఒక నాటక శాసనంగా ఉంది. కాళిదాసు వ్రాసిన శాకుంతలంనుండి మణిపురి, కథక్, కథకళి, భరతనాట్యం, కూచిపూడి నృత్యం మొదలైన విభిన్న నాట్య నాటక స్వరూపాలన్నిటిమీదా భరతనాట్యశాస్త్ర ప్రభావం వుంది. మన ప్రాచీన తెలుగు నాటకరంగం మీదా, తంజావూరు యక్షగానాలమీదా, కూచిపూడి భాగవతులమీదా కూడ ఈ నాట్యశాస్త్ర ప్రభావం పూర్తిగా వుంది. ఒక్క మాటలో చెప్పాలంటే ఈ నాటికీ మనకు ఆధార నాట్యశాస్త్రంగా వర్ధిల్లేది భరతనాట్యశాస్త్రం ఒక్కటే.

ఈ నాట్యశాస్త్రపు పుట్టుపూర్వోత్తరాలనూ కాలనిర్ణయాన్నీ గూర్చి అనేక భేదాభిప్రాయాలున్నై. కాళిదాసు రచనలకంటే ముందే ఈ భరత నాట్య శాస్త్రముందట. అందుకు నిదర్శనంగా కాళిదాసు రచించిన విక్రమోర్వశీయం నాటకంలో

> మునినా భరతేన యః ప్రయోగో-భవతీష్వష్టరసాశ్రయో నియుక్తః,
> లలితాభినయం త మద్య భర్తా-మరుతాం ద్రష్టుమనాః స లోకపాలః.

ఈ విధంగా భరతమునిని గురించి కాళిదాసు ప్రస్తావించాడు. అసలు కాళిదాసే క్రీస్తుకు పూర్వం మొదటి శతాబ్దంలోని వాడని చరిత్రపరిశోధకుల అభిప్రాయం. అంటే అంతకుముందు ఇంకా రెండు మూడువందల సంవత్సరాలక్రితమే ఈ భరత నాట్యశాస్త్రం రచించి వుండవచ్చును.

అభినవ గుప్తుడు .

ఈ భరతనాట్యశాస్త్రానికి అభినవగుప్తుడనే మహనీయుడు అభినవ భారతీ వ్యాఖ్యను రచించాడు. భరత నాట్యశాస్త్రంలో మనకు అర్థంకాని అనేక విషయాలను ఆయన తెనిగించి అమూల్యమైన వ్యాఖ్యానాలను వివరంగానూ, సుబోధకంగానూ రచించాడు. నిజంగా అభినవగుప్తుని వ్యాఖ్యానమే భరత శాస్త్రానికి లేనట్టయితే ఈనాడు మనకు కనిపించే భరత నాట్యశాస్త్రం ఇలా రూపురేఖలు దిద్దబడివుండేదే కాదు. అనేక అధ్యాయాలను ఆయన సరళమైన మార్గంలో పెట్టాడు. భరతముని నాటినుంచీ వెలువడ్డ అనేక నాట్యశాస్త్ర గ్రంథాల వ్యాఖ్యానాలను ఆయన భారతీ వ్యాఖ్యంలో పొందుపరిచాడు. ఆనాటికీ ఈనాటికీ అభినవగుప్తుని నాట్యశాస్త్ర వ్యాఖ్యానమే ప్రమాణమై వుంది.

భరతముని అనంతరం కాళిదాసు, భాసుడు, భవభూతి మొదలైన వారంతా నాటకాలు వ్రాశారు. భరతముని నాట్యశాస్త్రానికి అనుగుణంగా వాటిని ప్రదర్శించారు. ఆనాడు వ్రాసినటువంటి ప్రతి అలంకారశాస్త్ర గ్రంథంలోనూ నాటకం యొక్క నిరూపణం, రసప్రకరణం చేర్చబడుతూనే వచ్చాయి.

ఈనాడు మనకు ప్రచారంలో వున్న భరతనాట్యశాస్త్రం అభినవగుప్తుని వ్యాఖ్య నాటికి 36 అధ్యాయాలు మాత్రమే వుండేదనీ, తరువాత 37-వ అధ్యాయం కలిసిందనీ తెలుస్తూంది.

ఆనాటి రాజమందిరాల్లో నాట్యకారులు, గాయకులు, విటులు లేని రాజసభలే జరిగేవికాదు. ఆనాటినుండీ లలితకళలన్నీ స్వతంత్ర రాజుల సమక్షంలో అభివృద్ధి పొందాయి. ప్రతి శుభకార్యానికీ నాట్యాభినయం మంగళ ప్రదంగా ఎంచారు. రామాయణం నాటినుంచీ, కర్ణాట ఆంధ్ర ద్రావిడ రాజ్యాన్ని పరిపాలించిన ఆంధ్ర రాజుల ఆధ్వర్యంలోనూ భరతముని నాట్యశాస్త్ర ప్రకారం నాట్యం, అభినయం, ప్రచారంలోకి వచ్చాయి.

---



# ఆంధ్రుల కళాచరిత్ర



ఆంధ్రనామ సంగ్రహం —బౌద్ధయుగపు నాట్యకళ-
చోళచాళుక్యులనాటి సొంపు పెంపులు—కాకతీయుల
కళాపోషణ—తంజావూరు నాయకరాజుల నాటి నయ
నాణ్యాలు - గోల్కొండ నవాబుల చోపుదారీ - రెడ్డి
రాజుల దొడ్డదోహదం — విజయనగరరాజుల నాటి
విన్నాణ విశేషాలు

# ఆంధ్రనామసంగ్రహం - శాతవాహనులు



### ఆంధ్ర శబ్దం :

ఈనాటి వరకూ జరిగిన పరిశోధనల ఫలితంగా ఆంధ్రుల చరిత్ర ఒక వరుస క్రమంలో తెలుస్తూవుంది. అనేక భూగర్భ పరిశోధనలద్వారా ఎన్నో కొత్త విషయాలు విశదమౌతున్నాయి. క్రీ. పూ. 550 నుండి బౌద్ధులు ఆంధ్రదేశంమీదుగా సింహళానికి ప్రయాణాలు చేసినట్లూ, అందుకు సంబంధించిన గాథలు బౌద్ధగ్రంథాలలో వున్నట్లూ తెలుస్తూ వుంది. ఆంధ్ర అనే పదం అనేక ప్రాచీన గ్రంథాలలో ఉదాహరింపబడి వుంది.

భరతుడు నాట్యశాస్త్రంలో ముఖ్యమైన పదకొండు జాతిరాగాలలో ఆంధ్రి (నేటి రాగం) కూడా ఒక జాతిరాగమని పేర్కొన్నాడు. ప్రాచీన గ్రంథమైన ఐతరేయ బ్రాహ్మణంలో ప్రప్రథమంగా ఆంధ్రశబ్దం ఉపయోగపరచబడడమేగాక క్రీ. పూ. వెయ్యి సంవత్సరాల ముందుగానే రచింపబడిన భారత, రామాయణ గ్రంథాలలో కూడ ఆంధ్రుల ప్రశంస వుంది. ఈనాటికి సుమారు 4 వేల సంవత్సరాలనుండీ ఆంధ్రజాతి ఒక ప్రత్యేకతెగగా నివసిస్తున్నారని చెప్పవచ్చు.

### శాతవాహనులు :

ఆంధ్రదేశాన్ని పరిపాలించిన రాజులలో శాతవాహన తెలుగు చక్రవర్తులు మొదటివారు. వీరినే శాతవాహనులని, శాతకర్ణి రాజులని కూడ వర్ణించారు. క్రీ. పూ. 220 నుండి క్రీ. శ. 218 వరకూ, అంటే దాదాపు 4 వందల సంవత్సరాలవరకూ 30 మంది శాతవాహనరాజులు ప్రతిష్ఠానపురాన్ని రాజధానిగా చేసుకుని హైదరా

బాదు సంస్థానంతో సహా కృష్ణాగోదావరి మండలం వరకూ వ్యాపించి వున్న ప్రాంతాన్ని పాలించారు. ఆంధ్ర శాతవాహనరాజులలో 14 వ రాజైన హాలుడు ప్రతిష్ఠానపురం రాజధానిగా చేసుకుని దక్షిణాపథంతోపాటు సింహళాన్ని జయించి సప్తగోదావరి వద్దనున్న ద్రాక్షారామ భీమేశ్వరాలయానికి వచ్చి, అక్కడ సింహళ రాజపుత్రిక లీలావతిని వివాహం చేసుకున్నట్లు లీలావతి కావ్యంద్వారా తెలుస్తూంది. హాలుడు తన ఆస్థానంలో కవి, పండిత, గాయక, శిల్పులను ఆదరించినట్లు తెలుస్తూ వుంది.

## ఆనాటి సంఘం, సంస్కృతి :

క్రీస్తుకు పూర్వమే ఆంధ్రదేశంలో సంగీతం, నృత్యం, నాటకంతోపాటు అనేక వాద్య విశేషాలు ప్రచారంలో వున్నట్లు హాలశాతవాహనుడు రచించిన గాథా సప్తశతి తెలియజేస్తూ వుంది. హాలుడు గాథాసప్తశతిని మహారాష్ట్రి ప్రాకృత భాషలో రచించినా తెలుగుదేశానికి సంబంధించిన అనేక కళారూపాలను ఉదాహరించాడు. ప్రాకృత భాషలో 700 గాథల్ని రసవత్తరంగా రూపొందించాడు. ఆంధ్రదేశపు ఆనాటి సాంఘిక జీవితాన్ని తెలుసుకోవడానికి ఇదే ముఖ్యమైన గ్రంథం. క్రీస్తుశకం ప్రథమశతాబ్దంలో నాటి లలితకళలకు సంబంధించిన ఈ క్రింది వివరాలు గాథాసప్తశతి తెలియజేస్తూ వుంది.

1. జనపచేను హరితాల (అంచే అరదళము) మండిత ముఖంతో మెరసే నటివలె అందముగా ఉన్నదట.

2. గోపికల నర్తనాన్ని శ్లాఘించే నెపాన ఒక గోపిక వారి చెక్కిళ్ళ మీద ప్రతిబింబిస్తున్న కృష్ణుని ముద్దు పెట్టుకున్నదట. (2-14)

3. నర్తించి నర్తించి, అలసటగొన్న వాలుగంటి మొదలైనవారితో కలయిక ఆహ్లాదకరమట. (3-59)

4. ముఖమున అన్నం వున్నంతవరకే మద్దెల మధురంగా పలికి అది లేనిచో విరసముగా మొఱుగునట. (3-53)

పై వుదాహరణలతోపాటు గాథాసప్తశతిలో నాటకాలు, సంగీతం, మృదంగం, మురజ, వీణ మొదలైన వాద్య విశేషాలు ప్రచారంలో వున్నట్లుకూడ తెలుపబడింది. (పి. యస్. ఆర్. అప్పారావ్)

---

# బౌద్ధమత వ్యాప్తి - బౌద్ధయుగపు నాట్యకళ



కొత్తమోజు :

శాతవాహనరాజులు గాఢమైన హిందూమతాభిమానులైనప్పటికీ దేశంలో బౌద్ధమతం విరివిగా వ్యాపించింది. వ్యాపారులు, రైతులు, వివిధ వృత్తుల పనివారు చాలావరకు బౌద్ధ మతాన్ని అభిమానించారు. బ్రాహ్మణులు మాత్రం హిందూమతాన్ని, హిందూ దేవతలను ఎక్కువ ఆరాధించారు. శాతవాహనరాజులు మాత్రం వివిధ మతాలవారిని సమానదృష్టితో చూశారు. ఆనాడు రాజులకు రైతులకు వృత్తి పనివారల మధ్య వర్గకలహాలు తీవ్రంగా వుండేది. గ్రామ జీవితంలో పీడించేవారు, పీడింపబడేవారు వుండేవారు. కుల భేదాలను, వర్గభేదాలను నిరసించి సర్వసమానత్వాన్ని బోధించడంవల్ల పీడిత ప్రజానీకానికి బౌద్ధమతం ఒక ఆశాజ్యోతిగా నిలబడింది. అందువల్ల ఆనాటి కార్మికులు, రైతులు ఇతర పీడిత ప్రజానీకమంతా బౌద్ధ మతాన్ని గాఢంగా అభిమానించారు. ముఖ్యంగా శిల్పులు బుద్ధునిపై గలతమ భక్తి భావాన్ని ప్రదర్శించడానికి బౌద్ధ విగ్రహాలను చెక్కి పూజించడం మొదలుపెట్టారు. కాని బుద్ధుని విగ్రహరూపంలో పూజించవచ్చునా, కూడదా అన్న మీమాంసలో బౌద్ధులలో హీనయాన, మహాయాన అనే రెండు విభాగాలు ఏర్పడ్డాయి. మహాయాన శాఖవారు పూజించవచ్చునన్నారు: హీనయానవారు వ్యతిరేకించారు. కాని క్రమేపీ మహాయానశాఖ అభివృద్ధిచెంది ప్రపంచమంతటా బౌద్ధమతం వ్యాపించింది.

కాని ఆర్థికవ్యవస్థలో అణగిపోతున్న పీడిత ప్రజాసామాన్యానికి బౌద్ధమతం సాంఘిక, ఆర్థిక సమానత్వం కలిగిస్తుందని మొదట్లో ఆశించారు. కాని అలా జరుగలేదు. బౌద్ధమతంలోని సమానత్వ సిద్ధాంతాలన్నిటినీ అహింసా సూత్రాలతో బంధించడంవల్ల రాజరికవ్యవస్థకు భంగం కలుగదని భావించిన రాజులందరూ బౌద్ధమతాన్ని స్వీకరించారు. అంతేకాక ప్రారంభంలో వర్ణవ్యవస్థను వ్యతిరేకించిన బౌద్ధమతం క్రమేపీ వర్ణవ్యవస్థతోకూడా రాజీపడింది. ఈ విధానంవల్ల వివిధ

జాతులంటూ చెందినవారు వారి కులాచారాలను అనుసరిస్తూ బుద్ధుని దేవునిగా ఆరాధించారు. శిల్పులు శిల్పాలను చెక్కారు. చిత్రాలను చిత్రించారు. సంగీత, నృత్యాలతో వారి ఆనందాన్ని వెల్లడించారు. ఇలా బుద్ధుని ఆరాధించేవారందరికీ నాగార్జునకొండ కేంద్రమై అక్కడ శూద్రతీర్థం అనేది ఏర్పడింది. బౌద్ధమతంలో వచ్చిన కళా పరిణామాలను ఆచార్యనాగార్జునుడు మరికొంత ముందుకు తీసుకువెళ్ళారు.

నాగార్జునుడు :

ఆచార్యనాగార్జునుడు క్రీస్తుశకం రెండు మూడు శతాబ్దులమధ్య ధాన్యకటకం (నేటి ధరణికోట)ను రాజధానిగా పరిపాలించిన యజ్ఞశ్రీశాతకర్ణి ఆస్థానంలో వుండి దేశదేశాలూ సంచారంచేసి చివరిరోజుల్లో నాగార్జునుని కొండమీద ఆశ్రయం నిర్మించుకొని అక్కడే మరణించిన ఆంధ్రుడు.

నాగార్జునుడు శూన్యవాదం-లేక, మాధ్యమికవాదం అనే సిద్ధాంతాన్ని ప్రతిపాదించి బౌద్ధమతంలో ఒక పెద్ద మార్పును తీసుకువచ్చాడు. ఆంధ్రులలో విశేషంగా వ్యాపించిన బౌద్ధమతం ఆంధ్ర సంస్కృతిపరిణామంలో ఎంతో ప్రాముఖ్యం వహించింది. పండితుడైన నాగార్జునుడు దాదాపు 30 దర్శనగ్రంథాలను రచించాడు. ఆయన గొప్ప పండితుడు. ఆనాటి నాగార్జునుని కొండ బౌద్ధ ఆరామంలో విద్యాబోధన, ఉచిత వైద్యచికిత్సలతోపాటు శిల్పం, చిత్రలేఖనం, సంగీతం, నాట్యమూ నేర్పబడేవి. లలితకళలకు నిలయమైన అనేక బౌద్ధ ఆరామాలు ఆనాడు ఆంధ్ర దేశంలో—నాగార్జునుని కొండ, అమరావతి, ధరణికోట, జగ్గయ్యపేట, భట్టిప్రోలు, నందిగామ, ఘంటసాల, గుడివాడ, గోలి, రామతీర్థం, శంఖవరం మొదలైన ప్రాంతాలలోనేగాక, తెలంగాణాలోని, కొండాపురం, గుమ్మడిదుర్రు, ఫణిగిరి, గాజులబండ, అల్లూరు మొదలైనచోట్ల కూడ—ప్రసిద్ధంగా ఉండేవి.

అంతేగాక ఆంధ్రదేశంలోని ప్రసిద్ధ వైష్ణవదేవాలయాలన్నీ ఒకప్పుడు బౌద్ధ ఆరామాలున్నచోట కట్టబడినవే. ఈ వైష్ణవదేవాలయాలమీద సంగీత, నృత్య, వాద్యాలకు సంబంధించిన శిల్పాలు చెక్కబడినాయి. బౌద్ధ ఆరామాలన్నిటిలోనూ వివిధ లలితకళలూ పోషింపబడినాయి. ఇందుకు ఉదాహరణలు ఇటీవలి నాగార్జు

నునికొండ త్రవ్వకాలలో అనేకం బయటపడి, భద్రపరచబడ్డాయి. ఆకోవకు చెందిన నదే శిథిలమైన నాగార్జుననికొండ ఆరుబయలు రంగస్థలం.

## నాగార్జునకొండ ఆరుబయలు రంగస్థలం :

ఈ మధ్య నాగార్జునకొండ త్రవ్వకాలలో ఈ ఆరుబయలు రంగస్థలం బయట పడింది. ఇది దీర్ఘచతురస్రప్రాంగణం గల స్టేడియం. దీనికి నాలుగుపైపులా ప్రేక్షకులు కూర్చోవడానికి వీలుగా ఇటుకలతో మెట్లుమెట్లుగా రాతిపలకలు పరచిన ఆసనాల వరుసలు ఏర్పాటు చేసి వున్నాయి. ఇది 56.3 పొడుగు, 47.3 వెడల్పు వుంది. ఇది విద్యార్థులు సమావేశమయ్యే సభారంగం కావచ్చు. ఈ రంగస్థలంలో నై రుతిమూలగా ఎత్తైన శిలాపీఠం వుంది. ఇది ప్రధానవక్తనిమిత్తమూ. సంఘారామాన్ని దర్శించటానికి వచ్చిన వారి నిమిత్తమూ ఏర్పాటు చేయబడింది. ఇదీ ఆరుబయలు రంగస్థలం. దీనిలో కురిసిన వర్షపునీరంతా బయటికి పోవడానికి ఒక పెద్ద తూము వుంది. రంగస్థలం మధ్య భాగంలో ఒక గుండ్రని స్తంభం లాంటి వేదిక వుంది. వక్తలు దీనిమీద నిలబడి సభికుల నుద్దేశించి ఉపన్యసించే వారు. ఈ రంగస్థలంలో ఒక విచిత్రం: దీని మధ్య నిలబడి వుపన్యసిస్తే ఆ కంఠధ్వని స్పష్టంగా రెండువందల అడుగుల దూరం వరకూ వినబడుతుంది. అంతేకాక ఆసనపంక్తి అంతకంతకూ ఎత్తవుతూ వచ్చిన కొలదీ ఆ ధ్వని మరింత స్పష్టంగా వినబడుతుంది. దీనినిబట్టి అదివరకే ఆ పరిసరప్రాంతాలనుండి వచ్చే ప్రతి శబ్దధ్వనుల ననుసరించి ఈ ఆరుబయలు రంగస్థలం నిర్మింపబడియుండవచ్చునని పి. యస్. ఆర్. అప్పారావుగారు వారి నాట్యశాస్త్రంలో ఉదాహరించారు.

## అమరావతి నాట్యశిల్పాలు :

ఆంధ్రుల నృత్యకళ సుమారు రెండువేల సంవత్సరాలక్రితమె శాతవాహనుల నాటికే అభివృద్ధిచెందిం దనడానికి ఈనాడు అనేక ఆధారా లున్నాయి. అమరావతి, నాగార్జునకొండల్లో ఈనాడు కనుపించే అనేక పాలరాతిశిల్పాల్లో, అనేక నాట్యభంగిమలతోపాటు మన నాట్య సంప్రదాయాలన్నీ మలచబడి ఉన్నాయి.

ముఖ్యంగా అమరావతిలో దొరికిన శిల్పంలో ఒక బృంద నాట్య ముంది. బృందంలో ఉన్న ప్రతినర్తకీ ఏదో ఒక భావాన్ని సూచిస్తూ వుంది. ఒక నర్తకి

ప్రవేశికనృత్యం చేస్తూవుంది. మరో నర్తకి ఆలీఢ స్థానంలో ఉండి వ్యంసిత కరణాన్ని చూపుతూ వుంది. వేరొక నర్తకి అర్ధమత్తిల్లి స్థానంలో ఉండి స్ఖలితాపవిద్ధ కరణాన్ని చూపుతూ వుంది.



మరొక శిల్పంలో ఆరుగురు నర్తకీమణులు ఒక రాజుముందు నృత్యం చేస్తున్నట్లు చూపబడింది.

బోధిసత్వుడు తెల్ల ఏనుగురూపంలో భూమికి వచ్చే ఘట్టాన్ని చూపే శిల్పంలో ఆయనను అనుసరించివచ్చే దేవతల బృందం వివిధ నాట్యభంగిమలలో కనిపిస్తున్నారని దిగవల్లి శివరావుగారు తమ 'కథలు-గాథల'లో తెలియజేశారు.

## బుద్ధుడు, నాట్యకళ :

బౌద్ధయుగంలో అనేకమైన రూపకాలు వెలిశాయి. బుద్ధుడు మొట్టమొదటి నాట్య శాస్త్రవేత్త అని బుద్ధుని తొలిజీవితచరిత్ర 'లలిత విస్తరం'లో ఉదాహరణలు కనిపిస్తున్నాయి. బుద్ధుడు తన రాజగృహంలో విశ్రమించినప్పుడు ఆయన శిష్యులైన మౌద్గల్యాయనుడూ, ఉపతిష్యుడూ తమ నటనాకౌశల్యాన్ని చూపించారట. బింబిసారుని ఆస్థానానికి నాగరాజులు వచ్చినప్పుడు వారి గౌరవార్థం నాటకాలు ప్రదర్శించారట. రాజగృహంలో బుద్ధుని సమక్షంలో దక్షిణదేశానికి సంబంధించిన కువలయ అనే ప్రసిద్ధ నర్తకురాలు బుద్ధుని జీవితాన్నే అభినయించిందట. బౌద్ధజాతక కథలలో నటులను గురించి కావలసినంత సమాచారం తెలుస్తూంది. పై వివరాలనుబట్టి బౌద్ధయుగంలో నాటకకళ ఎలా అభివృద్ధిలయిందో సూక్ష్మంగా తెలుసుకోవచ్చును.



శాతవాహన రాజ్యవైభవం క్రీ. శ. 200 తో అంతరించింది. 400 సంవత్సరాల ఆ పరిపాలనలో సంగీతం, నాట్యం, శిల్పం, చిత్రలేఖనం ఎంతగానో అభివృద్ధి పొందాయి.

## ఇక్ష్వాకులు :

శాతవాహన రాజ్యం ఛిన్నాభిన్నమైన తరువాత ఇక్ష్వాకురాజులు పరిపాలించారు. ఈ వంశంలో ముగ్గురు రాజులు 5?

సంవత్సరాలు మాత్రమే రాజ్యపరిపాలన చేశారు. వాసిష్ఠీపుత్రశాంతమూలుడు ఈ వంశకర్త. ఈయన కుమారుడు మాఠరీపుత్ర వీరపురుషదత్తుని కాలంలోనే నాగార్జునకొండ శిల్పాలన్నీ చెక్కబడినాయి. ఇక్ష్వాకు రాజులు లలితకళలను పోషించిన ఆధారాలు మనకు ఎక్కువ లేవు. కాని శాతవాహనుల కళాసంస్కృతులను చాలవరకూ కాపాడింది వీరే. పల్లవరాజులు ఆంధ్రదేశంమీద దండెత్తడంతో ఇక్ష్వాకురాజ్యం పతనమైంది. నాగార్జునకొండ, విజయపురినగరాలను నాశనం చేయడంతో ఆ నగరాల శోభ అంతరించింది. బౌద్ధ భిక్షువులందరూ తరిమివేయబడ్డారు. బౌద్ధచైత్యాలన్నీ ధ్వంసంచేయబడ్డాయి.

## పల్లవులు :

శాతవాహన చక్రవర్తులక్రింద సామంతరాజులుగా వుండి వీరు తరువాత స్వతంత్రులై పల్లవనాడును (నేటి పలనాడు) కేంద్రంగా చేసుకుని దక్షిణాన కంచివరకు ఆక్రమించుకుని కంచిలో రాజ్యం స్థాపించారు. పల్లవుల రాజ్యపరిపాలనాకాలంలో మొత్తం 21 మంది పల్లవరాజులు పరిపాలించారు.

వీరిలో మొదటి మహేంద్రవర్మ క్రీ. శ. 600 నుండి 630 వరకు పరిపాలించాడు. సింహవిష్ణుని మరణానంతరం అతని పుత్రుడు మొదటి మహేంద్రవర్మ కాంచీపుర పల్లవరాజ్యానికి అధిపతి అయ్యాడు. ఈతడు పల్లవవంశపాలకులలో సుప్రసిద్ధుడు. ఇతడు కళాప్రియుడు. శిల్పకళా విద్యావిశారదుడు. సంగీత విద్యలో దిట్ట. అనేక బిరుదులు సంపాదించినవాడు. రుద్రాచార్యు డనే విఖ్యాత సంగీత విద్వాంసునికి శిష్యుడు. ఈయన ఒక సంగీత గ్రంథాన్ని రచించి కుడిమియామలై అనే చోట శిలాక్షరాలను చెక్కించాడు. ఈయన సంగీతంలో ఎంత ప్రావీణ్యం కలవాడో సాహిత్యంలోనూ అంత గొప్పవాడు.

పల్లవుల తరువాత సాలంకాయనులు పశ్చిమగోదావరిలోని వేంగివి రాజధానిగా చేసుకుని 300 నుండి 420 వరకు పరిపాలించారు. ఈ కాలంలో వర్ధిల్లిన లలితకళావికాసం ఎటువంటిదో మనకు తెలియదు.

## విష్ణుకుండినులు :

తరువాత విష్ణుకుండినులు 420 నుండి 620 వరకు, అమరావతి రాజధానిగా పరిపాలించారు. గుంటూరుజిల్లాలోని వినుకొండ వీరి స్వగ్రామం. వినుకొండకే

## ముందుబంతిలో మొదటివారు :

కూచిపూడి నాట్యకళాకారులలో అగ్రశ్రేణికి చెందినవారిలో ముఖ్యులు బ్రహ్మశ్రీ నాట్యకళానిధి వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రిగారు.


వేదాంతం లక్ష్మీనారాయణశాస్త్రి

యక్షగానాలూ, వీధి భాగవతాల్లో పారంపర్యంగా వచ్చే సాధారణ నృత్యాల బాణీకి భిన్నంగా శాస్త్రిగారు కొత్త పద్ధతి అనుసరించారు. భరత నాట్యశాస్త్రసంప్రదాయాల ఆధారంతో శ్రీ నారాయణ తీర్థుల కృష్ణలీలాతరంగిణి తరంగాలకు, శ్రీ జయదేవ కవి అష్టపదులకు, క్షేత్రయ్య మువ్వగోపాల పదాలకు, కృష్ణకర్ణామృతం, పుష్పబాణవిలాసం శ్లోకాలకు నృత్యాలు సరికొత్తగా కల్పించి, ప్రధానపాత్రల లక్షణాలు, మనస్తత్వాలు నిరూపించి, శాస్త్రోక్తంగా ఒక నూతన నాట్యశాస్త్రమే కల్పనచేసి, శిష్య ప్రశిష్యుల్ని తయారుచేసి ఆంధ్రదేశానికి ప్రసాదించిన మహనీయులు వీరు భామా కలాపంలో సత్యభామ నాయిక. సత్యభామపాత్ర నిర్వహణలో అపూర్వంగా అఖండ ప్రజ్ఞ ప్రదర్శించిన వ్యక్తి ఈయన. ఈయన ఒక్క భామాకలాపం, గొల్లకలాపాలే కాకుండా, ఉషాపరిణయం, చెంచునాటకం, పార్వతీపరిణయం వంటి చెంచుసమ్మవేషం, లీలావతి విజయంలో బాలింత వేషం, శ్రీ కృష్ణజననం మొదలైన యక్షగానాల పాత్రలనూ అత్యద్భుతంగా నిర్వహించేవారు.

శాస్త్రిగారి విద్యను దర్శించిన ఉత్తరాది ఉజ్జ్వలనటుడు ఉదయశంకర్ ఉంద ....రేః ఈయనకు అమాంతంగా సాష్టాంగమే పడ్డాడు.

శాస్త్రిగారి జీవితం అంతా రాజుల ఆస్థానాల్లోనే గడిచింది. ఉమ్మడి మద్రాసు ...ప్రభుత్వం భావనగర్ మహారాజా గవర్నరుగిరీకింద శ్రీ పి. వి. రాజ ...న్నారు సమక్షంలో ప్రముఖ కళాకారులుగా శాస్త్రిగారిని గుర్తించి సువర్ణఘంటా ...కాలతో సత్కరించింది.

**తామరతంపరగా శిష్యులూ ప్రశిష్యులను తయారుచేసిన గురునాథుడు :**

శాస్త్రిగారి దగ్గిర భామాకలాపం, గొల్లకలాపం నేర్చుకున్న శిష్యులు అసంఖ్యాకం. ఈనాడు తెలుగుచలనచిత్ర పరిశ్రమలో ప్రముఖులుగా కీర్తి సంపాదించిన వేదాంతం రాఘవయ్య, వెంపటి సత్యం, వెంపటి చినసత్యం మొదలైనవారు శాస్త్రిగారి శిష్యులే: మద్రాసులోని సుప్రసిద్ధ నాట్యాచార్యుడు శ్రీ రామయ్యపిళ్ళై స్వయంగా కొన్ని నాట్యరీతులు శాస్త్రిగారివద్ద అభ్యసించారు.

రామాయణం, మండూకశబ్దం, ప్రహ్లాద పట్టాభిషేకం, తాటకి సంహారం, దశావతారాలు మొదలైనవాటిని శబ్దరూపంలో శ్రీ శాస్త్రిగారు నృత్యం చేసేవారు. ఆంధ్రదేశం అంతటా జరిగిన ఆయన నృత్యప్రదర్శనాలు విశేషంగా ప్రశంసలు అందుకున్నాయి. ఆయన 82 సంవత్సరాలు జీవించి 1957 జులై 13 వ తేదీన హైదరాబాదులో కీర్తిశేషులైనారు.

**అసలు 'రుద్రుడు' కాదు,**
**ఆటకు అస్సలు రుద్రుడు :**


హరి పున్నయ్య

కూచిపూడి నృత్యనాటక సంప్రదాయంలో, భయానక, బీభత్స, రౌద్ర, వీరరసాలను పోషించే పాత్రలను ధరించి ప్రేక్షకుల హృదయాలను రంజింపచేసి సుప్రసిద్ధ కళాకారులుగా వెలుగొందారు హరిపున్నయ్యగారు. వీరిది కూచిపూడి గ్రామం. చిరకాలంగా కళాలక్ష్మిని ఆరాధించిన కళాజీవి.

**సాత్వికవేషాల్లో 'సై' అనిపించుకొన్న సవ్యసాచి:**

కూచిపూడి వీధినాటకాలలో సాత్విక పాత్రల్ని రసవంతంగా అభినయించడంలో ఆరితేరినవారు వేదాంతుల రామకృష్ణయ్యగారు. యక్షగాన విద్యలోనూ, కలాపవిద్యలోనూ అపారమైన జ్ఞానాన్ని

ఆర్జించిన ప్రముఖ కళాకారులు. వృద్ధాప్యంలో వుండిన్నీ సంగీత నాటక అకాడమీ వారి పారితోషికాలు పైపైన పొందు తున్నారు.



వేదాంతం రామకృష్ణయ్య

## త్రాణతో ముందడుగులేక క్షీణదశ :

ప్రాచీన నాట్యకళ ప్రచారమవడానికి కూచి పూడివారు ఎంతో కృషి చేశారు. కాని ఎంత చేసినా, పాత పరిధిని మించి కొత్త పరిధిని చేపట్టలేకపోయారు. పౌరాణిక గాథలు తప్పితే చారిత్రిక, సాంఘిక ప్రదర్శ నాలను తయారు చేయలేక పోయారు. కాగా రానురాను రాజుల ఆదరణ తగ్గింది. పరిణామ స్థితిగతుల ననుసరించి వారి భాగవతాలు ముందుకురాలేదు. వారు కాలంతోపాటు కాళ్ళు వేయలేకపోయారు. అవి ప్రేక్షకులకుకూడ కొంతవరకు విసుగు పుట్టించాయనే చెప్పాలి.

## శుక్లపక్షంనుంచి కృష్ణపక్షం :

కూచిపూడివారి నాట్యకళా సాంప్రదాయాలు ఆంధ్రదేశమంతటా, వెలిగినంతమట్టుకు, క్రీ॥ శ॥ 1880 వరకూ వేవెలుగులతో వెలుగొందాయి. ఆ రోజుల్లోనే ధార్వాడ నాటకసమాజాలు ఆంధ్రదేశానికి వచ్చి ప్రదర్శనలిచ్చి, వేనోళ్ళ పొగడ బడుతూ వచ్చాయి. కాలదేశాలెరిగి రంగస్థలంలో వారు అనేకమార్పులు తీసుకు వచ్చారు. చెమ్కీ దుస్తులతో రమణీయంగా ప్రదర్శనాలిచ్చారు. తహతహతో, మార్పు కావాలనుకుంటున్న ప్రజలకు ఒక నూతన ఆనందాన్ని కలుగజేశాయి, ఈ ప్రదర్శనలు. ఈ రోజుల్లోనే కూచిపూడివారి ప్రదర్శనల ప్రభావం మగ్గుపట్టి తగ్గుతూ తగ్గుతూ వచ్చింది. అంతేకాక ధార్వాడవారు వచ్చి వెళ్ళిన తరువాత వారి ప్రబల ప్రచారంతో ఆంధ్రదేశ ప్రముఖ పట్టణాలలో ఎన్నో విద్యావంతుల నాటక సంఘాలు బయలుదేరి, అచ్చంగా ధార్వాడవారి అడుగుజాడల్లో ప్రదర్శనాలిచ్చాయి. ఈ పరిస్థితుల్లో కూచిపూడివారి ప్రదర్శనాలమీద మోజు బాగా తగ్గిపోయింది.

1930 నాటికి నాటకాల ఉధృతంకూడ కొంతవరకు తగ్గి సినిమాల ప్రభావం

బహు ఎక్కువైంది. ఆ సినిమా ప్రభావంతో రంగస్థల నాటకాలూ, కూచిపూడి వారి నాటకాలుకూడా బాగా దెబ్బతిని పోయాయి.

**మేలుకోలు -**

**కొత్త మెరుగులు :**

1880 నుంచి 1911 మధ్యకాలంలో కూచిపూడివారు ఏటికెదురీదలేక తమ ప్రదర్శనాలలో కూడ కొన్ని మార్పులు తీసుకువచ్చారు. రంగస్థల నాటకాలు ప్రేక్షకులను ఏ విధంగా, ఎందుకు ఆకర్షిస్తున్నాయో ఆ కీలకాలన్నిటినీ తెలుసుకొని భాగవత సంప్రదాయాలలో కొంత సంస్కారం తీసుకువచ్చి, తెరలు, హార్మోనియం, పద్యాలు, పాటలు, చెమ్కీ దుస్తులు ప్రవేశపెట్టి భరతనాట్య సంప్రదాయాల ననుసరించి ప్రదర్శనాలను ఇచ్చారు.

---

# కోటకొండ భాగవతులు

**ఆ మాటకు వస్తే . . .**

ఆ మాటకువస్తే భరతనాట్య సంప్రదాయ ప్రవర్తకులలో కూచిపూడికన్న ప్రథముల పొతకమూరి భాగవతులు. వీరు అహోబిల నృసింహస్వామి సన్నిధిని నాట్యాచార్యులై నిత్యనాట్యసేవ చేసేవారు ..“శ్రీ వెలయ పాలవారిధి పవ్వళించి జో, జో,” అన్న జోలపాట ఈ భాగవతులు రచించిందే. వీరిని తాళ్ళపాక అన్నమాచార్యులే పేర్కొన్నారన్న. గీతనాట్యాలలో వీరికి గల ప్రతిభ వ్యక్తం కాగలదనీ, వీరు 1280 ప్రాంతపువారనీ శ్రీ నిడుదవోలు వెంకటరావుగారు....ఎల్లోరా ..వ్రాసిన “కళలు—పుట్టు పూర్వోత్తరాలు”కు వ్రాసిన ఉపోద్ఘాతంలో వివరించారు. దీనిని బట్టి భాగవతకళ రాయలసీమలో తరతరాలుగా ప్రచారంలో వున్నట్లు తెలుస్తూ వుంది.

**భాగవతకళపై**

**నవాబుల బలిపాటం :**

భాగవత కళను రాయలసీమలో ఎక్కువగా ప్రచారం చేయించవలెనన్న తలంపుతో, క్రీ. శ. 1700-1750 ప్రాంతంలో బసగానిపల్లె నవాబుగారు కూచిపూడి

మంది కొందరు కళావేత్తల కుటుంబాలను ఆహ్వానించి. కోటకొండ. కపట్రాల వద్ద వారికి భూములూ పత్రిలిచ్చి, వారిచేత కర్నూలుజిల్లాలో భాగవత కళా ప్రచారాన్ని ప్రోత్సహించారు. అప్పటిలో కూచిపూడినుండి తరలివెళ్ళిన కుటుంబాలలో చల్లావా రొకరు. వీరు వెలనాటి బ్రాహ్మణుల కుటుంబానికి చెందినవారు. వీరిలో ప్రథముడు చల్లా భాగవతందాసంభొట్లు. భాగవతమనేది వీరికి పౌరుషవాచకమట. సిద్ధేంద్రయోగి నేర్పించిన పారిజాతాపహరణాన్ని పారంపర్యంగా ప్రదర్శించిన వారిలో ఈ చల్లావా రొకరు.

## సిద్ధేంద్రయోగి పేరు నిలబెట్టిన చల్లావారు :

ఈ మధ్య కీర్తిశేషులైన భరతశాస్త్రం లక్ష్మీనారాయణశాస్త్రి వారిలో తొమ్మిదవ తరానికి చెందినవారు. శాస్త్రిగారు ఆ కళాకారుల కుటుంబానికి చెందిన సుప్రసిద్ధ నాట్యకళా విశారదులు. భామా కలాపాన్నీ, గొల్ల కలాపాన్నీ, క్షేత్రయ్య పదాలనూ, తరంగాలనూ అభినయించడంలోదిట్ట. సంగీత, నృత్య విద్యల్లోనే గాక సంస్కృతాంధ్ర భాషలలోనూ చక్కని పాండితీప్రతిభ గడించినవారు. నృత్యరీతిలో వీరి బాణీకి, కూచిపూడి వారి బాణీకి అడుగుల క్రమంలోనూ, జాతివిన్యాసాల్లోనూ తేడా వున్నట్లు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారిచేత జరుపబడిన కూచిపూడి నాట్య సదస్సులో వివరించారు. వీరి కలాపంలో కొన్ని భాగాలను ఆనాడు అఖిల భారత సంగీత నాటక అకాడమీవారు టేప్‌రికార్డు చేశారు. వారి సంప్రదాయం ఎటువంటిదో తెలుసుకునే అవకాశం మనకు లేకుండాపోయింది.



చల్లా భరతశాస్త్రం లక్ష్మీనారాయణశాస్త్రి

కోటకొండలో ఈనాటికీ ఉన్న లక్ష్మీనారాయణ శాస్త్రిగారి అన్న కుమారులైన రంగయ్యగారికి భరత నాట్యశాస్త్రంలో అభినివేశం అట్లాగే ఉన్నదట. మరికొంద

రున్నా జీవనోపాధి కష్టమై ఇతర వృత్తులలోనూ, వ్యవసాయంలోనూ ఆసక్తి కల్పించుకొని పెంచుకున్నారు.

**వారికి గోలకొండ నవాబైతే**
**వీరికి కర్నూలు నవాబు :**

కూచిపూడి భాగవతులకు గోలుకొండనవాబు తానీషా ఎలా అగ్రహారాన్ని దానం చేశాడో అదేవిధంగా కోటకొండ భాగవతులకు కర్నూలు నవాబు 200 ఎకరాల భూమి శ్రోత్రియంగా—కుడివారం, మేలువారం హక్కులతో—ఇచ్చారట. ఆ హక్కు ఈనాటికీ వారి అనుభవంలో వున్నది.

**వంశమంతా**
**భరత శాస్త్రానికే అంకితం :**

వీరి వంశంలో ఒకరో ఇద్దరో తప్ప తర్కంలోనూ, వ్యాకరణంలోనూ ఎక్కువ మంది ప్రతిభావంతులు లేరట. వీరి యింట పారంపర్యంగా భరతశాస్త్రమే ప్రసిద్ధంగా ఉన్నదని లక్ష్మీనారాయణశాస్త్రిగారు వివరించారు.

**ఇంటింటా**
**ఒకని కాళ్ళకు గజ్జెలు :**

వీరి ఇలవేల్పు కౌలుట్ల చెన్నకేశవుడు. వీరి కుటుంబంలోని ప్రతి మగపిల్లవానికి ఐదవ ఏట ఆ దేవాలయంలో ముక్కు కుట్టిస్తారట. ఉపనయనానంతరం ఆ దేవుని ఎదుట గజ్జెకట్టించి ప్రథమపాఠాలు ప్రారంభిస్తారట. విద్య పూర్తికాగానే చెన్నకేశవుని సన్నిధానంలో ప్రప్రథమం ప్రదర్శనమిచ్చిన అనంతరం గాని రాజులవద్ద ప్రదర్శించేవారు కారట. వీరికి ఎక్కువ మక్కువతో అభ్యాసమైన విద్యలు తరంగాలు, అష్టపదులు, క్షేత్రయ్యపదాలు.

**డిటోగా పాటుపడ్డ**
**కపట్రాల కళాకారులు :**

రెండువందల సంవత్సరాలకు పూర్వం, బనగానిపల్లె నవాబు కర్నూలు సమీపంలో తుంగభద్రానదికి ఆవలిప్రక్కన అలంపురానికి దగ్గిరగానున్న చారిత్రిక సుందర

నగరం కవుట్రాలను వీరికి ఈనాంగా ఇచ్చారు. ఆనాడే కూచిపూడినుండి కొంత మంది చల్లావారు, చింతావారు కుటుంబాలతో అక్కడికి వలసవెళ్ళారు. కూచిపూడి సంప్రదాయాన్నే వారు నైజాం సంస్థానంలో ప్రచారం చేశారు. కాని రాఘరామ వారి కళాసంప్రదాయం నిర్జీవమైపోయింది. వీరుకూడ ఆ గ్రామంలో వున్న కాళ త్తయ్య దేవాలయంలో బిడ్డలందరికీ చిన్నతనంలోనే ముక్కులూ, చెవులూ కుట్టించి గజ్జెకట్టించి నాట్యాభ్యాసానికి ప్రారంభోత్సవం చేసేవారట. అక్కడ వున్న కళాకారులు చల్లా మోహనకృష్ణ, చల్లా కాళత్తయ్య, చల్లా ముద్దుకృష్ణ మొదలైనవారు భాగవత సంప్రదాయాలను కాపాడుతూ వచ్చారు. ఈ సంప్రదాయాన్ని మహారాష్ట్ర దేశంలోకూడా ప్రచారం చేసి వచ్చారని ప్రతీతి.

## వినుతికెక్కిన తమ్మారపు వీధినాటకాలు :

కూచిపూడి భాగవతులు వీధినాటక ప్రదర్శనాలతో ఆంధ్రదేశం అంతటా విజయయాత్ర సాగిస్తున్న రోజుల్లో అంత వృత్తమంగానూ వీధినాటకాలు ప్రదర్శించి సెహభాష్ అనిపించుకున్న వ్యక్తి శ్రీ తమ్మారపు వెంకటస్వామి. ఆయన స్వగ్రామం ఒంగోలుతాలూకాలోని తమ్మవరం. ఆయన దేవదాసి కులానికి చెందిన వ్యక్తి. బాల్యంలో ప్రాథమిక విద్యాభ్యాసం పూర్తిచేసిన వెంటనే ఆ గ్రామంలోవి కుందుర్తి వారివద్ద సంస్కృతం చక్కగా అభ్యసించారు.



ఏ వేషం వెయ్యమన్నా వెయ్యగలరు - తమ్మారపు వెంకటస్వామి

## పగటివేషాల ప్రాభవం, ప్రభావం :

కూచిపూడి బృందం పగటివేషాలు తిలకించిన శ్రీ వెంకటస్వామి కళాజీవితం పగటివేషాలతోనే ఆరంభమైంది.

ఆచిన్నతనంలోనే ఆయన తల్లి వద్ద తమాషాగా తమాషా అయిన ఆశీర్వాదం పొందాడట. ఒకరోజున ఆయన తల్లికి తెలియకుండా బుడబుక్కలవేషం ధరించాడు. స్వగృహంముందే ఆ వేషంతో నిలబడి ఇంట్లో వున్న వస్తువులు అన్నిటినీ పేరుపేరునా వరుసగా వల్లిస్తూవుంటే ఆ బుడబుక్కలవాని మాహాత్మ్యనికి తల్లి ఆశ్చర్యపోతూవుండగా "అమ్మా, ఆ చిన్నతనంలోనే తమాషాగా తల్లి ఆశీర్వచనం పొందాడు. ఈ బుడబుక్కలవాడు నీ కొడుకేనమ్మా," అంటూ మాతృమూర్తి ఆశీర్వచనాలు పొందారు.

### జట్టులో కట్టుబాటులు :

వెంకటస్వామి జట్టులో చేరిన వారందరూ కళావంతుల కులానికి చెందిన వ్యక్తులే. ఆయన జట్టులో పురుషపాత్రలు పురుషులు, స్త్రీ పాత్రలు స్త్రీలు ధరిస్తూ వుండేవారు. అందరిదీ అమ్మనబోలుగ్రామమే. అందులో శ్రీ పెద్ద హనుమయ్య నాయక పాత్రలను, శ్రీ చెల్లయ్య, శ్రీ చిన్నహనుమయ్య, శ్రీ మాణిక్యం ఇతర పాత్రలు ధరించేవారు. అలివేలమ్మ నాయిక పాత్రలు నిర్వహిస్తూండేది. మంగతాయమ్మ మాత్రం పురుషపాత్రలు ధరించేది.

ఈ జట్టు శ్రీ ధేనువుకొండ వెంకయ్య రచించిన ఉత్తరగోగ్రహణం నాటకాన్ని, అమ్మనబ్రోలు వాస్తవ్యులు శ్రీ నాగినేని వెంకటప్పయ్య వ్రాసిన హరిశ్చంద్ర నాటకాన్ని ప్రదర్శిస్తూండేది. అది గాక శశిరేఖాపరిణయం, ఉషాపరిణయం, నలచరిత్ర, భామాకలాపం, గొల్లకలాపం మొదలైన ప్రదర్శనాలు కూడా కొనసాగిస్తూండేవారు.

### హాస్యరసపోషణలో అందెవేసిన అద్భుతప్రతిభ :

శ్రీ వెంకటస్వామి హాస్యరస పోషణలో స్వయంగా ఒకముద్ర ప్రతిష్ఠాపించుకొన్న ప్రజ్ఞావంతుడు. ఆయనే ఈ జట్టును నిర్వహించేవారు. ఒకసారి మద్దిలాలపాడులో హరిశ్చంద్రనాటకం ప్రదర్శిస్తూండగా ఒక సంఘటన జరిగింది. నక్షత్రకుడి పాత్ర నిర్వహిస్తున్న ఆయన పైకం చెల్లించవలసిందిగా హరిశ్చంద్రుణ్ణి

విలదీసి విలబెట్టి వీపువంచి దానిపై బండలు బరువుపెట్టి హింసిస్తూవుంటే ఆ దృశ్యం చూడలేక శ్రీ తూమాటి రామమూర్తి అనే ఓ ధనికుడు ప్రేక్షకుల్లోంచి లేచి "ఏహేయ్ బేంబడా, ఆ బండ తీసెయ్. ఆయన్నెందుకు బాధిస్తావ్? ఆ డబ్బు నేను పారేస్తా రావయ్యా" అన్నారట. దీనినిబట్టి ఆనాటి ఆ జట్టు వీధినాటకాలు ఎంత రసవత్తరంగా రక్తికట్టేవో అర్థంచేసుకోవచ్చు.

### జిట్టుజిట్టంతకూ

### చక్కని విందు :

శ్రీ వెంకటస్వామిజట్టు ఒక ఊరిలో ప్రదర్శనాలు ప్రారంభిస్తే ఇక రోజులతరబడి ఆ గ్రామంలోనే వివిధ నాటకాలు ప్రదరిస్తూనే ఉండేవారు. ప్రతి ప్రదర్శనానికీ నాలుగు రూపాయ లిచ్చేటట్లూ, ఇంటికి ఒకరుచొప్పున జట్టులోనివాళ్ళకు భోజనాలు పెట్టేటట్లూ ఏర్పాట్లు జరగగానే ప్రదర్శనం జరుగుతూ వుండేది. ఆజట్టులో సత్యభామ పాత్రధారిణి అలివేలు చాలా అందగత్తె కావటంవల్ల ప్రతివాళ్ళూ ఆమెనే భోజనానికి ఆహ్వానిస్తూండేవాళ్ళట. ఆమె అందుకు అంగీకరిస్తే విందు షడ్రసోపేతంగా జరిగేదట. ఈ సంగతి గ్రహించిన వెంకటస్వామి ప్రతియింటివాళ్ళకూ సత్యభామే భోజనానికి వస్తుందని చెప్పివచ్చేవాడట. ఆ విధంగా ఆ జట్టులోని వాళ్ళందరికీ చక్కని విందు అందేదట.

### నాటక ప్రారంభం,

### ఆ డాబు - ఆ గోటు :

నాటకప్రదర్శనంనాడు రంగస్థలానికి ముందువరుసలో కరణం. మునసబు ఆదిగా అన్నివర్గాలవాళ్ళూ కూర్చునేవాళ్ళట. సాధారణంగా ఈ జట్టు ప్రదర్శనలు భాగవతంతో ఆరంభమయేవి. అందులో ముఖ్యపాత్రలు శ్రీ కృష్ణుడు, నత్యభామ, గొల్లభామ, సుంకరికొండడు.

ఈ పాత్రలు తెరవెడలేముందు రంగస్థలానికి రెండుప్రక్కలా రెండు దివిటీల్ని పాత్రధారుల ముఖాలకు దగ్గరగా వుంచి వాటిపై ఒకసారి గుప్పెడు గుగ్గిలం చల్లేవారు. ఆ వెలుగులో ఠీవిగా విర్రవీగుతూ పాత్రలు రంగస్థలంలో ప్రవేశించేవి.

ఆనాటి రంగస్థలానికి యవనిక అడ్డంగా పట్టే వెడల్పయిన గుడ్డమాత్రమే. వేషధారణలో ఉపయోగించే ఆభరణాలన్నీ తేలికకొయ్యతో, కాకిబంగారం అంటింపులతో తయారయ్యేవి.

## పండితులకు
## పాత్రధారుల సవాలు :

ఆ కాలంలో వీధినాటకాల్లో సత్యభామ తన జడను తెరవెలుపల వేయటం, సభలో కూర్చున్న పండితులు భాగవతం విషయమై ప్రశ్నిస్తే జవాబు చెప్పగలనని సత్యభామ పాత్రధారిణి సూచించటం ఒక సంప్రదాయంగా ఉండేది. ఈ సూచనకు పండితులు ఆగ్రహించి భాగవతం పద్యాలకూ, కృష్ణకర్ణామృతం శ్లోకాలకూ భావార్థాలు చెప్పమని అడిగేవారు. అలివేలమ్మ వాటిని క్షుణ్ణంగా వల్లించేది. పండితులు అంతటితో తృప్తిచెందక ఆమెకు భరతశాస్త్రం, అలంకారశాస్త్రం గురించి ప్రశ్నలు అందించేవారు. వాటికీ ఆమె సంతృప్తికరంగా జవాబులు చెప్పగానే కొందరు పండితులు ఆమెను ప్రశంసించేవారు. మరికొందరు తృప్తిపడకుండా ఆమె పై మంత్రాలు, తంత్రాలు ప్రయోగించే వారు. అందుచేత ప్రతి వీధినాటకం జట్టులోనూ ఒక మంత్రశాస్త్రవేత్త ఉండి ఇటువంటి మంత్రప్రయోగాల్ని విఫలీకృతం చేసేవాడు.

## పండితులతో సయ్యాటం,
## కన్నెపడుచుల కైవారం :

ఆనాటి కళావంతుల కులంలో పెరిగిన కన్యలందరూ సామాన్యంగా విద్వత్తు కలిగినవారుగానే ఉండేవారు. నాటక ప్రదర్శనం పూర్తికాకముందే సత్యభామ పాత్రధారిణి ముందు కూర్చున్న పండితులూ, పెద్దమనుష్యుల దగ్గరకు వెళ్ళి తన జడను వాళ్ళ మెడలకు చుట్టి రెండు బుగ్గలూ ఒత్తుతూ జావళీలు పాడుతూవుంచే ఆ పెద్దలు తబ్బిబ్బయి ఆమెచేతికి ఒకటికి బదులు రెండు రూపాయలు అర్పించే

వారు. ఆ సమయంలో బహుమతి యిచ్చిన పెద్దల పేర్లు చెప్పి శ్రీ వెంకటస్వామి వారిపై పొగడ్తలు కురిపిస్తూ పద్యాలు పాడేవారు. ఈ పద్యాలు అందరి పేర్లకూ సరిపడేటట్లుగా వుండేవి.

ఈ విధంగా సత్యభామ పాత్రధారిణి బహుమతులుగా 20 రూపాయలవరకూ ఆర్జించేది. ఈ హంగులతో నాటక ప్రదర్శనం ముగిసేసరికి అచ్చంగా తెల్లవార గట్ల అయిదుగంట లయేది.

### ఆట అయినాక
### ఊరిమీదికి దాడి !

నాటక ప్రదర్శనానంతరం జట్టులోనివాళ్ళు అందరూ ఆ వేషాలతోనే గ్రామంలోని ప్రతిగడపకూ వెళ్ళి చీరలూ, ధోవతులూ దండుకునేవారు. ప్రదర్శనం చూసి ముగ్ధులైన గ్రామస్థులు ఎంతో ఆదరంతో వాళ్ళకు ఈ బహుమతులు ఇచ్చేవారు. ఈ విధంగా శ్రీ వెంకటస్వామి జట్టు ప్రదర్శించే వీధి నాటకాలు జేగీయమానంగా సాగుతూ వుండేవి.

### మచ్చలేని
### మహామంచి మనిషి :

శ్రీ వెంకటస్వామి దైవభక్తుడు. పెద్దలంటే వినయ విధేయతలు కలిగిన వ్యక్తి. ఆయనకు ఎటువంటి దురభ్యాసాలూ లేవు. ఆయన 80 సంవత్సరాలు జీవించి. అందులో 60 సంవత్సరాలు కళాసేవజేసి అవసానదశలో తమ్మవరంలో మరణించారు.

### జేజేలు అందుకొన్న
### జేగంట భాగవతులు :

"ఎందుకయ్యా వుంచినావు బందిఖానలో రామయ్య తండ్రీ, ఎందుకయ్యా వుంచినావు'' అని రామదాసు బందిఖానా విశేషాన్ని పాటరూపంలో వల్లిస్తూ

గంటి భాగవతులు ఆంధ్రదేశపు పల్లెల్లో సంచారం చేస్తూ వుంటారు. వీరు ఒక చేతిలో ఒక పెద్ద జేగంట, రెండవ చేతిలో సీతారామలక్ష్మణ విగ్రహాలతో కూడిన ఒక దీపపు స్తంభాన్ని పట్టుకుని, చంకలో నెమలి ఈకలపింఛం, కాళ్ళకు గజ్జెలు కట్టి నృత్యంచేస్తూ, నోటితో పాట పాడుతూ, ఒక చేతితో జేగంట వాయిస్తూ యింటింటి ముందూ స్తంభాన్నుంచి స్తంభంచుట్టూ కలయ తిరుగుతూ, నృత్యంతో, పాటతో, వాయిద్యంతో చుట్టూ మూగిన ప్రేక్షకుల్ని ముగ్ధుల్ని చేస్తూ ఇంటింటికీ తిరిగి యాచిస్తూ వుంటారు. ఈ నృత్యం ఇంచక్కా భక్తిభావంతో నడుస్తుంది.



జేగంట భాగవతుడు

## గంటిభాగవతులు :

ఆంధ్రదేశంలో కొంతకాలం క్రితం గంటి భాగవతులు అని ఒక తెగ భాగవతులుండేవారు. వీరు దీపస్తంభాల వెలుతురులో బొమ్మలు ఆడిస్తూ వుండేవారు. అంటే బొమ్మతోపాటు మనిషి కూడా ఆడుతూ వుండేవాడు. ఇలా బొమ్మలు ఆడించేవారిని 'గంటి భాగవతులు' అనేవారు. వీరు ఎక్కువగా భాగవత గాథల్నే ప్రచారంచేయడంవల్ల వీరికి 'భాగవతులు' అనే పేరు వచ్చింది.

ఈ భాగవతులు నలుగురు, లేక ఐదుగురు కలిసి ఒక దీపపు స్తంభాన్ని పట్టుకుని పాటలతో, పద్యాలతో బయలుదేరి ఈ బొమ్మలాటలను ప్రదర్శించేవారు.

## తోలుబొమ్మలకు పూర్వరూపం

## కొయ్యబొమ్మలు :

ఈ బొమ్మలకు 'పాంచాలిక'లనీ, 'పుత్తళిక'లనీ పేరుకూడ వుంది. ఇవి కొయ్యబొమ్మలు. భాస నాటకాలన్నిటినీ ఈ పాంచాలిక లనే కొయ్యబొమ్మలాటలగానే ప్రదర్శించారనే ప్రతీతికూడా వుంది. తోలుబొమ్మలకు ముందరి కళా రూపం ఈ కొయ్యబొమ్మలే. భాసుని నాటకాలు కొయ్యబొమ్మలలో ప్రదర్శిస్తే

భవభూతి నాటకాలన్నీ తోలుబొమ్మలలో ప్రదర్శించబడ్డాయి. సుభటుని 'దూతాంగద', రాజశేఖరుని 'బాలరామాయణం' మొదలైనవి తోలుబొమ్మల నాటకాలుగానే ప్రదర్శింపబడ్డాయని ప్రతీతి. ఈనాటికీ ఈ బొమ్మలాటలను చూడాలంటే తమిళనాడులో చూడొచ్చు. 'బొమ్మలాట్టం' అని ఈ కళారూపాన్ని అక్కడ అత్యద్భుతంగా ప్రదర్శిస్తున్నారు. ఈ ప్రదర్శనాలు కొంతకాలం ఆంధ్రదేశంలోనూ ప్రదర్శింపబడినా, ఇటీవలికాలంలో ఎక్కడా ప్రదర్శించినట్లు లేదు. అందుకు కారణం తోలుబొమ్మలై యుండవచ్చు. తమిళనాడులో తోలుబొమ్మలకంటే ఈ కొయ్య బొమ్మల ప్రదర్శనాలే ఎక్కువ.

గంట భాగవతుల రంగస్థలం వీధిభాగవతుల మాదిరిగా కాదు. ప్రతి ఇంటి ముందు ప్రదేశమూ వీరికి రంగస్థలమే. చుట్టుప్రక్కల నాలుగు ఇండ్ల ప్రజలే వీరి ప్రేక్షకులు. వీరి ప్రదర్శనకాలంకూడా స్వల్పమే. ఈ బొమ్మలాటల్ని యాచనకే ఎక్కువ వుపయోగించారు. వీరికి ప్రజలిచ్చే పారితోషికం ఏమిటో తెలుసా? బొమ్మలాడించుకునేందుకు వారి దీపస్తంభపు ప్రమిదలో ఒక గంటెడు నూనె పోస్తే చాలు. దాని పోషణకు ఆ ప్రమిదలో ఎవరికి తోచిన కానుకలను వారు వదిలేవారు. గంటెడు చమురుతో తృప్తిపడి ప్రదర్శనలను సాగించేవారు కాబట్టి వీరిని 'గంటిభాగవత' లనేవారు.

## గొల్లభాగవతులు :

కృష్ణుడు గొల్లవాడనే విశ్వాసంకొద్దీ కృష్ణలీలలను, కృష్ణ భాగవతాలను గొల్లభాగవతులే ప్రదర్శించేవారు. వీరే యాదవులు, యాదవకులానికి గర్వకారకుడైన శ్రీకృష్ణభగవానుడు తమ జాతివాడనే అభిమానంకొద్దీ ఈ వీధి భాగవతాలను ప్రదర్శించేవారు. ప్రథమంలో భక్తికొద్దీ ఈ కళద్వారా పౌరాణిక ప్రచారం జరిగినా కొంతకాలానికి అన్నికళలతో బాటు వీరి భాగవతాలూ యాచనకే ఉపయోగించేవారు. పెళ్ళిళ్ళకూ, ఉత్సవాలకూ, తిరునాళ్ళకూ, పండుగలకూ, వ్యవసాయ తిరుణం అయిన తరువాత ఓ ఘనంగానూ వీటిని ప్రదర్శించేవారు ఈ భాగవతులు ఒకే గ్రామంలో వీడి వీడిగా ప్రదర్శించేవారు. ఇంటింటా చందాలు వసూలు చేసేవారు. ప్రజలు ఓంచాలు దుస్తులు, కిరీటాలకూడ బహూకరించేవారు. పదిహేను సంవత్సరాల క్రితంవరకూ ఎంతో ప్రచారంలో వున్న వీరి ఈ భాగవతాలు ఈనాడు మన దురదృష్టంకొద్దీ మచ్చుకుకూడ కనబడడంలేదు.

## యానాది భాగవతులు :

కూచిపూడి భాగవతుల ప్రభావం అనేక జాతులమీదా, కులాలమీదా పడింది. ఒక నాటక సమాజాన్ని చూచి అనేక సమాజాలు ఉద్భవించినట్లు కులాలవారీగా కూడా భాగవతులు తయారయ్యారు. యానాదులు ఎక్కువగా నెల్లూరు, గుంటూరు జిల్లాలలో వున్నారు. వీరి అసలువృత్తి రాత్రిళ్ళు గ్రామాలను కాపలాకాయడం. వీరిలో కొంతమంది యువకులు ఉత్సాహంతో భాగవతుల జట్టులుగా తయారయ్యారు. యానాది భాగవతుల్లో స్త్రీ పాత్రలు స్త్రీలు, పిల్లలపాత్రలు పిల్లలు. పురుషపాత్రలు భర్తలు ధరిస్తూవుంటారు. దాదాపు జట్టులోని వారందరూ ఏదోఒక వాయిద్యమో, తాళమో, లేక వంతపాట పాడటమో చేస్తూవుంటారు. వీరిలో బెందాళం గవరయ్య, ముతరాజు నర్సయ్య అనే పురుషులూ, చింతపువ్వు మాణిక్యమనీ, పెదమాణిక్యమనీ ఇద్దరు స్త్రీలూ ఆంధ్రదేశంలో ఎంతో పేరు ప్రతిష్ఠలు గడించారు.

## ఒకపూట భోజనంపెట్టి
## పదిరూపాయలిస్తే చాలు :

ఒకరాత్రి అందరికీ భోజనాలు పెట్టి పదిరూపాయలు ఇస్తే ప్రదర్శనం జరిగిపోతుంది. వీరి ప్రదర్శనాలు అంతకట్టుదిట్టంగా లేకపోయినా ప్రేక్షకుల్నిమాత్రం తృప్తిపరచాయి. వీరు ప్రదర్శించే భాగవతాలు ఉషాపరిణయం, కృష్ణలీలలు, సావిత్రి, శశిరేఖాపరిణయం మొదలైనవి. వీరి వాయిద్యాలు మద్దెల, తాళాలు, శృతి పక్కమైన హార్మోనియం. ఇక వీరి ముఖాలంకరణకు వాడే రంగులు అరదళం, గంగసింధూరం, కాటుక, దుస్తులు, పూసల కోట్లు వగైరా. ప్రదర్శనకాలం ప్రారంభించిందిమొదలు తెల్లవార్లూ. ఈ మధ్య వీరి ప్రదర్శనాల ప్రభావం చాలా తగ్గింది.

## మాల భాగవతులు :

మాలభాగవతులని కొందరు ఆంధ్రదేశంలో అక్కడక్కడా వున్నారు. వీరు హరిజనుల ఇండ్లలో నివాహాలకు భోగంఆటలు ఆడేవారు. వీరిలో కొంతమంది భాగవతుల జట్లుగా తయారయ్యారు. వీరు ప్రదర్శించే నాటకాలు, ముఖ్యంగా శశి

రేఖాపరిణయం, రెండవది చెంచులక్ష్మి, చుక్కలూరి రామనాటకం, మర్రిగుంట రామాయణం మొదలైనవి. వీరి ప్రదర్శనల్లో చెంచులక్ష్మి భాగవతాన్ని ప్రతిభా వంతంగా ప్రదర్శించేవారు. మచ్చుకు వీరు పాడే పాట

"చెట్టు లెక్కగలవా నరహరి
పుట్ట లెక్కగలవా.
చెట్లనుండీ సన్నబియ్యము
ఏరితెచ్చీ పెట్టగలవా ?"

వీరి భాగవత సాహిత్యం ఈ విధంగా వుండేది. ముఖ్యంగా వీరి భాగవతాలు పల్లెల్లో వ్యవసాయతరుణం ఐపోయిన తరువాత రాత్రి సమయాల్లోనూ. దసరా వుత్సవాల్లోనూ ప్రదర్శిస్తారు.

వెన్నెల నాటకాలు :

పూర్వం ప్రతివైశాఖ పౌర్ణమికీ, ఆరుబయట, నిండు వెన్నెలలో రెండు మూడు రోజులు ఈ వెన్నెలనాటకాలు ఆడుతూ వుండేవారు. వీటిని 'రాసనాటకా' లనే వారు. 1916-17 సంవత్సరాల ప్రాంతంలో బందరులో కానుకొల్లు నరసింహం గారు 'బృందావనపురం ప్రాంతంలో ఈ రాసలీలలు ప్రదర్శించటంవల్లనే ఆ ప్రదేశానికి బృందావనపుర మని పేరు వచ్చినది. భజనగీతాలమాదిరి భాగవతంలోని భ్రమరగీతాలను పాడేవారు.

ఈ ప్రదర్శనాలకు-వెన్నెలలో, ఇసుక దిబ్బలమీద తులసికొమ్మలు పాతి, ఆ తులసికొమ్మల చాటున, గోపికాలీలలు ప్రదర్శించేవారు. తులసి అంటే బృంద. అందుకే వాటిని బృందావనగీతా లనేవారు. ఇందులోని నటీ, నటులు ఆయా కుటుంబాలకు సంబంధించిన బాలబాలికలు. బాలులందరూ కృష్ణులూ, బాలికలందరూ గోపికలూ. అందరూ ఒకేరకమైన రంగుల బట్టలు ధరించేవారు.

జడకోలాటాలు,

వాటి కోలాహలం :

ఆ రోజుల్లో బందరులో పెద్దపెద్ద పందిళ్ళలో జడకోలాటాలు వేసేవారు. ఆ కోలాటాలు వేసేవారందరూ రాసనాటకాలకు ప్రేక్షకులుగాను, వారి పిల్లలు నటీనటులుగాను వుండేవారు.

ప్రదర్శనం ఒక ఎత్తుదిబ్బమీద జరుగుతూ వుండే చుట్టూ ఎత్తుగా గ్యాలరీమాదిరి ఇసుకతిన్నెలను ఏర్పాటుచేసేవారు.

## పాటలకు పాటలు, భజనలకు భజనలు :

ఒక ప్రక్క తంబురా, హార్మోనియం, మద్దెల మొదలైన వాటి శ్రుతితో భజనలకు సంబంధించిన భజనపరులు గోపికాగీతాలను పాడుతూవుండే బాలనటులందరూ రాధాకృష్ణులుగానూ, కృష్ణలూ గోపికలుగాను అభినయిస్తూ వుండేవారు. పాట వచ్చిన పిల్లలు పాటకూడా పాడుతూవుండేవారు. ఈ ప్రదర్శనం చూడడానికి కొంత మంది ప్రేక్షకులు ప్రక్కనున్న చెట్లెక్కి కూర్చునేవారు. ఈ ప్రదర్శనాలకు దాదాపు వెయ్యిమంది వరకూ ప్రేక్షకులు హాజరయ్యేవారు. వీటిని చిలకలపూడి ప్రాంతంలోకూడా ప్రదర్శించేవారు.

## వీధినాటక సూత్రధారుని విశేషత, విలక్షణత :

పూర్వం మన గ్రామాల్లో వీధిభాగవత ప్రదర్శనాల్లోనూ, తోలుబొమ్మల్లోనూ, మరి కొన్ని పౌరాణికనాటకాలలోనూ నాటకానికి ముందు సూత్రధారుడు ప్రవేశించే వాడు. ఈనాటికీ జానపద కళారూపాల్లో సూత్రధారుడు ప్రత్యక్షమౌతూనేవున్నాడు.

ఆరోజుల్లో ప్రదర్శనాలు వీధుల్లో ప్రద[illegible]పబడే[illegible]. ప్రేక్షకులు ఏడు [illegible]ట లకే తెరముందు కూర్చునేవారు. ప్రదర్శనం ప్రారంభించమని వత్తిడి చేసే[illegible]. ఈ వత్తిడినుంచి తప్పుకోవడానికే, ఈ సూ[illegible] నాంది ప్రస్తావన తెచే[illegible] అతగడు ప్రదర్శించబోయే ప్రదర్శనాన్నిగూర్చి [illegible]టూకీగా [illegible] చెప్పే[illegible] తన హాస్యచతురతతో ప్రేక్షకుల్ని అదుపు[illegible]

## సూత్రధారుని లక్షణం :

నాటక రచయిత గుణగణాలను, కథావిస్తృవు విశిష్టతను గురించి విస్పష్టంగా వివ రించ గలిగినవాడూ, అంతేగాక రంగస్థలంలోని పాత్రధారులందర్నీ, సిద్ధంచేయ

గలిగినవాడూ. లయ, తాళం, సంగీతవిద్యల్లో ప్రజ్ఞ కలిగినవాడూ, పాత్రల నిర్ణయంలో సహకారీ, అన్నిదేశాల నృత్తభేదాలను ఎరిగినవాడూ సూత్రధారుడని కాళిదాసుని (ఆంధ్ర) శాకుంతలంలో వుదాహరింపబడింది.

నాటకాల్లోనూ, జానపద కళారూపాల్లోనూ విటుడూ, విదూషకుడూ, చేటకుడూ, పీఠమర్దుడూ అనే ఇంకా కొందరు పాత్రధారు లుండేవారు. కాని అందరూ ఒకే నాటకంలో వుండేవారనిమాత్రం చెప్పలేం. ఆయా కథావిధానాలనుబట్టి ఈ పాత్రలు వస్తూవుండేవి.

## నాయకునికి నమ్మిననేస్తం

## విటుడు :

విటుడు ముఖ్యంగా శృంగారనాయకునికి సహాయంగా వుండేవాడు. నాయకుడు నాయికకోసం అన్వేషించడంలో తగిన సలహాలనిస్తూ, అటు నాయికచర్యలూ, ఇటు నాయకుని చర్యలూ గమనిస్తూ వారిద్దరినీ ఒకేచోట కలిపేటందుకూ, కలిపిన తరువాత వారిమధ్య శృంగారం తొణికిసలాడేటట్లు చమత్కారంగా మాట్లాడడం, వారిద్దరిమధ్య ప్రణయకోపాలను తెప్పించడం, ఇరువురిమధ్యా చేరి చమత్కార సంభాషణలతో ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్విస్తూ, ధర్మాలనూ, నీతులనూ బోధించడం చేస్తూ వుండేవాడు. ఇలాంటి విటులవల్లనే ఆనాటి ప్రదర్శనసారాంశం ప్రేక్షకులకు చక్కగా అర్థమయ్యేది.

## విరహంలో ఉన్నవారిని దారికితెచ్చే విదూషకుడు :

ఈతని పాత్రకూడ హాస్యంతో కూడుకున్నదే. విరహంతో కూడుకున్న నాయికా నాయకులమధ్య వుండి వారిని నవ్విస్తూ, వారిని సరియైన త్రోవలోకి తీసుకురావడమే విదూషకుని కర్తవ్యం. అంతేకాక ఆనాటి ప్రజలకు అక్షరజ్ఞానం తక్కువ. ప్రదర్శనకారుల భాష, ప్రదర్శన ఇతివృత్తం కఠినమైన భాషలో వుండడం వల్ల వాటిని ప్రజలకు అర్థమయ్యే భాషలో తెలిగిస్తూ, ఆయా పాత్రలమధ్య చేరి హాస్యాన్ని గుప్పిస్తూ వుంటాడు ఈ విదూషకుడు.

## కలహాలుతీర్చి, కూరిమికూర్చి చేర్చే చేటకుడు :

సూత్రధారుడూ, విటుడూ, విదూషకుడూ కాక ఈయన నాలుగవవాడు. ప్రదర్శ నాల్లో ఈతని పాత్ర నాయికా నాయకులమధ్య వచ్చే కలహాలను తీర్చడం. నాయిక చెప్పిన విషయాలను నాయకునితో చెప్పడం, నాయకుడు చెప్పిన విష యాలను నాయికకు చెప్పడం! వీరిద్దరిమధ్యా రంగస్థలంపై నే వార్తలు మోస్తూ ఏదోవిధంగా వారిని సమాధానపరిచి, నేర్పుతో ఆ కార్యాన్ని నిర్వహించేవాడు. ఇలా నిర్వహించిన తరువాత నాయికా నాయకులద్వారా పారితోషికం పొందేవాడు. ఈ దృశ్యమంతా ప్రేక్షకులకు కళ్ళకు కట్టినట్లు ప్రదర్శించడంవల్ల ప్రేక్షకులు ఎంతో ఆనందించేవారు. నిత్యజీవితంలో దంపతులమధ్యా, ప్రేమికులమధ్యా జరిగే సంఘ టనలే గనుక ఇవి ప్రేక్షకుల నెంతో ఆనందపరిచేవి.





# తోలుబొమ్మలాటలు

ఒకే కళలో అనేక కళలు జోడించిన తుల
లేని తోలుబొమ్మలాట - సాహిత్యంతో
సాహిత్యాని కెక్కిన ప్రశస్తి ప్రకాస్తులు-
శాసనాల నుద్దులు-ఆటలాడించే పాటవం-
ఆటగాండ్ల ఊర్లూ పేర్లూ



# తోలుబొమ్మలాటలు

ఆంధ్రదేశంలో ఆబాలగోపాలాన్నీ ఆనందింపజేసి, అన్ని కళారూపాలతో పాటు దీర్ఘకాలం దివ్యంగా వర్ధిల్లిన కళారూపం తోలుబొమ్మలాట.

**ఒకే కళలో**

**అనేక కళల మిలాఖత్తు :**



మన లలితకళలు ఈ కళ వుపాంగంగా వున్నా. లలితకళలు అన్నిటికిఅన్నీ ఈ ప్రదర్శనంలో మూర్తీభవించి వున్నాయి. కావలసినంత కవిత్వం వుంది. సాహిత్యం వుంది. సంగీతంవుంది. శిల్పం. చిత్రకళలు తొణికిసలాడుతూ వుంటాయి. కడుపుబ్బ నవ్వించే హాస్యరసఘట్టాలు వున్నాయి. లలిత కళ లన్నిటిలోనూ ఈ ప్రదర్శనం ఎంతో కన్నులపండు వుగా వుంటుంది.

బొమ్మలతో చక్కగా నాట్యం త్రొక్కిస్తారు. ఆ పైన వెనుకనుంచి సూత్రధారుడు ఎంతో నాటకచక్యంగా పాత్రాభినయం చేయిస్తూ వుంటాడు. నాటక ప్రదర్శనానికి ఎన్ని హంగు లుండాలో దాదాపు అన్ని హంగులూ బొమ్మ లాటలోనూ వుండాలి. ఇన్ని హంగుల్నీ వారు ఎక్కడనుంచి పూర్తిచేసుకొంటారు? కిరాయి నటీ నటుల్ని ఎక్కడనుంచీ దించరు. ఇంటిపెద్దలు పురుషపాత్రలు, వారిస్త్రీలు స్త్రీపాత్రలు వహిస్తారు. భర్త శ్రీరాముడుగా వాచికం చెప్పి పాట పాడితే, భార్య సీతగా వాచకంచెప్పి వంత పాడుతుంది. ఇక వారి బిడ్డలు బాలబాలికల పాత్రలకు అభినయాన్నిస్తారు.

ఈ విధంగా ఆయా పాత్రల బొమ్మలు పుచ్చుకుని కార్యక్రమాన్ని దిగ్విజయంగా నడుపుతారు. తెరమీది బొమ్మలు ఎంత వుధృతంగా నాట్యం త్రొక్కుతూ వుంటాయో, లోపలి భాగంలోవున్న వ్యక్తులుకూడా దాదాపు అంతటి అభినయాన్నీ వ్యక్తంచేస్తూ వుంటారు.

ఈ బొమ్మలాటలు - ఈ తమాషా కళారూపం ఒక్క ఆంధ్రదేశంలోనే కాకుండా పరిసర ప్రాంతాలైన మహారాష్ట్రం, మలయాళం, తమిళం, బెంగాల్ మొదలైన ప్రాంతాల్లోనూ వ్యాపించి వుంది. ఉత్తర దేశంలో 'కట్ పుత్లీ' అనే కొయ్యబొమ్మలాటలూ, దక్షిణ దేశంలో కీలుగుఱ్ఱపు బొమ్మలాటలూ, బొమ్మలాట్టం అనబడే కొయ్యబొమ్మలాటలూ ప్రచారంలో వున్నాయి. ఈనాడు మనం చూచే బొమ్మల వస్త్రధారణా, భూషణాలంకార పరిశోధనా చూస్తే - ఈమాదిరి అలంకారం గల నాగరికత తంజావూరు ఆంధ్రరాజుల కాలంలోనిదిగాను, మహారాష్ట్ర రాజులకాలంలోనిదిగాను నిదర్శనాలు కనుపిస్తున్నాయి.



కీలుగుఱ్ఱం

తోలుబొమ్మలాటలు ప్రదర్శించేవారు చాలవరకు మరాఠీవారు. వీరిని కన్నడంలో 'కిళ్ళేక్యాత' జాతివారని, తమిళదేశంలో 'కిల్లెక్యాతవా'రని, తెలుగు దేశంలో బొమ్మలాటవారని, చర్మనాటకులని వ్యవహరిస్తున్నారు.

ఆంధ్రదేశంలో ప్రదర్శించే తోలుబొమ్మలాటలు మహారాష్ట్రంనుంచి సంక్రమించాయనే చరిత్రాధారా లున్నప్పటికీ, చాళుక్యరాజుల కాలంనాటికే తోలుబొమ్మలాట లాడినట్లు భారతం విరాటపర్వంలో వివరించబడింది.

బొమ్మలాటలవారు బెల్గాం, కొల్హాపూర్, సతారా, పూనా, బిజాపూర్ ప్రాంతాలనుండి, పరిపాలకుల జైత్రయాత్రల్లోనూ, ఆయాదేశాలలో వచ్చిన విప్లవోద్యమాల మూలంగానూ వలస వచ్చారు.

శ్రీశైలం శివరాత్రి మహోత్సవాలలో తోలుబొమ్మలాటలు ప్రదర్శించినట్లు పండితారాధ్యచరిత్ర పర్వత ప్రకరణంలో పాల్కురికి సోమనాథుడు ఈ విధంగా వివరించాడు.

భారతాదికథల జీరమఱుగుల—వారంగ బొమ్మల నాడించువారు.
గడు నద్భుతంబుగ గంబసూత్రంబు—లడరంగ బొమ్మల నాడించువారు.

అనడాన్నిబట్టి శ్రీశైలం వెళ్ళే ద్రావిడ యాత్రికులతోపాటు పై వలసలు వెళ్ళిన బొమ్మలాటలవారు కూడా వుండి వుండవచ్చు. దీనినిబట్టి ఆంధ్రదేశంలో కొన్ని వందల సంవత్సరాల ముందునుంచే ఈ బొమ్మలాటలు ఆదరింపబడి ప్రజాభిమానం పొందుతూవున్నాయని స్పష్టపడుతూంది.

మన వాఙ్మయంలో పాల్కురికి సోమనాథుని కాలంనుండి తంజావూరు రఘునాథరాయల కాలంవరకూ అనేకమంది కవులు బొమ్మలాటలను పేర్కొన్నారు. ''ప్రతిమలాడగ బట్టినయట్లు'' అని పల్నాటిచరిత్రలో శ్రీనాథ మహాకవి పేర్కొన్నాడు.

బొమ్మలాటలను గురించి నాచనసోమన వుత్తర హరివంశంలో-

"యంత్రకు డాడించి యవని ద్రోచిన వ్రాలు
బొమ్మల గతి రథపూగములుమ"

అని వివరించాడు. బొమ్మలాటల వారు గోన బుద్ధారెడ్డి రామాయణంలోని ద్విపదలను పాడేవా రని సురవరం ప్రతాపరెడ్డిగారు 'సాంఘిక చరిత్ర'లో వివరించారు. భాస్కర శతకాన్ని వ్రాసిందెప్పుడో తెలియదుగాని, అతని కాలంలో తోలుబొమ్మలాటలు వ్యాప్తిలో వున్నట్లు భాస్కరశతకంలో ఈ క్రింది పద్యం ద్వారా తెలియవస్తుంది.

"ఇంచుక వేర్పు చాలక విహీనత జెందిన నాకవిత్వముల్
మించు వహించె నీకతన మిక్కిలి; యెట్లన తోలుబొమ్మలన్
మంచివివేకి వాని తెరమాటునమండి ప్రశస్తరీతి వా
డించిన నాడవే? జనుల డెందము నింపవె ప్రీతి భాస్కరా !"

## శాసనాలు, తోలుబొమ్మలు :

తోలుబొమ్మలాటలను గురించి అనేక శాసనాల్లో వుదాహరింపబడి వుంది. బొమ్మలాట వారిని గురించి చాగంటి శేషయ్యగారు ఒక శాసనాన్ని బయట పెట్టారు. కడపజిల్లా కమలాపురం తాలూకా చిడిపిరాల అన్న గ్రామాన్ని చంద్రయ్యా, బొమ్మలాట అమృతకవీ అనే వా రిద్దరూ తెరనాటకా లాడడానికి పెదచిట్టెయ్య అనే ఆయనకు దానం ఇచ్చినట్లు శాసనంలో వుంది.

## ముక్కామల

## భూదానశాసనం :

అలాగే క్రీ॥ శ॥ 1208 లో దుర్జయాన్వయులైన విప్పరుల కొండప, గుండప నాయకుల ముక్కామల భూదాన శాసనంలో, సూత్రధారి సోమలయ అనే

ఆయన ప్రతిగృహీతగా పేర్కొనబడ్డారు. అతను బొమ్మలాటవాడే కావచ్చని యస్వీ జోగారావుగారు వ్రాస్తున్నారు.

## గూడూరు శాసనం :

ఇంకా కాకతీయులకు సంబంధించిన తెలంగాణాశాసనాలలో వరంగల్ జిల్లా గూడూరుశాసనం ఒకటి ఈ బొమ్మలాట సమాచారాన్ని తెలియజేస్తూంది. శాసనం చివరిభాగంలో సూత్రధారి కొమ్మోజనహో బరహో అనివుంది. అంటే సూత్రధారి కొమ్మోజు వ్రాసినదన్న మాట. ఇది తెలుగుశాసనం

అలాగే పానుగల్లు శాసనంలో సూత్రధారి బ్రహ్మోజు బెరసిన సూత్ర ధారుల కాస్యపల్లిని బానుగంట దళవృత్తి పుడపండ్లు 20. భీమసముద్రమువెనుక పుడమఋతరు అని వుంది.

## కొమ్మోజు,
## బ్రమ్మోజు :

పై సూత్రధారులు-కొమ్మోజు, బ్రమ్మోజు అనే పేర్లనుబట్టి బొమ్మలాటవారని తెలుసుకోవచ్చు. అంతేగాక పై పేరులనుబట్టి వీరు తప్పక మహారాష్ట్రులై వుండవచ్చు.

అంతేగాక వా రుపయోగించిన మాటలు బరహో, బెరసిన అన్నవి కన్నడభాషకు చెందినవి. దీనినిబట్టి మనకు విశదమయ్యే దేమంటే మరాటీ బొమ్మ లాటవారు దేశదేశాలూ తిరిగారు. అలాగే వీరు కన్నడదేశంకూడా సంచారం చేశారు. అంతేగాక మహారాష్ట్రపు సరిహద్దు నున్నదేశం కన్నడదేశం. అందువల్ల వీరికి ఆబరహో, బెరసిన అనే కన్నడమాటలుకూడ వచ్చివుండవచ్చు. దేశదిమ్మరు లైనవారికి ఆయా భాషలు పంటబట్టడం సహజమే.

## అరెకాపులు,
## గంధోళీలు :

ఈ బొమ్మలాటలాడేవారిని ఆరెకాపు లంటారు. ఈ ఆరెకాపులు ఈనాటికీ మహా రాష్ట్ర దేశంలో వున్నారు. అక్కడ వారి పేరు గంధోళీ లంటారు. ఈనాడు



తెలుగుదేశపు బొమ్మలాటల వారందరూ ఒకనాడు మహారాష్ట్రులే. ఈనాటికీ బొమ్మలాటలవారు బయట ఎంత తెలుగు మాట్లాడినా ఇంట్లో మాత్రం మరాఠీభాషనే మాట్లాడుతూవుంటారు. అంతేగాక మరాఠీ బొమ్మలాటలో వుండే హాస్య పాత్రధారి గంధోళిగాడికీ, మన జుట్టుపోలిగాడికీ చాలా దగ్గరసంబంధ ముంది. ఒకేరకమైన హాస్యమూ వేషధారణలో పోలికలూ వున్నాయి.

## రకరకాల జాతులు, పేర్లు :

కాని దక్షిణదేశంలోని బొమ్మలాట ప్రదర్శకులందరూ మహారాష్ట్రజాతికి సంబంధించినవారని చెప్పలేము. మైసూరు ప్రాంతంలో వూరి జంగాలు, బొంబాయి, మైసూరు సరిహద్దుప్రాంతాల్లో రుతుబువారు, మధుర తంజావూరు ప్రాంతాలలో కుత్తాడీ అనే నట్టువ జాతివారు, బళ్ళారి జిల్లాలో కొన్ని ప్రాంతాల్లో బలిజలు, విశాఖ జిల్లాలో ఈడె బొండిలీ తెగలవారు, గోదావరి మండలంలో తెలుగు గొల్లలూ, గుంపు తెగలవారు, జంగాలు మొదలైన వారు కూడ వున్నారు.



## బొమ్మలాటలవారి ఇమ్ములు, కేంద్రాలు :

ఈ బొమ్మలాటల కుటుంబాలవారి నివాసాలు ఆంధ్రదేశంలో విశాఖపట్టణంజిల్లాలో సర్వసిద్ధి, శృంగవరపుకోట, కశ్శేపల్లి అగ్రహారం, గోదావరిజిల్లాలో మండపేట, అంగర, ఎలమంచిలి, తణుకు, నెల్లూరుజిల్లాలో సింగరాయకొండ, కర్నూలుజిల్లాలో రాయదుర్గం, బెళగల్లు, అనంతపురంజిల్లాలో కదమలపంట, ఆవులన్న, జరుట్ల రామపురం, బళ్ళారిజిల్లా సొండూరు, తోరణగల్లు, బొమ్మలాటపల్లి

మొదలైనవి. ఆ ప్రాంతాలలో బొమ్మలాటలవారు ఎక్కువగా వున్నారు. కాకినాడ వద్ద మాధవపట్నంలో మాత్రం ఈ కుటుంబాలవారు చాలామంది వున్నారు.

**ఫక్తు బొమ్మలాటల పల్లి**

**బొమ్మలాటపల్లి :**

బొమ్మలాట లాడేవారు ఎక్కువమంది వుండడంవల్లనే ఈ గ్రామానికి బొమ్మలాట పల్లి అనే పేరు వచ్చింది. బొమ్మలాటపల్లి బళ్ళారిజిల్లాకు చెందిన గ్రామం.

**కులగోత్రాలు -**

**కోరికోరి ఆడే**

**కథలు, గాథలు :**

ఇక్కడున్న బొమ్మలాటవారిలో మహారాష్ట్రవాసనలు చాలా వున్నాయి. వీరిని బొందిలీ క్షత్రియు లంటారు. గంధోలి అనే శబ్దవికృతే బొందిలీ అని కూడా వాడుకవుంది. ఈనాటికీ వీరు బొమ్మలాటల్ని ప్రదర్శిస్తున్నారు.

ముఖ్యంగా వీరు ప్రదర్శించే కథా ఇతివృత్తాలు భారత రామాయణ గాథలకు సంబంధించినవి. లంకాదహనం, మైరావణ చరిత్ర, ఇంద్రజిత్తువధ, యయాతికథ, కీచకవధ, దుశ్శాసనకథ, ప్రహ్లాదచరిత్ర, రంగనాథరామాయణం మొదలైనవే కాక, దేశీయ కథలైన దేశింగురాజుకథ, పల్నాటి వీర చరిత్ర, కరెభంటనకథ,కుమార రాముని కథలనుకూడ ప్రదర్శిస్తూ వుంటారు.



**బొమ్మలాటల సాహిత్యం,**

**రామనాటకం :**

తోలుబొమ్మల ఆటలు ఆడేవారి సాహిత్యమంటూ మనకు ఈనాడు ఏదీ లభ్యంకాదు. కాని వారు యక్షగానాలనే బొమ్మలాట సాహిత్యంగా కూడా ఉపయోగించుకున్నారు. క్రీస్తుశకం 1850 ప్రాం

తాల్లో గంజాంజిల్లా గుజ్జువాడనివాసి మరింగంటి భట్టరు రామానుజాచార్యుల శ్రీరామ నాటకం బొమ్మలాటగా ప్రసిద్ధిజెందింది. ఇందులో కథ ముఖ్యంగా లక్ష్మణ మూర్ఛ, ఇందులోని పాటలూ, పద్యాలూ, దరువులూ మొదలైనవి మాధవ పట్నం బొమ్మలాటవారి లక్ష్మణమూర్ఛలో కనబడుతాయి. భట్టరు రామానుజా చార్యులు వ్రాసిన తాళపత్రప్రతి చెన్నపురి ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో వుంది.

## బాణాసుర నాటకం :

1893 లో కోట వెంకటప్పయ్య శాస్త్రిగారనే ఆయన బాణాసుర నాటకాన్ని రచించాడు. వీరి నివాసస్థలం పర్లాకిమిడికి దగ్గరలో వున్న పాత పట్నం గ్రామం. ఆయన ఆ నాటకానికి పీఠిక వ్రాస్తూ "ఈ గేయ ప్రబంధము చర్మ విగ్రహములచేత ఆడించుటకును, వేషములు ధరించి నాటకమాడుటకును అను కూలముగ నుండునట్లు రచింపుడని నా మిత్రులు కొందరు ప్రోత్సాహపఱచినందున నే నిందుల కియ్యకొంటి''నని వ్రాశారు. దీనిని 1894 లో ఇండియన్ లా ప్రెస్‌లో ముద్రించారు. వీరు బాణాసుర నాటకంలో తోలుబొమ్మల జుట్టుపోలిగాడి మాదిరి 'లొట్టకిత్తడు', 'రత్నాల పోలిగాడు' అనే రెండు హాస్యపాత్రల్ని సృష్టించారు.

## సంత వేలూరు

## కుశలవుల నాటకం :

అలాగే వీణె సుబ్బరాజు, గాజుల పెండ్లూరి శేషగిరిరాజు అనే ఇరువురు కవులు కలిసి సంత వేలూరు కుశలవుల నాటకాన్ని, ఆరు రాత్రిళ్ళు ప్రదర్శించడానికి అను వుగా, వ్రాశారు. దీనిని బొమ్మలాటగాను, వీధి నాటకంగాను, యక్షగానంగా కూడ ప్రదర్శించేవారట. 'బొమ్మలాట హాస్య నాటక'మనే కేతిగాని పెళ్ళి ఇతి వృత్తంగా గల తాళపత్ర నాటకం మద్రాసు ప్రాచ్య లిఖిత గ్రంథాలయంలో వుంది.

## తోలుబొమ్మల బమ్మలు -

## వారి ఎమ్మెల్యూ, పనితనం :

తోలుబొమ్మల్ని ఎక్కడో మార్కెట్టుల్లో కొనుక్కురారు. ఈ బొమ్మలను తయారు చేసే చిత్రకారులు వారి వారి దళంలోనే వుంటారు. ఎప్పుడు బొమ్మ అవసర మనుకుంటే అప్పుడు అప్పటికప్పుడు తయారు చేసుకుంటారు. ఈ బొమ్మలు మేకచర్మంతోనూ, జింక చర్మంతోనూ, దుప్పి చర్మంతోనూ తయారుచేస్తారు.

**పాత్రలకుతగ్గ**

**సరకుసతం జామాలు :**

బొమ్మలాట కథా విధానంలో వచ్చే ఉదాత్తమైన పాత్రలన్నింటికీ రాముడు, కృష్ణుడు, విష్ణువు, ఇంద్రుడు, దేవతలు, సీత, సావిత్రి, ద్రౌపది మొదలైన పాత్రలన్నింటికీ జింక చర్మాన్ని ఉపయోగిస్తారు. జింక చర్మాన్ని పూజా సమయాలలో ఎంత పవిత్రంగా వుపయోగిస్తామో, అలాగే వారుకూడా ఆ చర్మాన్ని ఎంతో పవిత్రంగా ఎంచుకుంటారు. రాక్షస పాత్రలకు, దుష్ట పాత్రలకు ఇంకా మిగిలిన చిల్లర పాత్రలకు మేకచర్మాన్ని వుపయోగిస్తారు. ఈ విధంగా పాత్రల పవిత్రతనుబట్టి చర్మాలను వుపయోగిస్తారు.

**బొమ్మల తయారీ -**

**బహుభంగులు :**

పైన వుదాహరించిన చర్మాలను సేకరించి చక్కగా శుద్ధిచేసి, చర్మంలో వున్న దుర్వాసననంతటినీ పోగొట్టి, వాటికి కావలసిన బొమ్మల సైజుకు చక్కగా గీతగీసి దానిని సొంపుగా కత్తిరించి చిత్ర విచిత్రమైన రంగులను అద్దుతారు. రంగులు వేసిన తరువాత ఆ బొమ్మలో జీవం వుట్టిపడుతూ వుంటుంది. ఈ రంగుల్ని అద్దడంలో కూడా పాత్ర ఔచిత్యాన్నిబట్టే రంగుల్ని చిత్రిస్తారు. ప్రథమ, మధ్యమ, వుత్తమ పురుషలక్షణాలతోనూ, పద్మిని, చిత్తిని, శంకిని మొదలైన నాయకీ, నాయకులకుండే భేదాలను రంగుల్లో చిత్రిస్తారు.

ముఖ్యపాత్రలు అంటే ప్రదర్శనంలో చిపరంటా వచ్చే పాత్రలు. ఆయా రంగాలలో ఘట్టాలననుసరించి ఒకే పాత్ర నాలుగు రకాలుగా తయారు చేసుకుంటారు. వుదాహరణకు-బాల్యంలో రాముడు, అడవిలో రాముడు, యుద్ధంలో రాముడు, పట్టాభిరాముడు. ఈ విధంగా ఆయా దశల ననుసరించి చిత్రాలను తయారుచేసుకుంటారు.

**హంగులు, సజ్జు, సరంజామా,**

**పరికరాలు :**

ఇక ప్రదర్శనానికి కావలసిన పరికరాలను, మిగిలిన హంగు లన్నిటినీ కూడ తయారు చేసుకుంటారు.రథాలు, గుఱ్ఱాలు, అంబులు, బాణాలు, గదలు, ఈటెలు,

సైన్యం మొదలైన వాటినన్నిటినీ కూడ తయారు చేసుకుని ప్రదర్శనం రోజున వివరంగా విడదీసి ప్రదర్శన గమనాన్నిబట్టి ఈ బొమ్మలన్నిటినీ సక్రమంగా, సిద్ధంగా అమర్చిపెట్టుకుని, ఒక బొమ్మ తరువాత మరొక బొమ్మను తెరమీదికి ఎక్కించి కథను ముందుకు నడుపుతారు. ఈ బొమ్మల్నిగాని, పరికరాలను గాని విడిగా చూస్తే ఏదో తోళ్ళముక్కల్లాగ కనిపిస్తాయి. వీటి నిజమైన అందం ఆముదపు దీపాల వెలుగులో తెరమీదే చూడాలి. ఎంతో రమణీయంగా వుంటాయి. కష్టమో, నష్టమో పడి ఒక్కసారి ఈ బొమ్మల్ని తయారుచేసుకుంటే ఇంక అవి 20 సంవత్సరాల వరకూ చెక్కుచెదరకుండా వుంటాయి. ఒకవేళ మధ్య మధ్య కొన్ని బొమ్మలు శిథిలమైతేగియితే వాటిని అప్పటికప్పుడు పూర్తి చేసుకుంటారు. ఈ బొమ్మల్ని అన్నిటికన్నా పెద్ద సైజు బొమ్మకు తగినంత వెడల్పు, పొడవూ గల పెదర పెట్టెల్లో అమరుస్తారు. ఒకో ప్రదర్శనానికి ఒక్కొక్క పెట్టెను వుంచు కుంటారు.

### ఆటలకు అనువుగా అప్పటప్పట యేర్పాట్లు :

ఈ బొమ్మలాట ప్రదర్శకులు ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి బండ్లమీద ప్రయాణం చేస్తారు. ఒక్కొక్క దళానికి ఒకటిగాని, రెండుగాని బండ్లు వుంటాయి. ఒక బండిమీద సామాన్లు, రెండవ బండిమీద మనుషులు ప్రయాణం చేస్తారు.

గ్రామంలో ప్రవేశించి పెద్దల్ని, పిన్నల్ని కలుసుకుని పరిచయం చేసు కుంటారు. అందరూ కూర్చోవడానికి అనువుగా వున్న బహిరంగస్థలంలో పందిరి ప్రారంభించి, మూడు ప్రక్కలా మూయబడి ఒక ప్రక్కన తెరకట్టడానికి వీలుగా పందిరి వేస్తారు. ఈ పందిరి కొంచెం ముందుకు వాలివుండేటట్లు కడతారు. ఇలా కట్టడంవల్ల వారు ఆడించే బొమ్మలు జారిపోకుండా వుంటాయి. పందిరి లోపలి భాగంలో వారి మొత్తం సామగ్రి, పిల్లలూ, భార్యలూ - సంసారమంతా అందు లోనే వున్నదా అనిపిస్తుంది. వెనుక ప్రక్కకూడా మూతతో అందరూ లోపలే వుంటారు, లోపలి ప్రక్క తెరమ అనుకుని ఒక పెద్ద బల్లను వేస్తారు.

వరుసగా ఆముదపుదీపాలను అమరుస్తారు. ఈనాడు కొందరు పెట్రో మాక్సులైట్లను వాడుతున్నారు. కాంతి తగ్గకుండా ఎప్పుడూ ఒకరు ఆముదపు దీపాల ఒత్తులు ఎగదోస్తూ, కొరతబడ్డ ఆముదాన్ని పూర్తిచేస్తూ వుంటాడు. దీపాల కాంతి తగ్గితే బొమ్మల అందచందాలు తగ్గుతాయి.

ప్రదర్శన ప్రారంభం -

తెరమీద బొమ్మలు :

ప్రదర్శనం ప్రారంభించే రోజున 'ఈ రాత్రికి బొమ్మలాటవుందహో' అని చాటింపు ద్వారాగాని, ఇంటింటికీ వెళ్ళి ఖుద్దున చెప్పడంద్వారాగాని అందరికీ ఈ వర్తమానం తెలియజేయబడుతుంది.

బొమ్మలాటకు తెర సిద్ధంచేసిన తరువాత ప్రప్రథమంగా విఘ్నేశ్వరుని బొమ్మను తెరకు మధ్యగా ఎక్కించి వుంచుతారు. ఒక ప్రక్కమాత్రం దిష్టి బొమ్మ నొకదానిని, రెండవ ప్రక్క జుట్టుపోలిగాణ్ణి ఎక్కించి వుంచుతారు.



తోలుబొమ్మల్ని తెరమీద ఆడించడానికి వీలుగా ఒక వెదురుబద్దను బొమ్మకు మధ్య భాగంలో కడతారు. బొమ్మను ఆడించాలంటే ఈ బద్దే ఆధారం. బొమ్మను ఆడించే సమయంలో చేతిని తెరమీదకు ఏమాత్రం రానీయరు. ఒకవేళ వస్తే మనిషి బొమ్మ కనబడుతుంది. అందువల్ల దూరంగా వుండి ఒక చేతిలో బొమ్మను బట్టి రెండవ చేతిలో మరో చిన్న కొంకిగల బద్దను పట్టుకుని బొమ్మయొక్క చేతులకు తగిలించి, సంభాషణల ప్రకారం బొమ్మల్ని కదిలిస్తూ వుంటారు. కాళ్ళు మాత్రం ఎటుబడితే అటు కదిలేలాగా మన దసరా వుత్సవాల్లో పిల్లలు పుచ్చుకునే కోతి బొమ్మమాదిరి కీలు కీలు వద్దా రంధ్రాలుపొడిచి ఎటుపడితే అటు తరగడానికి వీలుగా అమరుస్తారు. ఒకవేళ తెరమీద బొమ్మ కొంచెంసేపు చలనంలేకుండా వుండాలంటే ఒక తుమ్మముల్లుతో నాటువేసి బొమ్మను తెరమీద నిలబెడతారు. ఒక్కొక్కసారి ఒకే వ్యక్తి రెండేసి బొమ్మల్నికూడా ఆడిస్తూ వుంటాడు.

విఘ్న వినాశకంగా
విఘ్నేశ్వరపూజ :

ప్రదర్శన ప్రారంభంలో తోడిరాగంతో కూడిన మంగళహారతి పాడుతారు. ఏ విఘ్నాలూ కలుగకుండా విఘ్నేశ్వరుని ప్రార్థిస్తారు. తరువాత సభావర్ణనచేస్తూ పాట పాడుతారు. "అందరూ వచ్చారా ? కరణంగారొచ్చారా ? మున్సిఫ్‌గా రొచ్చారా ? పండితులంతా వచ్చారా ? పెద్ద రెడ్డి వచ్చాడా ?" అంటూ హెచ్చరించి ప్రేక్షకుల్ని అదుపులో పెట్టుకుంటారు.

సర్వసిద్ధంగా
హంగుదారులు :

పాటపాడేవారు, హార్మోనియం వాయించేవారూ, తాళంవేసేవారూ, మద్దెలకొట్టే వారూ, అదనపు మోతల్నిచ్చేవారూ, వంతపాటలు పాడేవారూ అందరూ లోపలే కూర్చుంటారు. పిల్లల పడకలూ వుయ్యాలలూ, అన్నీ నేపథ్యంలోనే అమర్చుకుంటారు.

ఆటకుతగ్గ పాటలు,
పాటకుతగ్గ మోతలు :

వీరికి హార్మోనియం శృతిగా వుంటుంది. తాళాలుంటాయి. హార్మోనియం, తాళాలు, మద్దెలవాయించే వ్యక్తులుకూడా వెనుక వంతపాట పాడుతూ వుంటారు. ఇంతే కాదు. వాళ్ళ కాళ్ళక్రింద బల్లచెక్క లుంటాయి. ఆయా ఘట్టాలననుసరించి ఈ చెక్కలను త్రొక్కుతూ వుంటారు. ముఖ్యంగా రథాలు, గుఱ్ఱాలు, పరుగు లెత్తేటప్పుడూ, యుద్ధఘట్టాలలోనూ ఈ చెక్కలు టకటకా త్రొక్కుతూ వుంచే బలే రసవత్తరంగా వుంటుంది.

అంతేగాక నగారామోతలకు ఖాళీ డబ్బాలు వుపయోగిస్తారు. పిడుగులు పడ్డట్టూ, వురుములు వురిమినట్లు డబ్బాలను మ్రోగిస్తారు. ఈ విధంగా వారు ప్రదర్శనాన్ని జయప్రదంగా రక్తికట్టిస్తారు. ఆట ఆడినంతసేపూ పరస్పర సహకారం వారిలో కనబడుతుంది. అందువల్లనే వారి ప్రదర్శనాలు అంత బాగా రక్తి కడతాయి

**ఆటగాండ్ల**

**అష్టావధానం :**

ముఖ్యంగా ఏ వ్యక్తి బొమ్మల్ని ఆడిస్తాడో ఆ వ్యక్తి నోటితో పాట పాడుతూ పాటకు తగినవిధంగా బొమ్మను ఆడిస్తాడు. సంభాషణలకు కూడా ఇదే విధానాన్ని అనుసరిస్తాడు. ఇక రెండు బొమ్మల్ని ఆడించే సమయంలో బొమ్మలమధ్య వచ్చే పోరాటంలో, రెండు బొమ్మల్ని రెండు చేతులతో కొట్టిస్తాడు. అలా కొట్టడంలో సమయానికి క్రింద బల్ల చెక్క టకామని త్రొక్కుతాడు. నిజంగా పాత్రలు కొట్టుకున్నట్లే వుంటుంది. ఈ సమయంలో ఇతర వంతదారులు కావలసిన అల్లరి, హంగామా చేస్తారు. ఒక యుద్ధఘట్టం వచ్చినప్పుడు, డోళ్ళు, డబ్బాలు, ఈలలూ, కేకలతో వానకురిసి వెలిసినట్లు చేస్తారు. ఈ విధంగా వారు ప్రదర్శనను సమిష్టి కృషితో జయప్రదంగా నిర్వహించి ప్రేక్షకుల్ని మెప్పిస్తారు.

**బొమ్మలాటకు**

**బ్రహ్మ :**

నాటకానికి దర్శకుడు ఎంత అవసరమో అలాగే ఈ బొమ్మలాటలకు బ్రహ్మలాంటి వాడు సూత్రధారుడు. తెరలోపలనుండి ప్రదర్శనాన్ని వరుసక్రమంలో నడిపే బాధ్యతలన్నీ ఈతనిమీదే వుంటాయి. మిగతావారందరూ ఈతనిని అనుసరిస్తూ వుంటారు. ఈ సూత్రధారుడు సంస్కృత రూపకాలలోనూ, తెలుగు భాగవతాలలోనూ, యక్షగానాలలోనూ, నాటకాలలోనూ కూడా ప్రాముఖ్యం వహిస్తూ వచ్చాడు.

బొమ్మలాట సూత్రధారుడు కథను చాలా వివరంగానూ, చాకచక్యంగానూ చెపుతాడు ప్రథమంలో కొన్ని శ్లోకాలు చదివి, ఆ శ్లోకాల అర్థాన్ని మరలా తెలుగులో అందరికీ అర్థమయ్యే స్థాయిలో విపులీకరిస్తాడు. కొన్ని పద్యాలనూ, గేయాలనూ అతిమృదుమధురంగా ఇతను పాడితే మిగిలినవారు, పై శృతిలో ఆలాపిస్తారు. వచనాన్నికూడా రాగయుక్తంగా చదువుతారు అయా పాత్రల ఔచిత్యానికి భంగం లేకుండా గొంతులు మారుస్తూ వుంటారు. సూత్రధారుడు అడుగడుగునా ప్రేక్షకులయొక్క ఆదరణను గమనించి, కథను సాగించి విజయం పొందుతాడు.

**ప్రదర్శనంలో**

**ప్రేక్షకుల హడావిడి,**

**ఉత్సాహము, ఉబలాటమూ :**

తోలుబొమ్మలాట ప్రదర్శిస్తున్నారని తెలిస్తే చాలు, గ్రామం చుట్టుప్రక్క లున్న ప్రజలు-పిల్లలూ, స్త్రీలూ అందరూ హెచ్చు తగ్గుల భేదాలు లేకుండా ఒకరికంటే ఒకరు ముందువచ్చి కూర్చుంటారు. కథా ప్రారంభంనుండి ఆసాంతం వరకూ రెప్ప వాల్చకుండా చూస్తూ కూర్చుంటారు. ప్రతి ఘట్టంలోనూ వారు కదలి పోతారు. హాస్యఘట్టాలలో ఎంతగా పగలబడి నవ్వుతారో అలాగే కష్టాలతో కూడు కున్న ఘట్టాల్లో కళ్ళవెంట నీరు కారుస్తారు. ఇక దౌర్జన్య ఘట్టాలలోనూ, దుర్మార్గపు సన్నివేశాలలోనూ, ఆ దుష్ట పాత్రలమీద పళ్ళు పటపటా కొరుకుతారు. ఈ విధంగా పండితుల మొదలు పామరులవరకు ఆబాలగోపాలం ఆనందంలో మునిగిపోతారు.

**జుట్టుపోలిగాడు,**

**బంగారక్క :**

ఈ బొమ్మలాట ప్రదర్శనాలను ఇంత ఆపేక్షగా ప్రజలు చూడడానికి కారణం లేకపోలేదు. తెలుగు నాట బొమ్మల ప్రదర్శనాలలో విచిత్రమైన హాస్య పాత్రలను చూపుతారు. ఈ పాత్రలు కథా ప్రారంభం నుండి కథాంతంవరకూ అడుగడుగునా కథా గమనంతో ఒక ఘట్టం అయిన తరువాత రెండవఘట్టం ప్రారంభమయ్యే వ్యవధిలో ప్రత్యక్షమౌతూ వుంటాయి. ఆ పాత్రలే జుట్టుపోలి గాడు, బంగారక్క-ఈ రెండు పాత్రలూ. హాస్యంద్వారా. దీర్ఘకాలం ప్రదర్శించే ప్రదర్శనంలో మధ్య. మధ్య వారిని కడుపుబ్బ నవ్వించి నిద్రమత్తు వదలగొడుతూ వుంటాయి. ఈ పాత్రల హాస్యం బహుమోటుగా వుంటుంది. నవ్వుతో కడుపు చెక్కలయ్యే పనులు ఈ బొమ్మలతో చేయిస్తారు. సమాజంలో వున్న కుళ్ళను, ఈ బొమ్మలను అందగా పెట్టుకుని కుళ్ళగిస్తుంటారు. మధ్యమధ్య విసుర్లు విసు రుతూ వుంటారు.

**మరో బఫూన్**

**అల్లాటప్పగాడు :**

తోలుబొమ్మలాటల్లో హాస్యం ఎంతవరకెళ్ళిందో అల్లాటప్పగాడిని గురించి తెలుసు కుంటే బోధపడుతుంది. జుట్టుపోలిగాడు, బంగారక్క-కాక వీడు మూడవవాడు.

వీడి పాత్ర ఎటువంటిదంటే 'ఖారెక్కే వాడుంటే వాడి తలతన్నేవాడుంటా'డనే సామెత ప్రకారంపై రెండు పాత్రలమా తలతన్నేవాడు ఈ అల్లాటప్పగాడు. ప్రదర్శనంలో బంగారక్కను గడసరి పెండ్లాంగా సృష్టిస్తారు. ఈమెకు, పోలిగాడికి నిరంతరం కయ్యం నడుస్తూ వుంటుంది. కాసేపు రెండు పాత్రలూ అతి విచిత్రంగా అసభ్యశృంగారాన్ని అభినయిస్తాయి. కొంచెంసేపు పోట్లాట, మరల రాజీ, ఇంతలో పోలిగాడి అంతర్ధానం. ఈ సమయంలో అల్లాటప్పగాడు బంగారక్క దగ్గర ప్రత్యక్షమౌతాడు. బంగారక్కకు, అల్లాటప్పకు సంబంధాన్ని కుదురుస్తాడు రెండు పాత్రలూ మంచి శృంగారపట్టులో వుండగా మరో పాత్ర ప్రవేశిస్తుంది. అది కేతిగాని పాత్ర.

## కేతిగాడు :

కేతిగాడి పాత్ర అతి విచిత్రమైంది. అన్ని బొమ్మలకన్నా కేతిగాని బొమ్మ చిన్నది. ఎక్కడ బడితే అక్కడ, ఎప్పుడు బడితే అప్పుడు పానకంలో పుల్లలాగా ఒక అడుగుచోటు తెరమీద వుంటే చాలు హఠాత్తుగా ప్రవేశిస్తాడు. శృంగార ఘట్టంలో వున్న అల్లాటప్పాగాణ్ని టకీమని ఒక్కదెబ్బ కొడతాడు కేతిగాడు. వెంటనే అంతర్ధానమౌతాడు అల్లాటప్పా. ఇంకేముంది కేతిగాడు బంగారక్కను ఏడిపిస్తాడు. ఇలాంటి ఘట్టాలు ప్రదర్శనంలో వచ్చే వ్యవధిని కమ్మివేస్తూ వుంటాయి. చాలా మంది ప్రేక్షకులు కథకంటే హాస్య పాత్రల ప్రవేశంకొరకే ఎదురుచూస్తూ వుంటారు. అందువల్లనే ప్రదర్శనం తెల్లవార్లూ ప్రదర్శించినా విసుగుజెందరు.



కేతిగాడు–బంగారక్క

## వానలు రాకపోతే

## నాటమైన కిటుకు :

గ్రామాల్లో ముఖ్యంగా వ్యవసాయతరుణం అయిన తరువాత ఈ బొమ్మలాటల ప్రదర్శనాలు జరుగుతూ వుంటాయి. బొమ్మలాటల్ని ప్రదర్శించడంలో జానపదులకు కొన్ని నమ్మకాలు కూడా వున్నాయి. వుత్తరగోగ్రహణం కథ చెప్పితే వర్షాలు కురుస్తాయని వర్షాయులేని ప్రాంతంలో ఈ ఆటలను ఆడిస్తూ వుంటారు. ఈ నాటికీ కాకినాడ ప్రాంతంలో వర్షాలు పడనప్పుడల్లా దగ్గరలో

వున్న మాధవపట్నం బొమ్మలాట వారిని ఆహ్వానించి శ్రీదేనువు కొండవెంకయ్య గారు రచించిన ఉత్తర గోగ్రహణాన్నీ, విరాటపర్వాన్నీ ప్రదర్శిస్తారు.

## పెండ్లాం బిడ్డలతో దేశదిమ్మర్లు :

బొమ్మలాటలాడేవారు వూరు తరువాత వూరు చాంద్రాయణం చేసుకుంటూ ప్రదర్శన లిచ్చుకుంటూ దేశ దిమ్మరుల్లాగా తిరుగుతూ వుంటారు. చావులూ, పుట్టుకలూ, వివాహాలూ, వేడుకలూ-అన్నీ దారిలోనే జరిగిపోతూ వుంటాయి.

వీరిలో ఒక్కొక్కరికి ఇద్దరు ముగ్గురు భార్యలు కూడా వుంటారు. ఇలా వుండడం వారికేమీ తప్పుకాదు. కారణం ఈ స్త్రీలందరూ ప్రదర్శనంలో పాటలు పాడటానికీ, బొమ్మల నాడించడానికీ వుపయోగపడతారు. అందువల్ల బయటనుంచి కిరాయినటుల్ని తెచ్చుకోవాల్సిన అవసరం వుండదు అంతేగాక ప్రదర్శనం రోజున ఒకరికి జబ్బుచేసినా గొంతుపోయినా, ప్రదర్శనం ఆగదు. ఈ బాధ్యతలు అదనంగా వున్న స్త్రీలు పంచుకుంటారు. బొమ్మలాట వారిలో పురుషులకంటే స్త్రీలే ఎక్కువమంది వుంటారు. ఎంతమంది వున్నా వారి కంఠాలన్నీ కోకిలకంఠాలే. పుట్టుకతోనే వారికి ఆ లక్షణాలు అబ్బుతాయా అన్నట్లుంటుంది.

తోలుబొమ్మలు ఒకనాడు తెలుగు విజ్ఞాన వికాసానికి పట్టుగొమ్మలు. తోలు బొమ్మల్ని ఆనాడు ప్రజలు ఎంతగానో పోషించారు. రానురాను నాటకాలు అభి వృద్ధిలోకి రావడంవల్లా, సినిమాకళ అభివృద్ధి చెందడంవల్లా ఈ కళ కొంతవరకు దెబ్బతినిపోయిందని చెప్పవచ్చు.

ఆనాటి తోలుబొమ్మల జట్టు వారిలో ఎంతో సంగీతం, సాహిత్యం, శిల్పం మొదలైనవాటిలో విద్వాంసులుండేవారు. ఈనాడు అటువంటివారు చాలావరకు తగ్గి పోయారు. వున్న కొద్దిమందీ పొట్టకోసం నాసిరకం ప్రదర్శనాలిస్తున్నారు. శిథిల మైపోయిన మన ఈ ప్రాచీనకళనూ, సాంప్రదాయాన్నీ పునరుద్ధరించాలి.

---

# ఛాయా నాటికలు - తోలుబొమ్మలాటలకు సైదోడులు

తోలుబొమ్మల ఆటల అనంతరంవచ్చిన పరిణామమే ఈ ఛాయా నాటికలు. వీటినే 'షాడో ప్లేస్' అంటారు. ముఖ్యంగా ఈ ఛాయా నాటికలు దేశం మొత్తంలో చాలా తక్కువమందే ప్రదర్శిస్తున్నారు. మన వుత్తమ కళారూపాల్లో ఛాయా నాటికను కూడ ఒక వుత్తమ కళాఖండంగా ఎంచవచ్చు. ఈ ఛాయా నాటికలు ఇతర దేశాల్లో-ముఖ్యంగా అమెరికా, ఇంగ్లండు దేశాల్లో సాంకేతికంగా బాగా అభివృద్ధి పొందాయని ప్రతీతి.



ఛాయా నాటికలు మనదేశంలో సుప్రసిద్ధ నర్తకుడు ఉదయశంకర్ తన నృత్య ప్రదర్శనాలతోపాటు ఈ ఛాయా నాటికను కూడ వ్యాప్తిలోకి తీసుకు వచ్చాడు. ఈయన ఛాయా నాటికద్వారా బుద్ధుని జీవితాన్ని ఎంతో నిపుణంగా ప్రదర్శించాడు. ప్రేక్షకులలో ఎంతో అనుభూతిని కలిగించాడు.

అలాగే ఆంధ్రదేశంలో బాపట్ల ప్రజానాట్యమండలి కార్యకర్తలైన మురళీధరరావు, బొన్నలగడ్డ జోషి మొదలైనవారు. ఇతర కళారూపాలతో పాటు. ఈ ఛాయా నాటికలను-దేశానికీ, ప్రజలకూ వుపయోగపడే కథా వృత్తాలను తీసుకుని- ఎంతో ముచ్చటగా ప్రదర్శించారు,

ఛాయా నాటికలకు మాతృకలు తోలుబొమ్మలే. తోలుబొమ్మలాటల్లో కేవలం తోలుతో తయారుచేయబడిన బొమ్మలను మనుషుల సహాయంతో ఆడిస్తారు. ఒక్కొక్కరు ఒక బొమ్మ. మరికొందరు రెండు బొమ్మలను రెండు చేతులతోనూ ఆడిస్తూ వుంటారు. కాని ఛాయా నాటికల్లో, కేవలం ఆయా పాత్రలకు సంబంధించిన వ్యక్తులు తెర వెనుక నుండి నటిస్తూవుంటే, వారి నీడలు. వారి అభినయం తెల్లని తెరమీద ఎంతో స్పష్టంగా కనబడతాయి. తోలుబొమ్మలకు అలంకరించిన రంగులన్నీ మనకు కొట్టొచ్చినట్లు కనబడతాయి కాని. ఛాయా నాటికల్లో పాత్రలు ధరిం

# బుట్టబొమ్మలు

తెలుగు ప్రజల్లో బుట్టబొమ్మలు తెలియనివారెవరూ వుండ రనుకోవచ్చు. పేడతో చేయబడ్డ ఈ బుట్టబొమ్మలు పెండి వూరేగింపుల్లోనూ, దేవుళ్ళ వుత్సవాల్లోనూ ప్రదర్శిస్తూ వుంటారు.


పాములవాడు

ఈ బొమ్మల్ని పురుషులు ఆడిస్తారు. పై భాగమంతా బొమ్మ ఆకారంగా వుండి లోపలిభాగం డొల్లగా వుండి బొమ్మయొక్క కాళ్ళ భాగంలోనూ, నోటి దగ్గరా రంధ్రాలుంటాయి. ఆట కాడు ఈ లోపలిభాగంలో దూరి తలను దూర్చి నృత్యంచేస్తే కేవలం బొమ్మే అభినయించినట్లుంటుంది. ఈ బొమ్మల్లో ఒకటి స్త్రీ బొమ్మగానూ, రెండవది మగ బొమ్మగానూ వుంటాయి. కొన్ని బొమ్మలు పింగీ పింగడుగానూ వుంటాయి. బొమ్మల నృత్యానికి తగినట్లు వాయిద్యాన్నిచ్చేవి డప్పులు. రెండు బొమ్మలకూ ఏదో ప్రణయకలహాన్ని సృష్టిస్తాయి. ఆ సాంతానికి రెండు బొమ్మలూ రాజీపడి అతి సన్నిహితంగా దగ్గిరకొచ్చి కౌగలించుకున్నట్లు నటించడంద్వారా ప్రేక్షకులు గొల్లున నవ్వుతారు. నోటిమాట లేకుండా, వాయిద్యంద్వారా, నృత్యం ద్వారా ఈ బుట్టబొమ్మల కళారూపాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. తెలుగు ప్రజల నానందపరిచే కళారూపాల్లో ఇది ఒకటి.

### కొయ్యబొమ్మలాటలు :

దేశంలోనైనా నాటకానికి పూర్వరంగం వీథి నాటకాలూ, చెక్క బొమ్మలూ, కొయ్యబొమ్మలూ, పేడబొమ్మలూ అని మనం తెలుసుకోవచ్చు. కాళిదాసు-భవభూతి, భాసుడు మొదలైన వారంతా వ్రాసిన సంస్కృత మహా నాటకాలకు నాంది ఈ కొయ్యబొమ్మలూ, భాగవతా లనే ప్రతీతికూడా వుంది.

ఈనాడు మనకున్నది నాటకమందిరం. ఆనాడు వారి నాటకరంగ స్థలం వీధులే విగ్రహాలమీద నమ్మకం వచ్చిన తరువాత దేవతలక్రింద, దేవుళ్ళ క్రింద

బొమ్మల పూజలు వచ్చిన అనంతరం వారికి ప్రియమైన, భక్తియుతమైన బొమ్మలకు చక్కగా రంగులుదిద్ది దీపస్తంభాల వెలుతురులో ఈ కొయ్య బొమ్మలను ఆడిస్తూ వుండేవారు. ఈ బొమ్మల నిర్మాణం తేలికగా వుండే కొయ్యలతోనూ, పేడతోనూ, ఆడించడానికి యోగ్యంగా వుండేటంత తేలిక వస్తువులతో తయారు చేసుకునేవారు. దసరాకు పిల్లలు ఆడించుకునే హనుమంతుడి బొమ్మల్ని, సంక్రాంతికి పెట్టే బొమ్మల కొలువులూ, పెళ్ళిళ్ళకు ఆడించే బుట్టబొమ్మలూ, దేవుళ్ళ వాహనాలుగా వుపయోగించే గరుత్మంతుడు, నెమలి, హంస మొదలైన కొయ్య బొమ్మలను గుర్తుకు తెచ్చుకోవచ్చు. ఆంధ్రదేశంలో ప్రచారంలో లేవుగాని ఈనాటికీ తమిళనాడులో 'బొమ్మలాట్టం' ప్రదర్శిస్తూ వున్నారు.

ఆచార్య
యం.వి. రమణమూర్తి :

శిథిలమైన తోలుబొమ్మలాటలను ఆధునిక రీతిలో పునరుద్ధరించటానికి కాకినాడ వాస్తవ్యులు యం. వి. రమణమూర్తిగారు ఎంతో కాలంగా కృషి చేస్తున్నారు. వీరికి భారత ప్రభుత్వం రెండు సంవత్సరాలు స్కాలర్‌షిప్ ఇచ్చి తోలుబొమ్మల పరిశోధనకు అవకాశం కల్పించారు. రమణమూర్తిగారు దాదాపు 15 సంవత్సరాలుగా ఈ కృషిలో వుండి, అనేక మహాసభల్లోనూ, ప్రముఖ నాయకుల సమక్షంలోనూ, విదేశీ రాయబారుల సమక్షంలోనూ ప్రదర్శించి, ఆనాటి తోలుబొమ్మలాటల విశిష్టతను చాటారు. బొమ్మల ప్రదర్శనంలో పూర్వం వుపయోగించే ఆముదపు దీపాలను తొలగించి, ట్యూబు లైటుల ద్వారా ప్రదర్శిస్తున్నారు. తెరను కూడా ఇనుపగొట్టాల ఫ్రేమును తయారుచేసి, ప్రదర్శనాన్ని అవలీలగా ప్రదర్శించే ఏర్పాటు చేశారు. తోలుబొమ్మలతో పాటు గ్లోవ్ పప్పెటును కూడ ప్రదర్శిస్తున్నారు. ఎక్కువమంది హంగువారులు అవసరం



లేకుండా, కథా వృత్తాన్నంతా టేపురికార్డు చేసి బొమ్మలను ఆడించటానికి మాత్రం ఇద్దరు ముగ్గురు మనుషులతో ప్రదర్శనాలు సాగిస్తున్నారు. కథల్లో, లంకాదహనం మొదలైన పౌరాణిక గాథలతోపాటు, పంచతంత్ర కథలు, కుటుంబ నియంత్రణం మొదలైన ఇతివృత్తాలకు సరిపడే బొమ్మలను తయారుచేసి ప్రదర్శనాల నిస్తున్నారు.

ఈనాడు వారు మద్రాసు-అడయారులో సెంట్రల్ లెదర్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్‌లో, బొమ్మల పరిశోధనలో ఆచార్యులుగా పని చేస్తున్నారు. ఎంతో మందికి బొమ్మలను తయారు చేయడంలో తరిఫీను ఇస్తున్నారు. బొమ్మలను తయారు చేయడంలో ఆధునికమైన పరికరాలను వుపయోగిస్తున్నారు. ఎన్నో బొమ్మలను ఇతర రాష్ట్రాలకు, ఇతర దేశాలకు ఎగుమతి చేస్తున్నారు. వీరికి సహాయంగా వీరి మరదలు సీత, వీరి కుటుంబం ఎంతో సహాయ పడుతున్నారు.





# జంగంకథలు



జంగంకథలు -- బుర్రకథలు - శారద వాంద్రు. బుడిగెజంగాలు - ఈతముక్కు జంగాలు. సిరికిజంగాలు. అసలు, వుద్దేశ్యం, గినలు ఉద్దేశం. జంగంకథల తేజతీంద్రము జానుతెనుగుదనం.

# జంగంకథలు, బుర్రకథలు - శారదవాండ్రు

**పాతరోత,**

**కొత్త వింత :**

ఆంధ్రదేశంలో ఆనాటినుండి ఈనాటివరకు బహుళ ప్రచారం పొందిన జంగం కథలు ఈనాడు బుర్రకథలుగా పిలువబడుతూ వున్నాయి. ఒకనాడు మత ప్రబోధానికి, దేశభక్తికి ప్రతిబింబంగా నిలబడిన జంగం కథా కళారూపం రానురాను యాచనకూ, వుదరపోషణకూ వుపయోగపడి తిరిగి ఈనాడు దేశభక్తిని ప్రబోధిస్తూ ప్రజాసమస్యలను చిత్రిస్తున్నది.



జంగం కథలను ఎక్కువగా జంగాలే చెప్పడంవల్ల వీటికి జంగం కథలనే పేరు వచ్చింది. ఈ కథలను సిరికి జంగాలూ, బుడిగె జంగాలూ, సెట్టి బలిజెలు, సెట్టి బణిజలూ, ఈతముక్కుజంగాలూ వంశ పారంపర్యంగా ప్రచారంలోకి తీసుకు వచ్చారు. జంగాలందరూ శైవభక్తులు కావడంవల్ల శైవ వైష్ణవమతాల మధ్య వచ్చిన సంఘర్షణకాలంలో శైవమత ప్రచారానికి ఈ కథలను వుపయోగించారు. వీర శైవమతం బాగా వ్యాప్తిలోకి వచ్చేనాటికి, అంటే, క్రీ॥ శ॥ 1150 నాటికే ఈ కథలను జంగాలు పాడుతూ వుండేవారు. వీరు ఈ కథలతోపాటు పగటివేషాలను కూడ ప్రదర్శించేవారు. బైచరాజు వేంకటనాథ కవి పంచతంత్రంలో, 'కడివోని తెరనాటకపుటూరి జంగాలు' అని వుదాహరించడాన్నిబట్టి జంగాలు నాటకాలను కూడ ప్రదర్శించే వారని తెలుస్తూంది.

**బుడిగె జంగాలు :**

దాసరులందరూ వైష్ణవభక్తు లైనట్లే, జంగాలందరూ శైవభక్తులు. వీరు చెప్పే కథలకు జంగం కథలనిపేరు. వీరికే బుడిగెజంగాలనే పేరు కూడ వాడుకలో వుంది. అందుకు కారణం, వారు కథలో వుపయోగించే వాయిద్యానికి బుడిగె అనే

పేరు. ఆ పేరునుబట్టి వీరికి బుడిగె జంగాలనే పేరు సార్థకనామమైంది. ఈ బుడిగెనే ఢక్కీ అనీ, ఢక్కా అనీ, గుమ్మెటనీ, అనేక రీతులలో ఆయా ప్రాంతాలలో ఉదహరిస్తున్నారు. బుడిగెలు మామూలు గుమ్మెట్లకంటే చిన్నవి. ఇవి ఇత్తడితోనూ కంచుతోనూ వేయబడి వుంటాయి.

జంగాలు ప్రారంభంలో శైవమతాన్నే ప్రచారం చేసేవారు. తరువాత శైవేతర కథలైన దేశింగురాజు, విరాటపర్వం, భల్లాణ, సిరియాళ, దేవయాని, వామన విజయం, అంబరీషోపాఖ్యానం మొదలైన కథలను కూడ ప్రచారంలోకి తెచ్చారు. జంగాలు వీరశైవ ప్రచారకులవడంవల్ల వారి కథలన్నీ వీరావేశంతో చెప్పబడుతూ వుండేవి. ధేనువుకొండ వెంకయ్యగారి విరాటపర్వం జంగం కథలో జంగాల యొక్క వేషధారణ, వాయిద్యాల వర్ణన వుంది. ఉడిదం సూరకవి 'జంగాలవారు దేవాంగుల విత్తంబు' అని వర్ణించడంవల్ల దేవాంగులైన సాలెవారిని యాచిస్తారని తెలుస్తుంది.

## శారదకాండ్రు

ఆంధ్రదేశంలో శారదకాండ్రు అనే ఒక జాతివారు ఒక్క తెలంగాణాలో తప్ప మరెక్కడా అంతగా కనిపించరనీ జానపదగాయకులుగా భిక్షుకులుగా వుండే వారిలో కూడ వీ రెక్కువనీ, మున్నూరు, ముత్తరాసి మొదలైన కులముల నుండి ఉద్భవించిన జాతుల్లో శారదకాండ్ర జాతి ఒకటనీ 'జానపద వాఙ్మయం'లో బి. రామరాజుగారు వుదాహరించారు. ఓ భారతి, కరుణామతీ భవి, శారదా కరుణానిధి అనే పల్లవాలు పాడడంవలన కూడా వీరికి శారదకాండ్రు అనే పేరు వచ్చి వుండ వచ్చు. అంతేకాక వీ రుపయోగించే వాద్యంలో భుజముమీద ధరించే తంబురాను శారద అని పేరు. బుర్రకథలో వుపయోగించే తంబురాకూ దీనికీ ఏమీ తేడా లేదు. శారదను ఒక భుజంమీద ధరించి వాయిస్తారు. శారద అంటే సరస్వతి. విద్యలతల్లి సరస్వతి. విద్యల తల్లి సరస్వతి పేరును వా రుపయోగించే తంబురా వాయిద్యానికి మారుపేరుగా శారద అని నామకరణం చేశారు. వీరి కథ శారదాదేవి స్తోత్రంతో ప్రారంభమవుతుంది. ముఖ్యంగా వీరి జట్టులో పురుషుడు కథ చెపితే అతని ఇద్దరు భార్యలూ వంత పాడుతారు. ఒక భార్యను కలిగివున్న కథకుడు కథ చెపితే, అతని భార్య ఢక్కీ కొడుతుంది. దీనిని వీరు డిమ్కీ అని కూడా పిలుస్తారు. వీరు పాడేపాటల్లో శారద వరుసలనేకాక చరిత్రాత్మకమైన వీరగేయాలను,



# జంగంకథలు



జంగంకథలు - బుర్రకథల్లు - శారద
వాండ్రు. బుడిగెజంగాలు - ఈతముక్కు
జంగాలు. సిరికిజంగాలు. అన్నలు,
వుద్దేశ్యం, గినలు ఉద్దేశం. జంగంకథల
తేజతీంద్రము జానుతెనుగుదనం.



అన్నాబత్తుల బుల్లి వెంకటరత్నం

ఆమె అభినయవిద్యను కోటిపల్లి వాస్తవ్యులు కిడియాల రామమూర్తి గారివద్దనూ, సంగీతాన్ని మహోద్రాడ పద్మనాభంగారివద్దనూ, గొల్లకలాపాన్ని, భామాకలాపాన్ని ఆత్కూరి సుబ్బారాయుడుగారివద్దనూ, కలాపంలో వేదాంత విద్యను జయంతిస్వామి నాయనగారివద్దనూ నేర్చుకుంది.

### కోనసీమలో గొప్పపేరు :

ఆమె భామాకలాపం, గొల్లకలాపం, కచేరీ నాట్యం మొదలైన విద్యలలో కోనసీమలో మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించిన నట్టువరాలు. రాజమండ్రి భారత సంస్కృతి సభ, కాకినాడ సాహిత్య పరిషత్తు, మద్రాసు సంగీత నాటక అకాడమి మొదలైన అనేక సంస్థలు ఆమెను సన్మానించాయి.

### ఉభయ విద్యాప్రవీణ శ్రీమతి మద్దెల రాముడు :

విజయనగరం వాస్తవ్యురాలు మద్దెల రాముడు సంప్రదాయ కచేరీ నృత్యవిద్యలోనూ, కర్ణాటక విద్యలోనూ ఆరితేరిన విద్వాంసురాలు. ఆమె తన విద్యతో ఒక్క విశాఖమండలమే కాక ఆంధ్రదేశంలో పలుతావుల్లో ప్రదర్శనలిచ్చి మెప్పుపొందింది. ఈమె నాయకురాలుగా ఎన్నో సంవత్సరాలు ఆ బాధ్యతను నిర్వహించింది. ఎంతోమందికి విద్యాదానంచేసి అనేకమంది కళాకారుల్ని తయారుచేసింది. సంగీతనాటక అకాడమీ వారి ఉపకారవేతనంతో ఈనాడు జీవితం వెళ్ళబుచ్చుతూ వుంది.



శ్రీమతి మద్దెలరాముడు

# భామాకలాపాలూ, వాటిలో వాసికెక్కిన కొందరు జాణలు

పందిరి వెంకటరత్నం :

పందిరి వెంకటరత్నం జన్మస్థలం తూర్పుగోదావరిజిల్లా మండపేట. భాగవత సంప్రదాయాన్ని భాగవతుల రూపేణ ప్రచారం చేయడంలో కృష్ణాజిల్లాలో కూచిపూడి ఎంతటి ప్రఖ్యాతి వహించిందో గోదావరి మండలంలో మండపేట కచేరీ నాట్యంలోనూ, కర్ణాటక, భామా గొల్ల కలాపంలోనూ అంతటి సరస్వతీ పీఠంగానూ వర్ధిల్లింది. శ్రీమతి పందిరి వెంకటరత్నం, వానపల్లి వీరరాజు మొదలైనవారు భామాకలాప, గొల్లకలాప విద్యలను అనేక సంవత్సరాలుగా ఆంధ్ర దేశంలో ప్రదర్శిస్తూ వచ్చారు. 1949 సంవత్సరంలో విజయవాడలో జరిగిన చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారి సన్మాన సందర్భంలో వెంకటరత్నం సమయానుకూలంగా సన్మానించబడింది. ఈవిడ రేడియోద్వారా ఎన్నో భామాకలాప ప్రదర్శనాలను ప్రసారం చేశారు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాదమీ ఈమెను ఘనంగా సన్మానించింది.



శ్రీమతి పందిరి వెంకటరత్నం



వానపల్లి వీరరాజు

నృత్య శిక్షణనిచ్చింది. 'నే నీ కళారాధనకు అంకితమయ్యాను. నా జీవితం కళా రాధనలోనే గడిపి తరిస్తా'నని నృత్యనికేతనం చేరినట్లు నటరాజ రామకృష్ణగారు 68 అక్టోబరు 'నాట్యకళ' సంచికలో వివరించారు. శ్రీమతి జీవరత్నమ్మ 68 ఆగస్టు 22 తారీఖున కీర్తిశేషురాలైంది.

## భామవేషంలో ధీమాచూపిన మరికొందరు :

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకా కుమారదేవ గ్రామంలో మంచిరాజు వెంకట్రామరాజుగారనే నియోగిబ్రాహ్మణుడు భామవేషం ధరించడంలో బహు ప్రసిద్ధుడు. వారి శిష్యులైన వల్లంపట్ల రామయ్యగారు పశ్చిమ గోదావరిజిల్లా, కొవ్వూరు తాలూకా బందపురంలోని పిచ్చుకుంట్ల వారికి భామాకలాపాన్ని, గొల్ల కలాపాన్నీ నేర్పారు. బయ్యా పెదగంగాధరుడు, బండి చిట్టిలింగము, దేశిలక్ష్మీ నారాయణ మొదలైనవారు భామ వేషధారణలో సిద్ధహస్తులు. 16 సంవత్సరాల వయస్సులోనే లక్ష్మీనారాయణ భామవేషం అద్భుతంగా వుండేదట. బందపురంలో పిచ్చుకుంట్లవారికి ఈ విద్యను నేర్పించటంలో విశేష కృషిసల్పినవారు పి. యస్. ఆర్. అప్పారావుగారి పితృపాదులైన పోణంగి రామమూర్తిగారు.





# అవీ-ఇవీ-అన్నీ



చోడిగానికలాసం - వీరభద్ర విన్యాసం - జముకుల కథలు- గారడీ విద్యలు - గొల్ల సుద్దులు-వసంతోత్సవాలు-డప్పులకోలాటం - గరగ నృత్యం - పులివేషాలు-కాముని పున్నమ వినోదాలు - తెలంగాణా యక్ష గానాలు-జానపద కళలు

# చోడిగాని కలాపం

వచ్చెరబాబు సోలిగాడు
ముక్కుమీద చుక్కబొట్టు
నిక్కినిక్కి చూచుకుంటు
వచ్చెరబాబు సోలిగాడు.

అంటూ ఈనాటి ఆంధ్రదేశపు పల్లెలలో దసరా ఉత్సవాల్లో గొంతాలమ్మ పండుగలో ప్రదర్శించే విచిత్ర వేషాలలో ఈ సోలి(డి)గాడివేషం అతిముఖ్యమైనది. సోలిగాడు వంకర దుడ్డుకఱ్ఱతో ప్రవేశించి పిల్లలందర్నీ హడలగొట్టేవాడు. వేష ధారణ అంతా హాస్యంగా వుండేది. ముఖంనిండా సున్నపుబొట్టులూ, బొట్టుల మధ్య నల్లచుక్కలు. నల్లగుడ్డ అంట గట్టినతలకు ఒక ప్రక్కగా కాకిఈకల కుచ్చుబెట్టి, మొలకు గోచిపెట్టి, ఒక చేతిలో వంకర దుడ్డుకఱ్ఱ, మరొకచేతిలో చింకిజోలె వేసుకుని, గొంతాలమ్మ నృత్యాలలో వున్నట్లుండి ఏదో ఒక మూలనుండి హఠాత్తుగాలేచి, పిల్లలందర్నీ హడల గొట్టి ప్రేక్షకుల నందర్నీ ఒక అదుపులో వుంచేవాడు ఇదే ఈనాడు మనకు కని పించే సోలిగానివేషం. ఈ సోలిగానిని చోడిగాడనీ, సోడిగాడనీ, పింగడనీ వేరువేరు ప్రాంతాల్లో వేరువేరు పేర్లతో పిలుస్తుంటారు. ఈ సోలిగాడి పేరు ప్రాచీనంనుండీ, ప్రస్తుతంవరకూ ఆంధ్రప్రజా జీవితంలో జీవించి వుంది. తోలుబొమ్మల ఆటలో జుట్టుపోలిగాడు, బంగారక్క, అల్లాటప్పగాడు ఎటువంటి ప్రాముఖ్యం వహిస్తున్నారో, ఈ చోడిగాడుకూడ చోడిగాని కలాపంలో అంతటి



సోడిగాడు

ప్రాముఖ్యం వహిస్తున్నాడు. కాని బొమ్మలాటలోని పాత్రలు కేవలం హాస్యపాత్రలు మాత్రమే. చోడిగానిపాత్ర అలా గాక కథానాయకుడుగానూ, హాస్యపాత్రగానూ జీవిస్తున్నాడు. సోలిగానిపేరు ప్రజా జీవితంలో ఎలా హత్తుకుపోయిందో వుదాహరణలు చూస్తే మనకు బోధపడుతుంది. పెండ్లిపందిళ్ళలో ఫలానావాడు సోలిగాడులా వున్నాడనీ, గాలిగా తిరిగేవాళ్ళను సోలిగాడిలా తిరుగుతున్నాడనీ, కొంచెం వికృతంగా వున్నవాళ్లను సోలిగాడులా వున్నాడనీ, భార్యతోడు లేకుండా వచ్చిన వాడిని సోలిగాడులా వచ్చాడనీ, మరికొంతమంది తోడివాడిని 'ఎరా సోలిగా' అనీ రకరకాలుగా పిలుస్తూ వుంటారు.

## కరకు టెడదలను కూడా కదిలించే కథా వస్తువు :

మనకు కూచిపూడివారు ప్రదర్శించే భామాకలాపం, గొల్లకలాపం మాదిరి ఈ చోడిగానిది కూడ ఒక కలాపమే. కురవంజి కథారూపంలో సింగి సింగని ప్రణయకలహమే ఈ చోడిగాని కలాపానికి కథా వస్తువు. సింగణ్ణి మరిపించి పారిపోయిన సింగిని వెదుక్కుంటూ, వియోగాన్ని అభినయిస్తూ, తుదకు సింగిని కలుసుకుని తనను వదలి ఎక్కడికి వెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో, మొదలైన ప్రశ్నల ద్వారా వాగ్వివాదం జరిపి చివరికి సింగిని తీసుకుని, ఇరువురూ ఇంటికిచేరడంతో చోడిగాని కలాపం కథ సమాప్త మౌతుంది. తొలిఘట్టంలో చోడిగాడు తెరవెడలి.

వచ్చెరబాబు చోడిగాడు
చంకలోనూ వంకికర్ర
చేతిలోనూ చింకిజోలెతో॥ వచ్చె॥
ముక్కుమీదా చుక్కబొట్టు,
నిక్కినిక్కి చూచుకుంటు॥ వచ్చెర॥

అని పాడుకుంటూ తన పరిస్థితినంతా ఈ విధంగా వివరంగా చెప్పడం ప్రారంభిస్తాడు. "అయ్యలారా అమ్మలారా, నాపేరు సింగడు. నా భార్యపేరు సింగి. మేమిద్దరం పడకగదిలో పడుకునివుండగా అర్ధరాత్రి నాసింగి పక్కలోనుంచి మాయమైపోయింది." అని ఆవృత్తాంతమంతా చెపుతూ, "హా! నా సుందరీ! ఎందుబోయితివే" అని వెదుకుట ప్రారంభించడంతో కథలో తొలిఘట్టం ఆరంభం అవుతుంది.

ఈ కలాపంలో హాస్యగాడు వుండడు. సింగనిపాత్రే హాస్యరసాన్ని అంది స్తుంది. సింగడే నాయకుడు. సింగీ సింగని పాటలకు వంతపాడే ఇరువురు తాళ గాళ్ళలో ఒకడు ఈ నాయకీ నాయకులకు మధ్యవర్తిగా తోడ్పడుతూ, అనేక ప్రశ్నలు వేసి సమాధానాలు చెప్పిస్తూ కధా సంధుల్ని విపులంగా సభవారికి ఎరుకపరుస్తూ వుంటాడు.

కథాగమనంలో సింగిని వెదుక్కుంటూ సింగడు అడవిలో కనబడిన మృగాలను వేటాడి అవి లభించినప్పుడు ఆయా దేవతల్ని సింగిని చూపమని ప్రార్థిస్తూపోతాడు. ఈ ఘట్టంలో ఆఖేటనృత్యం ప్రదర్శింపబడేది. ఆ తరువాత దశావతారాలను అభినయించి నారాయణమూర్తిని ప్రార్థించేవారు. తరువాత రామాయణగాథను సంస్మరించి శ్రీరాముని వేడుకుని, రామాయణగాథ నంతనూ పదాభినయంద్వారా అభినయిస్తూ, సింగి కనపడలేదనే ఆవేదనతో స్మృతితప్పి తూలిపడిపోతూ నిష్క్రమిస్తాడు.

ఇంతలో సింగి 'ఎరుకో, ఎరుక' అంటూ ప్రవేశిస్తుంది. సూత్రధారుడు సింగిమీద ప్రశ్నలవర్షం కురిపిస్తాడు. అంతట సింగి అతనికి సమాధానంగా తన యొక్క కులగోత్రాలనుగూర్చి, వృత్తి విద్యావిలాసాలను గురించి, తన వన్నె చిన్నెలు, అందచందాలను వివరిస్తూ సింగని వర్ణిస్తుంది. ఈ సమయానికి సింగడు ప్రవేశించి సింగి దొరికిందన్న సంతోషంతో వుబ్బితబ్బిబ్బైపోతూ తన సంతో షాన్ని మాత్రం పైకి కనబడనీయక వాగ్వివాదానికి దిగుతాడు. ఈ సింగీ సింగని వాగ్వివాదంలో మొరటుహాస్యం ఎక్కువ దొర్లిటంవలన కొంచెం విరసంగా వుంటుంది. సవతులకయ్యంమాదిరి చోడిగాడు, సింగి ఈ విధంగా ప్రారంభిస్తారు :

## సింగీ సింగన్నల
## వాద వివాదాలు :,

చోడిగాడు:— మనసులాకపోతే మునుపెరుంగవె సింగి
అనుములంటి నోరు అగలించి
కళ్ళెమంటి బిగ్గకఱచియుబట్టితే
కొరడ దెబ్బలనుచు ఎఱుగవటవె?

సింగి:— కొరడ దెబ్బలనుచు మరిమరి బలికేవు
తరముగాదు వాదుదరికి రాకు
ముదవు పరువులేని పురుషత్వమేల నీ
సరసమెల్ల నాకు చాలుపోర.

చోడిగాడు: — సింగీ నను జూచితె నే
నంగజుడను రూపురేఖలందును నా
సంగతి నీవిటులైన తిరు
సంగము న్యాయంబు గాదు గట్టిగ సింగీ.

సింగి:— చెకుపలెనుండు మీసాలు, చీపికళ్ళు
చింకితలగుడ్డ, గొంగళీచంకబెట్టి
కప్పపొక్కిడి పొగసిద్ధ వొప్పుజూచి
నయమె నిన్నంగజుడవన్న నవ్వరటర?

ఈ విధమైన వాగ్వివాదంతో సంవాదం ముగిసి, ఇరువురికీ సఖ్యతకుదిరి, ఇంటికిపోవడంతో కథ సుఖాంతమె మంగళాంతం అవుతుంది.

పైన వివరించిన ఈ చోడిగాని కలాపం రాత్రి తెల్లవార్లూ ప్రదర్శిస్తారు. కథా వస్తువు దంపతులకయ్యానికి సంబంధించింది. దీనిలో శృంగారం రసాభాసమైనది. కురవంజిలో సింగీ సింగని వాగ్వివాద లక్షణాలు, నృత్యాలే ఈ చోడిగాని కలాపంలోనూ కనుపిస్తున్నాయి. ఈ కలాపంలో జిక్కిణీ చిందు మొదలైనవి విశేష నాట్యాలు. ఇది భార్యాభర్తల సంవాదం అవడంవలన ప్రేక్షకులను ఎక్కువ ఆనందపరిచేది.

భామాకలాపం, గొల్లకలాపం మాదిరే ఈ చోడిగాని కలాపంకూడ నృత్యరూపకం. సూత్రధారుడే విదూషకస్థానాన్ని అలంకరిస్తాడు.

చోడిగాని కలాపంలో వుపయోగించే ఒంకి కఱ్ఱ ఒక ముఖ్యమైన విశేషమనీ, భరత శాస్త్రంలో 'బ్రహ్మకుటిలకందద్యా' త్తని ఒక వాక్యంవుందనీ ఆ కుటిలకం విదూషకోపయోగిగా అభినవగుప్తులు వ్యాఖ్యానించారనీ, ఆనాడు బ్రహ్మదేవుడిచ్చిన వంక కఱ్ఱ ఈనాటికీ తెలుగువారివద్ద ఉండటమే చోడిగాని కలాపంలోని ఒక శాస్త్రీయమైన విశేషమనీ, శ్రీ ముట్నూరి సంగమేశం, సాళ్వ కృష్ణమూర్తి గార్లు భారతిలో వుదాహరించారు.

**అసలు ఆధారం**

**ఇల్లిదిగో ఇదీ :**

చెంచునాటకం, ఎఱుకల కథ, ఎఱ్ఱగొల్లల భాగవతం మొదలైన వాటన్నిటికీ మూలమైన చెంచులక్ష్మి నృసింహుల ప్రణయగాథే ఈ చోడిగాని కలాపానికి ఆధారం. అనేక కురవంజి రచనలకు మూలాధారం ఈ ప్రణయ కలహమే.

ఈ కథావస్తువైన చెంచులక్ష్మి నృసింహుల వివాహగాథను క్రీ॥ శ॥ 1600 ప్రాంతంలో గరుడాచల మాహాత్మ్య మను పేర ఓబయమంత్రి యక్షగానంగా వ్రాశాడు. ఆనాటికీ, ఈనాటికీ దక్షిణ దేశభాషల్లో కొరవంజులలో దీనినే ప్రాచీన కృతిగా చెప్పుకోవచ్చు.

ఈ చోడిగాడి కలాపానికి ఎఱుకల కథ అని కూడ పేరు. తంజావూరు సరస్వతీ మహల్ లైబ్రరీలో 'ఎఱుకత కథ' అనే పేరుతో ఒక రచన వుంది. ముఖ్యంగా ఈ కలాపాలు వ్రాసినవారిలో చెంగల్వరాయ కవి—ఆరవెల్లి వేంకటార్యుడు—వంకాయల బలరామభక్త—గొడవర్తి జగన్నాథం మొదలైన వారి రచనలు ముఖ్యమైనవి.

---

# వీరభద్ర విన్యాస నృత్యం

ఆంధ్రదేశంలో వీరశైవ సంప్రదాయంవారు ఎక్కువమంది ఈ వీరభద్ర విన్యాస నృత్యాలు చేస్తూవుంటారు. ఈ విధానాన్ని 'వీరభద్రపళ్ళెం పట్టడ'మంటూ వుంటారు. అంతే కాక శైవమత సంప్రదాయంగల పద్మశాలీల దేవుడైన భావనా ఋషి వుత్సవాలలోనూ, విశ్వబ్రాహ్మణుల వీరభద్రస్వామి వుత్సవాలలోనూ ఈ నృత్యం జరుగుతూ వుంటుంది.

**ఖడ్గనృత్యం :**

పైన వివరించిన వుత్సవాలలోనే గాక పెద్ద పెద్ద జాతర్ల సందర్భాలలో కూడ ఈ వీరభద్రనృత్యం జరుగుతూ వుంటుంది. ఈ నృత్యాన్ని 'ఖడ్గనృత్య'మని కూడా

పిలుస్తారు. ఈ నృత్యం ప్రత్యేకంగా కొన్నిజాతులవారు మాత్రమే చేస్తారు. ఏ కులం వారైనా వీరశైవమతాన్ని అవలంబించిన ప్రతివారూ ఈ నృత్యాన్ని తప్పక చేస్తారు.

**తంతు, తతంగం :**

ఈ నృత్యసమయంలో పెద్ద పెద్ద ప్రభలుగట్టి ఆ ప్రభలను అనేక అలంకారాలతో ముంచివేస్తారు. ప్రభకు ముందూ వెనుకా స్త్రీ పురుషులు నడుస్తూ వుంటారు. ప్రభముందు సన్నాయి వాద్యకాండ్రు రెండు మూడు దళాలవారు వుంటారు. ముఖ్యంగా ఈ నృత్యంలో వీరు వాయించే వాద్యం వీరంగం. ఇది ఒక ప్రత్యేక మైన వాయిద్యం. కణకణమని అతి దురితంగా డోళ్ళు మ్రోగుతాయి. సన్నాయి బూరలు తారస్థాయిలో, గుక్కపట్టి, నృత్యకారుని చెవుల్లో వూదుతారు. సాంబ్రాణి ధూపం ముఖానికి వుక్కిరి బిక్కిరి అయ్యేలాగా పట్టిస్తారు. దీనితో ఖడ్గధారి వీరా వేశంతో ఒక్కగెంతుగెంతి 'దళ్ళరభ, అళ్ళరభ' అంటూ డోలు వాయిద్యగాళ్ళ ప్రక్కచేరి... అదదదదదద, అబబబబబబబ, అగగగగగగ అని డోలు వాయిద్య గానిని కవ్వించి ముక్తాయింపులు ఇప్పించి, దళ్ళరభ, అళ్ళరభ అని దక్షుని దండకం ఈ విధంగా ప్రారంభిస్తాడు

**దక్షయజ్ఞం దండకం :**

దక్షుండు యజ్ఞంబు శరభ
తలపెట్టెనందులో దళ్ళరభ.
బ్రహ్మదేవుని గుండె శరభ.
భగ్గుమనియె శర.
వింటిరా సురులార శర.
విన్నపంబొక్కటి శర.
కలగంటి ఈ రాత్రి శర.
కల్లగాను కల్లగాను. అదదదద, అగగగగ, శరభ, అళ్ళరభ.
మహిమీద పార్వతీ రళ
మాయమైపోయెనని
పరమేశ్వరుని హెూమము శర
బగ్గుమనియె శర

చెమట బట్టగతీసి శర
చ్రటాత్రిపైవేసి శర
వీరేశ్వరుడు బుట్టె విశ్వమునకు శర
పటపటా బ్రహ్మాండపలములన్నియు శర
కొట్టెగద దక్షుని శర
తోలెగదరిపుల శర
దండించవైరుడు శర
నీమిండడనగ శర
మొక్కజొచ్చితిమిగదా మోసపోయితి మని శర
వెన్నుగల అన్నకు శర
ఏనుగుతలబుట్టెనని
గుడిమీద తాతకు శర
గొఱ్ఱెతల ఇంపాయె శర
వరుల గుణవిహార శర
కోసూరి వీరభద్ర శర
అదదద, అగగగ, అదదద, అగగగ.
శరభ, దశ్శరభ, అశ్శరభ, శరభ, శరభ.

అంటూ ఆర్భాటం చేస్తారు. వీరంగధ్వనులు మిన్నుముట్టుతాయి.

ఇలా ఖడ్గంపట్టి, దండకం చదువుతూ, వాయిద్యాల గమకాల ననుసరించి వీరావేశంతో ఆ ప్రక్కకూ, ఈ ప్రక్కకూ అడుగువేస్తూ, కంకణంకట్టిన కత్తిని వేగంగా తిప్పుతూ ఆసాంతంలో ఏ గ్రామదేవతనుగాని, ఏ దేవుణ్ణి పూజిస్తారో, ఆ గ్రామం పేరు తలచి జై మంగళగిరి వీరభద్ర అని ముగించి, మరల వాయిద్య గాంధ్రను అదలించి శరభ, శరభ అంటూ నానాహంగామాజేసి ఆ కత్తిని, ఎవరైతే ఆ వుత్సవాన్ని నిర్వహిస్తున్నారో, ఆతని పళ్ళెంలో వుంచుతాడు.

## మజిలీ మజిలీవద్దా

## మరి మరీ ఇదే ఆట :

ఇలా వూరంతా ఊరేగుతూ ఒక్కొక్క మజిలీవద్ద, అంటే నాలుగువీధులూ కలిసిన చోట్లనల్లా ఒక్కొక్క వ్యక్తి పైవిధంగా ఖడ్గ నృత్యం చేస్తాడు. ఇలా వుత్సవం ముందుకు సాగేకొద్దీ జనసమూహం ఎక్కువై ఎంతో ఉద్రేకాన్ని కలిగిస్తుంది.

నృత్యధారి ధరించే ఖడ్గం చాలా భారీగా వుంటుంది. ఖడ్గం మిలమిలా మెరుస్తూ వుంటుంది. ఖడ్గం మధ్య భాగంలో తమలపాకుతోగాని, మామిడాకుతో గాని కంకణం కడతారు.

**ఖడ్గధారికి కావలసినవి,**
**ఆయన కర్తవ్యాలు :**

ఖడ్గం ధరించే వ్యక్తి విభూతిరేఖలు పట్టించి, పెద్ద కుంకుమబొట్టు పెట్టుకొని పంచ ఎగగట్టి, గోచి బిగగట్టి, విచిత్ర వేషధారణలో వుంటాడు. ఖడ్గంధరించే వ్యక్తి ఆ రోజున ఉపవాసముంటాడు. ప్రతివారూ ఈ నృత్యంచేయడం కష్టం. నృత్యం చేసే ప్రతివ్యక్తీ దక్షుని దండకాన్ని తప్పనిసరిగా నేర్చుకోవాలి లేనట్లయితే అడుగు పడదు. ఖడ్గ నృత్యధారి ప్రళయతాండవంగా నృత్యంచేసిన తరువాత శివమెక్కి ఆవేశంతో నారసాలు పొడుచుకుంటాడు.

**నాలుకపై**
**నారసాల నాట్లు :**

ఖడ్గ నృత్యంలో ఈ నారసాల నృత్యం మహా వుత్తేజకంగానూ, భయంకరం గానూ వుంటుంది. ఖడ్గ నృత్యం అయిన వెంటనే ఆ వ్యక్తి నారసాలు పొడుచుకుంటాడు. నారసాలంటే రెండు మూడు రకాలుగా వుంటాయి. ఏకనారసం, కంటినారసం, గొంతునారసం, సిరసునారసం, శూలనారసం మొదలైన పేర్లు వుంటాయి. ఇవి శూలంమాదిరిగా వుండి, త్రిశూలం చివరి భాగంలో నూనె గుడ్డలుచుట్టి వాటిని వెలిగించి సన్నని మొన భాగాన్ని నాలికపై గ్రుచ్చుతారు. ఇలాగ్రుచ్చే సమయంలో జోరుగా జోరు జోరుగా వాయిద్య సమ్మేళనం జరుగుతుంది. రణగొణధ్వనులు చేస్తారు. ధూపంవేసి ఆ వుద్రేకంలో నెమ్మదిగా గ్రుచ్చి నృత్యకారునికి కర్పూరం వెలిగించిన పళ్ళెం చేతికిస్తారు. నృత్యకారుడు ఒ



నారసాన్ని నాలుకమీద పొడుచుకున్న ఆవేశపరుడు

చేతితో నారసాన్ని పట్టుకుని వాయిద్యానికి తగినట్లు గుండ్రంగా వీరాధి వీరుడులా నృత్యం చేస్తారు. చేసేకొద్దీ వాయిద్యాల జోరు ఎక్కువ అవుతుంది. ఈ జోరులో వెలిగించిన వత్తులు ఒక్కొక్కటిగా ఆరిపోవడంతో ఈ నృత్యం పూర్తి అవుతుంది.

వెంటనే మరల వాద్యకారులందరూ చుట్టూచేరి వుక్కిరి బిక్కిరిగా రోదన చేస్తూ సాంబ్రాణి ధూపం వేసి, ఆ నారసాన్ని నెమ్మదిగా తీస్తారు. ముఖ్యంగా ఇద్దరు ముగ్గురు ఇలా నారసాలు ధరించి మూకఉమ్మడి నృత్యం చేస్తారు. ఈ నృత్యం ప్రేక్షకులను ఆశ్చర్యచకితులను చేస్తుంది.

**అద్యాపి జరుగుతూనే**

**ఉన్న చోద్యమే :**

ఈ విధంగా ఈ వీరభద్రవిన్యాస నృత్యాలు శైవులు, వీరశైవులు ఈనాటికీ చేస్తూనే వున్నారు.

ఇలాంటి ఖడ్గనృత్యాలు దక్షిణ దేశంలో తిరువాన్కూరులో వున్నాయి. ఈ నృత్యాన్ని 'పాతాయం' అని పిలుస్తారు.

# జముకుల కథలు

జముకుల కథలను జక్కుల కథ లని కూడా పిలవడం కద్దు.

**ఆటపట్టులు,**

**ఆకారపకారాలు :**

ఈ కథలు పశ్చిమ గోదావరి, తూర్పుగోదావరి, విశాఖపట్టణం మొదలైన జిల్లాల లోనూ, తెలంగాణాలోనూ విశేష ప్రచారంలో వున్నాయి. ఈ కథలు శృంగార



ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రదళం జముకుల కథ - మాచినేని, మిక్కిలినేని, ఉమామహేశ్వరరావు

లాలిత్యాలతోనూ, కరుణరసాన్ని ప్రతిబింబించేవిగానూ వుంటాయి. ఈ కథల్లో అనేక రకాలైన సంగీతపుమట్టు లున్నాయి. ఈ ప్రదర్శనం మూడు గంటల కాలం వుంటుంది.

## రంగస్థలం, రంగులు, వేషాలు, విశేషాలు :

వీరి ప్రదర్శనానికి ఏ విధమైన రంగస్థలమూ అవసరంలేదు. గ్రామం మధ్యలో చిన్న పందిరి వేసి రెండు లైట్లు కడితే సరి, సరిపోతుంది. ప్రదర్శనకారులు ముగ్గురు. అందులో మధ్య వ్యక్తి కథకుడు. వంతదారుల్లో ఒకరు హాస్యం, రెండవవారు వ్యాఖ్యానం. వేషధారణలో కథకుడు నల్లకోటు, తెల్లకట్టుపంచ. తల గుడ్డ చుట్టి చక్కగా నృత్యంచేస్తూ కలియదిరుగుతాడు. స్త్రీ పాత్రలు కథా విధానంలో వచ్చినప్పుడు అక్షరాలా స్త్రీ అభినయాన్నే కథకుడు చేస్తూ వుంటాడు. వంతదారులు రెండు జముకులను శ్రావ్యంగా వాయిస్తూ వుంటారు.

## జముకుల చిన్నెలు, వన్నెలు :

జముకులంటే చాలామందికి తెలియకపోవచ్చు. దీనినే జమిలిక, జమిడిక అని కూడ పిలుస్తారు. ఈ వాయిద్యం, కుంచం ఆకారంలో వుంటుంది. దానిని ఒక ప్రక్క భాగం బక్కచర్మంతో మూస్తారు. మధ్యభాగంలో చిన్న రంధ్రంచేసి నరాన్నికట్టి లోపలిభాగంనుంచి రెండవప్రక్క ఒక కట్టెముక్కకు కట్టుచేతితో దానిని లాగిపట్టి లోపలిభాగంలో ఆ నరాన్ని మ్రోగించినట్లయితే శ్రావ్యమైన మ్రోతలు వస్తాయి.

ఈ జముకుల కథలు ఒకనాడు కాకతీయ సామ్రాజ్యంలో విశిష్టంగా, విరివిగా వర్ధిల్లాయి.

ఈనాటికీ ప్రజానాట్యమండలిదళాలు, రేడియోద్వారా బహిరంగ ప్రదర్శనాలద్వారా ఈ విధానంలో 'పన్యక కథను' ప్రచారం చేస్తున్నారు.

---

# గారడీ విద్యలు

ఈ గారడీ విద్యను సంస్కృతంలో ఇంద్రజాలమనీ, గారడీవాళ్ళను ఐంద్ర జాలికులనీ వ్యవహరిస్తారు. ఈ గారడీవిద్య పూర్వకాలంనుండీ ప్రస్తుతం



వరకూ ప్రచారంలో వుండనే వుంది. పూర్వం రాజాస్థానాలలో విరివిగా ఈ విద్యను ప్రదర్శించి అఖండమైన సన్మానాలను, లాంఛనాలను పొందే వారు. ఈ నాటికీ గ్రామాలలో ఈ విద్య ప్రదర్శిస్తు న్నారు.

## మన్నికలో ఉన్న కొన్ని మాయదారి విద్యలు :

వేపాకులుదూసి తేళ్ళను తెప్పించడం, అరచేతిలో రూపాయలు సృష్టించడం. అప్పటికప్పుడు మామిడిటెంకను పాతి మొక్కను మొలిపించడం, మనిషిని బుట్టలోపెట్టి మాయంచేయడం, గొంతునుకోసి రక్తం చూపించడం, మనవద్దనున్న వస్తువును మాయంజేసి మరొకరి జేబులోనుండి తెప్పించడం మొదలైన అనేక విచిత్రాలను చూస్తూనే వున్నాం. ఈ గారడీవిద్య పూర్వంనుంచీ ప్రచారంలో వుం దనడానికి మనకు ప్రాచీన గ్రంథాలనుండి అనేక వుదాహరణలు కనిపిస్తున్నాయి. గారడీ విద్యల్నిగూర్చి పండితారాధ్య చరిత్రలో

> నావియద్గతి బక్షులాడెడునట్టి
> భావన మ్రోకులపై నాడెడువారు.

అని వుంది.

దొమ్మరసానులు గడలపై ఆడినట్లే, గారడీవారు మ్రోకులపై ఆడినట్లు పై రెండు పదాలనుబట్టి అర్థం చేసుకోవచ్చు.

## అంతరిక్షంలో వింత వింత జాలవిద్యలు :

పొడవైన మ్రోకును ఆకాశంలోకి విసరగానే, అది వెదురుగడలాగా నిలుస్తుందట. తరువాత గారడీ త్రాడుమీద నిచ్చెన ఎక్కినట్లు జరజరా ఆకాశంలోకి పోయి

వట్లు పోయి మాయమై తిరిగి కనిపించి, అక్కడే చిత్ర విచిత్రమైన విద్యల్ని ప్రదర్శించేవాడట.

**సవాళ్ళు,**

**ప్రతిసవాళ్ళు :**

ఈ విద్యను ఇంగ్లీషువారు 'రోప్‌ట్రిక్' అనే వారట. ఈ విద్యను గురించి 150 సంవత్సరాలక్రితం ఒక ఆంగ్లేయుడు భారతదేశంలో ఒక ఇంద్రజాల ప్రదర్శనంచూచి మెచ్చుకుని ఆనాడే పత్రికలలో వ్రాశాడట. ఆ ఇంద్రజాలంలో ఒకడు త్రాడు నొకదానిని పైకి నిలువుగా విసిరి గాలిలో నిలబెట్టి, దానిపైకి ఎగబ్రాకి మాయమైనాడట. తరువాత అతని అంగాలన్నీ ఖండాలుగా క్రిందపడిపోయాయనీ, మరికొంత సేపటికి యథాప్రకారంగా వాడు త్రాటిమీదనుండి గబగబా దిగి వచ్చాడనీ వ్రాశాడు. అది శుద్ధ అబద్ధమనీ, అటువంటి విద్యను ప్రదర్శించగలవానికి ఇంగ్లండుకు రానుపోను ఖర్చులు భరించడమేగాక కొన్నివేల రూపాయలు బహుమాన మిస్తామనీ కొందరు ఆంగ్లేయులు ప్రకటించారట.

ఇలాంటి కథనే కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలో వివరించాడు.

**'సింహాసన ద్వాత్రింశిక'లో**

**మరో దాఖలా :**

ఒక ఐంద్రజాలికుడు తన భార్యను వెంటబెట్టుకొని రాజసన్నిధిలో ఆమెను రక్షణార్థం విడిచి, తాను దేవసహాయార్థమై యుద్ధం చేయడానికి వెళుతున్నానని చెప్పి ఒక త్రాటిని పైకి నిలువుగా విసరి దానిని నిలబెట్టి దాని పైకి ఎగబ్రాకి మాయమయ్యాడట. తరువాత కొంతసేపటికి వాని కాళ్ళూ, చేతులూ, తల, మొండెం తుంపులై కిందబడ్డాయట. రాజువద్ద రక్షణగావుంచిన అతని భార్య రాజును వేడుకుని, సెలవుపొంది భర్తతో సహగమనం చేసిందట వెంటనే తాడుపాకి పైకిపోయిన ఐంద్రజాలికుడు పైనుండి దిగివచ్చి తన భార్యను పంపమన్నాడట. అంతట రాజు విచారగ్రస్తుడై ఆమె సహగమనం చేసిందని చెప్పాడట. అంతట ఆతడు.—

ఆవీరుం డవ్విధె నిజ
భావము ప్రకటముగ నాత్మభామినికొఱకున్

దా వైతాళికుడనుచున్
గైవారము చేసె జనులు కడువెరగందన్.

నరనాథ ! నిన్ను నపుడవ
నరమడిగినవాడ నైంద్రజాలికురీతిన్
నరుల నణకించి నీచే
సిరివొందం జోద్యమిట్లు చేసితిననియెన్.

ఇది ఆనాటి ఇంద్రజాలవిద్య అని, అదే సందర్భంలో చతుష్షష్టి కళలైన ఈ క్రింది వాటిని కూడ వివరించాడు. అవి వేదాలు—శాస్త్రాలు—పురాణాలు—వాస్తు—ఆయుర్వేదం—ధనుర్వేదం—మాంత్రికత్వం—సంగీతం—జలస్తంభన (మహేంద్రజాలం)—జూదం—అష్టావధానం—వాద్యనృత్య కౌశలం—బహురూప పటుత్వం (అనగా పగటివేషాలు)—పరిహాసం మొదలైనవి. [సింహాసన ద్వాత్రింశిక 111-112 పుటలలో వుదాహరించబడిందని సాంఘిక చరిత్ర 185 పుటలో వుదాహరించారు]

ఈ ఇంద్రజాలవిద్యల్లో జైనులు ప్రసిద్ధులని పైన వుదాహరించిన ఇంద్రజాలికుని కథ యథాతథంగా జైనుల త్రిషష్టికాపురుష చరిత్రలో [2 వ భా, 8 వ అధ్యాయం, 200-209 పుటలు] వుదాహరింప బడింది.

ఈ క్రింది జాలవిద్యను గురించి యథాదాక్కుల అన్నమయ్య సర్వేశ్వర శతకం 12 వ పద్యంలో ఈ విధంగా వివరించాడు

సురల న్మర్త్యసమంబుగా, మనుజులన్ శోభిల్లు బృందారకో
త్కరముంగా, ఘనునల్పు నల్పుని ఘనుంగా బుధ్యపాపాలిచే
దిరుగన్వైచుచు నీమహామహిమ ప్రీతిం బద్మజాండంబులం
దరయన్ జీవుల నింద్రజాలమునునా నాడించు సర్వేశ్వరా.

ఇదే ఇంద్రజాలానికి సంబంధించిన మరియొక కళారూపం కూడ ప్రాచీన కాలంనుంచీ ప్రచారంలో వుంది. అదే విప్రవినోదం.

## గొల్లసుద్దులు

గొల్లసుద్దులను చెప్పేవారు గొల్లలను మాత్రమే యాచిస్తారు. యాదవ చరిత్రకు సంబంధించిన కృష్ణలీలలు, కాటమరాజు కథ మొదలైనవాటిని సుద్దులవారు

ప్రచారంచేస్తూ వుంటారు. ఈ ప్రచారకులు ఆంధ్రదేశమంతటా వున్నారు. అయ్యలరాజు నారాయణామాత్యుడు 'హంసవింశతి'లో గొల్లసుద్దులను ఈ విధంగా వర్ణించాడు:

కొమ్ములు వీరణాలు జిగిగుల్కెడు ప్రాతల కృష్ణలీలలం
గ్రమ్ముగుడార్లు వీరుడగు కాటమరాజు కథామలావముల్
బమ్మినపుస్తకాలు ముఖవట్టిడికట్టు రుమాలలు వ్నెఱా
సొమ్ములు నావముల్ వెలయు సుద్దుల గొల్లలు వచ్చిరెంతయున్.

గొల్లసుద్దులవారి కథా వివరాన్ని పెద్దపెద్ద వస్త్రాలపై చిత్రించి బొమ్మల సహాయంతో కథలను చెపుతారు. వీరి మాదిరే తెలంగాణాలో పాండవు లనే తెగవారు భారత కథల్ని చీరలపై చిత్రించి పెద్దపెద్ద బొమ్మల సహాయంతో ప్రజానీకానికి పాడి వినిపిస్తారని బి. రామరాజుగారి జానపదగేయ సాహిత్యంలో తెలియజేశారు.

పై పద్యంలో వివరించిన మాదిరి కొమ్ముల్నీ, వీరణాలనూ వాయిస్తారు. వీరణం పెద్ద డోలువంటిది. కొందరు శంఖాలను కూడా పూరిస్తారు. గొల్లలలో అనేక తెగలవారు వున్నప్పటికీ అధిక సంఖ్యలో వున్నవారు ఎఱ్ఱగొల్లలే. వీరి ప్రధానమైన వృత్తి ఆవులమందలనూ, గొఱ్ఱెలమందలనూ పెంచడం. యాదవులకు ప్రధాన దేవతయైన గంగమ్మకు జాతర్లు మొదలైన వుత్సవాలుచేస్తూ వుంటారు. ఇలాంటి వుత్సవాలు దొనకొండ, అలవలపాడు మొదలైనచోట్ల జరుగుతున్నాయి. థర్స్టన్ పండితుడు ఈ గంగపూజల్ని వీరులపూజలుగా పేర్కొన్నాడు

# వసంతోత్సవాలు

వసంతోత్సవం ఋతు సంబంధమైన పండుగలలో ఒకటి. వసంతకాలంలో మన్మథుని గురించి ఈ వుత్సవం జరుపబడుతుంది. ఈ వసంతోత్సవం గురించి వాత్స్యాయనుని కామసూత్రాల్లోనూ, శ్రీహర్షుని రత్నావళి నాటకంలోనూ, కాళిదాసుని మాళవికాగ్నిమిత్ర నాటకంలోనూ ప్రస్తావించ బడింది. ముఖ్యంగా రత్నావళి నాటకం ఈ వసంతోత్సవంతో నే ప్రారంభమౌతుంది.

ఆంధ్రదేశంలో ఈ మదన మహోత్సవానికి వసంత మహోత్సవమనీ, కాముని పండుగనీ, ఫాల్గుణ శుద్ధ పూర్ణిమకు కాముని పూర్ణిమ అనీ పేరు. 14 వ శతాబ్దానికి పూర్వం ఈ వసంతోత్సవాలు ఏ విధంగా జరిగేవో తగిన ఆధారాలులేవు. కాని, కొండవీటి రెడ్డిరాజులకాలంలోనూ ఆ తరువాతి కాలంలోనూ ఈ వసంతోత్సవాలు ఎలా జరుపబడుతూ వుండేవో తెలుసుకోవడానికి శ్రీనాధుని భీమేశ్వర పురాణంలోనూ, కొరవి గోపరాజు సింహాసన ద్వాత్రింశికలోనూ వసంతోత్సవాలను గురించి విపులంగా వర్ణించ బడింది.

ఆ కాలంలో వసంతోత్సవాలకు రాజనగరునూ, నగరుకు వెలుపలనున్న వుద్యానవనాన్నీ మనోహరంగా అలంకరించి, వుద్యానవనంలో ఒక పూజా మండపాన్ని, వివిధ దేవతలకు పూజావేదికలను నిర్మించి, తోరణాలతోనూ, పుష్పాలతోనూ, సుగంధద్రవ్యాలతోనూ వైభవంగా పూజామండపాన్ని అలంకరించి రతీమన్మథులను, లక్ష్మీ విష్ణువులను, శివపార్వతులను, దేవేంద్రుడు, శచీదేవి, వసంతుడు విఘ్నేశ్వరుడు మొదలైన విగ్రహాలను వేదికలమీద వుంచి, మహారాజు అశ్వారూఢుడై, మంత్రులు సామంతులు దండనాయకులు పురోహితులు విదూషకులు పురజనులు, వెంటరాగా బ్రహ్మాండమైన మంగళ వాయిద్యాలతో వుద్యానవనానికి బయలుదేరేవాడు.

ఈ విధంగా ప్రారంభమైన వసంతోత్సవంలో వారి వారి విద్యల్ని ప్రదర్శించి పారితోషికాలు పొందడానికి నటీనటులు, శిల్పులు, సంగీత విద్వాంసులు మొదలైన అనేకమంది కళాకారులు హాజరయ్యేవారు. రాజ్యం నలు మూలలనుంచీ ఈ వసంతోత్సవాలను తిలకించటానికి ఆబాలగోపాలం కదలి వచ్చేది. ఆనాటి వసంతోత్సవాలు రాజుకు, ప్రజలకు పండుగగా మారింది.

వుత్సవం ఈ విధంగా సాగుతూ వుండగా రాజుకు సామంతరాజులూ, మండలేశ్వరులూ మొదలైనవారు కానుకలనూ, కిప్పములనూ ఈ సందర్భంలో చెల్లించేవారు. విదూషకులు వినోదగోష్ఠిని జరిపేవారు. రాజువెంటవచ్చిన సుందరీ మణులు వసంలో వుయ్యాలలూగుతూ, ఏలపాటలతోనూ, జాజరపాటలతోనూ కాలక్షేపం చేసేవారు. రాజు రాణులతో కలిసి, మన్మథునీ, తదితర దేవతలనూ పూజించి బ్రాహ్మణ దంపతులకు కర్పూర తాంబూలాలను సమర్పించేవారు.

తరువాత రాజు చందనాది సుగంధ ద్రవ్యాలనూ, కర్పూర నీరాజనాలనూ, వినోద ప్రారంభానికి చిహ్నంగా జనసమూహంపై చల్లేవాడు. ఆ తరువాత జన సమూహంపై ఒకరిపై ఒకరు పరిమళద్రవ్యాలను, రంగుతో కలిపిన వసంతాన్ని చల్లుకొని వావివరుసలు లేకుండా తటాకంలోదిగి జలక్రీడలతో వినోదించేవారు.

ఆ తరువాత మహారాజు, నిండుకొలువులో గాయకులకు, శిల్పులకు, నట్టువ రాంద్రకు, నటీ నటులకు బహుమానాలను సమర్పించి, పండితులను సన్మానించి, ఆనాటి రాత్రంతా జాగారం చేసేవాడు. నాటకప్రదర్శనాలతోనూ, సంగీత నృత్యాల తోనూ తెల్లవారేది.

రెడ్డి రాజుల్లో అనవేమారెడ్డి ప్రథమంగా ఈ వసంతోత్సవాలను ప్రవేశ పెట్టాడు. ఆనాటినుంచి రెడ్డి సామ్రాజ్యంలో వసంతోత్సవాలు వైభవోపేతంగా జరుగుతూ వుండేవి. ఆ మహోత్సవ సమయాలలో కర్పూరాది పరిమళద్రవ్యాలను వెదజల్లడంవలన అనవేమారెడ్డి, కుమారగిరిరెడ్డి రాజులకు వసంతరాయ, కర్పూర వసంతరాయ బిరుదులు కలిగాయి. రెడ్డిరాజులకాలంలో వసంతోత్సవాలు జాతీయ వుత్సవాలుగా జరిగేవి. విజయనగర రాజులకాలంలో కూడా ఈ వసంతోత్సవాలు ముమ్మరంగా జరుగుతూ వుండేవి. భారతదేశం ఇంగ్లీషువారి అధీనం అవడంతో వసంతోత్సవాలు అంతరించాయి.

# వీరముష్టివారు

ఈ వీరముష్టివారిని వీరశైవ భిక్షుకులని, వీరయోధులని చెప్పుకోవచ్చు. వీరు వీరశైవ వాఙ్మయానికి సంబంధించిన గేయాలను, భక్తులగాథలను, కన్యకా పరమేశ్వరీ కథలనూ చెపుతూవుంటారు. వీరు ఎక్కువగా జంగాలను యాచిస్తారు. కన్యక కథను చెప్పడంవల్ల వైశ్యులుకూడ వీరిని అభిమానిస్తారు. వీరముష్టులు పాడే పాటల్లో ఎక్కువభాగం కన్యకా సంబంధమైనవి. అందువల్ల వీరిని కోమట్లు ఎక్కువగా ఆదరిస్తారు. అయ్యలరాజు నారాయణామాత్యుడు వీరముష్టులను వుదాహరించి నట్లు బి. రామరాజుగారు 'జానపద గేయసాహిత్యం'లో తెలియజేస్తున్నారు. వీర భద్రుడు దక్షుని ధ్వంసం చేయునపుడు అతని చెమటనుండి వీరముష్టులు ఉద్భవించా

రని ఒక కథ వుంది. వీరు వీరభద్ర ఖడ్గములను కూడ చెపుతారు. వీరు వీరశైవుల వలె నారసాలు గుచ్చుకుని నాట్యం చేస్తారు.

# ఫకీరు వేషాలు

ఫకీర్లు ముస్లిం కులంలో ఒకతెగ. వీరు ముస్లిములనే యాచిస్తారు. అల్లాను సంస్మరిస్తూ 'అల్లాకే నాం' జపిస్తూ ఇంటింటికీ తిరుగుతూ ముస్లిములను ఆశీర్వదిస్తారు. కళారూపాలన్నీ ప్రథమంలో ఒకందుకు ఏర్పడినా తరువాత అవి వివిధ రీతులుగా ఎలా పరిణామం చెందాయో ఈ ఫకీరు వేషాలు కూడా అంతే.



వీరు ఒక పెద్ద కంజీరాను చేతిలో ధరించి, తలకు పెద్ద తలపాగా చుట్టి, మెడలో ఫకీరు పూసలను ధరించి, మొలకు లుంగీని ధరిస్తారు. ప్రతి జట్టుకూ ఇద్దరు ముగ్గురు వుంటారు. మధ్యలో పాటకుడు పాట పాడుతూ వుంటే మిగిలిన ఇద్దరూ 'అల్లాకేనాం' అని వంతపలుకుతారు ఉదాహరణకు—

పాడిపంటల్ సల్‌గుండాలి ॥అల్లాకే నాం॥
తల్లీపిల్లల్ సల్‌గుండాలి
తండ్రీ కొడుకుల్ సల్‌గుండాలి
హిందూ ముస్లింలంతా
వాకహేకం కావాలండి.

అంటూ పాడుతూ, మధ్య మధ్య, రక్తికొరకు కర్రతో చేయబడ్డ ఒక విధమైన, కిర్రు శబ్దంవచ్చే దానిని చేతిలో ధరిస్తారు. కాలేజీ, హైస్కూలు విద్యార్థులు వారి స్కూలు వుత్సవాల్లో ఈ కళారూపాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. ఈ కళారూపాన్ని ఆంధ్ర ప్రజా నాట్యమండలి హిందూమతసామరస్యంకొరకు వువయోగించి ఆంధ్ర ప్రజలలో విశేషంగా ప్రచారం చేశారు.

# తుమ్మెద పాటలు

దసరాపండుగ వచ్చిందీ అంటే ఆంధ్రదేశపు పల్లెల్లో కూలీ స్త్రీలు చక్కగా రంగు రంగుల చీరలు ధరించి, కొప్పుల్లో బంతిపువ్వులుచుట్టి, వయ్యారంగా సీతాకోక చిలుకల్లా మృదుమధురమైన కంఠాలతో,

రావెరావె నల్లతుమ్మెదా ॥మంచి॥
పాటలెన్నో పాడు తుమ్మెదా
పాండవులు పాండవులు
పంచపాండవులారె ॥తుమ్మెదా॥

అంటూ ఇంటింటికీ తిరిగి,

కొత్త పంటొచ్చింది తుమ్మెదా
మనకు కరువేమిలేదింక తుమ్మెదా.

అంటూ తుమ్మెదజట్టుల్లాగా స్త్రీ కూలీలు ఈ కళారూపాన్ని ప్రచారంలోకి తీసుకువచ్చారు. ఈ పాటలనే ప్రజా నాట్యమండలి కరువు పరిస్థితుల ననుసరించి అధికపంటలు పండించవలసిందిగా రైతుల నుద్బోధించడానికి పాటలు రాసి ప్రచారం చేశారు.

# డప్పుల కోలాట నృత్యం

ఈ డప్పుల వాయిద్యాన్నే తప్పెట్ల వాయిద్యమంటారు. వీటినే రాయలసీమ ప్రాంతాల్లో కనక తప్పెట్లంటారు. ఈ వాయిద్యాన్ని మాదిగ కులస్థులు ఎక్కువగా వాయిస్తూ వుంటారు.

ఈనాటికీ ప్రతి పల్లెలోనూ ఒక కార్యక్రమాన్నిగాన్ని, ఒక విశేషాన్నిగాని ప్రజ అందరికీ తెలియ జెప్పాలంటే, ఒక్కడప్పుతో వూరంతా ఎటువంటి విషయాన్నైనా చాటిస్తారు. వివాహాలకూ, అమ్మవారి జాతర్లకూ, పీరుళ్ళ పూజలకూ ఈ వాయిద్యాన్ని ఎక్కువగా వుపయోగిస్తూ వుంటారు. వాయిద్యం చాలా వుద్రేక పూరితంగా వుంటుంది. ఈ దప్పులను వేపచెక్కలతోనూ, చంద్రపు చెక్కలతోనూ చట్రంగా తయారుచేసి గేదెదూడ చర్మాన్ని ఒక ప్రక్క మూసి నిప్పుశగమీద కాచి వాయిస్తే



కణకణమని శబ్దం వస్తుంది. ఈ డప్పు లతో వలయాకారంగా నిలబడి.

నీలాలారా, నిమ్మారాలా
  నీళ్ళకుపోయే కన్యాథాలా
రేపేపైనామాని చెప్పండోయ్
  మేలన్నాలారా. ॥నీలాలారా॥
కోటాదుమికే—పేటాదుమికే
కోటలోగజ—నిమ్మాదుమికే
నిమ్మాముల్లూ రొమ్మూనాటేనూ. మేలన్నాలారా
శెలవాలిత్తే గడియాకొత్తూమూ
సద్దీతిన్నా జలదీకాడా సాబానాలబావికాడా
జోడుంగరాలు- మరచీపోతినే—మామయ్యగారు
శెలవాలిత్తే-గడియాకొత్తూనూ.

అంటూ డప్పులను వాయిస్తూ, కోలాటం వేస్తారు. మామూలు కోలాటంలో అందరూ చిరుతలు వుపయోగిస్తే ఈ కోలాటంలో అందరూ డప్పులను చంకల్లో ధరిస్తారు. డప్పులు మ్రోగించే పుల్లలతో మధ్య ఒకరికొకరు కోలాటంవేస్తూ. ఎగిరి ఎగిరి, గజ్జెల కాళ్ళతో నృత్యంచేస్తూ అద్భుతంగా కోలాటం వేస్తారు. ఈ కనక తప్పెట్ల వాయిద్యం చాలా వుత్తేజాన్ని కలుగజేస్తుంది. ఈ వాయిద్యంలో కృష్ణాజిల్లా కనుమూరువాస్తవ్యుడు అమృతయ్య. వుంగుటూరు వాస్తవ్యుడు ఏసుదాసు-వీరిద్దరూ డప్పులమీద మృదంగ వరుసలన్నిటినీ అద్భుతంగా వాయించి ప్రదర్శిస్తారు. వీరెరువురూ ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రదళంతో బొంబాయి, అహమ్మదాబాదు, పూనా, షోలాపూర్, మద్రాసు, ఢిల్లీ మొదలైన ప్రాంతాలకు వెళ్ళి దేశభక్తి ప్రబోధాన్ని చేశారు. సామాన్య వరుసలతో ప్రారంభమైన జాన పదుల ఈ డప్పుల వాయిద్యం ఈనాడు ఒక శాస్త్రీయ వాయిద్యంగా రూపొందింది.

## బగ్గు గొల్లలు

సర్కారు ప్రాంతంలోవున్న గొల్లలు చాలా మంది సుద్దులు చెపుతూ వుంటారు. నరసారావుపేట ప్రాంతంలోని కొంత మంది ఎఱ్ఱగొల్లలు పగటివేషాలను ధరించు

డం కూడా కద్దు. గొల్లజాతిలో అనేక తెగలున్నాయి. వాటిలో ఈ బగ్గు గొల్లల తెగ ఒకటి. వీరు తెలంగాణాలో దాదాపు చాలా జిల్లాలలో వున్నారు. వీరి ప్రదర్శనాలు రాత్రిపూటా పగటిపూటా కూడా జరుగుతూ వుంటాయి. వీరి దళంలో నలుగురు సభ్యులకు మించిగాని, తక్కువగాని వుండరు. ఒకడు ప్రధానుడై కథ చెపితే మిగతా ముగ్గురూ వంతపాటను అందుకుంటారు. వీరి ప్రదర్శనం యక్షగాన పద్ధతిలో నడుస్తుంది. నోటితో పాట, ముఖంతో అభినయం. ఆంగిక చలనాదులూ వుంటాయి. కథకుని వేషధారణ పంచకట్టి, నడుముకు కట్టు కట్టి, తలకుపాగా చుట్టి, కాళ్ళకు గజ్జెలు కడతాడు. వీరి వాయిద్యాలలో ముఖ్యమైనది ఒక పెద్ద రండోలు. దీని శబ్దం గంభీరంగా వుంటుంది. వీరి శృతిమాత్రం ప్రక్కవంతలే. వీరి ప్రదర్శనాలు పంటలకాలంలో ఎక్కువగా జరుగుతాయి,

# గోండుజాతి నృత్యాలు

ఈ నాటి తెలంగాణాలో కేసలాపురం భీమదేవు దేవాలయం గోండుజాతికి సంబంధించినది. ఇక్కడ గోండు జాతివారు గొప్ప జాతర జరుపుతారు జాతర పుష్యమాసం తరువాత ప్రారంభమౌతుంది. పదిహేను రోజులపాటు జరుగుతుంది. వేలాది గోండుజాతి ప్రజలు గుమికూడతారు. ఈ వుత్సవంలో పాల్గొనడానికి గోండుకవులూ, వాయిద్యకారులూ, పాటకులూ, అందరూ హాజరై ప్రధాన వాయిద్యాలను వాయిస్తూవుంటే పాటగాండ్రు భక్తిగీతాలు పాడుతారు. ఈ వుత్సవాలలో వివాహమైన పెండ్లికూతుళ్ళు ప్రధాన పాత్రలు వహిస్తారు విగ్రహం ముందు నిలబడి రాత్రి తెల్లవార్లూ తన్మయీభావంతో వివిధ రకాలైన నృత్యప్రదర్శనాలు జరుపుతారు ఈ ప్రదర్శనలకు గోండు ప్రజలే కాక, ఇతర కులాలకు చెందిన వారు కూడ హాజరై ఆనందిస్తారు.

# గరగ నృత్యం

ఒకప్పుడు పెంపుగలిగిన గరగజాతి ఈనాడు చాలావరకు క్షీణదశలో ఉన్నదని చెప్పవచ్చు. వీరు ముఖ్యంగా దేవతలను ఆరాధిస్తారు. వీరు జాతర్ల సమ



యంలో ఐదు శిరస్సుల నాగును సర్వాంగ సుంద రంగా అలంకరించి శిరస్సుపై ధరించి కనక తప్పెటల వాయిద్యంతో భక్తి ప్రధానంగా నృత్యం చేస్తారు వీరు దేవీ నవరాత్రులలో కూడా నృత్యం చేస్తారు గరగజాతివారు ఆంధ్రదేశమంతటా వున్నారని చెప్పడానికి ఆధారాలు లేవు అక్కడక్కడా ఒక తెగగా మాత్రమే వున్నారు.

## ఋంజలు

ఆంధ్ర దేశంలో అన్ని ప్రాంతాల్లోనూ విశ్వ బ్రాహ్మణులను ఆశ్రయిస్తూ, వారి నారాధిస్తూ వారిపై ఆధారపడిన తెగ ఋంజలవారు. వీరినే ఋంజలని పిలవడం కూడా కద్దు. వీరి ముఖ్య వాయిద్యం ఋంజవాయిద్యం అవడంవల్ల వీరిని ఋంజల వారని పిలవడం వాడుకలోకి వచ్చింది ఈ వాద్యకులు ఆ వూరునుండి ఈ వూరికి, ఈ వూరినుండి ఆ వూరికి సంచారంచేస్తూ వుంటారు. ఈ తెగవారిని విశ్వబ్రాహ్మణులు ఎంతో ఆప్యాయతతో చూచుకుంటారు. వీరు విశ్వకర్మ పురాణాన్ని గానంచేసి పారితోషికాలు పొందుతూ వుంటారు. ఋంజవాయిద్యం చాలా వుత్తేజాన్ని కలిగిస్తుంది. ఒక్కొక్క జట్టులో దాదాపు పదిమందివరకూ వుంటారు. అందరూ ఋంజ వాయిద్యాన్ని అద్భుతంగా వాయిస్తారు.

# పాండవులవారు

మహా భారతగాథను అద్భుతంగా గానంచేస్తూ జీవించే ఒక తెగ హైదరాబాదు ప్రాంతంలో వుంది. ఈ తెగలోని పురుషులందరూ పాండవులగాథను అత్యద్భుతంగా గానం చేస్తారు. పాండవులగాథను గానం చేయడంవల్ల వీరిని పాండవులవారని పిలుస్తూ వుంటారు. మహా భారత గాథలను మినహా మరే గాథలనూ వీరు గానం చేయరు. పురుషులు కథాగానంచేస్తే, వీరి స్త్రీలు పురుషులకు స్త్రీలకు,

పిల్లలకు పచ్చబొట్లు పొడిచి డబ్బును సంపాదిస్తారు. వీరు ఒక్క తెలంగాణాలో తప్ప ఇతర ఆంధ్రప్రాంతాల్లో ఎక్కడా కనుపించరు.

# మాలజంగాలు

మాలజంగా లనే పంచాలవారు మన బుర్రకథలనే ప్రత్యేక ఫక్కీలో చెపుతారు.

వీరి తంబురా నెమలి ఈకలతో అలంకరింపబడి వుంటుంది. వీరు చేతివుంగరాలతో తంబురా బుర్రను తాళంప్రకారం కొడుతూ, కథ చెపుతూ వుంటారు. ముఖ్యంగా వీరి కథలు కరుణరస ప్రధానమైనవి. వీరి ప్రదర్శనాలు సాయంత్రం ప్రారంభమై, తెల్లవార్లూ జరుగుతుంటాయి. వీరు చెప్పే కథా సాహిత్యం ఎటువంటిదో మనకు తగిన ఆధారం గ్రంథరూపంగా లభించదు. వీరి వాయిద్యాలలో ఢోలు ప్రసిద్ధిచెందిన వాయిద్యం. ఇంకా వీరుపయోగించే వాయిద్య విశేషాలలో ముఖ్యమైనది 'జమిలిక'. దీనినే జవనిక, జముకు అని పిలువడం కూడా కద్దు. వీరి మరొక వాయిద్యం 'తుడుంకొమ్ము'. వీరిని కొన్ని ప్రాంతాలలో రోజవారని కూడా పిలుస్తూ వుంటారు.

# చిన్నమాదిగలు

కేవలం మాల మాదిగలను మాత్రమే యాచించే వీరిని చిన్న మాదిగలంటారు.

సర్కారు ప్రాంతంలో కూడా ఇలా యాచించేవారు వున్నారు. చిన్న మాదిగలు వూరూరా సంచారంచేస్తూ ప్రదర్శనలిస్తారు. వీరిది పగటి ప్రదర్శనం, వీరి ప్రదర్శనం వీధి భాగవతానికి దగ్గరగా వుంటుంది. వేషధారణ కూడా అంతే. వీరి కథా ఇతివృత్తం చరిత్రాత్మకమైనది. వీరు ఏ గ్రామంలో ఎన్ని ప్రదర్శనాలు ఇచ్చినా ఒక వారం రోజులకన్నా ఎక్కువ ఆ గ్రామంలో వుండరు. ప్రదర్శనలన్నీ ముగిసిన తరువాత చివరిరోజున ఒకతంతు నడుపుతారు. నీచ దేవతలను తృప్తిపరచడానికని జంతుబలిచేసి బీభత్సంగా వేషం అలంకరించుకున్న ఒక యువకుడు క్షుద్ర దేవతలముందు తాండవం చేస్తాడట. గ్రామ ప్రదక్షిణంచేసి సమీపంలో వున్న చెరువులో స్నానంచేసి తిరిగి ఆ గ్రామానికి రాకుండా వెళ్ళిపోతాడట. ఈ విధంగా ప్రదక్షిణం చేయడంవల్ల పాడిపంటలకు, జనులకు శుభం కలుగుతుందని జానపదుల నమ్మిక.

# కడ్డీ వాయిద్యం

మిత్తుల అయ్యావార్లనీ, దాసరులనీ పిలువబడే వీరు ఈ కడ్డీ వాయిద్యంలో ప్రవీణులు. ఈ వాయిద్యం వీణమాదిరిగా వుంటుందట. వీణమాదిరే దీనిని కూడా చేతివ్రేళ్ళతోనే వాయిస్తారు. వీరు ముఖ్యంగా ఈ వాయిద్యంమీద భగవన్నామ సంకీర్తనలను వాయిస్తూ వుంటారు.

ఈ వాయిద్యాన్ని ముందు నిలబెట్టుకుని రెండు సన్నని పుల్లలతో జలతరంగ్ వాయిద్యాన్ని వాయించినట్లు వాయిస్తారు. ఈ స్వరమాధుర్యం ఎంతో మధురంగా వుంటుంది. వీరి వృత్తికి ప్రాణప్రదమైంది ఈ వాయిద్యమే. అయితే ఈ వాయిద్యాన్ని అందరూ వాయించలేరు. దీనిని ప్రత్యేకమైన శిక్షణతోనూ, సాధనతోనూ సాధించవలసిందే. అందువల్లనే ఈ వాద్యకాండ్రలో ప్రవీణులు చాలా తక్కువ. తెలంగాణాలో ఈ వాయిద్యంలో ప్రసిద్ధులైనవారు కరీంనగర్ జిల్లా మెట్టుపల్లి తాలూకాలో వున్నారు. ఈ కళారూపాన్ని శిథిలం కాకముందే దీనిని రక్షించుకోవడం అవసరం.

# విప్రవినోదులు

విప్రవినోదులు విజయనగర సామ్రాజ్యకాలంలో వున్నట్లు పైనే తెలుసుకోగలిగాం. విప్రవినోదంచేసేవారు ఆంధ్రదేశం అంతటా వున్నట్లు మనకు ఆధారాలు వున్నాయి. తెలంగాణాలో ఈ విప్రవినోదులు కరీంనగర్ జిల్లా మాణిక్యాలపురంలో వున్నట్లు తెలుస్తూ వుంది. వీరి వృత్తి విప్రులను యాచించడమే. వీరి ప్రదర్శనం కూడ ఇంద్రజాలమే వీరిదళ సభ్యులు నలుగురుంటారు. వీరి ప్రదర్శనలు విప్రుల ఇండ్లలోనూ, విశాల బహిరంగ స్థలాల్లోనూ కూడా ప్రదర్శిస్తారు. వీరి ప్రదర్శనసామగ్రి 5, 6 శాలువలు, ఒక కొయ్య అలమారా, ఒక తాళపత్రగంథం, రెండు జతల తాళాలు. వీరి ప్రదర్శనం విశాల ప్రదేశంలో ఒక చిన్న పందిరిలో జరుగుతుంది. పందిరిచుట్టూ శాలువలు కడతారు. ఆ తెరలమధ్య ఖాళీ అలమారా వుంచుతారు. . ఇరువురు వ్యక్తులు చెరోపక్కన చేరి తాళాలు వాయిస్తారు. ఇంతలో ప్రేక్షకులు గుమికూడతారు. తెరలన్నీ ఎత్తి ఖాళీ అలమారా చూపిస్తారు. తరువాత దళముఖ్యుడు ప్రాచీన తాటాకుల గ్రంథంతో తెరలమధ్యకు

వెళతాడు. ఒక పావుగంటవరకూ ఆయన బయటకు రాడు. ఈలోగా భజన జరుగు తూనే వుంటుంది. తరువాత తెరను తొలగిస్తారు. అదివరకు ఖాళీగా వున్న అల మారాలో దేవతల విగ్రహాలూ, దీపారాధనకుందులూ, పుష్పాలూ, ఫలాలూ, పిండివంటలూ, గంట, శంఖు, వివిధ పూజాపాత్రలు, అనేకరకాల పిండివంటలు ప్రత్యక్షమౌతాయి. ఈ ప్రదర్శనం ప్రేక్షకుల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది. ప్రదర్శనానికి ముందే అలమారాను పరీక్షించవచ్చు. అంతేకాక వీరు ఇంటింటికీ తిరుగునప్పుడు విగ్రహాలను, కప్పలను, చిలకలను, విభూతిని అరచేతిలో సృష్టించి ఇంద్రజాల మహేంద్రజాల విద్యను ప్రదర్శిస్తారు.

# పులినృత్యం

ఆంధ్రదేశంలో ప్రతి పల్లెలోనూ ఈ పులి నృత్యాన్ని చూచి వుంటారు. ముఖ్యంగా దసరా వుత్సవాలలోనూ, పీర్లపండుగల సందర్భంలోనూ, సంక్రాంతి విచిత్ర వేషాల్లోనూ ఈ పులి వేషాన్ని ధరిస్తారు. పులివేషం జంతు నృత్యాలకు అనుకరణ. నెమలినృత్యం, గరుడ నృత్యం, సింహ నృత్యంమాదిరే ఈ పులినృత్యం కూడా. ఈ కళారూపాన్ని ఎక్కువగా ప్రచారంలోకి తెచ్చినవారు పల్లె ప్రజలు.



దక్షిణదేశంలో ఈ పులి వేషాన్ని పులివాలకోలు అనడం కద్దు ఆంధ్ర దేశంలో పులివేషమని, పెద్దపులివేష మని, దసరా పులివేషమనీ పిలుస్తూ వుంటారు. ఈ పులివేషంవాళ్లు గ్రామాల్లో ఇంటింటికీ తిరిగి యాచిస్తూ వుంటారు. పిల్లలు భయపడేటంత సహజంగా ఈ పులివేషాన్ని చిత్రిస్తారు. పులివేషం వచ్చిందంటే పల్లెల్లో పిల్లలకీ, పెద్దలకీ ఒక పండుగ.

**పులివేషధారణ -**
**తీరు, తెన్ను :**

**పు**లివేషధారణ చాలా కష్టమైంది. మామూలు వేషాల్లాగ ఏదో ముఖానికి ఇంత

రంగు పూసి తుడిచివేయడంలాంటిది కాదు. శరీరంలో అన్ని భాగాలనూ వార్నీషు రంగులతో ముంచివేస్తారు. శరీరమంతటా అక్కడక్కడ నల్లటిచారలను చిత్రించడంతో పెద్ద పులి ఆకారం వస్తుంది. నెత్తికిమాత్రం తోలుతో కుట్టబడిన టోపీని తగిలిస్తారు. కళ్ళకు మాత్రం నల్లద్దాల కళ్ళజోడు ధరిస్తారు వేషధారి. వేషం పూర్తి అయినతరువాత ఈ పులివేషం బజారులో కొస్తుంది. నిజంగా పెద్ద పులి వచ్చినట్లే వుంటుంది. హుందా యైన నడకలతోనూ, గంభీరపు చూపులతోనూ అడుగులు వేస్తూ రోడ్డంతా కలయ దొక్కుతారు. ఈ అడుగులకు తగినట్లు రెండు మూడు కనక తప్పెట్లు కణకణమంటూ వాయిస్తూవుంటే ప్రతి ప్రేక్షకునికీ చిందులూ, శివాలూ వేయాలన్నంత వుత్సాహం కలుగుతుంది. పులినృత్యాన్ని, ఆ బాలగోపాలం హాజరై ఆనందిస్తారు.

పులివేషధారి అప్పుడప్పుడు చుట్టూ మూగిన పిల్లల్ని భయపెడుతూ వుంటాడు. ముందు మామూలుగా అడుగులు వేస్తాడు. అడుగులకు తగినట్లు వాయిద్యం వుధృతంగా వుంటుంది. ఇలా అడుగులమధ్య ఎగిరెగిరి ఘుగ్గలు వేస్తూ వుంటాడు. పల్టీలు కొడుతూవుంటాడు. తొడచరిచి పౌరుషాన్ని నటిస్తాడు. ఇలా పల్టీలు కొట్టేటప్పుడు నృత్యం వుత్తేజంగా వుంటుంది.

ఈ నృత్యంలోనే పెద్ద పులి, వేటగాడు-రెండు పాత్రలు నటిస్తాయి. వేటగాడు పులిని చంపాలని ప్రయత్నించడంలో నృత్యం ఎంతో ఆకర్షణీయంగా సాగుతుంది.

మధ్య మధ్య డప్పు వాయిద్యగాళ్ళు పులివేషాన్ని కవ్విస్తూ వివిధ గతుల్లో అడుగులు వేయిస్తూ, వారు కూడా అడుగులు వేస్తూ, గుండ్రంగా తిరుగుతూ, ప్రేక్షకుల ను త్తేజపరుస్తారు. పులివేషగాడు రెండు చేతుల్లోనూ రెండు నిమ్మకాయలుపట్టి, అప్పుడప్పుడు అతనికివచ్చే ఆయాసాన్ని ఆపుకోడానికి నిమ్మకాయల్నికొరికి రసం తాగుతూ జంతుతత్వాన్ని నటిస్తాడు. ఈ విధంగా ప్రజల నాకర్షించి పర్వ దినాల్లో డబ్బు సంపాదించుకుంటూ వుంటారు.

పులివేషం ఆంధ్రదేశపు జానపద నృత్యాల్లో ముఖ్యమైంది.

## కాముని పౌర్ణమి వినోదాలు

తెలంగాణా గ్రామీణ ప్రజలకు కాముని పౌర్ణమి ఆనందదాయకమైన పండుగ. వెన్నెల రాత్రులలో గుంపులు గుంపులుగా, పౌర్ణమి ఇంకా మూడు రోజు లుం-

దనగానే, ఈ వినోద కార్యక్రమాలు ప్రారంభమౌతాయి. కాముని పున్నమ ఒక్క తెలంగాణాలోనేకాక భారత దేశమంతటా, ముఖ్యంగా ఉత్తర హిందూస్థానంలో హోళీపండుగ రూపంలో జరుగుతుంది. వరుసా వావీ లేకుండా ఒకరిమీద మరి ఒకరు వసంతాలను జిమ్ముకుంటూ ఒడలు మరచి తన్మయత్వంలో ఈ వినోదాలను జరుపుకుంటారు. కులభేదాలూ, మతభేదాలూ, వైషమ్యాలూ, ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువా అనే భేదభావం లేకుండా ఈ వినోదాలు ఎంతో అన్యోన్యంగా సాగుతాయి. ఆంధ్రదేశంలో ఈ వసంతాలు ముఖ్యంగా వివాహానంతరం కంకణాలు విప్పేరోజున ఎంతో వుల్లాసంగా జరుగుతాయి.

అలాగే సీతాకళ్యాణం సమయంలో బండ్లమీద వసంతాలతో నిండిన ధాందాలు పెట్టుకొని గ్రామవీధుల్లో కనబడిన వా రందరిమీదా ఈ వసంతాలను విరజిమ్మి గులాములను చల్లుతారు. పిడకలు, కప్పలు, నత్తలు, మామిడిటెంకల దండలూ మెడలోవేసి ఒకరి కొకరు వినోదాలతో తృప్తిని తీర్చుకుంటారు.

కాముని పౌర్ణమి సందర్భంలో వసంతాలు అంతటా అందరూ వుపయోగిం చకపోయినా ముఖ్యంగా హైదరాబాదు, సికిందరాబాదు, వరంగల్లు మొదలైన నగ రాలలో వసంతోత్సవాలు జరుగుతూ వుంటాయి. పల్లెప్రాంతాల్లో రకరకాల వినో దాలతోనూ, ఆటపాటలతోనూ ఈ వుద్యమాలు జరుగుతూ వుంటాయి.

కాముని పున్నమ సందర్భంలో వెన్నెలపాటలు, అల్లో నేరేళ్ళు, కోలాటపు పాటలూ స్త్రీలు పాడుకుంటే పురుషులు జాజరపాటల్ని, కోలాటపు పాటల్ని పాడుతూ వుంటారు. మొత్తంమీద ఈ కోలాట కళారూపంలో స్త్రీ పురుషు లిరువురూ పాల్గొంటారు. స్త్రీలకంటే పురుషులయొక్క కోలాటనృత్యం వుధృతంగా వుం టుంది; స్త్రీలకోలాటం లాలిత్యంగా వుంటుంది.

కోలాటపు చిరతల్ని కోలలంటారు. ఒక్కొక్కరూ రెండేసి చిరతల్ని రెండు చేతులా ధరించి ఒకరి కొకరు లయప్రకారం అడుగుల ననుసరించి ఆయా పాటల గమకాలమేరకు ఒకడు ప్రధానుడై పాటపాడితే మిగతా బృందం వా రందరూ అతనిని అనుకరిస్తారు. కోలాట నృత్యాలను గురించి మరోచోట వివరంగా వివ రించాను.

ఆంధ్రదేశంలో కోలాటాలు ఎంత ప్రచారంలో వున్నాయో తెలంగాణాలో కూడా అంత ప్రచారంలోనూ వున్నాయి. బి. రామరాజుగారి వ్యాసరచనమునబట్టి స్త్రీ పురుష లిరువురిలోనూ కోలాట నృత్యప్రభావం చాలా ఎక్కువగా వున్నట్లు విశదమవుతూ వుంది.

కోలాటపు పాటలు ఎక్కువగా సంవాదరూపంలోనూ, శృంగార రసప్రధానా లుగాను వుంటాయి. మరి కొన్ని పచ్చి శృంగారంతో నిండివుంటాయి. స్త్రీల కోలాటపు పాటల్లో గోపికలు చిలిపి కృష్ణుని దుందుడుకు చేష్టలకు విసిగి కృష్ణుని తల్లి యశోదతో మొరపెట్టుకుంటారు.

# బతుకమ్మ, బొడ్డెమ్మ పండగలు

ఆంధ్రదేశంలో ఎక్కడా ప్రచారంలో లేకుండా ఒక్క తెలంగాణాలో మాత్రం విశేష ప్రచారాన్ని పొందింది బతుకమ్మ పండుగ. ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నుండి మహర్నవమివరకు తొమ్మిది రోజులు ఈ పండుగ జరుగుతుంది.

బతుకమ్మ పండుగకు పూర్వమే తొమ్మిదవరోజు బొడ్డెమ్మ పండుగ జరుగుతుంది. ఇది మహాలయ అమావాస్యతో పూర్తి అవుతుంది. బొడ్డెమ్మ కన్యా కల కారాధ్యదైవము. ఈ వుత్సవాల్లో పెద్దలు అంతగా పాల్గొనరు.

పుట్టమన్నుతో ఒక బొమ్మనుచేసి బహుళ పంచమినాడు ప్రతిష్ఠించి దాని పైన ఒక కలశాన్నివుంచి, కలశంపై పసుపు ముద్దతో గౌరమ్మను నిలిపి పూల తోను, పసుపుతోను అలంకరిస్తారు. ఈ విధంగా ప్రతి యింటిలోను చేయక పోయినా గ్రామానికి ఒక గృహంలో చేసినా సరిపోతుందని వారి అభిప్రాయం.

బొడ్డెమ్మను నిలిపిన తరువాత ఆ వాడలో ఉన్న ఆడపిల్లలందరూ అక్కడ గుమికూడతారు. ఈ వినోదాన్ని చూడడానికి పెద్దలందరూ, వస్తారు. ఎవరో ఒకరు పాట ప్రారంభిస్తే మిగతా కన్యలందరూ చేతులు తట్టుతూ బొడ్డెమ్మచుట్టూ తిరు గుతూ, ఈ విధంగా పాడుతారు:

మాలుమర్తి మేడమీద చందమామా . .వెండియ్యవేనగరలు ॥చం॥
వెండియ్యవే నగరలకు . ఇత్తడియ్య బేరీలు
ఇత్తడియ్య బేరీలకు . రాగియ్య కడుపలు
రాగియ్య కడుపలకు . ముత్యాల ముగ్గులు
ముత్యాలముగ్గులకు . వజ్రాల వాకిండ్లు
వజ్రాలవాకిండ్లకు పవడాల పందిళ్ళు
పవడాల పందిళ్ళకు మంచినీళ్ళ బావిపుట్టె
మంచినీళ్ళ బావిప్రక్క . మంచి మల్లెచెట్టుపుట్టె
కోసేవారెవరు లేక కొండెత్తు పెరిగిపోయె
కోయించు చందప్ప పంచిపెట్టు గౌరమ్మ.

ఈ విధంగా ఎన్నోపాటలు పాడుతారు. తొమ్మిదవనాడు బొడ్డెమ్మ నర్చించి కలశంలో వాడపిల్లలు ప్రతి దినం తెచ్చిపోసే బియ్యం పరమాన్నం వండి పంచి పెట్టి ఒక బావిదరిచేరి,

బొడ్డెమ్మ బొడ్డెమ్మ బిడ్డలెందారే,
బావిలపడ్డవారికి బారిద్దరమ్మా,
చెర్లబడ్డవారికి చేరిద్దరమ్మా,
కుంట్లబడ్డవారికి కోరిద్దరమ్మా,
నిద్రబో బొడ్డెమ్మ నిద్రబోవమ్మా,
నిద్రకూ నూరేండ్లు నీకు వెయ్యేండ్లు,
నినుగన్న తల్లికి నిండ నూరేండ్లు.

అంటూ బొడ్డెమ్మను నీటిలో వదలుతారు. బొడ్డెమ్మ పండుగలో పాడబడే పాటలు ఇంకొ కొన్నివందలున్నట్లు రామరాజుగారు తెలియజేస్తున్నారు.

**బతుకమ్మ :**

బొడ్డెమ్మ పండుగ తరువాత వచ్చేపండుగ బతుకమ్మ పండుగ. దీనినే బతకమ్మ పండగని కూడా ఈనాడు పిలుస్తున్నారు. గ్రామసీమల్లో వుండే రకరకాల

పువ్వులతో బతుకమ్మను పేర్చి దాని పైన పసుపుతో తయారుచేసిన గౌరమ్మను నిలుపుతారు. ముత్తైదువులందరూ అడుగులకు మడుగు లొత్తుతారు. పసుపు కుంకుమలతో సింగారనింపి పగటిపూటనే బతుకమ్మలను పీటలపై ప్రతిష్ఠించి సాయంకాలం నాలుగు గంటలకు పిన్నలు పెద్దలు వారికున్న వస్త్రాలనూ, భూష ణాదులనూ ధరించి, అందరూ బతుకమ్మ బొమ్మలను తీసుకుని ఊరిబయట వుండే కాలువకో, చెరువుకో, బావికో వెళ్ళి బ్రతుకమ్మలను మధ్యనిలిపి, అందరూ చుట్టూ గుమికూడి వలయాకారంగా తిరుగుతూ చప్పట్లు చరుస్తూ పాటలు పాడుతూ వంగి లేస్తూ గంతులువేస్తూ పాటలు పాడుతారు ఈ వుత్సవాన్ని తిలకించడానికి గ్రామంలో వున్న ఆబాలగోపాలం పిన్న పెద్దలందరూ వస్తారు. మొగపిల్ల లందరూ వసంతా లను గొట్టాలలోచేర్చి ఆటపాటల్లో నిమగ్నమైన వా రందరిపైనా ప్రయోగిస్తారు.

ఇలా వలయాకారంగా తిరిగే పెద్దపెద్ద వరుసలు దీరిన జట్టులు, విశాల రంగమంతటా వుంటాయి. అందరూ ఇలా బతుకమ్మ పాటలను పాడుతూవుంచే కనులపండువుగా వుంటుంది. ఈ పాటల్లో లక్ష్మీ, పార్వతుల స్తోత్రములేగాక పౌరాణిక గాథలు కూడా అనేకం వున్నాయి. బతుకమ్మ పాటలు కొన్ని ముద్రిం చారు. అముద్రితాలు ఎన్నో వున్నాయి. వీటిలో ఓరుగల్లు సమీపానికి జెందిన మొగిలిచర్ల గ్రామస్థుడు ఈ క్రింది పాటను రెండువందల సంవత్సరాలక్రితం రచించాడు.

శ్రీలక్ష్మిదేవియు చందమామ సృష్టి బతుకమ్మయ్యె ॥చం॥
పుట్టినా రీతి జెప్పె భట్టు నరసింహకవి
ధరచోళదేశమున . .ధర్మాంగుడనురాజు
ఆరాజు భార్యయు. .అతి సత్యవతియంద్రు
నూరునోములు నోమి.. .నూరుమందినిగాంచె
వారు శూరులయ్యు. ..వైరులచె హతమైరి
తలిదండ్రులపుడు. . తరుగనీ శోకమున
ధనరాజ్యముల బాసి... దాయాదులను బాసి
వనితతో అరాజు... వనమందు నివసించె
కలికి లక్ష్మినిగూర్చి....ఘనతపం బొనరించె
ప్రత్యక్షమై లక్ష్మి....పలికె వరమడుగుమని



తెలంగాణాలో యక్షగాన రచన 18-వ శతాబ్దంలో విరివిగా సాగింది. యక్షగానాలకు ప్రదర్శనరూపంలో గాక పురాణ పఠనం మాదిరి పారాయణం ద్వారా ప్రారంభదశలో ప్రచారం జరిగింది.

1780 లో రచింపబడిన శేషాచల కవి ధర్మపురిరామాయణం, 1834 నాటి ముద్దకవి మంధెనరామాయణం ఈ కోవకు చెందినవే.

ఆనాడు ధర్మపురి రామాయణం ఒక్క తెలంగాణాలోనేగాక సర్కారు ఆంధ్రదేశమంతటా వ్యాప్తిలో వుంది. ఆంధ్రదేశపు ప్రదర్శకులు అందులోని దరువుల్ని చక్కగా వినియోగించు కున్నారు.

ఎటుతిరిగీ 19-వ శతాబ్దపు ఉత్తరార్థంలోనే యక్షగాన ప్రదర్శనాలు రంగ స్థలమెక్కాయి. ఈ కాలంలో శేషభట్టరు కృష్ణమాచార్యులు, గోవర్ధనం నరసింహా చార్యులు, దట్టెము పాపకవి మొదలైనవారు యక్షగానాలను వ్రాశారు.

## మహారాజపోషణ :

ఆనాడు యక్షగానకవుల్ని మహారాజు పోషించారు. ఆత్మకూరు సంస్థానాధీశుడైన ముక్కర సీతారామ భూపాలుడు రామదాసనే కవిచేత 'తారాశశాంకము', 'భీమసేన విలాసం' అనే యక్షగానాలను వ్రాయించారు.

ఈ సమయంలోనే గోవర్ధనంవారి గొల్లకలాపం, రూప్ఖాన్‌పేట రత్నమ్మ గారి కురవంజి వెలువడ్డాయి.

## యక్షగాన రచనలో అందెవేసిన చేయి :

20-వ శతాబ్దం నాటికి తెలంగాణాలో యక్షగానాలు రచనలోనూ, ప్రదర్శనలోనూ గణుతికెక్కాయి. పల్లెగ్రామాలలో ప్రజలు పదాలుకట్టి పాడుకుంటూ వుండే వారు. కాంభోజరాజు, బాలనాగమ్మ, పెదబొబ్బిలిరాజు కథ, ఆరెమరాఠీల కథ మొదలైన యక్షగానాలు బహుళ ప్రచారాన్ని పొందాయి. చెర్విరాల భాగయ్యగారు

ప్రదర్శనయోగ్యమైన యక్షగానాల రచనలో అందెవేసినచేయిగా పేరుపొందారు. ఈయన రచించిన యక్షగానాలు 32. ఇన్ని యక్షగానాలను వ్రాసిన కవి మరొకరు ఆంధ్రదేశంలో లేరంటే అతిశయోక్తి కాదు. ఈయన అనేకమంది యక్షగాన కవులకు గురుతుల్యుడుగా ఎంచబడ్డాడు.

ఈనాడు తెలంగాణా యక్షగాన కవులలో ప్రసిద్ధులైనవారు బూరుగపల్లి సోదరులు. వీరి కృతులను నాటకా లనే వ్యవహరించారు.

పట్లోరి వీరప్పగారి 'రైతువిజయం' సామ్యవాద సిద్ధాంతానికి అనుగుణంగా రచించబడింది.

తెలంగాణాలో యక్షగాన వాఙ్మయమూ, యక్షగాన ప్రదర్శనాలూ, ఆలస్యంగా ప్రారంభమైనప్పటికీ ఆంధ్రదేశపు యక్షగాన చరిత్రలో ఒకస్థానాన్ని సంపాదించుకున్నాయి.

# తెలంగాణా జానపద కళారూపాలు

అనేక సంవత్సరాలుగా నైజాం ప్రభువు బానిసత్వంలో క్రుగ్గిపోయిన తెలంగాణా ప్రజల వినోద కళా రూపాలు సర్కారు, రాయలసీమ ఆంధ్రప్రజలకు అంతగా తెలియవు. ఆంధ్ర ప్రాంతంలో జానపద కళా రూపాలూ, నాటకరంగమూ అభివృద్ధి అయినంతగా తెలంగాణా ప్రాంతంలో కాలేదు. అక్కడక్కడ శిథిలమై జీర్ణావస్థలోఉన్న జానపద కళారూపాల వివరాలు కూడ మనకు సరిగా తెలియవు. ఈ విషయంలో శ్రీ బి. రామరాజుగారు అద్భుతమైన కృషిచేశారు. కొన్ని కళా రూపాలనుగురించి సముద్రాల గోపాలమూర్తిగారు 'నాట్యకళ'లో వుదాహరించారు.

**హద్దులు,**

**అదుపులు :**

ఆనాటి సంఘపెద్దలు ఈ జానపద కళారూపాలకు కొన్ని హద్దుల్ని నిర్ణయించారు. నృత్యనాటకాలు కేవలం వినోదాలే నని, అవి కూడ సానివారల సొత్తులే నని, ఇతరులు వాటిని ఆదరిస్తే, సంఘ బహిష్కారం కులబహిష్కారంగావిస్తామని బెదరించేవారట. అంతే గాక ప్రభుత్వ అనుమతిలేకుండా ఏ ప్రదర్శనా ప్రద

క్షించడానికి వీలులేదు. అందువల్ల ఆ ప్రాంతంలో కళారూపాలు ఒక స్థాయికిమించి అభివృద్ధి పొందలేకపోయాయి.

ప్రతి ప్రాంతంలోను జానపద కళారూపాలను, ఆయా జాతులు, కులాల వారు ఏ విధంగా పోషిస్తూ వచ్చారో అదే విధంగా తెలంగాణాలో ఒక్కొక్క తెగ ఒక్కొక్క కళారూపాన్ని పోషిస్తున్నాయి. ఒక తెగవారు మరో తెగవారిని వినోద పరుస్తూ వుంటారు. అలాగే ఒక తెగవారు మరొక తెగవారికి ఆచార్యులుగానూ గురువులుగానూ వ్యవహరిస్తూ వుంటారు. జానపద కళారూపాలలోవున్న విశేష మేమిటంటే కళద్వారా అనేక క్లిష్టమైన మహత్తర విషయాలను తేలికభాషలో, సూటిగా, ప్రజలకు అర్థమయ్యేటట్లు సునిశితమైన రీతిలో, సుబోధకంగా వివరింప జేయడమే జానపద కళ విశిష్టత. ఈ జానపద కళా రూపాలలో పండితులకు సునిశిత హాస్యాన్నీ. పామరులకు మొరటుహాస్యాన్నీ ప్రవేశపెట్టి రంజింప చేశారు. ఈనాడు తెలంగాణంలో బంజారా అనే తెగలవారు ఈ జానపద కళను ఆదరిస్తున్నట్లు గోపాలమూర్తిగారు వ్రాస్తున్నారు.

వారిలో రాజగోండ్—ప్రధాన్—లంబాడి—మధురా—కొలామ్—మొదలైన శాఖలు. ఇలాగే సామాన్య తెగలకు చెందినవారు విప్రవినోదులు—సాధనా శూరులు—బైండ్లవారు—చిన్న మాదిగలు—గంటె భాగవతులు—కాటిపాపలు—కట్టెబొమ్మలు—బగ్గుగొల్లలు—పంచాల—మిత్తలయ్యవారు—ముస్లిం సాంప్రదాయాలకు సంబంధించినవారు, ఖవ్వాలీ, నౌబత్ ఖానా—తాషామర్ఫా మొదలైనవి.

## సాధనా శూరులు

పద్మశాలీలను మాత్రమే అర్థించే వీరిని సాధనాశూరులని పిలుస్తూ వుంటారు. వీరి ప్రదర్శనాలను అందరికీ ప్రదర్శిస్తారు. ఒక గ్రామంనుంచి మరో గ్రామానికి సంచారంచేస్తూ ప్రతి గ్రామంలోని పద్మశాలీల అనుమతితో వీరు ప్రదర్శనలు ప్రారంభిస్తారు. వీరి ప్రదర్శన ఇంద్రజాలానికి సంబంధించింది. వీరి ప్రదర్శనం పగటి వేళ జరుగుతుంది. దీనిని పగటివేషంగా భావించవచ్చు. వీరి ప్రదర్శనకాలం 3 గంటల వరకూ వుంటుంది. వీరి రంగస్థలం గ్రామకూడలిలోనున్న విశాల స్థలంలో జరుగుతుంది. వీరి కళా రూపాలసాధనకు నిష్ఠ అవసరమంటారు. వీరి పనులు కనికట్టు గారడీలా వుంటాయి. ఉదాహరణకు వీరి ప్రదర్శనలో ఇరువురు వ్యక్తులు రెండు రేకు పళ్ళెములు తీసుకుని చేతులకు ఏదో ఆకుపసరు పూసుకుని

దూరంగా నిలబడతారు. తాము వేసుకుని పూసుకున్న పసరు ప్రభావంవల్ల వారి హస్తాల్లోవున్న పళ్ళెంబు ఒక్కసారి పైకెగిరి రెండు పళ్ళెములూ తప్పుకుని మరల యధాస్థానాన్ని చేరుకుంటాయి.

అలాగే మరో వ్యక్తి బొమ్మమీద ఒక ప్రత్యేకమైన ఆకును అతికించి ఆ ఆకును గురిచూచి కొట్టవలసిందిగా ఒక తుపాకిని ప్రేక్షకులలో ఎవరు ముందుకు వస్తే వారికిచ్చి బొమ్మమీది ఆకును గురిపెట్టి కొట్టమంటారు. అలా గురిచూచి ఎవరైనా కొట్టినట్లయితే ఆ గుండు బొమ్మలోపలి భాగానికి పోక ఆ ఆకును కొట్టుకుని అక్కడే పడిపోతుంది. ఆ ప్రదేశంలో ఏవిధమైన గాయమూ మనకు కనబడదు. ఇది కనికట్టో, ఆకుపసరు ప్రభావమో, లేక ఇంద్రజాలమో మనకు తెలియదు గాని వారు ఇలాంటి ప్రదర్శనలో నిజంగా సాధనాశూరులే. ఈ సాధనాశూరులు ప్రస్తుతం కరీంనగర్ జిల్లాలోని హుజూరాబాద్ తాలూకా వల్లభాపురంలో వున్నారు. ఈ ప్రదర్శన ద్వారా వీరు జానపదులను దిగ్భ్రాంతులను చేస్తారు.

# గంటె భాగవతులు

ఆంధ్ర ప్రాంతంలో వున్న గంటె భాగవతులకు, తెలంగాణా గంటె భాగవతులకు వ్యత్యాసముంది. ఈ గంటె భాగవతులు కరీంనగర్ జిల్లా 'కాదురుపాక'లో వున్నారు. వీరి ప్రదర్శనం రాత్రిపూటే జరుగుతుంది. వీరి ప్రదర్శన సాహిత్యమేమో మనకు తెలియదుగాని, వీరి ప్రదర్శనం మాత్రం ప్రాముఖ్యంగా ప్రదర్శించటానికి ఈ గంటెల నుపయోగిస్తారు. వీరి ప్రదర్శనంలో వచ్చే ప్రతి పాత్రధారి చేతిలోనూ ఒక గరిటె వుంటుంది. అందులో చమురుపోసి, ఒత్తివేసి వెలిగిస్తారు. ప్రతిపాత్రయొక్క హావభావాలూ, ఆంగికచలనాలూ ఈ గరిటె వెలుతురువల్ల ప్రేక్షకులకు విశదంగా వెల్లడౌతాయి. మధ్య మధ్య నటనను సాగిస్తూ గంటెలలోని వత్తి ఎగదోస్తూ వుంటారు. ఈ వత్తుల వెలుతురువల్ల ముఖంలో ప్రతిబింబించే సాత్వికాభినయానికి ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తారు. ప్రాచీనులు ఈ పద్ధతిని



జేగంట భాగవతుడు

అనుసరించేవారు. అంటే ఆనాటికి ముఖానికే ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చినట్లు మనం తెలుసుకోవచ్చు. ప్రతివారి చేతిలోనూ గరిటె వుంటుంది. కాబట్టి, ఆ గరిటె ప్రాముఖ్యంతోనే భాగవతాలను ప్రదర్శిస్తారు. కాబట్టే, వారికి గరిటె భాగవతులనీ, గంటె భాగవతులనీ పేరు వచ్చింది.

## కాటిపాపలవాళ్ళు

కాటిపాపలవారు ఆంధ్ర ప్రాంతంలో కూడ వున్నట్లు వినికిడి. కాటిపాపలవాళ్ళు మచ్చుజల్లి పిల్లల్ని ఎత్తుకపోతారని భయపెట్టేవారు. ఈ కాటిపాపలవారు మెదక్ జిల్లా జహీరాబాద్ తాలూకాలో వున్నారు. వీరిదికూడ ఇంద్రజాల ప్రదర్శనమే. ప్రజలను భయకంపితులనుగా చేసే కళారూపమిది. వీరి వేషధారణ అతి గంభీరమైనది. ఈ ప్రదర్శకుడు రంగు రంగుల దుస్తులు ధరిస్తాడు. రెండు మూడు పెద్ద పెద్ద గంటలను వ్రేలాడదీస్తాడు. నడుస్తూంటే ఈ గంటల చప్పుడు ఏదో ఒక ఏనుగువస్తున్నట్లుగా భీతిపుడుతుంది. నొసటన పెద్దబొట్లు, వడితిరిగిన బుర్రమీసాలు, శూకలమాదిరిగా చిత్రించిన రేఖల, కిరీటం చంకజోలె, చేతిలో ఎముకలు పుచ్చుకుని భూతవైద్యుడులా ప్రవేశిస్తాడు. కూర్చున్నచోటల్లా, నోటిలో నుంచి నాలుగైదుపౌనుల బరువుగల పెద్ద పెద్ద గుండ్లను, విగ్రహాలను, ఇతర సామానులను నోట్లోనుంచి పుట్టిస్తాడు. కీళ్ళలోనుంచి మేకులను తీస్తాడు. ఈ ఈ ప్రదర్శనం కూడ ప్రజలను ఆశ్చర్యచకితులను చేస్తుంది.

## బైండ్లవారు

వీరశైవ మతస్థులకు వినోదాన్ని కల్పించే వీరిని బైండ్లవారని అంటారు. కులాలూ మతాలవారీగా, ఆచార్యులూ, కళాకారులూ వున్నట్లు వీరు కేవలం శైవమత స్థులకే వినోద ప్రదర్శనలిస్తారు. వీరు శైవమతస్థుల ఇండ్లలో, పెండ్లి మొదలైన శుభకార్యాలలోనూ, చావు మొదలైన దుర్దినాలలోనూ కథలను చెపుతారు. పెండ్లికి, చావుకి వేరువేరుగా వాయిద్యాలను వాయిస్తారు.

## కోలాట నృత్యం

పాల్కురికి సోమనాధుడు కోలాటాన్ని కోలాటగొడియ అని వర్ణించాడు. ఇతర అనేక నృత్య విశేషాలను వర్ణించినంతగా కోలాట గొడియను గూర్చి అంతగా

వివరించనందువల్ల సోమనాథుని కాలానికి కోలాటాలు అంతగా అభివృద్ధి పొంద లేదని వూహించవచ్చు. కాని విజయనగర సామ్రాజ్యకాలంలో ఈ కోలాటాలు ప్రసిద్ధంగా ప్రదర్శించినట్లు విదేశ యాత్రికుడు అబ్దుల్‌రజాక్ వర్ణించిన విషయం



తెలిసిందే. ఈనాటికీ విజయనగర శిధిల శిల్పాలలోనూ, శ్రీశైలం దేవాలయ ప్రాకారపు గోడలపైనా కోలాటంచేసే నర్తకురాండ్ర శిల్పాలున్నాయి.

తెలుగుదేశపు జానపద నృత్యాలలో కోలాట నృత్యాన్ని పిన్నలు మొదలు పెద్దలవరకూ చేస్తూవుంటారు. ప్రతి బాలికా పాఠశాలలోనూ ఆటవిడుపు కార్యక్రమంలో నృత్యాన్ని ప్రదర్శిస్తూ వుంటారు. నోటితో నృత్యం, చేతి చిరతలతో తాళం ఏకకాలంలో జరుగుతూ వుంటాయి. ఇందులో జడకోపు కోలాటం చాల ప్రజ్ఞతో ప్రదర్శిస్తారు.

## జడకోపు :

సమసంఖ్యలో అందరూ అన్నిత్రాళ్ళూ పట్టుకుని గుండ్రంగా నిలుస్తారు. వీరు రెండు పక్షాలుగా చీలుతారు. రెండు పక్షాలకూ ఇద్దరు నాయకులుంటారు. వారు లయప్రకారం రెండు భాగాలుగా విడివడివారు నిలబడిన కేంద్రంనుంచి మరోకేంద్రానికి ఒకరి తరువాత మరొకరు వరుసక్రమంలో తిరగడంతో ఈ త్రాళ్ళన్నీ అల్లబడిన జడలాగా ఎంతో సుందరంగా కినబడుతుంది. ఇలా జడను అల్లడం ప్రారంభించి జడ పూర్తి అయ్యేవరకూ పాటపాడుతూ అల్లుతూనే వుంటారు. ఈ అల్లికలో ఏ ఒక్కరు తప్పుగా నడిచినా జడ చిక్కైపోతుంది. అందువల్ల ప్రతి ఒకరూ వరుస తప్పకుండా నిపుణతతో జడను అల్లుతారు. ప్రారంభంలో ఈ అల్లడం నిదానంగా సాగుతుంది. తరువాత అతివేగంగా అల్లబడుతుంది. ఈ వేగంలో కోలాటనృత్యం ప్రేక్షకులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. ఇలా జడకోపు పూర్తి అయిన తరువాత

అందరూ ఒక పుష్పాకారంలో దగ్గరకు చేరుకుంటారు. ఆ తరువాత జడను ఎలా అల్లుకొచ్చారో అలాగే మరల ఎదురు తిరిగి జడను విడదీస్తారు. జడను అల్లినంత కష్టం వూడదీయడంలో వుండదు. విడదీయడం అతి వేగంగా జరుగుతుంది. ఈ విధానం ఎంతో కనులపండువుగా వుంటుంది. ముఖ్యంగా బాలికల్ని ఒకే ఎత్తు కలిగినవారిని కోలాటానికి ఎంచుకుంటారు. అందరూ వాలుజడలు వేసి రంగురంగుల పూలు ధరిస్తారు. ఒకే రంగుగల లంగాలు, చొక్కాలు, తొడుగుతారు. రంగు రంగుల కోలాటపు బిరతలు ధరించి వలయాకారంగా తిరుగుతూవుండే ఇంద్ర లోకంలో దేవతలు నృత్యం చేస్తున్నారా అనిపిస్తుంది.

గొంతులు కలిసిన ఇద్దరు బాలికలు పాట ప్రారంభిస్తే, దళంలోని వారందరూ ఒక్కసారి గుమ్మగా అందుకుంటారు. ఇలా పాడే బృందగానం చెవులకెంతో ఇంపుగా వుంటుంది. వీరి జడకోపు ప్రదర్శనం శాస్త్రయుక్తమైన భరత నాట్యంలో ఒక భాగంగా కనిపిస్తుంది.

ఈ కోలాటానికి ఎప్పుడూ సమసంఖ్యలో వ్యక్తులు వుండాలి. 8 మంది గాని, 12 మంది గాని, 16 మంది గాని, 24 గురుగాని వుండవచ్చు. సంఖ్య ఎంత పెరిగితే ఈ నృత్యం అంత రంజింపుగా వుంటుంది. ఈ నృత్యాన్ని ఒక వ్యాయామ క్రీడగా ప్రతి సాయంత్రమూ డ్రిల్లు క్లాసులో వేయిస్తూ వుండేవారు వీరి కోలాట ప్రారంభంలో ఎక్కువగా ఈ పాట పాడుతూ వుంటారు.

అటవిస్తళముల కరుగుదుమా,
పటపత్రంబులు కోయుదుమా,
చందన గంధము తీయుదుమా,
సఖియజాక్షి మెడ పూయుదుమా,
కోలాటంబులు వేయుదుమా,
కోరికదీరంగా మనము.

ఈ విధంగా కోలాటంలో పాటలు పాడుతూ నృత్యంచేస్తూ ప్రేక్షకులందర్నీ ముగ్ధుల్ని చేస్తారు.

**చుట్టుకోపు,**

**కోలాటం కీర్తన :**

గోపిక, కృష్ణుల, సంవాదం.

గోపిక : గొల్లవారి వాడలాకు కృష్ణమూర్తీ,
నీవేమిపనుల కొచ్చినావు కృష్ణమూర్తీ॥ గొల్ల॥

కృష్ణుడు : పాలుకొన వచ్చినానె గొల్లభామా,
మంచి పాలుపోసి పంపించు గొల్లభామా॥ గొల్ల॥
గోపిక : కొత్తకోడలనయ్యా నేను కృష్ణమూర్తీ
మా యత్తగారి నడుగుమయ్యా కృష్ణమూర్తీ॥ గొల్ల॥
కృష్ణుడు : కొత్తకోడలైతేనేమి గొల్లభామ
నా రొక్కమిచ్చి పుచ్చుకోండే గొల్లభామా॥ గొల్ల॥
గోపిక : నీ రొక్కము మా కొద్దయ్యా కృష్ణమూర్తీ
నీవు రంపుచేయక మళ్ళుమయ్యా కృష్ణమూర్తీ॥ గొల్ల॥

చక్రం కోపు :

ముంగటేరు దున్నువాడ
ముద్దుల మేనత్తకొడుక
దాపటెద్దుకు దప్పికాయెను
ఓ రందకాడ నరసయ్యా బావ
సీలదిప్పి నీలబెట్టబ్బి॥ ఓరందకాడ॥
దూరాబారము దున్నబోకు, దిబ్బలెక్కి చూడలేను
వూరుముంగట వులవచల్లబ్బ
ఓ రందకాడ నరసయ్యాబావ
వులవకోతకు పిలువనంపబ్బ
నూగునూగు మీసమోడ
నువ్వుచేకాచేనువోడ
నాకుచేరెడు నువ్వులంపబ్బ
ఓ రందకాడ నరసయ్యాబావ
చిమ్మిడి వుండలు చేయగలనబ్బ॥ ఓరంద॥
ఏటి అవతల చిన్నవాడ
వెనకలేరు దున్నువాడ
తెప్పగట్టి తేలిపోదాము
ఓ రందకాడ నరసయ్యాబావ
ముప్పతిప్పలు మూల్గులేలబ్బి.

**పెద్దల కోలాటాలు :**

పైన చర్చించిన కోలాటం చిన్న పిల్లలలోనే గాక, పెద్దలలో కూడ వ్యాప్తిలో వుంది భక్తిభావంతో ఈ నృత్యాన్ని ఎక్కువగా చేస్తూవుంటారు. పొడుగైన కోలాటపు చిరతలతో ఎగిరి ఎగిరి పల్టీలుకొడుతూ, కూర్చుని లేస్తూ, వెనుకకు గిఱ్ఱున తిరుగుతూ, వేగంగా గిరికీలు కొడ్తూవుంటారు. కోలాట ప్రారంభంలో 'ఇడతయ్యకు తాధిమితా' అని చిరతలతో తాళం తెగగొట్టి ప్రారంభిస్తారు వీరు కూడ నోటితో పాటనూ కాళ్ళతో నృత్యాన్నీ చేస్తూవుంటారు. అందరూ ఒకే రంగు పంచెలు ధరించి గోచీలుమడిచి సైకిల్ కట్టులో అందంగా కడతారు. ఒకే రంగు కలిగిన బనియన్లు తొడుగుతారు. అందరూ తలకు చక్కని రంగు తల గుడ్డలుగాని, రంగు టోపీలుగాని ధరిస్తారు. లేదా చక్కని గిరజాలజుట్లు పెంచు తారు. జట్టునాయకుడు పాటపాడుతూ వుంటే మిగతా సభ్యులందరూ వంత పాడు తారు. తాళం దురితంగా నడిచే సమయంలోగాని, కూర్చుని లేచేటప్పుడుగాని, ఎగిరి గెంతి గిఱ్ఱున తిరిగే సమయంలోకాని, జట్టునాయకుడు ఈలతోగాని, మరో కేకతో గానీ సంజ్ఞ చేస్తాడు. ఆ సౌంజ్ఞను అందరూ వెంటనే ఆచరణలో పెడతారు.

ఈ కోలాట నృత్యాలు పల్లెల్లో పనిలేని రోజుల్లో రాత్రిళ్ళు ప్రొద్దుపోయే వరకూ చేస్తూవుంటారు. భక్తిభావంతో దేవుని స్తంభాన్ని పట్టుకుని ఇంటింటికీ తిరిగి ప్రతి ఇంటిముందూ కోలాటం ప్రదర్శిస్తారు. ఈ కోలాట నృత్యాలను పెద్ద పెద్ద తిరుణాళ్ళ సమయాల్లోనూ, దసరా వుత్సవాలలోనూ బహిరంగంగా వీధుల్లో ప్రదర్శిస్తారు.

రెండవ ప్రపంచ యుద్ధప్రారంభపు రోజుల్లో హిట్లరు మాస్కోను పట్టు కోవటానికి చేసిన ప్రయత్నాలను గురించి ఆంధ్రప్రజా నాట్యమండలి దళాలు ఈ కళారూపంద్వారా ఆంధ్రప్రదేశ మంతటా ఈ విధంగా ప్రచారం చేశారు.

మాస్కో పొలిమేరలోనా-మారణ యంత్రాలునిలిపి
మాడ్చివేసెరా-రెడార్మీ కూల్చివేసెరా॥

అంటూ హిట్లరు ఫాసిస్టు చర్యలన్నిటినీ, ఈ కోలాటంపాట ద్వారా ప్రచారం చేశారు. ఇదే కోలాటంలో.

ఖండ ఖండాంతరాల భరతమాత, నీవు
ఖ్యాతిగన్న తల్లివమ్మ భరతమాత,

అంటూ దేశభక్తిని ప్రబోధించారు. కోలాటం ఒక సమిష్టి నృత్యం. అది ఒక సమిష్టి బృందగానం, అది ఒక వ్యాయామ క్రీడ. ఈ కోలాట నృత్యాలను సంగీతనాటక అకాడమీలాంటి సంస్థలు పూనుకుని పునరుద్ధరించాలి,

# దొమ్మరాటలు

ఆనాటికీ, ఈనాటికీ గ్రామాల్లో ఇతర వినోద కార్యక్రమాలతోపాటు దొమ్మరాట సర్కసు కూడ ప్రాచీనకాలంనుంచీ తెలుగు దేశంలో వర్ధిల్లుతూ వచ్చింది.



దొమ్మరవారు గ్రామాల్లో నాలుగు వీధులూకలిసినచోట, ఒక పొడవైన వెదురుగడను మధ్య పాతి డోలు వాయిద్యాన్ని ప్రారంభించి గ్రామప్రజలను ఆకర్షించే వారు, చిత్ర విచిత్రమైన వినోదాలతో సర్కసు పను లనుచేస్తూ తమ తమ నైపుణ్యంతో ప్రజలను ఆశ్చర్య చకితులనుజేపి, వారి వద్దనుండి డబ్బును, ధాన్యాన్ని, వస్త్రాలను వసూలు చేసుకునేవారు. ఈ దొమ్మరాటలు పూర్వకాలంనుంచీ వున్నట్లు 13 వ శతాబ్దానికి చెందిన పాల్కురికి సోమనాధుడు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో

అమరాంగనలు దివినాడెడుమాడ్కి
నమరంగ గడలపై నాడెడువారు.

అని వర్ణించాడు. (పర్వత ప్రకరణం, 434)

పై రెండు పాదముల వర్ణనప్రకారం దొమ్మరసానులు వెదురుగడలపైన ఆకాశంలో అప్సరసలు ఆడుతున్నారంత భ్రమను కలిగించే వారట. అంటే వా రుపయోగించే వెదురుగడలు అంత పొడవైన వన్నమాట.

దొమ్మరసానులు పురుషులతోబాటు భూమిమీద వివిధ రకాల పిల్లిమొగ్గలు మొదలైన చిత్ర విచిత్ర ప్రదర్శనాలతో ప్రేక్షకుల్ని దిగ్భ్రమలో ముంచేవారు. చూచేవారికి వారి ఆటలు భయాన్ని కలిగించేవి. వారి ఆటలు పాతినగడమీదనేకాక,

గడను పురుషులు ఎదురురొమ్ముమీద, నొసటిమీద నిలబెట్టి, ఆ గడలపై దొమ్మర సానులతో తమతమ విద్యల్ని ప్రదర్శింప జేసేవారు.

దొమ్మరిసానుల ఆటను శ్రీహర్షుడు సంస్కృత నైషధంలో అలంకారికంగా వర్ణించినట్లు శ్రీనాధుడు శృంగార నైషధంలో ఈ విధంగా వివరించాడు

ఈ సకలాపనీ తలము వెక్కటిదాన పరిభ్రమించి, య
భ్యాస వరంపరాపరత నభ్రమునన్ విహరింపగోరి యో
లాసిక కీర్తి విభ్రమకలాగరిమ న్నటియించుచుండు నీ
థానుతు వంశరత్నము దిరంబుగ జెంది యమందలీలలన్.

(శృంగార నైషధం. 5 ఆశ్వా 118 పేజీ

అలాగే,

సంతవెన్నడో జవ్వనమమ్మ
కొన్న గడసాని నమం గవయందలంచీతే.

అని. ఊర్వశి పేర్కొన్న గడసాని ఇటువంటిదే అని నాచనసోముని ఉత్తర హరివంశం 1 - 74 పద్యంలో ఉదాహరింప బడిందని (పి. యస్. ఆర్. అప్పారావుగారు 'సూత్రధారి' పత్రికలో వుదాహరించారు.

విజయనగరరాజుల కాలంలో మహర్నవమీ వుత్సవాలలో, దొమ్మరాటలు మొదలైన చిత్ర విచిత్రాలను ప్రదర్శించడంతోపాటు ఏనుగులు-పులులు-సింహాలు మొదలైన క్రూరమృగాలతో సర్కసుపనులు చేయించేవారిని విదేశీ యాత్రికుడైన అబ్దుల్ రజాక్ వర్ణించినట్లు భావరాజు కృష్ణారావుగారు 'విదేశయాత్రికులు— ప్రాచీనాంధ్రదేశం 191-192 పేజీలలో వుదహరించారు.

అంతేగాక బాపల విద్యలేవీ కూడ దొమ్మరివిద్యలతో సరిపోలవని చంద్రశేఖరుడు చంద్రశేఖర శతకంలో ఈ విధంగా వివరించాడు :

మెద్దుగ దొమ్మరెక్క, గన
మించిన యిద్దమరేదలేదు, నా
తెడ్డాక బావవిద్దెలని
తిట్టుమ మూర్ఖుడు చంద్రశేఖరా. (చంద్రశేఖర శతకం)

ఈ విధంగా దొమ్మరాటలు చరిత్రలో స్థానాన్ని ఏర్పరుచుకున్నాయి. ఈనాడు పెద్దపెద్ద సర్కసులని చెప్పుకోబడే వాటికి ఆధారం ఆనాటి దొమ్మరాటలే.

## జంతరుపెట్టె



కాశీపట్నం చూడర బాబు
విశ్వనాథుడే చూడర బాబు
చూచిమోక్షం పొందర బాబు
చిలిబిలి చిలిబిలి చిలిబిరిజం.

అంటూ జంతరుపెట్టె ద్వారా వివిధ రకాలైన బొమ్మల్ని చూపిస్తూ పిల్లల్ని ఆకర్షిస్తూ వుంటారు. ఇది ఒక పెట్టె. జంతరువాడు ఆ పెట్టెలో చేయి పెట్టి బొమ్మలన్నీ ఒక దాని తరువాత ఒకటి, ఒకరి తరువాత మరొకరు చూచి ఆనందిస్తూ వుంటారు.

ఒకరు తాళంకొడుతూ 'కాశీపట్నంచూడర బాబు' అంటే బొమ్మలో కాశీ దేవాలయం, గంగానది కనిపిస్తాయి. ఇలా పాటనుబట్టి బొమ్మ తరువాత బొమ్మను చూపిస్తూ వుంటారు. ఇదే కళారూపంద్వారా సంఘంలోవున్న కుళ్ళునూ, స్వార్థపరుల్నీ, తిండి దొంగల్నీ, లంచగొండుల్నీ బయటపెడుతూ దేశభక్తి కార్యక్రమానికి వుపయోగిస్తున్నారు. ప్రజా నాట్యమండలివారు ఈ జంతర్లు పెద్దపెద్ద తిరుణాళ్ళలోనూ, సంతల్లోనూ ప్రదర్శిస్తూ వుంటారు

## వీధిపురాణం

పూర్వం పల్లెల్లో మహా భారతం, భాగవతం, రామాయణం, గరుడపురాణం, బసవ పురాణం, దేవీ భాగవతం మొదలైన పురాణ గాథలను చదివి, తేట తెలుగులో ప్రేక్షకులకు అర్థమయ్యే శైలిలో అర్థం చెప్పడం నాడు ఆచారంగా వుండేది. ఆనాటి ముఖ్యమైన వినోదాలలో వీధిపురాణం చెప్పడం కూడా ఒకటి. గ్రామంలోని ధనికులు, గ్రామపెద్లు, పండితులు, బ్రాహ్మణులు, మొదలైనవారు వీటిని నిర్వహించేవారు



పురాణ పఠనం నడివీధిలోని మంటపంలోగాని, గ్రామచావడిలోగాని చెప్పే వారు. పురాణ పఠనానికి ఏ విధమైన ఖర్చూలేదు. భుక్తీ ముక్తీ రెండూ కలుగుతా యనే విశ్వాసంతో ఎంతోమంది ఈ పురాణ పఠనానికి హాజరయ్యేవారు. ప్రేక్ష కులు వచ్చేవారు వస్తూవుంటే, వెళ్ళిపోయేవారు వెళ్ళిపోతూ వుండేవారు. ఏ మాత్రం కొంచెం తీరికవున్నా కాస్త పురాణ కాలక్షేపం వినిపోయేవారు. అంతే గాక ఈ పఠనం సాయంత్రంపూట తీరుబడివేళ జరిగేది. ఒకరు పురాణం చదివితే మరొకరు చక్కగా విడమర్చి, అర్థం చెప్పేవారు గ్రామంలోవుండే పురుషులు ఏ మాత్రం అవకాశమున్నా వీధుల్లోనే వుండేవారు. ఆనాడు వినోద కార్యక్రమాలు అ న్నీవీధిలోనే జరిగేవి.

### వీధిపురాణ ప్రాముఖ్యం :

ఆనాడు వీధికి అంతటి ప్రాముఖ్య ముండేది. వీధుల్లోనే వీధిబడులు పెట్టి చదువు చెప్పేవారు. దొమ్మర్లు, దాసర్లు, బొమ్మలాటరవారు, భాగవతులు మొదలైనవారు ఎవరు వచ్చినా నడివీధిలో కార్యక్రమం జరిగేది. వివాహమైన తరువాత వీధిలోనే వూరేగింపులు జరిగేవి. వీధిలోనే మేజువాణీలు జరిగేవి. దేవదాసీ నృత్యాలూ వీధుల్లోనే జరిగేవి. దేవుళ్ళ కళ్యాణం నడివీధిమంటపంలో జరిగేది. జాతర్లూ, వుత్స వాలూ అన్నీ వీధిలోనే. బాల బాలికల ఆటపాటలు వీధుల్లోనే జరిగేవి. ఎవ రైనా తప్పుచేస్తే నడివీధిలోకిలాగి విచారణ జరిపి తీర్పుచేసేవాళ్ళు. ఈ విధంగా ఆనాడు వీధికి అంతటి ప్రాముఖ్యముండేది. తప్పెటతో చాటింపుచేస్తేసరి అందరూ బొలబొలమని వీధిలోకి వచ్చేవారు. వీధుల్లో నాటకాలాడేవారు గనుక వీధి నాటకా లని, వీధిభాగవతులని పేర్లు వచ్చాయి. వీటన్నిటిలోనూ ఎక్కువరోజులు ఏకబిగిని సాగేది వీధిపురాణం మాత్రమే.

## అశ్వనృత్యం

ఈ అశ్వనృత్యాలు ఎక్కువగా కృష్ణా, గుంటూరుజిల్లాలలో ఎక్కువ ప్రచారంలో వున్నాయి. అశ్వనృత్యాలను ముఖ్యంగా హరిజనులు దసరా నవరాత్రి సమ



కీలుగుఱ్ఱం

యాలలో గొంతాలమ్మను పంటచేలో ప్రతిష్ఠించి 9 రోజులు వుత్సవం జరిపి తరువాత గొంతాలమ్మను తృప్తిపరచి వుత్సవంతో సాగనంపుతారు. ఈ సందర్భంలో వివిధ చిత్రవిచిత్ర వేషాలు ధరించి చుట్టుప్రక్కల గ్రామాలన్నీ సంచారంచేసి డబ్బు, ధాన్యం, వస్త్రాలు సంపాదిస్తారు.

వీరి ప్రదర్శనల్లో ప్రాముఖ్యం వహించేది అశ్వనృత్యం. మెడవరకుగల ఒక గుఱ్ఱపు తలను పేడతో చేయించి వివిధ రంగులతో అలంకరించి ఇతర శరీరభాగాన్నంతా తేలిక వెదురు బద్దలతో గుఱ్ఱపు ఆకారాన్ని తయారుచేసి చుట్టూ ఒక ఎఱ్ఱచీరనుకట్టి ఆ గుఱ్ఱాన్ని చంకలకు తగిలించుకుని వెనుకకూ ముందుకూ ఎగురుతూ అద్భుతంగా నృత్యం చేస్తారు. వీరి నృత్యానికి ఉత్తేజం కలిగించే వాయిద్యం డప్పులవాయిద్యం. ఈ వాయిద్యపు వరుసలననుసరించి నృత్యగతిని మారుస్తూ ఉధృతంగా నృత్యంచేస్తారు.

ఈ నృత్యంలో డప్పువాయిద్యాన్ని నిలిపి అందరూ సమిష్టిగా చేతుల్లో చిరుతలు ధరించి, ఈ విధంగా పాటపాడుతూ నృత్యం చేస్తారు.

(1) కంచెల చెరిగే చేడికురులపై
లలనకురులపై
తుమ్మెదలాడిన ఓలాలా
ఘనతుమ్మెదలాడిన ఓలాలా. ॥కం॥

(2) చెమటకు తడిసి చెదరినగంధం
ఘుమఘుమ లాడిం దోలాలా
అది ఘుమఘుమ లాడిం దోలాలా. ॥కం॥

(3) చెరిగేటప్పుడు చేతులగాజులు
గలగలలాడిన వోలాలా
అవి గలలాడిన వోలాలా. ॥కం॥

(4) గొప్పదిరోకలి గుప్పునదంచగ
జబ్బలుకదిలిన వోలాలా
ఘనజబ్బలు కదిలిన వోలాలా. ॥కం॥

ఈ విధంగా ఒకప్రక్క నృత్యం జరుగుతూ వుంటే మరో ప్రక్కనుంచి సోడిగాడు వంకర దుడ్డుకఱ్ఱను చేతబట్టి పిల్లలందర్నీ భయపెట్టి నవ్విస్తూ వుంటాడు.

గుంటూరుజిల్లాలో ఈ అశ్వనృత్యాలను నిజమైన గుఱ్ఱాలతోనే చేయిస్తారు. గుఱ్ఱాన్ని వివిధ సామగ్రితో శోభాయమానంగా అలంకరించి ముందుకాళ్ళకు గజ్జె కట్టి తప్పెటవాయిద్యపు దరువుకు తగినట్లు లయప్రకారం గుర్రంతో నృత్యం చేయిస్తారు. ఈ నృత్యం ఎంతో కనులపండువుగా వుంటుంది. ప్రత్యేకంగా ఈ నృత్యంకొరకు గుఱ్ఱాలను తయారుచేస్తారు. తిరుణాళ్ళ సమయంలోనూ, వివాహాల ఊరేగింపుల్లోనూ ఈ నృత్యాలు కనులపండువుగా జరుగుతూ వుంటాయి.

# చెక్కభజన

పల్లెల్లో పనిపాటలులేని తీరిక సమయాల్లో ఈ భజనలు చేస్తూ వుంటారు. దేవుని స్తంభాలనుబట్టి ఇంటింటికీ తిరుగుతూ భజనలు చేస్తారు. సమాజ సభ్యులు 20 మంది వుంటారు. ఈ భజనలో నోటితో పాట, చేతితో చెక్కలద్వారా తాళం, గజ్జెలు కట్టిన కాళ్ళతో నృత్యం చూడ దానికి ఎంతోఇంపుగాఉండి వుత్తేజాన్ని కలిగిస్తుంది.



చెక్క భజన

చెక్కభజన చాల శ్రమతో కూడు కున్న కళారూపం. ఒక్కొక్కపాటకూ ఒక్కొక్క రకమైన నృత్యం వుంటుంది. ఆంధ్రుల భక్తిరస ప్రధానమైన కళారూపాల్లో ఈ చెక్కభజన చాలా ప్రాముఖ్యమైనది.

# చిత్రకథా విధానం

చిత్రకథా విధానమనగా చిత్రపటాలద్వారా ఒక బొమ్మ తరువాత మరొకబొమ్మ చరిత్రను తెలుపుతూ తోలుబొమ్మలాటలోని బొమ్మల ప్రవేశమూ, భాగవతాలలోని

పాత్రల ప్రవేశమూ మాదిరి వివిధ చిత్రాల చరిత్రద్వారా ఒక విధానాన్ని నడిపి ఒక రమణీయమైన కథను పూర్తిచేయడం. ఈ విధానం చిత్రపటాలద్వారా కథలు చెప్పే విధానం అవడంవల్ల చిత్రకథా విధానమని ప్రచారంలోకి వచ్చింది. ఈ విధానం పూర్వంనుండి ప్రస్తుతంవరకూ ఆచరణలోనే వుంది. ఇటీవల 15 సంవత్సరాలనుండి మాత్రం ఈ విధానం ఆంధ్రదేశంలో ఆచరణలోనే వుంది. అది కేవలం యాచకుల చేతిలో వుంది.

# హరిభజనలు

భక్తిభావంతో హరిని స్మరిస్తూ ఈ భజనలు చేస్తారు. ఈ భజనలో నృత్యానికి స్థానంలేదు. ముఖ్యంగా సంక్రాంతి దినాలలో ఈ భజనలు ప్రారంభించి తెల్లవారకమునుసే పరిశుభ్రమైన బట్టలు ధరించి తెల్లని నామాలతో, చేతితాళాలతో, హార్మోనియం మద్దెల సహాయంతో ఊరు నాలుగుమూలలా భక్తితో ప్రచారం చేస్తారు. ఇది భక్తిరసమైన కళారూపం!

# పండరి భజనలు

ఈ కళారూపం మహారాష్ట్రినిది. కీరపండరీక్షేత్రం నుంచి పండరి భక్తులద్వారా దేశమంతా వ్యాపించింది. ఇది నృత్య ప్రధానమైన భజన. చేతిలో చిరతలు, నోటితోపాట, పాటకుతగిన అభినయంతోపాటు ప్రాముఖ్యం వహించే వాయిద్యాలు డోలక్, మద్దెల, కంజీరా, తంబురా, తాళాలూ, హార్మోనియం. ఈ కళారూపం భక్తితో కూడుకున్నా వినడానికి ఇంపుగానూ, సొంపుగానూ వుంటుంది.

# చెంచులు

ఏవూరు ఓభామ. ।తంధానా।
ఎవ్వారిదానవే. ।ఓభామా।
చేతెడే ముద్దమ్మ. ।తంధానా।
చేయెత్తి దానాలు. ।వోభామా।
వద్దిచ్చె తల్లో వద్దిచ్చెతల్లో.

అంటూ భద్రాచలం ప్రాంతాలనుంచి ఆంధ్రదేశానికి అప్పుడప్పుడు వచ్చి యాచించి వెళ్ళిపోతూ వుంటారు. వీరు పాడేపాట చెంచీత పాట అంటారు. వీరు ముగ్గురు నలుగురు కలిసి జట్లుజట్లుగా వస్తారు. ఒకరు చరణం పాడితే మిగిలిన వారు చరణాంతంలో చెంచీతా అని, తంథానా, నంవానా అని శృతికలుపుతారు. అందరూ చిన్న జేగంటలు, మంచి పుల్లలు పట్టుకుని పాడేపాటకు తాళంగా వుపయోగిస్తారు. వీరి వేషధారణ, కాళ్ళకు చాలీచాలని లాగులు, యాచనలో సంపాదించిన చొక్కాలూ, పూలదండలూ, తలపాగాలూ,పాగలపై నెమలి ఈకలూ, పులిగోరులూ, పందికోరలూ మొదలైన వాటిని ధరిస్తారు. ఈ చెంచు పాటద్వారా ఆంధ్ర ప్రజా నాట్యమండలి అల్లూరు సీతారామరాజు కథను ఉత్తేజంగా పాడి ప్రజల నుత్తేజ పరిచి, ప్రజా ప్రబోధం చేశారు. ఈనాడు అనేక ప్రజా నాట్యమండలి దళాలు దేశ భక్తి ప్రయోజనానికి ఈ కళారూపాన్ని ఉపయోగిస్తున్నారు.

# హరికథ

ఆంధ్రదేశంలో అన్ని జానపద రూపాలతోపాటు వర్ధిల్లి ప్రజాభిమానాన్ని చూరగొన్న కళారూపాల్లో ముఖ్యమైంది హరి కథా గానం. ఆంధ్రుల హరి కథా చరిత్రలో హరి కథ ఒక ప్రత్యేకతనూ, గౌరవాన్నీ సంపాదించింది. దానిని ఒక విశిష్ట కళారూపంగా తీర్చి దిద్దినవారు అజ్జాద ఆదిభట్ల నారాయణ దాసుగారు.

### హరికథల ప్రత్యేకతా, ప్రాశస్త్యమూ :

హరి కథా కళారూపంలో ఒకే ఒక పాత్రధారి మూడు గంటలకాలం కథా గానం చేస్తాడు. ఒకే వ్యక్తి అన్ని పాత్రల్లోనూ జీవించి, రసవత్తరంగా నటిస్తాడు. నోటితో వాచికం చెబుతూ, మృదు మధురమైన గానం పాడుతూ, ముఖంలో సాత్వికమూ, కాలితో నృత్యమూ, చేతులతో అంగికమూ గుప్పిస్తూ ఆకర్షణీయమైన ఆహార్యంతో ఏకకాలంలో అభినయిస్తాడు. ప్రజలను ఆకర్షించి రంజింపజేస్తాడు.

హరికథలోవున్న ప్రత్యేకత ఇదే. మూడు గంటల కాలం కూర్చున్నా ప్రేక్షకులకు విసుగుజనించకుండా పిట్ట కథలతో, మధ్య మధ్య హాస్యరసాన్ని పోషిస్తూ సమాజంలోవున్న కుళ్ళును ఎత్తి చూపిస్తూ, వేదాంత బోధ చేస్తూ జనరంజకంగా హరికథను గానం చేస్తాడు.

## వేషలు, భూషలు :

కథకుడు కేవలం అతని ప్రతిభవల్లనే ప్రేక్షకులను హరికథతో రంజింప జేయగలడు. హరికథకుని వేషధారణ కూడ సామాన్యమే. చేతిలో చిరతలు. కాలికి గజ్జెలు. పట్టుదోవతి పంచకట్టు. పట్టుకండువా నడుముకుకట్టి, మెడలో ఒక పూల హారం ధరించి చక్కగా తిలకం దిద్దుతాడు.

## కట్టుకథలు కావు,
## అచ్చంగా హరికథలే :

హరికథకులు రామాయణం, భారతం, భాగవతం మొదలైన అధ్యాత్మిక సంబంధమైన కథలను విరివిగా చెపుతూ వుంటారు. సంపూర్ణ రామాయణం, సంపూర్ణ భారతం, భాగవతం మొదలైన కథలు వరుసగా పదిహేను రోజులూ, నెల రోజులవరకూ గూడ సాగుతాయి. పట్టణాలలోనూ, గ్రామాల్లోనూ పనులతరుణం అయిపోయిన తరువాతా, పర్వదినాలలోనూ ఆంధ్రదేశపు హరిదాసులు ఈ కథలు చెపుతూ వుంటారు.

## హరికథల
## ప్రాచీనత :

హరికథల స్వరూపం వేదకాలంనాటిదనీ, సర్వజ్ఞులయిన మహర్షులు ఈ హరికథా శిల్పాన్ని ప్రప్రథమంగా సృష్టించారనీ పండితులు నిర్ణయించారు. బ్రహ్మమానస పుత్రుడైన నారదుడు భక్తిసూత్రాలను ఉపదేశిస్తూ హరికథాగానం చేస్తూవుంటాడని ప్రతీతి వేదవిభజనచేసినా, అష్టాదశ పురాణాలను లిఖించినా మనశ్శాంతి పొందనేరని శ్రీ వ్యాసునకు శ్రీమద్భాగవతం రచించి హరికథామృతాన్ని పంచిపెడుతూ

మానవోద్ధరణ గావింపుమని నారదుడు ఆదేశించాడు. తరువాత శుకదేవుడు, శౌనకాది మహర్షులు, సూతుడూ హరికథా రూపకమైన భాగవతాన్ని భారతదేశం అంతటా ప్రచారం చేశారని పాతూరి ప్రసన్నంగారు 1965 ఫిబ్రవరి 'నాట్యకళ' సంచికలో వివరించారు.

## రంగస్థలము, రంగైన ప్రదర్శనం :

హరికథా ప్రదర్శనాలు రాత్రిపూటే జరుగుతూ వుంటాయి. ఇవి ముఖ్యంగా, గణపతి నవరాత్రులు, దసరా, కృష్ణజయంతి, ముక్కోటి ఏకాదశి, సంక్రాంతి పర్వ దినాలలో విరివిగా జరుగుతూ వుంటాయి. ఈ ప్రదర్శనానికి ఖర్చు చాలా తక్కువ. ఒకేనాటి ప్రదర్శనమైతే, గ్రామంమధ్య పెద్ద బజారులోగాని, విశాలమైన మైదానంలోగాని ఒక చిన్న పందిరివేసి, పందిరిలో ఎత్తైన దిబ్బనుగాని చెక్కలతో చిన్న స్టేజిని నిర్మించిగాని రెండు ప్రక్కలా కాంతి వంతమైన పెట్రోమాక్సు లైట్లను అమరుస్తారు. ఆరుబైట ప్రేక్షకులు కూర్చుంటారు. అదే కథ ఒక నెల రోజులు చెప్పవలసివస్తే ఒక పెద్ద పందిరివేసి దానిని చక్కగా అలంకరిస్తారు.

## సన్మానాలూ, సత్కారాలూ :

ఒకే రోజు కథకైతే, ఏదో ఒక పారితోషికాన్ని హరిదాసుకు ముట్టజెపుతారు. అదే నెలరోజుల కథైతే నెలరోజులూ కథలు జరిగిన తరువాత హరిదాసు ఇంటింటికీ వెళ్ళి ప్రతివారినీ కలుసుకుంటాడు. నెలరోజులపాటు మదులకు నెమ్మదిగా హరి కథను విని ముగ్ధులైన ప్రజలు భక్తిప్రపత్తులతో దాసుగారిని గౌరవించి ఎవరికి తోచింది వారు సమర్పిస్తారు. ఇలా హరిదాసు మొత్తంమీద అందరివద్దాచేరి ఎక్కువ మొత్తాన్ని వసూలు చేసుకుని సంతృప్తిగా వెళ్ళిపోతాడు. ఈ విధంగా గ్రామ గ్రామాలూ తిరిగి హరిదాసులు కార్యక్రమా లిస్తూవుంటారు. మరికొందరు ప్రతి సంవత్సరమూ వార్షికంగా ఆయా ప్రదేశాల్లో ఈ కథలు చెపుతూ వుంటారు.

సినిమా, నాటకం అభివృద్ధికాక పూర్వం గ్రామాల్లో ఇతర జానపద కళా రూపాలతోపాటు ఎక్కువ ప్రజాదరణను పొందిన కళారూపాల్లో హరికథ చాలా

ముఖ్యమైంది. ఏది ఏమైనా ఆనాటినుంచి ఈనాటివరకూ శిథిలంకాకుండా నానాటికీ కొత్తరూపును సంతరించుకున్న కళారూపం హరికథ.

ఈ హరికథను అత్యంత ఉత్తమ కళారూపంగా తీర్చి దిద్ది దానికొక గౌరవాన్నీ, విశిష్టతనూ చేకూర్చినవారు ఆదిభట్ల నారాయణదాసుగారు. ఆయన ఎన్నో హరికథలు రచించారు. ఎంతోమంది ఉద్దండులైన శిష్య ప్రశిష్యుల్ని తయారుచేశారు.

## ఇంటాబయటా ఇంచక్కని పేరుపొందిన ఆదిభట్ల నారాయణదాసు :

ఆదిభట్ల నారాయణదాసుగారు 1864 వ సం. రం శ్రీకాకుళం జిల్లా బొబ్బిలి తాలూకాలో సువర్ణముఖీతీరంలో ఉన్న అజ్జాడ గ్రామంలో జన్మించారు. వీరు ద్రావిడ బ్రాహ్మణులు. తల్లి నరసమాంబ. తండ్రి వేంకటచయనులు. చిన్ననాడే తల్లిద్వారా భాగవతాన్ని విని ఆధ్యాత్మికతత్వాన్ని జీర్ణించుకున్నారు. తండ్రిద్వారా పాండిత్యాన్నీ, కవిత్వాన్నీ నేర్చుకున్నారు. నారాయణదాసుగారు స్వయంకృషి వలన సకల విద్యల్నీ అపారజ్ఞానాన్నీ సంపాదించారు.



ఆటపాటలమేటి ఆదిభట్ల నారాయణదాసు

దాసుగారు బొబ్బిలి వాస్తవ్యులైన వాసా సాంబయ్యవద్ద కొంతకాలం వీణ నేర్చుకున్నారు. తరువాత విజయనగరం మహారాజావారి కాలేజీలో యఫ్. ఏ. వరకూ చదివి తరువాత ఆంగ్లవిద్యకు స్వస్తి చెప్పారు.

దాసుగారు ప్రప్రథమంగా యక్షగానాలను, తరువాత హరికథా ప్రబంధాలను రచించారు. షేక్స్పియర్, కాళిదాసు గ్రంథాలను అనువాదం చేశారు. వీణా వాదనలోనూ, నృత్య సంగీతాల్లోనూ అనమానమైన ప్రజ్ఞను సంపాదించారు. లయలో ఈయన సామర్థ్యం సాటిలేనిది. చల్లపల్లి జమీందారుగారిచే గజయాన, గండపెండేర సత్కారాన్ని పొందారు.

## దర్బారుల్లో

### దర్బాగా సన్మానాలు :

పిఠాపురం, ఏలూరు, విజయవాడ, బళ్ళారి, మద్రాసు నగరాల్లో హరికథా ప్రదర్శ నాలనిస్తూ అనేక సంస్థానాల్లో సత్కారాల నందుకున్నారు. బెంగుళూరులో తన హరికథా కథన ప్రజ్ఞను ప్రదర్శించి మైసూరు మహారాజా దర్బారున కాహ్వానింప బడి గొప్ప సన్మానాన్ని పొందారు.

ఈ విధంగా అన్యప్రాంతాల్లో సన్మానాల నందుకున్న దాసుగారి కీర్తిని గుర్తించి ఆనంద గజపతి మహారాజు దాసుగారిని ఆహ్వానించి దర్బారు పండితుణ్ణిగా చేశారు ఆనంద గజపతి మరణానంతరం దాసు మరల ఆంధ్రదేశ మంతటా హరి కథ ప్రదర్శనా లిచ్చారు.

1919 వ సంవత్సరంలో ఆనాటి విజయనగర సంస్థానాధీశ్వరుడు శ్రీ విజయరామ గజపతి సంగీత పాఠశాల నొక దానిని స్థాపించి దానికి ఈయనను అధ్యక్షులుగా నియమించారు. ఈ పదవిలో ఆయన 17 సంవత్సరాలు పనిచేశారు. 1936 లో ఉద్యోగాన్ని వదలివేశారు. వృద్ధాప్యం వచ్చే కొద్దీ కథలను తగ్గించి అనేకమంది శిష్యుల్ని తయారుచేసి ఆంధ్రదేశ హరికథా పితామహు డనిపించుకున్నారు. 1945 సంవత్సరం జనవరి 2 వ తేదీన మరణించారు.

### శిష్యులూ, ప్రశిష్యులూ :

80 సంవత్సరాలు జీవించారు. వీరి శిష్యులైనవారు నారాయణదాసు సాంప్ర దాయాన్ని అపారంగా ప్రచారం చేశారు. వీరేగాక, పాణ్యం సీతారామ భాగవతార్, పట్రాయని సీతారామశాస్త్రి, ప్రయాగసంగయ్య, బాలాజీదాసు, కోసూరి భోగలింగదాసు, తంపిళ్ళ సత్యనారాయణ, ఎరుకయ్య మొదలైన మహా మహు లెందరో ఆంధ్రదేశంలో హరికథా గానాన్ని ప్రచారం చేశారు.

### ప్రసిద్ధ హరిదాసులు :

పై వారే గాక, వడ్లమాని నరసింహదాసు, ఉమాకాంతదాసు, బాలబ్రహ్మానంద దాసు, బులుసుపాటి వెంకటప్పయ్య, బెజవాడ లింగమూర్తి, భమిడిపాటి వెంకటరమణ, చిట్టిమళ్ళ రంగయ్యదాసు, శనగవరపు లింగమూర్తిశర్మ,

పెద్దింటి సూర్యనారాయణ దీక్షితదాసు, పాతూరి మధుసూదనరావు, చొప్పల్లి సూర్యనారాయణ భాగవతార్, మహావాది వెంకటప్పయ్య, కోసూరి పున్నయ్య, కొండపల్లి కల్యాణదాసు, మైనంపాటి నరసింగరావు, కడలి వీరదాసు, శ్రీమతి ఆర్. దుర్గాంబ, మహేంద్రవాడ కామేశ్వరరావు, పిల్లలమర్రి రామదాసు, ములుకుట్ల సదాశివశాస్త్రి, రాజశేఖరుని లక్ష్మీపతిరావు, పొడుగు పాండురంగదాసు, తాతిన సీతారామయ్య, ములుకుట్ల పున్నయ్యశాస్త్రి, శ్రీమతి యన్. రాజకుమారి చౌదరి, నవుడూరి విశ్వనాధశాస్త్రి, పొట్లూరి వెంకటరామయ్య, ముట్నూరి సూర్యనారాయణశాస్త్రి, బంకుపల్లి సింహాచల భాగవతార్, చిట్యాల ఆంజనేయ భాగవతార్, శ్రీమతిబేబిరాణి, బసవలింగం, అమ్ముల విశ్వనాథం, కోట సచ్చిదానందశాస్త్రి మొదలైన ప్రసిద్ధ హరికథకులు నారాయణదాసులాంటి పెద్దల బాటల్లో నడిచి హరికథ కళను ప్రచారం చేశారు.

## మరపురాని మరికొందరు

### హరిదాసులు :

ఈనాడు ఆంధ్రదేశంలో హరికథగానకళ విస్తృతంగా వ్యాపించి ప్రజల నెంతగానో ఆకర్షిస్తూంది. రాష్ట్ర వ్యాపితంగా ఈ కళను ఈ క్రింద ఉదాహరించిన ఎంతో మంది కళారాధకులు ప్రచారం చేస్తున్నారు. మిక్కిలినేని పరంధామయ్య (కోలవెన్ను), ఘట్టి శేషాద్రి (రేలంగి), చదలవాడ వెంకట్రాయుడు(భీమవరం), వీర్ల రామచంద్రయ్య (తణుకు), చిట్యాల పార్థసారథి (తాడేపల్లిగూడెం),అన్నమనీడి బాలకృష్ణ (రామచంద్రపురం), మట్టా వజ్రశేఖర్ (వుప్పాకపాడు), గూనపల్లి తాతారావు (రామచంద్రపురం), సుంకర నరసింహారావు (కొమరగిరిపట్నం), కొనకళ్ళ చిన వెంకన్న (రావులపర్రు), బద్దిరెడ్డి సుబ్బారావు (సుందరపల్లి), అయినం అప్పలదాసు (తాడేపల్లిగూడెం), తాడేపల్లి వరలక్ష్మి(తెనాలి), ముట్నూరి కుటుంబరావు (పెదకళ్ళేపల్లి), వాజపేయాజుల రామనాథశాస్త్రి (వుంగుటూరు), యాళ్ళబండి శారద (తాడేపల్లిగూడెం), ఆత్మకూరు గురుబ్రహ్మగుప్త (పిడుగురాళ్ళ), వంగవోలు సుబ్బారావు (చెన్నయ్యపాలెం), తిరునగరి సత్యవాణి (తెనాలి), కోట సుబ్బారావు (కొండయ్యపాలెం), శీలం నారాయణదాసు (నర్సాపురం), గిడుతూరి మాణిక్యాంబ (ఫత్తేపురం), బృందావనం రంగాచార్యులు (తాడేపల్లి),రాయిపూడి సాంబశివరావు (చావలి), నడింపల్లి నారాయణరాజు (ఉండి), వేపూరి పోతరాజు (కోనేటి

పురం), గూడేవల్లి సూర్యనారాయణ (రామచంద్రపురం), శీలం గంగరాజు (పెను గొండ), తిరువాయిపాటి రామారావు (తెనాలి), పఠ్ఝూ అప్పయ్య చౌదరి (గోల ఘూడి), మద్దుల కోటేశ్వరగుప్త(పాలకొల్లు), సిగిడి సూర్యారావు (ఉండి), వీరగంధం వెంకట సుబ్బారావు (తెనాలి) జి. ఎ. శివయ్యదాసు (పెడన), మెట్ట బలరామ మూర్తి (ఉండి), అవుతు సోమారెడ్డి (చినపరిమి),అక్కిపెద్ది శ్రీరామశర్మ (విజయ వాడ), వంకా వెంకట్రామయ్య (తణుకు), సజ్జల చిన ఓబులరెడ్డి (కొప్పోలు), తమ్మిరెసి హనుమంతరావు (త్యాజంపూడి), కంచర్ల బాలకృష్ణదాసు (తా॥ గూడెం), తాడాల వెంకటరత్నం (పొలమూరు), కాపవరపు పాపారావు (పెదమెరం),మెట్టా వెంకటేశ్వరరావు (క్రైకరం),కన్నేపల్లి నీలకంఠశాస్త్రి (ఉండి), నంద్యాలరాయుడు (తా॥గూడెం), నడింపల్లి విశ్వనాథశాస్త్రి (గరికపర్రు), బాసంశెట్టి మల్లయ్య(మామి డూరు), బి. సింహాచలం (పెరమరం), ములుకుట్ల సీతారామశాస్త్రి (తా॥గూడెం) తాడాల నరసింహస్వామి, పొలమూరు జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రి (తణుకు), కాజన విశ్వరూపాచారి (శిరిపురం), ఆకురాతి నాగేంద్రం (పెడన), పృథివి బసవ శంకరయ్య (పెడన), జోశ్యుల సత్యనారాయణ (శీనలి) ఖండవల్లి తారకరామం (ఎదురులంక, యానాం),ముదపాక మల్లేశ్వరరావు (భీమవరం),కల్లే బాలకృష్ణదాసు (విజయవాడ), అంబటిపూడి శివరామ కృష్ణమూర్తి (విజయవాడ), శంభానరామా రావు (వేలపర్ల), డి. జ్యోతిర్మయాంబ (ఏలూరు), గోవర్ధనం వెంకటాచార్యులు (కేశవరం), పంచాగ్నుల విశ్వనాధశర్మ (సికిందరాబాదు), షణ్ముఖి లోకనాధరాజు (భీమవరం), పట్నాల వీరభద్రాచార్యులు (చాగల్లు), కోట లక్ష్మీకాంతం (వంగోలు), మల్లాది శ్రీరామమూర్తి (ఏలూరు), వడ్డి సత్యనారాయణ (కోరు కొల్లు), ఎ. పూర్ణిమ (ఏలూరు), నిడుమోలు శేషగిరిరావు (ఏలూరు), ఎ. సత్య నారాయణ (మండపేట), వరకూటి జయమ్మ మొదలైన అనేకమంది హరికథ కులు ఈనాడు హరికథా గానాన్ని ప్రచారం చేస్తున్నారు.

# పిచ్చుకుంటుల కథలు

ఆంధ్రదేశంలో చిరకాలంనుంచీ వున్న కళారూపాల్లో పిచ్చుకుంటుల కథ ఒకటి.

ఈ కళా రూపాన్ని పిచ్చుకుంటులవాళ్ళనే జాతివారు ఆకట్టుకొని కాపీరైటు



చేసుకొని చెపుతూ వుంటారు. ఈనాటికీ వారు మన వంశాలూ గోత్రాలను వల్లిస్తూవుంటారు. ఈ కథా బృందం అంతా చేరి ముగ్గురంటే ముగ్గురు వ్యక్తులు. వీరు చెప్పే కథల్లో ప్రాముఖ్యమైనదీ, చరిత్రాత్మకమైనదీ, వీరోచితమైనదీ శ్రీనాథ మహాకవి రచించిన పల్నాటి వీరచరిత్ర. ఈ కథను ప్రారంభిస్తే మరి కట్టుకదలకుండా దాదాపు 15 రాత్రిళ్ళు చెపుతారు. పిచ్చుగుంటుల కథలో శృంగార, వీర, దుఃఖరసాలకు ఎక్కువ అవకాశముంది. ఒకప్పుడు వీరు కేవలం ప్రజలను యాచించేవారని సోమనాథుడు పండితారాధ్య చరిత్రలో పర్వతప్రకరణంలో ఈ విధంగా వర్ణించాడు:

వీవంగ చేతు లులేవయ్య-నడచి
పోవంగ కాళ్ళుమలేవయ్య—అంధ
కులమయ్య పిచ్చుకుంటులమయ్య
దానమొసగరే ధర్మాత్ములార!

అని వివరించాడు. పిచ్చుకుంటల వారిని గురించి చంద్రశేఖరుడు చంద్రశేఖర శతకంలో ఈ విధంగా వర్ణించాడు.

గుడగుడరోజు నడకుండకు బాపడుపిచ్చుగుంట్ల యో
కడు కెప్పినన్ని గోతరలు, గట్టిగ జెప్పనా మానమంగుగా
వడిగొని సంవసాచి దలవట్టుక సిందుపదాలుపాడు
గుడగుడ వట్టిలొట్టయని కూయును మూర్ఖుడు చంద్రశేఖరా.

ముఖ్యంగా వీరి వేషధారణ కథకునికి హుందాయైన తలపాగా. ఒక చేతిలో కత్తి, మరొకచేతిలో డాలూ, కాళ్ళకు గజ్జెలూ వుంటాయి ఈయన చరణాల్ని పాడుతూవుంటే మిగతా వారిద్దరూ 'ఆ——' అంటూ దీర్ఘంతీస్తూ కథకుని గొంతులో గొంతు కలిపేస్తారు.

ఇక మూడవవ్యక్తి ఒక తోలుతిత్తిని తగిలించుకుని గ్రుక్కవిడువనిశృతి పోస్తూవుంటాడు. ఈ శృతి చెవులకు ఎంతో యింపుగా వుంటుంది. ఈ శృతిని ఆధారం చేసుకుని పిచ్చు కుంటుల కథా విధానాన్ని నడుపుతూ వుంటారు.

కథలో వచ్చే ఆయా పాత్రల మనస్తత్వాల ననుసరించి కథకుడూ, వంత దారుడూ ఆ పాత్రల్లోకి మారిపోతారు. పిచ్చుకుంటుల కథా విధానం ఎలా వుం టుందో పల్నాటి యుద్ధంలో బాలచంద్రుడు యుద్ధంలో దూకిన ఘట్టాన్ని వింటే బోధపడుతుంది:

కుప్పించి ఎగసిన—కుండలంబులకాంతి
గగన భాగంబెల్ల—గప్పికొనంగ
కంపించి జగమంత—కదలివణకంగ
మొగమందు చిరునవ్వు—మోసుతెత్తంగ
కొండలంతా రాళ్ళు—పిండిపిండిగను
పత్రమంతారాళ్ళు—పాడిపాడిగాను
శిలగలంతా రాళ్ళు—చిచ్చువ్వగాను
ఒక్క దూకు దూకాడయ్యా శీలంవారి బాలుడు.

శ్రీమల మలదేవ చెన్నుడో॰ ఓ. ఓ. ఓ. అంటూ దీర్ఘంతీస్తూ పాడతారు.

ఈ విధంగా పిచ్చుకుంటులవారు ఎంతో వుత్తేజంగా ఖడ్గతిక్కన, కాటమ రాజు, పల్నాటి వీరచరిత్ర మొదలైన కథలను చెప్పేవారు.

## పాతకథలతోపాటు

## కొత్త కథలూ :

ఇదే పిచ్చుకుంటుల కథా విధానాన్ని 1943 లో వచ్చిన కంట్రోలు రేషనింగు విధానాలద్వారా, కరువుతో ప్రజలుపడిన బాధను వివరిస్తూ, వారి సమస్యలు తీసు కుని కోసూరి పున్నయ్యగారు 'ఆకలి మంటలు' అనే పిచ్చుకుంటుల కథనువ్రాసి ప్రజా నాట్యమండలిద్వారా ప్రచారం చేశారు. వీరి కథలో మచ్చుకు కొద్ది చరణాలు.

కంపించి జగమంత—కదలివణకంగ
బాంబులా యుద్ధాలు—బయలుదేరాయి
జాతీయనాయకుల్—స్వాతంత్ర్యకాంక్షులు
గాంధి జహ్వారులజాద్—ఘనులనెందరినొ
జైళ్ళగోడల మధ్య—చేర్చె పైప్రభుత
అంబా జగదంబా—శ్రీ భారతాంబో. ఓ ఓ ఓ.

అంటూ రాగం ఆలాపిస్తారు. ఈ విధంగా పిచ్చుకుంటల కళారూపం రూపొందింది.

# హరిహరీ పదాలు

హరిహరీనారాయణ—ఆదినారాయణ
కరుణించిమమ్మేలు—కమలలోచనుడ. ॥కరు॥

హరిహరీ పదాలన్నీ ఈ పల్లవితోనే నడుస్తాయి. ఒకో ప్రాంతంలో ఒకోపాటా, ఒకో ఆటా, ఒకో కథా బహుళ ప్రచారంలో వున్నట్లే ఈ హరిహరీ పదాలు కూడా విశాఖపట్టణం జిల్లాలో విశేష ప్రభావాన్ని కలిగివున్నాయి ఈ పేరుతో అనేక కథలను సుద్దులరూపంలో చెపుతూ వుంటారు.

వీటినే 'జంపె'లని కూడ వాడుతారు. హరిహరీ పదాల్లాంటి పాటలే మన యక్షగానాల్లో కూడా చాలవరకు వ్రాయబడి వున్నాయి. పదాల నడక ప్రారంభం నుంచీ చివరివరకూ ఒకే వరుసలో నడుస్తుంది. మధ్యమధ్య, కథాగమనా న్నను సరించి, వచనంలో తేటతెల్లంగా కథయొక్క అర్థాన్ని చెపుతారు సన్నివేశాలను బట్టి ఇంకా కీర్తనలు కూడా పాడుతూ వుంటారు. కథకుడు పదం పాడితే మధ్య ప్రక్కనున్న వంతదారులు 'ఆఁ—'అంటూ శృతిలో సాగదీసి శృతిపక్వంగా ఒక గమకాన్ని జత కలుపుతుంటారు.

## పదాలంటే పదాలుకాదు, పాటికెక్కిన పదాలు :

హరిహరీ పదాలు కేవలం ఏవో జానపద గేయాల్లాగా కాకుండా మన కళారూపాల్లో అవీ ఒక కళారూపంగా వెలుగొందుతూ వున్నాయి. వీటి కథల్లో చాల వరకు రామాయణ, భారతాది కథలే ఎక్కువగా వున్నాయి. భారతంనుంచి నలచరిత్ర, శశిరేఖాపరిణయం, విరాటపర్వం, ఉత్తర గోగ్రహణం మొదలైనవే కాక పాతాళ హోమం, శతకంఠరామాయణం, కుశలాయకం మొదలైనవీ, శివగాథలూ, గంగా వివాహం, సారంగధర చరిత్రా రాణిస్తుంటాయి.

## ప్రాంతీయంగానే పరిమిత ప్రచారం :

హరిహరీ పదాలు ఎక్కువగా విశాఖ జిల్లాలోనే ప్రచారం పొందాయి. ఇతర జిల్లాలకు ఏ మాత్రం వ్యాపించలేదు. అందుకు కారణం కూడ లేకపోలేదు. విశాఖ

మండల ప్రాంతీయభాష మనకు చాలా భిన్నంగా వుంటుంది. వారి మాటతీరు ప్రత్యేకంగా అదోలా వుంటుంది. అందువల్ల ఆ పదాలు ఇతరులు వ్రాయడం కూడా కష్టమే అందువల్ల ఆ మండలంవారే వారి ప్రజలకు అర్థమయ్యే భాషలో, అర్థమయ్యే శైలిలో వ్రాస్తారు. ఇప్పటికి వ్రాయబడిన పదాలన్నీ కూడా అటువంటివే. చీపురుపల్లి, రాజాం, పాలకొండ, వీరఘట్టాం, ఆముదాలవలస, శ్రీకూర్మం, చికాకోల్, విజయనగరం ప్రాంతాల్లో ఈ కథలను రకరకాలుగా చెప్తారు. అన్ని కళారూపాలకన్న ఈ హరిహరీ పదాలు, జముకుల కథలు ఎక్కువ ప్రచారంలో వున్నాయి.

ఈ హరిహరీ పదాల విషయంలో పేకుమళ్ళ కామేశ్వరరావుగారు ఎక్కువ కృషిచేస్తున్నారు. వారి అనుభవాలనుంచీ, వారి సేకరణలనుంచీ కొన్ని వుదాహరిస్తాను.

గంగా వివాహం :

గంగా వివాహం 1901 లో అరుణాచలం చెట్టిగారు ప్రచురించారు. దీన్ని రచించినవారు పసగాడ సన్యాసిరాజు. రచనాకాలం 1856. ఈ పుస్తకంలో గంగా, గౌరి సంవాదం ఎంతో చమత్కారంగా వ్రాయబడింది:

గౌరి: ఉన్నచోటను నమ్మ ఉండమన్నందుకు
తప్పకను నీజిహ్వ తరిగింతుగంగ.

గంగ: నీవు తరిగినకూర నేను తరిగినకూర
వండి వడ్డింతుమే వనితగౌరమ్మ.

గౌరి: చెంపకాయలుగొట్టి చెవులూడదీతునా
జగడపోతులమారి జాలారిగంగ.

గంగ: నీవు గొట్టినకాయ నేను గొట్టినకాయ
గంపనింపింతుమే కాంతగౌరమ్మ.

పై మాదిరే పూరి రామచంద్రరాజు కుశలాయక పదాన్ని వ్రాశాడు. ఈయన క్రీ॥ శ॥ 1862 ప్రాంతపువాడు. ఈ పుస్తకాన్ని 1951 లో మద్రాసులో సి. వి. కృష్ణా డిపోవారు ప్రచురించారు. రామచంద్రరాజు తన గ్రంథంలో ఆయనుండే నివాస స్థలాన్ని హరిహరీ పదంలో ఈ క్రింది విధంగా వ్రాసుకున్నాడు:

పూర్వులుండేస్థలము భువిలోనకొర్లాము
తర్వాత పడివాడ తనజన్మభూమి
వర్తమానమునందు వచ్చి ఈ పెద్దమ్మ
పాళెమ్మలో నేను పరగనున్నాడ.

నలచరిత్రను హరిహరీ పదంగా తోలేటి సీతారామకవి 1900 సంవత్సరంలో రచించాడు. ఈయన దమయంతి కష్టాలను గురించి ఈ విధంగా రచించాడు:

చెలికత్తెలందరును సేవలుచేయంగ
హంసతూలికాతల్పమునందు బవళించి
సుఖముగా నిద్రించు సుందరాంగికి నేడు
ఈనేల పాన్పయ్యె ఎట్టిఖర్మంబొ.

ఈ విధంగా హరిహరీ పదాలు విశాఖ మండలంలో విపరీత ప్రచారాన్ని పొందాయి. ఈ కథలు పగటివేళ, సాయంత్రం సమయంలోనూ, భోజనానంతరం రాత్రివేళ చెప్పబడతాయి.

# ఘట నృత్యం



## జాతర్లలోనేకాని సర్వదా జరగదు :

ఆంధ్రదేశపు జానపద నృత్యాలలో ఈ ఘట నృత్యం ఒకటి ఇతర నృత్యాల వలె ఎప్పుడు బడితే అప్పుడు ప్రదర్శించే నృత్యం కాదిది. పర్వ దినాల్లో కూడా ఈ నృత్య ప్రదర్శనాలు జరుగవు. ఒక్క జాతర్ల సందర్భాల్లో మినహా మరెప్పుడూ ఈ ఘటనృత్యాలు జరుగవు.

ఆంధ్రదేశంలో అనాదినుంచీ ప్రదర్శింప బడుతున్న దీ ఘట నృత్యం. దీనిని జాతర్ల సంద ర్భంలో ప్రదర్శిస్తారు. పల్లెల్లో పశుజాడ్యాలు వచ్చి నప్పుడు దేవతలకు ముడుపులుగట్టి మ్రొక్కుతారు. ఇలా మ్రొక్కిన కొన్నిదినాలకు గ్రామంలో ఇంటం టికీ చందాలు వసూలుచేసి గ్రామమధ్యలో, దేవతల విగ్రహాలను కొయ్యలతోనూ, మట్టితోనూ నిర్మించి వాటిఆకులపాకల్లో నెలకొ...

ప్రతిష్ఠించి ఒక నెలరోజులు పంబలకథలతో రాత్రిళ్ళు ప్రదర్శనలిస్తూ సన్నాయి వాద్యగాళ్ళ వీరంగ వాయిద్యంతోనూ, కనకతప్పెట్లతోనూ మహోధృతంగా జాతర చేస్తారు. ఇలా జరిగే జాతర్లకుముందు నెలరోజులు పైన వివరించిన ఘటం (కుండ)తో వూరంతా ఇంటింటికీ తిరిగి అన్నం, మజ్జిగలను సేకరిస్తారు. ఇలా ప్రతి ఇంటివద్దనూ సేకరించిన అన్నం, మజ్జిగను వాయిద్యకారులందరూ పంచుకుంటారు.

ఇలా ఘటాన్ని నెత్తిన బెట్టుకుని వూరేగేవారు చాకళ్లు (రజకులు). ఘటం ఇంటింటికీ తిరిగే సమయంలో తప్పెట్ల వాయిద్యపు గమకాలతో, ఘటం ఎత్తుకున్న వ్యక్తి ఎంతో వుద్రేకంగా నృత్యం చేస్తాడు. ఇలా చేసే నృత్యానికి ఏ విధమైన శాస్త్రమూ వుందని చెప్పలేం కాని ఘటనృత్యం చూచేటందుకు చాలా వుత్తేజంగా వుంటుంది. ఈ ఘటం ఇంటింటికీ తిరిగి అన్నం, మజ్జిగ సేకరించడంలో వుద్దేశం కేవలం దేవతల సంతృప్తికోసం. అందువల్ల ప్రతి ఇంటివారూ ప్రసాదాన్ని వేస్తారు.

ఘటాన్ని (కుండను) పసుపుతోనూ, కుంకుమతోనూ అలంకరిస్తారు. ఘటంయొక్క అంచుకు చుట్టూ వేపాకులతోరణం కడతారు. ఘటాన్ని చూస్తేనే అది ఒక దేవతామూర్తిలాగా కనబడుతుంది. ఇక ఘటం ఎత్తుకున్న వ్యక్తి పూజ్యభావంతో ఎవరితోనూ మాట్లాడక తప్పెట్ల వాయిద్యానికి అనుగుణంగా వీర నృత్యం చేస్తాడు. అలా చేసేనృత్యం ఎంతో భక్తిభావంతోనూ, నిండు నమ్మకంతోనూ జరుగుతుంది.

ఇలా జరిగే ఘటనృత్యానికి ఏ విధమైన సాహిత్యంగాని వుండదు. కేవలం మూగతాండవం. ఎంతో ఆవేశపూరితంగా జరుగుతుంది. ఇలా ఆవేశంగా జరిగే నృత్యసమయాల్లో కొంతమందికి గణం పూనుతుంది. ఇలా గణం పూనిన వ్యక్తులు చిందులు శివాలు త్రొక్కుతారు. ఇలా త్రొక్కడం ప్రళయతాండవ నృత్యంలా వుంటుంది. ఈ ఘటనృత్యాలు జాతర్ల సందర్భంలోనూ, వీరుళ్ళ వుత్సవాలలోనూ చేస్తూ వుంటారు.

ఈ నృత్యం ఆంధ్రదేశపు అన్ని పల్లెల్లోనూ వుంది. ఏ గ్రామంలో జాతర జరిగితే, ఆ గ్రామంలో మాత్రమే ఈ ఘట నృత్యాలు జరుగుతూ వుంటాయి.

కాని ఈనాడు జాతర్ల ప్రభావం తగ్గుతున్నకొద్దీ ఈ నృత్య ప్రభావంకూడ తగ్గుతూ వుంది.

ఒక్కొక్క ప్రాంతంలో

ఒక్కొక్క పేరు .

ఇలాంటి ఘటనృత్యాలు మూఢనమ్మకాలు, దైవభీతి వున్న ప్రతి ప్రాంతంలోనూ ప్రచారంలో వున్నాయి. ఈ నాట్యాన్ని దక్షిణదేశంలో 'కుడకూతు' అని పిలుస్తారు. దక్షిణదేశంలో వారి గ్రామదేవతయైన అయ్యప్పన్ వుత్సవాల్లో ఈ నృత్యాన్ని చేస్తారు. ఈ నృత్యాన్నే వుత్తర హిందూస్థానంలో గర్బనృత్యం అని పిలుస్తారు. ఈ విధంగా ఘటనృత్యం ఆయా ప్రాంతాల్లో ప్రచారంలో వుంది.

# జయదేవుని అష్టపదులు

కొన్ని శతాబ్దాలక్రితం వంగదేశంలో సుమిత్రా-మహదేవులకు పుత్రుడుగా జన్మించాడు జయదేవుడు. ఈయన గీతగోవిందమనే కావ్యాన్ని వ్రాసి శతాబ్దాల తరబడి భారతీయ చరిత్రలోనూ, భారతీయుల హృదయాల్లోనూ శాశ్వత కళాకారుడుగా నిలిచివున్నాడు.

నామకరణకు

అసలు కారణం :

ఎనిమిది చరణాలతోకూడిన పాటలవడంవల్ల వీటికి 'అష్టపదు'లని పేరు వచ్చింది. ఈయన ఇలాంటివి 24 గీతాలను రచించాడు. ప్రతిగీతం గుబ్బపునడకలా సాగిపోతుంది. సంగీత సాహిత్యాల కెంత ప్రాముఖ్యముందో, నృత్యానికికూడా అంతే స్థానముంది. నోటితోపాట, అంగాలతో అభినయం, కాలితో నృత్యం చేస్తూ వుంటే నూటికి నూరుపాళ్ళు నవరసాలశోభ వెల్లివిరుస్తుంది. భక్తజయదేవుడు ఎంతో అద్భుతంగా ఈ అష్టపది గీతాలను రచించాడు. ఆంధ్రదేశంలో ఈ గీతాలు ఎంతో ప్రచారంలోకి వచ్చాయి.

# కాశీకావళ్ళు

పైన వివరించిన విధానానికి సంబంధించిందే ఈ కాశీకావడి, కాషాయవస్త్రాలు ధరించి ఒక కావడిని భుజాన వేసుకుని ఇరుప్రక్కలా కాశీ విశ్వనాధుని విగ్ర

హాలను వుంచి పసుపుకుంకుమలతోనూ, పుష్పాలతోనూ అలంకరించి షుమారు మూడుగజాల చిత్రపటాన్ని కావడికొమ్ముకు తగిలించి, కాశీ విశ్వనాధుని సందర్శనాన్నిగురించి వరుస క్రమంలో కథను నడుపుతారు. ఆ కథా సంవిధానంలో అన్ని రసాలూ వచ్చేటట్లు చెపుతారు. నడక ద్విపదమాదిరి నడుస్తుంది. పూర్వకాలంలో కాశీయాత్ర చేయాలంటే ఎంత కష్టమో ఈ కథ ద్వారా వివరిస్తారు. యాత్రికులు బయలుదేరిన దగ్గరనుంచి కాశీకి పోయేదారిలో అడవుల్ని గురించి వర్ణనలూ, క్రూరమృగాల ఆర్భాటాలూ, తరువాత నదీప్రవాహాలూ, సత్రాలూ, దొంగ దోపిళ్ళూ, మజిలీలూ, ఇతర యాత్రాస్థలాలూ, పర్వతాలలో ప్రయాణం, తుదకు కాశీవిశ్వనాధుని సందర్శనం, ఈ మధ్యలో వచ్చే ఇబ్బందుల్ని గురించీ, బాధలను గురించీ, క్రూరమృగాలబారినుండి తప్పుకోవడంగురించీ, యమలోకాన్ని జయించి నట్లు వ్యతిరేకశక్తు లన్నిటినీ యమదూతలుగా చిత్రించి కష్టాలు గట్టెక్కి గంగా నదినిదాటి తుదకు స్వర్గతుల్యమైన ఆ కాశీ విశ్వేశ్వరాలయానికి చేరి, ముక్తిపొందడం, దీనిని జీవితానికి అన్వయించి, మనం స్వర్గానికి చేరుకోవడం ఎంత కష్టమో ఈ కష్టాలను ఉదాహరణగా చెపుతారు. కథకుడు బహు లబ్జుగా ఈ కథను నడుపుతాడు.

## ఫక్తు పగటి వినోదం :

ముఖ్యంగా ఈ ప్రదర్శనం పగటి పూటనే జరుగుతుంది. ఎక్కువగా ఉదయపు సమయాల్లోనే. కథా కాలం కనీసం అరగంట వుంటుంది. 'కాశీకావడి, కాశీ కావడి' అంటూ గంటలు మ్రోగించుకుంటూ నడిబజారులో కావడిదించి కథకుడు కథ ప్రారంభిస్తాడు. ఈ సమయానికి దాపులోనున్న ఇండ్లలోని స్త్రీలూ, పురుషులూ, పిల్లలూ అందరూ కావడిచుట్టూ మూగుతారు. కథాంతానికి అందరూ రససిద్ధి పొందుతారు. సంతృప్తితోనూ, ఆధ్యాత్మికచింతనతోనూ ఎవరికితోచిన పారితోషికాలను వారు ముట్టచెబుతారు. ఈ విధంగా కథకుడు ఒడి నిండి, మరో వీధికి బయలుదేరుతాడు. వీరి బొమ్మలన్నీ పీరలమీద వరుసగా చిత్రించబడి బహు సొంపుగా వుంటాయి. బొమ్మలద్వారా కథ చెప్పడంవల్ల చదువురాని వయోజనులందరికి కూడ ఈ విధానం సుబోధకంగా వుంటుంది. వీరు కేవలం కాశీమహత్తు లనేకాక, ఆయా జాతులవారి దేవతలను గురించీ, దేవుళ్ళనుగురించీ కూడ పీరల మీద బొమ్మలను అద్దకం ద్వారా అద్దించుతారు.

**తెరచీరలవారు :**

ఆంధ్రదేశంలో తెరచీరలవారని ఒక జాతివా రున్నారు. వారి గోత్రాలనూ, వారి పూర్వవృత్తాంతాలనూ, గాథలనూ చెపుతూ వుంటారు. వీరే సుద్దులను కూడా చెపుతారు.

**క్రీడాభిరామంలో**

**దఖలైన దాఖలాలు :**

పై విధానపు తెరబొమ్మలనుగురించి క్రీడాభిరామంలో ఒక పడతి పల్నాటి వీర చరిత్రను గూర్చి పాడుతూ వున్నదనీ అక్కడవారి చరిత్ర ఒక చిత్రఫలకం మీద వ్రాయబడెననీ దానిని గూర్చి ఈ క్రింది విధంగా వర్ణింపబడింది:

కోలదానవు ద్రిక్కటి గూడియున్న
గచ్చువేసిన చిత్రంపు గద్దెపలక
వ్రాసినారదె చూడరా వైశ్యరాజ
శిలబ్రహ్మాది వీరనాసీర చరిత॥ (క్రీడాభిరామం, 125)

# ఆంధ్రుల కళారూపాలు

ఆంధ్రుల ప్రజా జీవితంలో అనేక కళారూపాలు పుట్టిపెరిగాయి; ఆంధ్రుల కళా సంస్కృతులకు పట్టుకొమ్మలై మెరిశాయి. ఇవేకాక ఈ క్రింద వుదాహరించిన కళారూపాలన్నీ ఆయాకాలాల్లో వృద్ధిపొందాయి.

శావమూర్ళ్ళ భజనలు—బృందగానాలు—సమిష్టి జానపదుల నృత్యాలు—మరాటీ కథలు—కేళికలు—పంబల కథలు—కోడంగియాటలు—చిరుతల రామాయణం—కురుబనాట్యాలు—మేదరాటలు — ఎరుకల కథలు—గొల్ల కథలు—చెంచుల నాటకాలు—దాసరులచిందులు — కొమ్మాయిదాసుళ్ళ పదాలు — పిరికి జంగాల కథలు—ఈతముక్కు జంగాల కథలు—జంగాల చిట్రో చిట్రోపదాలు—బుడబుడక్కలవారు—జాతర్ల చిందులు — శివకథలు — వద్దె వుప్పరపదాలు —గంగిరెద్దాటలు— విష్ణు కథలు — చీరన్నలవారు — చిందుమాదిగలు — జోగులవారు— బాలసంతువారు— హటాక్కరులు — కొమ్ముువాళ్ళు — దక్కలి

వారు—ఈమొదలైనవారు. అఖిలాంధ్ర దేశాన్ని తిరుగుతూ, రకరకాల పాటలను. రకరకాల కళారూపాలను ప్రదర్శిస్తూ జానపద వాఙ్మయాన్నీ కళారూపాలనూ కాపాడుతూ వచ్చారు. వీరు ఒక్క వర్షాకాలం మినహా మిగిలిన ఎనిమిదిమాసాలూ దేశ సంచారంచేసి సంపాదించుకుంటారు. వీరిలో కొంతమంది. కొన్ని గ్రామాల్లో స్థిర నివాసం ఏర్పాటు చేసుకున్నారు. కొంతమందికి ఆస్తిపాస్తులున్నాయి. వీరి సంచారంలో స్త్రీలూ, పిల్లలూ కూడ పాల్గొంటారు. వీరు తమ సామగ్రి అంతా సంచారానికి అనువుగా, కూడినంత కుదిరికగా ఏర్పాటు చేసుకుంటారు.





# తెలుగు
# నాటక సాహిత్య
# సమీక్ష



తెలుగు నాటకాల పరిణామం-దానికి దారితీసిన పరిస్థితులు, ప్రభావాలు-సంస్కృత నాటకాలు - అనువాద నాటకాలు- శ్రవ్యనాటకాలు - దృశ్య నాటకాలు-నాటికలు

# తెలుగు నాటకాల పరిణామం

క్రీస్తుకు పూర్వం 3-వ శతాబ్దంలో మొట్టమొదటగా శాతవాహనరాజులు ఆంధ్ర సామ్రాజ్యాన్ని స్థాపించినట్లు చరిత్రాధారాలు తెలుపుతున్నాయి. హాలు డనే రాజు గాథాసప్తశతిని రచించాడు. ఈయన శాలివాహనరాజుగా పేర్కొన బడ్డాడు. గాథాసప్తశతిలో ఆకాలపు పల్లె ప్రజలకు సంబంధించిన పండుగలు, వేడుకలు, వినోద కార్యకలాపాల సందర్భాలలో పాల్గొను ఆటలు, పాటలు, జానపద నృత్యాలు పేర్కొనబడ్డాయి. ఇవి ప్రజల జీవిత విశేషాలను వెల్లడిచేస్తున్నాయి.

## అభినయదర్పణం అందించే ఆరాలు, తీరుతీయాలు :

దాక్షిణాత్యులు నృత్త, గీత, వాద్యాది లలితకళల్లో ఆరితేరినవా రని భరతుడు నాట్యశాస్త్రంలో వుదాహరించాడు. నందికేశ్వరుని అభినయదర్పణం రచయిత ఆంధ్రుడే నసీ, అది క్రీ. శ. 3, లేదా 4 వ శతాబ్దపు ప్రాంతంలో రచింపబడిందనీ, అభినయదర్పణకాలంనుంచీ క్రీ.శ. 11 వ శతాబ్దంవరకూ జరిగిన మధ్య కాలంలో ఆంధ్రదేశంలో వున్న సంగీత నృత్యనాటక చరిత్ర మనకు తెలియదనీ, అది ఒక అజ్ఞాతయుగం లాంటిదనీ,కాగా అమరావతి నాగార్జునకొండ మొదలైన ప్రదేశాల్లో బయటపడిన శిల్పకళాసంపద ననుసరించి ఆంధ్రదేశంలో లలితకళలు అపారంగా అభివృద్ధి పొందివుండవచ్చుననీ పి. యస్. ఆర్. అప్పారావు కూచిపూడి సదస్సు సంచికలో వివరించారు.

నన్నయ భారతం వ్రాసేనాటికే కాళిదాసు, భాసుడు, శ్రీహర్షుడు, శూద్రక కవి, భవభూతి మొదలైనవారి సంస్కృత నాటకాలన్నీ అమల్లో వున్నాయి. నన్నయ్య రచనల్లో కాళిదాసుని శాకుంతలాన్ని గూర్చి, భవభూతి వుత్తరరామ చరిత్రతోనూ పరిచయ మున్నట్లు ఉదాహరణలు కనబడుతున్నాయి.

## నన్నయకాలంనాటి నాటకాలు, వాటి నయనాణ్యాలు :

నన్నయకాలంలో నాటకాలు విరివిగా జరుగుతుండేవి. నాటకం నాందీ శ్లోకాలతోనూ, ప్రదర్శనం ఎవరు జరిపిస్తున్నారో వారి గుణగణాల వర్ణనలతోనూ, సూత్రధారునిచే నాటకం, నాటకకర్త, ప్రస్తావనలతోనూ, నాటకకథా విధానాన్ని వివరిస్తూనూ ప్రదర్శనలు జరిగేవి. ఆనాటికి వుత్తరభారతదేశంలో దృశ్య నాటకాలకు, దక్షిణభారతదేశంలో శ్రవ్యకావ్యాలకు ప్రాధాన్య మిస్తూ వుండేవారు.

ఆకాలంలో మతాన్నిగూర్చి, సాహిత్యాన్నిగూర్చి, ధర్మాలనుగూర్చి అనేక విధాల ప్రచార ముండేది. పురాణాలు చదవడం, శాస్త్రాలు పరిశోధించడం, నాటకాలు చూడటం ఎక్కువ ఆచారంలో వుండేది. కొంతకాలం సంస్కృత నాటకాల అనువాదాలు చేశారు. తరువాత స్వంత రచనకు పూనుకున్నారు.

## నాటి కళారూపాల ఖిత్తు, పండితారాధ్యచరిత్ర వక్కణ :

పాల్కురికి సోమనాథుడు కళారూపాలకు సంబంధించిన అనేక విషయాలను పండితారాధ్య చరిత్రలో పై విషయాలను సమర్థించే విధంగా దీక్షాప్రకరణంలో సామవేదికథలో ఇలా వుదాహరించాడు:

వ్యక్తంబుగా నితరాకృతినున్న
భక్తు డెఱుంగు దద్భావ మెట్లనిన
బహురూపమాడు బాటివెండేడు
సహజంబు జూపకే జాడవచ్చినను
నరయువేరంగ మధ్యంబున నున్న
తరుణి ఎరుంగదే తన మగడగుట.

నటుడు తా నెట్టి మారువేషంతో వచ్చినను రంగమున నున్న నటుని భార్య, అతనిని తన మగడని ఎట్లు గుర్తింపగలదో, అట్లే ఈశ్వరుడు వేరువేరు రూపములుగా సంచరించినను భక్తుడగువాడు అతనిని గుర్తింపగలడని పై పంక్తుల

తాత్పర్యం. దీనినిబట్టి నాటక ప్రదర్శనాలు ఆ కాలంలో ప్రధానస్థానం అలంకరించి నట్లు తెలుస్తూంది.

సోమనాథుడే పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణంలో,

శతకంబు శివతత్త్వసారంబు
దీపకళిక మహానాటకమును.

అని వివరించాడు. ఆ మహా నాటకం ఎటువంటిదో మన కింతవరకూ లభ్యం కాలేదు. సోమనాథుడు రచించిన బసవ పురాణంలోనూ, పండితారాధ్య చరిత్రలోనూ 12 వ శతాబ్దం నాటి సంగీత, నృత్య నాటకాలకు సంబంధించిన అనేక జానపద కళారూపాలు మనకు లభ్యమౌతున్నాయి. మార్గ, దేశి అనే రెండు రకాలైన సంగీతాన్ని గూర్చి ఆయన అభివర్ణించాడు.

## ఆంధ్రుల సంగీత కళాపోషణకు క్రీ.శ. 602 నాటి దాఖలాలు :

ఆంధ్రులు సంగీత కళాపోషణ చేసినట్లు పుదుక్కోట సంస్థానంలో కుడిమియామలై వద్ద పల్లవరాజైన మహేంద్రవర్మ క్రీ. శ. 602 లో చెక్కించిన శిలా శాసనంవల్ల తెలుసుకోవచ్చు.

భరతుడు నాట్యశాస్త్రంలో 11 జాతుల రాగాలలో ఆంధ్రి ఒక జాతి రాగ మని పేర్కొనడాన్నిబట్టి లలితకళల విషయంలో క్రీ॥ శ॥ మొదటి శతాబ్దం నాటికే ఆంధ్రులు ముందున్నారని చెప్పవచ్చు.

## తెలుగు కావ్యాల్లోని తెలివిడి :

పింగళి సూరన్న రచించిన ప్రభావతీ ప్రద్యుమ్న నాటకంలో రంగస్థల మర్యాదలను గురించి, రంగస్థల సూత్రాలను గురించి ఈ క్రింది విధంగా వుదాహరింపబడివుంది. ఈనాటిమాదిరి రంగస్థలంమీద ఒక తెరవుండేది. ఆ తెరనుండి పాత్రధారులు ప్రవేశించేవారు. వారు రకరకాల పాత్రలను ప్రదర్శించేవారు. రంగస్థలంమీద గంగానది, కైలాసపర్వతం, వుద్యానవనాలు, అడవులు, వన్యమృగాలు, పశుపక్ష్యాదులూ కన్నులకు కట్టినట్లు ప్రదర్శించేవారట.

స్త్రీ పురుష పాత్రధారులు తమ తమ వేషధారణకు వుచితమైన దుస్తులను, అభరణాలను ధరించేవారు. నవరత్న ఖచితములైన బంగారునగలలా కనబడే టట్లు లక్కతోను, రంగుతోను, వరకు రేకుతోనూ ముచ్చిపనిచేసిన దుస్తులను తయారుచేసి వాటిని ధరించేవారు.

వీణ మొదలైన వాద్యాలతో కొందరు స్త్రీలు గానంచేయడంతో నాటకం ప్రారంభమయ్యేది. తరువాత సూత్రధారుడు రంగస్థలంమీదికి వచ్చి నాందీ పద్యా లను చదివి నాటకం పేరూ, రచయిత పేరూ చెప్పి తెరవెనుకకు వెళ్ళగా పాత్ర ధారులు తెర ఫెడలేవారు. ప్రదర్శనానంతరం నటీ, నటులను సభాసదులు సన్మా నించేవారు.

ప్రభావతీ ప్రద్యుమ్నంలోనే గాక ఇంకా ఆ కాలంనాటి అనేక ప్రబంధా లలో కూడా నాటక ప్రదర్శనాలను గురించి వివరాలున్నవి.

కందుకూరి రుద్రయ్య రచించిన నిరంకుశోపాఖ్యానంలో తరుణ యౌవన లక్ష్మీ నర్తనము సూపే నధిక తరమైన తెరతీసి నంతలోనె, చిత్తరము జూపు పాతరక త్తెదోలె అనే పద్యభాగంలో రంగస్థలంమీది తెర వర్ణింప బడింది. మను చరిత్రలోనూ వసుచరిత్రలోనూ కూడా నాటకశాలలు పేర్కొన బడినట్లు (దిగవల్లి శివరావు 'కథలు - గాథలు' గ్రంథంలో వుదాహరించారు. క్రీస్తుశకం 1480-90 ప్రాంతంలో ప్రోలుగంటి చెన్నశౌరి లక్ష్మీకళ్యాణమనే యక్షగానాన్ని వ్రాశాడు. 1270-80 సంవత్సరాల మధ్యకాలంలో మంచెనకవి రాజశేఖరుని విద్ధసాలభంజిక నాటికను చంపువుగా రచించాడు.

17 వ శతాబ్దంలో ఎలకూచి బాలసరస్వతి తన రాఘవ పాండవీయ కావ్యంలో, కవి సమీహితరంగకౌముదీనామనాటక విధాన ప్రతిష్ఠాఘనుండ అని ఉదాహరించాడు.

18 వ శతాబ్దంలో కుందుర్తి వేంకటాచలకవి తన కార్తీక మాహాత్మ్యంలో "చాటుకృతులును, బహువిధ నాటకములు, బంధురతరార్థపూర్ణ ప్రబంధములును" రచన గావించి దేవతార్పణముచేసి పాండ్యవిభుచే బ్రభూత సంపదలు గనితినని వ్రాసుకున్నాడు. కాని వీరి నాటకకృతి ఒక్కటికూడ లభ్యంకాలేదు.

## తెలుగు అభినయ దర్పణం :

క్రీస్తుశకం 18 వ శతాబ్దంలో తిరుచునాపల్లి జిల్లా వాస్తవ్యుడైన లింగం గుంట మాతృభూతయ్య నందికేశ్వరుడు సంస్కృతంలో రచించిన నాట్యశాస్త్రాన్ని అభినయదర్పణంగా మూడు అశ్వాసాలలో తెలుగు భాషలో రచించాడు. మాతృభూతయ్య తెలుగులో రచించిన ఈ అభినయదర్పణం ఆంధ్రదేశంలో ఆనాటి నుండి ఈనాటివరకు వుపయోగపడుతూ వుంది. మాతృభూతయ్య భరతశాస్త్రం లోనూ, సంగీతశాస్త్రంలోనూ అపారమైన జ్ఞానంకలవాడు. ఆయన తిరుచునాపల్లికి దగ్గరగా నున్న శ్రీరంగంలోని శ్రీరంగధామునికి దానిని అంకితం చేశాడు. దీనినిబట్టి ఆయన 19 వ శతాబ్దారంభంవరకు శ్రీరంగంలోనే నివసించి వుండవచ్చు.

నన్నెచోడుడు కుమారసంభవంలో సూత్రధారుడై నాట్యాభినయము లెసగ నాడె నారదుండు అనీ, పింగళిసూరన ముఖాదులగు సంధులు సాంగత బెంపుమీర గంగావతారాది నాటకము లాడెననీ వ్రాయడాన్నిబట్టి సంస్కృత నాటక మర్యాదల ననుసరించి తెలుగులో నాటకా లాడివుండవచ్చు.

సంస్కృతభాషలో నున్న విద్ధసాలభంజిక, అభిజ్ఞాన శాకుంతలం, ప్రబోధ చంద్రోదయం మొదలైన నాటకాలను అనువదించిన మంచన, పిల్లలమర్రి పిన వీరన, నందిమల్లయ్య ఘంటసింగయ కవులు మొదలైనవారు రచించిన కేయూరబాహు చరిత్రం, శృంగార శాకుంతలం ప్రబోధ చంద్రోదయ కృతులను ప్రబంధాలుగా రచించారేగాని వాటిని నాటకాలుగా అనువదించడంగాని, నాటకాలుగా వ్రాయడంగాని జరుగలేదు.

గంగాధరకవి, పశుపతి, భాస్కరుడు, నాగనాథుడు, పింగభూపాలుడు, ధర్మసూరి, వెంకటాధ్వరి, భట్టబాణుడు, నరసింహకవి మొదలైనవారంతా ఆంధ్రులై యుండి సంస్కృతనాటకాలనే రచించారు. కాటయవేముడు, శ్రీనివాసాచార్యులు తెలుగువారై యుండి సంస్కృత నాటకాలకు వ్యాఖ్యానాలు వ్రాశారేగాని నాటకాలు వ్రాయలేదు.

## రాజుల ఆనందానికే ఆనాటి నాటకాలు :

సంస్కృత నాటకాలు వ్రాసిన కవులందరికీ ఆనాడు రాజాదరణ బాగా లభించి

వుండవచ్చు. కేవలం వారి ఆనందానికే వారు ఆ నాటకాలను వ్రాసి వుండవచ్చు. ఇంతకు మినహా తెలుగులో విరివిగా నాటకాలు ఆడినట్లు మనకు తగిన ఆధారాలు అంతగా లభించడంలేదు. కాని ఆనాటి ఆంధ్రదేశంలో ప్రజల విజ్ఞాన వినోదాలకు జానపద కళారూపాలైన కురవంజి, యక్షగానాలు, పగటివేషాలు, జంగంకథలు మొదలైన కళారూపాలు కొన్ని శతాబ్దాలుగా ప్రదర్శిస్తూ వుండేవారని చరిత్రాధారాలవల్ల తెలుస్తూ వుంది.

## తొలి తెలుగు వీథి నాటకం

### క్రీడాభిరామం :

ప్రప్రథమంగా 14 వ శతాబ్దంలో తెలుగు దేశంలో క్రీడాభిరామం అనే తెలుగు వీధి నాటకం అవతరించింది. అయితే ఇది స్వంత రచన మాత్రం కాదు. సంస్కృత ప్రేమాభిరామం నాటకాన్ని అనువదించి వ్రాయబడింది. దీనిని వినుకొండ వల్లభరాయుడు రచించాడనీ, మరికొందరు శ్రీనాధుడు రచించాడనీ పరస్పర విరుద్ధమైన అభిప్రాయా లున్నాయి. ఈ వీధినాటకాన్ని మోపూరి భైరవుని తిరునాళ్ళలో ప్రదర్శించే వారట. దీని ఇతివృత్తమంతా పిచ్చశృంగా రంతో నిండివుంది. ఇది కేవలం వీధినాటకమై బహిరంగంగా ప్రదర్శించడంవల్ల ఆనాటి ఆంధ్రదేశంలో వివిధవర్గాల ప్రజలను ఆకర్షించింది.

18 శతాబ్దిలో ఆంధ్రదేశపు ప్రజల నానందింపజేసిన కళా రూపాలన్నీ జాన పద కళా రూపాలే ననడానికి మనకు అనేక ఆధారా లున్నాయి. అనేక దేవాల యాలమీద సృష్టించబడిన నృత్యవిశేషాలు, అమరావతి, నాగార్జునకొండ శిల్పాలు, లేపాక్షి, అజంతా వర్ణచిత్రాలు, అనేక రాతి, తామ్ర శాసనాలు, చాళుక్య, కాకతీయ, రెడ్డి, విజయనగర తంజావూరు రాజుల చరిత్రలూ మనకు వైజ్ఞానిక గాధల్ని చెపుతున్నాయి. ఇందుకు వుదాహరణ తంజావూరులో వందలసంఖ్యలో వున్న ప్రాచ్య లిఖిత యక్షగానాలే సాక్ష్యం.

### ప్రథమ తెలుగు నాటకం :

1860 నాటికి గాని తెలుగులో నాటకం వ్రాయబడలేదు. బందరు నోబుల్ కళాశాల ప్రధా నాంధ్రోపాధ్యాయుడైన కోరాడ రామచంద్ర శాస్త్రిగారు మంజరీ మధుకరీయం అనే నాటకాన్ని ప్రప్రథమంగా రచించారు. ఈ నాటకం 1908 లో

గాని అచ్చు కాలేదు. ఈ నాటకం ఎక్కువ సంస్కృత మర్యాదల ననుసరించి వుండడంవల్లనో ఏమో ప్రదర్శనానికి నోచుకోలేకపోయింది. ప్రథమంలో సంస్కృత నాటకాన్ని అనువదించింది కూడా వీరే.

వీరి తరువాత కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు 1872 లో నరకాసుర విజయ వ్యాయోగం, 1894 లో ధనంజయ విజయ వ్యాయోగం, 1872 లో ప్రసన్నరాఘవం నాటకాలను రచించారు. వీరిది కఠినమైన గ్రాంథిక శైలి. శ్లోకాలను పద్యాలుగాను, సంస్కృత వచనాన్ని వచనంగాను రచించారు. కాని వీరి నాటకాలు ప్రదర్శన యోగ్యమే కాలేదు.

1872 లో శాకుంతలాన్ని అనువదించిన పరవస్తు వెంకట రంగాచార్యులు గారు గ్రాంధికభాషను వాడినా ప్రాకృత భాషాస్థానంలో తెలుగును ప్రవేశపెట్టారు.

## ప్రథమ అనువాద నాటకాలు :

ప్రథమంగా 1875 లో వావిలాల వాసుదేవ శాస్త్రిగారు జూలియస్ సీజరు, షేక్స్పియర్ ఇంగ్లీషు నాటకాలను తెలుగులో అనువదించారు. సంస్కృతంనుండి మృచ్ఛకటిక, ఉత్తర రామచరితం తెనిగించారు. వారు స్వతంత్రంగా తెలుగులో పద్యాల రూపంలో నందకరాజ్యమనే ప్రథమ సాంఘిక నాటకాన్ని వ్రాశారు.

## ధార్వాడ నాటక సమాజాల జైత్రయాత్ర :

ఈకాలానికి తెలుగునాడులో ఎక్కడా స్వతంత్రంగా నాటకాలాడినట్లు మనకు ఆధారాలేవీలేవు. కాని ఈ సమయంలో 1880 సంవత్సరంలో ధార్వాడ నాటక సమాజాలవారు ఆంధ్రదేశమంతటా వారి హిందీ నాటకాలతో విజయయాత్రచేసి ఆంధ్ర ప్రజలలో నాటకోత్సాహాన్ని కలిగించారు.

ఆనాటికే వీరి నాటకాలలో బాహాటంగా తెరలను, మంచి మంచి చెమ్కీ దుస్తులను వాడారు. వీరి నాటకాలను ప్రజలు తండోపతండాలుగా చూశారు. ధార్వాడ వారిచ్చిన వుత్సాహంతో అదేమాదిరి నాటకాలు ప్రదర్శించడానికి పూను కుని రాజమండ్రిలో వీరేశలింగంగారు చమత్కార రత్నావళి అనే నాటకాన్ని ఆడిం

చారు. ప్రథమంగా తాటియాకుల హాలులో ప్రదర్శింపబడ్డ తొలి నాటకం ఇదే. రత్నావళి నాటకం కామెడీ ఆఫ్ ఎరర్స్ అనే షేక్స్పియర్ నాటకానికి అనువాదం.

ఈ కాలంలో ఆంధ్రదేశంలో దాదాపు అన్ని ముఖ్యనగరాల్లోనూ నాటక సమాజాలు ఏర్పడినాయి. కాని ప్రదర్శించడానికి నాటకాలు మాత్రం లేవు.

### వచన నాటకాలకు

### హరిః ఓం :

ధార్వాడవారు తీసుకున్న జానపద పురాణగాథల ననుసరించి తెలుగులో వచన నాటకాలు వ్రాయడం ప్రారంభించారు.

అలా వచన నాటకాలు వ్రాసిన వారిలో ముఖ్యులు కొండుబొట్ల సుబ్రహ్మణ్య శాస్త్రి, నాదెళ్ళపురుషోత్తం, కందుకూరు వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహం గారు. వీరిలో కొండుబొట్ల సుబ్రహ్మణ్యంగారు 1881 నుండి 35 వరకూ హరిశ్చంద్ర, వస్త్రాపహరణం, యుగంధర విజయం, గయోపాఖ్యానం మొదలైన 30 వచన నాటకాల్ని రచించారు. ఆనాడు వచన నాటకాలు అత్యంత మనోహరంగా వున్నట్లు చిలకమర్తివారు తమ స్వీయచరిత్రలో వ్రాసుకున్నారు. బందరులో హిందీ నాటకాలాడుతున్న నాదెళ్ళ పురుషోత్తమకవి "రామదాసు" "హరిశ్చంద్ర" తెలుగు నాటకాలను రచించారు.

తోలేటి సుబ్బారావుగారు రచించిన హరిశ్చంద్ర వచన నాటకాన్ని రాజమండ్రి హిందూ నాటక సమాజంవారు ఇమ్మానేని హనుమంతరావుగారి ఆధ్వర్యంలో చాలాసార్లు ప్రదర్శించారు.

1889 లో చిలకమర్తివారు రచించిన "కీచకవధ", "శ్రీరామజననం" "గయోపాఖ్యానం" "ద్రౌపదీపరిణయం" వచన నాటకాలే. గయోపాఖ్యాన నాటకం ప్రథమంలో వచనంలో రచింపబడిన తరువాతనే పద్యాలను చేర్చారు.

### ఒకడుగు ముందుకెళ్ళిన

### ధర్మవరంవారు :

సర్కారాంధ్రదేశంలో ఇలా వచన నాటకాలు ప్రదర్శిస్తున్నప్పుడు, రాయలసీమలో గద్యపద్యాత్మక నాటకాలాడాలనే వుత్సాహంతో ధర్మవరం కృష్ణమా

చార్యులవారు సరసవినోదిని సభను స్థాపించి నాటకాలు ఆడించారు. వీరు దాదాపు 28 నాటకాలు వ్రాశారు. అన్నీ పౌరాణిక నాటకాలే. వీరు నాటకాలలో గేయాలు, రాగమాలికలు, ద్యూయెట్లు ప్రవేశపెట్టారు. వచనంలో నున్న భావాన్నే పద్యం లోనూ, కీర్తనలలోనూ చెప్పించేవారు.

ఈ విధానాన్ని ఎందుకు ప్రవేశపెట్టవలసి వచ్చిందో, చిత్రనళీయం పీఠికలో వుటంకించారు వచనం చెప్పగలవారు వచనాన్ని, పద్యం బాగా పాడగల వారు పద్యాన్ని, పాటలు పాడగలవారు పాటలను వుపయోగించుకోవడానికి వీలుగా రచించానని వారు వుటంకించారు.

వీరు 1886 లో రచించిన చిత్రనళీయం, 1889 లో రచించిన విషాద సారంగధర, 1914 లో ప్రహ్లాద, ప్రమీలార్జునీయం, 1915 లో ముక్తావళి, 1916 లో చంద్రహాస, అజామీళ, 1919 లోని చిరకారి, 1920 లోని రుక్మాంగద మొదలైన పౌరాణిక నాటకాలు ఎక్కువ ప్రజాదరణను పొందాయి.

కృష్ణమాచార్యులుగారి రచనా కౌశల్యానికి మెచ్చుకుని 1910 లో గద్వాల సంస్థానాధీశులు ఆంధ్రనాటక పితామహ అనే బిరుదునిచ్చి సత్కరించారు.

### కోలాచలంవారి పోటీ :

ఈ కాలంలోనే బళ్ళారిలో కృష్ణమాచారిగారికి పోటీగా సుమనోరమ సభను స్థాపించిన కోలాచలం శ్రీనివాసరావుగారు 30 వరకూ గద్య పద్యాత్మక నాటకాలు రచించి, పేరు పొందారు. వీరి నాటకాలలో రామరాజు, ప్రహ్లాద, ద్రౌపదికీచక వధ,రుక్మాంగద,చాందుబీబీ మొదలైన నాటకాలు ఎక్కువ ప్రజాదరణను పొందాయి.

వీరికి బిరుదు సంపాదించిపెట్టిన నాటకం రామరాజు. బళ్ళారి రాఘవ ఈ నాటకాన్ని ఆంధ్రదేశంలోనేగాక మైసూరు బెంగుళూరు మద్రాసు నగరాలలో ప్రదర్శించి ప్రఖ్యాతి వహించారు.

గద్య, పద్య, గేయాత్మక నాటకాలు ఎక్కువ ప్రజాదరణ పొందడంవల్ల ఆనాటి రచయితలంతా ఈ విధానాన్నే అనుసరించారు. ప్రతి నాటకంలోనూ పద్యాలనూ పాటలనూ ద్యూయెట్లనూ విరివిగా ప్రవేశ పెట్టారు. ఇందుకు వుదాహరణ సంగీత హరిశ్చంద్ర, సంగీత సావిత్రి అనే పేర్లతో నాటకాలు వెలువడడమే.

పద్యాలు, పాటలు లేని నాటకం నాటకమే కాదనే స్థితికి ప్రేక్షకులు కూడా దిగజారారు.

## చిలకమర్తి పలుకుబడి, ప్రభావం :

ఆ ప్రభావంతోనే 1890 లో చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గయోపాఖ్యాన నాటకం అవతరించింది. ఆనాటినుండి ఈనాటివరకూ అర్ధ శతాబ్దంపైగా ఆంధ్రప్రజల నుజ్జ్రూత లూగించి ఈనాటికీ గణనీయమైన నాటకంగా నిలబడి, లక్ష కాపీలకుపైగా అమ్ముడుపోయింది.

## ఆంధ్ర నాటకరంగంలో నవ్యయుగం :

పౌరాణిక, చారిత్రిక నాటకాలు వుధృతంగా ప్రదర్శింపబడి ప్రజాభిమానాన్ని చూరగొంటున్న రోజులలో 1892 లో ఆంధ్రనాటక రంగంలోనూ, ఆంధ్రనాటక సాహిత్యంలోనూ ఒక నవ్యయుగం ప్రారంభమైంది. ప్రజాకవి గురజాడ అప్పారావుగారి సాంఘిక మహా నాటకం కన్యాశుల్కం వెలువడింది. ఈ నాటకంలో వాస్తవిక జీవితాన్నీ, వ్యవహారిక భాషనూ వుపయోగించి ఒక నూతన విప్లవాన్ని తీసుకు వచ్చారు. ఆనాటి సమాజంలోవున్న ఛాందసులైన బ్రాహ్మణ పండితుల్ని, కుహనా సంఘ సంస్కర్తల్ని, త్రాగుబోతుల్ని, వ్యభిచారుల్ని, దొంగ సన్యాసుల్ని, కోర్టు పక్షుల్ని, పోలీసుల్నీ, న్యాయవాదుల్నీ, రౌడీల్నీ మొదలైన సంఘంలోవున్న దుష్టశక్తుల గుట్టును బట్టబయలుచేసి ప్రజల్ని చైతన్యవంతుల్ని చేశారు. గంభీరమైన మానవత్వం కన్యాశుల్కంద్వారా వెల్లడించారు. ఈ నాటకాన్ని 1892 ఆగష్టులో విజయనగరం జగన్నాధ విలాసినీ నాటకసమాజంవారు మొదటిసారిగా ప్రదర్శించారు. కన్యాశుల్కం ఆనాటి కవిపండితులలోనూ, నాటక సమాజాల వారిలోనూ సంచలనం కలిగించింది. అనేక విమర్శలకు కూడా గురైంది. కన్యాశుల్కాన్ని రష్యనులు ఈ మధ్యనే రష్యన్ భాషలోకి అనువదించడం ద్వారా అది ప్రపంచ సాహిత్యంలో చేరిపోయింది.

## పాత్రోచిత భాషకు పునాదివేసిన వేదంవారు :

అప్పారావుగారి కన్యాశుల్కం అచ్చుపడి వెలువడిన సంవత్సరమే 1897లో వేదం వెంకటరాయశాస్త్రిలవారి "ప్రతాపరుద్రీయం" వెలువడింది. ఇంతకు ముందే శాస్త్రిగారు 1891 లో శ్రీహర్షుని నాగానంద నాటకాన్ని, 1896 లో కాళిదాసుని అభిజ్ఞానశాకుంతల నాటకాన్ని అనువదించారు. కాని ప్రతాపరుద్రీయ నాటకంతోనే శాస్త్రిగారి పేరు దశదిశల మారుమ్రోగింది. ఇది తెలుగులో వ్రాయబడిన మొదటి చారిత్రిక నాటకం. ఈ నాటకంలో వ్యావహారిక, గ్రామ్యభాషలను వాడడంతోపాటు ముస్లిం పాత్రలకు తెలుగు తురకాన్ని వాడి పాత్రోచితభాషకు మూలకారకులైనారు.

ఆనాటి అన్ని నాటకాలలోని పాత్రలకు గ్రాంధికభాషను వాడుతున్న సమయంలో శాస్త్రిగారి ఈ విధానం ప్రతిపక్షులైన అనేకమంది పండితులకు కంటకమైంది. ప్రతాపరుద్రీయ నాటకం రచనలో, పాత్రచిత్రణలో, పాత్రోచితభాషలో వున్నతస్థాయినందుకుని, అనేకమంది రచయితలకు ఆదర్శప్రాయమై, ప్రథమాంధ్ర చారిత్రిక నాటకంగా నిలబడింది. ఈ నాటకాన్ని నెల్లూరు ఆంధ్రసభవారు, తెనాలి రామవిలాససభవారూ ప్రదర్శించి వేనోళ్ళ పొగడబడ్డారు.

## మరో బహద్దరు పానుగంటి :

సర్కారాంధ్రదేశంలో మరో ప్రసిద్ధ నాటకరచయిత పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు 20 వ శతాబ్దంలో వెలుగులోకి వచ్చి దాదాపు 32 నాటకాలను రచించారు. వీరి నాటకాలలో ముఖ్యమైనవి విప్రనారాయణ, కంఠాభరణం, రాధాకృష్ణ, ప్రచండచాణక్యం, పాదుక మొదలైనవి. వీరు పౌరాణిక, చారిత్రక, సాంఘికాది నాటక విధానాలనన్నింటినీ సమర్ధతతో నిర్వహించారు. వీరు హాస్యరచనలో సిద్ధహస్తులు. వీరి నాటకాలలో హాస్యం హెచ్చుగా వుంటుంది. వీరి సంభాషణలలో వుపమానాలు హెచ్చు. వీరి రచనా విధానం గ్రాంధికమూ, వ్యవహారికమూ కాక, మధ్యే మార్గంలో నడుస్తుంది. వీరి సంభాషణలు దీర్ఘసమాసాలతో నిండి

వుండడంవల్ల నటులకు కొంత ఇబ్బంది కలిగేది. వీరి నాటకాలలో పద్యాలుకూడా ఎక్కువే. కాని పానుగంటివారు చివరిదశలో వ్రాసిన "పద్మిని" "విచిత్రవివాహం" మొదలైన నాటకాలను వచన నాటకాలుగానే రచించారు. వీరి నాటకాలలో ఏయే పాత్రను ఎలా మాట్లాడించాలో, వారి మనోహర వైఖరులను ఎలా ప్రకటించాలో వీరికి తెలిసినట్లు మన నాటకకవులలో మరి ఎవరికీ తెలియదని నండూరు బంగారయ్యగారు వీరి నాటకాలన్నిటినీ సమీక్షిస్తూ వుటంకించారు.

## తిరుపతి వెంకటకవుల

### విజయ పతాక :

శతాధిక గ్రంథకర్తలూ, శతావధానులూ, ఉద్దండపండితులూ అయిన తిరుపతి వెంకటకవులు మహాభారత గాథలను తీసుకొని 1908 లో పాండవవిజయం, 1909 లో పాండవజననం, 1913 లో పాండవాశ్వమేధం, 1921 లో పాండవ రాజసూయం మొదలైన 6 నాటకాలను రచించి పౌరాణిక నాటక ప్రపంచంలో విజయపతాకను ఎగురవేశారు. ముఖ్యంగా వీరి పాండవోద్యోగవిజయాలు ఆనాటి నుండి నేటివరకూ కొన్నివేలసార్లు ప్రదర్శింపబడి,ప్రతి ప్రేక్షకుని హృదయంలోనూ వారి పద్యాలు నిలిచిపోయి శాశ్వతస్థానాన్ని ఏర్పరుచుకున్నాయి. తిరుపతి కవుల ప్రతిష్ఠ ప్రజాసామాన్యంలా పెరగటానికి ఈ నాటకాలే కారణమయ్యాయి.

అయితే వీరి నాటకాలలో గద్యంకంటే వరుస పద్యాలు ఎక్కువ అవడం వల్ల నటుల ప్రతి నటుల అభినయానికి కొంత ప్రతి బంధకం ఏర్పడుతూంది. అందువల్ల వరుస పద్యాలలో కొన్నిటిని తగ్గించి పాడడం కూడా కద్దు. ఈ విధానంవల్ల ప్రేక్షకుల విసుగుదల కొంత తగ్గుతూ వుంది. వీరి నాటకాలలో స్త్రీ పాత్రలు లేకపోవడంవల్ల కూడ ప్రదర్శనానికి యోగ్యంగా వుండి ఈనాటివరకూ నిలిచివున్నాయి.

తిరుపతికవులు పై నాటకాలే కాక అనర్ఘనారదం, ప్రభావతీ ప్రద్యుమ్నం, పండితరాజం, సుకన్య అనే స్వతంత్ర నాటకాలనూ రచించారు గాని పాండవ నాటకాలు సంపాదించుకున్న స్థానాన్ని సంపాదించుకోలేక పోయాయి.

## వేదంవారి బాణీని అందిపుచ్చుకున్న శ్రీపాద :

ప్రతాపరుద్రీయం వచ్చిన తరువాత ఆ వుత్సాహంలోనే వెలువడిన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారి బొబ్బిలియుద్ధ నాటకం ముఖ్యమైనది. ఈ కాలంలోనే కోలాచలం శ్రీనివాసరావుగారి విజయనగరపతనం నాటకం వెలువడ్డది. బొబ్బిలి యుద్ధనాటకం ఆంధ్రనాటకరంగస్థలంలో ప్రదర్శింపబడి ప్రజాదరణ సంపాదించింది. ఈ నాటకంలోని పద్యాలు కూడ ప్రజల ను త్తేజపరిచాయి.

పౌరాణిక నాటకాలు ఉధృతంగా ప్రదర్శిస్తున్న ఈ సమయంలో 1918 లో బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి సత్యహరిశ్చంద్ర నాటకం ఆనాటికున్న అన్ని హరిశ్చంద్ర నాటకాలను ఆవలకునెట్టి అగ్రస్థానంలో కూర్చుంది. ఆనాటికీ, ఈ నాటికీ ఆంధ్రుల హృదయాలలో హత్తుకుపోయి చిరస్థాయిగా నిలబడింది. హరిప్రసాదరావు, డి. వి. సుబ్బారావు, యన్. వి. యల్. నరసింహం మొదలైన వారు ఏండ్లతరబడి ఈ ఒక్క నాటకాన్ని ప్రదర్శించే అఖండమైన ప్రతిష్ఠను సంపాదించుకున్నారు.

ఈ దశలో శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రిగారి సావిత్రి, చిలకమర్తివారి ప్రసన్న యాదవం, పారిజాతాపహరణం, మారేపల్లివారి బిల్హణీయం, కె. సుబ్రహ్మణ్య శాస్త్రిగారి లవకుశ, కృష్ణలీల, కాశీనాధుని వీరమల్లయ్యగారి నాటకాలు ప్రసిద్ధికెక్కాయి.

## దేశభక్తికి దారితీసిన దురంతాలు :

మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన తరువాత స్వరాజ్యం వస్తుం దనుకున్న భారతీయులకు ఆశాభంగమై, బెంగాలు విభజనోద్యమం, పంజాబు జలియన్‌వాలా బాగ్ దురంతాలు ప్రజలలో నూతనోత్తేజాన్ని, దేశభక్తినీ కలిగించాయి. కవులు పూర్వ చరిత్రలకు సంబంధించిన కథలను తీసుకుని సంభాషణరూపంలో బ్రిటిష్ ప్రభుత్వాన్ని దుయ్యబట్టారు. ఈ కోవకుచెందిన నాటకాలు రసపుత్ర విజయం, దుర్గాదాసు, రాణా ప్రతాప్, రాజసింహుడు, శివాజీ, తానాజీ, రోషనార, జేబున్నీసా,

మొదలైనవి. వీటిలో జేబున్నీసా, రోషనార, రసపుత్రవిజయం నాటకాలు, హిందూ మహమ్మదీయ కలహాలను రెచ్చగొడుతాయని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. ఈ కాలంలో కొప్పరపువారు అద్భుతంగా చిత్రించిన రోషనారపాత్రను స్థానం నరసింహారావుగారు అద్భుతంగా పోషించారు.

1919-20 సంవత్సరాలలో జాతీయ ఉద్యమాన్ని పురస్కరించుకుని దేశ భక్తిని పురికొల్పే నాటకాలు వెలువడ్డాయి. వీటిలో దామరాజు పుండరీకాక్షుడుగారు వ్రాసిన గాంధీ విజయం, పాంచాల పరాభవం ముఖ్యమైనవి.

జాతీయోద్యమ ప్రభావంతో ఇతర భాషలైన హిందీ, బెంగాలీ, మరాటీ భాషల నాటకాలను అనువాదంచేసి కూడ నాటకాలను ప్రదర్శించారు. ఈ కోవకు చెందిన నాటకాలు జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారి చంద్రగుప్త, షాజహాన్, మేవాడపతనం, శ్రీపాద కామేశ్వరరావుగారి చంద్రగుప్త, రాణా ప్రతాప్‌సింహ, నండూరి శివరావుగారి చంద్రగుప్త మాచిరాజు దుర్గాశంకర అమాత్యుని శివలీల, పింగళి నాగేంద్రరావుగారి మేవాడపతనం మొదలైనవి.

## సాంఘికోద్యమానికి సాయంచేసిన చింతామణి :

1921 ప్రాంతంలో సాంఘికోద్యమం విజృంభిస్తున్న రోజులలో కాళ్ళకూరి నారాయణ రావుగారు 1921 లో చింతామణి నాటకాన్ని, 1926 లో వర విక్రయం, మధుసేవ నాటకాల్ని రచించారు. ఈ మూడు నాటకాలూ అద్భుతంగా ప్రదర్శింపబడి ఒక విశిష్ట స్థానాన్ని ఏర్పరచుకున్నాయి. చింతామణి నాటకం ఈ నాటికీ ప్రదర్శింపబడుతూవుంది. ఈ కాలంలో వీరేశలింగంగారు బ్రాహ్మ వివాహం విచిత్ర నాటకం మునిసిపల్ నాటకం మొదలైన వాటిని హాస్యధోరణిలో ప్రజలకు అందుబాటులో వుండేటట్లు రచించారు.

1920-30 సంవత్సరాల మధ్యకాలంలో సోమరాజు రామానుజ రావుగారు దాదాపు 30 నాటకాలను వ్రాశారు. కాని వెలుగులో కొచ్చి ప్రదర్శింపబడిన నాటకాలు 1929 లోని రంగూన్ రౌడి, 1931 లోని ధరణికోట, 1934 లోని కాలకేతనము మొదలైనవి మాత్రమే. వీటిలో విశేషంగా ప్రదర్శింపబడి ప్రజాభిమానాన్ని చూరగొన్న నాటకం ఒక్క రంగూన్ రౌడి మాత్రమే.

ఈ కాలంలో వచ్చిన నాటకాలలో ప్రఖ్యాతి వహించిన మరికొన్ని నాటకాలున్నాయి. అవి 1922 లో వచ్చిన ముత్తరాజు సుబ్బారావుగారి శ్రీ కృష్ణతులాభారం, 1926 లో చందాలకేశవదాసుగారి కనకతార, ముత్తనేని వెంకట చెన్నకేశవులుగారి చండిక, 1936 లో పున్నవలక్ష్మీనారాయణగారి నాయకురాలు. 1926 లో ఆవటపల్లి హనుమంతరావుగారి కాళిదాసు, 1927 పింగళి నాగేంద్రరావు గారి నారాజు, 1923 బలిజేపల్లి లక్ష్మీకాంతంగారి ఉత్తర రాఘవం మొదలైనవి ముఖ్యమైనవి.

గ్రంధి సుబ్బరాయ గుప్తగారి ఆంధ్రమాత(1921)ద్రోణంరాజు సీతారామా రావుగారి ఆంధ్రపతాకం(1921)ఆంధ్రరాష్ట్రోద్యమానికి సంబంధించిన నాటకాలు.

ఈ కాలంలోనే భావకవులైన విశ్వనాధ సత్యనారాయణగారి నర్తనశాల 1924 లో వెలువడింది. వీరివే ఆనార్కలీ, సౌప్తిక ప్రళయం కూడ వెలువడ్డాయి. వీరి నర్తనశాల వుత్తమ నాటకంగా పరిగణింపబడింది.

1925 లో చింతాదీక్షితులుగారి శబరి నాటకం కూడా అపూర్వంగా రచించ బడింది. ఇందులోని సంభాషణలు అద్భుతంగా వ్రాయబడ్డాయి.

1924 లో దువ్వూరి రామిరెడ్డిగారి విషాద నాటకం కుంభరాణా ప్రదర్శింప బడి పలువురి ప్రశంసలందుకుంది.

### త్రిపురనేని

### తిరుగుబాటు :

సనాతనాచారాలమీదా, సనాతన ఛాందసులమీదా, భారత, రామాయణాది పురాణ, మత, తాత్విక గ్రంథాలమీదా తిరుగుబాటును లేవదీసిన త్రిపురనేని రామస్వామి చౌదరిగారు 1912 లో కురుక్షేత్ర సంగ్రామం, 1920 లో శంబుకవధ, 1935 లో ఖూనీ మొదలైన నాటకాలను రచించారు.

గుడిపాటి వెంకటచలం, ముద్దుకృష్ణగార్లు కూడ పౌరాణిక, చారిత్రిక నాటకాల్ని నూతన దృష్టిలో వ్యాఖ్యానించారు. ఈ విధానా న్ననుసరించి చలం గారు చిత్రాంగి, పద్మరాణి 1921లో సావిత్రి 1923లో శావలిని 1926లో మంగమ్మ 1920 మొదలైన నాటకాలను, సత్యం, శివం, సుందరం, అనే నాటికను, 1923 లో రచించారు.

ముద్దుకృష్ణగారి అశోకం 1930 లో వెలువడింది. దీని ఇతివృత్తం సీతారాముల మనస్తత్వాలకు నూతన వ్యాఖ్యానం.

ఈ దశలోనే 1920-30 సంవత్సరాల మధ్య వచ్చిన నాటకాలలో పింగళి నాగేంద్రరావుగారి "వింధ్యరాణి" మంచి నాటకంగా గణుతికెక్కింది.

1928 లో చిలకమర్తి షష్టిపూర్తి వుత్సవ సందర్భంలో వారు అనువదించిన భాసనాటకాలను సంపుటంగా ప్రకటించారు.

## నాటకరంగంలోనూ పేరుగడించిన సంగీత పండితుడు :

ఈనాటికి పాపట్ల కాంతయ్యగారనే గొప్ప సంగీత పండితుడు ఆంధ్రనాటక రంగంలో దేదీప్యమానంగా వెలుగొందుతున్న వ్యక్తి. ఈయన నాటకాలకు కీర్తనలు వ్రాయడంలో దిట్ట. వీరు మైలవరం బాలభారతీ సమాజానికి, రాజమంద్రి గున్నేశ్వరరావుగారి కంపెనీకి రకరకాల కీర్తనలు వ్రాసి, వాటికి బాణీలు ఏర్పాటు చేశారు. ఆనాటి తెలుగు నాటకాల పాటలన్నీ ఈయన ప్రతిభావిశేషాలకు సంబంధించినవే. వీరి పాటలు ప్రజలను బాగా ఆకర్షించాయి. కాని, నాటకాభినయానికి మాత్రం ఈ పాటలు కొంత ప్రతిబంధకం కలిగించాయి. 1920 సం॥ర ప్రాంతాల్లో నాటకాలన్నీ, సంగీతంతోనూ, పాటలతోనూ నిండిపోయి నాటక ప్రయోగానికి సంబంధించిన విలువలన్నీ పడిపోవడంతో బి. టి. రాఘవాచార్యులు సంగీత నాటకాలలోని అవకతవకలను ఎత్తిచూపుతూ "సంగీత ఇంద్రసభ" అనే నాటకాన్ని వెలువరించడమేకాక నటుల వుపయోగార్థం 1924 లో "నాటకదీపిక" అనే నాటక లక్షణ గ్రంథాన్ని రచించారు.

## సంగీత నాటకాల అవకతవకలపై దెబ్బలు :

1908 లో కోలాచలం శ్రీనివాసరావుగారు ప్రపంచ నాటకచరిత్రను ఇంగ్లీషులో ప్రచురించడమేకాక "ఆంధ్ర నాటకములు - కొన్ని నియమములు" అనే వ్యాసాన్ని ప్రకటించారు. ఈకాలంలో కృష్ణా పత్రికలో పురాణం సూరిశాస్త్రి, ముత్త

రాజు సుబ్బారావుగార్లు నిర్మాణాత్మకమైన వ్యాసాలను ప్రకటించారు. భమిడిపాటి కామేశ్వరరావుగారు సంగీతంతో పద్యాలను సాగలాగడం తప్పని వ్యాసాలద్వారాను, ఉపన్యాసాలద్వారాను వెల్లడించారు.

ఈ తరుణంలో పురాణం సూరిశాస్త్రిగారు నాట్యాంబుజం 1923, నాట్య అశోకం. 1924 విమర్శక పారిజాతం. 1925 పాశ్చాత్య నాటక రచనారీతుల్ని విశదీకరించే నాట్యోత్పలం మొదలైన నాటక విజ్ఞానానికి పనికివచ్చే గ్రంథాలను రచించారు. "ఆంధ్ర నాటకరంగం" అనే గ్రంథాన్ని గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు 1924 లో ప్రచురించారు. పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు "ఆంధ్రనట ప్రకాశిక" అనే పుత్తమ చారిత్రిక గ్రంథాన్ని రచించారు.

1923 లో "నాటకకళ" అనే పత్రికను బుర్రా శేషగిరిరావుగారు స్థాపించి యోగ్యమైన అనేక వ్యాసాలను వ్రాశారు.

## పాశ్చాత్యుల ప్రభావం :

1920-30 సంవత్సరాల మధ్యకాలంలో నాటకరంగంమీద అనేక విమర్శలూ, చర్చలూ జరిగాయి. 1930 నాటికి అంతర్జాతీయ నాటక సాహిత్యం మనకు అందుబాటులోకి రావడంతో బెర్నార్డుషా, చెకోవ్, ఇబ్సెన్, టాలుస్టాయి మొదలైన సుప్రసిద్ధ నాటకకర్తల నాటకాల ప్రభావం విద్యావంతులమీదా, మేధావులమీదా పడింది. ఆ ప్రభావంలో వెలువడిన పి. వి. రాజమన్నారుగారి తప్పెవరిది నాటకం సాంఘిక నాటకాల్లో నూతన విప్లవాన్ని తీసుకువచ్చింది. ఈ ప్రభావంలో వెలువడిందే రంగారాంగారి దంపతులు.

తప్పెవరిది, దంపతులు నాటకాల తరువాత చెప్పుకోదగిన నాటకం మల్లాది అవధానిగారి "గాలివాన".

## గాంధీజీ ప్రభావం :

1930 సంవత్సరంలో ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమైన తరువాత, గాంధీజీ తన దృష్టినంతా హరిజన సమస్యల మీద కేంద్రీకరించారు. ఈ ప్రభావం నాటక రచయితలమీదకూడా పడింది. ధర్మవరం గోపాలాచార్యులుగారి 'అస్పృశ్య

విజయం', పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారి 'నందనార్', తాంధ్ర సుబ్రహ్మణ్యం గారి 'పతితపావన', మునిమాణిక్యంవారి 'తిరుగుబాటు' మొదలైనవి ముఖ్యమైనవి.

1935 లో ఒకే ఇతి వృత్తాన్ని తీసుకుని విశ్వనాథ సత్యనారాయణగారు వేనరాజు అనే కథను, త్రిపురనేని రామస్వామిగారు ఖూనీ అనే కథను, బుచ్చి వెంకటకృష్ణయ్య చౌదరిగారు విప్లవం, లేక వేనరాజు అని విభిన్న దృక్పథాలను వెల్లడించారు. వీరు ముగ్గురూ సమర్థులైన రచయితలు కావడంవల్ల మూడు నాటకాలూ వుత్తమంగానే వున్నాయి.

## నాటక రచనలో మార్పు :

ఈ దశలోనే నాటకరచనలో మార్పు వచ్చింది. శివశంకరస్వామి పద్య, గేయ నాటికలను రచించారు. పద్మావతీ చరణ చారణ చక్రవర్తి, దీక్షిత దుహిత, కవిప్రియ మొదలైన గేయ నాటికలు వెలువడ్డాయి.

1920 లో వచ్చిన జాతీయోద్యమప్రభావంతో ప్రజా సమస్యలు తీసుకుని నాటకాలు వ్రాయడం మొదలు పెట్టారు. ప్రథమంగా రైతు జీవితాన్ని, కష్ట సుఖాలను చిత్రించే నాటకంగా సబ్నవీసు రామారావుగారు రచించిన రైతుబిడ్డ వెలువడింది.

ఆ తరువాత నాటక ప్రయోగంలో నూతన విధానాన్ని ప్రవేశపెట్టిన వేలూరి చంద్రశేఖరంగారి కాంచనమాల నాటకం 1939 లో వెలువడింది. బందరులో ప్రదర్శింపబడి కళాకారుల ప్రశంస లందుకుంది,

1930-40 సంవత్సరాలమధ్య ఈ దశాబ్దంలో వచ్చిన విషాద నాటకాలలో ప్రతాపరెడ్డిగారి ఉచ్చుల ప్రాముఖ్యం వహించింది. అనువాద నాటకాలలో పురిపండా అప్పలస్వామిగారి ఉత్కలపతనం, 1931 శ్రీపాద కామేశ్వరరావుగారి కళాపహాడ్ ముఖ్యమైన నాటకాలు.

స్వతంత్ర నాటకాలలో చిలుకూరి నారాయణరావుగారి పౌరాణిక వచవ నాటకం అంబ, కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి భక్తకుచేల, చందాల కేశవదాసుగారి బలిబంధనం, ముత్తనేనివారి తులసీదేవి, ధర్మవరం గోపాలాచార్యులుగారి

సుభద్రార్జునీయం, ముత్తరాజుగారి మార్కండేయ, ఊటుకూరివారి పాషాణి బాల సరస్వతి భక్తతుకారాం మొదలైనవి ప్రసిద్ధిపొందిన పౌరాణిక నాటకాలు.

సాంఘిక నాటకాలలో గాలి బాలసుందరరావుగారి 'అపోహ', కాళ్ళకూరి హనుమంతరావుగారి 'కాలేజిగరల్', 'లేడి డాక్టర్' మొదలైనవి ప్రదర్శింపబడి ప్రముఖుల ప్రశంస లందుకున్నాయి.

చారిత్రక నాటకాల్లో గుండిమెడ వెంకట సుబ్బారావు, 'ఖిల్జీ రాజ్యపతనం' అనేకసార్లు ప్రదర్శింపబడి విమర్శకు గురైంది. వీరి 'మేవాడ పతనం' కూడా ఈ కాలంలోనే రచింపబడింది.

## నాటకరంగ చరిత్రలో నవ చైతన్యం :

ఆంధ్రనాటకరంగ చరిత్రలో 1943 నుండి ఒక నవచైతన్యం కలిగింది. ప్రపంచ మంతా ఫాసిస్టుల ప్రళయార్భాటాలతో మారుమ్రోగిపోతోంది. శాంతికి అశాంతికి, ధనికవర్గానికి పేదవర్గానికి సంఘర్షణ ప్రారంభమైంది. ఈ స్థితిలో సోషలిస్టు భావాలు గల యువకులందరూ యువజన సంఘాలద్వారా, వైజ్ఞానిక ప్రదర్శనలద్వారా ప్రజలను ప్రబోధించారు. ఈ ప్రబోధంతో వేలాది యువకులు కదిలారు. అభ్యుదయాన్ని కాంక్షించే రచయితలందరూ పాటలు, వీధినాటకాలు, బుర్రకథలు, జముకుల కథలు, నాటకాలు, నాటికలు వ్రాశారు.

దీనితో ఆంధ్రనాటక సాహిత్యం అభ్యుదయదశను అందుకుంది. ఈ దశలో జమీందారీ విధాన దుష్ఫలితాలను చిత్రిస్తూ సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావుగార్లు 'ముందడుగు' నాటకాన్ని 1946 లోనూ, మా భూమి నాటకాన్ని 1947 లోనూ రచించారు. మా భూమి నాటకం ఆనాటి నిజాంప్రభువు, అతని తాబేదార్ల యొక్క నిరంకుశత్వాన్నీ, దోపిడీ విధానాన్నీ చిత్రిస్తూ వెలువడింది. పై రెండు నాటకాలనూ ఆంధ్రదేశంలో అనేక ప్రజా నాట్యమండలి దళాలు ప్రదర్శించాయి. ఒక్క మా భూమినాటకం ఒక్క సంవత్సరంలో అఖిలాంధ్ర దేశంలో 125 ప్రజా నాట్యమండలి దళాలు వెయ్యి ప్రదర్శనాలను ప్రదర్శించాయి. 20 లక్షల మంది ప్రజలు నాటకాన్ని చూచి ఆనందించారు. రాజకీయనాయకులు, పండి

తులు, మంత్రులు, గాయకులు, కవులు ఎంతగానో ప్రశంసించారు. చివరికి ఈ నాటకం రాజకీయ కారణాలవల్ల 1948 లో నిషేధింపబడింది. ఈ రచయితలదే 'అపనింద' సాంఘిక నాటకం కూడా ఆదరణ పొందింది.

## తిరుతిరుల

## తెలుగు నాటకాలు :

ఇదేసమయంలో కొండముదిగోపాలరాయశర్మగారి 'ఎదురీత' 1946 లో వెలువడి నాటక కళాపరిషత్తులో ప్రథమ బహుమతినందడమేగాక, ఆంధ్రదేశపు ముఖ్య కేంద్రాలలో ప్రదర్శింపబడింది. 1946 లో వేదాంతకవిగారి 'ఆకలిమంటలు', బోయి భీమన్నగారి 'పాలేరు' పలుచోట్ల ప్రదర్శింపబడి ప్రజామన్ననలు అందుకున్నాయి.

భారతదేశానికి 1947 లో స్వాతంత్ర్యం సిద్ధించాక, దేశంలో హిందూ, ముస్లిం కలహాలురావడంతో ఐక్యతను ప్రతిబింబిస్తూ వచ్చిన నాటకాలు ఆత్రేయ గారి ఈనాడు, గోపాలరాయశర్మగారి 'ఎకదేశం' 1947 ముఖ్యమైనవి.

ఈకాలంలో వృత్తి నాటక సంఘాలద్వారా విరివిగా ప్రదర్శింపబడి పేరు తెచ్చుకున్న నాటకాలు తాండ్ర సుబ్రహ్మణ్యంగారి 'రామాంజనేయ యుద్ధం', కొప్పరపు సుబ్బారావుగారి 'తారాశశాంకం' ముఖ్యమైనవి.

పాత ఇతివృత్తాలను తీసుకుని, పాత్ర చిత్రణలో నూతన విధానాన్ని ప్రవేశపెట్టిన ఊటుకూరి సత్యనారాయణగారి 'ద్రౌపది''శివాజీ' 'అనార్కలి' 'వీరాభిమన్యు' వెలువడి ప్రదర్శింపబడి పలువురి ప్రశంసలందుకున్నాయి. ఇదేవిధానంలో నండూరి కృష్ణమాచార్యులుగారు 'ధర్మచక్రం' 'శేషబాబు' 'తిష్యరక్షిత' రమణీయంగా రచించారు. ఈకాలంలో ఎన్నదగిన పౌరాణిక నాటకం పైడిపాటివారి 'ఉషాసుందరి'.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత మన పూర్వుల శౌర్యపరాక్రమాలను వివరిస్తూ 1948 లో కణ్వశ్రీగారు 'ఆనాడు' అనే నాటకాన్ని వ్రాసి స్వయంగా ప్రదర్శింపజేసి ప్రశంసలందుకున్నారు.

ఈకాలంలో వెలువడ్డ డి.వి. కృష్ణమూర్తిగారి 'విషాద తిమ్మరుసు', శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి 'రాజరాజు' వుత్తమశ్రేణికి చెందిన విషాద నాటకాలు.

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. కాని, ఆంధ్రుల చిరకాలవాంఛ ఆంధ్రరాష్ట్రం మాత్రం అవతరించలేదు. తెలుగు వారికి తెలుగు రాష్ట్రం రావాలనే ఆవేశంలో, వేదాంతకవిగారి 'తెలుగు తల్లి', వావిలాల సోమయాజులుగారి 'నాయకురాలు', గుళ్ళపల్లి నారాయణమూర్తిగారి 'ఆంధ్రజ్యోతి', రాయప్రోలు సుబ్రహ్మణ్యం గారి 'కొండవీడు' మొదలైన నాటకాలను అనేక సమాజాలు ప్రదర్శించి, ఆంధ్రులను ఉత్తేజపర్చాయి.

ఈకాలంలో అమెచూరు నాటక దళాలు ముద్దుకృష్ణగారి 'టీకప్పులో తుఫాను' 'అడయిక్కా పిళ్ళే', భమిడిపాటివారి 'పెళ్ళి ట్రైనింగు' 'పెళ్ళికంట్రోలు' 'పూర్వరంగం' 'మాయలోకం' మొదలైన నాటకాలు ప్రదర్శింపబడి ప్రజలకు వినోదం కలిగించాయి.

ఆంధ్రనాటక కళాపరిషత్తు స్థాపించబడి, సాంఘిక నాటక నాటికల, పోటీ ప్రదర్శనాలను పరిషత్తు నడిపింది. పరిషత్తు ఇచ్చిన ఈ వుత్సాహంతో అనేక మంది రచయితలు సాంఘిక నాటకాలను ఎంతో కట్టుదిట్టంగా వ్రాయడానికి పూనుకున్నారు. ఈ విధంగా ప్రతి సంవత్సరం అనేక నాటకాలు వెలువడ్డాయి.

పరిషత్తు నాటకాల్లో 1947 లో కొండముదిగోపాలరాయశర్మగారి 'ఎదురీత' నాటకం గొప్ప పేరు తెచ్చుకుంది. ఈ సమయంలో గోపాలరాయశర్మగారు నాటక కళమీద వ్యాసాలు వ్రాసి, ఆంధ్రప్రభలో పరంపరగా ప్రకటించారు. 'గౌతమ బుద్ధుని' జీవితాన్ని చిత్రిస్తూ ఆచార్య ఆత్రేయ, కొండముదిగోపాలరాయశర్మ 'గౌతమబుద్ధ' నాటకాలను ప్రశంసనీయంగా రచించారు. కొండముదివారి 'న్యాయం' కూడా ఈకాలంలో వెలువడిందే.

ఈ దశాబ్దంలో ప్రపంచ ఖ్యాతిగాంచిన ఇంగ్లీషు నాటకాలు తెలుగు అనుకరణతో అనేకం వచ్చాయి. వాటిలో ముఖ్యమైనవి కొప్పరపు సుబ్బారావుగారి 'ఇనుపతెరలు' శ్రీ శ్రీ వరదల సంపెంగతోట అవసరాల వెంకటనర్సు 'జ్యోతిర్మయి' ముప్పన చినఅంకయ్య కుళ్ళుసరుకు, సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి 'కళ్యాణి' విద్వాన్ విశ్వంగారి 'ప్రజావిరోధి' గౌతమ 'మేడిపళ్ళు' ముఖ్యమైనవి. వీటిలో

కొప్పరపు సుబ్బారావుగారి 'ఇనుపతెరలు' నిర్మాణాత్మకంగా ఎక్కువ ప్రశంస లందుకుంది.

పతనమైన స్త్రీల ఇతివృత్తంతో పిఠాపురం యువరాజాగారు తీరనికోరికలు అనే నాటకం వ్రాశారు. ఈ దశలోనే మల్లాది అచ్యుతరామశాస్త్రిగారి సతీసక్కుబాయి, గుండిమెడవారి 'పృథ్వీపుత్ర' కోటగిరి వెంకటకృష్ణారావుగారి 'అభినవ పాండవం' బెబ్బులి, కాజరాధాకృష్ణశాస్త్రి 'అమరజ్యోతి', జంపనవారి 'వెంకటేశ్వర మాహత్మ్యం' నాటకాలు ప్రసిద్ధిపొందాయి. వీటిలో సక్కుబాయి, వెంకటేశ్వర మాహాత్మ్యం విరివిగా ప్రదర్శింపబడ్డాయి.

1940 నుండి 50 వరకూ వచ్చిన నాటకాలలో ఆత్రేయగారి యన్. జి. ఓ. 'అశోకసామ్రాట్' 'విశ్వశాంతి' 'ప్రగతి' 'భయం' 'కప్పలు' మొదలైన నాటకాలు ఆంధ్రప్రజలలో ఎక్కువ సంచలనాన్ని కలిగించాయి.

1953 లో తెలంగాణా దేశముఖుల హింసాకాండను చిత్రిస్తూ వాసిరెడ్డి భాస్కరరావు వ్రాసిన పోతుగడ్డ నాటకం కూడ మంచి ప్రచారం పొందింది. ఈ కాలంలోనే బెల్లంకొండ రామదాసుగారి 'అతిథి' నాటకం వెలువడింది.

ఈ తరుణంలో బంజరుభూముల పోరాటాన్ని చిత్రిస్తూ సుంకర 'భూమి కోసం', కె. వి. రమణారెడ్డి. పి. వేణుగార్ల 'అన్నపూర్ణ' నాటకాలు వెలువడ్డాయి. ఈ కాలంలో పినిసెట్టి శ్రీరామమూర్తిగారి 'పల్లెపడుచు' 'అన్నా చెల్లెలు', మల్లాది సత్యనారాయణగారి 'పేదపిల్ల' నాటకాలు ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడి అధిక ప్రశంస లందుకున్నాయి. ఈ కోవకుచెందినవే కొడాలి గోపాలరావుగారి 'తిరుగుబాటు' బల్లా ఈశ్వరుడుగారి 'నేటి న్యాయం' పడాలి రామారావుగారి 'భూదేవి' కోడూరు అచ్చయ్యగారి 'పెత్తందారు' కణ్వశ్రీ 'ఇదా ప్రపంచం' భూషణ్‌బాబు 'స్వతంత్రభేరి' సోమసుందర్ మందీ-మనిషి, లక్ష్మీకాంత మోహన్ సమ్మెపిలుపు, నవకుమార్ 'ప్రజా విజయం' మొదలైన ప్రజా సమస్యలను చిత్రించే సామాజిక నాటకాలు వెలువడ్డాయి.

అనిసెట్టి సుబ్బారావుగారు గ్రామాలలోని మురాతత్వాలనూ, అన్యాయాలనూ చిత్రిస్తూ ఆ అన్యాయాల వత్తిడిలో నలిగిపోయిన బడిపంతులు జీవితాన్ని ప్రతిబింబింపజేస్తూ 1954 లో మా వూరు నాటకాన్ని రచించారు.

గ్రామపంచాయితీ, మున్సిపాలిటీ రాజకీయాల్లోని వివిధ తరహాల మనస్తత్వాలకు చెందిన కౌన్సిలర్లనూ, ప్రెసిడెంట్లనూ చిత్రిస్తూ, స్వార్థం కొద్దీ వారు చేసే దురన్యాయాలను చిత్రిస్తూ కొడాలి గోపాలరావు 'ఛైర్‌మన్' నాటకం, కొండేటి సుబ్రహ్మణ్యంగారి 'ప్రెసిడెంటు పట్టయ్య' నాటకం వెలువడ్డాయి.

ఈ కాలంలో ధనికవర్గాన్ని, భూస్వామ్యవర్గాన్ని చిత్రించే నాటకాలేకాక, పెట్టుబడిదారీ వర్గంచే పీడింపబడే కార్మికుల జీవితాలను చిత్రిస్తూ, బోయి భీమన్నగారు 'కూలిరాజు' నాటకాన్ని కొడాలి గోపాలరావుగారు 'కూలినాటకాన్ని' పడాల రామారావు 'నేతబిడ్డ' నాటకాన్ని రచించారు. ఈ తరహా నాటకాలు దేశంలో విరివిగా ప్రదర్శింపబడి ప్రజల మన్ననలుపొందాయి.

స్వాతంత్ర్యానంతరం దేశ రాజకీయ సాంఘిక పరిస్థితుల వాస్తవాన్ని చిత్రిస్తూ ఆశాభంగం చెందిన ప్రజలకు కనువిప్పుగా ఆచార్య ఆత్రేయ 1952 లో వాస్తవం, నాటకాన్ని పడాల రామారావు 1953 లో ఇదా స్వతంత్రం అనే నాటకాన్నీ వెలువరించారు. ప్రణాళికా యుగంలో, గ్రామపంచాయితీల పరిపాలనతో ఉద్ధరింపబడిన గ్రామోద్ధరణను చిత్రిస్తూ ప్రచారయోగ్యమైన నాటకాలు వెలువడ్డాయి. వాటిలో ముఖ్యమైనవి 1950 లో కె. యల్. నరసింహారావు రచించిన 'కొత్తగుడి' 'అడుగుజాడలు' 1956 లో వెలువడిన పసుమర్తి యజ్ఞనారాయణ శాస్త్రిగారి 'గ్రామసేవ' పైడిపాటి సుబ్బరాయశాస్త్రిగారి 'అంకితం' నండూరి సుబ్బారావుగారి 'గ్రామసేవక్' కొట్టుపాటి గంగాధరరావుగారి 'అందరి ఆనందం' కావ్యశ్రీ 'కలెక్టరు' ముఖ్యమైనవి.

పాశ్చాత్య నాటకాన్ని ఆధారం చేసుకుని 1951 లో డి. వి. నరసరాజుగారు 'నాటకం' అనే నాటకాన్ని వృత్తమంగా రచించారు. ఈ నాటకం ఔత్సాహిక నాటక సమాజాలకు ఎంతో వుత్సాహాన్నిచ్చింది.

నాటకంలో జీవించి, జీవితంలో నటించే ఒకానొక మానవుని అయోమయ అవస్థను చిత్రిస్తూ ప్రఖ్య శ్రీరామమూర్తిగారు 'మనిషిలో మనిషి' నాటకాన్ని 1962 లో రచించారు.

మానవునికి మానవునికి మధ్యవుండే అగాధాలను చిత్రిస్తూను, ఆ నీలితెరల

తొలగించుకుంటే శాంతి లభిస్తుందనే ఇతివృత్తాన్ని తీసుకుని అంగర సూర్యారావు గారు 'నీలితెరలు' నాటకాన్ని రచించారు.

ధనపిశాచం ఆవహించిన మానవులు దానవులుగా తయారవుతారనే సత్యాన్ని 'లంకెబిందెలు' 'దొంగవీరడు' నాటకాలలో కొడాలి గోపాలరావుగారు చిత్రించారు.

స్త్రీ పాత్రలు లేని నాటికలు, హాస్య నాటికలు, నాటకాలు. గంభీరమైన ఇతి వృత్తాలతో వివిధరకాల సాంఘిక నాటకాలను కొడాలి గోపాలరావు, క్రొరపాటి గంగాధరరావుగార్లు రచించారు. వీరి నాటకాలు జనరంజకాలు. ఆంధ్రదేశంలో అనేక సమాజాలు వీరి నాటకాలను ఉత్సాహంతో ప్రదర్శిస్తున్నారు.

స్వప్నజగత్తులో మానవునికి కలిగే తీరనికోరికలను చిత్రిస్తూ కొత్త పద్ధతిలో అనిసెట్టి సుబ్బారావుగారు 'గాలిమేడలు' నాటకాన్ని, శ్రీవాత్సవ తీరనికోరికలు అనే నాటకాన్ని రచించారు.

విధివశాన ఒక పిల్ల చెడిపోతే ఆమెకు భవిష్యత్తులేదా? బాగు పడడానికి అవకాశాలేలేవా? అలా కృంగి కృశించిపోవలసిందేనా? అనే ప్రశ్నకు సంబంధించిన వివిధ మనస్తత్వాలు గల యువతీ యువకుల నాధారంగా తీసుకుని 1956 లో 'పునర్జన్మ' నాటకాన్ని బెల్లంకొండ రామదాసుగారు, 'పంజరం' నాటకాన్ని అవసరాల సూర్యారావుగారు, 1959 లో పి. వి. రాజమన్నారుగారు 'మనోరమ' నాటకాన్ని రచించారు. ఈ మూడు నాటకాల్లో 'పునర్జన్మ' 'పంజరం' అనే నాటకాలు పరిషత్తు పోటీలలో ప్రదర్శింపబడి బహుమతుల నందుకున్నాయి.

కణ్వశ్రీ, బి. యస్. సూరి, మందపాటి సీతంరాజు మొదలైనవారు అధిక సంఖ్యలో నాటకాలను రచించారు.

ముఖ్యంగా సీతంరాజువారి నాటకాలు పల్లెల్లో విరివిగా ప్రదర్శిస్తున్నారు. వీరి నాటకాలలో ముఖ్యమైనవి 'పేదపడుచు' 'పేదపిల్ల' 'దోపిడి' 'ప్రతిఫలం' మొదలైనవి.

స్వాతంత్ర్య సమరంలో ఆంధ్రదేశంలో వీరులుగా కీర్తించబడ్డ వారి జీవితాలను ప్రతిబింబిస్తూ బ్రిటిష్ ప్రభుత్వాన్ని గడగడ లాడించిన అల్లూరి సీతారామ రాజు వీరగాథను 'పితూరి' పేరుతో వడాల రామారావుగారు, 'మన్యవిప్లవజ్వాల' పేరుతో ధూళిపాళ సూర్యనారాయణమూర్తి, అల్లూరి సీతారామరాజు పేరుతో గబ్బిట వెంకటరావు, ఆకుల సుబ్రహ్మణ్యం మొదలైనవారు నాటకాలను రచించారు.

పూర్వాంధ్రుల శౌర్య పరాక్రమాలను చిత్రిస్తూ పెమ్మరాజు గోపాలకృష్ణ మూర్తిగారు'నాగమనాయకుడు''వీరకాపయ''వీరపాండ్య కట్టబ్రహ్మన' నాటకాలను, నండూరి బంగారయ్యగారు 'ఆంధ్రతేజాన్ని', కన్నసామి మహా రుద్రీయ నాటకాన్ని రచించారు.

కవి బ్రతికుండగా ఆయనను గౌరవించలేని వ్యక్తులు, ఆయన బ్రతకడని తెలిసి ఆయన మరణం ద్వారా కీర్తిని ఆర్జించాలనే వ్యక్తుల మనస్తత్వాన్ని చిత్రిస్తూ భమిడిపాటి రాధాకృష్ణ 'కీర్తిశేషులు' నాటకంలో నేటి కవుల దుర్భరజీవితాలను చిత్రించారు.

ఇంకా కుందుర్తి ఆంజనేయులుగారు ఆశనాటకాన్ని, కణ్ణపాటి గంగాధర రావుగారు గుడ్డిలోకాన్ని, రవీంద్రుని శతజయంతి వుత్సవాలను పురస్కరించుకుని బెజవాడ గోపాలరెడ్డి, అబ్బూరు రామకృష్ణరావు, శ్రీనివాస చక్రవర్తిగార్లు రవీంద్ర నాటకాలను అనువాదం చేశారు. చలన చిత్ర దర్శకుడు జగన్నాధ్‌గారు అనేక మహారాష్ట్ర నాటకాలను అనువదించారు.

వ్యాపారంలో భాగస్వామిని మోసంచేసి అతని ఆకలిచావుకు కారణమైన మార్వాడీ సేటును అతని ధనాశను ఆధారం చేసుకుని మరణించిన భాగస్వామి కుమారుడు మాస్టర్జీ వంచించి, ఆతని ధనమంతా అపహరించి హత్యచేసిన గాథను 'మాస్టర్జీ' నాటకంగా బెల్లంకొండ రామదాసుగారు రచించారు. ఈ నాటకం అనేక చోట్ల ప్రదర్శింపబడి అనేకమంది ప్రశంస లందుకుంది.

అపరాధ పరిశోధక నవలలవ్యాప్తి కారణంగా అపరాధ పరిశోధక నాటకాలు కూడా వెలువడ్డాయి. ఈ కోవకుచెందినవి ప్రఖ్య శ్రీరామమూర్తిగారి కాళరాత్రి,

ఫణి మొదలైనవి. ఇవి పాశ్చాత్య నాటకాలకు అనువాదాలు. ఈ నాటకాలు కూడ ప్రేక్షకుల ప్రశంస లందుకున్నాయి.

ఇతరదేశ రచయితల నాటకాలకు అనువాదంగా భమిడిపాటి కామేశ్వర రావుగారు మోలేర్, షేరిడాన్ నాటకాలను, సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారు, విశ్వం పెళ్ళి, న్యాయం నాటకాలను, శివంగారి 'నేరమూ-శిక్ష' 'వారసురాలు' డి. వి. నరసరాజు, రెంటాల, బెల్లంకొండ, గిడుతూరి, సోమంచి మొదలైనవారు 'ఇన్ స్పెక్టర్ జనరల్ నాటకాన్ని, ముద్దుకృష్ణ 'ఆడవాళ్ళ తెలివి', మారుతీరావు 'రాగ రాగిణి 'కొట్టుపాటి విషకుంభాలు' ఏ. యస్. అవధాని 'ఆదర్శాలు' శ్రీనివాస చక్రవర్తి 'నీటికాకి' 'పతితజీవులు''జైత్రయాత్ర' కోడూరు అచ్చయ్య 'తప్పునాదే' విద్వాన్ విశ్వం మహాశిల్పి దండమూడి మహీధర్ 'చంద్రయ్యాలో చైతన్యం' జోగిరాజుగారి 'అనామకులు' వి. యన్. శర్మగారి ఫౌస్ట్, వావిలాల, అమరేంద్ర, దుర్భా రామమూర్తి, లక్ష్మీకాంత మోహన్‌గార్లు షేక్స్పియర్ అనువాద నాటకాలు ఉపాధ్యాయుల సూర్యనారాయణమూర్తిగారి 'పంకజాక్షి' పి. వి. ఆచార్, ఆపద్బాంధవులు మొదలైనవి ముఖ్యమైన అనువాద నాటకాలు.

పైన వుదాహరించిన అనువాద నాటకాలే కాక, సమాజంలోవున్న వివిధ సాంఘిక సమస్యలను చిత్రిస్తూ బుచ్చి బాబుగారి 'ఆత్మవంచన', చలంగారి జయదేవ, పురూరవ, బోయి భీమన్నగారి రాగవాశిష్ఠం, నాగభూషణ్ 'విషాదాంతం' ముప్పన చినఅంకయ్య 'శిథిలాలయం' మాడభూషి వెంకటాచారి 'ప్రభ' గన్నిసెట్టి 'శారద' మొదలైన నాటకాలు ప్రేమతత్వాన్ని చిత్రించే నాటకాలుగా వెలువడ్డాయి.

వివాహ సమస్యను ప్రత్యేకంగా తీసుకుని చిత్రించే నాటకాల్లో పినిసెట్టి 'కులంలేనిపిల్ల' 'కన్నికొడుకు' భమిడిపాటి రాధాకృష్ణ 'ఇదేమిటి?' రాం షా 'లక్ష్మీపతిగారి అమ్మాయిలు', గన్నిసెట్టి భలేపెళ్ళి, మునిమాణిక్యం గృహప్రవేశం యజ్ఞన్నశాస్త్రిగారి కట్నంలేని కళ్యాణం మొదలైన నాటకాలు వెలువడ్డాయి. వీటిలో ఎక్కువగా ప్రదర్శించబడిన నాటకాలు'కులంలేనిపిల్ల' 'ఇదేమిటి' 'భలేపెళ్ళి' మొదలైనవి.

ఆంధ్రనాటక రంగంలో, ముఖ్యంగా సాంఘిక నాటకాల్లో రక్తకన్నీరు నాటకం ఒక విశిష్టస్థానాన్ని సంపాదించుకుంది. తమిళ నాటకానికి అనువాదంగా

పద్మరాజుగారు రచించారు. పి. నాగభూషణంగారు ఈ నాటకాన్ని కొన్నివందలసార్లు ప్రదర్శించారు. మల్లాది విశ్వనాథశర్మ (విశ్వనాథ కవిరాజు) మల్లాది వెంకటకృష్ణ శర్మ సోదరులు అనేక నాటకాలను రచించారు. వీరి నాటకాలు చాలవరకు సురభి నాటక సమాజాలవారు ప్రదర్శించారు.

ఎప్పుడు సంపదగలిగిన.. .కప్పలు పదివేలుచేరు అనే వృత్తాన్ననుసరించి ఆచార్య ఆత్రేయగారి 'కప్పలు', పినిసెట్టి 'ఆత్మీయులు' నాటకాలు వెలువడ్డాయి.

పల్లెటూరి జీవితాన్ని చిత్రిస్తూ వెలువడిన దాసం గోపాలకృష్ణగారి 'చిల్లర కొట్టు చిట్టెమ్మ' నాటకం పలుచోట్ల ప్రదర్శింపబడి ప్రశంస లందుకుంది.

కోర్టుల్లో నిజాన్ని అబద్ధంగానూ, అబద్ధాన్ని నిజంగానూ చిత్రించే నాటకంగా రాచకొండ విశ్వనాథశాస్త్రిగారి 'నిజం' నాటకం వెలువడింది.

ఒక వ్యక్తి మరణానికి నేను కారణమంటే నేను కారణమని భావించుకుని వాదించే ఇరువురు వ్యక్తుల మనస్తత్వాన్ని పోతుకూచి సాంబశివరావుగారు 'హంతకులు' అనే నాటకంలో వివరించారు.

ఈ విధంగా గత నూరు సంవత్సరాలలోనూ, ఆంధ్రనాటకరంగానికి అనేక మంది నాటక రచయితలు దాదాపు మూడువేల నాటకాలను వ్రాశారు. వీటిలో రంగస్థలంమీద ప్రదర్శింపబడిన నాటకాలు చాలా తక్కువ.

## ప్రదర్శన యోగ్యమైన నాటకాలు :

ముఖ్యంగా ప్రదర్శన యోగ్యమైన నాటకాలను వ్రాసిన వారిలో కాశీనాథుని వీరమల్లయ్య, పామర్తి బుచ్చిరాజు, ఓలేటి పార్వతీశ్వరకవి, ద్రోణంరాజు సీతారామారావు, సోమరాజు రామానుజరావు, బద్దిరెడ్డి కోటేశ్వరరావు, గూడూరు కోటేశ్వరరావు, చక్రావధానుల మాణిక్యశర్మ, ముత్తనేని వేంకట చన్నకేశవులు, బేతపూడి లక్ష్మీకాంతం, అవసరాల శేషగిరిరావు, అయినాపురపు సోమేశ్వరరావు, ఆవటపల్లి హనుమంతరావు, మద్దులపల్లి గురుబ్రహ్మం. గూడ

కృష్ణయ్య, పామర్తి బుచ్చిరాజు, ఆకెళ్ళ సత్యనారాయణ, విష్ణుభొట్ల సుబ్రహ్మణ్యేశ్వరుడు, రామనారాయణకవులు, భోగరాజు నారాయణమూర్తి, త్యాడి వేంకట శాస్త్రి, అయినాపురపు సుందరరామయ్య, చందాల కేశవదాసు, శ్రీరాం వీరబ్రహ్మం, వెంపటి వేంకటనారాయణ, జానపాటి పట్టాభిరామశాస్త్రి, కొండపల్లి లక్ష్మణపెరుమాళ్ళు మొదలైనవారు అనేక నాటకాలను రచించారు. వీరిలో ఒక్కొక్కరు 20 నాటకాలను వ్రాసినవారు కూడా వున్నారని శ్రీ పి. యస్. ఆర్. అప్పారావు గారు తమ తెలుగు నాటకవికాసంలో తెలియజేశారు.

పైన వుదాహరించిన నాటక రచయితలలో శ్రీయుతులు సీతారామారావు, మాణిక్యశర్మ రామానుజరావు, రామనారాయణకవులు, సుందరరామయ్య మొదలైన వారు ప్రతి ఒక్కరూ ఇరవై నాటకాలకుపైగా వ్రాశారు. రాజమండ్రి వాస్తవ్యులైన సీతారామారావుగారు గున్నేశ్వరరావుగారి నాటక సమాజాలకు, బందరు నాటక సమాజాలకు 1913 ప్రాంతాల్లో దాదాపు ముప్పై నాటకాలను రచించారు. ప్రసిద్ధి కెక్కిన వీరి నాటకాలు 'విజయబొబ్బిలి' 'పీష్వా నారాయణరావు' 'సారంగధర' 'చతుర చంద్రహాస' మొదలైనవి.

నర్సాపురానికి చెందిన మాణిక్యశర్మగారు దేశీయ నాటక గ్రంథమాలను స్థాపించి, 'సావిత్రి' 'బిల్వమంగళ' 'చంద్రకాంత' 'సంగీత సత్యవిజయం' మొదలైన నాటకాలను వ్రాశారు.

భద్రాచల వాస్తవ్యులైన సోమరాజు రామానుజరావుగారి నాటకాల్లో చెప్పదగినవి 'కాళిదాసు' 'దానవీర' 'సక్కుబాయి' 'ధరణికోట' 'కర్ణ' 'తాజ్‌మహల్' 'రంగూన్‌రౌడీ' మొదలైనవి.

కొమరిపాలెంకు చెందిన సుందరరామయ్యగారు పార్శీ నాటకాలను ఎక్కువగా అనువదించారు. అవి 'లాల్‌గోహర్' (జయచంద్రరేఖావిజయం) 'ముష్వాజ్రి' 'గూల్బకావళి'. వీరు 'ప్రతిజ్ఞాపాండవం' 'ఊర్వశీ శాపవిమోచనం' 'ప్రతిజ్ఞాయాదవం' 'గర్వభంగము' మొదలైన పౌరాణిక నాటకాలను కూడ రచించారు.

బెజవాడ హిందూ థియేటరు స్థాపకుల్లో ఒకరైన కాశీనాథుని వీరమల్లయ్య అనేక పద్య నాటకాలను వ్రాశారు. వాటిలో 'సారంగధర' 'కుశలవ' 'స్త్రీసాహసం'

# ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ తూములూరు శివరామయ్య



శ్రీ గూడవల్లి రామబ్రహ్మం



శ్రీ పురాణం సూరిశాస్త్రి



శ్రీ ఆర్.బి. రామకృష్ణరాజు

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ దివాకర్ల వెంకటావధాని



శ్రీ బెజవాడ గోపాలరెడ్డి



శ్రీ కట్టమంచి రామలింగారెడ్డి



శ్రీ పోలవరపు సూర్యప్రకాశరావు

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి



శ్రీ కాజ వెంకటరామయ్య



శ్రీ ఎట్జోజు మాధవాచార్యులు



శ్రీ కడారు నాగభూషణం

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ మైలవరం రాజా



శ్రీ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి

(నటప్రకాశిక గ్రంథకర్త)



శ్రీ సత్యవోలు గున్నేశ్వరరావు



శ్రీ బుర్రా శేషగిరిరావు

'సత్యహరిశ్చంద్ర' 'ఉషాపరిణయం' 'తారాచంద్రీయం' 'లంకాదహనం' 'జయపాలీయం' మొదలైనవి.

కార్వేటినగరం హార్దింజి నాటక సభవారికొరకు గుండు చంద్రమౌళిగారు 'శమంతకవిజయం' 'దేశింగురాజు చరిత్ర' మొదలైన రంగస్థల నాటకాలను రచించారు.

ఆ రోజుల్లో రాజమండ్రి హిందూ నాటక సమాజంవారు చందాల కేశవదాసుగారి 'కనకతార'ను అద్భుతంగా ప్రదర్శించేవారు.

ముత్తనేని చన్న కేశవులుగారి 'చండిక' 'శశిరేఖాపరిణయం' ప్రసిద్ధిగన్న నాటకాలు.

భోగరాజు నారాయణమూర్తి 'లలితాంగి' 'ఉషాపరిణయం' తిరునారాయణస్వామి 'దుర్గావతి' బుచ్చిరాజుగారి సంగీత నాటకాలైన 'జగన్మోహిని' 'పద్మిని' పట్టాభిరామశాస్త్రిగారి 'కంసవధ' లక్ష్మణపెరుమాళ్ళుగారి 'హాల్దీఘాటుయుద్ధము' దేవగుప్తాపు భరద్వాజంగారి 'శర్మిష్ఠావిజయం' గాదేపల్లి సూర్యనారాయణశర్మగారి 'సంగీత సైంధవార్జునము' బేతపూడివారి 'సుభద్రాపరిణయం' త్యాడి వెంకటశాస్త్రిగారి 'ససేమిరా' 'మదాలసీయము' 'మదనమోహిని' ఆకెళ్ళవారి 'జయంత జయపాల' వీరబ్రహ్మంగారి 'రత్నమాల' గూడ కృష్ణయ్యగారి 'సంగీతశాకుంతలము' శేషగిరిరావుగారి 'సంయుక్త విభీషణ పట్టాభిషేకం' భువనగిరి బుచ్చి పరదేశి సోమయాజిగారి 'సౌగంధిక పుష్పాపహరణము' విష్ణుభొట్లవారి 'కుశలవ' 'సారంగధర' గురుబ్రహ్మంగారి 'శృంగార చంద్రహాస' సోమేశ్వరరావుగారి 'సతీ అనసూయ' బసవరాజు సీతారామారావుగారి 'సాత్రాజితీపరిణయం' బద్దిరెడ్డివారి 'బాలచంద్ర ప్రతాపం' గూడూరు రామనారాయణకవుల 'పాండవ నాటకాలు' అహల్యాశాప విమోచనం మొదలైనవి పేర్కొనదగిన నాటకాలు.

అంతేకాక, బందరు వాస్తవ్యులైన పింగళి నర్సయ్యగారి 'మార్కండేయ' ప్రజామన్ననలు అందుకున్న నాటకం.

ఆనాడు మద్రాసునగరంలో సుగుణవిలాస సభ ప్రఖ్యాతిగన్న నాటక

సమాజం. ఆ సమాజంలో నాటక ప్రయోక్తగా పేరెన్నికగన్న వేదం వేంకటాచల అయ్యగారు ప్రథమంగా అనువదించిన మోలియర్ నాటకాల్లో ప్రసిద్ధి గాంచిన నాటకం 'విధిలేక వైద్యుడు'. ఆ తరువాత 'నందుని చరిత్రం' అనే నాటకాన్ని కూడా రచించారు.

కిర్లంపూడి సంస్థాన పండితులైన సత్యవోలు కామేశ్వరరావుగారి 'రతి మన్మథ నాటకం' 'కాదంబరి' చెప్పదగిన నాటకాలు.

జనమంచి శేషాద్రిశర్మగారి 'సీతాస్వయవరం' చిల్లరిగె శ్రీనివాసరావుగారి 'పుళిందాసుశీలము' ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారి 'సుభద్రాకల్యాణము' రెంటాల వేంకట సుబ్బారావుగారి 'అధిలబింబం' కస్తూరి సుబ్బారావు 'శకుంతలాదుష్యంతం' దంటు సుబ్బావధానిగారి 'చిత్రమాధవము', గ్రంథి సుబ్బరాయగుప్తగారి 'సుజ్ఞాన పరిణయము' 'ఆంధ్రమాతలు' మొదలైన నాటకాలు కూడ రచనలో పేర్కొన దగినవి.

తణికెళ్ల పూర్ణయ్యపంతులుగారి 'ప్రసన్న పాంచాలీయము' 'రాణీసంయుక్త' ఆర్. మదనగోపాల్‌నాయుడిగారి 'లంకాదహనము' భమిడిపాటి చినయజ్ఞ నారాయణ శర్మగారి 'దుర్యోధన పరాజయం''నందవధము' వల్లూరి బాపిరాజుగారి 'సుగుణమణి' మొదలైన నాటకాలు రచనలోనూ, మరికొన్ని ప్రయోగంలోనూ ప్రఖ్యాతి వహిం చాయి.

ఆంధ్రనాటక రంగంలో పురుషులతోపాటు స్త్రీలు కూడా నాటకాలను వ్రాశారు. వారిలో గూడపాటి లక్ష్మీనరసమ్మ 'స్వయంవరం' కందాళ చూడమ్మ కమలా పరిణయం' విస్సంరాజు సీతాంబ 'సావిత్రి నాటకము 'చేకుమళ్ళ లక్ష్మి కాయమ్మ 'వామన నాటకము' మొదలైన నాటకాలను రచించారు.

# నాటికలు

ఈనాడు తెలుగు దేశంలో నాటకాలతోపాటు నాటికలుకూడ పుంఖానుపుంఖాలుగా వెలువడుతున్నాయి. పెద్ద నవలనుండి కథానిక ఉద్భవించినట్లు నాటకంనుండి

నాటిక జన్మించింది. ముఖ్యంగా పాశ్చాత్య నాటకరంగంలో నాటకంతోపాటు నాటిక ప్రక్రియకూడ ఎంతో అభివృద్ధి చెందింది. తెలుగుదేశంలో ముఖ్యంగా అమెచూర్ నాటక సమాజాలు ఈనాడు సాంఘిక నాటకలను ఎక్కువగా ప్రదర్శిస్తున్నాయి. అనేకమంది ముఖ్య రచయితలు నాటికా రచనకు ప్రాముఖ్యమిచ్చి అనేక నాటికలను రచించారు.

డాక్టరు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 25 సంవత్సరాల క్రితం భారతి సంచికలలో నాటికల పరిణామాన్నిగూర్చి, వివిధ నాటికా రచయితల రచనాదర్శాలనూ కూలంకషంగా చర్చించారు.

ముఖ్యంగా తెలుగుదేశంలో కందుకూరి వీరేశలింగంగారు సాంఘిక సంస్కరణోద్యమంలో కొన్ని హాస్యప్రహసనాలను రచించారు. తెలుగులో ప్రథమ ఏకాంకికలుగా వీటిని పేర్కొనవచ్చు. కొక్కొండవారి నరకాసురవ్యాయోగం కూడా ఈ కోవకు చెందిందే.

విశ్వనాధ కవిరాజుగారు హాస్యనాటికా రచనలో అందెవేసినచేయి. కవిరాజుగారు దాదాపు 50 ఏకాంకనాటికలను రచించారు. వీటిలో 'దొంకలోషరాబు' 'సరాగం' 'రాజీ' దొంగాటకం 'కిర్రుగానుగు' 'వైవాహికం' 'నేపథ్యం'. మొదలైన నాటికలు ప్రేక్షకుల అభిమానాన్ని చూరగొన్నాయి.

1930లో తెలుగు నాటకరంగంలో రాజమన్నారుగారి 'తప్పెవరిది' ఏకాంక నాటిక ఒక నూతన అధ్యాయాన్ని సృష్టించింది. రాజమన్నారు ఏకాంకికా రచనలో సిద్ధహస్తులు. ఇబ్సెన్, గాల్స్వర్దీవంటి పాశ్చాత్య రచయితల రచనలవల్ల ఉత్తేజం పొంది తెలుగులో అభ్యుదయకరమైన సాంఘిక నాటికలను రచించారు. వారి రచనల్లో ముఖ్యమైనవి ఏమి మగవాళ్ళు, దెయ్యాలలంక, నిష్ఫలం, నాగుబాము, విముక్తి మొదలైనవి.

సంఘసంస్కరణకోసం విప్లవాత్మకమైన రచనలు సాగించిన గుడిపాటి వెంకటచలం 'సత్యం శివం సుందరం' 'పద్మరాణి' 'కొండడు' మొదలైన నాటికల్లో సాంఘిక సమస్యల్ని చిత్రించారు.

ముద్దుకృష్ణగారి 'టీకప్పులో తుపాను' హాస్యనాటికగా తుపాను రేపింది. 'డాకిని' 'అపవాదు' 'అనార్కలీ' మొదలైనవి కూడ వీరి ఉత్తమరచనలు.

భారత నాటకాలలో వేనోళ్ళ ప్రస్తుతించబడిన తిరుపతి వెంకటకవులు నాటికారచనలో కూడ ఔననిపించుకుని 'రసాభాసము' 'అపూర్వ కవితా వివేచనము' 'పల్లెటూళ్ళ పట్టువల 'అనే నాటికలను రసవత్తరంగా రచించారు.

సురభినాటక సమాజాలకు తమ నాటకాలద్వారా మహత్తర సేవచేసిన మల్లాది వేంకట కృష్ణశర్మ నాటికా రచనలో మేటి అనిపించుకున్నారు. వీరి 'వార సత్వం' నాటిక అనేకచోట్ల ప్రదర్శింపబడి వేనోళ్ళ పొగడబడింది. వీరి హాస్య నాటికల్లో ముఖ్యమైనవి. 'సుబ్బమ్మ విరహం' 'నామకరణం' 'ప్రత్యక్షదైవం' మొదలైనవి. వీరు విశ్వనాధకవి రాజుగారి సోదరులు.

ఆంధ్రసాహిత్య జగత్తులో నవల, చిన్న కథ, నాటకం, నాటిక మొదలైన అన్ని ప్రక్రియల్లోనూ సిద్ధహస్తు లనిపించుకున్న శివరాజు వేంకట సుబ్బారావు (బుచ్చిబాబు) ప్రయోగాత్మక రంగస్థల నాటకాలను, నాటికలను, రేడియో నాటికలను రచించి అసమానమైన పేరు గడించుకున్నారు. 'ఆత్మవంచన' 'దారినపోయే దానయ్య' 'తిష్యరక్షిత' 'ఉమర్ ఖయ్యాం' 'నాలుగో పరిణామం' మొదలైనవి వీరి సుప్రసిద్ధ రచనలు.

ప్రపంచ కథానికల పోటీలో ద్వితీయస్థానం సంపాదించుకున్న పాలగుమ్మి పద్మరాజుగారు కథా రచయితగా, నాటక రచయితగా, సినీ రచయితగా, దర్శకుడుగా పేరుపొందిన మేధావి. నాటకాల్లో వీరికి కీర్తితెచ్చిన కన్నీరు తమిళ నాటకానువాదం. ఆంధ్ర హృదయాల్లో హత్తుకుపోయింది. నాటికల్లో 'ఖూనీ' మద్రాసు రేడియో నాటికల్లో ప్రథమ బహుమతి పొందింది.

గేయ నాటికా రచనలో, ప్రయోగంలో సిద్ధహస్తు లనిపించుకున్న బాలాంత్రపు రజనీ కాంతరావు గాయకుడు. వీరి ప్రథమ గేయ నాటిక 'చండీదాసు' 1941 లో రేడియోలో ప్రసారమైంది. వీరి రచనల్లో 'లకుమాదేవి' 'రాసలీల' 'విశ్వవీణ' 'మేనక' మొదలైనవి గణనకెక్కినవి.

ఫ్రెంచి రచయితైన మోలియర్ రచనంతో ప్రభావితుడైన హాస్య బ్రహ్మ భమిడిపాటి కామేశ్వరరావు ప్రప్రథమంగా స్వతంత్రంగా రచించిన ప్రహసనం 'బాగు బాగు'. దీనిని అనేకనాటక సంస్థలు ప్రదర్శించాయి. 'కచటతపలు', 'ఎప్పుడూ ఇంతే' అనే ప్రహసనాలు కూడ పేర్కొనదగినవి. దాదాపు 12 మోలియర్ రచనలను అనుసరించారు. అనేక భాస నాటకాలను అనుకరించి కూడ నాటకాలను వ్రాశారు.

1932 లో అబ్బూరి రామకృష్ణారావుగారు 'నదీసుందరి' అనే ఉత్తమ నాటికను రచించారు. రామకృష్ణారావుగారు తెలుగు సాహిత్యోద్యమంతో, నాటక రంగంతో బహుముఖాల పరిచయమున్న కళాశీలి. ఆయన ప్రసిద్ధ కవి, నటుడు, దర్శకుడు.

1933 లో తలావఝుల శివశంకరశాస్త్రిగారు 'పద్మావతీ చరణచారణ చక్రవర్తి' అనే ప్రథమ పద్యనాటికను, 1936 లో 'వరపరీక్ష' అనే గేయ నాటికను రచించి గేయ నాటికలకు ఆద్యులైనారు.

ఉత్తమంగా శబరి నాటకాన్ని వెలువరించిన చింతాదీక్షితులుగారు 'శర్మిష్ఠ' 'జటాయు' 'శ్రీకృష్ణుడు' 'చక్రవాకమిథునము' రచించి నాటికారచనలో సమర్థులనిపించుకున్నారు.

విజయవంతంగా ప్రదర్శింపబడిన నాటికల్లో చిలుకూరి నారాయణరావుగారి అశ్వత్థామ, అచ్చి చెప్పదగినవి.

ప్రప్రథమంగా 1939 లో సంగీత రూపకంగా వెలువడ్డ రూపకం మల్లవరపు విశ్వేశ్వరరావుగారి 'బిల్హణీయం'. ఇది రేడియోలో ప్రసారితమైంది. 'వరూధిని' 'కలభాషిణి' అనే నాటికలను కూడా వీరు రచించారు.

చిన్నకథా రచనలో సిద్ధహస్తు లనిపించుకున్న శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ఉత్తమమైన నాటికలను కూడ రచించారు. వారి రచనలో 'పునాదిరాయి' 'కలంపోటు' 'లక్ష్యసిద్ధి' ముఖ్యమైనవి.

నోరి నరసింహశాస్త్రిగారి 'శబ్దవేధి' 'పతంగయాత్ర' 'భాగవతావరణము' 'స్వయంవరము' 'తేనెతెట్టె' మొదలైన నాటికలను రచనా విశిష్టతలో ఉత్తమంగా పేర్కొనవచ్చు.

సుప్రసిద్ధ రచయితలైన జి. వి. కృష్ణారావుగారి 'భిక్షాపాత్ర' 'దమడమాల బండి' 'యాదవప్రళయం' మొదలైనవి రచనలో ఉత్తమమైనవి.

హాస్య రచయితలైన మొక్కపాటి నరసింహశాస్త్రిగారు సాంఘిక జీవితానికి సంబంధించిన నాటికారచనలో సిద్ధహస్తులై 'మ్రొక్కుబడి' సంపుటాన్ని వెలువరించారు.

పత్రికా రచయితగా, సంపాదకులుగా రూపొందిన గోరాశాస్త్రిగారు రూపక రచనలో కూడా ఆరితేరినవారు. వీరి దూరతీరాలు, సెలవుల్లో, ఆనందనిలయం మొదలైన నాటికలు పేర్కొనదగినవి.

ప్రసిద్ధ భావకవిగా పేరుపొందిన దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అనేక ఉత్తమ రేడియో నాటికలను రచించారు. వారి రచనల్లో ఉత్తమమైనవి విద్యావతి, ధనుర్దాసు, కృష్ణాష్టమి, ఊర్వశి మొదలైనవి.

నాటకరచనలో, సంగీత దర్శకత్వంలో, పర్యవేక్షణలో, నాటకశిల్పంలో ప్రతిభావంతులైన కొప్పరపు సుబ్బారావుగారి గద్య, పద్యాత్మకమైన గేయనాటిక అల్లీముఠా అగ్రశ్రేణికి చెందింది.

సుప్రసిద్ధ పాత్రికేయులైన నార్ల వెంకటేశ్వరరావుగారు పల్లెటూరు వాతావరణాన్ని, గ్రామీణ జీవితాన్ని వాస్తవికతనూ చిత్రించడంలో వారి నాటికలు ఆంధ్ర నాటకరంగంలో అగ్రశ్రేణిలో నిలబడుతున్నాయి. ఒక్కొక్క సమస్యతో ఒక్కొక్క నాటికను అద్భుతంగా చిత్రించారు. వారి కొత్తగడ్డ నాటికల సంపుటి 1947 లో వెలువడింది. వారి నాటికల్లో కొత్తగడ్డ, భంగపాటు, ద్రోహం, దొంగా దొరా, ప్రారబ్ధం, పైపంట, ఆశాపాశం మొదలైనవి ఉత్తమశ్రేణికి చెందినవి.

ఇంకా కొట్టిపాటి గంగాధరరావు తనలోతాను, విధివశం, పినిసెట్టి ఆడది.

రిక్షావాడు, ఎవరినీ నమ్మకు, సుంకర సత్యనారాయణ కనువిప్పు, పీరకుంకుమ, రాబందులు, భూదేవి, హితశ్రీ విముక్తుడు, అనిసెట్టి చెప్పుక్రిందిపూలు, శాంతి, మూకాభినయం, కారెపు అప్పలస్వామి ఈరోజు, బ్రాకెట్, కట్‌జోకర్, కావ్యశ్రీ మానవుడు, ఎన్. ఆర్. నంది వానవెలిగింది, రమాకాంత్ కాలచక్రం, మగదల రామచంద్రరావు ప్రత్యూష, కొండముది శ్రీరామచంద్రమూర్తి కళావరుణాకీ, చరిత్రగతులు, బాలగంగాధర్‌తిలక్ సుచిత్రాప్రణయం, నాగభూషణ్ అన్వేషణ, దివ్యప్రభాకర్ నిరవధి, వడ్లమూడి సీతారామారావు తారాబలం, భట్టిప్రోలు కృష్ణమూర్తి ఉత్తచేతులు, వెంపో ప్రజలకోసం, మల్యాద్రి, ఢిల్లీ ఛలో, కొర్లపాటి శ్రీరామమూర్తి నటన, వట్టికోట ఆళ్వారుస్వామి కనువిప్పు, మారేమండరామారావు విప్లవం, పోతుకూచి ఇదీతంతూ, రెంటాల ఆకలి, శిష్, రావికొండలరావు కుక్కపిల్ల దొరికింది, గొల్లపూడి మారుతీరావు పతిత, అనంతం, రాగరాగిణి, ఎ. ఆర్. కృష్ణ అరగంటలో అదృష్టం, కొడాలి సుబ్బారావు ఆహుతి, శ్రీమతి కల్యాణి పెళ్ళికొడుకు, శ్రీనివాసచక్రవర్తి లోభి, సోంపల్లి బావయ్య అప్పాజీ, పురుషోత్తముడు, కంచిభట్ల కృష్ణమూర్తి దేవుడు ప్రత్యక్షమైతే, అంబటిపూడి వెంకటరత్నం కౌమోదకి, రావూరి భరద్వాజ భానుమతి, ఇష్టసిద్ధి, పెమ్మరాజు వేణుగోపాలమూర్తి కర్ణ, అశ్వత్థామ, చాణక్య, వేణు దిష్టిబొమ్మలు, ముప్పన విశ్వప్రసాద్ తాజమహల్, అసమర్థులు, దగాకోరు. పైన వివరించినవారే కాక పోకల నరసింహారావు,మహీధర రామమోహనరావు, డాక్టరు రాంబాబు, బి. ఎన్. సూరి, పొట్లూరి వెంకటేశ్వరరావు, పోలవరపు శ్రీహరిరావు మొదలైన అనేక మంది యువరచయితలు నాటికా రచనలో అనేకమైన నూతన ప్రయోగాలను చేస్తున్నారు.

## పెద్దపేరు తెచ్చుకొన్న గేయ నాటికలు :

నాటకాలూ, నాటికలతోపాటు గేయ నాటికలు కూడ నాటకరంగంలో ప్రాముఖ్యం వహించాయి. గేయనాటికా రచనకు అద్యులుగా శివశంకర శాస్త్రిగారిని పేర్కొనవచ్చు. ముఖ్యంగా గేయ నాటికల్లో నటన, సంగీతం, నాట్యం సమపాళ్ళలో ప్రాముఖ్యం వహిస్తాయి. గేయనాటికా రచనలో దేవులపల్లి కృష్ణశాస్త్రి, బాలాంత్రపురజనీ కాంతరావు మొదలైనవారుకూడ విశేషకృషి చేశారు.

ఈనాడు ముఖ్యంగా గేయనాటికా రచనలో సిద్ధహస్తులై, అనేక గేయ నాటికలను రచించినవారు పి. నారాయణ రెడ్డిగారు. వీరి గేయనాటికలు చదువుకునే వారికి, రంగస్థలంమీద నటించే వారికి, రేడియోలో శ్రవ్యనాటికలుగా వినేవారికి ఎంతో ఆహ్లాదాన్ని కలిగిస్తాయి. వీరి గేయనాటికల్లో ప్రాముఖ్యం వహించినవి 'నవ్వనిపువ్వు' 'గోకుల విహారం' 'దివ్వెల సంగీతం' 'రామప్ప' 'ఊర్మిళ' సంక్రాంతి వెన్నెలవాడ, అజంతా సుందరి, 'ఋతువుల రాణి' 'సుగాత్రి' మొదలైన నాటికలు ప్రదర్శింపబడి, రేడియోలో ప్రసారం చేయబడి రసజ్ఞుల హృదయాలను చూర గొన్నాయి. వీరి రామప్ప అఖిలభారత ప్రఖ్యాతి వహించింది. గేయనాటికా రచనలో వింజమూరి శివరామారావు, బోయిభీమన్న, వి. వి. రామనాథం మొదలైనవారు కూడ పేరెన్నిక గన్నారు. ముఖ్యంగా ఈ గేయనాటికా రచనలో నూతన ప్రయోగంచేసినవారిలో ముఖ్యులు ఆరుద్ర, సోమసుందర్, కుందుర్తి మొదలైనవారు. ఆరుద్ర గారి సీతాకోక చిలుక రచనలో పలువురి ప్రశంసలందు కుంది. అలాగే, కుందుర్తివారి 'ఆశ' సోమసుందర్ 'మంచీ-మనిషీ' చెప్పుకో తగినవి.

## శ్రవ్యనాటకాలు,
## నాటికలు :

ఈనాడు శ్రవ్యనాటకాలు, నాటికలు రేడియోద్వారా చాలా ప్రాముఖ్యం వహిస్తున్నాయి. 1938 లో రేడియో నాటికగా ముద్దుకృష్ణగారి 'అనార్కలి' ప్రథమంగా ప్రసారం చేయబడింది. ఆనాటినుండి ఈనాటివరకు ప్రతి రోజూ ఒకటో, రెండో శ్రవ్యనాటికలు ప్రసారం చేయబడుతూనే వున్నాయి. ఈనాడు కొన్నివందల మంది రేడియో నాటికలను వ్రాస్తున్నారు. ముఖ్యంగా గోరాశాస్త్రి, కొడవటిగంటి కుటుంబరావుగార్లు ఒక్కొక్కరూ నూరు రేడియో నాటికలు వ్రాశారనడంలో ఏమీ అతిశయోక్తి ఉండదనుకుంటాను. గోరాశాస్త్రిగారి 'ఆశ ఖరీదు అణా' 'లోహ ఘంటలు', 'కొమ్మసంపెంగ' "సెలవల్లో' 'ఆనందనిలయం' 'ఇల్లుకట్టి చూడు' మొద లైనవి ముఖ్యమైనవి.

రేడియో నాటికారచనలో ఆరుద్రగారు కూడ సిద్ధహస్తులు. ఎన్నో శ్రవ్య నాటికలను నూతన పోకడలతో, విశిష్టమైన శైలితో వ్రాశారు. వీరి 'న్యాయాధికారి'

'అక్కయ్యకు ప్రమోషన్', 'సీతాకోకచిలుక' ముఖ్యమైనవి. వీరి 7 నాటికలను ఆరుద్ర నాటికలుగా 1958 లో సంపుటిగా ప్రచురించారు. వీటిలో 'న్యాయాధికారి' 'పార్కుబెంచి' 'నన్ను గురించే' 'దరఖాస్తుఫారం,' 'అక్కయ్యకు ప్రమోషన్' రేడియోలో ప్రసారం చేయబడ్డాయి.

కాటూరి వెంకటేశ్వరరావుగారి, మువ్వగోపాల,నాగభూషణ్ 'కల-కాపురం' 'సర్పదష్టులు' 'వడ్డించిన విస్తరి' మొదలైనవి పేర్కొనదగినవి.

శ్రీయుతులు జలసూత్రం రుక్మిణీ నాధశాస్త్రి, సి. నారాయణరెడ్డి, రజని, బుచ్చిబాబు, దాశరథి, చల్లా రాధాకృష్ణశర్మ, అమరేంద్ర, ప్రయాగ, శ్రీవాత్సవ, భరద్వాజ, నార్ల చిరంజీవి, ఏడిద కామేశ్వరరావు, శ్రీ శ్రీ, అనిసెట్టి మొదలైన అనేకమంది రేడియో నాటికలలో ప్రాముఖ్యం వహించారు.

## బాలల నాటికలు :

ముఖ్యంగా బాలనాటికలు రేడియో బాలల కార్యక్రమాలద్వారా ఎక్కువ ప్రచారంలో కొచ్చాయి. ముఖ్యంగా న్యాపతి రాఘవరావు, రేడియో అక్కయ్యల ద్వారా. రేడియో బాలానంద కార్యక్రమాల్లో రేడియో నాటికలు ఎక్కువ ప్రసారం చేయబడ్డాయి. బాలల నాటికలను వ్రాసిన వారిలో న్యాపతి రాఘవరావు, ఏడిద కామేశ్వరరావు, నార్ల చిరంజీవి, బి. వి. నరసింహారావు, జంధ్యాల పాపయ్య శాస్త్రిగార్లు ముఖ్యులు.

శ్రీ నార్ల చిరంజీవిగారు ఎన్నో బాలల గీతాలను వ్రాశారు. ఎన్నో కథలను వ్రాశారు. బాలల ఉపయోగార్థం ఎన్నో నాటికలూ వ్రాశారు. ఎంతో బాల సాహిత్యాన్ని రచించి, ప్రచారం చేశారు.

నాట్యాచార్య బి. వి. నరసింహారావుగారు వస్తుతా ఉపాధ్యాయు డవడం వల్ల పిల్లల మనస్తత్వం బాగా ఎరిగినవారు. ఆయన ఎన్నో బాలగేయాలను వ్రాశారు. చక్కగా పాడగల నేర్పరి. ఆ నేర్పరితనంతో బాలలనిట్టే ఆకర్షించగల చతురుడు. ఆయన బాలసాహిత్యంమీద ఎన్నో గ్రంథాలను వెలువరించారు.

ఇంకా నాగభూషణ్, జమ్మలమడక పూర్ణచంద్రరావు, చెరుకుపల్లి భాస్కర రావు, జనమంచి రామకృష్ణ 'శ్రీవాత్సవ' ఇల్లిందల సరస్వతీదేవి, రేడియో తాతయ్య మొదలైనవారు కూడ పిల్లల నాటకాలను వ్రాశారు.

ముఖ్యంగా పిల్లల నాటకాల్లో ''బూరెల మూకుడు'' ''జబ్బు కుదిరింపు' 'శ్రావణ భాద్రపదాలు'' ''పిల్లి మెడలో గంట'' ''గ్రాంథికశాస్త్రి'' ''సింద్రిల్లా'' ''నువ్వా నేనా' 'చిట్టిబావ, పొట్టిమరదలు' మొదలైన నాటికలు ఎక్కువ ప్రఖ్యాతి వహించాయి.

ఈ విధంగా గత నూరు సంవత్సరాల ఆంధ్రనాటకరంగంలో అనేక సంస్కృత రూపకానువాదాలు, భారతీయ భాషల్లో వెలువడిన నాటకాలకు తెలుగు అనువాదాలు, ఆంగ్ల నాటకానువాదాలు, తెలుగు నాటకాలపై ఆంగ్ల నాటకాల ప్రభావంతో వెలువడిన నాటకాలు, స్వతంత్ర నాటకాలు. పౌరాణిక, నాటకాలు, చరిత్ర నాటకాలు, సాంఘిక నాటకాలు, ప్రచార నాటకాలు, మన స్తత్వాలను నిరూపించే నాటకాలు, విషాద నాటకాలు, ప్రహసనాలు, నాటికలు, ఏకాంకికలు, పద్యనాటకాలు, గేయ నాటికలు, వచన నాటికలు, రేడియో నాటికలు, బాల నాటకాలు మొదలైన వెన్నో వెలువడినాయి. దాదాపు తెలుగులో మూడువేల నాటకాలవరకూ వెలువడ్డాయని శ్రీ శ్రీనివాస చక్రవర్తి, డా. పి. యస్. అర్. అప్పారావుగార్ల అంచనాలవల్ల తెలుస్తున్నాయి. అన్ని నాటకాలను గురించీ ఇక్కడ సమీక్షించ లేకపోతున్నందుకు విచారిస్తున్నాను. అలాగే అందరు నాటక రచయితల పేర్లు ఉదాహరించటం కూడా సాధ్యం కాలేదు.

నాటక సమీక్షలో వెలుగుచూచిన నాటకాలను, ప్రజలు మెచ్చిన నాటకాలను, అందుకు సంబంధించిన రచయితల పేర్లను మాత్రమే ఉదాహరించటం జరిగింది. అన్ని నాటకాలనూ, ఆయా నాటక రచయితలనూ ఉదాహరించాలనే నా కోరిక. కాని గ్రంథ వి స్తరణ, అధిక వ్యయమూ ఇందుకు కారణం. రెండవ ముద్రణలో నాకోరిక సఫలీకృతం అవుతుందని విశ్వసిస్తున్నాను. కావాలని ఏ నాటకాన్నీ, ఏ రచయితనూ విస్మరించలేదు. ఇది నా ప్రథమ ప్రయత్నం.

ఈనాడు ఆంధ్రనాటక రంగంలో కొన్నివందల నాటకాలు రచింపబడి వున్నాయి. వీటిలో కొన్ని ప్రదర్శింప బడ్డాయి. మరికొన్ని రంగస్థలంమీదికే

రాలేదు. మరికొన్ని శ్రవ్య నాటకాలుగానే వుండిపోయాయి. వున్న నాటకాల్లో కొన్ని మంచి నాటకాలు, ప్రదర్శనకు యోగ్యమైనవి వుండవచ్చు. అందువల్ల ఈ నాటకాలను గురించీ, వీటి మంచిచెడ్డలను గురించీ ఆంధ్రప్రేక్షకులకు చాలామందికి తెలియదు. నాటకాలు లేవో అనే గోల తప్ప ఏయే నాటకా లున్నాయో చూసే ఓపిక కూడా లేదు. ఎవరో ఒకరు నాటకం ప్రదర్శించిన తరువాతగాని నాటకం యొక్క మంచి చెడ్డలు బయటపడవు గదా? నాటకం ప్రదర్శింప బడకుండానే గుణగణాలు నిర్ణయించటం మంచిది కాదు. నాటకం ఒకమాదిరిగా వున్నప్పుడు దానిని ప్రదర్శనానికి సంబంధించిన హంగులతో రక్తి కట్టించవచ్చు. కనుక మన కున్న నాటకాలను ఒకసారి సమాజాల వా రందరూ తిరగవేయడం మంచిది.

ఈ నాటక సమీక్షలో నాకు అత్యంత ఆప్తమిత్రులైన శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారి నాటక సమీక్షా, డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావుగారి 'తెలుగు నాటక వికాసమూ, ఇరువురి ప్రత్యక్ష సహకారమూ నా కెంతగానో తోడ్పడ్డాయి. వారికి నేను ఎంతైనా కృతజ్ఞుణ్ణి!





# ఆంధ్రప్రదేశ నాటకరంగం



నెల్లూరు- గుంటూరు-కృష్ణా - పశ్చిమ గోదావరి - తూర్పుగోదావరి - విశాఖ పట్టణం-శ్రీకాకుళం-బళ్ళారి-కర్నూలు -కడప - చిత్తూరు - అనంతపురం - హైదరాబాదు- సికిందరాబాదు-వరం గల్లు-ఖమ్మం-మహబూబ్‌నగర్- కరీం నగర్ - అదిలాబాద్ - నిజామాబాద్- మెదక్-నల్లగొండజిల్లాలనాటకరంగాలు

# నెల్లూరు జిల్లా నాటకరంగము

## నెల్లూరు :

ఆంధ్రదేశంలో అన్ని పట్టణాల్లోనూ నాటకాలను ప్రదర్శించిన ధార్వాడవారు నెల్లూరు కూడా వచ్చి నాటకాలను ప్రదర్శించారు. ఈ ప్రదర్శనాలకు



ముగ్ధులైన నెల్లూరు కళాకారులు కొంతమందిచేరి, లక్ష్మీ నాటక సభ అనే పేరుతో తిప్పరాజు సుబ్బయ్యసత్రం దగ్గర పందిరివేయించి నాటకాలను ప్రదర్శించారు. ఆ నాటకాలలో గడ్డం శేషయ్య. న్యాపతి కృష్ణారావు. ఆ. వాసుదేవరావు.మధ్వ పతి సత్య సంధరావు మొదలైనవారు పాత్రలు ధరించీ, ముఖ్య కార్యకర్తలుగావుండీ ఆ సమాజాన్ని పోషించారు.

అదేరోజుల్లో, నెల్లూరు సంతపేట వద్దనున్న రామానుజ పురవాసులైన శీనయ్య. పురుషోత్తం, అనే పేర్లుగల అన్న దమ్ములు, ఒక నాటక సమాజాన్ని స్థాపించి, గూడూరు కంపెనీ అనే పేరుతో బాణాసుర, ప్రహ్లాద మొదలైన నాటకాలను నెల్లూరుజిల్లా అంతా ప్రచారంచేసి నాటకాలను ప్రదర్శించారు. ఆ రోజుల్లో, కిరసనాయిలు లాంతరుకట్టి నాటకాలాడేవారు. ముఖ్య పాత్రధారుల ప్రవేశంలో అరుపులు, కేకలతో వికటాట్టహాసం చేసేవారు. ఇది ఆనాటి పద్ధతి.

## నెల్లూరు అమెచ్యూర్ నాటక సభ :

ఆ తరువాత 1891 వ సంవత్సరంలో నెల్లూరు అమెచ్యూర్ నాటక సభ స్థాపించబడింది. ఈ సమాజంలోని వా రందరూ వుత్సాహవంతులైన విద్యావంతులు. తీరిక సమయాల్లో వినోదార్థం నాటకాలు ప్రదర్శించేవారు, కొంతమంది కాలేజీ విద్యార్థులు కూడ షేక్స్పియర్ నాటకాలు మొదలైనవి కూడా ప్రదర్శిస్తూ ఉండేవారు. అమెచ్యూర్ నాటక సభను మహంకాళి సుబ్రహ్మణ్యం, కంబాడై శఠగోపరామానుజం మొదలైనవారు కార్యదర్శులుగావుండి జయప్రదంగా నడిపారు.

### అమెచ్యూర్ డ్రమాటిక్ సమాజము :

మద్రాసు క్రిష్టియన్ కాలేజి సంస్కృత పండితులైన వేదం వేంకటరాయ శాస్త్రిలు గారి ప్రతాపరుద్రీయ నాటకాన్ని ప్రప్రథమంగా 20-1-1898 సంవత్సరంలో అమెచ్యూర్ డ్రమాటిక్ సమాజంవారు ప్రదర్శించారు. ఈ సమాజానికి కందాడై అనంతాచారి, ఒంగోలు వెంకటరంగయ్యగారు స్టేజి డైరెక్టర్లుగా పనిచేశారు.

### వేదం వేంకటరాయశాస్త్రి :

వేంకటరాయశాస్త్రిలుగారు శకుంతల, నాగానందం మొదలైన సంస్కృత నాటకాలను అనువాదం చేశారు. వీరు స్థాపించిన సమాజానికి వారే అధ్యక్షులుగావుండి నెల్లూరులోనే నాటకాలను ప్రదర్శించేవారు. వీరి సమాజంలో పది పదిహేనుమాసాలు వరకూ నాటకాలకు వద్దికలు జరిపేవారు. శాస్త్రిగారి పద్యాలను, పాటలనే వుపయోగించేవారు. ఒక సంభాషణ చేర్చడంగాని తీసివేయడంగాని జరిగేదికాదు. ప్రతి పాత్రనూ దగ్గరుండి తీర్చిదిద్దేవారు. వారి నాటకంలో పాత్రలకు ఆయా స్వభావాల ననుసరించి పాత్రోచితభాషను ప్రవేశపెట్టారు. వీరి పర్యవేక్షణలో ఆనాడు అనేకమంది సుప్రసిద్ధనటులు ఉద్భవించారు. వేంకటరాయశాస్త్రిగారు ఈ సమాజాన్ని 1900 మొదలు, 1925 వరకు అజరామరంగా నడిపి, తరువాత ఆంధ్రసభలో ఈ సమాజాన్ని లీనం చేశారు.



నెల్లూరు నగరాజారావుగారు-సత్యకీర్తి

### ఆంధ్రభాషాభిమాని సమాజము :

ఈ రోజుల్లోనే నెల్లూరులో కాపువీధి నాటక సమాజమని, లిటరరీ క్లబ్ అనీ రెండు మూడు నాటక సమాజా లుండేవి.

వర్ధమాన సమాజంవారు బళ్ళారివారి నాటకాలను, లిటరరీ క్లబ్‌వారు బలిజేపల్లి బుద్ధిమతీ విలాసాన్ని, కాపువీధివారు చిలకమర్తివారి నాటకాలనూ ప్రదర్శించేవారు. సరస్వతీ అమెచ్యూర్స్ అనే వారు షేక్స్పియర్ ఇంగ్లీషు నాటకాలను ప్రదర్శించేవారు.

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ టి. చలపతిరావు
(ప్రజానాట్యమండలి సంగీత దర్శకులు)



శ్రీ నందమూరి త్రివిక్రమరావు



శ్రీ ఇమ్మానేని హనుమంతరావు నాయుడు



శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి

# ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ గిడుగు సీతాపతి



శ్రీ పిఠాపురం రాజా



శ్రీ గద్దె రంగయ్యనాయుడు

# ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ పి.యస్.ఆర్. అప్పారావు

(తెలుగు నాటక వికాసము గ్రంధకర్త)



శ్రీ విక్రమ దేవవర్మ (జైపూర్ రాజా)



శ్రీ బి.టి. రాఘవాచార్యులు

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ పి.వి. రాజమన్నారు



శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డి



శ్రీ సుంకర కనకారావు

వేదంవారి శిష్యులైన రాయప్రోలు సుబ్రహ్మణ్యం 1913 సంవత్సరంలో ఒక నాటక సమాజాన్ని ఏర్పాటుచేసి విమల, మదాలస అనే రెండు నాటకాలు ప్రదర్శింపజేసి, ఆ తరువాత బళ్ళారి ధర్మవరం వారి నాటకాల్లో పాత్రలు ధరించి, ప్రహ్లాద, లవకుశ, కృష్ణలీలలు నాటకాలను తీసుకుని నెల్లూరులో జ్ఞానోదయ నాటక సమాజాన్ని స్థాపించి, పై నాటకాలను ప్రదర్శించారు. నగరాజారావు, శ్రీనివాసాచారి, కాశీ చెంచు, నేలనూతల రామకృష్ణయ్య మొదలైనవారు ప్రసిద్ధ నటులుగా పేరు పొందారు. ఈ సమాజ స్థాపకుడైన రాయప్రోలు సు బ్ర హ్మ ణ్యం బాహుకుడు, కృష్ణుడు, అర్జునుడు, కంసుడు, హిరణ్యకశిపుడు మొదలైన పాత్రలను ధరించడంలో అఖండమైన ఖ్యాతిని సంపాదించారు. ఇలా కొంత కాలం సమాజాన్ని నడిపి, చిత్తూరు రామవిలాస సభవారికి దర్శకుడుగా వెళ్ళిపోయారు.



కె. శ్రీనివాసాచారిగారు—విషయ

1917 సం॥ రంలో సుగుణవిలాస సభ స్థాపించబడి రామదాసు, హరిశ్చంద్ర, మానవతి, కృష్ణక్రీడ మొదలైన నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజంలో ఘంటసాల రాధాకృష్ణయ్య, కాశీచెంచు సుబ్రహ్మణ్యం పాత్రధారణలో ప్రసిద్ధిపొందారు.

ఈ రోజుల్లోనే దువ్వూరి రామిరెడ్డిగారి మీరాబాయి నాటకంలో ఖురగుడిపాటి అనుమంతరావు రాణా పాత్రను ధరించి పేరు తెచ్చుకున్నారు.

## ఆంధ్ర సభ :

నెల్లూరు నాటక రంగంలో ఆంధ్ర సభ ఆనాటినుండి ఈనాటివరకూ నాటక కళా సేవ చేస్తూవుంది. వృద్ధులైన వేదం వేంకటరాయశాస్త్రిగారు వారి సమాజాన్ని ఆంధ్రసభలో లీనంచేసిన తరువాత సభవారు శాస్త్రిగారి నాటకాలనూ, ధర్మవరం కృష్ణమాచారిగారి నాటకాలనూ, కోలాచలంవారి నాటకాలనూ, చిలకమర్తివారి గయోపాఖ్యానాన్ని, ముత్తరాజువారి తులాభారాన్నీ ప్రదర్శించేవారు, శాస్త్రిగారి నాటకాల్లో

కందాద్రై శ్రీనివాసన్. (వీరికే మరొకపేరు దొరసామి) నాయక పాత్రధారణలో బహు ప్రసిద్ధిని పొందారు.

ఆ రోజుల్లోనే ఫ్రండ్సు యూనియన్ అనే నాటకసమాజం కన్యాశుల్కం, అనార్కలి నాటకాలను ప్రదర్శించింది.

పైన్ఆర్ట్సు సమాజంవారు వేదంవారి నాటకాలను, దువ్వూరి రామిరెడ్డివారి మీరాబాయి నాటకాన్ని, షేక్స్పియర్ ఇంగ్లీషు నాటకాలనూ ప్రదర్శించారు. ఈ నాటకాలన్నిటిలోనూ యరగుడిపాటి సుబ్రహ్మణ్యం, ముంగమూరు నరసింహారావు, గోవిందరాజులు నాయుడు, టి. సుదర్శనరావు మొదలైనవారు ప్రసిద్ధ నటులుగా గౌరవస్థానాన్ని అలంకరించారు.

ఆంధ్ర సభవారు మోదర్ల రామకృష్ణయ్య రచించిన ప్రచండభార్గవం, శాకుంతలమును, నేలనూతల కృష్ణమూర్తి, వారి మిత్రులు రచించిన రుద్రమదేవి, త్యాగరాజు నాటకాలను, పులుగుండ్ల రామకృష్ణయ్య రచించిన తలవని తలంపు, తుఫాను మొదలైన సాంఘిక నాటకాలను ప్రదర్శించారు.

## తూములూరు శివరామయ్య :

**1918** లో స్థాపించబడిన సుజనవినోదినీ సమాజం కారణాంతరాలతో విడిపోయిన ఆంధ్ర సభ ఈనాటికీ కొనసాగుతూ వుంది. ఈ సభకు ప్రథమ అధ్యక్షులు కీ॥ శే॥ తూములూరు శివరామయ్యగారు, దాదాపు 18 సంవత్సరాలు అధ్యక్షులుగా వున్నారు. వీరు సుప్రసిద్ధ న్యాయవాదులు, కళాప్రియులు, లలిత కళల్లో బహుముఖాలుగా పరిచయమున్నవారు. శివరామయ్యగారి కళాభిమానాన్ని గుర్తించిన ధనవంతులైన దాతలు, ప్రసిద్ధ న్యాయవాదులు పోషకులుగా వుండి, నాటక కళాపోషణకు ఎంతగానో తోడ్పడ్డారు. 18 సంవత్సరాలనుండి, సంవత్సరానికి 6 ప్రదర్శనాల చొప్పున 1918 నుంచి 1936 వరకూ కళను ఉద్ధరించారు.

1942 లో రాజమన్నార్‌గారి అధ్యక్షతను సిల్వర్‌జూబిలీ జరుపుకున్న ఆంధ్ర సభకు శివరామయ్యగారు, వారి తరువాత రేబాల పట్టాభిరామిరెడ్డిగారు, తరువాత వారి సోదరులు లక్ష్మీనరసారెడ్డిగారు వరుసగా అధ్యక్షులుగా పనిచేశారు. ఈనాడు నరసారెడ్డిగారు అధ్యక్షులుగను, ఏ. పి. సుబ్బారెడ్డిగారు ఉపాధ్యక్షులుగాను వుండి,

ఆంధ్ర సభకు అనుబంధంగా గ్రంథాలయాన్ని నడుపుతున్నారు. ఆంధ్ర సభ కార్య కలాపాల్లో పి. వి. కృష్ణయ్యగారు కూడ విశేషంగా కృషిచేశారు.

నటేశయ్యగారనే ప్రసిద్ధ సంగీత విద్వాంసుడు 1909 నుండి 1914 వరకు వేంకటరాయశాస్త్రిగారి నాటకాలకు, 1914 నుండి 1918 వరకూ అనేక పేర్లు మార్పుచెందిన ఇతర నాటకసమాజాలకు శాస్త్రీయదాక్షిణాత్య సంగీత సాంప్ర దాయాలను ప్రవేశపెట్టి, అపూర్వమైన సేవచేశారు.

ఆనాడు నెల్లూరు నాటక రంగంలో పనిచేసిన కళాకారు లందరూ గౌరవ కుటుంబాలనుండి వచ్చినవారు, విద్యావంతులు, ఉద్యోగాలు చేసుకొనేవారు, రచ యితలు, కళాభిమానం కల కళాకారులు, డబ్బుకాశించి ఒక్క కళాకారుడూ పని చేయలేదు. అందరూ నిస్వార్థంగా పనిచేశారు. అందువల్లనే నెల్లూరు నాటకరంగం ఆంధ్రనాటకరంగ చరిత్రలో ఒక ప్రముఖస్థానాన్ని ఆక్రమించింది.

నెల్లూరు నటులు :

గద్దం శేషయ్య—న్యాపతి కృష్ణస్వామిరావు—మధ్వపతి సత్యసంధరావు—మహం కాళి సుబ్రహ్మణ్యం—ఆత్మకూరు కృష్ణమాచార్యులు—తూములూరు వేంకట రమణయ్య—వేదం వేంకటరాయశాస్త్రి—ఒంగోలు వెంకటరంగయ్య—కందాడై శ్రీనివాసన్—కందాడై కేశవాచార్యులు—కందాడై అనంతాచార్యులు—నందగిరి హనుమంతరావు—కె. కేశవాచార్యులు—కాశిచెంచుసుబ్రహ్మణ్యం—కె.వి .రంగా చార్యులు—పులిగండ్ల రంగయ్య—పి. జయరాజారావు—దుర్భా రామయ్య— ఆదూరు సీతారామయ్య-నేలటూరు శ్రీనివాసాచార్యులు-పి. ఆర్. కృష్ణమాచార్యులు- పులిగండ్ల వెంకటకృష్ణయ్య—దుర్భా చిదంబరయ్య—ఆమంచర్ల ఆదినారాయణ రావు—శ్రీనివాస రంగస్వామి అయ్యంగార్—కొమండూరు దొరస్వామి అయ్యం గార్—యరగుడిపాటి గోపాలకృష్ణారావు—యరగుడిపాటి హనుమంతరావు— వై.వి. రావు—కనుపర్తి రామకృష్ణయ్య—నేలటూరు సింగరాచార్యులు—రేబాల సుబ్బారాయుడు—కొమండూరు రంగాచార్యులు—పూండ్ల రామకృష్ణయ్య— మధుర శ్రీనివాసరావు—ఫండాఫీసు బంగారయ్య—నేలటూరు వరదాచార్యులు— ముత్తరాజు శ్రీనివాసరావు—జంగా వెంకయ్య—రేబాల పట్టాభిరామరెడ్డి—గుణ్ణం సుబ్బరామయ్య—రేబాల లక్ష్మీనరసారెడ్డి—టి. రాఘవాచార్యులు—పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి—ఘంటసాల రాధాకృష్ణయ్య—తిక్కవరపు రామిరెడ్డి—కోట

శ్రీనివాసరావు—మోచర్ల రామకృష్ణయ్య—వేగూరు వెంకటప్ప—కామరాజుగడ్డ శ్రీనివాసరావు—సరస్వతిరంగస్వామిఅయ్యంగార్—వావిలకొలను రంగారావు—కొలిపాక వెంకటవరదరావు—తూములూరు శివరామయ్య—నేలనూతల రామకృష్ణయ్య—పత్రి నరసింహారావు—నేలటూరు వరదాచార్యులు—యస్. వి. కృష్ణమాచార్యులు—పి. పుల్లయ్య—ఘంటసాల బలరామయ్య—దువ్వూరి రామిరెడ్డి—బడి చెంగారెడ్డి—వైద్యుల చంద్రశేఖరం—గాదేపల్లి రామయ్య—మోచర్ల రామకృష్ణయ్య—కణ్వశ్రీ—కె. సుబ్రహ్మణ్యకుమారి—టి. వి. రమణారెడ్డి—రంగనాయకి—పులుగుండ్ల రామకృష్ణయ్య—యస్. వి. సుబ్బారావు మొదలైనవారు నటీనటులుగా వెలుగొందారు.

## వెంకటగిరి నాటకరంగం :

వెంకటగిరిలో 60 సంవత్సరాలక్రితం వెంకటగిరి అమెచ్యూర్స్ అనే నాటక సమాజాన్ని వెంకటగిరి జమీందార్లు స్థాపించారు. పాదుకాపట్టాభిషేకం, శకుంతల మొదలైన నాటకాలను ప్రదర్శించేవారు. ఆనాటి వారి ప్రదర్శనాలకు వీధి రంగస్థలాన్నే వుపయోగించారు. నాలుగువీధులు కలిసినచోటలో వుండే వీధిమంటపాన్ని మూడు ప్రక్కలా మూసి, ఒక ప్రక్క తెరలకు బదులు దుప్పట్లనే తెరలుగాపట్టి నాటకాలాడేవారు. వారికి పెట్రొమాక్సు లైట్లుకూడ లేనిరోజులవి. కేవలం దివిటీల వెలుతురులోనే ప్రదర్శించేవారు. వీరి సమాజంలో పళ్ళాల జగ్గయ్య పురుషపాత్రల్ని, దుర్యోధనగారి వీరాస్వామి స్త్రీ పాత్రల్ని ధరించేవారు. ముఖ్యంగా పళ్ళాల జగ్గయ్య బళ్లారి రాఘవాచార్యుల మెప్పును పొందిన మేటినటుడు.

తరువాత 1910 సంవత్సర ప్రాంతంలో పాత విద్యార్థులందరూ కలిసి విద్యార్థి సంఘం అనే నాటక సంఘాన్ని స్థాపించారు. వీరు స్వంతంగా నాటకాలాడి డబ్బు సంపాదించి స్వశక్తితో టిన్నురేకు హాలును నిర్మించుకున్నారు. ఆ హాలు శిధిలావస్థలో వుంది. ముఖ్యంగా నాటకసమాజంలో నిర్మాణం దర్శకబాధ్యతల నన్నిటినీ వహించినవారు రంతుమియా. ఈ సమాజంలో ప్రఖ్యాతివహించిన నటులు గుర్నాథంచెట్టి, సుబ్బయ్య, బాబూరావు, జయరాంనాయుడు, అవధానం శంకరయ్య, గురువుగారి వెంకటకృష్ణయ్య, గురువుగారి వెంకటదాసు మొదలైనవారు విద్యార్థి సంఘంలోవుండి కట్టుదిట్టంగా నాటకాలు ప్రదర్శించారు.

తిరిగి 1930 ప్రాంతంలో వెంకటగిరి రాజాగార్ల పోషణలో వెంకటగిరి అమెచ్యూర్సు అనే నాటక సమాజాన్ని తిరిగి పునర్నిర్మించారు. స్వంతంగా ఒక నాటక హాలును కట్టించారు. అది ఈనాటికీ ప్రదర్శనయోగ్యంగా వుంది. ఈ థియేటరులో ప్రముఖనటుడు బళ్ళారి రాఘవకూడ కొన్ని నాటకాలను ప్రదర్శించారు. వీరు నాటకసంఘం స్థాపించే నాటికి వచ్చిన మార్పుల్లో గమనించతగింది స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించటం. వీరు ప్రమీలార్జునీయం, కృష్ణలీలలు, చిత్రనళీయం మొదలైన పౌరాణిక నాటకాలను ప్రదర్శించేవారు. ఈ సమాజంలో పాల్గొన్న నటులు కొంతవరకు బాగా చదువుకుని ఉద్యోగాలు చేసుకునేవారు. పురుషపాత్ర ధారుల్లో తిరుమలశెట్టి రంగనాయకులు, డాక్టరు తిరుమలశెట్టి సింహాచలం, మహేశ్వరం, డాక్టరు దామోదరం, జగదీశ్వరరావు, దుర్యోధన్‌గారి వెంకటసుబ్బయ్య మొదలైనవారు.

ఇక స్త్రీ పాత్రలు ధరించినవారు దేవదాసీలైన శేషసుందరి, రోశమ్మ, నవరత్నమ్మ, బేబి, నారాయణమ్మ మొదలైనవారు. ఈ విధంగా ఈ సమాజం కొంతకాలం నాటకాలు ప్రదర్శించిన తరువాత 1930 లో వెంకటగిరి అమెచ్యూర్ ఆర్టిస్టు అసోసియేషన్ సమాజాన్ని పాత విద్యార్థులందరూ కలిపి స్థాపించారు. వీరు విప్రనారాయణ, ఖిల్జీరాజ్యపతనం, మీరాబాయి, ఉషాపరిణయం మొదలైన పౌరాణిక చారిత్రకాలనేకాక అనేకమైన సాంఘికనాటకాలను కట్టుదిట్టంగా ప్రాక్టీసు చేసి ఆంధ్రనాటక కళాపరిషత్తు మహాసభల పోటీల్లో ప్రదర్శించి అనేక ప్రథమ బహుమతుల్ని పొందారు. అలా బహుమతులు పొందిన పరిషత్తులు హిందూపూరు ఆంధ్రనాటక కళాపరిషత్తు వార్షికసభల్లో గాలి బాలసుందరరావుగారు రచించిన అపోహ నాటకాన్నీ, శరత్ పరిణీతను నాటకంగా మార్చి కాకినాడ పరిషత్తులోనూ, మల్లాది అవధాని రచించిన 'గాలివాన' నాటకాన్ని బందరు పరిషత్తులో ప్రదర్శించి, మెరిట్ సర్టిఫికేట్‌ను పొందారు. ఆనాటికి కళాపరిషత్తు పోటీ పద్ధతుల్ని ప్రవేశపెట్టలేదు.

తరువాత మద్రాసు నాటక కళాపరిషత్తుసభల్లో బాలసుందరరావుగారి అపోహను ప్రదర్శించి మొదటి బహుమానాన్ని పొందారు. గుడివాడ పరిషత్తులో కొండముది గోపాలరాయశర్మ రచించిన 'ఎదురీత' నాటకాన్ని ప్రదర్శించి ప్రథమ బహుమానాన్ని పొందారు. అలాగే ఏలూరు పరిషత్తులో ఆత్రేయ రచించిన

'యన్. జి. ఓ' నాటకానికి, విజయవాడ పరిషత్తులో ఆత్రేయ రచించిన 'ఈనాడు' నాటకానికి ప్రథమ బహుమానాలను పొందారు. ఈ విధంగా వెంకటగిరి ఆమెచ్యూర్సు ఆంధ్రనాటక రంగంలో ఔత్సాహిక నటీనటులకు, నాటక సమాజాలకు కొత్త వుత్సాహాన్నిచ్చారు. వీరు కొంతకాలం పరిషత్తుల్లో బహుమతులను మాత్రం పొందడానికే తయారుచేసేవారు. కాని తరువాత రాఘవపేర నాటక మందిరాన్ని స్థాపించాలని గూడవల్లి రామబ్రహ్మం అధ్వర్యంలో ఎదురీత నాటకాన్ని ఆంధ్రదేశపు ముఖ్యపట్టణాల్లో ప్రదర్శించి కొంతధనాన్ని సంపాదించారు. తరువాత ఎన్. జి. ఓ; ఈనాడు; డాక్టర్ కోట్నీసు నాటకాలను కొన్ని ఆంధ్ర నగరాలలో ప్రదర్శించారు. వీరు పరివర్తన, రషీదా అనే నాటకాలను కూడా ప్రదర్శించారు. ఈ నాటక సమాజంలో ప్రముఖులైన నటీనటులు వుద్భవించారు వారిలో డాక్టరు దామోదరం, జయరాంనాయుడు, జగన్నాథ ప్రసాద్, ఈశ్వరదాస్, ఆత్రేయ, కబీరు, టి. వి. రమణారెడ్డి, దుర్యోధనగారి జగన్నాథం, కేశవయ్య, అవధానం శంకరశాస్త్రి, నరసింహులు, సుబ్రహ్మణ్యం మొదలైనవారు; స్త్రీ పాత్రల్లో కావూరి లక్ష్మీకాంతమ్మ, టి. జి. కమలాదేవి, పూర్ణిమ, సుబ్రహ్మణ్యకుమారి, మాలపిల్ల సుందరమ్మ, సురభి బాలసరస్వతి, నిర్మల, రామతిలకం, బాలామణి, లలిత మొదలైనవారు. ముఖ్యంగా ఈ నాటక సమాజాన్ని కట్టుదిట్టంగా నిర్వహించిన కార్యకర్తల్లో ముఖ్యులు సినీమ్యూజిక్ డైరెక్టరు పి. మోహన్‌దాసు, సాధనా ఫిలిమ్సు ప్రొడ్యూసరు డైరెక్టరు రంగనాధదాసు, రామేశ్వరదాసు, నర్సయ్య, డాకరు రామదాసు మొదలైన కళాకారులు.

పై సమాజాలేకాక 1947 లో ప్రోగ్రసివ్ ఆర్టుథియేటరు, కల్చరల్ ఆర్టు థియేటర్, వెంకటగిరి ఆర్టుథియేటర్సు, జనతా ఆర్టుథియేటర్సు మొదలైన సమాజాలు కూడ ఏర్పడి పనిచేస్తున్నాయి.

ఈ సమాజాలలో పి. నగరాజారావు, వి. నారాయణబాబు, కె. రవీంద్రనాధ్, సి. హెచ్. గోవర్ధనమ్, కె. వెంకటశేషయ్య, పి. వెంకటసుబ్బయ్యనాయుడు, శ్రీవేణు, సుబ్బరామనాయుడు, వెంకట గోపాల్‌నాయుడు, గుర్నాథం, డాక్టర్ పి.చెంచయ్య, యస్.యల్. నరసింహం,శాస్త్రి,చంద్రశేఖరం మొదలైన నటీనటులు పనిచేశారు.

ఈ విధంగా వెంకటగిరి నాటకరంగం చరిత్రలో ఔత్సాహిక నాటకరంగంలో కొత్త ప్రమాణాలను ప్రవేశపెట్టి యువకుల్ని వుత్సాహపర్చింది.

## అల్లూరు నాటక రంగం :

ఆనాడు నెల్లూరు నాటకరంగంతోపాటు నెల్లూరుకు సమీపంలోవున్న అల్లూరులో శ్రీ కృష్ణవిలాస సభ అనే నాటక సమాజాన్ని పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు స్థాపించారు. ఈ సమాజ కార్యదర్శిగా కె. వెంకటరమణారెడ్డిగారు బహుముఖసేవ చేశారు.

అల్లూరు కృష్ణవిలాస సభవారి రామదాసు నాటకం ఆంధ్రదేశంలో విశేష ఖ్యాతి నందుకొంది. రామదాసు నాటకంలో కబీరు పాత్రధారణలో పర్వతరెడ్డి రామచంద్రారెడ్డిగారు అఖండమైన పేరు ప్రతిష్ఠల్ని సంపాదించుకున్నారు, మూర్తీభవించినట్లుగా ముమ్మూర్తులా కబీరుపాత్రకు సరిపోయే అంగసౌష్టవం ఆయనది. స్వచ్ఛమైన వుచ్చారణ, గంభీరమైన గాత్రం, కబీరుపాత్రను తీర్చి దిద్దింది. వీరి నాటకసమాజం నాటకాలను ఎంతో కట్టుదిట్టంగా ప్రదర్శించారు. వీరి సమాజానికి రామదాసు నాటకం ఎక్కువ పేరును సంపాదించి పెట్టింది. అంతేగాక దువ్వూరి రామిరెడ్డిగారి సీతావనవాస నాటకాన్ని, ప్రహ్లాద మొదలైన ఇతర నాటకాలను కూడ ప్రదర్శించేవారు. వీరి నాటకాల్లో మరో పేరుపొందిన నటుడు లచ్చారెడ్డిగారు. వీరు హాస్యపాత్రలను నటించడంలో బహు ప్రసిద్ధుడు.

## గూడూరు :

1954 లో సంస్కృతి సమ్మేళనం, నవోదయ నాట్యమండలి, ఆంధ్ర అభ్యుదయ నాట్యమండలి, విజ్ఞాన సంఘం, కాళిదాస కళానికేతన్, లలితకళా మండలి, ఆదర్శ నాట్యమండలి మొదలైన నాటకసమాజాలు పనిజేశాయి.

యరగుడిపాటి హనుమంతరావు, వై. వి. రావు, సివి డైరెక్టరు, ఎ. అజీజ్, శ్రీనివాసరావు, రామయ్య, డి. వి. శేషయ్య, పి. సిద్ధయ్యనాయుడు, రంగనాయకులు, కె. వి. రామచంద్రారెడ్డి, బి. పద్మనాభరెడ్డి, యస్. ప్రకాష్ మొదలైన నటులు పనిజేస్తున్నారు.

బిట్రగుంటలో 1928 లో రైల్వే ఇన్‌స్టిట్యూట్ ఏర్పడి పనిజేస్తూ వుంది.

**కావలి :**

1952 లో కావలి కాలేజి డ్రమెటిక్ అసోసియేషన్, 1958 లో విశ్వోదయ లలితకళాసమితి, శారదా నాట్యమండలి ఏర్పడి పనిజేస్తున్నాయి. కేసరి కృష్ణమూర్తి, వేదుల రాజ్యలక్ష్మి, జె. వి. సుబ్బారాయుడు, జి. పరమేశ్వర రావు, కే. శంకరయ్య, పి. నర్సయ్య, కె. సుబ్బయ్య. యం. పి. కోటయ్య, పి. సత్యనారాయణ మొదలైన కళాకారులు పనిజేస్తున్నారు.

**కందుకూరు :**

1922 లో మార్కండేయ నాట్యమండలి. 1952 లో ధరణి నాటకమండలి. ఆర్య వైశ్యనాటకసంఘం పనిజేస్తున్నాయి. ఈ సమాజాల్లో నందా మార్కండేయ శర్మ. యం. సీతారామనాథశాస్త్రి. యం. రాధాకృష్ణయ్య యం. ఆంజనేయులు. పాచ్చా. నరసింహారావు. శ్రీనివాసరావు. పి. రాధాకృష్ణమూర్తి. శ్రీమతి యస్. సరోజనీదేవిగార్లు పనిజేస్తున్నారు.

**పొదిలి :**

1954 లో సత్యనారాయణ కళాసమితి, 1957 లో రాఘవ అమెచ్యూర్స్ పని జేస్తున్నాయి. కె. యల్. సీతారామయ్య, టి. రాఘవులు, సూర్య ప్రకాశరావు, మాధవయ్య. కె. సూర్యనారాయణ, వి. శేషాద్రి, యం. వి. రమణయ్య. పి. వి. సుబ్బారావు మొదలైనకళాకారులు పనిజేస్తున్నారు.





# గుంటూరు జిల్లా నాటకరంగం



గుంటూరు, తెనాలి, నరసరావు పేట, బాపట్ల, గురజాల, చీరాల, ఒంగోలు, రేపల్లె, వేటపాలెం మొదలైన నాటకరంగాలు.

# గుంటూరు నాటకరంగం

గుంటూరు హిందూ నాటక సమాజమనే ఫస్టుకంపెనీ 1882 సం॥ మొదలు 1912 వరకూ కొండుభొట్ల సుబ్బరాయశాస్త్రి, పాతూరి శ్రీరాములు, పోలూరు హనుమంతరావు, తోలేటి అప్పారావు మొదలైనవారు నిర్వహించిన ఈ సమాజంలో అద్వితీయమైన నాట్యకళా వైదుష్యాన్ని ప్రదర్శించిన పితామహుడుగాను, నటకాగ్రేసరుడుగాను పేరు ప్రతిష్ఠలు గడించుకున్నవారు హరిప్రసాదరావుగారు. ఈ సమాజంవారు ఆనాడు మద్రాసులోనూ, ఆంధ్రదేశమంతటా పర్యటించిఅఖండమైన ఖ్యాతి నార్జించారు. వీరు ప్రదర్శించిన నాటకాల్లో రామదాసు, పద్మవ్యూహం, హరిశ్చంద్ర, చిత్రనళీయం, విషాదసారంగధర, అభిజ్ఞాన శాకుంతలం మొదలైనవి ముఖ్యమైనవి.



శ్రీ హరిప్రసాదరావుగారు (హరిశ్చంద్రుడు)
శ్రీ కోపల్లె హనుమంతరావుగారు (చంద్రమతి)

ఫస్టుకంపెనీలో అనేకమంది ఉద్దండులైన నటులు వుద్భవించారు. కలపటపు నరసింహారావు, రాగం పీరాస్వామి, బాబు నౌషర్‌వాంజీ, కోపల్లె హనుమంతరావు, శ్రీ పార్వతీశ్వరశాస్త్రి, పత్రి గోపాలరావు, ఇవటూరి వియ్యన్న, బొడ్డుపల్లి శాస్త్రులు, మల్లాది సోమయాజులు, నాళ్ళచెరువు రామారావు, బలిజేపల్లి లక్ష్మీకాంతం, పత్రి వెంకటరమణరావు, తిప్పావఝుల లక్ష్మీనారాయణ, బలిజేపల్లి సీతారామయ్య, కోటంరాజు లక్ష్మీకాంతం, హరిసుబ్బారావు, పత్రి శ్రీనివాసరావు, తూములూరు పుల్లయ్య, నాళ్ళచెరువు నరసింహారావు, భువనగిరి లక్ష్మీనారాయణ, వారణాసి

బలరామయ్య. అధరాపురపు గోపాలాచార్యులు ప్రభృతులు ఈ కంపెనీలో పాల్గొన్నారు.

**విబుధరంజనీ**

**శృంగార హిందూ**

**నాటక సమాజం :**

1885 సం॥రంలో ప్రారంభమైన విబుధరంజనీ శృంగార హిందూ నాటక సమాజ మనే సెకండు కంపెనీ 1912 వరకూ దేదీప్యమానంగా నడిచింది. ఈ నాటక సమాజాన్ని కనకరత్నం శ్రేష్ఠిగారు స్థాపించి, స్వంత నాటకశాలను నిర్మించి పాండవజననం, వేణీసంహారం, ద్రౌపదీ స్వయంవరం, చిత్రనళీయం, సారంగ ధర, హరిశ్చంద్ర మొదలైన ప్రముఖ నాటకాలను స్థానికంగా ప్రదర్శించడమేగాక సర్కారాంధ్రదేశమంతటా పర్యటించి ఘనమైన కీర్తిని ఆర్జించారు.

ఈ నాటక సమాజంలో పత్రి గోపాల్‌సింగ్, క్షత్రి దివాకర్‌సింగ్, గుత్తా శేషయ్య, మందపాటి నరసింహారావు, మల్లాది గోవిందశాస్త్రి, పులుగుండ్ల వెంకట రమణయ్య, మల్లాది వేంకటరామయ్య, కొడవటిగంటి వెంకటప్పయ్య, పత్రి వేంకటరమణారావు, గుండవరపు వీరభద్రయ్య, వుమ్మెత్తల సీతాపతి, కోటంరాజు లక్ష్మీకాంతం, గుండిమెడ చలపతిరావు, మేడిసెట్టి సుబ్బారావు మొదలైనవారు బహుముఖ పాత్రలు ధరించి మేటి నటులుగా కీర్తింపబడ్డారు. వీరేగాక చల్ల యల్ల మంద, నేతి సుబ్బరాయశాస్త్రి, పోరల నర్సయ్య అనే ఈ ముగ్గురు మూర్తులూ ఈ సమాజ నిర్వహణలో ప్రముఖ బాధ్యతల్ని వహించారు.

సెకండ్ కంపెనీలో ఎంతమంది పనిచేసినా ఆ సమాజానికి బ్రహ్మాండమైన కీర్తిప్రతిష్ఠలు చేకూర్చి సుప్రసిద్ధ నటకాగ్రేసరులుగా కీర్తింపబడినవారు మల్లాది గోవిందశాస్త్రిగారు.

**కన్యకాపరమేశ్వరి**

**నాటక సమాజం :**

1889 సం॥ నుండి 1899 వరకు నడిచిన ఈ సమాజాన్ని గోపుకృష్ణమ్మ స్థాపిం చారు. మల్లెల చలపతి, కిడాంబి వేదాద్రి నరసింహాచార్యులు నిర్వాహకులుగా వున్నారు. ఈ సమాజంవారు-హరిశ్చంద్ర, రుక్మాంగద, బొబ్బిలి, చంద్రకాంత

మొదలైన నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజంలో చోడగం కృష్ణయ్య, అల పర్తి పాపయ్య, గుడివాడ వెంకటేశ్వర్లు, కనుమర్లపూడి వెంకటప్పయ్య మొద లైనవారు నటులుగా వెలుగొందారు. ఈ రోజుల్లోనే పొత్తూరు సుబ్బయ్య, సుధీపథ హితబోధినీ నాటక సమాజాన్ని 1890 లో స్థాపించి 1895 వరకూ నడిపారు.

1895 లో గుంటూరులో ప్రథమ హార్మోనిస్టుగా పేరుపొందిన మహమ్మద్ షర్ఫుద్దీన్ క్రిసెంట్‌స్టార్ వుర్దూ డ్రామెటిక్ సొసైటీని స్థాపించి 1926 వరకూ 'ఖాన్‌దానేహమాన్' 'గులేబకావళి' 'సహెర్‌సామరీ' మాత్ మేజఫర్' 'ఇందర్‌సభ' మొదలైన వుర్దూ నాటకాలను ప్రదర్శించారు. ఈ నాటకాలలో మోసెన్‌షరీఫ్—మొహదీన్ బేగ్—అబ్దుల్‌కరీం—షేక్‌బిక్కు—రాఘవులు—దరాజ్‌బేగం మొదలైనవారు నటులుగా వెలుగొందారు.



శ్రీ కడియాల రత్తయ్యగారు (రుక్మిణి)

1906 లో యం. డి. గోపాలచారి ఇంగ్లీషు డ్రమెటిక్ క్లబ్‌ను స్థాపించి రోమియో జ్యూలెట్, మర్చంట్ ఆఫ్ వెనీస్ మొదలైన ఇంగ్లీషు నాటకాలను ప్రదర్శించారు.

1910 వ సంవత్సరంలో కొంతమంది న్యాయవాదులు కృష్ణానంద హిందూ నాటక సమాజాన్ని స్థాపించారు. 1923 వరకు గిరి రాజు రామమూర్తి, చెలిమికంటి లక్ష్మీనారాయణగార్లు ఈ సమాజాన్ని నిర్వహించారు. ఇందులో పాల్గొన్న నటులందరూ ప్లీడరు గుమాస్తాలు. వీరు ప్రదర్శించిన నాటకాలు 'ప్రసన్నయాదవం' 'పాండవ విజయం' 'గయోపాఖ్యానం' 'హరిశ్చంద్ర' 'బొబ్బిలి' మొదలైనవి. గిరిరాజు రామమూర్తి, చెలిమికంటి లక్ష్మీనారాయణ, యద్దనపూడి నరసింహం, ఉండవల్లి లక్ష్మీనారాయణ, ఆరణి సత్యనారాయణ, పెనుమాక నరసింహం మొదలైనవారు నటులుగా పేరుపొందారు.

## సీనియర్

## హిందూ థియేటరు :

గుంటూరు షష్టకంపెని నిలిచిపోయిన తరువాత హరిప్రసాదరావుగారు 1912 సంవత్సరంలో సీనియర్ హిందూథియేటర్‌ను స్థాపించి హరిశ్చంద్ర, సారంగధర,

శకుంతల మొదలైన నాటకాలను ప్రదర్శించారు. హరిప్రసాదరావు, కోప హనుమంతరావు, పర్వతనేని వీరయ్య చౌదరి, పిల్లలమఱ్ఱి సుందరరామయ్య, బెల్లంకొండ సుబ్బారావు, తూములూరు పుల్లయ్య మొదలైనవారు ప్రసిద్ధ నటులుగా పేరు తెచ్చుకున్నారు.

## అమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్ :

యడవల్లి సూర్యనారాయణ అధ్వర్యంలో అమెచ్యూర్ డ్రమెటిక్ క్లబ్ స్థాపించబడి 1912 నుండి 1915 వరకు నడిచింది. వీరు ప్రసన్నయాదవం, గయోపాఖ్యానం, బొబ్బిలి నాటకాలను ప్రదర్శించారు. యడవల్లి మైలవరం కంపెనీలో చేరడంతో ఈ కంపెనీ మూలబడింది. ఈ సమాజంలో యడవల్లి, వంగల ఆంజనేయులు, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య నటులుగా వర్ధిల్లారు.

## సీతారామ నాటక సమాజం :

బోళ్ళ వేంకటప్పయ్య, పురుషోత్తం స్థాపించిన ఈ సమాజం 1912 నుంచి, 1919 వరకూ సాగింది. 1917 లో గుంటూరులోనూ, బెజవాడలోనూ జరిగిన హరిశ్చంద్రకాంపిటీషన్ డ్రామాల్లో ట్రూప్ కప్పును గెలుపొందారు.

## మూన్ థియేటరు :

పొత్తూరు హనుమంతరావు, బండారు రామస్వామినాయుడు, పాదర్తి సోమయ్య, ప్రత్తి సుబ్రహ్మణ్యం మొదలైనవారు 1912 లో మూన్‌థియేటరును స్థాపించి అనేక చారిత్రక నాటకాలనూ, పౌరాణిక నాటకాలనూ ప్రదర్శించారు. 1916 లో గుంటూరులో ప్రసన్నయాదవ నాటకానికి, రాజమండ్రిలో బొబ్బిలి కాంపిటీషన్ నాటకానికీ ట్రూపు కప్పును గెలుచుకున్నారు. ఈ సమాజంలో గోవింద రాజు వేంకటరామయ్య, ఆరణి సత్యనారాయణ, కడియాల రత్తయ్య మొదలైన వారు ప్రసిద్ధ నటులు.

### హిందీ నాటక్ సభ :

1913 లో పాదర్తి సోమయ్యగారు హిందీ నాటక్‌సభను స్థాపించి, హిందీ నాటకాలు ప్రదర్శించారు. తాళ్ళూరు నరసింగరావుగారు ఈ సమాజంలో పాల్గొని, పీష్వా నారాయణరావు హిందీ నాటకాన్ని ప్రదర్శించారు.

### స్టార్ థియేటరు :

1913 లో అద్దంకి శ్రీరామమూర్తి స్థాపించారు. 1920 వరకూ ఈ సమాజం నడిచింది. వీరు పౌరాణిక చారిత్రక నాటకాలు ప్రదర్శించారు. రావిపాటి లక్ష్మీనారాయణ-పోతకమూరి మల్లయ్య-జంధ్యాల కృష్ణారావు-బొగ్గవరం కృష్ణారావు-మద్దాలి సూర్యనారాయణ మొదలైన అనేకమంది నటులు పాల్గొన్నారు.

### అఫిషియల్ డ్రమెటిక్ క్లబ్ :

ఈ సమాజాన్ని పొత్తూరు లింగయ్య మొదలైనవారు 1913 లో స్థాపించి 1930 వరకు నాటకా లాడించారు. కొప్పరపు సుబ్బారావు కవిగానూ దర్శకుడుగానూ వెలుగొందిందిక్కడే. బళ్ళారి రాఘవ, స్థానం నరసింహారావు వీరి విజయనగర సామ్రాజ్య పతనం, రోషనార నాటకాల్లో పాల్గొన్నారు. వీరేగాక, బెల్లంకొండ సుబ్బారావు, బండారు రామస్వామి, వలివేటి శ్రీమన్నారాయణ, లక్కరాజు విజయగోపాలరావు మొదలైన వారు నటులుగా పేరు పొందారు.



### విద్యాదాన వినోదినీ సభ :

పత్రి వేంకటరమణారావు 1913 లో స్థాపించి, గయోపాఖ్యానం, చిత్రనళీయం, ప్రసన్నయాదవం, చింతామణి మొదలైన నాటకాలను ప్రదర్శించి, 1927 సం॥ రంలో రోషనారగా స్థానం నరసింహారావుగారు ఈ సభను పూర్తిగా నిలిపివేశారు. నటులుగా

పత్రి వేంకటరమణరావు. పత్రి శ్రీనివాసరావు, పర్వతనేని వీరయ్యచౌదరి, మల్లాది గోవిందశాస్త్రి. జాగర్లమూడి నరసింహారావు మొదలైనవారు ప్రముఖపాత్ర వహించారు.

## సంఘసేవా

## నాట్యమండలి :

ఈ సమాజాన్ని 1920 లో దామరాజు పుండరీకాక్షుడు స్థాపించి, స్వరాజ్య సోపానం, గాంధిమహోదయం, గాంధివిజయం, పాంచాల పరాభవం, సంస్కారిణి మొదలైన దేశభక్తిని ప్రబోధించే నాటకాలతో 1926 వరకూ ఆంధ్రజాతిని వుత్తేజ పరిచారు. ఈ నాటకాల్లో పత్రి శ్రీనివాసరావు, బసవరాజు సుబ్బారావు, నిడుముక్కల సుబ్బారావు, దైతా గోపాలం, పెద్దిభొట్ల చలపతిరావు, ముక్కామల ముకుందరామయ్య, కడియాల రత్తయ్య, పువ్వుల అనసూయ మొదలైన నటీ నటులు పాల్గొన్నారు.

## బాలమిత్ర

## నాటక సమాజం :

ఈ సమాజాన్ని 1916 లో దంటు వెంకటకృష్ణయ్య స్థాపించారు. ఈ సమాజంలో కొప్పరపు సుబ్బారావు ప్రముఖపాత్ర వహించారు. 1928 వరకూ ఈ సమాజం నడిచింది. తరువాత దీని స్థానంలో నవలా నాటక సమాజం ఏర్పడి స్త్రీ పురుషపాత్రలు స్త్రీలే ధరించే పద్ధతిలో 1930 వరకూ నడిచింది.

బాలమిత్ర సమాజంలో టి. రామకృష్ణశాస్త్రి, కె. రఘురామయ్య, పైడి బాబు, రావుల లక్ష్మీకాంతం, మాస్టర్ కళ్యాణి, నాగలింగం, సూరిబాబు, ఆంజి మొదలైన సమర్థులైన నటులు వుద్భవించారు.

నవలా నాటక సమాజంలో శ్రీమతులు దాసరి కోటిరత్నం, పసుపులేటి కన్నాంబ, సిద్ధాబత్తుని శ్రీహరి, ఆదోని అమ్మణీబాయ్,దాసరి యామినీ పూర్ణతిలక్, దాసరి అంజనీబాయి మొదలైన నటీమణులు నాటకరంగంలోనూ, సినిమా రంగంలోనూ ప్రఖ్యాతి పొందారు.

అఖిల సాహిత్య కళాభివర్ధక ఆంధ్రసంసత్ తరపున 1952 లో వారణాసి

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ ఏ.టి. రామానుజులు
(హార్మోనిస్టు)



శ్రీ కోట రామబ్రహ్మం



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి



శ్రీ తాపీ ధర్మారావునాయుడు

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ కొత్తపల్లి లక్ష్మయ్య



శ్రీ త్రిపురనేని శివప్రసాదరావు



శ్రీ వేమూరి ఆంజనేయశర్మ



శ్రీ బొబ్బిలి రాజా

# ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు



శ్రీ పసల సూర్యచంద్రరావు
(ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక
అకాడమి అధ్యక్షులు)



శ్రీ సి. మోహన్‌దాసు
(ప్రజానాట్యమండలి సంగీత దర్శకులు)

## ప్రసిద్ధ కళా పోషకులు



శ్రీ ఆచంట వెంకటసాంఖ్యాయన శర్మ



శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ



శ్రీ మోతే నారాయణరావు

రామమూర్తి సాహిత్య గోష్ఠిని స్థాపించి పూర్వ నటులను స్మరించటం, వృద్ధ నటులను ఆదరించటం, ఔత్సాహిక నటులను ప్రోత్సహించటం మొదలైన ఆశయాలతో 1953 లో హరిప్రసాదరాయ వర్ధంతిని జరిపారు. కడియాల రత్తయ్య. పత్రి వేంకటరమణరావు. తూములూరు పుల్లయ్య. బండారు రామస్వామి, పింగరాజు నాగభూషణం. గోవిందరాజుల సుబ్బారావు, స్థానం నరసింహారావు, దాడి గోవిందరాజులనాయుడు, ముప్పవరపు భీమారావు మొదలైన సుప్రసిద్ధ నటకాగ్రేసరులను ఘనంగా సన్మానించారు.



డాక్టరు శివరామకృష్ణయ్యగారు
(కర్ణుడు)

**ఆంధ్ర విజ్ఞాన లలితకళాపరిషత్ :**

మందపాటి రామలింగేశ్వరరావుగారు 1953 లో ఆంధ్రవిజ్ఞాన లలితకళా పరిషత్తునుస్థాపించి హరిప్రసాదరాయ నాటకకళాగోష్ఠులను జరిపారు. విక్రమదేవవర్మగారిచే నాట్యకళానిధి అనే బిరుదును పొందారు.

**వుర్దూ నాటకసమాజ్ :**

మహమ్మదు జానిసాహెబ్ ఈ సమాజాన్ని 1927 లో స్థాపించి, 1932 వ సంవత్సరంవరకు పోషించారు. 'ఖుదాదోస్త్' 'ముస్తఫాకమాల్' 'లైలామజ్నూ' మొదలైన వుర్దూ నాటకాలను ప్రదర్శించారు.

**హిందూకాలేజి డ్రమెటిక్ అసోసియేషన్ :**

ఈ సమాజం పక్షాన కలవగుంట నరసింగరావుగారు నాటక కళాభివృద్ధికొరకు అంతర్ కళాశాలా నాటక పోటీలకు బహూకరించిన షీల్డు నిమిత్తం నాటక పోటీలు జరుపబడుతూ వున్నాయి. ఈ ప్రదర్శనాలలో పిల్లలమర్రి హనుమంతరావు, ముక్కామల అమరేశ్వరరావు, వేమూరు రామయ్య, ముక్కామల కృష్ణమూర్తి,

ధూళిపాళ సీతారామశాస్త్రి స్టారుథియేటరు స్థాపించి ఉద్యోగవిజయాలు, గయోపాఖ్యానం, బొబ్బిలి మొదలైన నాటకాలు ప్రదర్శించి దుర్యోధన పాత్రకు ప్రత్యేక బహుమానాలను సంపాదించారు.

పైన వివరించిన సమాజాలేకాక ముక్కామల అమరేశ్వరరావు స్థాపించిన 'నవజ్యోతి', 1943 లో తోట రత్తయ్య, కూర్మా వేణుగోపాలస్వామిగార్లు స్థాపించిన నాట్యసమితి, నాట్యకళామందిర్, హిందూకాలేజి హైస్కూలు నాట్యమండలి, భారతీనాటకసమితి, సాహితీ ఆర్టు థియేటర్స్,సాహిణీ ఆర్టు థియేటర్సు, బాలానంద కేంద్రం,రవి ఆర్టు థియేటర్,లలితకళాసమితి,నటరాజసేవాసంఘం, మారుతీ నాట్యమండలి, సీతారామ నాట్యకళాసమితి, నటరాజకళామండలి,కల్చరల్ అసోసియేషన్, నటరాజ నాట్యమండలి,విజయవాణీ కళాసమితి మొదలైన సమాజాలు ఏర్పడి పని చేస్తున్నాయి.

ఈ సమాజాలలో—

ధూళిపాళ సీతారామశాస్త్రి, బందారు రామస్వామి, కడియాల రత్తయ్య, నవరం వీరాస్వామి, పెళ్ళూరి శేషగిరిరావు, ముప్పవరపు భీమారావు, మందపాటి రామలింగేశ్వరరావు, కురిచేటి నాగేశ్వరరావు, బి. జగన్నాధం, బి. కె. విశ్వేశ్వర రావు, వేమారావు, జి. విద్యాసాగర్, డి. రామచంద్రరావు, టి. పుండరీకాక్షయ్య, టి. రామచంద్రరావు, జె. సీతారామశాస్త్రి, గుంటుపల్లి వెంకటరత్నం, యం. ఆర్. ఆంజనేయులు, ఎ. యన్. ఆర్. ఆంజనేయులు, అరవపల్లి సుబ్బారావు, రవీంద్ర నాధ్, పి. కాళిదాసు. డి. కుమార్, ఎ. లక్ష్మణరావు, పి. వి. స్వామినాయుడు, కె. కృష్ణమూర్తి, టి. యస్. వెంకటేశ్వరరావు, కె. చక్రపాణి, కె. యస్. ఆర్. ఆంజనేయులు, బొగ్గవరపు రామకృష్ణరావు, వై. మృత్యుం, జయశర్మ, ఆకుల సత్యనారాయణ, యం. వి. యస్. శాస్త్రి, అరిపిరాల రాధాకృష్ణ, చిలుకూరి సుబ్బారావు, షేక్‌నాజర్, కాకుమాను నాగభూషణం, శ్రీమతి జి. కోమలి, ముక్కామల కృష్ణమూర్తి, వల్లభజోశ్యుల,శివరామ్, కె. శివరామకృష్ణయ్య, జి. వరలక్ష్మి, ఛాయాదేవి, కొంగర జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, వేపూరి రామకోటి, సినీనటుడు బాలయ్య, కె. రఘురామయ్య, వై. వి. రాజు, సీనియర్ శ్రీరంజని, జూనియర్ శ్రీరంజని. పి. శ్రీరామశాస్త్రి. డి. లక్ష్మీనరసింహారావు, తంగిరాల శ్రీరామమూర్తి, వలివేటి రామసుబ్రహ్మణం, బి. శ్రీనివాసమూర్తి, పొత్తూరి నర

సింహారావు, వై. కేశవరావు, పోలూరి లక్ష్మీకాంతరావు, యం. పార్వతీశం, యలమర్తి వెంకటసుబ్బారావు, టి. సత్యనారాయణ, శ్రీమతి పుష్పాంజలి, తారా బాయి, రాయప్రోలు సూర్యనారాయణశాస్త్రి, బి. జగన్నాధరావు, యం. వి. రాఘవ రావు, శ్రీమతి మణి మొదలైన నటీనటులు పనిచేస్తున్నారు.

# తెనాలి నాటకరంగం

తెనాలిలో శ్రీ కృష్ణ హిందూ థియేటరుపేర చల్లా ఆంజనేయులుగారు ఒక సమాజాన్ని స్థాపించి ఒక హాలును నిర్మించారు. ఈ సమాజంలో గుంటూరు సెకండ్ కంపెనీ నటులైన మల్లాది గోవిందశాస్త్రిగారు ముఖ్య పాత్రల్ని ధరిస్తూ వుండేవారు. పాది రంగయ్యగారు నాయిక పాత్రల్ని ధరిస్తూ వుండేవారు.



శ్రీ గోవిందరాజుల సుబ్బారావుగారు
(ప్రతాపరుద్రీయంలో పిచ్చివాడు)

1921 సంవత్సరంలో భాగవతుల రాజగోపాలంగారు—త్రిపురారిభట్ల వీర రాఘవస్వామిగారు కలిసి రామ విలాస సభ స్థాపించారు. ఈ సమాజంలో ప్రసిద్ధిపొందిన నటులు పెద్దిభొట్ల చలపతిరావు—డా. గోవింద రాజుల సుబ్బారావు — మాధవపెద్ది వెంకటరామయ్య—పిల్లలమర్రి సుందర రామయ్య—పులిపాటి వెంకటేశ్వర్లు— తంగిరాల ఆంజనేయులు—ఏలేశ్వరపు కుటుంబశాస్త్రి — లక్కరాజు విజయ గోపాలరావు — పాతూరు సూర్యనారా యణ — దావులూరి బుచ్చి రాజేశ్వర రావు— రావూరి రంగారావు మొదలైన వారు పురుషపాత్రల్ని ధరిస్తూ వుండే వారు. పైవారేకాక స్త్రీ పాత్రధారణలో ప్రఖ్యాతి వహించిన స్థానం నరసింహారావులాంటి ప్రసిద్ధ నటులు రామవిలాస సభలోనే అభివృద్ధి పొందారు. వీరు ప్రదర్శించే నాటకాలు ప్రతాపరుద్రీయం—

కన్యాశుల్కం—బొబ్బిలి— రోషనార బాగా పేరు ప్రతిష్ఠలు సంపాదించాయి. వీరి నాటకాలకు చిత్రలేఖకుడుగా వడ్డి బాబురావుగారు పనిచేశారు.


మాధవపెద్ది వెంకటరామయ్య గారు (దుర్యోధనుడు)

దుగ్గిరాల కంపెనీ అనే సమాజం ఒకటి తెనాలిలో ఏర్పడి సౌందర్యభవనం అని ఒకదానిని నిర్మించుకుని యడవల్లి సూర్యనారాయణగారితో కలిసి కొన్ని నాటకాలు ప్రదర్శించారు.

1920 సంవత్సరంలో పులిపాటి వెంక టేశ్వర్లుగారు ఆంధ్రనట సభను స్థాపించారు. 1942 లో జనతా ఆర్టు థియేటరు స్థాపించబడి సాంఘిక నాటకాలను ప్రదర్శిస్తూ అనేక పరిషత్తు పోటీ లలో పాల్గొంటూ వుంది.

1948 లో శ్రీ వెంకట గౌరీశంకర నాట్య మండలి స్థాపించబడి పౌరాణిక నాటకాలను ప్రద ర్శిస్తూ వుంది. వీరి గౌతమబుద్ధ నాటకం ప్రఖ్యాతి వహించింది. దీనికి కార్యదర్శిగా పి. శ్రీరామ మూర్తిగారు పని చేస్తున్నారు.

1957 లో మధుమతి కళాసమితిని వై. బల రామశాస్త్రిగారు స్థాపించి పౌరాణిక చారిత్రక, నాట కాలను ప్రదర్శిస్తూ వున్నారు.

1957 లో అభ్యుదయ కళాసమితిని ఐ. వి. రాఘవరావుగారు స్థాపించి, "అంత్యఘట్టం" లాంటి సాంఘిక నాటకాలను ప్రసిద్ధంగా ప్రదర్శిస్తున్నారు.

పైన వుదాహరించిన సమాజాలేగాక, 1950 లో టాగూర్ కళాసమితిని డి. ఆర్. రాజగోపాల్‌గారు, 1948 లో ఆంధ్ర క్రాంతి థియేటర్‌ను పి. ఆంజ నేయులుగారు, 1950 లో ఆంధ్ర ఆర్టిస్టు్స అసోసియేషన్‌ను పీసపాటి నరసింహ మూర్తిగారు, 1957లో దివ్యకళాకేంద్రాన్ని పి.రమణగారు స్థాపించి పనిచేస్తున్నారు.

**వివిధ నాటక సమాజాలు :**

ఆవేకాక విజయశ్రీ కళామందిర్—నవ్యకళాకేంద్రం— కళాసమితి —-

కల్చరల్ ఆర్టు థియేటర్—రవీంద్ర నాట్యమండలి— వివేకవర్ధని నాట్యమండలి —యువజన నాట్యమండలి—ప్రజావినోద నాట్యమండలి—ఆచార్య ఆర్టుథియే టర్— నేషనల్ ఆర్టు థియేటర్ — హనుమాన్ థియేటర్—జ్యోతిర్మయి నాట్య మండలి—నవోదయ నాట్యమండలి—సాహిత్యవనం—భారతనారి నాట్యమండలి —లలితకళా పరిషత్తు—బాలకళా పరిషత్తు—శ్రీ లక్ష్మీగణపతి నాట్యమండలి —ఆంధ్ర డ్రమెటిక్ కంపెని— హరిప్రసాదరాయ నాట్యమండలి — మునిసిపల్



స్థానం నరసింహారావుగారు (స్త్రీ పాత్ర)

డ్రమెటిక్ ఎంప్లాయీస్ అసోసియేషన్—మాస్టర్ ఆర్టు థియేటర్సు—నవ్య కమల కళామండలి మొదలైన సమాజాలు చారిత్రక. పౌరాణిక. సాంఘిక నాటకాలను ప్రదర్శిస్తున్నాయి.

తెనాలి నాటకరంగంలో ఈ దిగువ వుదాహరించిన నటీనటులు అనేకమంది వెలుగొందారు.

పద్మశ్రీ స్థానం నరసింహారావు, పులిపాటి వేంకటేశ్వర్లు, అబ్బూరి వరప్రసాదరావు, వల్లూరు వేంకటరామయ్య. నెల్లూరి సత్యనారాయణ, టి. రామకృష్ణశాస్త్రి, చంద్రమౌళి సత్యనారాయణ, కాకుమాను నరసింహారావు, చిలు కూరి సుబ్బారావు, యు. వి. సుబ్రహ్మణ్యం, పి. రామమోహన్‌రావు, కె. నర్సయ్య, కె. రాజారావు, ఎ. శ్రీనివాసమూర్తి, వై. బలరామ

శాస్త్రి, కె. వి. అప్పయ్యశాస్త్రి, ఎ. యస్. ఆర్. మూర్తి, బి. రామకృష్ణయ్య, బి. వాలేశ్వరరావు, తంగిరాల శ్రీరామమూర్తి, మల్లాది దేవేంద్రుడు, కస్తూరి నరసింహారావు, అబ్బూరు ఆదినారాయణశర్మ, పాటూరి రామకృష్ణమూర్తి, పోతుకూచి లక్ష్మీ నరసింహమూర్తి, కె. సీతాకుమారి, సినీ ఆర్టిస్టు బారా సత్యవతి, కె. సావిత్రి, రత్నమాల, సుందరి, వి. కోటిరత్నం, జానకీదేవి, నాగుమణి, దాసరి కోటిరత్నం, వేమూరి గగ్గయ్య, సి. యస్. ఆర్. ఆంజనేయులు, వంగర వెంకట సుబ్బయ్య, లక్ష్మీరాజ్యం, ఏ. వి. సుబ్బారావు, వేమూరి రామయ్య, వేమూరి సీతారామశాస్త్రి, పెద్దిభొట్ల చలపతిరావు, శ్రీమతి రాజరత్నం మొదలైనవారు.



సి. యస్. ఆర్. ఆంజనేయులు గారు [రామదాసు]

# నరసరావుపేట

1900 సంవత్సరంలో నరసరావుపేటలో విక్టోరియా మెమోరియల్ థియేట్రికల్ కంపెనీ స్థాపించబడింది. ఈ సమాజంలో బందరు నేషనల్ థియేటర్‌కు సంబంధించిన వంగల ఆంజనేయులుగారు ప్రధాన పాత్రల్ని ధరిస్తూ వుండేవారు. వీరు బొబ్బిలి నాటకంలో వెంగళరావు పాత్రను అద్భుతంగా పోషించేవారు. సుప్రసిద్ధ నటులైన బెల్లంకొండ సుబ్బారావుగారు ఈ సమాజానికి చెందినవారే. సుబ్బారావుగారు శ్రీకృష్ణరాయబారం నాటకంలో శ్రీకృష్ణుని పాత్రను ధరించడంలో ప్రసిద్ధి పొందారు.

తరువాత 1936 సంవత్సరంలో అరవపల్లి సుబ్బారావుగారు, శ్రీరాయల్ థియేటర్స్‌ను స్థాపించి చింతామణి, కన్యకాపరమేశ్వరి మొదలైన నాటకాలను ప్రదర్శించారు. పైన వివరించిన సమాజాలే కాక, 1954 లో సంతగుడిపాడు హైస్కూలు నాటక సమాజం, 1955 లో విజయసారథి నాట్యమండలి, రాష్ట్రీయ సాహిత్య నాట్యమండలి, విజయ ఆర్టుథియేటరు, 1956 లో సర్వోదయ నాటక కళామండలి, కేసరి ఆర్టుథియేటరు, కనకదుర్గా నాట్యమండలి, యువజన నాట్యమండలి మొదలైన నాటక సమాజాలు ఏర్పడి పనిచేస్తున్నాయి.

ఈ సమాజాలలో చోరగుడి దాశరధిరావు, యం. గోపాలరావు, పోలూరి లక్ష్మీకాంతరావు, పి. శ్రీరామమూర్తి, నంద్యాల కోటిరెడ్డి, పిరాట్ల సూర్యనారాయణ, పసారాజు వెంకటరామారావు, దర్శి శేష గిరిరావు, కోట ఆంజనేయులు, అన్నవరపు సుబ్బారావు, జి. చెంచు రామారావు, పి రామకృష్ణయ్య, రాణీపేట లక్ష్మీనారాయణ, కె. శేషగిరిరావు, ఆర్. హనుమయ్య, కె. పట్టాభిరామయ్య, మొలకలూరి కృష్ణమూర్తి, వట్టం రంగయ్య, పృథ్వీ వెంకటేశ్వర్లు, యం. నాగేశ్వరరావు, కె. పురుషోత్తమరావు, యస్.వి.చలపతిరావు,పి. వీరయ్య, పి. హెచ్.నరసింహారావు, యన్.గోవిందరావు,మదారురెడ్డి,కె.వెంకటేశ్వరనాయుడు,డి.రామకోటి,యల్ కాసి ప్రభృత నటవర్గం పనిచేస్తున్నారు.



వంగల ఆంజనేయులుగారు
[నలుదు]

## బాపట్ల

1931 లో శ్రీ హితైషిణి మండలి డ్రమెటిక్ సెక్షన్, 1935 లో భారత నాట్యమండలి, 1945 లో జాతీయ కళామండలి, ఇండియన్ నేషనల్ ధియేటరు, 1946 లో ప్రజా నాట్యమండలి, 1954 లో కళావని, సరస్వతి నాట్యమండలి మొదలైనవి ఏర్పడి పనిచేస్తున్నాయి.

ఈ సమాజాలలో సింగరాజు నాగభూషణం, డాక్టర్ కె. గంగాధరరావు, పి. యల్. నారాయణ, వి. సీతారామారావు, భీమరాజు రామకృష్ణరావు, చెరువు శివరామశాస్త్రి, ఎ. యస్. ఆర్. ఆంజనేయులు, కె. వెంకటరామయ్య, కోన ప్రభాకరరావు, కె. నరసింహారావు, ఎ. రామనాథశాస్త్రి, కె. గోవిందరావు, యం. రామగోపాల్, కె. బాలధనంజయరావు, డాక్టరు యస్. వి. చలపతి రావు, పి. శచీంద్రనాథ్‌తిలక్ యన్. యల్. మురళీధరరావు, జె. జోషి, టి. ప్రకాశరావు, బ్రహ్మాండం సుబ్బారావు, కె. బి. శరభి పి. విద్యాసాగర్, కె. శేషతల్పశాయి, వుదుక్కోట లక్ష్మీనారాయణశర్మ, భోగుల సాంబశివరావు, జి. రామశేషు, యన్. నారాయణప్రసాద్, ధారా వెంకట కృష్ణమూర్తి, టి. నాగేశ్వరరావు, ఎ. నరసింహారావు, శ్రీమతి పాంచాలి, అంజయ్య, దాసరి చంద్రకాంతం, బి. రామకృష్ణరావు, పి. హెచ్. నరసింహ

మూర్తి, వై. సత్యనారాయణశాస్త్రి, కె. యస్. పిన్నా, ఎ. వెంకటేశ్వరరావు, శ్రీమతి సరోజిని మొదలైన నటీనటులు పనిచేస్తున్నారు.

# గురజాల

1903 లో విక్టోరియా మెమోరియల్ ఆనంద సమాజం, 1956 లో విజ్ఞాన సమితి మొదలైన సమాజాలు పనిచేశాయి. ఈ సమాజాలలో జానపాటి ప్రకాశరావు, కె. కృష్ణమూర్తి, పిడుగు సూర్యనారాయణ, బి. రాధాకృష్ణమూర్తి, ఉమా మహేశ్వరరావు, యన్.వి. ఆర్. సాంబశివరావు మొదలైన కళాకారులు పని చేశారు.



సొహ్రాబు- బి. రామకృష్ణరావుగారు,
రుస్తుం- సింగరాజు నాగభూషణరావుగారు

# చీరాల

1945 లో సర్వమిత్ర కళాసమితి, ఆంధ్ర రత్నకళాసమితి, 1953 లో మార్కండేయ కళాసమితి, 1957 లో నటరాజ కళాసమితి, ఐ. యల్. టి. డి. డ్రమెటిక్ అసోసియేషన్, ప్రజా నాట్య మండలి, గౌతమ అమెచ్యూర్సు, నెహ్రూ నాట్యమండలి, వి. యస్. ఆర్. కాలేజి డ్రమెటిక్ అసోసియేషన్, వైకుంఠపుర కళారాధనసమితి, జాతీయ నాట్యమండలి, ఆదర్శ కళాసమితి, అజంతా ఆర్టిస్టుసు ఆదిగాగల అనేక సమాజాలు పనిచేస్తున్నాయి.

ఈ సమాజాలలో చీరాల బాలకృష్ణమూర్తి, కార్యమపూడి కృష్ణమూర్తి, కార్యమపూడి వాసుదేవరావు, అవ్వారి సుబ్రహ్మణ్యం, సి. హెచ్. కామేశ్వరరావు, యం. గోపాలకృష్ణమూర్తి, షేక్ జానిసాహెబ్, డి. ప్రకాశరావు, ఆర్. సత్యనారాయణ, దామెర్ల చంచయ్య, అక్కల సుబ్బారావు, టి. కేశవరావు, సి.హెచ్. చంద్రశేఖరరావు, పి. వెంకటాద్రి, డి. బ్రహ్మానందం, దామెర్ల రామారావు, కె. పెరుమాళ్ళు, వంగర రామలింగేశ్వరరావు, మాచెర్ల వెంకయ్య, పిట్టి వెంక

టాద్రి, గంజి బాపనయ్య, నాయని లక్ష్మీనరసింహారెడ్డి, మానేపల్లి సుబ్బారావు, పి. శేషయ్యనాయుడు, ఆర్. సుబ్బారావు, మెహబూబ్, కె. రామమూర్తి, కె. శేషయ్య, కె. జె. పూర్ణానందం, పి. ప్రభుదాస్, లోకమాన్య, వై. వి. సత్యనారాయణమూర్తి, యన్. కోటేశ్వరరావు, జె. సరోజిని మొదలైనవారు నటీనటులుగా పనిజేస్తున్నారు.

అబ్బరాజు రంగారావు రచయితగాను, భాగవతుల శ్రీరాములు రంగస్థల దర్శకుడుగాను, డి. వీరభద్రుడు పెయింటరుగాను పనిచేస్తున్నారు.

## ఒంగోలు

1952 లో హిమకార్ కళాసమితి, లలితకళాసమితి, 1954 లో మిత్ర కళాసమితి, సి. యస్. ఆర్. శర్మ కళాశాల నాట్యసమితి, జనతా నాట్యమండలి, అజంతా నాట్యమండలి, ఒంగోలు ఎలెక్ట్రికల్ ఎంప్లాయిస్ క్లబ్, యన్. జి. ఓస్ క్లబ్, వేలన్ ఆర్టు థియేటర్సు, నవ్యకళాసమితి, నాగార్జున ఆర్టు థియేటర్ మొదలైన నాటక సమాజాలు పనిజేస్తున్నాయి.

నీలంరాజు శ్రీనివాసరావు, టి. కృత్తివాసతీర్థులు, ధారా రామనాధశాస్త్రి, యం. యల్. నారాయణరావు, అద్దంకి శ్రీహరిరావు, మిరియాల వెంకటేశ్వరరావు, మైనంపాటి రామకోటేశ్వరరావు, మాచెర్ల వెంకటేశ్వర్లు, యం. డి. సాజ్జాన్, యన్. సుబ్బారెడ్డి, భాగవతుల వేణుగోపాలాచార్యులు, పి. అచ్యుత రామశర్మ, యం. వెంకట సుబ్రహ్మణ్యం, కె. మల్లికార్జునరావు, యన్. వి. యస్. శర్మ, యం. రాఘవరావు, డి. శ్రీరాములు, ఎ. శివరామకృష్ణారావు, అక్కరాజు రాధ కృష్ణమూర్తి, యస్. దక్షిణామూర్తి, జి. వరలక్ష్మి, పి. భానుమతి మొదలైన కళాకారులు పనిచేశారు.

## రేపల్లె

1933 లో సీతారామ బాలభారతి నాటకసమాజం, 1942 లో సాయిబాబా నాట్యమండలి, 1950 లో విజయ ఆర్టు థియేటరు, సీతారామ నాట్యకళాసమితి, 1958 లో మహతి కళాసమితి, ఆదర్శ నాట్యమండలి పనిచేస్తున్నాయి.

పంచాంగం వెంకటాచార్యులు, కె. రామకృష్ణరావు, గుడిమెళ్ళ సీతారామాచార్యులు, కంతేటి సుబ్బారావు, పి. హెచ్. కృష్ణమూర్తి, ఎ. ఆంజనేయులు, యన్. పార్వతీశమ్, జి. కృష్ణమూర్తి, బి. హెచ్. వెంకటేశ్వర్లు, మండలి సుబ్రహ్మణ్యం, కుమారి రంగకుమారి, జి. వి. రమణారావు, వై. రాఘవయ్య, జంపని వెంకటప్పయ్య మొదలైన కళాకారులు వెలుగులోకి వచ్చారు.

# వేటపాలెం

1936 లో దుర్గావినోద నాట్యమండలి, 1945 లో నటరాజ నాట్యమండలి, 1950 లో అభ్యుదయ కళాకేంద్రం, 1952 లో లలితకళా సమితి, 1955 లో కళావని, 1957 లో నటరాజ ఆర్టుథియేటరు ఏర్పడి పనిచేస్తున్నాయి.

బండా శ్రీరాములు, ఎ. గోవిందరావు, లొల్ల శ్రీరామమూర్తి, గుంటూరి వెంకటేశ్వర్లు, సి. హెచ్. వి. నర్సయ్య, యన్. మల్లికార్జునరావు, వి. గోపాలకృష్ణ, వి. టి. శేషాచారి, బండ్ల సుబ్రహ్మణ్యకవి, పలగాని వెంకటేశ్వరరెడ్డి, వి. కందస్వామి, డి. చంద్రశేఖరరావు, బి. భీమలింగం, టి. వి. శేషయ్య, పి. యల్. నరసింహారావు, వి. రామమూర్తి, పి. రేణుకయ్య, యు. రామమూర్తి, పి. హెచ్. పటేల్, ఐ. వెంకటేశ్వర్లు, బి. సోమశేఖరమ్, జి. మల్లేశ్వరరావు, బొక్కసం ఆదిశేషయ్య, సెట్టి నాగేశ్వరరావు, బండారు వెంకటేశ్వర్లు, కుమారి యన్. సుశీల, యం. ఇందిర, రాఘవమ్మ, సత్యవతి, లక్ష్మీభారతి మొదలైనవారు పనిచేస్తున్నారు.





# కృష్ణాజిల్లా నాటకరంగం



విజయవాడ-మైలవరం బాలభారతి ఆంధ్ర అర్టు థియేటరు- నేషనల్ అర్టు థియేటరు బందరు: జాబిలి థియేటరు-ముదినేపల్లి ఎక్షిలియర్ థియేటర్-గుడివాడ: రామవిలాస సభ-చల్లపల్లి: ప్రజా నాట్యమండలి

# విజయవాడ

## అల్లా హిందూ థియేటరు :

ధార్వాడ కంపెనీ ప్రభావంతో ఆంధ్రదేశపు ముఖ్య నగరాల్లో నాటక తృష్ణ ఎలా బయలుదేరిందో అలాగే బెజవాడలో కూడా ప్రథమంలో కాశీనాథుని వీర



మల్లయ్య, సుబ్బయ్యనాయుడు, కారుపర్తి నాగలింగం మొదలైనవారు అల్లా హిందూ థియేటరును స్థాపించి సత్య హరిశ్చంద్ర, బొబ్బిలి, తారాశశాంక విజయం మొదలైన నాటకాలను ప్రదర్శిస్తూవుండేవారు. వీర మల్లయ్యగారు వ్రాసిన నాటకాలనుకూడా ప్రముఖంగా ప్రదర్శించేవారు. సుబ్బయ్యనాయుడు హరిశ్చంద్ర వేషాన్ని, నాగలింగం బొబ్బిలిలో రంగారావు పాత్రను ధరిస్తూ వుండేవారు.

## మైలవరం బాలభారతి :

ఆ రోజుల్లో బెజవాడ తాలూకా మైలవరం గ్రామంలో జమీందారైన శ్రీ రాజా సూరానేని వేంకటపాపయారావు బహద్దరు జమీందారుగారు అప్పటికే బాలభారతీ నాటకసమాజమును స్థాపించి విజయవంతంగా నడుపుతున్నారు. కొద్దిరోజుల తరువాత ఆ సమాజాన్ని విజయవాడకు తరలించి నాటక ప్రదర్శనాలను ప్రదర్శించడం ప్రారంభించారు. ఈ సమాజానికి మైలవరం కంపెనీ అని పెద్ద పేరుండేది ఆ రోజుల్లో. మైలవరం కంపెనీ ముందు ఏ కంపెనీ కూడా నిలబడలేకపోయింది.

## రాజేకాదు

## నాటకాలకే రాజు :

రాజాగారు స్థాపించిన మైలవరం బాలభారతి పున్నమినాటి చంద్రుడులా ప్రకాశించింది. అప్పటికే రాజమండ్రిలో కృత్తివెంటి నాగేశ్వరరావు, గున్నేశ్వరరావు

గార్లు కట్టుదిట్టంగా నాటకసమాజాన్ని అన్నిహంగులతోనూ నడుపుతున్నారు. వారి పద్ధతులన్నిటిని రాజాగారు ఆదర్శంగా తీసుకుని వారి కంపెనీలో ప్రవేశపెట్టారు. తెలుగుదేశంలో వున్న అనేకమంది ప్రసిద్ధ నటులందర్నీ రప్పించి వారికి జీతాలు ఏర్పాటుచేశారు. నటులకు నెలజీతాల పద్ధతి ఏర్పాటుచేసిన తరువాత చుట్టుప్రక్కల నున్న సమాజాల్లో వున్న అనేకమంది ఆకర్షింపబడడంతో అనేక సమాజాలు దెబ్బతిన్నాయి.

రాజాగారు వారి నాటకాలకొరకు బ్రహ్మాండమైన హాలు నొకదానిని ఏర్పాటు చేశారు. అందులో ధార్వాడవారి పద్ధతుల ననుసరించి రంగురంగుల తెరలు, వోకపింగులైట్లు, సెట్లు, వివిధ రకాలైన చెమ్కీ దుస్తులు మొదలైన ఆకర్షవంతమైన ఏర్పాటులు చేశారు.



ఉప్పులూరి సంజీవరావుగారు—
సత్యభామ

## పాపట్ల కాంతయ్య

### పార్శీమట్లు :

రాజమండ్రి గున్నేశ్వరరావుగారి కంపెనీలో ప్రసిద్ధ సంగీతదర్శకుడుగా పనిచేస్తున్న పాపట్ల కాంతయ్యగారిని రప్పించి, పార్శీమట్లు ఏర్పాటు చేయించారు. ఈ సమాజంలో ఏ. టి. రామానుజులుగారు హార్మోనియం, బగ్గన్నగారు తబలాను నిర్వహించారు. ఈ సమాజంలో సుప్రసిద్ధ నటులైన యడవల్లి సూర్యనారాయణ దుర్యోధన, సత్యవంతాది నాయక పాత్రలను, బందరు సమాజంనుంచి వచ్చిన ఉప్పులూరి సంజీవరావు సావిత్రి, ద్రౌపది మొదలైన నాయిక పాత్రలను, గూడపాటి నరసింహారావు నాయుడనే 'గురజనాయుడు' భీముడు, యముడు మొదలైన పాత్రలు నిర్వహించేవారు. మైలవరం బాలభారతీ నాటక సమాజ ప్రదర్శనాలంటే ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాలనుండి మూడు రోజులు ముందుగానే టిక్కట్లు రిజర్వు చేసుకునేవారు. ఆనాడు మైలవరంవారి నాటకాలు అంత ప్రసిద్ధి వహించాయి. ఈ సమాజం శకుంతల, పాదుక, ప్రహ్లాద, వేణీసంహారం మొదలైన నాటకాలను కూడ ప్రదర్శించేవారు. ఈ సమాజానికి శ్రీరాముల సచ్చిదానంద శాస్త్రి సావిత్రి నాటకాన్ని, మల్లాది అచ్యుతరామశాస్త్రి ద్రౌపది నాటకాన్ని వ్రాసి

యిచ్చారు. వీరు నాటకాలను వ్రాసి ఇవ్వడమేకాక, నాటకాలకు శిక్షణ కూడా యిచ్చేవారు. వీరితోపాటు వారణాసి సీతారామశాస్త్రి, పాపట్ల కాంతయ్యగారలు కూడ నటులకు నటశిక్షణ యిచ్చేవారు.

## నటనలో రాటుతేలిన

## ఆనాటి నటులు :

ఈ సమాజంలో యడవల్లి, గురజనాయుడు, ఉప్పలూరి సంజీవరావు, పారుపల్లి సుబ్బారావు, దైతా గోపాలం, జొన్నవిత్తుల శేషగిరిరావు, కుంపట్ల సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తి, కపిలవాయి రామనాథశాస్త్రి, నిడుముక్కల సుబ్బారావు మొదలుగా గల ఉద్దండులైన నటులందరూ పనిచేశారు. ఈ విధంగా రాజాగారి బాలభారతీసమాజం విరాజిల్లింది. కాని రానురాను సమిష్టికృషి తక్కువై ధనదాహం ఎక్కువై నాటక సమాజాన్ని వ్యాపార కేంద్రంగా మార్చారు. ఇలాగే కొన్నాళ్ళునడిచి క్రమేపీ క్షీణించి పోయింది. రాజాగారి ఆస్తిఅంతా పోయింది. ఇలా అంతరించి పోయింది బాల భారతీ సమాజం. ఆ తరువాత నటులందరూ ఛిన్నాభిన్నమై పోయి కంట్రాక్టు నాటకాల్లో పాత్రలు ధరించడం ప్రారంభించారు.



యడవల్లి సూర్యనారాయణరావుగారు–
దుష్యంతుడు

## ఆదర్శ కళానిలయం

## ఆంధ్ర ఆర్ట్సు థియేటరు :

1948 సం॥ రం, జూన్ 15వ తేదీన ప్రజా నాట్యమండలిని రద్దుచేసిన అనంతరం జులైలో హనుమంతరాయ గ్రంథాలయ కార్యకర్తలైన కృత్తివెంటి సుబ్బారావు,గెల్లి రాజగోపాలం, గరికిపాటి సుబ్బారావు మొదలైనవారు, గ్రంథాలయ వైజ్ఞానికశాఖనొక దానిని స్థాపించాలనే అభిప్రాయం కలిగి, రాఘవాపురపు అప్పారావు, మాచినేని, మిక్కిలినేని, వై.వి. రాజు, మల్లంపాటి సత్యనారాయణ, కారెపు అప్పలస్వామి మొదలైన కళాకారుల సహకారంతో,

కొప్పరపు సుబ్బారావు అధ్యక్షతను ఆంధ్ర ఆర్టుథియేటరును స్థాపించి నిర్విరామంగా ప్రజానాట్యమండలి ఆశయాలను ప్రచారం చేశారు. ఆనాటి ప్రభుత్వఒత్తిడి ఆర్టు థియేటరుమీద కూడా పడింది. ప్రతి ఆదివారం నాటక, నాటికా కార్యక్రమాలు జరుగుతూ వుండేవి. గురజాడ, వీరేశలింగం మొదలైన సాంఘిక సంస్కర్తల వర్ధంతులు జరుపబడుతూ వుండేవి. ఈ వర్ధంతుల్లో వీరేశలింగం జీవితం మొదలైన బుర్రకథలు చెప్పబడుతూ వుండేవి. జముకులకథ మొదలైన ఇతర ప్రజానాట్యమండలి జానపద కళారూపాలు కూడ ప్రదర్శింపబడుతూ వుండేవి.

## పఠనాలయం,
## నటనాలయం :

ప్రతి ప్రదర్శనంరోజునా గ్రంథాలయ ప్రదర్శనశాలలో ఆంధ్రదేశానికి సంబంధించిన కవులు, కళాకారులు, చిత్రకారులు, సాంఘిక సంస్కర్తల ఫొటోలను ఎగ్జిబిషన్‌గా ప్రదర్శించేవారు. ప్రదర్శనానికివచ్చే ప్రేక్షకులందరూ ఈ ప్రదర్శనాన్ని ఎంతో వుత్సాహంతో తిలకించేవారు. ఆనాడు విజయవాడలోనున్న అనేక ఔత్సాహిక నాటకదళాలకు వుత్సహాన్నిచ్చి మార్గదర్శకంగా నిలబడింది. ఆర్టుథియేటరు నాటకమంటే ప్రేక్షకులు ప్రజా నాట్యమండలి ప్రదర్శనంగానే భావించి అభిమానంతో ఆదరించేవారు.

## ఆర్టు థియేటరులో
## అభ్యుదయ నటులు :

ఆర్టుథియేటరు ఆత్రేయ, అనిసెట్టి, నార్ల వేంకటేశ్వరరావు,సుంకర మొదలైనవారి నాటకాలను, నాటికలను ప్రముఖంగా ప్రదర్శిస్తూ వుండేది. ఈ నాట్యమండలిలో మాచినేని, మిక్కిలినేని, వై. వి. రాజు, మల్లంపాటి సత్యనారాయణ, రాఘవాపురపు అప్పారావు, కారెపు అప్పలస్వామి, బి. గోపాలం, వి. మధుసూదనరావు, రక్తకన్నీరు నాగభూషణం, కర్నాటి లక్ష్మి,యన్. ఉదయలక్ష్మి, నర్సయ్య, రెంటాల, హరినారాయణ, డాక్టరు వీరయ్య, కొప్పరపు సరోజిని, కె. వెంకటేశ్వరరావు, శేషగిరిరావు, వీరమాచనేని సరోజిని, తులశమ్మ, మద్దాలి సుశీల, నాజరు, రామకోటి, తబలా లక్ష్మణరావు, కొడాలి ఆదిశేషయ్య, జగన్నాధం, జి. వి. యస్.

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ ముత్తరాజు సుబ్బారావు



శ్రీ పినిశెట్టి శ్రీరామమూర్తి



శ్రీ నార్ల వెంకటేశ్వరరావు



శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ

# ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ ధర్మవరం కృష్ణమాచార్యులు



శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి



శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి



శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు



శ్రీ కొర్లపాటి గంగాధరరావు



శ్రీ ఆచార్య ఆత్రేయ

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ పానుగంటి లక్ష్మీనరసింహారావు



శ్రీ డి.వి. నరసరాజు



శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు



శ్రీ పాలగుమ్మి పద్మరాజు

శాస్త్రి మొదలైన అనేకమంది కళాకారులు, కళాభిమానులు, ఆర్ట్సుథియేటరు అభి వృద్ధికి పాటుపడ్డారు.

ఆనాడు ఆర్ట్సుథియేటరు నాటకాలమీద కూడ ఆంక్ష విధించబడింది. ప్రతి నాటక రచనా ముందుగా కలెక్టరు పర్మిషన్ లేనిదే ప్రదర్శించ కూడదనే ఒక బిల్లు మద్రాసు అసెంబ్లీలో ప్రవేశ పెట్టబడి ఆర్ట్సుథియేటరు కార్యక్రమాలకు అంతరాయం కలిగించారు.

1948 లో స్థాపించబడిన ఆంధ్ర ఆర్ట్సుథియేటరు. దినదిన ప్రవర్ధమాన మౌతూ, ఈనాటికీ వెలుగొందుతూ వుంది. ఆర్ట్సుథియేటరునుండి చలన చిత్ర పరిశ్రమలో ప్రవేశించిన ఆనిసెట్టి ప్రసిద్ధ సినీ రచయితగా ధృవపడ్డాడు. వీర మాచనేని మధుసూదనరావు దర్శకుడుగా అంతర్జాతీయ ప్రఖ్యాతి కూడా వహించాడు. మిక్కిలినేని, నాగభూషణం ప్రసిద్ధ సినీ నటులుగా వెలుగొందుతున్నారు. తబలా లక్ష్మణరావు చిత్ర పరిశ్రమలో సంగీత దర్శకు లవద్ద వుత్తమ తబలిస్టులుగా గణుతికెక్కాడు. వి. సరోజని రచయిత్రిగాను, ఉదయ లక్ష్మి సిని నటిగాను, రెంటాల ప్రసిద్ధ నాటక రచయితగానూ, అప్పలస్వామి అనేక నాటకాలనూ నాటికలనూ రచియించడమేకాక పీపుల్సు అకాడమీని స్థాపించి ఆంధ్రదేశమంతటా అనేక పరిషత్తుల్లో ప్రదర్శనాలిచ్చి బహుమతుల నందుకున్నాడు. ఆదిశేషయ్య, లక్ష్మి నర్సయ్యలాంటి నటులు ఉత్తమనటులనిపించుకున్నారు.



కపిలవాయి రామనాథశాస్త్రిగారి శ్రీకృష్ణపాత్ర

ఈ విధంగా ఆర్ట్సుథియేటరు ఆనాటినుండి ఈనాటివరకూ ప్రజా నాట్య మండలి ఆశయాలను ముందు పెట్టుకుని హనుమంతరాయ గ్రంథాలయ వైజ్ఞానిక శాఖగా ఈనాటికీ వెలుగొందుతూ వుంది.

## తెలుగు లిటిల్ థియేటరు :

తెలుగు లిటిల్ థియేటర్ స్థాపించి దాదాపు 25 సంవత్సరా లవుతుంది. దీని స్థాపకులు కొప్పరపు సుబ్బారావుగారు. ఈ సంస్థకు అనుబంధ సంస్థలేమీలేవు. లిటిల్ థియేటరు తరపున నాటకరంగానికి సంబంధించిన గొప్ప గ్రంథాలయం ఏర్పడింది. ఇతర దేశాల నాటకాలు, నాటక కళకు సంబంధించిన అనేక శాస్త్రీయ గ్రంథాలు, అనేక ప్రాచీన సంస్కృత నాటకాలు ఈ గ్రంథాలయంలో వుండేవి. నాటక ప్రయోగానికి కావలసిన లైటింగ్ మొదలైన పరికరాలను తెప్పించి, నాటకప్రయోగంలో ఉపయోగించారు. అందుకు రాఘవకళాకేంద్రం అనే నాటక సంస్థను స్థాపించి, ఇనపతెరలు, నాటకం మొదలైన నాటకాలను నూతన ప్రయోగాలతో ప్రదర్శించారు. రామచంద్రకాశ్యప, డి. వి. నరసరాజు, వి. రామన్నపంతులు, వెంపటి రాధాకృష్ణ, కొప్పరపు సరోజని, వి. సరోజని, బి. గోపాలం, మాచినేని, నిర్మల మొదలైన వుత్తమ నటీనటులు రాఘవకళాకేంద్రంలో పనిచేశారు. కొప్పరపు సుబ్బారావుగారు నాటకరంగంలో నూతన ప్రయోగాలకోసరం జీవితాంతం కృషి చేశారు.

## నేషనల్ ఆర్టు థియేటరు :

విజయవాడలో 1947 వ సంవత్సరంలో యన్. టి. రామారావు, యన్. త్రివిక్రమరావు, ఎ. పుండరీకాక్షయ్యగార్ల అధ్వర్యంలో రవిప్రభ అమెచ్యూర్స్ అనే నాటకసంస్థ ప్రారంభించబడి, నందిగామ తాలూకా జయంతిగ్రామంలో ప్రప్రథమంగా వేనరాజు నాటకం ప్రదర్శించారు. ఆ తరువాత కట్టుదిట్టమైన నిర్మాణ సంస్థగా నేషనల్ ఆర్టు థియేటరును రూపొందించారు. ఈ సంస్థకు గొట్టిపాటి వెంకటేశ్వరరావు అధ్యక్షుడుగాను, యన్. త్రివిక్రమరావు కార్యదర్శిగాను నిర్ణయించబడి, యన్. టి. రామారావు, ఎ. పుండరీకాక్షయ్య, పి. యల్. నారాయణ, నాగేశ్వరరావు, సుంకర కనకారావు, కొంగర జగ్గయ్య, జి. మోహనరావు, కె. వి. యస్. శర్మ మొదలైన కార్యవర్గ సభ్యులతో నేషనల్ థియేటరు ఉత్తమ నాటక సంస్థగా వెలుగొందింది.

ఈ సంస్థ కట్టుదిట్టంగా క్రమశిక్షణతో అనేక నాటకాలను, నాటికలను ప్రదర్శించింది. ఆత్మవంచన - చేసినపాపం - శకునపక్షి - మాబావ - దారినపోయే దానయ్య - కరువురోజులు-విప్లవం లేక వేనరాజు - మొదలైనవి చెప్పుకోదగినవి. 1950 వరకూ ఈ సమాజం దేదీప్యమానంగా గడిచింది. తరువాత రామారావుగారు, త్రివిక్రమరావుగారు, ఎ. పుండరీకాక్షయ్యగార్లు సినీరంగ ప్రవేశంతో నేషనల్

థియేటరు కూడా మద్రాసు వెళ్ళిపోయింది. సినీరంగంలోవుండి రాయలసీమ కరువునిధికి నెలరోజులు నాటక, నాటికాప్రదర్శనలు యిచ్చి లక్షరూపాయలు సేకరించింది. తరువాత నేషనల్ ఆర్టు థియేటరు చిత్రనిర్మాణ సంస్థగా రూపొంది, తోడుదొంగలు, పిచ్చిపుల్లయ్య, జయసింహ, పాండురంగమహాత్మ్యం, సీతారామ కల్యాణం, గులేబకావళి, శ్రీకృష్ణపాండవీయం, ఉమ్మడి కుటుంబం, వరకట్నం మొదలైన భారీ చిత్రాలను నిర్మించింది.

నేషనల్ ఆర్టు థియేటరు నాటకసంస్థలో ఎ. బలరాం - పోలేపెద్ది శర్మ - మల్లికాంబ - కమలకుమారి- సినినటి సావిత్రి మొదలైనవారు పని చేశారు.

## అరుణోదయ సంగీత నాట్యమండలి :

మేంకర కనకారావుగారి ఆధ్వర్యంలో అరుణోదయ సంగీత నాట్యమండలి దేదీప్యమానంగా వెలుగొందింది. ఈ నాట్యమండలి అనేకమంది అమెచ్యూర్ నటీనటులకు ఎంతోఉత్సాహాన్నిచ్చింది. సంగీత, నృత్య నాటకశాఖల్లో జయప్రదంగా కార్యక్రమాలునిర్వహించింది. అనేక పరిషత్తుల్లోనూ సభల్లోనూ పాల్గొని అనేక బహుమతులందిన నాటక సంస్థ. అనేకమంది కళాకారులు ఈ సంస్థద్వారా సన్మానించబడ్డారు. జగ్గయ్య-సావిత్రి-వహీదా రెహమాన్- కె. వి. యస్. శర్మ- డి. వేణుగోపాలస్వామి మొదలైన ప్రసిద్ధ సినీనటులు ఈ సమాజంలో పనిచేశారు. ఈ సంస్థ ఆధిపతియైన కనకారావుగారు కళాశీలి, ఉత్సాహవంతులైన యువకుడు. సంగీత నాటక అకాడమీ సభ్యుడు. ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్య నిర్వాహక వర్గ సభ్యుడు.



అద్దంకి శ్రీరామమూర్తిగారు
హరిశ్చంద్రలో—కాటికాపరి

**నవ్యకళామండలి :**

ఈ నాట్యమండలి స్థాపకులు ప్రఖ్య శ్రీరామమూర్తిగారు. 1948 లో స్థాపించబడిన ఈ నాట్యమండలి ఈనాటికీ నడుపబడుతూ వుంది. ఈనాటివరకూ 27 నాటకాలను ప్రదర్శించారు. దాదాపు రెండు వందల ప్రదర్శనాల నిచ్చారు. శ్రీరామమూర్తిగారు నాట్యమండలి స్థాపకులుగానేకాక అనేక నాటకాలను వ్రాశారు వారి రచనలైన 'జనవరి ముప్పయ్' 'కాళరాత్రి' 'దెయ్యం' 'ఫణి' 'మనిషిలో మనిషి' మొదలైన నాటకాలు నవ్యకళామండలి ప్రదర్శించింది.

తరువాత విజయవాడలో పి. సూరిబాబు రాజరాజేశ్వరి నాట్యమండలిని స్థాపించి అనేక పౌరాణిక నాటకాలను ఆంధ్రదేశంలోనేకాక రాష్ట్రేతర ప్రాంతాలైన బొంబాయి, బెంగుళూరు, మైసూరుల్లోనూ విరివిగా ప్రదర్శించారు.

బండా కనకలింగేశ్వరరావు, బి. వి. రంగారావు, వి. శ్రీధర్‌గార్లు నాట్యభారతిని స్థాపించి అనేక పౌరాణికాలను ప్రదర్శించారు.

1954 లో కె. వెంకటేశ్వరరావు అధ్వర్యంలో రసన సమాఖ్య స్థాపించబడి అనేకమంది ఔత్సాహికుల్ని నటుల్నిగా తీర్చిదిద్దింది. ఎన్నో పరిషత్తుల్లో బహుమానాల నందుకుంది. ఎన్నో నూతన సాంఘిక నాటకాలను ఉత్తమంగా ప్రదర్శించి ఆంధ్రదేశంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించింది. దీని పర్యవేక్షకుడైన వెంకటేశ్వరరావు ఉత్తమ నటుడు.

పై సమాజాలేకాక, ఆంధ్ర సిమెంటు కల్చరల్ అసోసియేషన్ - రైల్వే ఇన్‌స్టిట్యూట్ డ్రమెటిక్ క్లబ్ - రాఘవ కళాకేంద్రం - పీపుల్స్ అకాడమి - నటరాజ కళామండలి - కల్పనాథియేటరు - తెలుగు లిటిల్ థియేటర్ - థియేటరు సెంటర్ - జైహింద్ కళాసమితి - బాలభారతి - రవీంద్ర నాట్యమండలి - కృష్ణ విలాస సభ - కళాకౌముది - జాతీయ నాట్యమండలి - విద్యార్థి థియేటరు - సూర్యారావుపేట యువజన నాట్యమండలి - ప్రజా నాట్యమండలి - హనుమాన్ ఆర్ట్సు థియేటర్ - విజయవాడ డ్రమెటిక్ అసోసియేషన్ - ఫ్రండ్స్ అసోసియేషన్- కృష్ణలంక యువజన నాట్యమండలి - ప్రజా నాట్యమండలి- న్యూ ఆంధ్ర మండలి - విద్యాధరపురం యువజన నాట్యమండలి - అరండల్‌పేట రాఘవ ఆర్ట్సు థియేటరు -

కస్తూరిబా నాట్యమండలి - పావని ఆర్టు థియేటరు - రాజకమల్ కళా కేంద్రం - ప్రజా నాటక సమితి - నేతాజి నాట్యమండలి - కనకదుర్గా నాట్యమండలి - కళా సమితి - స్వతంత్ర నాట్యమండలి మొదలైన నాటక సమాజాలు పనిచేశాయి.

**విజయవాడ**

**నటీనటులు :**

క్రాశీనాథుని వీరమల్లయ్య, సుబ్బయ్యనాయుడు, కారుపర్తి నాగలింగం, పాపట్ల కాంతయ్య(హార్మోనీ),బగ్గన్న (తబలా),గురజనాయుడు,అద్దంకి శ్రీరామమూర్తి, బసవరాజు సుబ్బారావు, పుప్పలూరి సంజీవరావు, కుంపట్ల సుబ్బారావు,పి. సూరిబాబు బ్రదర్సు, కొప్పరపు సుబ్బారావు (రచయిత-దర్శకుడు), ముక్తేవి రామానుజాచార్యులు, బుచ్చిరాజు, భేరా జానకిరామయ్య, బొడ్డపాటి రంగారావు, వెంట్రప్రగడ నారాయణరావు, విడుముక్కల సుబ్బారావు, మొలకలూరి గోపాలరావు, జె. యల్. నరసింహారావు, సూరవరపు వెంకటేశ్వర్లు, గుడిపాటి సాంబయ్య, ఈతపళ్ళ సూర్యనారాయణ, సివలంక బసవయ్యశాస్త్రి, మల్లాది సూర్యనారాయణ, మద్దాలి రామచంద్రరావు, కోట సూర్యనారాయణ, కె. శీతారామయ్య, బి. వి. రంగారావు, వాలిశెట్టి కోటేశ్వరరావు, వేమవరపు శ్రీధర్, నండూరిపాటి రామశాస్త్రి, యం. దుర్గాప్రసాద్, జంకి నారాయణ, ఓగిరాల రామచంద్రరావు, (మ్యూజిక్ డైరెక్టరు), ఓగిరాల జానకిరామయ్య, మట్టా అప్పారావు, కె. శేషయ్య, అద్దంకి వెంకటసుబ్బయ్య, సజ్జా రాధా, కాంచనపల్లి సుబ్బారావు, అబ్బూరి కమల,టేకు అనసూయ, సూర్యరత్నకుమారి. కాంచన లత, బెజవాడ రాజరత్నం, పి. వెంకటేశ్వరరావు (హాస్యనటుడు), పుచ్చా పూర్ణానందం - యం. సత్యనారాయణ - వి. రామన్నపంతులు - యం. యస్. మూర్తి - కర్నాటి లక్ష్మినేర్సయ్య- పి. వి. ఆచార్ - జి. యస్. ఆర్. మూర్తి - యం. రాఘవరావు - డాక్టరు వీరయ్య- నారాయణస్వామి - యం. వి. చలపతిరావు - అంకరాజు కృష్ణమూర్తి-పి. హెచ్. శ్రీరాములు-మాస్టర్ కె. హనుమంతరావు-యం. సత్యనారాయణ, బి. యి - యం. దుర్గాప్రసాదరావు-డి. శివరామరాజు - ప్రఖ్య శ్రీరామమూర్తి-కుందేలు కృష్ణశర్మ - కంతేటి కుటుంబరావు-పొందూరి వెంకటేశ్వర్లు-నల్లమంచి అప్పారావు - గోవింద రాజుల కోటేశ్వరరావు- పొన్నాడ కృష్ణమూర్తి - కొప్పరపు సరోజని-కుమారి వి. లక్ష్మి - ఉషాబాల - శ్రీమతి అన్నపూర్ణ - సరసీరుహం - సుశీల.

డి. వి. నరసరాజు - రామచంద్రకాశ్యప - మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి - మాచినేని వెంకటేశ్వరరావు - కొడాలి ఆదిశేషయ్య - శివలెంక బసవయ్యశాస్త్రి - ముక్తేవి రామానుజాచారి - నట్టా గోపాలకృష్ణయ్య - నిడుముక్కల సుబ్బారావు - మొలకలూరి గోపాలరావు - డాక్టరు మధుసూదనరావు - యస్. బుచ్చన్న శాస్త్రి - డాక్టరు వీరభద్రాచార్య - జి. సంజీవరావు - ఉప్పలూరి హనుమంతరావు - సూరపనేని లక్ష్మిపెరుమాళ్ళు - వీరమాచనేని మధుసూదనరావు- మిక్కిలినేని సీతారత్నం-వీరమాచనేని సరోజని- యన్. ఉదయలక్ష్మి-మల్లంపాటి సత్యనారాయణ - చదలవాడ కుటుంబరావు - బొడ్డపాటి రామకృష్ణారావు - బిట్టూరు రామకృష్ణారావు-దేశిరాజు రామారావు- కె. వి. యస్. శర్మ - ఆర్. కోటీశ్వరరావు- నిర్మల-కృష్ణారావు-రక్తకన్నీరు నాగభూషణం-ఋష్యేంద్రమణి - కనకం - తిలకం పి. రాజేశ్వరి-కాకుమాను లక్ష్మినారాయణ - మిక్కిలినేని పరంధామయ్య - మిక్కిలినేని బలరామమూర్తి - అనంతనేని బ్రహ్మానందం - చిరుమామిళ్ళ వెంకటేశ్వర్లు మొదలైనవారు పనిచేశారు.

## బందరు

పవిత్ర సాగరతీరాన వెలసిన బందరు పట్టణం కళాకారులకు ఆటపట్టు. ఇక్కడ ప్రసిద్ధ కళాకారు లెందరో తమ కళావ్యాసంగం సాగించి బందరుకు అద్వితీయమైన ఖ్యాతిని చేకూర్చారు.

### జూబిలి థియేటరు :

1880-82 ప్రాంతాల్లో బందరులో జూబిలి థియేటరును దేవరసు వెంకటసుబ్బారావు - బాలకృష్ణయ్యగార్లు స్థాపించారు. 1884 లో మొగిలిగిద్దల రామానుజరావుగారి యాజమాన్యాన హిందీ నాటకాలాడారు. ఈ సమయంలో నాదెళ్ళ పురుషోత్తమ కవిగారు డైరెక్టరుగా వుండి వారి సమాజానికి ఎంతో చేయూతనిచ్చారు. హిందీ నాటకాల్లో మొగిలిగిద్దల రామానుజరావు, ఈమని లక్ష్మణస్వామి, జోశ్యుల వెంకటశేషయ్య మొదలైనవారు అసమాన నటులుగా ప్రఖ్యాతి వహించారు. లక్ష్మణస్వామిగారు శివాజి పాత్ర ధరించి బిపిన్ చంద్రపాల్ ప్రశంస లందుకున్నారు. ఆ తరువాత 1884 సం॥రంలో దేవరసు వెంకటసుబ్బారావు - తురగా

పురుషోత్తం - రామిని బ్రహ్మయ్య - చివుకుల కృష్ణయ్య మొదలైనవారు హిందూ థియేటరును స్థాపించారు. ఈ సమాజంలో ఇవటూరి నాగభూషణం, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుపంతులు, గండికోట నరసింగరావు మొదలైనవారు ప్రసిద్ధ నటులుగా వెలుగొందారు.

శ్రీమాన్ రంగాచార్యులు, చల్లా రామనాధశాస్త్రి, భేతపూడి ప్రకాశం, లక్ష్మీకాంతం, మాదిరెడ్డి రంగారావు మొదలైనవారు నాటకాలను వ్రాసి దర్శకత్వ బాధ్యతలను వహించారు.

### శారదావిలాస

### నాటక సమాజం :

ద్దాసు నారాయణరావు - దాసు మాధవరావు - ఈమని లక్ష్మణస్వామి - వెంపటి వెంకటేశ్వర్లు-జోశ్యుల శేషయ్య-వడ్డి రామయ్య-పసుమర్తి సుబ్బయ్య-పసుపులేటి సుబ్బారావు - కృత్తివెంటి వెంకటసుబ్బారావు - భాష్యాలనాయుడు మొదలైనవారు ఈ సమాజాన్ని స్థాపించి, ఆంధ్రదేశమంతటా అనేక నాటకాలను ప్రదర్శించారు.

### ఛత్రపూర్ జగన్మోహన థియేటరు :

**1904** లో గొడుగుపేటలో వద్లమన్నాటి నాగభూషణం, భట్టిప్రోలు విజయ రామయ్య, కూనపులి లక్ష్మీనారాయణ, దామరాజు సౌభాగ్యనాయుడు, దామరాజు వీరేశలింగంగార్లు ఛత్రపూర్ జగన్మోహన్ థియేటరును స్థాపించారు. ఈ సమాజంలో కారుపర్తి నాగలింగం, మల్లెల శేషయ్య, నేతి యజ్ఞనారాయణ, మురికిపూడి లక్ష్మీకాంతంగార్లు నటులుగా వెలుగొందారు. ఈ సమాజం ప్రథమంలో వచన నాటకాలను ప్రదర్శించారు. అభినయానికి, నటనకు ప్రాధాన్యం యిచ్చిన తొలినాటక సమాజం యిదే.

### రామమోహన్ థియేటరు :

బందరు సర్కిల్‌పేటలో శ్రీయుతులు తురగా నరసింగరావు, కామరాజు గడ్డ రామచంద్రరావు, వెచ్చా భాష్యకార్లు ఈ సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజంలో గుళజనాయుడు, మాతంశెట్టి కృష్ణారావు, మట్టా సూర్యనారాయణ,

పింగంపెట్టి గోపాలరావు, పాలపర్తి నాగభూషణం, భట్లపెనుమర్తి కృష్ణయ్య, మద్దాలి శేషగిరిరావు, కపిలవాయి సుబ్బారావుగార్లు వివిధ పాత్రలు ధరించారు.

### నేషనల్ థియేటరు :

1880 లో స్థాపించబడిన నేషనల్ థియేటర్‌లో ముంజులూరు కృష్ణారావు, మునిషి చంద్రకళాధరరావు మొదలైనవారు నటులుగా పైకొచ్చారు.

### జగన్మోహినీ మోహన సమాజం :

1904 లో బందరులో జగన్మోహినీ మోహన సమాజం స్థాపించబడింది. ఈ ఈ థియేటర్‌లో ఎక్కువమంది స్త్రీలే వుండేవారు. స్త్రీ పురుష పాత్రల రెంటినీ స్త్రీలే ధరించేవారు. వీరికి బి. టి. రాఘవాచార్యులుగారు శిక్షణ యిచ్చి నాటకాలు ఆడిస్తూ వుండేవారు. ఆంధ్రదేశంలో అనేకమంది పండితుల మన్ననలందుకున్న ఈ సమాజం 1910 లో అంతరించింది.



శ్రీ ముంజులూరి కృష్ణారావుగారు-శర్విలకుడు.

### రాయల్ హిందూ థియేటరు :

రామానాయుడుపేటలో 1906 లో ముంజులూరు కృష్ణారావు, బుర్రా రాఘవాచారి, పింగళి లక్ష్మీకాంతం, పింగళి నరసయ్య, పింగళి వీరయ్య గార్ల చే పైసమాజం స్థాపించబడి అనేక ప్రసిద్ధ నాటకాలను ప్రదర్శించింది.

### భువనరంజనీ థియేటరు :

ఈ థియేటర్‌ను 1906 లో సర్కిల్ పేటలో బందరు నాయుడనే పిప్పళ్ళ రామకృష్ణరావు, పోతరాజు, వెంకటరత్నం, ఘాదిరెడ్డి వీరభద్ర రావుగార్లు స్థాపించారు. అనేక పౌరాణిక నాటకాలను ప్రదర్శించారు. డి. వి. సుబ్బారావు బాల్యంలో ఈ సమాజంలోనే అనేక స్త్రీ పాత్రలు ధరించారు.

**రామానంద థియేటరు :**

గ్గూడుగుపేటలో 1908 లో మాదిరెడ్డి సుబ్బరామయ్య, క్రాపవరపు సూర్యనారాయణ, క్రాపవరపు నరసింహం, దినవహి కృష్ణమూర్తిగార్లు స్థాపించి నాటకాలాడారు.

**బాలభారత సంఘం :**

గ్గూడుగుపేటలో 1908 లో చిట్టూరు నరసింహంపంతులు, తుర్లపాటి నరసింగరావు గార్లు దీనిని స్థాపించారు. ఈ సమాజంలో పారుపల్లి సుబ్బారావు, శ్రీపతి పట్టాభిరామయ్య, అద్దంకి శ్రీరామమూర్తి, భోగరాజు సుబ్బారావు, చిలకలపూడి వెంకటేశ్వరశర్మ, పంచాంగం రామానుజాచార్యులు, పారుపల్లి సత్యనారాయణ, మారుతి సీతారామయ్యగార్లు వివిధ పాత్రలు ధరించి, విశేష ఖ్యాతిని సంపాదించి ప్రధాన నటులై నాటకరంగానికి నూతన అలంకారాన్ని సంతరించిపెట్టారు.

**ఇండియన్ డ్రమెటిక్ కంపెని :**

1909 సంవత్సరంలో నల్లూరి బ్రహ్మానందం, డి. వి. సుబ్బారావు, పింగళి నాగేంద్రరావుగార్లు స్థాపించారు. మద్దిపట్ల సూర్యనారాయణ, గబ్బిట బాలసుందరశాస్త్రి, కందికొండ సత్యనారాయణ, బండారు వెంకటేశ్వరరావు, గుంగు వీరభద్రరావు, వి. వెంకటకృష్ణయ్య, వలివేటి శ్రీమన్నారాయణ, తోట నిరంజనరావు, పరిమి శేషగిరిరావు, కొండా శేషగిరిరావు, అనుమకొండ సుబ్బారావు, కొడాలి కేశవరాయుడు, మల్లాది సూర్యనారాయణ, తోట వెంకటేశ్వరరావు మొదలైన నటులు ప్రఖ్యాతి వహించారు.

జె. సీతారామశాస్త్రి, కురుమద్దాలి సత్యనారాయణ, నటశ్రీ మొదలైనవారు యిప్పటికీ పౌరాణిక నాటకాలను ప్రదర్శిస్తున్నారు.

డి. వి. సుబ్బారావు మృతిజెందిన అనంతరం కె. శివశ్రీ హరిశ్చంద్ర పాత్రను ధరిస్తూ ఆంధ్ర దేశంలో వందలాది ప్రదర్శనాలను యిస్తున్నారు.

డి. వి. సుబ్బారావుగారి కుమారుడు డి. వి. సుబ్రహ్మణ్యం కూడా హరిశ్చంద్ర పాత్రను తండ్రి పోకడలో ప్రదర్శిస్తున్నారు.

**ఔత్సాహిక నాటక సంఘాలు :**

1947 లో ముట్నూరి కృష్ణారావుగారు 'వసంత వని' స్థాపించారు. ఈ సమాజంలో ప్రసిద్ధ రంగస్థల నటి నిర్మల, ఆమె భర్త జి. వి. కృష్ణారావు చాలాకాలం సభ్యులుగా వ్యవహరించారు.



శ్రీ పారుపల్లి సుబ్బారావుగారు రాధ.

తరువాత సనకా గోవిందరావు ఈ సమాజాన్ని చేబట్టి అనేక పరిషత్తులలో పాల్గొని ప్రథమ బహుమతుల్ని అందుకున్నారు. శ్రీమతి వాణీబాల, సి. వేణుబాబు, ఐ. వి. కోనేశ్వరరావు ఈ సమాజంలో ప్రధాన నటులు.

### యల్.ఐ.సి. ఎంప్లాయిస్ ఫైన్ ఆర్ట్సు అసోసియేషన్ :

ఈ సమాజాన్ని ప్రసిద్ధ హాత్రికేయుడు విడియాల చంద్రశేఖరరావు స్థాపించారు.

ప్రతి నెలా రెండు ప్రదర్శనాల చొప్పున ఈ సమాజం ఇప్పటివరకు అసంఖ్యాకంగా ప్రదర్శనాల నిచ్చింది. అనేకమంది కవులను, నటులను, కళాకారులను ఈ సంఘం సన్మానించింది. పరిషత్తుల్లో అనేక బహుమతులను పొందింది. సి. యస్. నారాయణ, రంగారావు, మట్టా కోటేశ్వరరావు, ప్రభల లక్ష్మీనరసింహం, లంక సుందరరామయ్యగారు ప్రధాన నటులుగా వెలుగొందారు.

జనతా ఆర్ట్సు థియేటరును విన్నకోట వెంకటేశ్వరరావు స్థాపించి స్థానికంగా ఎన్నో నాటకాలను ప్రదర్శిస్తున్నారు.

కళా ప్రగతి, కళానికేతన్ మొదలైన సమాజాలు పరిషత్తుల్లో నాటకాలను ప్రదర్శిస్తూ వున్నాయి.



శ్రీ వేమూరి రామారావుగారు
భవాని శంకరుడు.

పైన వుదహరించిన సమాజాలే గాక నేతాజీ నాట్యమండలి - రవి ఆర్ట్సు అమెచ్యూర్స్ - రాఘవ కళాసమితి - ఆంధ్ర ఆర్ట్సు థియేటర్ - గొడుగుపేట - రాజశ్రీ అమెచ్యూర్స్, నవ కళావని - బచ్చుపేట - కృష్ణరాయ నాట్యమండలి - రాబర్ట్సనపేట - నవీన ఆర్ట్సు థియేటర్ - పెడన - సరస్వతి కళాసమితి - యునైటెడ్ ఆర్టిస్ట్సు, నవోదయ నాట్యమండలి - యువజన నాట్యమండలి - బాపూజి నాట్యమండలి, కప్పలదొడ్డి - రాఘవ అమెచ్యూర్స్, ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ మొదలైన సమాజాలు పని జేశాయి.

**నటీనటులు :**

గబ్బిట బాలసుందరశాస్త్రి,వి. ఉదయ భీమరాజు, ముదునూరి శేషగిరిరావు, భావరాజు నరసింహారావు, కందికొండ సత్యనారాయణశాస్త్రి, కుప్పా వెంకటరామశాస్త్రి, నటశ్రీ, విడియాల చంద్రశేఖరరావు, కె. యస్. వి. కోనేశ్వరరావు, సి. యస్. నారాయణ, ననకా గోవిందరావు, తోట నిరంజనరావు, తోట వెంకటేశ్వరరావు, ఇందుపల్లి గోవిందరావు, జొన్నలగడ్డ సీతారామశాస్త్రి, బట్టా పురుషోత్తం, అనుమకొండ వెంకటరామయ్య, తిరువేంకటాచారి, యడవల్లి కనకసుందరరావు, శ్రీమతి వాణీబాల, నిర్మల, ఇందిరాచార్య, ఆర్. వి. కృష్ణారావు, పింగళి వీరయ్య, బుజ్జా రాఘవాచార్యులు, సువర్ణ రామచంద్రరావు, కుండా పిచ్చయ్య, కురుమద్దాలి సత్యనారాయణ, దసిక నాగేశ్వరరావు, కట్టా అచ్చయ్య, శివశ్రీ, యం. కోటేశ్వరరావు, యం. ఆర్. కె. మూర్తి, సి. వాసుబాబు, యల్. సుందర రామయ్య, పి. యల్. నరసింహం, బి. యల్. నారాయణమూర్తి, శ్రీమతి సూర్యరత్నకుమారి, రత్నమాల, లలితకుమారి, కుసుమకుమారి, టి. హయగ్రీవరావు మొదలైన నటీనటులు పని చేశారు.

# గుడివాడ

ఆంధ్ర నాటక కళాపరిషత్తు 1929 లో స్థాపించిన నాటినుండీ గుడివాడ ప్రధాన కార్యాలయంగా వుండి, పనిజేస్తూ వుంది. ముఖ్య కార్యకర్తలైన కాజ వెంకట రామయ్య, ఎజ్జోజు మాధవాచార్యులు, దుక్కిపాటి మధుసూదనరావు, త్రిపురనేని వరప్రసాదరావు, పోలవరపు సూర్యప్రకాశరావు మొదలైనవారు గుడివాడ వాస్తవ్యులైనందువల్ల కళాపరిషత్తు దిగ్విజయంగా నడవడానికి అవకాశం కలిగింది.

1935 లో రామవిలాస సభ, నటరాజ నాగేశ్వర నాట్యమండల, 1942 లో ప్రభాకర నాట్యమండలి, కళాప్రభ, విశ్వ కళాసమితి, నటరాజ నాట్యమండలి, విజయభారతి నాట్యమండలి, జనతా నాట్యమండలి, కోడూరు ఆంధ్రా అమెచ్యూర్సు మొదలైన నాటక సమాజాలు పనిజేశాయి.

జంధ్యాల గౌరినాధశాస్త్రి, పి. సూరిబాబు, ఘంటసాల వెంకటేశ్వరరావు, అక్కినేని నాగేశ్వరరావు, సావిత్రిగణేశ్, పామర్తి సుబ్బారావు, కె. సరసీరుహం,

పి. హేమలత, అద్దుమిల్లి శేషగిరిరావు, డి. వి. రామారావు, డి. వి. యల్ వరసింహం. పెండ్యాల నాగేశ్వరరావు, బి. నారాయణరావు, టి. సూర్యనారాయణ, జె. వెంకటేశ్వరరావు, కె. సుబ్బారావు, ఎ. వి. సుబ్బారావు (జూనియర్), కైకాల సత్యనారాయణ, యం. ఆర్. శర్మ, తిలకం, గిరిజ, పెద వెంకటగిరి, చిన వెంకటగిరి, బి. యస్. సూరి, కోడూరు అచ్చయ్య, నగరాజకుమారి, యన్. యస్. ఆర్. అంజనేయులు, కోమలి, పువ్వుల అనసూయ, టి. తులసి, దాసరి అంజనీబాయి, అరుంధతి, సీత, చింతపల్లి సుబ్బారావు, దుగ్గిరాల శేషగిరి రావు, అంగలూరు కేశవరాయుడు మొదలైన నటీనటులు పని చేశారు.

# పామర్రు

1951 లో ప్రగతి నాట్యమండలి, 1953 రామకృష్ణ థియేటరు. 1954 లలిత కళా సమితి, 1958 లో కర్షక నాట్యమండలి ఏర్పడి పని చేస్తున్నాయి. ఈ సమాజాలలో బి. వెంకటరెడ్డి, కతారు రంగారావు, టి. వెంకటేశ్వరరావు, బండి వెంకటసుబ్బయ్య, కోగంటి దుర్గామల్లికార్జునరావు మొదలైన కళాకారులు పని చేశారు.

## ఎక్సెల్సియర్ థియేటరు, ముదినేపల్లి :

1939 లో ఎక్సెల్సియర్ థియేటరు ముదినేపల్లిలో ఈనాటి ప్రసిద్ధ చిత్రనిర్మాత అన్నపూర్ణ పిక్చర్సు అధినేతయైన శ్రీ దుక్కిపాటి మధుసూదనరావు, కోడూరు అచ్చయ్య మొదలైన కళాభిమానుల ఆధ్వర్యంలో స్థాపించబడింది.

ఆనాడు క్రమశిక్షణతో కట్టుదిట్టంగా నాటకాలను ప్రదర్శించటంలో పేరు పొందిన సమాజమిది. ఈ సమాజంలోనే పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు, సుప్రసిద్ధ సంగీత దర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావు, కోడూరు అచ్చయ్య, అద్దుమిల్లి శేషగిరిరావు, సూరపనేని ప్రభాకరరావు, కోనేరు కుటుంబరావు మొదలైన నటులు వెలుగొందారు. వీరు ప్రదర్శించిన ఆశాజ్యోతి నాటకం వేనోళ్ళ పొగడబడింది.

# చల్లపల్లి

ఆంధ్ర ప్రజా నాట్యమండలి ఏర్పడి అనేక నాటకాలను ప్రదర్శించింది. సిరివిశెట్టి సుబ్బారావు, కోసూరి పున్నయ్య, పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు మొదలైన నటులు పని చేశారు.

# రవి థియేటర్సు రక్తకన్నీరు

ఆంధ్రనాటక రంగంలో రవి ఆర్టుథియేటర్సు రక్తకన్నీరు నాటకం ఒక నూతన శకాన్ని నిర్మించింది. 1956 లో రవి థియేటర్సు స్థాపించబడింది. దీని ప్రధాన కార్యాలయం మద్రాసులోను, ఆయా ప్రాంతాల్లో కార్యక్రమాన్ని నిర్వహించే కార్యాలయం విజయవాడలోనూ వుంది.

రవి ఆర్టు థియేటరు స్థాపకుడు పి. నాగభూషణం. ఈయన ప్రదర్శించిన నాటకాలు రక్త కన్నీరు-పాపం పండింది-బికారి రాముడు-కోతలరాయుడు-కలికాలం మొదలైనవి.

## ప్రేక్షకులను రంజింపచేసిన రక్త కన్నీరు నాటకం :

వీటిలో ఒక్క రక్తకన్నీరు నాటకం చరిత్రాత్మకంగా ప్రసిద్ధి చెందింది. ఈనాటి వరకూ 12 వందలసార్లు ప్రదర్శింప బడింది. అంతేగాక రక్త కన్నీరు నాటకం ఆంధ్రనాటకరంగంలో మరో రికార్డును కూడా సంపాదించింది. ఒకే కేంద్రంలో ప్రతిరోజూ ఒక ప్రదర్శనం చొప్పున వరుసగా కాకినాడలో 15 ప్రదర్శనాలు ప్రదర్శింపబడ్డాయి.

ఆంధ్రనాటకరంగంలో ప్రజా నాట్యమండలి అనేక సుసాంప్రదాయాలను స్థాపించింది. వాటిలో ఒకే రాత్రి రెండు ప్రదర్శనాలివ్వడం ప్రవేశపెట్టింది. ఇదే సంప్రదాయాన్ని అనుసరించి రవి ఆర్టు థియేటరు రక్త కన్నీరు నాటకాన్ని ఒకే రాత్రి రెండు ప్రదర్శనాల చొప్పున మూడు కేంద్రాల్లో ప్రదర్శించింది.

రక్త కన్నీరు నాటకం తమిళ దేశంలో యం. ఆర్. రాధ పర్యవేక్షణలో అఖండవిజయం సంపాదించింది. అలాగే నాగభూషణం ఆధ్వర్యంలో రక్త కన్నీరు నాటకం ఆంధ్రదేశంలో విశేష ప్రశంస అందుకుంది. ఈ నాటకాన్ని పాలగుమ్మి పద్మరాజు తెలుగులోకి అనువదించారు. ఈ నాటకానికి వి. గోపాలం సంగీతాన్ని నిర్వహించారు. నృత్యాలను వెంపటి చినసత్యం నిర్వహించారు. ఈ నాటకంలో ప్రధాన పాత్రల్లో సి. నాగభూషణం, సీత, పెరుమాళ్ళు, రేపల్లె కృష్ణమూర్తి, మోహన్ దాస్, దుర్గారావు, సత్యనారాయణ, పెద్దన్న, సినీనటులు శారద సుజాత మీనాకుమారి రేవతి ఆదోనిలక్ష్మి వాణిశ్రీ మొదలైన వారంతా పేరుపొందారు. ఈ నాటకంలో 30 రంగా లున్నాయి. నాటకం ప్రారంభించి 'అంతమయ్యేవరకు జరజరా జరిగిపోతుంది. ఆంధ్రనాటకరంగంలో రక్త కన్నీరు నాటకం ఒక మైలు రాయిలాంటిది.





# పశ్చిమ గోదావరి జిల్లా నాటకరంగం



ఏలూరు : సీతారామాంజనేయ నాటక సమాజం - పూర్ణిమ నాట్యమండలి - కోరాడ నాట్యభారతి- నర్సాపురం: హిందూ నాటకసమాజం-పాలకొల్లు: ఆదర్శ నాట్యమండలి- తణుకు - తాడేపల్లిగూడెం- కొవ్వూరు మొదలైన నాటకరంగాలు

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ వాసిరెడ్డి భాస్కరరావు



శ్రీ సుంకర సత్యనారాయణ



శ్రీ అనిశెట్టి సుబ్బారావు

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ కొడాలి గోపాలరావు



శ్రీ అబ్బూరు రామకృష్ణారావు



శ్రీ రోహిణి

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ శ్రీనివాస చక్రవర్తి



శ్రీ విడియాల చంద్రశేఖరరావు



శ్రీ పులుగుండ్ల రామకృష్ణయ్య

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ ఆరుద్ర



శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి



శ్రీ గుండిమెడ వెంకటసుబ్బారావు

# ఏలూరు

## మోతేవారి మోతుబరితనం :

**1885-90** సంవత్సరాల ప్రాంతంలో వామనభట్ట జోషీగారు హిందీ నాటకాలను ఏలూరులో ప్రదర్శిస్తూవుండేవారు. ఆనాటికి సంస్కృత



నాటకాలుగాని తెలుగు నాటకాలుగాని ఆంధ్రదేశంలో అంతగా అమలులోకి రాలేదు. ఆనాడు ఏలూరులో బుద్ధిరాజువారు ఒక హాలును నిర్మించిన తరువాత నాటకాలు ప్రదర్శించాలనే ఉత్సాహం కొంతమందిలో కలిగింది. ఏలూరులో జమీందారులైన మోతే నారాయణరావుగారు నాటక కళవల్ల దేశాన్ని. జాతినీ ఎలా ముందుకు తీసుకువెళ్ళవచ్చునో చిన్ననాడే అవగాహన చేసుకున్నారు. ఆయన విదేశ యాత్రలుజేసి ఆ యా దేశాలలో వున్న నాటక కళారీతుల్ని గ్రహించారు. ఏలూరులో సీతారామాంజనేయ నాటక సమాజాన్ని స్థాపించి ఆంధ్రదేశంలో అప్పటికే పేరు ప్రతిష్ఠలు సంపాదించిన అనేకమంది నటీనటుల్ని సమకూర్చి. వారికి వారి వారి స్థాయిల ననుసరించి జీతాలు ఏర్పాటు చేసి. ఏలూరులోనూ. బెజవాడలోనూ నాటకరంగస్థలాలను నిర్మించి ఎంతో కట్టుబాట్లతో ఆదర్శప్రాయంగా నాటకాలను ప్రదర్శించారు. ఎంతోమంది కవుల్ని. చిత్రకారుల్ని. నృత్యకారుల్ని. సంగీత దర్శకులనూ పోషించారు.

## అందరి అభిమానాన్ని పొందిన ఆదర్శ నటులు :

నటుల్లో యడవల్లి సూర్యనారాయణ, ఉప్పులూరి సంజీవరావు, కడియాల రత్తయ్య. ఆరణి సత్యనారాయణ. ఆలమూరి పట్టాభిరామయ్య. కొచ్చెర్లకోట రంగారావు. పంచాంగం వేంకటరామానుజాచార్యులు. కపిలవాయి రామనాథ శాస్త్రి. అద్దంకి శ్రీరామమూర్తి. బుద్ధిరాజు లక్ష్మణరావు. ముంజులూరు కృష్ణారావు. జాగర్లమూడి లక్ష్మీనరసింహారావు. జొన్నవిత్తుల శేషగిరిరావు మొదలైన ప్ర

కొడాలి చంద్రమౌళీశ్వరరావు - దుగ్గిరాల సత్యనారాయణ - నేలగంటి కోటీశ్వర రావు - నంబూరి శ్రీనివాసరావు - మద్దాలి రామచంద్రరావు - ఎ. పూర్ణిమ-కొచ్చెర్ల కోట సత్యనారాయణ - యన్. వి. రంగారావు (సిని) - ఆరణి సత్యనారాయణ (సిని)- పి. హెచ్. నారాయణరావు (సిని) - వి. బాలకృష్ణ (సిని) మొదలైన నటీనటులు పనిచేశారు.

# నర్సాపురం

## హిందూ నాటక సమాజం :

నర్సాపురం నాటకరంగ చరిత్ర ప్రసిద్ధమైంది. 1902 వ సంవత్సరంలో పూనానుండి సాంగ్లీ హిందూ నాటక సమాజం వచ్చి నర్సాపురం కళాకారుల్లో వుత్సాహాన్ని రేకెత్తించింది. ఆర్యానంద హిందూ నాటక సమాజాన్ని బుద్ధిరాజు బ్రహ్మానందం — బొమ్మకంటి కృష్ణమూర్తి — మామిళ్ళపల్లి కేశవాచార్యులు మొదలైనవారు స్థాపించి, పూనావారు నాటకాలు ప్రదర్శించిన పందిరిలోనే హిందీ నాటకాలను ప్రదర్శించారు.

ఈ సమాజ నటులకు బందరు నేషనల్ థియేటరుకు చెందిన సుప్రసిద్ధ నటుడు మొగిలిగిద్దల రామానుజరావుగారు నాట్యశిక్షణ నిచ్చేవారు. వీరికి సహాయంగా జానకిరామయ్య పంతులుగారు పనిచేస్తూ వుండేవారు. ఈ సమాజంలో బొమ్మకంటి కృష్ణమూర్తిగారు నాయకపాత్రలు ధరిస్తూ వుండేవారు. వీరు ప్రదర్శించిన నాటకాలు కందుకూరివారి అభిజ్ఞానశాకుంతలం—హరిశ్చంద్ర—వడ్డాది సుబ్బారాయుడుగారి వేణీసంహారం-అనంతరావుగారి అజ్ఞాతవాసం చెప్పుకోదగినవి. 1905 వ సంవత్సరంలో బొమ్మకంటి కృష్ణమూర్తిగారు తణుకు సమాజంలోనూ — ఆ తరువాత పిఠాపురం సమాజంలోనూ — వెదురుమూడి శేషగిరిరావు గారితో కలిసి పనిచేశారు.

నర్సాపురం నాటకరంగంలో కొన్ని దశాబ్దాలు నాటకరంగం అంతగా అభివృద్ధి పొందలేదు. 1958 లో డాక్టరు పొన్నపల్లి సుబ్రహ్మణ్యంగారు నర్సాపురం నాటకకళా పరిషత్తును స్థాపించి. ప్రతి సంవత్సరమూ నాటక. నాటికల పోటీలను నిర్వహిస్తూ. వుత్తమ ప్రదర్శనానికి 1116 రూపాయలు బహుమతి నిస్తున్నారు.

తేజోమయ విజ్ఞానసమితి — సర్వోదయ నాట్యకళాసమితి — శాంతి శ్రీ నాట్యమండలి — రాజకమల్ కళామండలి — నాట్యప్రభావం మొదలైన నాటక సమాజాలు నడుపబడుతున్నాయి. ఈ సమాజాలలో వేపూరి వరసింహారావు — డాక్టరు పొన్నపల్లి సుబ్రహ్మణ్యం — పోపూరి తారక వెంకటరమణ — పొన్నపల్లి వెంకటేశ్వర్లు — దానం గోపాలకృష్ణ మొదలైన కళాకారులు పనిచేశారు.

# భీమవరం

ఇక్కడ రామకృష్ణ నాట్యమండలి, శారదా ఆర్టు థియేటర్, భవ్యలలిత కళాసమితి, యువజన ప్రజా నాట్యమండలి, వాణీ లలిత కళాసమితి, నవ్యకళా పరిషత్తు, రావు ఆర్టుథియేటర్, నవ్యకళా నికేతన్ మొదలైన అమెచ్యూర్ నాటక సమాజాలు పనిచేస్తున్నాయి.

పాలగుమ్మి పద్మరాజు, కోడూరి నరసింహం, మల్లాది సూర్యనారాయణ, కె. లక్ష్మీనారాయణ మొదలైనవారు నాటక రచయితలుగా వున్నారు. సినీ ఆర్టిస్టు రామకృష్ణ భీమవరానికి చెందిన నటుడే.

## పాలకొల్లు :

పాలకొల్లులో పినిశెట్టి శ్రీరామమూర్తి ఆదర్శ నాట్యమండలిని, మల్లాది సత్యనారాయణ సంస్కార కళాసమితిని స్థాపించి ఆంధ్రదేశమంతటా సాంఘిక నాటకాలైన పల్లెపడుచు, కులంలేనిపిల్ల, పేదపిల్ల, చెల్లాయి, అన్నా చెల్లెలు మొదలైన నాటకాలను విరివిగా ప్రదర్శించారు.

ఇంకా అజాద్ థియేటరు, సరస్వతి నాట్యమండలి, విజయశంకర నాట్యమండలి, సాహిణి, వాహినీథియేటర్సు, జైహింద్ నాట్యమండలి, స్వతంత్రభారతి అమెచ్యూర్సు, రాఘవకళా నిలయం, సాయి నాట్యమండలి, సమతా కళాకేంద్రం, అభ్యుదయ కళాసమితి, సారథి నాట్యమండలి, సర్వోదయ నాట్యమండలి, బాలానంద సంఘం మొదలైన నాటక సమాజాలు పనిచేశాయి.

ఈ సమాజాల్లో ద్రోణంరాజు నరసింహారావు, పినిశెట్టి శ్రీరామమూర్తి, మల్లాది సత్యనారాయణ, రమణాచలం, నల్లా రామమూర్తి, అల్లు రామలింగయ్య,

భమిడిపాటి శ్రీరామమూర్తి, మణ్యం, కోళ్ళసత్యం మొదలైన నటులు పని చేశారు.

**తణుకు :**

జనతా నాట్యమండలి, బృందావన కళాసమితి, శ్రీవత్సకళాసమితి, ఆంధ్రకేసరి కళాసమితి మొదలైన నాటక సమాజాలు పనిచేస్తున్నాయి. ఈ సమాజాలలో జీడిగుంట బుచ్చేశ్వరరావు, పామర్తి వెంకటేశ్వరరావు, ఎ. రాజగోపాలరావు మొదలైన నటులు పనిచేశారు.

దేవరకొండ బాంగంగాధరతిలక్, ఆంధ్ర శేషగిరిరావు, ఆమిజాల నరసింహ మూర్తి, జవ్వాది లక్ష్మయ్యనాయుడు మొదలగు నాటక రచయితలు కూడ ఈ సమాజాలకు దోహదమిస్తున్నారు.

**తాడేపల్లిగూడెం :**

1957 లో లలితకళా సమితి ఏర్పడి పనిచేస్తూ వుంది. మారంపల్లికిజెందిన చిత్త జల్లు పెద వెంకటరత్నం, వైదేహి, ఇందువదన, చిన వెంకటరత్నం, మొదలైన కళాకారిణులు నృత్యవిద్యలో ఆరితేరినవారు.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులు పసల సూర్యచంద్రరావు, సుప్రసిద్ధ స్త్రీ పాత్రధారి బందారు వెంకటేశ్వర్లు, ప్రసిద్ధ సినీనటి పుష్పవల్లి మొదలైన కళాకారులు తాడేపల్లిగూడెంవారే.

**కొవ్వూరు :**

బి. యల్. టి. డి. కంపెని డ్రమెటిక్ అసోసియేషన్, జైహింద్ క్లబ్ పని చేశాయి.

పి. హెచ్. వి. కామేశ్వరరావు, మహిపాల వెంకటరామన్న, యన్. వీరభద్రరావు, ఉప్పల నరసింహమూర్తి మొదలైన నటులు పనిచేశారు.

ప్రసిద్ధ నటి పసుపులేటి కన్నాంబ, ప్రసిద్ధ సినీనటి మాలతి కూడ ఇక్కడి వారే.



# తూర్పు గోదావరి జిల్లా నాటకరంగం



రాజమహేంద్రవరం : మానేపల్లి కంపెని-
కాకినాడ: యంగ్ మెన్స్ హాపీక్లబ్-పెద్దాపురం:
విద్యావినోదినీ నభ - పిఠాపురం, తుని,
రాజోలు, రామచంద్రపురం, అమలాపురం
నాటకరంగాలు

# రాజమహేంద్రవరం

## నవాబు దేవిడీలో నాటకాల కోలాహలం :

**1887** లో రాజమండ్రి ప్రభుత్వ కళాశాల ప్రిన్స్‌పాల్ మాసుదొరగారు. ఆయన పర్యవేక్షణలో విద్యార్థులచేత "మర్చంట్ ఆఫ్ వెనిస్" నాటకాన్ని ప్రదర్శింపచేశారు. పాత్రధారులుగా సత్యరాజు మృత్యుంజయ రావు—పారుపల్లి అచ్యుతరామయ్య—తల్లాప్రగడ సీతారామా రావు—చిలకలపూడి సీతారామయ్య మొదలైనవారు పాల్గొన్నారు. ప్రదర్శనం నవాబు దేవిడీలో జరిగినట్లూ, రాజమండ్రిలో ప్రప్రథమంగా ఇంగ్లీషు నాటకాలు ప్రదర్శించటం అదే మొదలనీ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు వారి స్వీయ చరిత్రలో తెలియచేశారు.



1889 నాటికి అంటే టంగుటూరి ప్రకాశం పంతులు గారు రాజమండ్రి చేరేనాటికే—దాసు మాధవరావు—కందుకూరి వెంకటరత్నం మొదలైనవారు ఆంగ్లంలో షేక్స్పియరు నాటకాలు ఆడేవారని ప్రకాశం పంతులుగారు వారి స్వీయ చరిత్రలో వ్రాశారు.

## ఆంధ్ర నటకేసరి
## టంగుటూరి ప్రకాశం :

రాజమహేంద్రవరంలో ఇమ్మానేని హనుమంతరావు నాయుడు—ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులు—చిలకమర్తి లక్ష్మీనరసింహకవి-వడ్డాది సుబ్బారాయుడు మొదలైన మహామహులు 1885-90 సంవత్సరాల ప్రాంతంలో హిందూ నాటక సమాజాన్ని స్థాపించి క్రమశిక్షణతో నడిపారు. ప్రముఖులైన విద్యావేత్తలందరూ పాత్రలు ధరించారు. ఈ సమాజంవారు తెరలు, దుస్తులు మొదలైన ఆలంకారాలకంటే అభినయానికే ఎక్కువ ప్రాధాన్యాన్ని ఇస్తూ వుండేవారు. వడ్డాది సుబ్బారాయుడుగారు—వేణీ సంహారనాటకంలో **అశ్వత్థామ**పాత్రను

అద్భుతంగా పోషించేవారట టంగుటూరి ప్రకాశం పంతులుగారు స్త్రీ పురుష పాత్రలు ధరించడంలో అపమానుడని పేరు తెచ్చుకున్నారు.

## నాటకకళకే అంకితమైన

## నాగేశ్వరరావు - గున్నేశ్వరరావు :

ఆ తరువాత యస్. గున్నేశ్వరరావు - కృత్తివెంటి నాగేశ్వరరావుగార్ల యాజమాన్యంలో ఒక పెద్ద సమాజం స్థాపించబడింది. కృష్ణా గోదావరిజిల్లాలో సమర్థులైన నటులందరూ ఈసమాజంలోకి ఆకర్షింపబడ్డారు. ఈ సమాజం వారు నాటకాలను వుత్తమంగా ప్రదర్శించడమే గాక వారి సమాజాన్ని చక్కని శిక్షణాలయంగా తయారు చేశారు. గున్నేశ్వరరావుగారు నాటకాలను వ్యాపార సరళిలోకి దించారు. నటులకు, సాంకేతిక నిపుణులకు జీతాల నిచ్చేవారు. గున్నేశ్వరరావు-నాగేశ్వరరావుగార్లు వారికున్న యావదాస్తినీ నాటక కళకే వినియోగించారు. వీరు ప్రదర్శించిన నాటకాలన్నీ జనరంజకాలు. మంచి మంచి పార్శీమట్లుతో పాటలూ, పద్యాలతో నాటకాన్ని చక్కగా తయారుచేసేవారు. వీరి నాటకానికి పాటలు వ్రాసే



ముప్పిడి జగ్గరాజుగారు స్త్రీ పాత్ర

బాధ్యత పాపట్ల కాంతయ్యగారు నిర్వహించేవారు. కాంతయ్యగారు వస్తుతః సంగీత విద్వాంసులు. అవసరమైనప్పుడు హార్మోనియం వాయిస్తూండేవారు. వీరు ఎక్కువకాలం హైదరాబాదు సంస్థానంలో వున్నారు. వీరి స్వగ్రామం కృష్ణాజిల్లా జగ్గయ్యపేట. వీరు ఆనాడు ఏర్పాటుచేసిన కీర్తన మట్టులు ఈనాటికీ అమలులో వున్నాయి. వారి పాటలు ఆనాడు అశేష ప్రజానీకాన్ని ఆకర్షించాయి.

## ప్రతిభావంతుడు పార్శీ రాము :

అంతేగాక చిత్ర విచిత్రమైన మంచితెరలూ, చెమ్కీకోట్లతో కనులపండువుగా ప్రదర్శనాన్నిచ్చేవారు. ఈ బాధ్యత అన్నిటినీ నిర్వహించటానికి పార్శీ



భీముడు - శ్రీ దొమ్మేటి సూర్యనారాయణ

యువకుడైన ఏ. యస్. రామును తీసుకు వచ్చారు. సమాజం ప్రదర్శించే ప్రతి నాటకానికీ కావలసిన తెరలను, దుస్తులనూ ఈయనతో తయారుచేయించేవారు, వీరి నాటకాల్లో నృత్య ప్రదర్శనాలుండేవి. ఏ దర్బారు సీన్ అయితే 30 మంది పరివారం హాజరయ్యేవాళ్లు. కన్నుమూసి కన్ను తెరిచేలోగా సీన్లు మారిపోయేవి. సకాలానికి నాటకం ప్రారంభించబడి సాగిపోయేది. ఏ ఒక్క నటుడూ సంభాషణలు తడుముకోవడంగాని, పోర్షనురాక నిలబడడంగాని జరిగేది కాదు. మధ్య మధ్య విరామ సమయాల్లో ఏ. యస్. రాముగారు ఫార్సులుచేస్తూ, ప్రేక్షకులను ఆనందింప జేసేవారు. ప్రదర్శనాకాలంలో ఏ విధమైన అల్లరి బయలుదేరినా గున్నేశ్వరరావుగారు వచ్చేసరికి నిశ్శబ్దమైపోయేది. ఇలా గున్నేశ్వరరావు, నాగేశ్వరరావు గార్లు ఆదర్శంగా నాటక సమాజాన్ని గడిపారు.

## కృత్తివెంటివారి

## కొత్త నాటక సమాజం :

కొంతకాలానికి వీరిరువురికి భేదాభిప్రాయాలువచ్చి నాగేశ్వరరావుగారు స్వంత నాటక సమాజాన్ని ఏర్పాటుచేసి ఆంధ్రదేశమంతటా నాటకాలను ప్రదర్శించారు.

వీరి సమాజం ఎంతో కట్టుదిట్టంగానడిచేది. సమాజ సభ్యులంధరూ సమాజం ఏర్పాటుచేసిన హాస్టల్‌లోనే వుండేవారు. నటులు ప్రతిరోజూ వుదయం 5 గంటలకు స్వరసాధన చేసేవారు. పాత్రధారులు వారివారి పోర్షన్సు చదువుతూ ఉచ్చారణనూ, హావభావాలనూ సాధకం చేసేవారు. నాగేశ్వరరావుగారు సమాజ సభ్యులందరినీ కన్నబిడ్డలుగా చూచుకొనేవారు. ఈ విధంగా వారి సమాజం 12 సంవత్సరాలు అవిచ్ఛిన్నంగా నడిచింది. దాదాపు 150 మంది నటులు తయారయ్యారు. డజనుమంది హార్మోనిష్టులుగా తయారయ్యారు. ఆయన అనేక ఔత్సాహిక నాటక సమాజాలకు ఆదర్శప్రాయులయ్యారు. రంగూను, నైజాము మొదలైన

ప్రాంతాల్లో కూడా నాటకాలు ప్రదర్శించి అనేకమంది సంస్థానాధిపతులతో సత్కారాలు పొందారు.

## మానేపల్లి కంపెనీ :

1898 ప్రాంతాల్లో మానేపల్లి వాస్తవ్యులైన ధరణీప్రగడ సూరయ్యగారు, నేషనల్ థియేటర్ నాటక సమాజాన్ని స్థాపించారు. వారి వూరు పేరునుబట్టి వారి కంపెనీగా స్థిరపడిపోయింది. నేషనల్ థియేటరు పేరుమీద ఇన్నీసుపేటలో ఒక థియేటరును కట్టారు. ప్రథమంగా వృత్తినాటక సమాజంగా వర్ధిలిన నాటక సమాజం ఇదేనని ప్రతీతి. ఈ సమాజంలో అంబడిపూడి కోటయ్య, ముప్పిడి జగ్గరాజు ప్రసిద్ధనటులుగా వెలుగొందారు. నాయక పాత్రధారణలో అంబడిపూటి కోటయ్యగారు అందెవేసినచేయి.స్ఫురద్రూపి. కంచు కంఠం పాటలో, నటనలో మేటి.

నాయకి పాత్రధారణలో ముప్పిడి జగ్గరాజుగారు ఆనాడు అనన్యమైన పేరు ప్రఖ్యాతుల్ని సంపాదించుకొన్నారు. ఆయన స్త్రీ పాత్రధారణలో ప్రేక్షకులను ముగ్ధుల్ని చేసేవారట. అభినయంలో, నడకలో, వయ్యారంలో, ఒడుపులో, ఒద్దికలో, స్త్రీయే ఈ పాత్ర ధరిస్తున్నదా అనేటంతటి భ్రమలో ముంచేవారట. దాదాపు ఈ సమాజం వీ రిరువురి అండదండలతో 1911-12 ప్రాంతంవరకూ జేగీయమానంగా నడిచింది.

శ్రీపాద కామేశ్వరరావుగారు 'ఎమెచ్యూర్స్' అనే నాటక సమాజాన్ని స్థాపించి నటులకు శిక్షణయిచ్చి నాటకాలను ప్రదర్శించేవారు. వీరి సమాజంలో ప్రముఖనటుడుగా పేరు సంపాదించినవారు అంకరాజు రామారావుగారు. వీరు నాయకపాత్రలను, ఏలూరుపాటి వెంకటరత్నంగారు నాయికపాత్రలను ధరించేవారు.

రాజమండ్రి నాటకరంగంలో బ్రహ్మజోస్యుల సుబ్బారావు, అంకరాజు శంకర్రావు, వెల్లంకి వెంకటేశ్వర్లు మొదలైనవారు ప్రసిద్ధనటులుగా వెలుగొందారు.

1950 సంవత్సరంలో లలితకళా నికేతన్ స్థాపించబడి ప్రతి సంవత్సరమూ నాటక, నాటికల పోటీలు జరిపి ఔత్సాహికనాటక సమాజాలకు ప్రోత్సాహాన్నివ్వడమే కాక అనేకమంది కళాకారులను సన్మానిస్తూ వుంది.

1950 లో రాఘవ కళాసమితి స్థాపించబడి అనేక సాంఘిక నాటకాలను

ప్రదర్శించారు. ఈ సమాజం ఆంధ్ర నాటక కళా పరిషత్తు సభలలోనూ, అనేక పరిషత్తులలోనూ ఎన్నో బహుమానాలను సంపాదించింది. ఈ సమాజాన్ని డాక్టరు జి. రాజారావు, యాసంరెడ్డి వెంకటరావుగార్లు అమోఘంగా నడిపారు.



శ్రీ బ్రహ్మజోస్యుల సుబ్బారావుగారు హరిశ్చంద్రలో - కాటికాపరి

వి. యస్. రావుగారు 1955 లో వెంకటేశ్వర మెమోరియల్ క్లబ్ స్థాపించి సాంఘిక నాటకాలను ప్రదర్శించారు.

శ్రీ మేడూరి వెంకన్నగారు 1957 లో యం. వి. థియేటర్సును స్థాపించారు.

ఇండియన్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ నాటక సమాజంలో అందరూ రైల్వే ఉద్యోగులు. వీరనేకమైన స్టేజి నాటకాలను ప్రదర్శించారు.

1954 లో ఉపాధ్యాయ మిత్రబృందం అనే నాటకసమాజాన్ని మారిశెట్టి నాగేశ్వరరావు - కలిదిండి నరసింహారావు మొదలైనవారు స్థాపించారు.

1958 లో ఆంధ్ర థియేటర్సు పెడరేషన్‌ను కొప్పరపు సుబ్బారావు - డాక్టరు రాజారావు - వేమల జగన్నాధరావు మొదలైనవారు స్థాపించి విజయవాడలోనూ, రాజమండ్రిలోనూ నాటక పాఠశాలలను నడిపారు.

పైన వివరించినవే కాక రాజమండ్రిలో వీర వెంకన్న ఆర్టు థియేటరు—విశ్వకళాసమితి—ప్రజా నాట్యమండలి—రామలక్ష్మణ ఆర్టు థియేటర్—కె. బి. నాట్యమండలి—వీరేశలింగం ఆర్టు థియేటర్ — జయలలిత కళాసమితి — నవజీవన సమితి—పోస్టు అండ్ టెలిగ్రాఫ్ డ్రమెటిక్ అసోసియేషను—శ్రీ అభ్యుదయ నాట్యకళాసమితి—హరకుసుమ థియేటర్ మొదలైన ఔత్సాహిక నాటకసమాజాలు చురుకుగా పనిచేశాయి.

## నటీనటులు :

అంకరాజు శంకరరావు—డాక్టరు జి. రాజారావు—నిడసనమెట్ల కొండలరావు-ఓలేటి నారాయణమూర్తి—ద్రోణంరాజు చినకామేశ్వరరావు-మోతిళ్ళమల్లికార్జునరావు — వి. ఆర్. శ్రీపతి—కాపుగంటి రమణరావు — శ్రీపాద పట్టాభి

రామారావు—వేములూరు నాగేంద్రం—పడాల రామారావు—వై. శేషగిరిరావు—ఆర్. వెంకటరావు—యన్. వెంకటేశ్వరరావు — కె. వీరరాజు — యం. డి. అబ్దుల్లా—సప్పా రామారావు — కొంపెల్ల పేరయ్యాసోమయాజి — భమిడిపాటి భీమయ్య—కుమారి లక్ష్మి—శ్రీమతి శాంత — నెల్లూరు నాగమణి—పువ్వాడ నరసింహమూర్తి—యం.వి.యన్. చారి—శేషుకుమారి—అమర్‌నాథ్—శంకర మంచి జానకి —బాబ్జీ — యన్. ఎ. కాంచన — చంద్రశేఖరం మొదలైన కళాకారులు రాజమండ్రి నాటకరంగంలో వెలుగొందారు.

### ఆంధ్ర థియేటర్సు ఫెడరేషన్ :

ఈ థియేటర్ ఫెడరేషన్‌కు పూర్వచరిత్ర ఏమీ లేదు. 1952 వ సంవత్సరంలో కొప్పరపు సుబ్బారావు, డాక్టరు రాజారావు, వేదుల జగన్నాధరావు మొదలైన వారంతా కలిసి ఆంధ్రదేశంలోవున్న నాటక సమాజాల నన్నిటినీ ఒక సమాఖ్యగా ఏర్పాటుచేసి వాటి అభివృద్ధికి పాటుపడాలని స్థాపించారు. రాజమండ్రిలో దీని ప్రధమ మహాసభ జరిగింది. బలరాజ్ సహానీలాంటి ప్రసిద్ధ నటుడు ఈ సభకు హాజరై గంభీరోపన్యాసా న్నిచ్చారు. నూరు నాటక దళాలు ,ఈ సమాఖ్యకు అనుబంధ శాఖలుగా చేరాయి. థియేటర్సు ఫెడరేషన్ తరపున విజయవాడలోనూ, రాజమండ్రిలోనూ నాటక పాఠశాలలు నడుపబడ్డాయి. నాట్యకళకు సంబంధించిన అనేక విషయాలమీద క్లాసులు నడుపబడ్డాయి. అనేకమంది కళాకారులు ఈ క్యాంపుల్లో ప్రాథమిక విషయాలమీద పరిజ్ఞానాన్ని సంపాదించారు.

# కాకినాడ

### కాకలుతీరిన కాకినాడ కళాకారులు :

కాకినాడ నాటకరంగాన్ని ప్రారంభించిన వారిలో ముఖ్యులు సింగీతం అబ్బాయి గారనే వెంకట్రావుగారు. అంతకుముందు జగన్నాధపురంలో పులవర్తి వెంకయ్య మొదలైనవారు ప్రయత్నాలు చేశారు గాని ముందుకు రాలేదు. ప్రజ్ఞావంతులైన సింగీతం అబ్బాయిగారికి, వెదురుమూడి శేషగిరిరావు—జయంతి భావనారాయణ

కవి—ఉప్పు చిదానందరావు—పంద్రవాడ కేశవరావు—తుర్లపాటి సుబ్బయ్య—దూబరాజు రెడ్డిపంతులు—దినవహి కృష్ణమూర్తి—పత్రి రామచంద్రరావు—ముష్టి నాగన్న—మంగిపూడి పేరయ్యశాస్త్రి—దేవరకొండ కృష్ణమూర్తి—బారు వెంకట రమణయ్య—పత్రి శేషగిరిరావు—మొసలికంటి బాయన్నపంతులు—జోడుగంటి కృష్ణారావు—కుందూరి మూర్తిరాజు-దోమలకొండ సోమేశ్వరరావు—కొటికలపూడి వెంకటరామయ్య—నండూరి మూర్తిరాజు—వల్లూరి జగన్నాధరావు—ముప్పిడి జగ్గరాజు మొదలైన ఉద్దండులైన నటులెంతోమంది వుండేవారు. పైన వుదాహరించిన వారందరూ విద్యావంతులు. రంగస్థలంమీద ప్రతి ఒక్కరూ ప్రేక్షకుల ఆదరాభిమానాలను చూరగొన్నవారే. వీరిలో ముఖ్యంగా అందరిచేతనూ ప్రశంసించబడ్డ నటుడు వెదురుమూడి శేషగిరి రావుగారు. శేషగిరిరావుగారు నటులేగాక రచయిత కూడా. సుభద్రాపరిణం, కన్యకావిజయం, సుయోధన ఘోషయాత్ర మొదలైన తెలుగు నాటకాలనూ-శివాజీ చరిత్ర, పీష్వా నారాయణరావు వధ మొదలైన హిందీ నాటకాలను కూడా రచియించారు.

## ఎందరికో వెలుగునిచ్చిన యంగ్‌మెన్స్ హాపీక్లబ్ :

1916 వ సం॥రంలో యంగ్‌మెన్స్ హాపీక్లబ్ ఏర్పడింది. ఈ సమాజంలో ఏలూరుపాటి వెంకటరత్నం—పామర్తి బుచ్చిరాజు—దేవినేని జగన్నాయకులు వుండేవారు. వీరు కాళ్ళకూరి నారాయణరావుగారి 'చింతామణి' నాటకాన్ని కడు సమర్థనీయంగా ప్రదర్శించేవారు. ఈ విధంగా కాకినాడ నాటకరంగం ఎంతో అభివృద్ధి చెందింది. ఈ అభివృద్ధికంతకూ కారకులైనవారు పింగితం సుబ్బారావు—పులవర్తి వెంకయ్య—జయంతి భావనారాయణ—మంగిపూడి పేరయ్యశాస్త్రి-మొసలికంటి బాయన్న—నండూరి మూర్తిరాజు—బారు వెంకటరమణయ్య మొదలైనవారు.

1916 లో స్థాపించబడిన యంగ్‌మెన్స్ హాపీక్లబ్ ఈనాటికీ పనిచేస్తూనే వుంది. ఈ సమాజంనుండి సుప్రసిద్ధ హాస్య సినీనటులు రేలంగి వెంకటరామయ్య, సినీ నటి శ్రీమతి అంజలీదేవి ఉద్భవించారు. ఈ సమాజ వికాసానికి తోడ్పడిన

వారిలో ముఖ్యులు డి. జగన్నాయకులుగారు. ఈనాడు ఈ క్లబ్‌కు దంటు భాస్కర రావుగారు ప్రెసిడెంటుగను, కార్యదర్శిగా ఎ. వి. సుబ్బారావుగార్లు పని చేస్తున్నారు.

1918 లో ఆంధ్రసేవా సంఘాన్ని పల్లా వెంకట హనుమంతరావు-చిత్త జల్లు రామారావు-నిష్టల నారాయణ మొదలైనవారు స్థాపించి, పౌరాణిక నాటకాలను, చారిత్రక నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజంలోనే కీ॥ శే॥ కిళాంబి కృష్ణమాచార్యులుగారు పనిజేశారు.

పై సమాజాలేగాక 1954 లో కళాప్రపూర్ణ రాఘవకళా సమితి - రసన సమాఖ్య-మార్కండేయ విలాస సభ-లలిత కళా పరిషత్-కళా భారతి - విజయశ్రీ ఆర్టు థియేటర్సు - సరస్వతి నాట్య నికేతన్ - యువజన నాట్యమండలి - నటరాజ నాట్యమండలి-కళా సమితి మొదలైన సమాజాలు నడుపబడుతున్నాయి.

### నటీనటులు :

కాకినాడ నాటకరంగంలో గండికోట జోగినాథం - డి. జగన్నాయకులు - కొవ్వాడ సూర్యనారాయణ - భద్రిరాజు భాస్కరరాజు - పసుమర్తి పార్వతీశం - సామిన రంగారావు - యం. నాగభూషణం - శ్రీమతి కొటారి శకుంతల-కొటారి అలివేణి-యన్. రాఘవకుమారి - రజనీకాంతం - కామేశ్వరి - పిళ్ళారిసెట్టి సూర్యారావు-శ్రీమతి తాయారు పంకజం-యం. వి. రమణమూర్తి-ఎ. వి. రమణమూర్తి-యన్. పి. లక్ష్మణస్వామి-కె. వీరరాఘవస్వామి-వి. రామరాజు - శ్రీమతి డి. లక్ష్మి-తేతలి సూర్యకుమారి - పట్నాల సన్యాసిరావు - పెండ్యాల సుబ్బారావు-శ్రీమతి వి. సరోజని-కుమారి రాజ్యం-శ్రీమతి అంజమ్మ- శ్రీ సాంబు-ఎ. వి. సుబ్బారావు-సి. యస్. రావు, సినీ డైరెక్టరు-కస్తూరి శివరావు - లంకసత్యం - హర్‌నాథ్-అడ్డాల నారాయణరావు-బేబి మల్లిక-శ్రీమతి సూర్యకాంతం (సిని నటి) మొదలైన ప్రసిద్ధ నటీనటులు వెలుగొందారు.

# పిఠాపురం

### కోటలో నాటకాలు :

1900-1906 సంవత్సరాలలో శ్రీ రాజా రావుసూర్యారావుగారు, కోలంక వీర

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ కణ్వశ్రీ



శ్రీ గొల్లపూడి మారుతీరావు



శ్రీ బి. రామరాజు
(జానపద వాఙ్మయ రచయిత)



శ్రీ బిందాన నారాయణరావు
(జంషెడ్పూర్)

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ పింగళి నాగేంద్రరావు



శ్రీ గురజాడ అప్పారావు



శ్రీ కోలాచలం శ్రీనివాసరావు



శ్రీ వడ్డాది సుబ్బరాయకవి

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ యన్.ఆర్. నంది



శ్రీ కారెపు అప్పలస్వామి



శ్రీ కొప్పరపు సుబ్బారావు



శ్రీ యస్వీ జోగారావు
(యక్షగాన వాఙ్మయ రచయిత)

## ప్రసిద్ధ నాటక రచయితలు



శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం



శ్రీ కొండముది గోపాలరాయశర్మ



శ్రీ రావూరు సత్యనారాయణ



శ్రీ కాటూరు వెంకటేశ్వరరావు

వరం ఎస్టేట్ల జమీందారిణి శ్రీ రావు చెల్లాయమ్మరావుగారు ఒక నాటక సమాజాన్ని స్థాపించి, వారి కోటలో ఒక నాటకశాలను కూడా నిర్మించారు. దీన్ని సత్యనారాయణ కంపెని అని పిలిచేవారని శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ అనుభవాలూ, జ్ఞాపకాలు అన్న గ్రంథంలో వివరించారు. ఈ సమాజానికి పానుగంటి వారు అనేక నాటకాలను వ్రాశారు. వెదురుమూడి శేషగిరిరావు, దేవరకొండ కృష్ణమూర్తి నాయికా నాయక పాత్రలు ధరించేవారు. ఆలమూరి పట్టాభిరామయ్య, కలగాని రామయ్య ప్రసిద్ధ నటులుగా ఈ సమాజంలో పేరు తెచ్చుకున్నారు. చెలికాని వెంకట సూర్యారావు, అకుండి వెంకటరత్నం ఈ సమాజాభివృద్ధికి ఎంతగానో పాటుబడ్డారు. ఈ సమాజం వారు రాజమండ్రి, పెద్దాపురం, కాకినాడ, సామర్లకోట మొదలైన ప్రాంతాల్లోనేగాక, నైజాం ప్రాంతంలోనూ, ఇతర సర్కారు జిల్లాలలోనూ నాటక ప్రదర్శనాలనిచ్చారు.


ఆలమూరి పట్టాభిరామయ్యగారు—మైత్రేయుడు

ఈనాటికీ పిఠాపురంలో అనేక నాటక సమాజాలు పనిచేస్తూనే వున్నాయి. 1952 లో గణేశ నాట్యమండలి, 1948 లో పీఠికాపుర కళాసమితి, 1955 లో సాయిబాబా నాట్యమండలి, 1936 లో నవకళా సమితి, నవోదయ కళాసమితి, భారతీయ సంఘం, 1948 లో స్వతంత్ర నాట్యమండలి, ఆంధ్రప్రజా నాట్యమండలి, ఆంధ్ర సేవా నాట్యమండలి మొదలైన సమాజాలుఏర్పడి పనిచేశాయి.

## సామర్లకోట

1944 లో దక్కన్ సుగర్‌ఫ్యాక్టరీ ఎంప్లాయీస్ డ్రమెటిక్ అసోసియేషన్, 1945 లో జానకి కళాథియేటర్, 1955 లో ఆంధ్రనాటక కళాసమితి, 1955 లో

హిస్ట్రియానిక్స్, ఆంధ్ర అమెచ్యూర్స్, భారత నాటక కళాసమితి మొదలైన నాటక సమాజాలు పనిచేశాయి.

ఈ సమాజాలలో చాగంటి సన్యాసిరాజు, సమయం వీర్రాజు, జి. వెంకట రమణ, నల్లమాటి గోపాలకృష్ణ, కూర్మా వెంకటరావు, యన్. వీర్రాజు, కూనిసెట్టి అప్పారావు, కుందం వీర్రాజు, షేక్‌పకీర్‌షా, మోహన్‌బాబు, దర్బా రమేష్, జి. యస్. రావు, తాడి రత్నావళి మొదలైన నటీనటులు పనిచేశారు.

# పెద్దాపురం

## విద్యావినోదినీ సభ :

ఆంధ్రనాటరంగ తొలిదశలో పెద్దాపురంలో విద్యావినోదినీ సభ స్థాపించబడి, ఎంతోమంది ప్రసిద్ధులైన విద్యావంతుల నాకర్షించి, ప్రతాపరుద్రీయంలాంటి వుత్తమ నాటకాలను ప్రదర్శించింది. ప్రతాపరుద్రీయ నాటకంలో కల్లూరు సుందర రామయ్య పంతులుగారు యుగంధర పాత్రను అద్భుతంగా పోషించి ప్రేక్షకుల మన్ననలనందుకున్నారు.

1938 లో పెద్దాపురంలో భారత అమెచ్యూర్సు స్థాపించబడి నాటక కళా పరిషత్తులలో నాటకాలను ప్రదర్శించింది. ఈ సమాజంలో ముప్ప నరామారావు, కోటి రామలింగస్వామి మొదలైనవారు పనిచేశారు. ఇంకా రాఘవ కళాసమితి-నాటక కళాసమితి—రాఘవ ఆర్ట్సు థియేటర్సు—స్వతంత్ర ఆర్టు థియేటర్సు పని చేస్తున్నాయి. ఈ సమాజాలలో ముప్పన చిన్నఅంకయ్య—గోళ్ళ నాగేశ్వరరావు—బందం సూర్యారావు—కోటి రామలింగస్వామి—పెద్దాపురం రాజు మొదలైన వారు నటీనటులుగా వున్నారు.

# తుని

1948 లో కన్యకాపరమేశ్వరి నాట్యమండలి, 1955 లో మాసం భాస్కర రావు ప్రజా నాట్యమండలి శాఖను స్థాపించారు, 1956 లో వాణి నాట్యమండలి మొదలైన సమాజాలు పనిచేశాయి. ఈ సమాజాల్లో డి. టి. రాజు, సి. చిట్టి

బాబు, జట్ల అప్పారావు, యం. రాజారావు, జి. వెంకటస్వామి, వి. వి. రమణ మూర్తి, బి. ఆదినారాయణ, పి. అప్పారావు, గోపాలం, వై. భద్రాచలం. ఎ. రామారావు, యం. జి. ఆచార్య, కె. రామచంద్రరావు మొదలైనవారు నటులుగా వెలుగొందారు.

## రాజోలు

1955 లో కళాపరిషత్తు, 1958 లో కళావిహార్ మొదలైన నాటక సమాజాలు పనిచేశాయి. ఈ సమాజాల్లో యం. రమణమూర్తి, పి. వీరభద్రరావు, సి. హెచ్. సూర్యనారాయణమూర్తి మొదలైన కళాకారులు పనిచేశారు.

## రామచంద్రపురం

1938 లో ఆంధ్రవిజ్ఞాన పరిషత్తు, 1956 లో నాట్యశాల, 1958 లో కళా కేంద్రం ఏర్పడి పనిచేస్తున్నాయి. దువ్వూరి నరసరాజు, యస్. సూర్యనారాయణ మూర్తి, యస్. నరసింహాచార్య, బాబురావు, స్వామి, రామారావు మొదలైనవారు నటులుగా పనిచేశారు.

## గొల్లప్రోలు

1938 లో రామాంజనేయ బాలభక్తసమాజం. 1948 లో పాండురంగ భక్త నాట్యమండలి, 1957లో రిక్రియేషన్ క్లబ్, కొప్పరపు సుబ్బారావు స్మారక నాటక కళా పరిషత్తు. ఆంధ్రకళా పరిషత్తు మొదలైన నాటక సమాజాలు. స్థాపించబడి నడుస్తున్నాయి. ఈ సమాజాల్లో మొగిలి రామచంద్రరావు, పొన్నా తాతారావు, వుప్పలూరి అప్పలస్వామి, పి. హెచ్. వీరాస్వామి, అల్లుమల్లు భాస్కరరావు, అడపా సూర్యనారాయణ మొదలగు కళాకారులు పనిచేశారు.

## అమలాపురం

1948 లో అభ్యుదయ కళాసమితి, 1943 లో అభ్యుదయ నాట్యమండలి, 1955 లో సాహితి కళాకేంద్రం మొదలైన నాటక సమాజాలు ఏర్పడి పనిచేస్తు

న్నాయి ఈ సమాజాలను ఎ.ఎ. పేరిశాస్త్రి, పి. కామేశ్వరరావు, వి.వి. సుబ్బారావు, జి. ధర్మారావు, జి. లక్ష్మణరావు, మొదలైనవారు నడుపుతున్నారు. ఈ సమాజాలలో వై. వి. సుబ్బారావు, ద్రోణంరాజు నరసింహారావు, వై. రామమోహనరావు, యన్. వి. సుబ్బారావు, మొదలైనవారు నటులుగా వెలుగొందారు.

## కొత్తపేట

1956 లో కళామందిర్‌ను వి. రామారావు, మారి రామచంద్రుడు స్థాపించారు. రాజోలు నాటకరంగంలో ఎ. కృష్ణమూర్తి, నిట్టల రామమూర్తి, కేశవరావు, రామచంద్రమూర్తి, నల్ల సత్యనారాయణ, కె. వి. సుబ్బారావు, యన్. అచ్యుతరావు, బి. ఎ. శర్మ, జె. బి. సుబ్బారావు, అయ్యగారి శ్రీరామమూర్తి, మంగిపూడి దుందేశ్వరరావు, కె. సత్యం, ఏ. వీరభద్రం మొదలైనవారు పని చేశారు.





# విశాఖపట్టణం జిల్లా

# నాటకరంగం



విశాఖపట్టణం: జగన్మిత్ర సమాజం-
విశ్వవిద్యాలయ విశాలనాటకరంగం,
విజయనగరం: విజయరామ డ్రమె
టిక్ అకాడమి, భీమిలిపట్నం -
అనకాపల్లి-నర్సీపట్నం-యలమంచిలి
మొదలైన నాటక రంగాలు.

# విశాఖపట్టణం

## జగన్మిత్ర సమాజం :

ఆంధ్రదేశమంతా పర్యటించిన ధార్వాడవారు విశాఖపట్టణంలో కూడా హిందీ నాటకాలను ప్రదర్శించారు. ఇవి ప్రజలను ఎంతో ఆకర్షించాయి. కొంతమంది యువకుల్లో నాటకాలాడాలనే వుత్సాహం కలిగింది. పరవస్తు రంగాచార్యులుగారు శాకుంతలం నాటకాన్ని అనువదించారు. 1885లో జగన్మిత్ర సమాజాన్ని శ్రీ రఘునాధవర్మగారు స్థాపించారు. అంకితం జగ్గారావు, విక్రమదేవవర్మ, మొసలికంటి సూర్యనారాయణ, సెట్టి లక్ష్మీనరసింహం, కాదంబరి జగన్నాధ రావు, బెండూరు చిదంబరరావు మొదలైనవారు సమాజ సభ్యులుగా వుండి కాళిదాసు నాటకాలూ, షేక్స్పియర్ నాటకాలూ, వేణీసంహారం, చంద్రహాస, శ్రీనివాసకళ్యాణం, హరిశ్చంద్ర మొదలైన నాటకాలను ప్రదర్శించేవారు. తెరలూ, దుస్తులూ, ఆయా నాటకాలకు తగినట్లు వ్రాయించుకుని నాటకాలను ప్రదర్శించేవారు. వీరి నాటకాలు అనతికాలంలో ప్రజామోదాన్ని పొందాయి.



జగన్మిత్ర సమాజంలో గోపేటి కామేశ్వరరావు, కాదంబరి జగన్నాధరావు, తెన్నేటి జగన్నాధరావు, సెట్టి లక్ష్మీనరసింహం, చిదంబరరావు, నీలమణి పాణిగ్రాహి, తియ్యాళి భాస్కరరావు, బాకురపండా వెంకటరావు, ఎల్లాయి సోమశేఖరం, జయంతి సూర్యనారాయణ, ప్రయాగ నరసింహశాస్త్రి మొదలైనవారు ప్రముఖ నటులుగా పేరుపొందారు.

## విక్రమదేవవర్మ వితరణ :

ఈ సమాజంవారి నాటకాలన్నీ ప్రదర్శించటానికి విక్రమ దేవవర్మగారు కట్టించిన స్వంతహాలు వెలమపేటలో వుండేది. సెట్టి లక్ష్మీనరసింహంగారు చిత్ర

హరిశ్చంద్రీయం, రుక్మిణీ కళ్యాణం, మాలినీ విజయం, అహల్యా నాటకాలనూ, వర్మగారు మానవతీ చరిత్ర, శ్రీనివాసకళ్యాణం నాటకాలనూ రచియించి సమాజ సభ్యులతో ప్రదర్శింపచేశారు.

1889-90 ప్రాంతాల్లో ఈ సమాజంలో విద్యాధికులూ, ఉద్యోగులూ చేరి సమాజాన్ని పెంపుచేశారు. మంతా సూర్యనారాయణగారు సమాజ కార్యదర్శిగా వున్నకాలంలో తాతా ఉమామహేశం, నండూరు కృష్ణమూర్తి మొదలైనవారు ఎంతో కట్టుదిట్టంగా ఈ సమాజాన్ని నడిపారు. వీరి నాటకాల్లో ఎప్పటికప్పుడు నూతన సాంప్రదాయాలను ప్రవేశ పెట్టేవారు. హాస్యంలోనూ నృత్యంలోనూ, కత్తిసాములోనూ, ప్రత్యేకనిపుణు లుండేవారు. సమాజం క్రమశిక్షణతో నాటకాలను ప్రదర్శించేవారు.

## కళాభిలాషక నాటక సమాజం :

మారేపల్లి రామచంద్రశాస్త్రి, సెట్టి లక్ష్మీనరసింహంగారు 1895 లో ఈ సమాజాన్ని స్థాపించారు. జగన్మిత్ర సమాజంతో పోటీగా నిలబడ నాటకాలు ప్రదర్శించింది. ఈ సమాజానికి కావలసిన నాటకాలు శాస్త్రిగారే వ్రాసేవారు. ఆయనే దర్శకత్వం వహించేవారు. ప్రప్రథమంగా వేణీ సంహారం నాటకాన్ని జనరంజకంగా ప్రదర్శించారు. ఈ సమాజానికి ఆకెళ్ళ సత్యనారాయణగారు కూడ నాటకాలు వ్రాసియిచ్చారు. రామచంద్రశాస్త్రిగారు నల నాటకం, కిరాతార్జునీయం, పారిజాతాపహరణం, కంసవధ, ప్రహ్లాద విజయం, పాండవజననం, బిల్హణీయం, ద్రౌపదీ స్వయంవరం, సారంగధర మొదలైన 30 నాటకాలవరకూ వ్రాశారు.

ఈ సమాజంలో రామచంద్రశాస్త్రిగారు, సెట్టి లక్ష్మీనరసింహం, కవికొండల నరసింహం, జయంతి సూర్యనారాయణ, జిల్లేపల్లి వీరభద్రస్వామి, చిల్లా నారాయణ స్వామి, ఆమంచి రామమూర్తి, ఆమంచి సీతారామయ్య, చావలి వెంకటరమణ శర్మ, భాగవతుల కృష్ణారావు, కొండూరు రామమూర్తి, తడకలూరి కుప్పుస్వామి, శివకోటి అప్పలరాజు, కట్టె సూర్యనారాయణమూర్తి, చిల్లా నారాయణమూర్తి మొదలైన నటులు భిన్నవిభిన్నపాత్రలను సమర్థనీయంగా నటించేవారు.

## కుప్పుస్వామి బాణీలు :

వీరి సమాజం నాటకాల్లో పాటలకు కుప్పుస్వామిగారు బాణీలు, మట్లు కట్టేవారు. సుప్రసిద్ధ చిత్రకారులైన రత్నం మాష్టరు కావలసిన తెరలు వ్రాసేవారు.

ఆనాడు చాలవరకు పాటల్లోనూ, సీనరీల్లోనూ పార్శీవారినే అనుకరించేవారు. ఈ సమాజం రాజమండ్రి, విజయనగరం, అనకాపల్లి మొదలైన పట్టణాల్లో కూడా నాటకాలు ప్రదర్శించి ప్రశంస లందుకుంది. 1912 తరువాత ఈ సమాజం నిలిచి పోయింది.

ఆ రోజుల్లో ప్రియసల్లాపక కంపెనీ ఒకటి వుండేది. ఈ సమాజం వారు కేవలం హిందీ నాటకాలనే ప్రదర్శించేవారు.

పార్శీ రామారావుగారు ఆంధ్రా ఎమెచూర్సు అనే సమాజాన్ని స్థాపించి హరిశ్చంద్ర, చిత్రనళీయం నాటకాలు ప్రదర్శించి పేరుపొందారు. ఈ సమాజంలో రాజమండ్రి వాస్తవ్యులు ముప్పిడి జగ్గరాజుగారు స్త్రీ పాత్రల్నీ, రామారావుగారు పురుషపాత్రల్నీ, బి. వెంకటస్వామిగారు స్త్రీ పురుషపాత్రలు రెండింటినీ సమర్ధ వంతంగా నటించి ప్రజాదరణను పొందారు.

## సంగీతమానినీ సమాజం :

వేశ్యావృత్తిని మాన్పించి, వారికి జీవనోపాధి కల్పించాలని కంకణం కట్టు కుని, మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు ఈ సమాజాన్ని స్థాపించారు. ఈ సమాజ సభ్యులందరూ వేశ్యలే. నటులను పంక్తిబాహ్యులుగా నిషేధించే ఆ రోజుల్లో, స్త్రీలతో నాటక సమాజాన్ని ఏర్పాటుచేసిన శాస్త్రిగారు ఎంతటి అభ్యుదయ కాము కులో మనకు అర్థమౌతుంది. ఈ సమాజంవారు గుంటూరు, ఏలూరు, బందరు, రాజమండ్రి, కాకినాడ మొదలైన పట్టణాల్లో సంచారంచేసి అఖండంగా నాటకాలు ప్రదర్శించారు.

ఈ సమాజంలో శ్రీమతులు కొంకిపూడి చినబుల్లి, కొంకిపూడి చినచిట్టి, మద్దిల సూర్యనారాయణమ్మ, కొంకిపూడి పెదబుల్లి మొదలైనవారు వుత్తమ నటీ మణులుగా గణన కెక్కారు. ఈ సమాజం పది సంవత్సరాలు దేదీప్యమానంగా నడిచింది.

రసపుత్రవిజయం నాటక రచయిత ఇచ్ఛాపురపు యజ్ఞనారాయణగారు హితకారిణీ సమాజాన్ని స్థాపించి, దేశభక్తి ప్రబోధానికి రసపుత్రవిజయం నాట కాన్ని ప్రదర్శించారు.

తరువాత విశాఖపట్టణాంధ్ర నాటక పరిషత్తును 1916 లో విక్రమదేవవర్మ గారు స్థాపించి శ్రీనాధుని వీధినాటకం విషయంలో కృషిచేశారు.

1900 ప్రాంతంలో రాగటి వెంకటరావుగారు సుజనరంజనీ నాట్యమండలిని స్థాపించి హిందీ నాటకాలు ప్రదర్శించారు.

## కారనేషన్ హిందీ అమెచ్యూర్స్ :

1911 లో కారనేషన్ హిందీ అమెచూర్స్ అనే సంస్థను పార్శీ రామారావు గారు స్థాపించారు. వీరు హరిశ్చంద్ర, రసపుత్రవిజయం, కనకతార, వేణీ సంహారం మొదలైన నాటకాలను ప్రదర్శించేవారు. ఈ సమాజంలో పొడుగు విశ్వనాథం, కామరాజు, పార్శీ శేషగిరిరావు, సెట్టి వెంకటస్వామి మొదలైనవారు ముఖ్య బాధ్యతలు వహించారు.

కొంతకాలానికి ఈ సమాజం ఆంధ్ర అమెచ్యూర్సుగా మారింది. విప్లవ వీరుడైన అల్లూరు సీతారామరాజు ఈ సమాజ నాటకాల్లో నటించారు.

1924 లో ఎం. నటేశ మొదలియారు ఈ సమాజాన్ని స్థాపించారు. రసపుత్ర విజయం, దుర్గాదాసు, సావిత్రి మొదలైన నాటకాలను ఈ సమాజంవారు ప్రదర్శించారు. మంధా సుబ్బారావు, టి. రామశర్మ, బాకురుపందా వెంకటరావు మొదలైన నటులు ముఖ్యులు.

## నాట్యకళాభిలాషుల సభ :

మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి అధ్యక్షతను 1931 లో నాట్యకళాభిలాషులసభ ఏర్పడింది. పురిపండా అప్పలస్వామి, భమిడిపాటి చినయజ్ఞనారాయణశర్మగార్లు కార్యదర్శులుగా పనిజేశారు. 1935 వరకూ ఈ సమాజం నడిచింది. నాలుగు దశాబ్దాలపాటు విశాఖపట్టణంలో నాటకరంగం మూడు పువ్వులూ, ఆరుకాయలూ కాచింది. ఈ స్వర్ణ చరిత్రను పురిపండా అప్పలస్వామిగారు కళావని సంచికలో వివరించారు.

## విశ్వవిద్యాలయం

## విశాల నాటకరంగస్థలం :

ఆంధ్రనాటకరంగంలో, ఆంధ్ర విశ్వవిద్యాలయం నాటక కళలో ప్రముఖ పాత్ర వహించింది. దీనికి కారకులు కూర్మా వేణుగోపాలస్వామిగారు. 1938 లో

ఆంధ్ర విశ్వవిద్యాలయ డ్రమెటిక్ అసోసియేషన్ ప్రారంభమైంది. గోపాలస్వామి గారి అధ్వర్యంలో ఆంధ్ర విశ్వకళా పరిషత్తు అనుబంధ కళాశాల నాటకోత్సవాలు కూడ ప్రారంభమైనాయి.

1913 లో ఎక్స్‌పెరిమెంటల్ థియేటరు స్థాపించబడింది. యుద్ధసమయంలో యూనివర్సిటీ గుంటూరుకు మార్చిన సమయంలో గుంటూరులోనూ, వాల్తేరులోనూ బహిరంగ నాటకశాలలు స్థాపించబడ్డాయి

గుంటూరులో వున్నప్పుడు కన్యాశుల్కం, అశ్వత్థామ, అనార్కలీ, ఎప్పుడూ ఇంతే, ప్రతిమాసుందరి, ఖూనీ మొదలైన నాటకాలు విజయవంతంగా క్రమశిక్షణతో ప్రదర్శించబడ్డాయి.

## విశాల రంగస్థలానికి వేణుగోపాలస్వామిగారు వెన్నెముక : :

1943 నుండి వాల్తేరులో నాటకోత్సవాలు జరుగుతూ వున్నాయి. ఈ వుత్సవాల్లో ఇతరు లెవరైనా పాల్గొనడానికి అవకాశం కల్పించారు. విశ్వవిద్యాలయంలో జరిగే ప్రతి వైజ్ఞానిక విశేషానికి వేణుగోపాలస్వామివారే కారకులు. ఆయన నాటక కళాభిమాని. కళాకారులకు అత్యంత ఆప్తుడు. నాటక విజ్ఞానాన్ని కూలంకషంగా ఆకళింపు చేసుకున్న విజ్ఞులు. ఆంధ్రదేశంలో ఏమూల పరిషత్తు జరుగుతున్నా ఆయన హృదయం అక్కడ వుంటుంది. ఆయన విశ్వవిద్యాలయ రిజిస్ట్రారుగా వున్నకాలంలో - 17 సంవత్సరాల్లో దాదాపు నూరు నాటకాలకు పైగా నూతన ప్రయోగాలతో ప్రదర్శించి ఆంధ్రనాటక రంగానికే ఆదర్శప్రాయులైనారు. ఈనాడు యూనివర్శిటీ నాటక ప్రయోగంలో వినియోగపడే సాంకేతిక పరికరాలు రెండు మూడు లక్షల రూపాయల విలువైనవి వున్నాయి ఈనాడు ఆంధ్రదేశంలోవున్న అనేక అనుబంధ కళాశాలల్లో ఒక్కొక్క ఓపెన్ ఎయిర్ థియేటర్ స్థాపించబడింది ఈ మహత్కార్యానికి ఆద్యులు గోపాలస్వామిగారే. పై సమాజాలే కాక 1910లో లిల్లీనైట్‌క్లబ్, విశాఖపట్టణం నాటక కళామండలి,1948 లో విశాఖపట్టణం పోర్టు అమెచ్యూర్ డ్రమెటిక్ అసోసియేషన్, 1950 లో రత్నం మెమోరియల్ అమెచ్యూర్స్, 1958 లో కల్చరల్ అసోసియేషన్, విశ్వనాథ కళాసమితి ఆంధ్ర యూనివర్శిటి థియేటర్, లోకో బాల భరత సంఘం, అంకితం నాట్యకళాసమితి,

మెడికల్ కాలేజి డ్రమెటిక్ అసోసియేషన్, యన్. జి. వోస్ డ్రమెటిక్ అసోసియేషన్, యూత్ రిక్రియేషన్‌క్లబ్, ఆంధ్రకేసరి లలితకళా పరిషత్తు మొదలైన నాటక సమాజాలు పనిచేశాయి.

# విజయనగరం

1900 సంవత్సరం నాటికి తెలుగు నాటకరచన, తెలుగునాటకరంగం సంపూర్ణ వికాసం పొందుతూ వున్నాయి. నాటకాలన్నీ గ్రాంధిక భాషలో వుండేవి. ఈ స్థితిలో వ్యవహారిక భాషలో కూడ నాటకాన్ని వుత్తమంగా వ్రాయవచ్చని శ్రీ గురజాడ అప్పారావుగారు కన్యాశుల్కాన్ని రచించి ఆంధ్రనాటక రంగంలో ఒక నూతనోత్తేజాన్ని కలిగించారు. ఆనాటికి పది సంవత్సరాల ముందునుంచే నగరంలో నాటకాలు ప్రదర్శింపబడుతూ వుండేవి.

## ఆంధ్ర భోజుడు

## ఆనంద గజపతి :

1890 సంవత్సరంలో సకల కళా పోషకులైన శ్రీ ఆనంద గజపతిగార నాయకత్వాన సంస్కృత భాషా, సంస్కృత నాటకాలూ, వాటి ప్రయోగాలూ, పునరుద్ధరణ చేయాలనే సంకల్పంతో ఒక నాటకసంస్థ ఏర్పడింది. రాజాగారే స్వయంగా ఆ సమాజాన్ని నిర్వహించేవారు. చతుర్విధ అభినయాలనూ వారే నేర్పేవారు. నాటకానికి కావలసిన ఆయా పాత్రధారులందరినీ ఆయనే ఎన్నిక చేసేవారు. నాటక ఇతివృత్తాన్ననుసరించి తెరలు వ్రాయించి వారి కోటలో ప్రదర్శింప చేసేవారు.

## విజయనగరపు విఖ్యాత నటవర్గం :

విజయనగరం నాటకరంగంలో రాజాగారి అధ్వర్యంలో ఆనాడు ఎందరో ప్రసిద్ధనటులు వుద్భవించారు. అటువంటి వారిలో కట్టా పేరయ్యశాస్త్రిగా రొకరు. వీరు దుష్యంతుడు, పురూరవుడు మొదలైన నాయకపాత్రలను ధరించేవారు. చొప్పల్లి నరసింహంగారు శకుంతల పాత్రధారణలో అందెవేసినచెయ్యి. పప్పు వెంకన్నగారు అద్భుతంగా పాడేవారు. కట్టా పేరయ్యశాస్త్రిలు సంస్కృత నాటకాల్లో విదూషకుని పాత్రనూ, శాకుంతలంలో కణ్వునిపాత్రనూ సమర్థనీయంగా

అభినయించేవారు: సంస్కృత నాటకాల్లో సూత్రధారులుగావుండి సమా బాధ్యతల నన్నిటినీ వహిస్తూ వుండేవారు.

**విజయరామ డ్రమెటిక్ అకాడమి :**

రాజాగారి మరణంతో ఆ సమాజం అంతరించిపోగా విజయరామ డ్రమెటిక్ అకాడమీ స్థాపించబడింది. దీని నిర్వాహకులు తాతా వుమామహేశంగారు, రామాయణం సర్వేశ్వరశాస్త్రిగార్లు. దీని తరువాత వాణీవిలాస సభను అవారసపు గోపాలరావు-చట్టి సత్యనారాయణ-నంద గిరి శ్రీనివాసరావుగారూ కలిసి అద్భుతంగా విజయనగర కళాకేంద్రాన్ని అభివృద్ధిలోకి తెచ్చారు.



1949 వ సంవత్సరంలో, వేదుల జగన్నాధరావు—పీసపాటి నరసింహమూర్తిగార్ల అధ్వర్యంలో బళ్లారి రాఘవ స్మారక నాటక సేవాసమితి స్థాపించబడి, వరుసగా పది సంవత్సరాలు నాటక నాటికల పోటీ వుత్సవాలను నిర్వహించింది.

1958 లో రాఘవ కళాసమితిని యన్. వి. రామారావుగారు స్థాపించి నాటకాలు ప్రదర్శించారు.

1953 లో వరదా బ్రహ్మానందం, కొచ్చెర్లకోట రంగారావుగారు-హిరణ్యాక్షుడు అచ్యుతరావు, బంబిళ్ళ సూర్యారావు మొదలైనవారు అభ్యుదయ నాటకాలను ప్రజా నాట్యమండలి ద్వారా ప్రదర్శించారు.

పైన వివరించిన సమాజాలే కాక ఆంధ్రసేవా కళామండలి, యం. ఆర్. కాలేజి సిబ్బంది డ్రమెటిక్ అసోసియేషను, యునైటెడ్ ఫ్రండ్స్ ఆర్టిస్ట్సు, విజయ రాఘవ నాట్యమండలి, గౌరి సోషల్ ఆర్ట్సు అసోసియేషను, కవిరాజు మెమోరియల్ క్లబ్, వి. వి. పి. అసోసియేషన్, మురళీకృష్ణ నాట్యమండలి మొదలైన ప్రోత్సాహక సమాజాలు పనిచేశాయి.

విజయనగరం నాటకరంగంలో వర్ధిల్లిన నటీనటులనేకమంది వున్నారు.

వారిలో ముఖ్యులు చొప్పల్లి సూర్యనారాయణ, ఇమిటేషన్ ఆచారి, కె. గురుమూర్తి, భోగరాజు కృష్ణమూర్తి, సాలూరు రాజేశ్వరరావు, సరిదె లక్ష్మీనరసయమ్మ (కళావర్ రింగ్), యం. బుచ్చిరాజు, ఎ. గోపాలరావు, సుభద్రరాజు, దొడ్డమ్మ, పి. హెచ్.బి. వెంకటచలం, మద్దెల రాముడు, పుల్లి వెంకటరావు, ఎ. సూర్యారావు, యన్. కృష్ణారావు బి. అప్పారావు, యన్. వి. రామారావు, కె. రామారావు, లోకేంద్రరావు, కె. భాస్కరరావు, కె. వి. సుబ్బారావు, కె. సాంబశివరావు, శ్రీమతి సాలూరు సూరమ్మ, ఐ. సత్యరాజు, కుమారి రాధాకుమారి, కుమారి కామేశ్వరి, వేమల జగన్నాధరావు మొదలైనవారు పనిచేశారు.

## భీమిలిపట్నం

1948 లో సాహితి నాట్యమండలి, దుర్గా కళా నాట్యమండలి, ఏర్పడి పని జేస్తున్నాయి. ఈ సమాజాలలో బి. లక్ష్మీనరసింహం, యం. సీతారామస్వామి, బి. నారాయణమూర్తి, ఎ. నరసింహమూర్తి, ఆర్. కృష్ణమాచారి, హుస్సేన్ షహ సుద్దీన్, కె. యల్లయ్య, పి. నాగేశ్వరరావు, పి. నరసింగరావు, అజాద్ యం. నారాయణరావు మొదలైన నటులు పనిచేశారు.

## అనకాపల్లి

1943 లో శ్యామలా కళా సమితి, విజయలక్ష్మి నాట్యమండలి, 1946 లో గౌరి నాట్యమండలి, పాండురంగ నాట్యమండలి, హైస్కూలు, కాలేజి నాటక సమాజాలు పనిచేశాయి.

## చిట్టివలస

జ్యూట్‌మిల్లు ఎంప్లాయీస్ రిక్రియేషన్‌క్లబ్, డ్రమెటిక్ సెక్షన్ 1955 లో ఏర్పడింది. రామాయణం సుందరరావు, యస్. బంగారయ్య, పి. హనుమంతరావు, పేరినాయుడు మొదలైన కళాకారులు పనిచేశారు.

## మాడుగుల

1943 లో సరస్వతి నాట్యమండలి పనిజేస్తూ వుంది. మాడుగులకు రెండు

మైళ్ళదూరంలోవున్న గుట్టాలపేట, హుకుంపేట గ్రామాల్లో ఆడవిజాతులవారు 'ప్రజ' అనే నృత్యాన్ని చేస్తూవుంటారు.

మాడుగులలోవున్న కళాకారులు జి. వి. యస్. శర్మ, మురారి రామారావు, కణ్ణా అప్పారావు, అల్లాడ హనుమంతరావు, పత్తి వేణుగోపాలశర్మ, యన్. వి. నరసింహాచారి, యం. సి. కొండలరావు, పుట్ల సింహాచలం, జి. వి. వి. రామయ్య, వి. జగన్నాధాచారి, గరిమెళ్ళ కృష్ణమూర్తి.

# నర్సిపట్నం

1936 లో గంధర్వ నాట్యమండలి, 1955 లో దుర్గా నాట్యమండలి, హైస్కూలు విద్యార్థి నాటక సమాజమూ పనిజేస్తున్నాయి. దువ్వూరి సుందరరావు, నిష్టల కన్నబాబు, బొంతా రామమూర్తి, ఇవ్వాది రామనాధ్, పి. అప్పారావు, జె. అప్పారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

# చోడవరం

1896 కు పూర్వమే చోడవరంలో శ్రీనివాస విలాస నాటక సమాజం వుండేది ఈ సమాజం అనేక చారిత్రక నాటకాలను ప్రదర్శించింది. ఆనాడు ఈ సమాజంవారు కట్టుకున్న భవనమే ఈనాటి ప్రేమసమాజ భవనం. 1943 లో పాండురంగ నాట్యమండలి, 1953 లో త్యాగరాజ నాట్యమండలి, 1949 లో ప్రేమ నాట్యమండలి, 1948 లో విజయగోపాల్ నాట్యమండలి పనిచేస్తున్నాయి. తంగెళ్ళ వెంకటప్పడు చిరుతల భజనకు ఉపాధ్యాయుడుగా వుండి రామాయణగాథను ప్రచారం చేస్తూ, ఆ బృందాన్ని నిర్వహిస్తున్నారు మంగిపూడి కామేశ్వరరావు, జె. చిన సత్యనారాయణ, భమిడిపాటి రామసోమయాజులు, బి. కె. శాస్త్రి మొదలైన కళాకారులు పనిచేశారు.

# యలమంచిలి

1890 లో కళాభివర్ధనీ నాట్యమండలి, 1948 లో విజయ ఆర్టుథియేటరు, రామకృష్ణ నాట్యమండలి, హైస్కూలు డ్రమెటిక్ అసోసియేషన్ మొదలైనవి పని చేశాయి.

---

## ప్రసిద్ధ నటులు



పద్మశ్రీ వి. నాగయ్య



పద్మశ్రీ యన్.టి. రామారావు



పద్మశ్రీ అక్కినేని నాగేశ్వరరావు

# ప్రసిద్ధ నటులు



పద్మశ్రీ శ్రీమతి పి. భానుమతి



శ్రీ యస్.వి. రంగారావు



శ్రీ దాసరి కోటిరత్నం



శ్రీ కె. వెంకటేశ్వరరావు

## ప్రసిద్ధ నటులు



శ్రీ వనారస చినరామయ్య



శ్రీ చదలవాడ కుటుంబరావు



శ్రీమతి పి. రామతిలకం

## ప్రసిద్ధ నటులు



శ్రీ టి.వి. రమణారెడ్డి



శ్రీ డి. వేణుగోపాల్
(ఇండియన్ బ్యాలెట్ సెంటరు)



# శ్రీకాకుళం జిల్లా

# నాటకరంగం



శ్రీకాకుళం: రసజ్ఞుల రమా విలాసినీసమాజం- బొబ్బిలి: లలితకళానమితి-సాలూరు: శారదా నాట్య మండలి- పార్వతీపురం:విజయనాట్య మండలి - బరంపురం: జగన్నాథ విలాసినీ సమాజం- ఛత్రపురం: హిందూ థియేట్రికల్ క్లబ్

# శ్రీకాకుళం

## రసజ్ఞుల రమావిలాసినీ సమాజం :

1906-1907 సంవత్సర ప్రాంతాల్లో రమావిలాసినీ సమాజం స్థాపించబడి కొంతకాలం నడిచి, తిరిగి 1921 వ సంవత్సర ప్రాంతంలో రమావిలాస అమెచ్యూర్స్ పేర పునరుద్ధరించబడింది. ఇందుకు కారకులు చట్టి చినపూర్ణయ్య పంతులుగారు. పూర్ణయ్యపంతులుగారు చదువుకునే రోజుల్లో ఇంగ్లీషు నాటకాల్లో పాల్గొన్నారు. ఆ అనుభవంతో పై సంస్థను స్థాపించి, సమాజ సభ్యులకు తరిఫీదు నిచ్చారు. పంతులుగారు బహుముఖ పాత్రలను ధరించారు. వీరి అభిమానపాత్ర శివాజీ. ఆంధ్రనాటక కళాపరిషత్తు స్థాపకుల్లో ముఖ్యులు. పరిషత్తు రెండవనాటి సభకు అధ్యక్షులు. అనేక సంవత్సరాలు శ్రీకాకుళం పురపాలక సంఘానికి అధ్యక్షులు. 1928 లో ఒక ఫ్రెంచి విశ్వవిద్యాలయం వీరిని ఆనరరీ ప్రొఫెసర్ ఆఫ్ ఇండియన్ డ్రామటర్జీగా ఎన్నుకున్నారు.



ఇంకా శ్రీకాకుళంలో 1955 నటరాజ కళాసమితి, 1954 లో లలితకళా సమితి, 1955 లో గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజి డ్రమెటిక్ అసోసియేషన్, మునిసిపల్ డ్రమెటిక్ అసోసియేషన్ మొదలైన నాటక సమాజాలు ఏర్పడి పనిచేశాయి.

చట్టి పూర్ణయ్యపంతులు, రాపాకకొండలరావు, జె. వి. రమణమూర్తి, జె. వి. సోమయాజులు, యల్. నరసింహమూర్తి, టి. హరిరావు, వి. శివరావు, యన్. ప్రభాకరరావు, యం. జోగారావు, జగన్నాథరావు, కె. లక్ష్మణరావు, బి. రామదాస్, వి. సుబ్బారావు, డి. హనుమంతరావు, జె. వి. శ్రీరామమూర్తి మొదలైన నటులు పనిచేశారు.

# బొబ్బిలి

**1958 లో లలిత కళాసమితి, 1951 లో నూతన ఆంధ్ర నాట్యమండలి,**

1955 లో టాగూరు నాటకళా సమితి, 1955 లో పొట్టిశ్రీరాములు నాట్యమండలి, పనిచేస్తున్నాయి.



చట్టిపూర్ణయ్యపంతులుగారు-శివాజి

ఈ సమాజాల్లో పీసపాటినరసింహమూర్తి, అయ్యగారి నారాయణమూర్తి, కామేశ్వరరావు, వి. సత్యనారాయణరెడ్డి మొదలైనవారు నటులుగా వెలుగొందుతున్నారు.

# సాలూరు

1935 లో శ్రీ శారదా నాట్య మండలి, మరికొన్ని నాటక సమాజాలు పనిచేశాయి. ఈ సమాజాలలో హుస్సేన్, యం. సత్యనారాయణ, భవానీ రామారావు, చెరుకూరి వెంకటరెడ్డి, కె. వి. నాయుడు, డి. నరసింహారెడ్డి, వై. సూర్యనారాయణ, డి. ఎ. రెడ్డి, యస్. ఇస్మాయిల్, యన్, సోమేశ్వరశర్మ, యన్. కబీర్‌షా, సి, హెచ్. రాజు, డి. సూర్యనారాయణ, సత్యరాజు సంజీవరావు, యస్. రాఘవ కుమారి, కుమారి సరోజని మొదలైనవారు పనిచేశారు.

# చీపురుపల్లి

1950 లో హైస్కూలు డ్రమెటిక్ అసోసియేషన్, 1954 లో నవీన యువజన నాటక సమాజం, 1958 లో వాణీ నాట్యనిలయం మొదలైన సమాజాలు ఏర్పడి నడుస్తున్నాయి.

ఈ సమాజాలలో డి. నరసరాజు, ముళ్ళపూడి నరసింహరాజు, ఆర్. వేణుగోపాలరావు మొదలైన కళాకారులు పనిచేశారు.

# నరసన్నపేట

1954 లో హైస్కూలు డ్రమెటిక్ కంపెనీ, 1955 లో శ్రీకాకుళం

అభ్యుదయ నాట్యమండలి, 1957 లో నరసన్నపేట నాటక కళాసమితి మొదలైన సమాజాలు పనిచేస్తున్నారు.

ఈ సమాజాలలో టి. వి. కుమార్ గుప్త, పెండ్యాల సుబ్రహ్మణ్యకవి, బి. రాజారావునాయుడు, కె. బాలకృష్ణారెడ్డి, బి. వి. కృష్ణారావు, వి. నరసింగరావు, యన్. వి. రమణ మొదలైన నటులు పనిచేశారు.

# పార్వతీపురం

1942 లో విజయ నాట్యమండలి, 1951 లో హైస్కూలు డ్రమెటిక్ అసోసియేషను, 1955 లో సీతారామ డ్రమెటిక్ సొసైటీ మొదలైన సమాజాలు పనిజేస్తున్నాయి.

ఈ సమాజాలలో అయ్యసోమయాజుల ఉమామహేశ్వరరావు, గౌరి చంద్ర, యం. యస్. యన్. రాజు, సింగమహంతి రామారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

# పాందూరు

1946 లో రామానాట్యమండలి, 1954 లో ఆంధ్రనాటక కళాసమితి మొదలైన సమాజాలు నడుస్తున్నాయి.

పై సమాజాలలో బి. సన్యాసినాయుడు, ఏ. చిదానంగరావు, కె. మల్లికార్జునరావు, టి. బైరాగిరాజు, యల్. వీరాచారి, సి. హెచ్. వాసుదేవరావు, అల్లంసెట్టి సీతారామస్వామి, విశ్వప్రగడ కామేశ్వరరావు, టి. కృష్ణమూర్తి మొదలైన నటులు పనిచేశారు.

# బారువ

1956 లో నయనేంద్ర నాటక కళా సమితిని శ్రీ కె. జగన్నాధరావుగారు స్థాపించారు.

# ఇచ్ఛాపురం

1953 లో ఆంధ్ర ఆర్టు ఆసోసియేషన్‌ను పుల్లెల ధర్మారావుగారు స్థాపిం

చారు. ఈ సమాజంలో కె. బలరామస్వామి, పి. ధర్మారావు, యస్. శ్రీనివాసా చారి, వి. వి. నరసింహం, వి. భాస్కరరావు, యన్. నరసింహాచార్య, కృష్ణ పట్నాయక్, ఆర్. విఠల్‌రావు, వి. యోగేశ్వరరావు, డి. వి. సుబ్బారావు మొదలైన నటులు నటించారు.

# కాశీబుగ్గ

1955 లో అభ్యుదయ కళాసమితి, 1957 లో లలిత కళాసమితి ఏర్పడి పని చేస్తున్నాయి. వీటిలో కుమారి శ్యామల, వి. మాణిక్యం, వి. శ్రీధరరావు, కె. గురుమూర్తి, త్రిపాఠి, జి. భీమారావు, టి. యన్. స్వామి, మకబుల్ ఖాన్, నరసింగరావు, దామోదరరావు, ప్రకాశరావు, లింగమూర్తి మొదలైన నటీ నటులు నటించారు.

# పెదతామరపల్లి

1948 లో శ్రీ వెంకటేశ్వర నాట్యమండలి, స్వతంత్ర నాట్యమండలి పని చేస్తున్నాయి. తామరపల్లి చుట్టుప్రక్కల గ్రామాలైన దేవల్, భద్రా, నందిగామ, హరిదాసపురం, పట్ట, పెక్కలి, వజ్రపుకొత్తూరు మొదలైన చోట్లకూడ నాటక సమాజాలు నడుస్తున్నాయి.

ఈ సమాజాల్లో టి. కృష్ణారావునాయుడు, వై. నరసింహమూర్తి, డి. అప్పారావు, బక్కా వీరేశు, వి. వీరయ్య, బత్తుల లింగరాజు, చిన్నిబాబు మొదలైన నటులు పనిచేశారు.

# ఆముదాలవలస

1932 లో సీతారం నాట్యమండలి, 1944 లో నేతాజి నాట్యమండలి, 1953 లో సీతారామ నాట్యమండలి, 1954 లో సూర్యసమాఖ్య మొదలైనవి నడుస్తున్నాయి. వీటిలో బి. కృష్ణారావు, వై. రామారావు, రాములు, విశ్వనాధం, రాంబాబు పనిచేశారు.

పలాసా—నౌపడా—అర్సవిల్లి మొదలైనచోట్ల సంగీత సమాజాలు పని చేశాయి.

# అంపోలు, అడ్డవరం

ఈ రెండు గ్రామాలు శ్రీకాకుళానికి 4 మైళ్ళ దూరంలో వున్నాయి. ఇక్కడ రంజకవరు ఆనే రుంజ వాయిద్యబృందం వుంది. ఈ వాయిద్యాన్ని శివ పార్వతుల కళ్యాణ సమయంలో ఉపయోగిస్తారు. వీటి ధ్వని బ్రహ్మాండమైనది. దీనిని ముఖ్యంగా విశ్వ బ్రాహ్మణజాతికి జెందినవారు వాయించుతూ వుంటారు. వీరు పుష్యమాసంలో ఆయా గ్రామాలు వెళ్ళి వాయిస్తూవుంటారు.

రుంజ వాయిద్యకారులు వి. ఆంజనేయులు. జంగం సత్యనారాయణ, మిరియాల కోటిలింగం, యస్. యన్. అప్పయ్య మొదలైనవారు.

1913 లో అగస్తేశ్వరస్వామి నాటక సమాజం ఏర్పడింది. ముద్దా నీలం అప్పయ్య, కె. ఎఱ్ఱయ్య, వడపలి సుబ్బారావు మొదలైనవారు పనిచేశారు.

# పర్లాకిమిడి

పార్శీ నాటకాలతో ఆంధ్ర నాటకరంగంలో వచ్చిన సంచలనంతో పర్లాకిమిడిలో విద్యార్థుల ఆధ్వర్యాన 1897 లో అమెచ్యూర్ డ్రమెటిక్ అసోసియేషన్ స్థాపించబడి దాదాపు 1929 వరకూ నడిచింది. పర్లాకిమిడి నాటకరంగానికి గిడుగు సీతాపతిగారు పట్టుగొమ్మ. ఈ సమాజంలో ఇతర ప్రముఖులు పంతుల రామ మూర్తి, చిలుకూరి బుచ్చన్నపంతులు మొదలైనవారు. 1904 లో పర్లాకిమిడి రాజా గారు నాటక ప్రదర్శనాలకొరకు పద్మనాభ థియేటరును కట్టించారు. ఒరియా నాటక సమాజంతోపాటు, తెలుగు నాటక సమాజాన్నికూడ రాజాగారు పోషించారు. 1927 లో ఈ సమాజంవారు మద్రాసు గవర్నర్ సమక్షంలో నాటకాలను ప్రద ర్శించి, గవర్నర్ ప్రశంస అందుకున్నారు. 1929 లో మద్రాసు వచ్చిన సీతాపతి గారు వారి సాహిత్య సేవతోపాటు నాటక కళాసేవకూడా చేశారు. చలనచిత్ర పరిశ్రమలో ప్రవేశించి, పాత్రలనుకూడా ధరించారు.

# బరంపురం

పూర్వం ఆంధ్రదేశంలోనూ ప్రస్తుతం ఒరిస్సా రాష్ట్రంలోనూ వున్న బరం-

పురంలో జగన్నాథ విలాసినీ నాటకసమాజాన్ని బూర్ల సోదరులు స్థాపించారు. ఈ సమాజంలో నాయిక పాత్రధారణలో మద్దూరి అప్పారావు పంతులుగారు ప్రముఖులు ఈ సమాజం ఎక్కువగా పానుగంటివారి నాటకాలనే ప్రదర్శించేది.

1920 సం॥ర ప్రాంతంలో మిత్రమండలి అనే నాటక సమాజాన్ని న్యాపతి నారాయణమూర్తిగారు స్థాపించారు. ఈ సమాజంలో వెలివెల వీరరాఘవస్వామి మొదలైనవారు ప్రసిద్ధ నటులుగా వెలుగొందారు.

# టెక్కలి

ఇక్కడ ఆంధ్ర ప్రచారక సంఘం స్థాపించబడి పనిచేసింది. ఈ సమాజంలో జయంతి వేంకట జగన్నాథరావుగారు నాయక పాత్రల్ని, వినుకొండ జోగా రావుగారు నాయిక పాత్రల్ని ధరించేవారు.

ఇక్కడ కళింగ వైశ్య కుటుంబానికి చెందిన టంకాల సాంబయ్యగారు స్త్రీ పురుష పాత్రలు ధరించేవారు. వీరి సోదరుడు హార్మోనీ వాయించేవారు. సాంబయ్య గారి కుమారు లిద్దరూ బాల పాత్రల నభినయించేవారు. వీరి స్వచ్ఛమైన ఉచ్చా రణ, సంగీత సామర్థ్యం, ప్రేక్షకుల్ని ముగ్ధుల్నిచేసేవి. సాంబయ్యగారి పెద్దకుమా రుడు శశిభూషణరావు అపూర్వ నటనా చాతుర్యాన్ని కనపర్చేవాడని, నాట్యాశోకం 236 వ పుటలో సూరిశాస్త్రిగారు వివరించారు.

# ఛత్రపురం

దాదాపు 1885 ప్రాంతంలోనే హిందూ థియేట్రికల్ క్లబ్ పనిచేసింది. మేధావులు, ఉన్నతోద్యోగులు మొదలైన ప్రముఖులు ఈ సమాజాన్ని కట్టుదిట్టంగా నిర్వ హించారు. 1936 లో ఒరిస్సారాష్ట్రం ఏర్పడేవరకు ఈ సమాజం జయప్రదంగా నడిచింది. ఈ సమాజంలో గోవిందు సూర్యనారాయణగారు నాయికా పాత్రల్ని ధరించారు. ప్రసిద్ధ నాటక కర్తలైన గుండిమెడ వేంకట సుబ్బారావుగారు ఈ సమాజ కార్యదర్శియై, దర్శకులై అఖండమైన ప్రఖ్యాతిని చేకూర్చారు. గుండిమెడ వారి చారిత్రక నాటకమైన ఖిల్జీ రాజ్యపతనం ఆంధ్రదేశంలో అనేక ప్రముఖ సమాజాలు ప్రదర్శించాయి. ఆయన స్ఫురద్రూపి, కవి, దర్శకుడు, నటుడు, చిత్ర కారుడు.



# రాయలసీమ

# నాటకరంగం



పొతకమూరి భాగవతులు - ఆటలు, బయలాటలు_బళ్ళారి రాఘవ ప్రతిభ- అన్నంకోసం ఆటపాటలు : సురభి నాటకరంగం-బళ్ళారి-కర్నూలు- కడప -చిత్తూరు-అనంతపురంజిల్లాల నాటక రంగాలు

# రాయలసీమ నాటకరంగం

ఆంధ్రదేశ మంతటా పూర్వ రంగస్థలంలో ఏ జానపద కళారూపాలు ప్రదర్శించబడ్డాయో అలాగే రాయలసీమలో కూడా ప్రాచీన కళారూపాలైన కుర వంజి యక్షగాన ప్రదర్శనాలే ప్రదర్శింపబడినట్లు చరిత్రాధారాలున్నాయి.

**తాయికొండ నాటక సమాజం :**

రాయలవారి కుమార్తె "మరీచీ పరిణయం" అనే యక్షగానాన్ని రచించినట్లూ, రాయల నాట్యశాలలో తాయికొండ నాటకసమాజంవారు నాటకాలను ప్రదర్శించి నట్లూ శాసనాధారాలు వున్నాయి. 1506-1509 ప్రాంతంలో పరిపాలించిన వీర నరసింహరాయలవారి సమక్షంలో కూచిపూడి భాగవతులు వీధినాటకాలను ప్రద ర్శించినట్లు చరిత్రాధారాలు వున్నాయి,

**పొతకమూరి భాగవతులు :**

భాగవత నాట్య సాంప్రదాయ ప్రవర్తకుల్లో కూచిపూడి భాగవతులకంటే ముందు వారు పొతకమూరి భాగవతులు వీరు అహోబిల నరసింహస్వామి సన్నిధిలో నాట్యాచార్యులై - ప్రతినిత్యమూ నాట్యసేవ చేసేవారట. "శ్రీ వెలయ పాలవారధి వవ్వళించి జో-జో" అనే జోలపాట పొతకమూరు భాగవతులు రచించిందేనని. వీరు క్రీ॥శ॥ 1280 ప్రాంతంవారని తాళ్ళపాక అన్నమాచార్యులు పేర్కొన్నారు.

**ఆటలు - బయలాటలు :**

రాయలసీమలో యక్షగానాల తరువాత వీధినాటకాలు, బుర్రకథలు, విచిత్రవేషాలు. తోలుబొమ్మలాటలు, హరికథలు విరివిగా ప్రదర్శిస్తూవుండేవారు. వీటినే బయలు నాటకాలనీ, బయలాటలనీ పిలవడం వాడుక. ఈ నాటకాలను ఎక్కువగా మాల పల్లెలలో వుండే దాసరులు ప్రదర్శిస్తూ వుండేవారు. వీరే దాసుళ్ళనీ, దాసరులనీ, కొమ్మాయి దాసుళ్ళని, మాలదాసరులని పిలవబడుతూ వుండేవారు. హరిజనుల్లో ఒక తెగగాను, వారిలో అతీతులుగాను వుండేవారు. శూద్రజాతులు బ్రాహ్మణులను ఎలా గౌరవిస్తారో అలాగే యీ దాసరులను కూడా గూడెపు ప్రజలు గౌరవిస్తారు.

ఒకనాడు ఈ ప్రదర్శనాలన్నిటినీ దాసరులే ప్రదర్శించినా, ఈనాడు అనేకమంది వాటిని ప్రదర్శిస్తున్నారు.

## కంఠస్థంగా వున్న కళారూపాలు :

వీరు ప్రదర్శించే నాటకాలు అన్నీ వ్రాతప్రతులుగానో, లేక తాటియాకుల గ్రంథాల్లోనో, లేక ప్రత్యేకవ్యక్తుల కంఠస్థంగానో నిలిచివున్నాయి. ఒక్కొక్క దేశంలో వున్న ముఖ్యనాయకునికి అనేక నాటకాలు కంఠస్థం అయివుంటాయి. అతను మరణిస్తే, అతనితోపాటే ఆ నాటకాలు కూడ అంతరిస్తాయి. ఈ విధంగా మన ప్రాచీన యక్షగాన సాహిత్యం, బయలు నాటకాల సాహిత్యం అంతా శిథిలమైంది. అయినా, ఇప్పటికీ రాయలసీమ పల్లెప్రాంతాల్లో అనేక బయలు నాటకాలు ప్రచారంలో వున్నాయి. అవికూడ అచ్చులో కొన్ని లేవనే చెప్పవచ్చు. వాటిలో కొన్ని మచ్చుకు ఈ క్రింద వుదహరిస్తాను.

## నాటిమేటి

## నాటక రచయితలు :

దొడ్డకవి వ్రాసిన సుగ్రీవవిజయం, కుమ్మర బాలయ్య వ్రాసిన "సారంగధర" నాటకం, రుద్రకవి వ్రాసిన "శశిరేఖా పరిణయం", బెడుదూరు రంగాచార్యులు, రామాచార్యులు వ్రాసిన హరిశ్చంద్ర, వేములపల్లి కృష్ణమాచార్యుల విరాటపర్వం, నరసింహారెడ్డి వ్రాసిన "చుక్కలూరు రామనాటకం", యాదవదాసు రచించిన "గరుడాచల యక్షగానం" మొదలైన పైన వివరించిన నాటకాలన్నీ నేటి రాయలసీమలో ప్రచారంలో వున్నాయి. ఇవి అన్నీ కూడ పురాణ కథావస్తువులతో కూడినవే. అయినా పల్లెప్రజలకు అర్థమయ్యే శైలిలో వ్రాయబడ్డాయి. అంతేగాక ప్రదర్శనాక్రమంలో ప్రతిమాటా అర్థమయ్యేటట్లు విడమర్చి చెప్పేవారు. అందువల్ల చదువురాని ప్రేక్షకునికి కూడ అర్థమయ్యేది. ఇందుకు వుదాహరణ-యాదవదాసు రచించిన గరుడాచల యక్షగానంలో—

బాణమెయ్యగలవా మృగముల
బట్టి త్రుంచగలవా
నాబెముతోడుత జారుడు బండల
మీది కెక్కగలవా

మృగముల బట్టెదనే నేని
నగముల తిరిగెదనే

## నలుగురూకూడే

## నడిబజారులో నాటక ప్రదర్శనం :

ఈ విధంగా సంవాదం జరుగుతుంది. ప్రదర్శనాల పద్ధతి-ఊరుమధ్య పెద్ద బజారులో నలుగురూ సమకూడే ప్రదేశంలో పెద్ద గడలతో పందిరివేసి చుట్టూ మామిడి తోరణాలు గట్టి, పందిరిలో ఎత్తుగా దిబ్బపోసి ప్రదర్శనానికి ముందు మద్దెల తాళాలతో కొంచెం సందడి చేసేవాళ్ళు. అంతకుముందు ప్రదర్శనకారులు ఇంటింటికీ వెళ్ళి రాత్రి ప్రదర్శనానికి రమ్మనమని ఆహ్వానించేవారు. ప్రదర్శనానికి లైట్లు వుండేవికావు. తెరలు వుండేవికావు. తెరలకు బదులు దుప్పట్లు ఉపయోగించేవారు. లైట్లకుబదులు దివిటీలు వెలిగించేవారు. కొన్నాళ్ళు కిరసనాయిలు ఇలాఋ కట్టలు వెలిగించారు. గ్యాసులైట్లు వచ్చిన తరువాత పై విధానాలు పోయాయి

## హంగామాతో

## రంగస్థల హంగులు :

ఈ యక్షగానాల్లో స్త్రీ పాత్రలు పురుషులే ధరించేవారు. భుజకీర్తులు ధరించేవారు. కిరీటాలు పక్షులరెక్కలతో సొంపుగా తయారు చేసేవారు. వేషధారణలో ఆయా రసాలకు తగిన ఎరుపు, పసుపు, పచ్చ రంగులను ఉపయోగించేవారు. ప్రతిపాత్ర ప్రవేశానికి ఒక హంగామా చేసేవారు. ఈ విధంగా ప్రేక్షకుల్లో కొత్త వుత్సాహాన్ని రేకెత్తించేవారు. ముఖ్యంగా ప్రధాన పాత్రలు యముడు, కంసుడు, రావణుడు మొదలైన పాత్రప్రవేశాల్లో నిప్పులు గ్రక్కుతూ పాత్రలు వచ్చేవి. రంగస్థలంపైకి పాత్ర రాగానే తెరపట్టి, తెరవెనుక పాత్రధారుల నుంచి, తెరముందు విదూషకుడు ఆ వచ్చిన పాత్రధారిని ప్రేక్షకులకు ఎరుక పర్చడానికి "అహో! ఈ సభారంగమునకు విచ్చేసిన ఆమాత్యవర్యు లెవరండీ?" అని ప్రశ్నిస్తే, వెంటనే లోపలవున్న పాత్రధారి ఏ వుద్దేశ్యంతో ప్రవేశించనున్నాడో అంతా పూసగ్రుచ్చినట్లుగా పాత్ర పరిచయం చేసేవారు. ఆ తరువాత నాటక ప్రారంభం. నటుడు వల్లించిన ప్రతిపాటకూ హంగుదార్లు వంత పాడుతూ నానా హంగామా చేస్తారు. ఈ విధంగా నాటకాన్ని రక్తికి తీసుకువస్తారు. ఈ విధమైన బయలు నాటకాలు రాయలసీమలో అన్ని పల్లెప్రాంతాల్లోనూ ప్రదర్శింపబడుతూ వుండేవి.

## వెదురు చాపల వీధినాటక రంగస్థలం :

ఆనాడు రాయలసీమలో నాటకాలు ప్రదర్శించడానికి తగిన ప్రదర్శనశాలలు లేవు. వెదురుచాపలూ, తడికెలూ, గోనెపంచుల కప్పులతో నాటకశాలలు నిర్మించేవారు. ప్రతి నాటక సమాజమూ మంచి క్రమ శిక్షణతో రంగస్థలాన్ని పవిత్రంగా ఎంచేవారు. నాటకాలలో వాద్యాలుగా హార్మోనియం, తబలా, మృదంగం, ఫిడేలు ఉపయోగించేవారు. వేషధారణలో సఫేదు, అర్దళం ఉపయోగించేవారు. ఉత్తమ పాత్ర లన్నిటికీ విలువైన చెమ్కీ కోటులను, మంచి తలపాగాలను, తురాయిలనూ వుపయోగించేవారు. విగ్గులకు బదులుగా వారివారి శిరోజాలనే విగ్గులుగా పెంచుకునేవారు.

# బళ్ళారి

## బళ్ళారికి పేరుతెచ్చిన బయలాటలు :

పూర్వం నుంచీ బళ్ళారి ప్రాంతంలో బయలాట అనే జానపద కళారూపం బహుళ ప్రచారంలో వుండేది. ఆంధ్రదేశపు వీధి నాటక ప్రదర్శనానికి ఈ బయలాట ప్రదర్శనానికి ఎంతో సన్నిహిత సంబంధముంది. ఈనాటికీ ఈ కళారూపం బళ్ళారి చుట్టుప్రక్కల గ్రామాల్లో ప్రదర్శింపబడుతూ వుంది.



శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులుగారు
హిరణ్యకశిపుడు
శ్రీ బెంగుళూరు వాసుదేవరావుగారు
లీలావతి

ఒకప్పుడు బళ్ళారిలో "జనల్ ఘాట్", "మేఘాట్" అనే రెండు పెద్ద బయలాట కంపెనీలను గరుడచేడు హనుమంతప్ప - రామసాగరం వెంకణ్ణ - కురుగోడు దొడ్డకవి మొదలైనవారు నడుపుతూ వుండేవారు. వీరు కన్నడిగులు.

### నాటకధర్మాలను
### నిర్వహించిన ధర్మవరంవారు :

బయలాటల తరువాత బళ్ళారిలో కన్నడంలో నాటకరచన బయలు దేరింది. ఈ కన్నడనాటకాలను చూచిన ధర్మవరం కృష్ణమాచార్యులుగారు కన్నడంలో "బాణాసుర, వామనచరిత్ర, ఉషాపరిణయం" నాటకాలను రచించి, ఆ నాటకాలకు దర్శకత్వం వహించారు. 1879 లో ధర్మవరం రామకృష్ణ మాచార్యులుగారు ఇంగ్లీషు నాటకాలాడారు. కన్నడ నాటకరచనతో వుత్తేజితులైన ఆచార్యులుగారు 20 సంవత్సరాల వయస్సులో స్వతంత్రంగా తెలుగులో తొలిసారిగా 1886 లో చిత్రనళీయం నాటకాన్ని రచియించి, ఆయన స్థాపించిన సరసవినోదినీ నాటక సమాజంద్వారా ప్రదర్శింపజేశారు. ఆయన చిత్రనళీయం, పాదుకాపట్టాభిషేకం, ప్రహ్లాద, విషాద సారంగధర, మోహినీ రుక్మాంగద, బృహన్నల, ముక్తావళి మొదలైన 28 నాటకాలను రచించారు ఆయన రచించిన నాటకాలన్నిటినీ బళ్ళారిలోనూ, మద్రాసు సుగుణవిలాస సభలోనూ ప్రదర్శించారు. దశరథుడు, బాహుకుడు, రాజరాజనరేంద్రుడు మొదలైన పాత్రలు ధరించి నటుడుగా కూడా రాణించారు.

కొంతకాలం నాటకరంగ సామ్రాజ్యాన్ని అమోఘంగా పరిపాలించాయి ఆచార్యులుగారి నాటకాలు. పద్యాలూ, గేయాలూ, అంకాలూ, రంగాలూ మొదలైనవన్నీ వీరి కావ్యాల్లో అమితంగా కనిపిస్తాయి.

1910 వ సంవత్సరంలో కృష్ణమాచార్యులుగారికి గద్వాల మహారాజుగారు ఆంధ్రనాటక పితామహ అని బిరుదు నిచ్చారు. ఆనాటి గద్వాల పౌరులు రత్నఖచితనిర్మాణంతో కూడిన ఒక కిరీటాన్ని బహూకరించారు.

### ధర్మవరం గోపాలాచార్యులు :

కృష్ణమాచార్యులుగారి జీవితం వ్రాసేటప్పుడు, వారి సోదరులైన ధర్మవరం గోపాలాచార్యులుగారి జీవితాన్ని విస్మరించడానికి వీలులేదు. సరసవినోదినీసభ స్థాపకుల్లో ఆచార్యులుగారు కూడా ఒకరు. వీరు కొన్ని పాత్రలను కూడా నటించారు. వీరి పాత్రల్లో అగ్రస్థానం వహించింది భక్తరామదాసు పాత్ర. వీరు కొంతకాలం హైదరాబాదులోనూ, కొంతకాలం న్యాయవాదవృత్తిలోనూ పనిచేశారు. వీరి నాటకాలు రామకబీరు, ప్రేమచంద్రయోగి, అస్పృశ్యవిజయం.

## కోలాచలంవారి గొప్పతనం :

ఆంధ్రనాటక పితామహుడైన ధర్మవరం కృష్ణమాచార్యులుగారి స్వస్థలమైన బళ్ళారిలోనే కోలాచలం శ్రీనివాసరావుగారు సుమనోరమ నాటకసంఘాన్ని స్థాపించారు. వీరు హరిశ్చంద్ర, కీచకవధ, లంకాదహనం, పాదుకాపట్టాభిషేకం, రామరాజుచరిత్ర, మైసూరురాజ్యం, చాందుబీబీ, కుశలవ మొదలైన 30 నాటకాలను రచించి వారి సమాజంద్వారా ప్రదర్శించి పండితపామరుల మన్నన లందుకున్నారు. వీరి నాటకాలను ఆనాడు ఆంధ్రదేశంలో విద్యావంతుల నాటకసమాజాలన్నీ ప్రదర్శించాయి. వీరి నాటకాలలో రామరాజుచరిత్ర బహుముఖ కీర్తి గడించుకుంది. ఆ నాటకాల్లో పాత్రలనుకూడా శ్రీనివాసరావుగారు ధరించారు. అంకవిభజనలాంటి కొత్త విధానాలను వీరూ ప్రవేశపెట్టారు.

కోలాచలం వారి సునందనీపరిణయం ఆరోజుల్లో గుంటూరు హిందూ థియేటరువారు, బందరు నేషనల్ థియేటరువారు ప్రదర్శిస్తూ వుండేవారు.

వీరి రామరాజుచరిత్ర కొంతకాలం ప్రదర్శింపబడిన తరువాత ఆనాటి ప్రభుత్వం నిషేధించింది. వీరి నాటకాల్లో పాటలనూ, పద్యాలనూ ఆనాటి విద్యావంతులైన నటకులు తప్ప ఎవరూ ఉచ్ఛరించడానికి వీలులేనంత కఠినంగా వ్రాయబడ్డాయి. ఏమైనా నాటకరచనకూ, నాటకాల ప్రదర్శనకూ అవి తొలిరోజులు. ఆంధ్రనాటకరంగానికి రచయితగానూ, సమాజస్థాపకుడుగానూ, నటుడుగానూ అపూర్వసేవ చేశారు. అంతేకాక ఇంగ్లీషులో ప్రపంచనాటక చరిత్రను రచియించి ఆదర్శప్రాయులైనారు.

## కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు :

ధర్మవరం కృష్ణమాచార్యులుగారినీ, కోలాచలం శ్రీనివాసరావుగారినీ గురించి చెప్పినతరువాత మరో బళ్ళారికి చెందిన కళాకారుణ్ణి గురించి కూడ చెప్పుకోవాలి. వారు పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. వీరు ఆంధ్రనాటకరంగానికి శ్రీకృష్ణలీలలు, లవకుశ, భక్తకుచేల, ద్రౌపదీ వస్త్రాపహరణం, లంకాదహనం, రామరావణయుద్ధం, మేవాడ శౌర్యాగ్ని, ప్రౌఢకృష్ణలీల మొదలైన ఎన్నో నాటకాలను రచియించారు. ముఖ్యంగా శ్రీకృష్ణలీలలు, లవకుశ నాటకాలు ఆంధ్రనాటకరంగంలో మణిపూసల్లాంటివి. ప్రతి పట్టణంలోనూ ప్రదర్శించిన

నాటకాలు. ఇవి రంగస్థలంమీదేకాక వెండితెరమీద టాకీయుగంలో ఒకసా చిత్రీకరించారు. అశేషప్రజామన్ననలను పొంది, ఆర్థికంగా విజయవంతమయ్యాయి

పైన వివరించిన రచయితలే గాక, రావ్‌బహద్దర్ హనుమంతగౌడ సుబ్బాశాస్త్రి, తోరణగల్లు రాజారావు, పద్మనాభ వెంకోబాచారి మొదలైనవారందరు బళ్ళారి నాటకరంగంలో నాటక రచయితలుగా వెలుగొందారు.

బళ్ళారి నాటకరంగంలోనూ, ఆంధ్ర నాటకరంగంలోనూ నూతన విప్లవాన్ని తీసుకువచ్చినవారు తాడిపత్రి రాఘవచార్యులుగారు.

# నాట్యకళాప్రపూర్ణ

# తాడిపత్రి రాఘవాచార్యులు

బళ్ళారి రాఘవ ఆంధ్ర నాటకరంగంలో నూతన విప్లవం తీసుకువచ్చిన ప్రతిభాశాలి. ఆంధ్ర నాటకరంగం మహోజ్వలంగా ప్రకాశించిన రోజులలో ఆయన సర్కారుప్రాంతాలు పర్యటించి ఎంతోకాలం రంగస్థలిమీద పాతుకుపోయిన పాతపద్ధతులకు స్వస్తిచెప్పి రచయితలకు, నటులకు కొత్తమార్గాలు ప్రసాదించారు. స్త్రీలతో స్త్రీపాత్రలు ధరింపజేయాలని ఎలుగెత్తిచాటిన ప్రముఖకళాకారులలో ఆయన ఒకరు. ఆయన అనేక పాత్రలకు కొత్త మనస్తత్వాలు, కొత్త అభినయం ప్రవేశపెట్టారు. ప్రతి పట్టణంలో విశాల నాటక రంగస్థలం నాటక సమాజాలకు లభించేటట్లు ఆయన కృషిజేశారు ఆయన ప్రోత్సాహం అందుకున్న అమెచ్యూర్ నాటక సమాజాలు ఎన్నో ఉన్నాయి. నాటక ప్రదర్శనం ధనారనకు కాకుండా ప్రజల మానసిక విజ్ఞానచైతన్యాలకు తోడ్పడాలని ఆయన ఉద్బోధిసూ వచ్చారు.



తాడిపత్రి రాఘవచార్యులుగారు
(దుర్యోధనుడు)

## అందాల సుందరుడు :

శ్రీ రాఘవాచార్యులు స్వతహాగా అందమైన వ్యక్తి. ఆయన రంగస్థలంలో అడుగుపెట్టిన క్షణంలో ప్రేక్షకులను ఆకట్టుకునేది ఆయన విగ్రహం. అదే ఆయన నిర్వహించిన పాత్రలకు పేరుప్రతిష్టలు ఆర్జించిందని రూఢిగా చెప్పవచ్చు. ఆయనలో వున్న మరొక ప్రత్యేకత ఆయన వాక్సంపత్తి. ఖంగుమనే గొంతు, లలితస్వభావంగల స్వరం, అన్నివిధాలా శృతిపక్వమైన కంఠం, స్వచ్ఛమైన ఉచ్చారణ ఆయనలోని విశిష్టలక్షణాలు. భావానికి అనుగుణంగా పలుకు, మాటలకు జతగా గంభీరమైన నటన ఆయనకు వెన్నతోపెట్టిన విద్యలు.

## నటనలో తెచ్చిన నవచైతన్యం :

ఆయన నాటకంలో పద్యాలు పాడడంలో ఒక కొత్తపద్ధతి ప్రవేశపెట్టాడు. సంగీతానికి ప్రాధాన్యం తగ్గించి, కేవలం భావానికి, భావానికి తగిన అభినయానికి ప్రాముఖ్యం ఇచ్చి, రాగాలరూపం ద్యోతకమయ్యేవిధంగా పద్యాలు చదివేవారు. ఈ పద్ధతి కొంతమంది నటుల్ని, ప్రేక్షకుల్ని సంతృప్తిపరచగలిగేది. నాటక ప్రదర్శనంలో సంగీతంకంటె, ఉచ్చారణకంటె పాత్రోచితమైన భావాలు పోషించగలిగేవారే నటులని, తక్కినవారంతా వేషధారులుగా దిగజారిపోతుంటారని ఆయన అంటూవుండేవారు.

## భారతదేశ అగ్రనటుడు :

తెలుగు, ఆంగ్లం, కన్నడం, సంస్కృతం, హిందీ, తమిళభాషల పరిచయం ఆయనకుండి. ఈ భాషలలో నాటకాలు పరిశోధించిన విజ్ఞాని ఆయన. ఆ నాటకప్రదర్శనల్లో ఆయన వివిధపాత్రలు ఎంతో సామర్థ్యంతో పోషించి భారతదేశ అగ్రనటుడుగా పేరు సంపాదించారు బెంగాలీ నాటకరంగపితామహులు శ్రీ శిశిర్‌కుమార్ బాధురీ, విశ్వకవి రవీంద్రనాథ్ ఠాకూర్, శ్రీ బాలగంధర్వ, గుబ్బి వీరన్న, తమిళనాటక పితామహుడు సంబంధ మొదలియార్ మొదలైన అగ్రనటులు శ్రీ రాఘవను ఉత్తమనటుడుగా ప్రశంసించారు సునిశితమైన పాత్రల మనస్తత్వాలను సున్నితంగా, సరళంగా, సమగ్రంగా ప్రదర్శించడంలో ఆయన సిద్ధహస్తుడు అనే కీర్తి గడించారు.

## దుర్యోధన పాత్రకు తెచ్చిన దొడ్డమార్పు :

నాటి నాటకరంగ నటులు - దుర్యోధనపాత్రను అతిపేలవంగా పోషించే

వారు. ఆ పాత్రధారి ఏమాత్రం నిలకడలేకుండా, ఓర్పు విస్మరించి, అరుపులతో కోపంతో చిందులుతొక్కి, పాత్రౌచిత్యం భంగపరిచేవాడు. భారతకర్తలు దుర్యోధన పాత్రను అద్వితీయంగా సృష్టించారు. శ్రీ రాఘవ దుర్యోధనపాత్ర నిర్వహణంలో ఏ హంగామా లేకుండా హావభావాలలో తేలికతనం కనబరిచి, రాజఠీవి, రాజకీయచాతుర్యం స్పష్టీకరిస్తూ, దుర్యోధనపాత్రకు న్యాయం చేకూర్చేవారు. పాండవుల్ని ఏవిధంగా లొంగదీయాలి? పాండవపక్షపాతం చూపించే కృష్ణుడిమీద కక్ష ఏవిధంగా సాధించాలి? అనే కార్యసాధనాల్లో కౌరవసోదరుల ఆవేశం అదుపులో పెట్టుకుంటూ, ఎదురైన అవమానాలు దిగమింగుతూ, పట్టువదలక కార్యదీక్షతో ముందుకు అడుగులు వేసే రారాజు సహజరూపం ప్రతిబింబించే విధంగా శ్రీరాఘవ నటించేవారు.

## పాత సంప్రదాయానికి స్వస్తిచెప్పిన ప్రతిభావంతుడు :

నాటక రంగస్థలిపై అనూచానంగా పోషిస్తూ వస్తున్న హిరణ్యకశిప, రామదాసు పాత్రల నిర్వహణ సంప్రదాయాలు మార్చి, వాటికి ఒక ఆకృతి కల్పించి, పండితుల ప్రశంసల నందుకున్నారు. హిరణ్యకశిప రాక్షస మనస్తత్వం రాఘవ హస్తాలలో సత్వగుణ ప్రాధాన్యం సంతరించుకుంది. పుత్రప్రేమ వీడలేక ఆ తండ్రి అంతర్గతంగా కుములుతూ, కొడుకును మొరటు పద్ధతుల్లో లొంగదీయకుండా, సాత్వికంగా బుజ్జగిస్తూ, మరొకపక్క లీలావతిని ఓదారుస్తూ, విష్ణుద్వేషం ప్రకటించి ప్రహ్లాదుని బెదరిస్తూ, ఒక కంటిలో వాత్సల్యం, మరొక నేత్రంలో ఆగ్రహం ప్రదర్శిస్తూ, ఎంతటి రాక్షసుడికైనా పుత్రప్రేమ ఒకపక్క వుండి తీరుతుందనే సహజ స్వభావాన్ని ప్రేక్షకులకు అందించేవారు శ్రీ రాఘవ హిరణ్యకశిపుడుగా.



కాడివర్తి రాఘవాచార్యులుగారు
బెంగుళూరు వాసుదేవరావుగారు,
పఠాన్ – రుస్తుం

**రామదాసుగా**

**రాణించిన రాఘవ :**

అదేవిధంగా రామదాసు రూపంకూడా ఆయన కల్పనతో మార్పుచెందింది. కథారంభంలో గోపన్న 'చొక్కా', తలపాగా ధరించేవాడు. గోపన్నలో శ్రీరామ భక్తి బీజాలు నాటుకున్న తరువాత భక్తి పారవశ్యంతో నిమగ్నుడైన రామదాసు ఆహార్యం కూడా మారుతూండేది. సాత్విక చలనాలు, వేషభాషల మార్పు, భక్తికి మించిన ఇతర స్వార్థాలపట్ల చిన్నచూపు - ఈ భావాలు ప్రస్ఫుటంగా ప్రదర్శించిన నాడే ఆ పాత్ర భక్త రామదాసుగా కళ్ళయెదుట అవతరిస్తుందని శ్రీ రాఘవ అభిమతం. రామదాసు పాత్ర ఆ విధంగా ప్రదర్శించిన ఫలితంగా ప్రేక్షకులు ఆయన పట్ల గౌరవభావాలు పెంపొందించుకున్నారు.

**పాత్రల తత్వాన్నే మార్చిన**

**ప్రతిభాశాలి :**

దుష్టబుద్ధి, పఠాన్, కీచకుడు, యముడు, యుగంధరుడు, చాణక్యుడు మొదలైన పాత్రలు అన్నిటిలోను శ్రీ రాఘవ మార్పులు తీసుకువచ్చారు. ఆంధ్ర నటలోకం ఆయన చేసిన ఈ మార్పులతో ఆ పాత్రల నిర్వహణ కొనసాగించడానికి ఆదిలో కొంత తటపటాయించింది. కాని క్రమేపీ పాత పాత్రల క్రొత్త ఆకృతిపట్ల మోజు పెంచుకోకపోలేదు. శ్రీ రాఘవ ప్రదర్శించే నాటకాలకు చాల మంది నటులు హాజరై, ఆయన పాత్ర నిర్వహణ పద్ధతులు సునిశితంగా పరిశీలించి వాటిని ఆచరించేవారు. శ్రీ రాఘవ నాటకాల ప్రభావం అంతటిది.

**బంగారు కలలుకన్న**

**బళ్ళారి రాఘవ :**

ఆంధ్ర నాటకరంగం ఇంకా అభివృద్ధి చెందాలని ఆయన బంగారుకలలు కన్నారు. ఆయన ఆశయాలు, ఆదర్శాలూ ఆచరణలో పెట్టగల వ్యక్తులు కొద్దిమంది మాత్రమే ఉండేవారు. వృత్తి నాటకసంఘాలు. కంట్రాక్టు నాటకాలు నాటకరంగాన్ని కలుషితం చేస్తున్నాయని ఆయన ఎంతో బాధపడేవారు. ఆయన ఏకాకి. నేడున్న చైతన్యం ఆనాడు ఉండివుంటే శ్రీ రాఘవ ఉద్యమం కొంత విజయవంతం అయేది. ఇంతమంది యువ నటీనటులు, యువ నాటక కర్తలు

అనాడు తక్కువ కావడంవల్ల ఆ రోజులలో రాఘవ కలలు కలలుగానే ఉండి పోయాయి.

ఈ తరం నటీనటులకు సమాజాలకు రాఘవ ఆశయాలు ఆదర్శ ప్రాయాలుగా ఉంటున్నందుకు ఒక విధంగా సంతోషించాలి. ఆయన ఆదర్శాల ప్రభావం, నాటక కళ వికాసానికి దారితీస్తుంది. ఒక యుగంలో ఒక ఉద్యమంలో కొద్దిమంది కారణ జన్ములుగా ఉదయిస్తారు. ఆ కోవకు చెందినవారే శ్రీ రాఘవ. ముందు తరాల నటలోకానికి, సమాజాలకు అభ్యుదయకరమైన పంథాలు నిర్దేశించిన ఉత్తమ కళాకారుడు శ్రీ రాఘవ. అదే రాఘవ యుగం. నటన అనేది ఒక యోగం, ఒక తపస్సు. అందరికీ సిద్ధించని ఒక విద్య అని ఆయన తరుచుగా ఉద్బోధిస్తుండేవారు.

ఆయన అక్షరాలా కళాప్రపూర్ణుడు. ఎన్నో ఆవేదనలు భరిస్తూ ఆయన 1946 ఏప్రిల్ 16 వ తేదీన అస్తమించారు.

# కర్నూలు జిల్లా

1949 లో కర్నూలుమండల కళాపరిషత్తు, కర్నూలుపట్టణంలో 1954 సంవత్సరంలో అభ్యుదయకళాసమితి, కర్నూలు డ్రమెటిక్ అసోసియేషన్, లలితకళాసంఘం మొదలైన సంస్థలు పనిచేస్తున్నాయి. ఈ సమాజాల్లో జి. సత్యనారాయణరావు, ఎ. కోదండరామయ్య, యం. యస్. శకుంతలాదేవి, హనుమయ్య, పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు, బి. వి. సుబ్బారావు, సీతారామయ్య, స్వామిరావు, జి. సుబ్బారావు, కె. లీలావతమ్మ, ఇందిరాదేవి, సరస్వతి, బి. నారాయణమూర్తి, అన్సారి, కె. సుబ్బారావు, వెంకటస్వామిగౌడ్, రామలింగప్ప, కమలకుమారి, లింగరాజు, అల్లూరి సుశీల మొదలైన నటీనటులు పని చేశారు.

# ఆదోని

1951 లో ఇక్కడ కళాసేవాసమితి, 1956 మల్లికార్జునస్వామి కృపపోషిత నాటకమండలి ఏర్పడి పనిజేస్తున్నాయి.

ఈ సమాజాల్లో జె. కృష్ణమూర్తి, బి. రంగనాథం, యస్. విరూపాక్షయ్య,

అయ్యన్నగౌడ్, వెంకోబారావు, పంపన్నగౌడ, యస్. యం. రాజశేఖరయ్య, వి. తిమ్మప్ప మొదలైన కళాకారులు పనిచేశారు.

# కంబం

1957 లో భారతనాటక కళానమితి ఏర్పడి, సాంఘిక నాటకాలను ప్రదర్శిస్తూ వుంది. ఈ సమాజంలో బి. వి. రాజయ్య, యన్. కామేశ్వరమ్ మొదలైనవారు పనిచేశారు.

# మార్కాపురం

1943 లో ఆంధ్ర అమెచ్యూర్ అసోసియేషన్ స్థాపింపబడి పనిచేస్తూ వుంది. యం. యన్. శాస్త్రి, యస్. వి. నరసింహం, అద్దంకి రాఘవరావు మొదలైన నటులు పనిజేశారు.

# నంద్యాల

1890 ప్రాంతంలో కళావంతుల కులానికి చెందిన జ్యోతి సుబ్బయ్య కంపెనీ అనే ఒక ప్రఖ్యాత సంచార నాటకసమాజం వుండేది. ఆ సమాజంలో సురభి గోవిందప్ప మొదలైనవారు నటించారు, ఈ కంపెనీలో స్త్రీ పాత్రలను స్త్రీలే ధరించేవారట. 1800 ప్రాంతాల్లో ప్రప్రథమంగా స్త్రీలను స్త్రీ పాత్రలకు నిర్ణయించిన గౌరవం జ్యోతి సుబ్బయ్య కంపెనీకి దక్కింది.

1947 లో మిత్రకళానమితివి వి. శేషయ్యగారు స్థాపించారు. ఈ సంస్థలో ఆర్. రామారావు, కె. వీరయ్యాచారి, యన్. వి. శేషయ్య, ఎ. కృష్ణమూర్తి, జి. పుల్లయ్య, మగదల రామచంద్రరావు, జె. శ్రీనివాసమూర్తి, యం. యన్. మూర్తి మొదలైన నటులు పనిచేశారు.

# పత్తికొండ

1955 సం॥ రంలో పత్తికొండ తాలూకాలో రాఘవ కళానమితి స్థాపించబడింది. ఎ. వెంకటేశ్వరరావు, యన్. షరీఫ్, వనం శంకరశర్మ పనిచేశారు.

# గిద్దలూరు

రాఘవ నాటక కళాసమితిని జి కామేశ్వరరావుగారు స్థాపించారు. ఇందులో సుసర్ల గోపాలశర్మ, కన్నయ్య, వెంగయ్య నటులుగా వర్ధిల్లారు.

# కడప జిల్లా

## కడప :

కడప జిల్లాలో ప్రప్రథమంగా నాటక బీజాలను నాటినవారు సురభివారు. నలభై సంవత్సరాల క్రితం కడప జిల్లాలో ఏచూరు వెంకటరంగం, దేవరాజుల మొదలియారు అనేవారు రామవిలాస సభ ఏర్పాటు చేశారు.

రామవిలాస సభ ఏర్పాటి అనేక సమాజాలకు మార్గదర్శకంగా నిలబడి పని చేసింది. "విజ్ఞాన కళాసమితి", కోడూరు ఆంధ్ర అమెచ్యూర్ అసోసియేషన్, "లలితకళామండలి" మొదలైన సంస్థలు ఉత్సాహంగా పనిచేశాయి.

ఈ సమాజాలలో యస్. యస్. రామస్వామి, యం. సుబ్బరాజు, గుండా చారి, విశ్వనాథరావు, యం వి. సుబ్బయ్య, ఆర్. వి. శ్రీరాఘులు, వి. ఉమా మహేశ్వరరావు, జె. వి. సుబ్బారావు మొదలైన నటులు ప్రసిద్ధికెక్కారు,

# ప్రొద్దుటూరు

1945 లో భారతమాతా నాట్యమండలి, 1955 లో వాణీకళాసమితి, 1956 లో సర్వోదయనాట్యమండలి, రామలింగేశ్వర నాట్యమండలి, నటరాజ నాటకసమాజం, కృష్ణదేవరాయ నాట్యకళాసమితి, రాయల నాటక కళాపరిషత్తు, సత్యనారాయణ నాట్యమండలి మొదలైన అనేక నాటక సమాజాలు పనిచేస్తున్నాయి.

రతనాలసీమలో

## రాయల నాటక కళాపరిషత్తు :

1958 వ సం॥ రంలో రాయలసీమలో సాంస్కృతిక కార్యకలాపాలకు పేరుమోసిన ప్రొద్దుటూరు పట్టణంలో కళాభిమానులూ కళాకారులూ,

ఔత్సాహిక కళాకారులలో నిగూఢమైయున్న ప్రతిభావిశేషాలను వెలుగులోకి తేవాలనే సంకల్పంతో ఈ పరిషత్తు ఏర్పర్చి రిజిస్టరు చేయించారు. 1961 లో ఆంధ్రప్రదేశ సంగీతనాటక అకాడమీకి అనుబంధ సంస్థగా రూపొందింది.

ప్రతిసంవత్సరం ఏప్రిల్, మే మాసాలలో నాటక, నాటికల పోటీలు ఏర్పాటు చేస్తున్నారు. ఆంధ్రదేశం నలుమూలల నుండేగాక ప్రవాసాంధ్రులు కూడ ఈ పోటీల్లో పాల్గొంటున్నారు. రచనకు, ప్రదర్శనకు, నటనకు కలిపి దాదాపు 2 వేల రూపాయల బహుమతు లిస్తున్నారు. ప్రతి సంవత్సరమూ నాటకరంగంలో విశేషానుభవం గడించిన పెద్దలను సన్మానిస్తున్నారు. అనేకమంది అనుభవజ్ఞులు నాటకనిర్ణేతలుగా నిర్ణయించబడుతున్నారు. కళాకారులతో నాట్యగోష్టిని ఏర్పాటు చేసి నాటక రంగ సమస్యలను చర్చిస్తున్నారు. ఈ పరిషత్తు పోటీలకు సంగీత నాటక అకాడమీ స్వల్ప ధనసహాయం చేస్తూవుంది.

పైన వివరించిన నాటక సంస్థల్లో కొప్పరపు సుబ్బారావు, బి. యస్. రాజు, పి. వెంకటసుబ్బారావు, పి. శాంతకుమారి, కొండపేట కమాల్, పి. కృష్ణారెడ్డి, టి. నారాయణ, శ్రీమతి యశోదాదేవి, సుశీలారాణి. బలిరెడ్డి నరసింహారెడ్డి మొదలైన కళాకారులు పని చేస్తున్నారు.





# సురభి నాటకరంగం



శివాజీపేరు నిలబెట్టిన సురభివారు - జంఖండి నాటకాలు - ఈతమట్టల బొమ్మలాటలు-తోలుబొమ్మలాటలు-రంగుల్లో ఫోకసింగులు - ప్రదర్శించిన పండితుల నాటికాలు-ఆకర్షించబడ్డ ఆంధ్ర నటులు-ఎన్నో సమాజాలు - ఎందరో మహానుభావులు -

వనారస గోవిందరావు

శ్రావ్యమైన గాత్రాలు కలవారున్నారు. పాడటం ప్రారంభించారు. పాటతోపాటు ఆట ప్రారంభించారు. తరువాత కొన్ని వినోద కార్యక్రమాలను ప్రదర్శించారు. ఆ విధంగా జీవనోపాధి ప్రారంభించారు. తరువాత ఈతమట్టల బొమ్మలాటలను ప్రదర్శించారు. ఆ తరువాత తోలుబొమ్మల ఆటలను రామయ్యగారి సోదరుడైన వెంకప్ప అనే వెంకోజీ రావుగారితో కలిపి బాహాటంగా ప్రదర్శనాలనిచ్చారు. తెలుగు నేర్చుకుని రామాయణాన్నీ. భారతాన్నీ పూసగ్రుచ్చినట్లు చెప్పేవారు. పైన వుదహరించిన వెంకోజీరావుగారి దత్తపుత్రులే వనారస గోవిందరావుగారు. వీరి పూర్వులు కడపజిల్లా రాయచోటి తాలూకా సురభిగ్రామంలో స్థిరపడి నాటకాలాడడంవల్ల వీరికి సురభి అనే పేరు సార్థకమైంది.

తోలుబొమ్మలాటల తరువాత, జంఖండి నాటకాలను ప్రర్శించారు. ఖండీ గారు ఈ నాటకాలను ప్రదర్శించడంవల్ల వీటికి జంఖండీ నాటకాలని పేరువచ్చింది.

## ప్రారంభించిన ప్రథమ నాటకం :

గోవిందరావుగారు 1895 లో ప్రథమంగా "కీచక వధ" నాటక ప్రదర్శనాన్ని జయప్రదంగా ప్రదర్శించి మెప్పుపొందారు. ప్రజాదరణ లభించింది. సురభి గ్రామవాస్తవ్యులైన రామిరెడ్డి, చెన్నారెడ్డిగార్లు వీరిని వుత్సాహపర్చి, నాటక సమాజాన్ని స్థాపించమన్నారు. ఆ నాడే సురభి నాటకరంగానికి మహోదయమైంది. ధర్మవరం వాస్తవ్యులూ, హరికథా పితామహులూ అయిన రాప్తాటి సుబ్బదాసుగారిని రప్పించి కొన్ని నాటకాలను వ్రాయించి, "శ్రీశారదా మనోవినోదిని సంగీత నాటక సభ" అనే నాటక సమాజాన్ని స్థాపించారు. వరుసగా సుబ్బదాసుగారు సారంగధర—జగన్మోహిని — చంద్రకాంత— స్త్రీ సాహసం— మొదలైన నాటకాలను వ్రాశారు.


రాప్తాటి సుబ్బదాసుగారు
సురభి నాటక రచయిత

ఈ నాటకప్రదర్శనాల్లో స్త్రీలు స్త్రీపాత్రలూ, పురుషులు పురుషపాత్రలూ ధరించేవారు. ఆనాడు వారు ప్రదర్శించిన సుబ్బదాసుగారి నాటకాలన్నీ పాటల నాటకాలే. సుబ్బదాసుగారు దర్శకుడుగా వుండి, అనేక పాత్రలను ధరించి, సురభి వారి నాటకాలకు జీవంపోశారు.

1901 - 1903 నాటికి సురభినాటక సమాజం ఉన్నతస్థాయి నందుకుని, విస్తృతంగా ప్రదర్శనాల నిచ్చింది. కొందరు బందరు చేరుకుని, గరికపర్తి కోటయ్య దేవరగారి శుశ్రూషచేసి శాస్త్రియసంగీతాన్ని నేర్చుకుని, తమ నాటకాలలో ఆ సంగీతాన్ని ప్రవేశ పెట్టారు.

## విభేదాలతో విడిపోయిన అన్నతమ్ములు :

1910 ప్రాంతంలో సురభి నాటక సమాజంలో విచ్ఛిత్తి ప్రారంభమైంది. అన్నతమ్ములు విడిపోయారు. విడివిడిగా సమాజాలను స్థాపించారు. ఈ విధంగా విడివడిపోయిన సమాజాలు ఈనాటికి దాదాపు నలభై సమాజాలుగా వర్ధిల్లాయి. వీటిలో కొన్ని సమాజాలు ఆధునిక రంగస్థలపరికరాలతో ఉత్తమసంచార సమాజాలుగా వర్ధిల్లుతున్నాయి. ఈనాడు సురభి సమాజాల వారందరూ, "సురభినాటక కళాసంఘాన్ని" స్థాపించుకున్నారు. దీనికి ప్రథమ కార్యదర్శిగా కీ॥ శే॥ అవేటి నాగేశ్వరరావు బాధ్యతలు వహించారు.

## రంగుల్లో ఫోకసింగుల సింగారం :



శ్రీమతి సురభి కమలాబాయిగారు - ద్రౌపది

ఈ నాడు వారి ప్రదర్శనాలు సాంకేతికంగా వుత్తమంగా ప్రదర్శింపబడుచున్నాయి. దాదాపు వారి నాటక ప్రదర్శనం ఒక సినిమాలాగా జరిగిపోతుంది. రంగురంగుల ఫోకసింగ్ లైట్లు, స్ప్రింగ్‌వర్కుతో భూమిలోనుంచి లక్ష్మీదేవి ప్రసన్నం కావడం, పైనుంచి నారదుడు వైరువర్కు ద్వారా ప్రత్యక్షమవడం, హనుమంతుడు సముద్రం దాటి లంకకు వెళ్ళడం, దేవుళ్ళ ప్రత్యక్షాలూ, అదృశ్యాలూ మొదలైన ట్రిక్కు లన్నింటినీ ప్రవేశపెట్టి ప్రజలను ఆకట్టుకున్నారు. ఈ పద్ధతుల్లో ఈనాడు వారి సమాజాలన్నీ ఆంధ్రదేశమంతటా సంచారం చేస్తూవున్నాయి. కొంతమంది డేరాలనూ, మరి

కొందరు జింకురేకుల హాల్సునూ. కలిగివున్నారు. ప్రతి పెద్దకంపెనీకి పదిహేను వందలమంది ప్రేక్షకులు కూర్చొనటానికి వసతిగల టిన్నురేకుహాలూ. ఎలెక్ట్రిసిటీ జనరేటరూ, మైక్‌లు మొదలైన దూరశ్రవణ యంత్రాలూ, దుస్తులూ, తెరలూ, సీనరీసెట్టింగులూ, ప్రేక్షకాగారానికి కావలసిన బల్లలూ, బెంచీలూ, ఇతర రంగస్థల పరికరాలూ, వున్నాయి. వారి స్వంత సామగ్రితో అనేకమంది స్త్రీ పురుష బాల బాలికలతో కొన్ని లారీల సామగ్రితో సంచారంచేసే నాటకసంస్థలు సురభివారివి.

## పావలా వచ్చినా ప్రదర్శనం తప్పదు :

సురభి నాటక ప్రదర్శన కారులు ఒక గ్రామంలో ప్రదర్శనలు ప్రారంభిస్తే వారి నాటకాలన్నీ ప్రదర్శిస్తేకాని అక్కడనుంచి కదలరు. అందరూ హెచ్చుతగ్గులు లేకుండా కష్టపడతారు. నాటకానికి ఆదాయం పావలా వచ్చినా, పదిరూపాయలు వచ్చినా ప్రదర్శిస్తారు. ఏ పరిస్థితుల్లోనూ ప్రదర్శనం ఆగదు. ఎవరికి వారే పాత్రోచితంగా అలంకరించుకోగలరు. చిన్న వేషధారులనీ, పెద్ద వేషధారులనీ తారతమ్యాలు లేవు. అవసరాన్ని బట్టి ఏ వేషమైనా వేయడానికి ప్రతివారూ సిద్ధంగా వుంటారు. స్త్రీలూ పురుషులూ కలిసివున్నప్పటికీ ఎటువంటి పొరపాట్లు జరుగవు. వారిలో వారే వివాహాలు చేసుకుంటారు. ఒకరికి జబ్బుచేస్తే ఆ పాత్రను మరొకరు ధరిస్తారు. ప్రదర్శనం అయిన మరునాడు క్రితం రాత్రి జరిగిన ప్రదర్శన లోపాలన్నిటినీ చర్చిస్తారు. నటీనటులకు నేపథ్యంలో అనేకమంది సహకరిస్తారు. నాటకానంతరం ఎవరి దుస్తులు వారు భద్రంగా సర్దుతారు. వారి నాటక మందిరం రాత్రిపూట ప్రదర్శనశాలగానూ—పగటి పూట గురుకులంగానూ ఉపయోగపడేది. ఒకప్రక్క బాలబాలికలకు విద్యాభ్యాసమూ, ఒకప్రక్క ఆనాటి ప్రదర్శనకు కావలసిన పరికరాలను కూర్చడమూ, రాబోయే కొత్త నాటకానికి రిహార్సల్సు—డ్రస్సులు కుట్టడం — సీనరీలు వ్రాయడం — సంగీతాన్ని కూర్చడం—పోయిన సామగ్రిని తిరిగి తయారు చేయడం జరుగుతూ వుంటుంది.



వనారస చినరామయ్యగారు
(క్రూరసేనుడు)

**కృషిలో సమిష్టి కృషి :**

ఒకరి పనిలో మరొకరు జోక్యం కలుగజేసుకోరు. కాని సమిష్టిగా నాటక ప్రదర్శనానికి కావలసిన అన్ని హంగులనూ సమకూరుస్తారు. రంగానికి రంగానికి మధ్య వ్యవధిలేకుండా తెరలు ఎత్తుతూ వుంటారు. అది సురభివారి ప్రత్యేకత. కొన్ని పెద్ద సమాజాలలో ట్రాలీ స్టేజీ ఏర్పాటులుకూడా చేశారు. రంగస్థలంమీద ఒక సన్నివేశ ప్రదర్శనం జరుగుతూ వుండగా మరో సన్నివేశానికి కావలసిన సెట్టు—రంగస్థల పరికరాలను కూర్చుకుని—లైట్లు ఆర్పి మరల వెలిగించేలోగా ట్రాలీద్వారా మరో సన్నివేశాన్ని ప్రారంభిస్తారు.

**కడుపులో కోత,**

**కళ్ళల్లో ఆనందం :**

సురభి నాటకాల్లో మనం నమ్మలేనటువంటి విచిత్రాలు జరిగేవి. కన్నబిడ్డ చనిపోయినా, తల్లీ తండ్రీ ఆ శవాన్ని స్టేజివెనుక పెట్టి, ఇరువురూ చిరునవ్వులతో ప్రేయసీ ప్రియులుగా ఆ సన్నివేశం పూర్తిచేసి ప్రేక్షకుల నానందింపచేసి నాటకం ముగించి మంగళం పాడి ఆ తరువాత శవం దగ్గర చేరి భోరుమని దుఃఖించేవారు. ఇది వారి వృత్తిధర్మానికి నిదర్శనం.

ఇలాగా సురభి కళాకారులు ఆంధ్ర నాటక రంగానికి అపారమైన సేవ చేశారు. కేవలం భుక్తికొరకే గాక, కళాదృష్టితో నాటకాలను ప్రదర్శించారనే దానికి నిదర్శనం పై విచిత్రాలే చాలు.

ప్రప్రథమంగా నాటక రంగస్థలంమీద కుల స్త్రీలను ప్రవేశపెట్టిన ఖ్యాతి సురభివారిదే. తరతరాలుగా సురభివారు తెలుగు ప్రేక్షకుల ఆదరాభిమానాలను సంపాదించారు. ధనం—బంగారు పతకాలూ—కత్తులూ—గదలూ—అమృత కలశాలూ—శాలువలూ—తెరలూ బహుమతులు పొందారు. దాదాపు 80 సంవత్సరాలనుండీ నాటకాలు ప్రదర్శిస్తూ ప్రశస్తి పొందారు.

**వాసిగాంచిన**

**వనారస గోవిందరావు :**

సురభి నాటక పితామహ వనారస గోవిందరావుగారి కంపెనీ అనేక సంవత్సరాలు నడిచింది. ఆయనకు ఇద్దరు భార్యలు. ఆంధ్ర నాటక రంగంలో

అత్యంత పేరు ప్రఖ్యాతులు గడించినవారు. గోవిందరావు గారి కుటుంబం అందరూ కలిసి నూరుమంది వరకూ వుంటారు. అందరూ నటీ నటులే. సురభి కంపెనీలన్నీ గోవిందరావుగారి కుటుంబానివే. గోవిందరావుగారు 1915 వరకూ సురభి గ్రామంలోనే వుండి, తరువాత పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరు దగ్గర జోల్బానిపల్లెలో స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. ఆ గ్రామంలో విద్యావ్యాప్తికి ఒక స్కూలును స్థాపించారు. నాటక రంగంలో స్త్రీ పాత్రలకు స్త్రీలనే ప్రవేశపెట్టడం ముఖ్యమైన విషయం. సంగీత సాహిత్యాలలో ప్రావీణ్యం సంపాదించి, సురభి నాటక కంపెనీలలో నాయక పాత్రలను ధరిస్తూ వచ్చారు. సురభి నాటక మండలికి అధిపతిగా వుండి, సమర్థతతో తమ సమాజాలను నడిపారు


శ్రీ వనారస గోవింద రావు-దొంగవేషం

గోవిందరావుగారు దానధర్మనిరతులు. అనేకమంది కవులకు, నటులకు, నాటక రచయితలకు చాల సహాయం చేశారు. 1929 లో వీరూ, కాశీనాధుని నాగేశ్వరరావుగారు కలిసి అచంట సాంఖ్యాయన శర్మగారి అధ్యక్షతను ఆంధ్ర నాటక కళా పరిషత్తు స్థాపించి, ఆంధ్ర నాటక కళోద్ధారకు లనిపించుకున్నారు. ఆంధ్రదేశంలోని సాహితీపరులు, నాటక రచయితలు, కళాభిమానులు, నటులు కలిపి, 1937 లో ఏలూరులో గోవిందరావుగారి జన్మదినోత్సవం మహావైభవంగా జరిపి కృతి సమర్పణాది బహూమాన పురస్సరంగా వీరిని సన్మానించారు. ఏలూరులో వీరి శిలా విగ్రహ ప్రతిష్ఠాపన జరిగింది. ఆంధ్ర నాటక రంగానికి అపూర్వసేవ చేసిన వీరు తమ 86 వ యేట 1953 లో కీర్తిశేషులైనారు.

## ప్రదర్శించిన పండితుల నాటకాలు :

సురభివారు ఎన్నో నాటకాలను ప్రదర్శించారు. ముఖ్యంగా వారికొరకే కొన్ని నాటకాలను వ్రాయించుకుని ప్రదర్శించారు.

వారి ప్రథమనాటకం కీచకవధ. తరువాత రాప్తాటి సుబ్బదాసుగారి హరిశ్చంద్ర' శాకుంతలం, సారంగధర; మారేపల్లి రామచంద్రశాస్త్రిగారి పారిజాతాపహరణం' బిల్హణీయం; వడ్డుల చింతామణిశాస్త్రి చంద్రకాంత; శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి

## ప్రసిద్ధ నటులు



శ్రీ దాడి గోవిందరాజులు నాయుడు



శ్రీ వల్లమూడి సీతారామారావు



శ్రీ దొమ్మేటి సూర్యనారాయణ



శ్రీ ముదిగొండ లింగమూర్తి

# ప్రసిద్ధ నటులు



శ్రీమతి పి. అనసూయ



శ్రీ బింతా కృష్ణమూర్తి



శ్రీ తుంగల చలపతిరావు

## ప్రసిద్ధ నటులు



శ్రీ హరిప్రసాదరావు



శ్రీ మాధవపెద్ది వెంకటరామయ్య



శ్రీ యన్.వి.యల్. నరసింహాచారి



శ్రీ సూరపనేని లక్ష్మీ పెరుమాళ్ళు

# ప్రసిద్ధ నటులు



శ్రీ వై. సంపత్‌కుమార్



శ్రీ బెల్లంకొండ సుబ్బారావు



శ్రీ పిల్లలమఱ్ఱి సుందరరామయ్య

శూర్పణఖ గర్వభంగం, కాంతామతి; తతకలూరి కుప్పుస్వామి: మైరావణ, కాంతామతి, భల్లాణ చరిత్ర; మల్లాది అచ్యుతరామశాస్త్రి జగన్మోహన; పండిత కె. సుబ్రహ్మణ్య శాస్త్రి సంపూర్ణ మహాభారతం; చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి సీతా కల్యాణం; చక్రవధానుల మాణిక్యశర్మ కుమార విజయము, రావణచర్యలు, భక్త కబీరు; విశ్వనాథ కవిరాజుగారి "సతీసావిత్రి" "సత్యహరిశ్చంద్ర" "మహానంద" "కృష్ణావతారం" "లవకుశ" "వసంతసేన" జమీందార్"; కొప్పరపు సుబ్బారావు గారి "శ్రీసామ్రాజ్యం"; హరి పురుషోత్తంగారి "బొబ్బిలియుద్ధం" "సంపూర్ణ మహాభారతం" "సంపూర్ణ రామాయణం" "బాలనాగమ్మ" "పలనాటియుద్ధం" "ఫస్టుక్లాసు బి. ఏ." కాంతామతి; మల్లాది వెంకటకృష్ణ శర్మగారి "ప్రతిజ్ఞ" "అలెగ్జాండర్" "బాలనాగమ్మ" "దేవదాసు" "ఖూకైలాస్" "మాయాబజార్" "దక్షయజ్ఞం" "మాయలమారి" "కురుక్షేత్రం" మొదలైనవి ప్రదర్శించారు.

ఆకర్షింపబడ్డ ఆంధ్రనటులు :

దేదీప్యమానంగా వెలుగొందుతున్న ఆనాటి సురభి నాటక సమాజాలలోకి ఉత్సాహంగా వున్న అనేకమంది తెలుగు యువకులు ఆకర్షింప బడ్డారు. వారిలో గుంటూరుజిల్లా మునిపల్లె వాస్తవ్యులు వి. సుబ్బారావుగారు, ప్రహ్లాద నాటకంలో హిరణ్యకశిపుని పాత్ర ధరించేవారు. ఈయనే తొలి తెలుగుచిత్రం, హెచ్. యం. రెడ్డిగారు తీసిన ప్రహ్లాదలో హిరణ్యకశిపుడుగా నటించారు. తరువాత సురభి కమలాబాయితోపాటు, సి. యస్. ఆర్. ఆంజనేయులు, జొన్నవిత్తుల శేషగిరిరావు, కపిలవాయి రామనాథశాస్త్రి, దేసువుకొండ సుబ్బారావు మొదలైన వారందరూ సురభి నాటకాల్లో పాత్రలు ధరించారు.

నిష్ణాతులూ, నిర్వాహకులూ :

గోవిందరాయ సురభి నాట్యమండలి : ఈ సమాజనిర్వాహకులు శ్రీ వనారస సుబ్బారావు, కోటీశ్వరావుగార్లు, ఆంధ్ర నాటక కళోద్ధారకులు, ఆంధ్ర నాటక కళాపరిషత్తు సంస్థాపకులు అయిన వనారస గోవిందరావుగారి స్వంత సమాజమిది. సుబ్బారావు, కోటీశ్వరరావుగార్లు గోవిందరావుగారి పుత్రులు. ఈ సమాజం సాదాపు 80 సంవత్సరాల క్రితం స్థాపించబడింది.

శారదా విజయ నాట్యమండలి : ఈ సమాజ నిర్వాహకులు యస్. ఎ.

బాబారావుగారు, సుప్రసిద్ధ నటీమణి స్వర్గీయ పాపాబాయిగారి కోవకు చెందిన నాటకసమాజం.

శ్రీ వెంకటేశ్వర నాట్యమండలి : ఈ సమాజనిర్వాహకులు ఆర్. చిన్న వెంకట్రావుగారు. రమారమి ముప్పై ఏళ్ళుగా నడుస్తున్న నాటకసమాజ మిది.

శ్రీ గజపతి నాట్యమండలి : దీని నిర్వాహకుడు అవేటి రమణకుమార్.

శ్రీ శారదా మనోవినోదినీసభ : ప్రఖ్యాతనటులు, చిత్రకారులు, నాట్యకళా విశారద వనారస చిన్నరామయ్యగారి పుత్రులు శ్రీ అబ్బారావుగారు ఈ సమాజానికి అధిపతి.

శ్రీ వసుంధరా నాట్యమండలి : ఈ సమాజాధిపతి ఎ. రామచంద్రరావు గారు. వీరి సతీమణి ప్రఖ్యాత రంగస్థల నటీమణి శ్రీమతి వసుంధర, గోవిందరావు గారి పుత్రిక.

శ్రీ రమా సత్యనారాయణ నాట్యమండలి : సురభి నాటక సమాజాలలో ప్రత్యేకత గల సమాజ మిది. దీని నిర్వాహకులు వనారస రామయ్యగారు. జనగాం రామయ్యగారంటే చాలామందికి తెలుస్తుంది.

గోవర్ధన నాట్యమండలి : స్వర్గీయ అవేటి వెంకటస్వామిగారి పుత్రులు శ్రీ చలపతిగారు ఈ నాట్యమండలి నిర్వాహకులు.

న్యూపూర్ణానంద డ్రమెటిక్ థియేటర్స్ : 1934 లో ఈ సమాజం స్థాపించ బడింది, స్వర్గీయ అవేటి వెంకటస్వామిగారు వ్యవస్థాపకులు. శ్రీ రామయ్య. ప్రసాదరావు, నాగేశ్వరరావు, చలపతిరావుగార్లు వెంకటస్వామిగారి పుత్రులు. ఈ నలుగురూ గోవిందరావుగారి అల్లుళ్ళు. 1943 లో విడిపోయారు. అవేటి నాగేశ్వరరావుగారు పై నాటకసమాజాన్ని స్థాపించి వృద్ధి చేశారు. నాగేశ్వరరావు గారు విద్యాధికులు, ఉత్తమనటులు, ప్రధాన పాత్రలు ధరించేవారు. ఆయన భార్య చెల్లాయమ్మ. నాగేశ్వరరావుగారు సురభి నాటక సమాజాల అభివృద్ధికి పాటుపడిన వ్యక్తి. అభ్యుదయ భావాలు గలవారు. ఆంధ్రులతో గుర్తింప బడినవారు. అనేక సన్మానాలు నందుకున్నారు. సంగీత నాటక అకాడమీలోనూ, ఆంధ్ర నాటక కళా పరిషత్తులోనూ సభ్యులుగా వున్నారు.

ఎన్నో సమాజాలు,

ఎందరో మహానుభావులు :

పైన పేర్కొన్న సమాజాలే గాక సురభి నాటక కళాసంస్థకు చెందిన

26 చిన్న సమాజాలు విశాలాంధ్ర వివిధ ప్రాంతాల్లో సంచారం చేస్తున్నాయి. ఈ క్రింద వుదహరించిన వారందరూ ఆ సమాజాలను నిర్వహిస్తున్నారు.

శ్రీమతి పూర్ణిమ రామయ్య, ఆర్. పుల్లయ్య, శంభులింగం, ఆర్. వెంకోబా రావు నారాయణశాస్త్రి, వి. వెంకోబారావు, ఆర్. కామాక్షీబాయి, వి. మోహనరావు, వి. చక్రపాణి. వి. చిన్న వీరాంజనేయులు, ఆర్. సత్యనారాయణరావు, పి. తిరుపతిరావు, వి. రామచంద్రరావు, ఆర్. వెంకటసుబ్బారావు, శ్రీమతి వి. పద్మావతీబాయి, శ్రీమతి వి. గౌరీబాయి, ఆర్. మహేశ్వరరావు, ఆర్. లక్ష్మణరావు, ఎ. వెంకటరావు, వి. నీలవేణీబాయి, అర్. జయరామారావు, ఆర్. మనోరమ, వి. సత్యనారాయణ. యస్. రెడ్డప్ప, యస్. రెడ్డన్న, వి. విఠోబారావు. ఆర్, తులసీరావు మొదలైనవారు.

## రెండు తరాల నటరత్నాలు :

మొదటి రెండు తరాల్లోనూ సుప్రసిద్ధులైన సురభి నటీనటులు వెంకోజీరావు, వారి భార్య చిన్నసుబ్బమ్మ; పెద్దరామయ్య, ఆయన భార్య రామాబాయి; సురభి పాపాబాయి, జంఝూటి వెంకూబాయి, సురభి కమలాబాయి, చిన్నరామయ్య, గోవిందరావు, వారి భార్య పెద్దసుబ్బమ్మ; లక్ష్మిబాయి, అవేటి వెంకటస్వామి మొదలైనవారు.

## ప్రసిద్ధులైన సురభి నటులు :

అవేటి నాగేశ్వరరావు, కృష్ణాజీరావు, సుబ్బారావు, అబ్బాజీరావు, పుల్లయ్య, వి. వి, సుబ్బారావు, బాబురావు, ఉత్తమరావు, వి. అంజనేయులు, ఎ. బాబారావు, యస్. యల్. పాపారావు, యస్. రామచంద్రరావు, శ్రీమతి ఎ. ధనలక్ష్మిదేవి, శ్రీమతి అవేటి పూర్ణిమ, శ్రీ సుబ్బయ్య, నటనా ప్రవీణ యస్. ఎ. ప్రకాశ్, శ్రీమతి శకుంతలాదేవి, శ్రీమతి కోటీశ్వరిదేవి, శ్రీమతి చంద్రకుమారి, బి. సత్యవతి, సుబ్బయ్యనాయుడు, శ్రీమతి వసుంధరాదేవి, నవరత్నం, శ్రీమతి నాగలక్ష్మి, ఆర్. సుభద్ర, సురభి బాలసరస్వతి, విజయాంబ, లక్ష్మి. శ్రీమతి లక్ష్మమ్మ, కోటీశ్వరరావు, యం. నారాయణరెడ్డి, భువన లక్ష్మిదేవి, శ్రీమతి వి. కృష్ణవేణి, శ్రీమతి అనసూయ, ఆర్. భోజరాజు, ఆర్. వెంకట్రావు, వి. వెంకట్రావు మొదలైనవారు.

# చిత్తూరు జిల్లా

## చిత్తూరు :

చిత్తూరులో 1920 వ సంవత్సరంలో శ్రీరామవిలాస సభను బ్రహ్మాండం నరసింహారావుగారు స్థాపించారు. ఈ సమాజానికి కార్యదర్శి బాధ్యతల్ని కూడా ఆయనే నిర్వహించేవారు ఈ సమాజ సభ్యులందరూ మధ్య తరగతికి చెందిన మేధావులు, ప్లీడర్లు, ఇతర వుద్యోగులు. నరసింహారావుగారి తరువాత టి. వి. రంగాచార్యులుగారు అధ్యక్షులుగాను, కె. వరదాచారి, టి. వి. శేషాద్రి కార్య దర్శులుగాను పనిచేశారు. ఈ సంస్థలో పనిచేసి దీని అభివృద్ధికి పాటుపడినవారు మాడభూషి అనంతశయనం అయ్యంగారు, ఆర్. బి. రామకృష్ణంరాజు, బొల్లిని మునిస్వామి నాయుడు, గొల్లపూడి శ్రీరామశాస్త్రి, పి. దొరస్వామి అయ్యంగార్, సుప్రసిద్ధ చలనచిత్రనటులు పద్మశ్రీ వి. నాగయ్య, కె. రాఘవేంద్రరావు, పి. నరసింహయ్య మొదలైనవారు. వి. నాగయ్యగారు ఈ సమాజంలో నటుడుగా, గాయకుడుగా, హార్మోనిస్టుగా బహుముఖాల సేవ చేశారు. వీరు ప్రదర్శించిన నాట కాలలో ముఖ్యమైనవి రామదాసు, బృహన్నల. బళ్ళారి రాఘవాచార్యులు, పర్వత రెడ్డి, రామచంద్రారెడ్డి, స్థానం మొదలైనవారు రామవిలాస సభ నాటకాలలో పాల్గొన్నారు. ఈ సమాజ నాటకాలకు రాయప్రోలు సుబ్రహ్మణ్యంగారు నాట్యశిక్షణ యిస్తూ వుండేవారు. ఈయన సభ నాటకాలలో నాయక పాత్రలను ధరిస్తూ వుండే వారు. వీరేకాక కె. రాఘవేంద్రరావు, వి. నాగేశ్వరయ్య, పి. నరసింహయ్య మొదలైనవారు కూడ ఉత్తమ నటులుగా పేరుపొందారు.

1920 నుండీ చిత్తూరు నాటకరంగంలో రామవిలాస సభ దేదీప్యమానంగా వెలుగొందింది. 1949 లో యస్. జి. ఓస్ డ్రమెటిక్ .అసోసియేషన్ స్థాపించ బడింది. 1945 లో ఆర్టులవర్స్ అసోసియేషన్, 1952 లో వాణీ కల్చరల్ అసో సియేషన్ మొదలైన సమాజాలు కూడా నడపబడుతూ వున్నాయి.

ఈ సమాజాలలో డి. శ్రీనివాసాచారి. యస్. రాఘవేంద్రరావు, కె. రామ స్వామి అయ్యంగార్, పి. నరసింహయ్య, కె. వీరభద్రాచార్య, పరసు వెంకట మునుస్వామిశెట్టి మొదలైనవారు నటులుగా పనిచేశారు

# తిరుపతి

1930 లో తిరుపతి అమెచ్యూర్స్ అసోసియేషన్, 1948 లో లలితకళా సమితి, 1954 లో వెంకటేశ్వర నాట్యమండలి, 1950 లో ఆర్టు క్రియేటర్ అసోసియేషన్ మొదలైన సంస్థలే గాక, దేవస్థానం నాటక సంఘం, సరస్వతి విలాస సభ, టి. టి. డి. ఎంప్లాయీస్ కల్చరల్ అసోసియేషన్, బాపూజీ నాట్యకళాసమితి, రాఘవ కళామండలి మొదలైన నాటక సంస్థలు పనిచేశాయి.

ఈ సంస్థల్లో శ్రీరాములు నాయుడు, సుందరం, పి. నాగేశం, ఆర్. వి. వరసింహం, ఎ. కృష్ణారావు, రామచంద్రారెడ్డి, దామోదరం, రాజారెడ్డి, కుమారి లీలావతి, సుశీల, రేవతి, శ్యమంతకుమారి మొదలైన నటీ నటులు పనిచేశారు.

# కాళహస్తి

1946 నవ్యకళామండలి ఏర్పడి పనిచేస్తూ వుంది. ఎ. సుబ్రహ్మణ్యం, ధర్మయ్య మొదలైన నటులు పనిచేస్తున్నారు.

# కుప్పం

1936 లో కంగుంది లలితకళా సమితి ఏర్పడి, తెలుగు నాటకాలను, తమిళ నాటకాలనూ ప్రదర్శిస్తూ వచ్చింది. ఈ సంస్థలో సంపంగి రామయ్య, యస్. నారాయణయ్య, కృష్ణమయ్య, వికటకవి సుబ్బయ్య మొదలైనవారు పనిచేశారు.

# మదనపల్లి

1915 లో బిసెంట్ థియోసాఫికల్ కాలేజి అసోసియేషన్, 1959 లో విజయ కళాసమితి, రిషివాలీ స్కూల్ నాట్యమండలి మొదలైన సంస్థలు పని చేస్తున్నాయి. నాటకాల్లో ఎ. రామాచారి మంచి నటుడుగా పేరు తెచ్చుకున్నారు.

# అనంతపురం జిల్లా

అనంతపురం :

అనంతపురంలో 1922 లో 12 వందలమంది సభ్యులతో జిల్లా నాన్ గెజిటెడ్ గవర్నమెంటు ఆఫీసర్సు నాటక సమాజం ఏర్పడింది. 1950 లో ఆదర్శ విజ్ఞాన సమితి, 1955 లో లలితకళా పరిషత్తు, చన్నకేశవ నాట్యమండలి, రాఘవ నాటక సమితి మొదలైన సమాజాలు ఏర్పడి పనిచేశాయి.

ఈ సమాజాలలో కె. సత్యరంగారావు, నాటక పాఠశాల ప్రిన్సిపాల్ రొద్దం హనుమంతరావు, వై. రామాంజనేయులు, జగన్నాధాచారి, కుమారి సావిత్రి, జి. వెంకటరెడ్డి, అడ్వొకేట్ చౌడన్నగౌడు, లక్ష్మీదేవి మొదలైన నటీ నటులు పనిచేశారు.

# పెనుగొండ

1954 లో బోర్డు హైస్కూలు కల్చరల్ అసోసియేషనూ, ఫ్రెండ్సు డ్రమెటిక్ అసోసియేషనూ అనే రెండు నాటక సమాజాలు పనిచేస్తున్నాయి. ఈ సమాజాల్లో జి. జానకిరామ్, టి. సుబ్రహ్మణ్యశాస్త్రి మొదలైన కళాకారులు పనిచేశారు.

# హిందూపురం

1958 లో లలితకళా సమితి. 1957 కర్ణాటక సంఘం అనే సంగీతశాఖ స్థాపించబడి పనిచేస్తున్నాయి. ఈ సంస్థల్లో పక్కా నరసింహారావు, గోపీనాథరావు, మసూద్ అలీ, పాణ్యం చంద్రమౌళి మొదలైనవారు నటులుగా పనిచేశారు.

# గుంతకల్లు

1945 లో రైల్వే ఇన్‌స్టిట్యూట్ కళాసమితి ఏర్పడి ఆదర్శమైన కృషి చేస్తూవుంది. ఫైన్ ఆర్ట్సు అసోసియేషన్, నటరాజ నాట్యమండలి, వై. ఎన్.

యమ్. మండలి, రామా నాట్యమండలి, తెలుగు భారత సమితి, శ్యామలా నాట్య మండలి, ప్రభ నాట్యమండలి మొదలైన కళాసంస్థలు కూడా పనిచేశాయి.

ఈ సంస్థల్లో కె. వి. గోవిందరాజులు, రామమూర్తి, అట్లూరి బలరామ్, జనార్దన, హొన్నూర్ సాహెబ్, మీనాక్షినాయుడు, శ్రీమతి నాగరత్నమ్మ మొదలైన కళాకారులు పనిచేశారు.

# కల్యాణదుర్గం

కల్యాణదుర్గం తాలూకా తూముకుంట గ్రామంలో 1890-1910 ప్రాంతాల్లో ఆ వూరి కరణం గుండూరావుగారు 'శ్రీహరి హరేశ్వర సహాయ నాటక కంపెనీ' స్థాపించి అనంతపురం జిల్లా అంతటా నాటక ప్రదర్శనాల నిచ్చారు. ఆనాడు అనంతపురం జిల్లాలో ఈ కంపెనీకి గుండూరావు కంపెనీ అనే పేరు సార్థకమైంది. ఆయన కళాశీలి. మంచి నటుడు, శాస్త్రీయ సంగీతం తెలిసినవారు ఆ సమాజ నాటకాలకు ఆయనే ప్రయోక్త.



# తెలంగాణా నాటకరంగం



తెలంగాణా నాటక కళ: భజన కోలాటాలు, చిరతల రామాయణం, చక్క భజనలు, సంగీత నాటక అకాడమి, నాట్యసంఘం, రవీంద్ర భారతి; హైదరాబాదు, సికిందరాబాదు, ఖమ్మం, వరంగల్, మెదక్, కరీంనగర్, అదిలాబాద్ మొదలైన జిల్లాల నాటక రంగాలు

# తెలంగాణా నాటకాలు

వనపర్తి :

తెలంగాణాలో రెండు మూడు శతాబ్దాలలో కొంతమంది సంస్కృత నాటక కవులు వెలిశారు. వీరిలో వనపర్తి సంస్థానాధీశుల్లో ఒకరైన శ్రీ అష్టభాషా బహిరీ



గోపాలరావుగారు 17 వ శతాబ్దంలో 'రామ చంద్రోదయం' అనే సంస్కృత నాటకాన్ని తొలిగా రచించారు సంస్కృతంలో ప్రౌఢ శైలిలో రచించడమే గాక సుబోధకంగా వ్యాఖ్యను కూడా రచించారు. అంతేగాక 'శృంగారమంజరీభాణము' అనే ఒక దృశ్య ప్రబంధాన్ని కూడ రచించారు. ఈ రెండు గ్రంథాలో ముద్రింపబడి నేటికీ వనపర్తి సంస్థాన గ్రంథాలయంలో భద్రపరచబడి వున్నాయి. ఈయనకు ఎనిమిది ప్రాకృత భాషలు వచ్చు. అందువల్లనే అషభాషా బహిరీ గోపాలరావుగారనే పేరు వచ్చింది.

గత శతాబ్దంలోనూ, ఈ శతాబ్దంలోనూ ఆత్మకూరు, గద్వాల, వనపర్తి, సురపురము, గోపాలపేట మొదలైన సంస్థానాల్లో విద్వాంసులు, కవులు వెలిశారు. మహబూబ్ నగర్ జిల్లాలో అనేకమంది సంస్కృత విద్వాంసు లుండేవారు. వారిలో ప్రౌఢసరస్వతి అనబడే బుక్కపట్టణం శ్రీనివాసాచార్యులు, వనపర్తిలో శ్రీ హస దుర్గం కృష్ణమాచార్యులు మొదలైనవారు అనేక గ్రంథాలను, నాటకాలను రచించారు.

19 వ శతాబ్దంలో కీర్తిశేషులు మాదిరాజు విశ్వనాధరావుగారు కాళిదాసుని శాకుంతలాన్ని తెనిగించారు. విశ్వనాధ రావుగారు, కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు కలిపి, బిల్హణుని 'కర్ణసుందరి' అను నాటికను తెనిగించారు.

ఏమైనా ఆంధ్రదేశంలో నాటక కళాభివృద్ధి జరిగినంత తెలంగాణాలో జరుగ లేదు. ఈ శతాబ్దంలో మాత్రం కొన్ని ఉత్తమ నాటకాలు వెలువడ్డాయి. వాటిలో

కీ॥ శే॥ మాదిరాజు విశ్వనాథరావుగారి ఉచ్చల నాటకము, కీ॥ శే॥ సురవరం ప్రతాప రెడ్డిగారి 'భక్త తుకారాం' ఉత్తమశ్రేణికి చెందిన నాటకాలు. వీ రిరువురి తరువాత భాగి నారాయణ మూర్తిగారు పరీక్ష చదువు, డాక్టరు యజ్ఞం అనే రెండు ఉత్తమ నాటకాలను రచించారు.

చిల్లర భావనారాయణగారు 'కళాభిమాని' 'దేశద్రోహం' 'ఉప్పెన' 'కామందు' 'పరిణామం' 'కొత్తమనిషి' 'పదవులు - పెదవులు' అనే నాటకాలను వ్రాశారు.

ఇంకా ఎ. ఆర్. కృష్ణగారు అరగంటలో అదృష్టం, ఎక్కడికి, కల్లోలం, దేశంకోసం చేసిన నేరం మొదలైన నాటకాలను వ్రాశారు

తరువాత పేర్కొనదగినవారు పి. నారాయణరెడ్డిగారు, యువకవి. ఈయన గేయాలనే కాక 'ఋతువులరాణి' నవ్వనిపువ్వు' 'వలపురేడు' 'రామప్ప' 'అజంతా సుందరి' 'ఊర్మిళ' 'సుగాత్రి' మొదలైన నాటికలు రచించారు వీరి నాటికలు ఎక్కువగా రేడియోలో ప్రసారం చేయబడి, విశేష ప్రజాభిమానాన్ని చూరగొన్నాయి

గిడుతూరి సూర్యంగారు ఆహుతి, మానవుడు నాటికలను రచించారు.

పోతుకూచి సాంబశివరావుగారు ఇదీతంతు, ప్రతిధ్వనులు, ఏడుసున్నలు, రెండు నాటికలు మొదలైన నాటికలను రచించారు. ఇంకా భట్టిప్రోలు జయరామారావు త్యాగయ్య, అవసానం, అప్పాజీ నాటికలనూ; వట్టికోట ఆళ్వారుస్వామి మేధావి నాటికనూ, కె. యల్. నరసింహారావు గెలుపునీదే. ఆదర్శలోకాలు అనే నాటికలనూ చక్కని నైపుణ్యంతో వ్రాశారు.

ఈనాడు అనేకమంది యువ రచయితలు బయలుదేరారు. వీరికి ఆంధ్ర సాహిత్య పరిషత్తు, సాధన సమితి, తెలంగాణా రచయితల సంఘం దోహద మిస్తూ వున్నాయి.

# హైదరాబాదు జిల్లా

హైదరాబాదు :

1906 ప్రాంతంలో హైదరాబాదులో ధర్మవరం గోపాలాచార్యులుగారు 'కృష్ణవిలాసినీ' సభను స్థాపించి జయప్రదంగా కొంతకాలం నడిపారు.



1910 ప్రాంతంలో శ్రీమతి సరోజినీనాయుడు మేనల్లుడు ఇనుగంటి 'హైదరాబాదు అమెచ్యూర్స్' అనే నాటక సమాజాన్ని స్థాపించి కొన్ని నాటకాలను ప్రదర్శించారు. ఇనుగంటి ఆ రోజుల్లో ప్రసిద్ధ నటుడు.

పై సమాజంలో నుంచి చీలిపోయిన కొందరు నటులు 1915 లో ఫ్రండ్స్ యూనియన్ స్థాపించి ఆంగ్ల నాటకాలను ప్రదర్శించారు. ఈ సమాజ నటులలో ఎస్. నారాయణదాస్ మంచి నటుడు.

హైదరాబాదులో కళామండల్ అనే మహారాష్ట్ర సమాజమూ, దానితోపాటు మరికొన్ని సమాజాలూ పనిచేశాయి.

## ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి

దాదాపు 12 సంవత్సరాల క్రిందట ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ నాటి విద్యామంత్రి యస్. బి. పి. పట్టాభిరామారావుగారి పర్యవేక్షణలో ఆర్. బి. రామకృష్ణంరాజు అధ్యక్షతను హైదరాబాదులో ప్రభుత్వ స్థాయిలో స్థాపించబడింది. ఈ సంస్థలో ఆంధ్రదేశంలోనున్న సంగీత, నృత్య, నాటక రంగాలలో ప్రసిద్ధులైన అనేకమంది ప్రముఖులు దాదాపు 75 మంది కౌన్సిల్ సభ్యులుగా వున్నారు.

అకాడమీ స్థాపించిన తరువాత కూచిపూడి నాట్య సదస్సు, నాటక సదస్సు, సంగీత సదస్సు, హరి కథా గాన సదస్సు మొదలైన వుత్సవాలు జరిగాయి.



ప్రతి సంవత్సరమూ ఆంధ్రప్రదేశ్ సంగీత సభల సమాఖ్య నిర్వహణలో సంగీతోత్సవాలు—

ఆంధ్రనాటక కళాపరిషత్తు అధ్వర్యంలో నాటకోత్సవాలు-

ఆంధ్రప్రదేశ్ నృత్యకళా పరిషత్ నిర్వహణలో నృత్యోత్సవాలు—

కథా గాన కళా పరిషత్ నిర్వహణలో హరికథోత్సవాలు జరుపబడుతూ వున్నాయి.

అకాడమీ అధ్వర్యాన ప్రతినెలా 'నాట్యకళ' పత్రిక వెలువడుతూ వుంది. సంగీత, నృత్య, నాటక సమస్యలమీద వ్యాసాలు ప్రచురించబడుతూ వున్నాయి. ఈ పత్రికకు ప్రధాన

సంపాదకులు పసల సూర్యచంద్రరావు. రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పోతుకూచి సాంబశివరావు, డా. పి. యస్ ఆర్. అప్పారావు, ఎ. ఆర్. కృష్ణ, శ్రీనివాస చక్రవర్తి మొదలైనవారు సంపాదకవర్గ సభ్యులుగా వ్యవహరిస్తున్నారు.

ఈ అకాడమీ వృద్ధాప్యంలో వున్న కళాకారులకు ప్రతి నెలా వృద్ధాప్యపు వేతనాన్ని 40 మందికి యిస్తూ వుంది.

సంగీత, నృత్య, నాటక విషయాలకు సంబంధించిన కొన్ని గ్రంథాలను ప్రచురించింది.

ఆంధ్రదేశంలో అనేక అనుబంధ నాటక సంస్థలకు గ్రాంటుల నిచ్చి పోషిస్తూ వుంది.

విజయవాడ, అనంతపురం పట్టణాల్లో అకాడమీ తరపున నాట్య విద్యాలయాలు నడపబడుతున్నాయి.

రాష్ట్రేతర ప్రాంతాలకు ఆంధ్రదేశం నుంచి సాంస్కృతిక బృందాలను పంపిస్తూ వుంది.

ఈనాడు అకాడమీ కార్యక్రమాలకు రథసారథిగా పసల సూర్యచంద్ర రావుగారు వ్యవహరిస్తున్నారు

## ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం :

ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం 1954 లో యం. చెన్నారెడ్డి, యం. ఆనందం, ఏ. ఆర్. కృష్ణ మొదలైన కళాకారుల అధ్వర్యంలో ఏర్పడి పనిచేస్తూ వుంది.

యునెస్కో ఇంటర్ నేషనల్ థియేటరు ఇన్ స్టిట్యూటుకు అనుబంధ సంస్థగా భారతీయ నాట్య సంఘం పనిచేస్తూ వుంది; భారతీయ నాట్యసంఘానికి అనుబంధ సంస్థగా ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం పనిచేస్తూ వుంది.

ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘం రాష్ట్రంలోని 70 నాటక సంస్థలకు ప్రాతినిధ్యం వహిస్తూ వుంది.

హైదరాబాదు రవీంద్ర భారతిలో ఒక నాట్య విద్యాలయాన్ని నడుపుతూ వుంది.

ప్రతి సంవత్సరమూ నాటకోత్సవాలను జరిపి ఔత్సాహిక నటులకు ఉత్సాహాన్నిస్తోంది.

నెలవారీ కార్యక్రమాలను, రిపర్టరీథియేటర్, నాట్యమిత్ర. స్పీచ్ సర్కిల్' నటీనటుల రౌండుటేబిల్, నాటక రచయితల రౌండు టేబిల్, థియేటర్ సర్వీసు మొదలైన నూతన పథకాలతో నాట్యసంఘం పనిచేస్తూ వుంది. జంటనగరాల్లో జరిగే అనేక సాంస్కృతిక కార్యక్రమాల్లో నాట్యసంఘం కార్యకర్తలు ప్రముఖ బాధ్యతల్ని వహిస్తున్నారు.

రాష్ట్రేతరప్రాంతాలనుండి వచ్చే సాంస్కృతిక బృందాలను ఆహ్వానించి ప్రదర్శనాల నిప్పించటంలో కూడా నాట్యసంఘం బాధ్యత వహిస్తూ వుంది.



నాట్యసంఘంలో శ్రీ సీలం సిద్ధారెడ్డి, డా. పి. యస్.ఆర్. అప్పారావు, జి. కృష్ణంరాజు, ఎ.ఆర్. కృష్ణ, పోతుకూచి. గోవిందుచౌదరి, వి. వి. మాణిక్యాలరావు, వాసిరెడ్డి సీతాదేవి మొదలైన ప్రముఖులు నాట్యసంఘ కార్యకర్తలుగా కృషిచేస్తున్నారు.

## రవీంద్రభారతి :

ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాదులో రవీంద్రభారతి ఒక అలంకారం. జంటనగరాల కళాకారులకు అది ఒక కళా కేంద్రం. అఖిలాంధ్ర ప్రజలకు గర్వకారణం రవీంద్ర భారతి. ఈనాడు రవీంద్ర భారతిలో ప్రతిరోజూ ఏదో ఒక సాంస్కృతిక కార్యక్రమం జరుగుతూ వుంది. విదేశాలనుండి, ఇతర రాష్ట్రాలనుండి, ఏ కళాకారుల బృందం వచ్చినా వారి ప్రదర్శనాలన్నీ రవీంద్ర భారతిలోనే జరుగుతున్నాయి.

నగరం కూడలిలో ఎత్తయిన ప్రదేశంలో సుందరభవనంగా రవీంద్రభారతి వెలుగొందుతూ వుంది. ఇది జంటనగరాల కళాకారుల నెందరినో వుత్సాహపర్చి వుత్తేజపర్చింది.

కేవలం నాటక ప్రదర్శనాలేకాక, అనేక సభలు, సన్మానాలు, గోష్టులు జరుగుతూ వున్నాయి. రవీంద్రభారతి ఆవరణలోనే ఆంధ్రప్రదేశ్ నాట్యసంఘ కార్యాలయమూ, నాట్య విద్యాలయమూ పనిచేస్తున్నాయి. సంగీతనాటక అకాడమి, సాహిత్య అకాడమి, లలితకళా అకాడమి కార్యాలయాలు కూడ కళాభవన్ పేరుతో పని చేస్తున్నాయి. రవీంద్రభారతి మేనేజరుగా ప్రసిద్ధనటుడు పాతూరి శ్రీరామశాస్త్రి పనిచేస్తున్నారు.

## ఇతర నాటక సమాజాలు :

1932లో కళామండలి, 1949లో దుర్గాకళా నాట్యమండలి, ఆదర్శ నాట్యకళా పరిషత్తు, 1953లో సన్మిత్ర నాట్యమండలి, లలితకళానికేతన్, 1957లో ఇండియన్ నేషనల్ థియేటరు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి, ఫైన్ ఆర్ట్సు అకాడమి, విద్యానగర్ కల్చరల్ అసోసియేషన్, సెక్రటేరియట్ కల్చరల్ అసోసియేషన్, శ్రీ కళానికేతన్, అంజమాన్ ఉరుదు థియేటర్, సాధనసంఘ్, లలితకళా సమితి, రోడ్ ట్రాన్స్‌పోర్టు రిక్రియేషన్ క్లబ్, బెంగాలిసమితి, ఇండియన్ ఆర్ట్స్ సొసైటీ, ఇన్‌కంటాక్సు రిక్రియేషన్ క్లబ్, కాశీ కల్చరల్ అసోసియేషన్, కళాకుసుమ్, కళానికేతన్, అజంతా ఆర్ట్సుథియేటర్, ఆనంద లలితకళాసంఘ్, నాట్యకళా నికేతన్, హైదరాబాద్ హిందీ ప్రచార్‌సంఘ్, హైదరాబాద్ కల్చరల్ సొసైటి, విద్యార్థి కళాసమితి, హిందుస్తానీ కల్చరల్ సొసైటి, వై. యం. సి. ఎ. క్లబ్, హైదరాదాదు టీచర్స్ అసోసియేషన్, కైలాసమిత్రమేళా, నాటకమండలి, సి. పి. యస్. టీచర్సు అసోసియేషన్ మొదలైన నాటక సమాజాలు ఏర్పడి పనిచేశాయి.

## నటీ నటులు :

ఈ సమాజాలలో టి. టి. నరసింహాచార్య, ఎ. ఆర్. కృష్ణ, యస్. ఆర్. మంత్రి, పన్నూరి రామారావు, టి. కృష్ణమోహన్‌రావు, యం. వెంకటరావు, రామచంద్రమూర్తి, వి. వి. రాఘవాచార్య, రామబ్రహ్మమ్, డాక్టర్ రామయ్య, వి. పూర్ణచంద్రరావు, టి. యన్. శేషాచారి, బి. ఆనందమోహన్, ఓ. డి. నరసింహారావు, శ్రీనివాసనాయుడు, యస్. గోపాలమూర్తి, వి. ఆనందమోహన్, రబీంద్రనాథ టాగూరు, వక్కలంక కామరాజు, కె. వీర్రాజు, కాంతాపతక్, యన్. జి. మల్పాకర్, వసంతగాడ్సే, శ్రీమతి లీలాసుందరయ్య, కుమారి వాణి, శ్రీమతి తారాబాయి, యం. విజయలక్ష్మి, యం. జి. మిరాల్, శ్రీమతి రత్నప్రసాద్, వి. యస్. రమాదేవి, శ్రీమతి చిన్నమ్మ, శ్రీ ప్రభావతిదేవి, పి. యస్. రామారావు, సి. ఆర్. కె. చారి, యం. లక్ష్మీనారాయణ, సురేందర్, పి. పి. నాయుడు, కుమారి వనజ, యస్. శ్రీనివాసరావు, యం. అప్పారావు, యం. శేషగిరిరావు, పి. కొండరాజ్, కోకా రాఘవరావు, సీతారామస్వామి, భాగి నారాయణమూర్తి, ఎ.కృష్ణారావు, కె. వి. సుబ్బారావు, శాంతకుమార్, పి. యన్. వెంకటేశ్వరరావు, కుమారి కె. లక్ష్మి, కుమారి విజయలక్ష్మి, కుమారి పద్మ, శ్రీ రూప్‌లాల్, రుక్మిణి, లలిత

## ప్రసిద్ధ నటులు



శ్రీ గుమ్మడి వెంకటేశ్వరరావు



శ్రీ వంగర వెంకటసుబ్బయ్య



శ్రీ జి.యస్.ఆర్. మూర్తి

## ప్రసిద్ధ నటులు



శ్రీ పుప్పలూరి సంజీవరావు



శ్రీ టి.యల్. కాంతారావు



శ్రీమతి రాజసులోచన

## ప్రసిద్ధ నటులు

శ్రీ పాతూరి శ్రీరామశాస్త్రి





శ్రీ భాగవతుల రామకోటయ్య

## ప్రసిద్ధ నటులు



శ్రీ వి. రామన్న పంతులు



శ్రీ కొడాలి ఆదిశేషయ్య



శ్రీ మద్దాలి శేషగిరిరావు

సతీ, ఎ. జె. సోమసుందరం, యన్. నారాయణదాస్, నాగేశ్వరరావు, వెంకటేశ్వర రావు, పి. కనకదుర్గ, పి. లక్ష్మీపతి, న్యాపతి రాఘవరావు, న్యాపతి కామేశ్వరమ్మ, గిడుగు సీతాపతి, గిడుగు వెంకటరామమూర్తి మొదలైన నటీ నటులు పనిచేశారు.

ఆర్. యన్. కోలేకార్, బాబురావు, రాజారామ్, ఖాపట్కార్ మొదలైన వారు మేకప్ శాఖలోనూ-

జి. హెచ్. జాఫ్రి, ములాజ్‌కర్, యస్. యన్. రామమూర్తి జె. యల్. విలియమ్స్, లీలా సుందరయ్య, యస్. గోపాలమూర్తి మొదలైనవారు స్టేజి క్రాఫ్టులోనూ పనిచేస్తున్నారు

యక్షగాన దళాలు, చిరతల రామాయణం సమాజాలు, కోలాట బృందాలు, బగ్గుగొల్లల దళాలు పనిచేశాయి.

# సికిందరాబాదు

సికిందరాబాదులో సి. టి. మోహనరంగంపిళ్ళెగారు 1913 లో వాణీ విలాస సభను స్థాపించారు. రాజా నాగన్న దేవిడీలో నాటకాలను ప్రదర్శించే వారు. మోహనరంగంపిళ్ళె నాయక పాత్రలు ధరిస్తే, కె. శేషయ్యగారు నాయక పాత్రలు ధరించేవారు. విజయవాడ మైల వరం కంపెనీలో ప్రఖ్యాత హార్మోనిస్టుగా పేరుపొందిన ఎ. టి. రామానుజులుగారు ప్రథమంలో ఈ సమాజంలో పనిచేశారు. ఈ సమాజం సర్కారు ప్రాంత ముఖ్య పట్టణాలలో ప్రదర్శనాల నిచ్చింది. సరస్వతీ సభ అనే ఒక సమాజమూ, 1919 లో 'శ్రీకృష్ణ మనోల్లాసినీ సభ' అనే నాటక సమాజము కూడా ఏర్పడి కొంతకాలం పనిచేశాయి. పై నాటక సమాజాల్లో అనేకమంది కళాకారులు పాల్గొన్నారు. ఈ సమాజంలో పి. ఎమ్. వేణుగోపాలస్వామిగారు ప్రసిద్ధ నటుడుగాను,



దర్శకుడుగాను పేరు పొందారు. ఈ సమాజాలకు శ్రీ విశ్వనాధశాస్త్రిగారు నాటకాలను వ్రాసి ఇచ్చారు

1932 ప్రాంతంలో సురవరం ప్రతాపరెడ్డిగారి భక్త తుకారాం నాటకాన్ని సికిందరాబాదు రైల్వే ఉద్యోగులైన బుచ్చయ్యగారు, పలువురితోకలిసి 'జగదీశ నాట్యమండలిని' స్థాపించి ఒక్క తెలంగాణాలోనే కాక విజయవాడ, గుంటూరు, మద్రాసు మొదలైన సర్కారు ప్రాంతంలో ప్రదర్శించి మంచి పేరు సంపాదించారు. తుకారాం పాత్రధారణలో బుచ్చయ్యగారు గణనీయమైన పేరు తెచ్చుకున్నారు.

1930 ప్రాంతంలో 'ఆంధ్రమిత్రమండలి' నాటక సమాజం అడిగ్ మెట్‌లో స్థాపించబడి కొంతకాలం పనిచేసింది.

1949 లో నాట్యకళాసమితి, 1951 లో నవకళాకేంద్రం, 1952లో విస్తృతి నాట్యమండలి, 1953 లో విజయకళాసమితి, 1956 లో రవీంద్ర కళామందిర్, 1957 లో కాళిదాస కళానిలయం, నాటక సమితి, సౌత్ ఇండియన్ ఇన్‌స్టిట్యూట్, అరుణోదయ నాట్యమండలి, చంద్రకళామందిర్, కళోదయ సమితి, సౌత్ సెంట్రల్ రైల్వే ఇన్‌స్టిట్యూట్ కల్చరల్ అసోసియేషన్, సోషల్ వెల్‌ఫేర్ సెంటర్, హిందు యువజన సంఘం, అభ్యుదయ ఆర్ట్సు, విస్తృత కళాసమితి, జయహింద్ నాట్యమండలి మొదలైన అనేక సమాజాలు ఏర్పడి పనిచేశాయి.

## నటీ నటులు :

ఈ సమాజాలలో డి. రాజేశ్వరరావు, యం. వి. చలపతిరావు, సి. చలపతిరావు, శ్రీరామమూర్తి, కందా మోహన్, వి. ఆనందమోహన్, కుందు, రమేష్, కళా సుబ్బారావు, సి. అంజనేయులు, వై.పి. విఠల్‌రావు, పోతుకూచి సాంబశివరావు, యం. రంగారావు, ఐ. సత్యనారాయణ, ఎ.కె. ఛాయాదేవి, యం.యల్. పతి, బి. భానూప్రకాష్, యన్. యస్. కృష్ణ, జి. వెంకటరావు, వి. బి. నారాయణ, మాస్టర్ రాము, శ్రీమతి కస్తూరి, సీతాకుమారి, జె. ఎస్ కృష్ణశాస్త్రి, ఎన్. రాధాకృష్ణ, మహదేవ్, వై. పి. విఠల్‌రావు, మురళీధర్. టి. నరసింహారావు, ఆనందరావు. ఆర్. హనుమంతరావు, వి. నాగేశ్వరరావు, మురళీకృష్ణ, కె. సూర్యనారాయణ, సులోచనా రాణి, సి. హెచ్. నరసింహం, హరిమూర్తి, డి. కోటయ్య, జి.వి.ఆర్. ప్రసాద్, ఆంజనేయశర్మ, యన్. పాండురంగ విఠల్, పి. శేషుబాబు, కె. సాంబశివరావు, యం. మదనమోహన్, యం. రామమోహన్ టి. నాగరాజు, శ్రీమతి పార్వతి,

యస్. కె. ఆంజనేయులు, కోట సత్యనారాయణమూర్తి, జి. సత్యనారాయణ, బాబు రావు, యన్.సి.యస్. వేణుగోపాల్, బి. కృష్ణరాజు మొదలైన కళాకారులు పని చేస్తున్నారు.

బక్షీ శ్రీరాం. టి. శివరామకృష్ణ మొదలైనవారు స్టేజి క్రాఫ్ట్‌లో కృషి చేస్తున్నారు.

# హయత్‌నగర్

1948 లో సరస్వతి నాటక కళామండలి, 1954 లో హనుమాన్ భజన సమాజం ఏర్పడి పని జేస్తున్నాయి. చిరతల రామాయణం, జడకోపు కోలాట సమాజాలు కూడ పని చేస్తున్నాయి. ఈ సమాజంలో పుట్టా సత్తెయ్య. యస్. వెంకటాద్రి. హనుమంతయ్య. రత్నమాచారి, వెంకోబారావు. ఎ. రాజయ్య. ఆకుల వీరయ్య, జనగామ శంకరప్ప. సి. తిరుపతి మొదలైన కళాకారులు పనిచేశారు.



# ఇబ్రహింపట్నం

1923 లో రామకృష్ణ నాట్యమండలి, 1954 లో సీతారామాంజనేయ సమాజం, 1954 లో శంకరనారాయణ భజనమండలి, 1957 లో ఓంకార భజన సమాజం. నాటక సమితి ఏర్పడి పనిచేశాయి.

చుట్టుప్రక్కల గ్రామాలైన మహాసురం, నెత్నూరు గ్రామాల్లో కూడా నాటక సమాజా లున్నాయి.

నెత్నూర్ రాచలూరు తిమ్మాపూరు మొదలైన గ్రామాల్లో యక్షగాన భజన సమాజాలు పనిచేశాయి.

ఈ సమాజాల్లో బి. రంగారెడ్డి, ఘటం సత్యనారాయణ, మల్లారెడ్డి, బుగ్గా రామదాసు. చంద్రశేఖరశర్మ, మురళీ మొదలైన కళాకారులు పనిచేశారు.

# మేడిచల్

1952 లో బాలశంకర భజన సమాజం, 1955 లో యతిరాజ నాట్యమండలి పనిచేశాయి.

రాంపల్లి అలియాబాద్ తురకపల్లి మరపల్లి దుండిగాల్ మొదలైన గ్రామాల్లో బుర్రకథ దళాలు పనిచేశాయి.

రాంపల్లి మేడిచల్ పుదూర్ యంజాల్ అలియాబాద్ యాదరమ్ యద్గర పల్లె కీసర కొన్సైగూడ వడ్డిమడ్డి దుండిగాల్ మొదలైన గ్రామాల్లో భజన సమాజాలు విరివిరిగా పనిచేశాయి.

ఈ సమాజాలలో హకీం నారాయణ, వై. యస్. గంగాధర్, ప్రభాకరరెడ్డి. వీరారెడ్డి ఆదిగాగల కళాకారులు పనిచేశారు.

## షాబాద్

1957 లో యువజన నాట్యకళామండలి ఏర్పడి పనిచేయడమేకాక బుర్రకథ దళాలు భజన సమాజాలు కూడ విరివిగా పనిచేశాయి,

## వికారాబాద్

1952 లో వెంకటేశ్వర నాట్యమండలి ఏర్పడి పనిచేస్తూ వుంది. చుట్టు ప్రక్కల గ్రామాలైన మొర్మగపల్లి పట్లూరు రాంపూర్ పెక్కులపల్లి కోటపల్లి మారపల్లి గ్రామాల్లో కూడా నాటక సమాజాలు నాటక ప్రదర్శనాల నిచ్చాయి.

బూరుగపల్లి దుర్గనచెరువు బన్వారమ్ అమరాది కొట్లపూర్ కోమశెట్టిపల్లి బిలీకాల్ బుద్రా రాంపల్లి గ్రామాల్లో భజన కోలాట దళాలు విరివిగా పనిచేశాయి.



సిరిపూర్‌లో హరికథలు చెప్పేవారున్నారు. మొయిన్ పేట పుట్లూరు గ్రామాల్లో బుర్రకథ దళాలు పనిచేశాయి.

## తాండూరు

1956 లో కల్చరల్ అసోసియేషన్ ఏర్పడి పనిచేస్తూంది. పరిసర గ్రామాలైన చెంగోల్ కొట్లిస్‌పల్లి మిట్టబాసపల్లి బషీరాబాద్ మంతమొగొండ యల్లాలా పెద్దిమల గోవిందరావు పేటల్లో కూడా నాటక సమాజాలు నడిచాయి.

చెంగోల్ గోనెల్లి మిట్టబాసపల్లి కోటబాసపల్లి అలంపూర్ అగ్నూర్ గోవిందరావుపేట మంబాపూర్ పెద్దిమాల్ కందనెల్లి బొప్పారమ్ మొదలైన గ్రామాల్లో చిరతల భజన, కోలాట దళాలు పనిచేశాయి.

పెడమాల్, గోవిందరావుపేట గ్రామాల్లో బుర్రకథ దళాలూ-

చెంగోల్, అల్లిపూరు, అగ్నూర్, కొత్త బాసపల్లి, కందనెర్లి, పెడమాల్, బొప్పారమ్ గ్రామాల్లో భాగవత దళాలూ-

శంకరరెడ్డిపల్లి, మంతనగౌడ, తట్టిపల్లి మొదలైన గ్రామాల్లో లంబాడి నృత్య దళాలూ పనిచేశాయి.

# వరంగల్లు జిల్లా

వరంగల్లులో దాదాపు 20 నాటకసమాజాలవరకూ పనిచేశాయి. వాటిలో కాకతీయ కళాసమితి, కాళిదాస కళాసమితి మొదలైన సంస్థలు ప్రాముఖ్యం వహించాయి.



సంగీత నృత్య నాటక సమాజాలలో ఈ క్రిందివారు పనిచేస్తూ వున్నారు: మాడభూషి నరసింహాచార్య, పాలెం రఘుపతి, త్యాగరాజు, రంగనాథం, జయరామచౌదరి, నేరెళ్ళ వేణు మాధవ్ (మోనో యాక్టరు), వి. నరసింహ మూర్తి, వీరభద్రయ్య మొదలైనవారు.

# జనగాం

ఇక్కడ 1953 లో లలితకళాసభ ఏర్పడింది. సంగీత, నృత్య. నాటక సమాజాలు అనేకం పనిచేస్తున్నాయి. ఈ నాటక సమాజాలలో యన్. జయసింగు. లక్ష్మీనరసింహాశర్మ, పరమేశ్వరసింగు, సంజీవసింగు, యల్. యన్. శర్మ, పి. లక్ష్మయ్య, రామ మూర్తి, యం. యస్. మన్యం, డి. యన్. రావు, యం. పుల్లయ్య మొదలైన కళాకారులు పనిచేశారు.

# కాజిపేట

సంగీత. నృత్య, నాటక కళలకు ప్రాతినిధ్యం ఇస్తూ, 1958 లో ఫైన్ఆర్ట్సు అసోసియేషన్ ఏర్పడింది. డాక్టర్ శ్రీనివాస్, యం. యన్. రావు, కె. యస్. ఆర్. మూర్తి, కొండరాజు, ఎ. ఆర్. మోహన్ మొదలైన నటులు పనిచేశారు.

# ఖమ్మం జిల్లా

ఖమ్మం పట్టణంలో ఆంధ్రబాలికా నాట్యమండలి పనిచేస్తూవుంది. కె. వి. యల్. నరసింహారావు, యం. బి. వి. ఐ. ఆర్. శర్మ మొదలైన కళాకారులు పని చేస్తున్నారు.

# దోర్నకల్లు

జితేంద్ర మెమోరియల్ క్లబ్ కే. కృష్ణమూర్తి, పి జార్జిగార్ల అధ్వర్యంలో నడుస్తూ వుంది. ఇల్లెందులో 1926 నుండి త్యాగరాజస్వామి ఆరాధన మహోత్సవ సభ నడుస్తూ వుంది. ఈ సంస్థలో పర్చా రంగారావు, టి. సుబ్బారావు మొదలైనవారు పని చేశారు.



# కొత్తగూడెం

కొత్తగూడెంలో 1944 నుండి సి. యి. ఆర్. క్లబ్ ఏర్పడి పని చేస్తూవుంది. ఈ క్లబ్‌కి సింగరేణి కాలరీస్ జనరల్ మేనేజర్ అధ్యక్షులుగాను, వి. కె. అనందరావు కార్యదర్శిగాను వుండి నడుపుతూ వున్నారు.

ఇంకా ఫైన్ ఆర్ట్సు అసోసియేషన్, ఫ్రండ్సు అసోసియేషన్, సెయింట్ మేరీస్ డ్రమెటిక్ అసోసియేషన్, రామకృష్ణస్కూలు డ్రమెటిక్ అసోసియేషన్ మొదలైన సంస్థలు కూడా వడిచాయి.

# మహబూబ్‌నగర్ జిల్లా

మహబూబ్ నగర్‌లో సంగీతశాఖలు తప్ప నాటక సమాజా లున్నట్లు లేదు. అలంపురంలో హైస్కూలు డ్రమెటిక్ అసోసియేషన్ మాత్రం ఒకటి పని చేస్తూంది. చిత్రపు వెంకటచలం, మల్లికార్జునశర్మ, రామసుబ్బయ్య, పి. గోపాల రావు, జగన్నాథం, ఇబ్రహీం, గడియారం రామకృష్ణశర్మ మొదలైనవారలు పని చేశారు.

# గద్వాల

ఇక్కడ సంగీత, నృత్య, నాటక సమాజాలు అనేకం పనిచేశాయి. యువ జన నాట్యమండలి పేర ఒక నాటక సమాజం నడుస్తూవుంది. లీలాకుమారి, అన సూయాదేవి, జి నాగప్ప, కె. శ్రీనివాసరావు, డి. రంగనాధరావు, యం. వి. గోపాలాచార్యులు వై. మురళీధర్, కె. యస్. రావు, జి. రామదాసు, కె. యస్. శర్మ, బి. కృష్ణమూర్తి, జి. ప్రహ్లాదరావు, పట్ల నారాయణ మొదలైనవారు కళా కారులుగా పని చేశారు.

# వుప్పేరు

ఇది ఒక చిన్న గ్రామం. గద్వాలకు దగ్గరలో వుంది. ఇక్కడ బయలు నాటాకాలకు ప్రసిద్ధి, కోలాటం సమాజాలు కూడా వున్నాయి. పురాణగాథలకు సంబంధించిన లవకుశ, సత్యకీర్తి కథ, రామాంజనేయ యుద్ధం, ప్రహ్లాద మొదలైనవి ప్రదర్శించారు.



బయలు నాటకాలు నెక్కటపల్లి, గట్టూరు మొదలైన గ్రామాల్లో కూడా ప్రసిద్ధంగా ప్రదర్శిస్తున్నారు. ఇంకా ఇక్కడ కట్టెలకోలాటం, చక్కభజన సమాజాలుకూడా వున్నాయి. పెద బసవయ్య, ఆయన శిష్యుడు వడ్ల వెంకట రామయ్య పేరుపొందిన కళాకారులు.

# వనపర్తి

వనపర్తిలో నాటక సమాజాలు లేకపోయినా, సంగీతశాఖ పనిచేస్తూవుంది. దగ్గరలోవున్న గోపాలపేటలో తోలుబొమ్మలాటలవా రున్నారు. పీసం శేషాచార్యులు, పాపయ్య, టి. గోపాల్, శ్రీమతి రాధమ్మ, వెంకటరామారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

# జడచర్ల

జడచర్లలో బాలభరత సంగీత పాఠశాల నడుస్తూవుంది. కలవకుర్తిలో భజన సమాజాలు పనిచేస్తున్నాయి. అచ్చంపేటలోనూ, అమరబాద్‌లోనూ చెంచు నృత్యదళాలు పనిచేశాయి.

# కరీంనగర్ జిల్లా

కరీంనగర్‌లో 1938 లో వెంకటేశ్వర నాట్యకళాసమితి, 1956 లో శారదా ఆర్ట్సుక్లబ్ మొదలైన నాటకసమాజాలేగాక సుందరగిరి, దుడినపల్లి, మొగిలిపాలెం, గంగిపల్లి, రాంమడుగు, గుండి, కొటాల, రేకొండ, గోపాలరావుపల్లి, వెదురుగట్ల, చొప్పదండి మొదలైన చుట్టుప్రక్క ల గ్రామాల్లో కూడా నాటక సమాజాలు నడుస్తూ వున్నాయి. నాటకసమాజాలేగాక, ముస్తురాపూరు, జంగిర్ల, మొగిలిపాలెం, గంగిపల్లి, మానకొండూరు, గోపాలరావుపల్లి, వెదురుగట్ల మొదలైనచోట్ల యక్షగాన దళాలు, తోలు బొమ్మలాటలు విరివిగా జరుగుతున్నాయి.



పైన వివరించిన ఆయా సంస్థల్లో వెంకటాచారి, యల్లయ్య, భద్రయ్య, లక్ష్మయ్య, వెంకటి, సీతారామ్, శ్రీనివాసాచారి, రాజశేఖర్, నారాయణశర్మ, మురళీధరాచార్య, సత్యనారాయణాచార్య, వెంకోబారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

# హుజూరాబాద్

హుజూరాబాద్‌కు దగ్గరలో నున్న తాటికంటి మొదలైనచోట్ల వీధినాటక

దళాలు పనిచేస్తున్నాయి. హుజూరాబాద్‌కు ఆరుమైళ్ళదూరంలో వున్న మాణిక్యపూర్‌లో విప్రవినోదులు ముప్పది కుటుంబాలవారున్నారు. పదిహేనుమైళ్ళ దూరంలో వున్న వల్లభాపురంలో సాధనాశూరులు, పద్మసాలి కులానికి చెందిన వారున్నారు. ఈ తాలూకాలో ప్రతిగ్రామంలోనూ చిరతలరామాయణం కళారూపం బహుళ ప్రచారంలో వుంది.

వల్లభాపురం. తాటికంటి, గట్లపల్లి, కమలాపూర్ మొదలైనచోట్ల నాటక సమాజాలు నడుస్తున్నాయి. పైన వివరించిన ఆయా సంస్థల్లో బాలలింగం, సత్యనారాయణ. లక్ష్మణస్వామి, వెంకటశాస్త్రి, విఠల్ మొదలైన కళాకారులు పని చేశారు.

## జగిత్యాల్

1923 లో లక్ష్మీనరసింహ నాట్యమండలి, 1956 లలితకళాసమితి మొదలైనవి ఏర్పడి పనిచేస్తున్నాయి. భీమారం, చిల్లకోడూరు,కొండలపల్లి, రాయికాల్, బాల్‌గడ, మల్యాల్, కోడూరుపల్లి మొదలైన గ్రామాల్లో యక్షగానదళాలు పనిచేస్తున్నాయి. బుగ్గారం గ్రామంలో వీధి భాగవతం దళం వుంది. ఇక్కడకూడా ప్రతిగ్రామం లోనూ చిరతలరామాయణం, కోలాటదళాలు విరివిగా వున్నాయి.



పై నుదహరించిన సంస్థల్లో వెంకటరెడ్డి, దావూరి వెంకటాచారి. శంకరయ్య. మనోహరాచార్య. లక్ష్మీకాంతశాస్త్రి, పేట కొంతయ్య, చంద్రమౌళి శాస్త్రి, అనంతయ్య మొదలైన కళాకారులు పనిచేశాయి.

## మంతెన

ఇక్కడకూడా చిరతలరామాయణం భజన సమాజాలు విరివిగా వున్నాయి. మంతెనకు దగ్గరలోనున్న మహదేవపూర్‌లో బంజారాదళాలు పనిచేశాయి. ఇవేగాక 1955 లో సంగీత కళాసమితి, 1958 లో యూత్‌క్లబ్, 1958 లో బాలవిశ్వనాథ నాట్యమండలి మొదలైన నాటక సమాజాలు పనిచేశాయి.

రామానందం, లక్ష్మీనారాయణ, డి. రంగారావు, పి. జి. వి. నాయుడు, ఎ. బాలరాజు, అయ్యవారు రామయ్య, సింహాద్రి, యన్. లక్ష్మీనారాయణ, కే. ఆర్. రంగారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

# మెట్పల్లి

ఈ తాలూకాలో అనేక గ్రామాల్లో భాగవత దళాలు పనిచేస్తున్నాయి. 1948 లో మార్కండేయ నాట్యమండలి, బాలానందసంఘం మొదలైన నాటక



దళాలేగాక, ఇటికాల్, సత్తారం, తక్కెడపల్లి, శ్రీకొండ, శ్రీపురం, మానపల్లె, వెల్లుళ్ళ, మన్నె గూడెం మొదలైన గ్రామాల్లో భాగవత దళాలు పనిచేశాయి. కోరట్ల, గూడూరు, లింగపూర్, దంపేట మొదలైన గ్రామాల్లో నాటక సమాజాలు నడిచాయి. సుందరాచారి, లింబగిరి, వాసుదేవ మొదలైన కళాకారులు పై నాటక సమాజాలలో పనిచేశారు.

# సిరిసిల్ల

1955 లో వెంకటేశ్వర నాట్యమండలి స్థాపించబడింది. మల్లారం గ్రామంలో భాగవతదళం, వేములవాడ, మల్లారం, నూకలమట్టి మొదలైనచోట్ల నాటక సమాజాలు నడుస్తున్నాయి. బూరుగుపల్లి, హనుమాజిపేట, నూకల మట్టి గ్రామాల్లో యక్షగానదళాలు పనిచేస్తున్నాయి. సంగీత నృత్య నాటకశాఖల్లో యన్. వెంకటాచారి, లక్ష్మయ్య, వెంకట నర్సయ్య మొదలైన కళాకారులు పని చేశారు.

# సుల్తానాబాద్

సుల్తానాబాదుకు దగ్గరలో కూచిపూడి అనే గ్రామముంది. ఇక్కడ కూడ కూచిపూడి నృత్యం మాదిరి నృత్యముంది. ఇక్కడ 1944 లో నాటక కళాసమితి,

1950 లో భారత నాట్యమండలి ఏర్పడి పనిచేశాయి. ఈ సంస్థల్లో వి. బుచ్చయ్య, శివరాగం, మల్లయ్య, పి. యల్. రామారావు మొదలైన కళాకారులు పనిచేశారు.

కరీంనగర్ జిల్లా ధర్మపురిలో శ్రీ కాసర్ల వేంకటరామయ్యగారు లక్ష్మీ నరసింహ నాట్యమండలిని 1920 ప్రాంతంలో స్థాపించి వివిధపరికరాలతో కూడిన చక్కని హంగులతో అనేక నాటకాలను ప్రదర్శించారు. లక్ష్మీనరసింహశాస్త్రిగారు 1955 లో హైదరాబాదులో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తులో సన్మానింప బడ్డారు. శ్రీ శాస్త్రిగారు నారదపాత్రధారణలో ప్రసిద్ధులు.

# అదిలాబాద్ జిల్లా

అదిలాబాద్‌లో 1957 లో కళావాఙ్మయ వికాసమండలి, 1950 లో ఆదర్శవికాస మండలి, 1948లో సరస్వతి నాట్యమండలి మొదలైన సమాజాలు సంగీత, నృత్య, నాటకశాఖల్లో పని చేస్తు న్నాయి. ఇవిగాక యప్పలగూడ, చాందా, కప్పరాళ్ళ మొదలైన ప్రదేశాల్లో యక్ష గానాలను ప్రదర్శించే సమాజాలు, పనిచేస్తు న్నాయి. అదిలాబాద్ తాలూకా సంకిడి గ్రామంలో ఒక డప్పుల నృత్యబృందం పని చేస్తూవుంది. వెంకటరెడ్డి, గంగారామ్, గణ పతిరెడ్డి, రాములు, లంకా నారాయణ, నారా యణ పంతులు మొదలైనవారు ఆయా శాఖల్లో కళాకారులుగా పనిచేశారు.



# మధోల్

ఇక్కడ ముఖ్యంగా భాయ్‌నాసి, కొత్తగని, మీర్జాపూర్, తిమ్మాపూర్, దిగమ, సుంకలి, మహాజమ్, చుండి, కోమ౨, మంజరి, బాసార్ మొదలైన గ్రామా లలో యక్షగాన బృందాలు పనిచేశాయి.

కాకన్న. హనుమంతాచార్య, ముత్తన్న మొదలైన కళాకారులు పని చేశారు.

## ఘనపూర్

కన్నపూర్, దస్తురాబాద్, కాలేముదుగు, ఇందనపల్లి, రామోజీపేట మొదలైన ప్రాంతాల్లో యక్షగానదళాలు పనిచేస్తున్నాయి. వడ్ల నరసింహులు, నర



సింహయ్య, గోవిందరావు, వెంకటరెడ్డి మొదలైన కళాకారులు ఈ దళాల్లో పని చేశారు.

## లక్సెట్టిపేట

ఇక్కడ 1951 లో లలితకళాసమితి, 1954 లో మరో లలితకళాసమితి ఏర్పడి పనిచేస్తున్నాయి. కొత్తూరు, కిష్టపురి, రాపల్లి, పార్తనపల్లి మొదలైన గ్రామాల్లోకూడ నాటక సమాజాలున్నాయి. ఇవిగాక నుమ్నూర్, పొట్టాయిపల్లి, రాయంపేట, దౌడపల్లి మొదలైన చోట్ల వీధినాటకసమాజాలు పనిచేస్తున్నాయి. రాయంపేటలో ఒక బుర్రకథ దళం కూడా పని చేస్తూ వుంది.

రామకృష్ణ, వెంకటరెడ్డి, బుచ్చయ్య, కాంతయ్య, తిరుమలరావు మొదలైన కళాకారులు ఈ సంస్థల్లో పనిచేశారు.

## చిన్నూర్

ఇక్కడ 1949 లో జగన్నాధ కళాసమితి ఏర్పడి పనిచేసింది.

కొత్తపల్లి, నీలవాయి గ్రామాలలో వీధి భాగవత దళాలు, వేమనపల్లి, సీనాల్, భీమవరం, మిట్టపల్లి, ఆదిల్ పేట, సిర్యా, అమద్ మొదలైన గ్రామాల్లో యక్షగాన దళాలు పనిచేశాయి.

ఈ దళాల్లో జక్కిపల్లి కృష్ణయ్య, సాంబయ్య, బిన్ రెడ్డి మొదలైన కళాకారులు పనిచేశారు.

## నిర్మల్

నిర్మల్ హస్తకళలకు ప్రసిద్ధి చెందిన గ్రామం. ఇక్కడ చిరతల రామాయణం ప్రదర్శించే జానపద కోలాట సమాజం పనిచేస్తూవుంది. ఇది తెలంగాణాలో ఒక ప్రత్యేకమైన కళారూపం.

## నిజామాబాద్ జిల్లా

నిజామాబాద్ లో 1948 వ సంవత్సరంలో మహారాష్ట్రి మహిళామండలి, 1958 లో లలితకళా సమితి ఏర్పడి, సంగీత నృత్య నాటకకళల్లో కృషి చేశాయి. నిజామాబాద్ కు 16 మైళ్ళలోనున్న ఆర్మోర్ లోకూడ సంగీతంలోనూ, నృత్యంలోనూ, నాటకంలోనూ కొన్ని సమాజాలు పనిచేశాయి.

నిజామాబాద్ కు 40 మైళ్ళదూరంలో వున్న బన్స్వాడలోకూడ కొన్ని సమాజాలు పనిచేస్తూ వున్నాయి. బన్స్వాడలో భీమశాస్త్రి హరికథ చెప్పడంలో ప్రసిద్ధి వహించారు. అచ్చంపేటలో శ్రీనివాసరావు కోలాటం సమాజాన్ని, రైతు నగర్ లో పొట్లూరి వీరభద్రం, రంగనాయకులు ఒక భాగవత సమాజాన్ని నడుపుతున్నారు.

బిర్కూర్, మొహద్ నగరుల్లో భజనపార్టీలు పనిచేశాయి.

బిర్కూర్, పిట్లాం గ్రామాల్లో బుర్రకథ దళాలు పనిచేస్తున్నాయి. దుకి, తడికేల్, తిరుమలపూరుల్లోకూడ వీధిభాగవత సమాజాలు పనిచేశాయి. ఈ ప్రాంతాల్లో నాటక సమాజాల అభివృద్ధి అంతగా కనబడడంలేదు.

# బోధన్

ఇక్కడ మజ్దూర్ సంఘం క్లబ్ పనిచేస్తూవుంది. దగ్గరలోనున్న రుద్రూరు, జహదిగ్మలపూర్‌లోనూ భజనపార్టీలు, భాగవత సమాజాలూ పనిచేస్తూ వున్నాయి. ఈ సంస్థల్లో కాశీనాథ్, వెంకటేశ్వర్లు, జైపాల్, కోటయ్య, వీరేశమ్, శ్రీమతి వీరేశ్వరమ్ మొదలైన నటీ నటులు పనిచేశారు.

# మెదక్ జిల్లా

మెదక్‌లో సంగీతశాఖలు మాత్రం పనిచేస్తూ వున్నాయి, నాటక సమాజాలు వున్నా అవి కట్టుదిట్టంగా లేవు. భాగవతదళాలూ, చిరతల రామాయణం ప్రదర్శించే సమాజాలు, కోలాటం మొదలైన జానపద కళారూపాలను ప్రదర్శించే బృందాలు విరివిగా వున్నాయి.



# సంగారెడ్డి

చెప్పుకోదగిన నాటకసమాజాలు ఏమీ లేవు. సంగీత శాఖలోమాత్రం కొద్దిమంది సంగీత ప్రియు లున్నారు. జడకోపు కోలాట సమాజాలు, వీధి భాగ వతదళాలు విరివిగా వున్నాయి. 1958 లో సంగీత కళామందిర్ అనే సంస్థ స్థాపించబడి పనిచేస్తూ వుంది. అనేక బుర్రకథ దళాలుకూడా పనిజేస్తు న్నాయి. జడకోపు కోలాటంలో కృష్ణలీల కథను అన్ని ఆభరణాలను ధరించి ప్రదర్శిస్తూ వుంటారు. అనేక దళాలు మాజీ యం. యల్. ఎ. లక్ష్మణకుమార్ అధ్వర్యంలో పనిచేస్తూ వున్నాయి. ఈశ్వరయ్య గంధయ్య విష్ణయ్య మొదలైనవారు కళాకారులుగా ప్రసిద్ధిచెందారు.

# సదాశివపేట

ఇక్కడ సంగీతశాఖలుమాత్రం పనిచేస్తూ వున్నాయి. భాగవతదళాలను పడిగి. నారాయణ, మారేపల్లి యజ్ఞనారాయణ మొదలైన కళాకారులు నిర్మాణయుతంగా

నడుపుతున్నారు. శ్రీ గోవిందదాసు ఆధ్వర్యంలో మూడు చిరుతల భజన సమాజా నడుస్తున్నాయి. మారేపల్లి, సూరారం, నందికుండి, నిజాంపూర్, వెంకటపూ తంగందపల్లి మొదలైన గ్రామాల్లో కూడా చిరుతల భజన సమాజాలు నడుస్తున్నాం రామకృష్ణ, శంకరరావు, నరసింహారెడ్డి మొదలైన కళాకారులు పైసంస్థల్లో : చేశారు.

# జహీరాబాద్

జహీరాబాద్ చుట్టుప్రక్కల గ్రామాలైన బిలాల్‌పూర్, కొహిర్, ముగు: పల్లి, అజాద్‌గంజ్ మొదలైన చోట్ల నాటక దళాలు పనిచేస్తున్నాయి. బిలాల్‌పూ గ్రామంలో బుర్రకథ దళంకూడా పనిచేస్తూవుంది. కొహి ముగుదంపల్లి, అజాద్‌గంజ్, దిగ్వాల్, రంజోల్, చీ ప మొదలైన గ్రామాల్లో వీధిభాగవతం దళాలు, తో బొమ్మలదళాలు సమర్థవంతంగా పనిచేశాయి.



బిలాల్‌పూర్, కొహిర్, రంజోల్ ' మొదలై గ్రామాలో చిరుతల భజన సమాజాలుకూడా నడుస్తున్నా ముగుదంపల్లి. రంజోల్ గ్రామాల్లో కోలాట సమాజ పనిచేశాయి.

# మీర్జాపూర్

మీర్జాపూర్‌కు దగ్గరలోనున్న జర్సగం గ్రామంలో తెలుగు, కన్నడ కాలు ఆడుతున్నారు. శ్రీగుత్తం, మందగి గ్రామాల్లో కన్నడ నాటకాలనుమా ఆడుతున్నారు. నల్లకాల్, బిరుగుపల్లి గ్రామాల్లో ఉరుదు నాటకాలు ఆడుతున్నాయి.

రామగుండం, బిటికుర్తి గ్రామాల్లో భజన సమాజాలు నడుస్తున్నాయి. వామనపల్లి సిద్ధపూర్ దోసపల్లి మొదలైన గ్రామాల్లో లంబాడి డాన్సు దళాలు పని చేస్తున్నాయి.

# జోగిపేట

ఇక్కడ సంగీతంలో ప్రవీణులైనవా రున్నారు. కనసంపల్లి పెదపూర్ తిక మల్ రామన్నపేట గ్రామాల్లో భాగవతం దళాలు నడుసున్నాయి. కనసంపలి పెద

పూర్ గ్రామాల్లో చిరతల కోలాటం సమాజాలున్నాయి. వాసుదేవ ఆదెప్ప మొదలైన కళాకారులు పనిచేశారు.

# నల్లగొండ జిల్లా

నల్లగొండ జిల్లాలో భువనగిరి హుజూర్ నగర్ సూర్యాపేట మొదలైన ప్రాంతాల్లో మాత్రమే కొద్ది వైజ్ఞానికశాఖలు పనిచేశాయి.



నల్లగొండలో శ్రీ టి. పూర్ణచంద్ర రావుగారు కళాసమితిని స్థాపించి నడిపారు. 1958 లో విజ్ఞానసమితిని పి. రాజ రత్నంగారు స్థాపించారు. ధరణికోట శ్రీనివాసులు (నాటక రచయిత) ఇక్కడి వారే.

1958 హుజూర్ నగర్‌లో గ్రామ వెలుగు నాట్యమండలిని నాటక రచయిత కె. యల్. నరసింహారావుగారు స్థాపించి ప్రతి సంవత్సరం 4 రోజులు నాటకోత్స వాలను నడుపుతూ వచ్చారు. ఈప్రాంతం నుంచి వచ్చినవారే టి. యల్. కాంతారావు (సిని నటుడు).

సూర్యాపేటలో 1946 లో జనతా కళామండలిని స్థాపించారు. ఇక్కడ సంగీత సంస్థలు ఎక్కువగా పనిచేస్తున్నాయి. టి. సూర్యనారాయణశర్మ, డాక్టర్ జి.వి. శర్మ, బి. సీతారామాచార్య, సముద్రాల నరసింహారావు, వెంపో మొదలైన కళాకారులు పనిచేశారు.





హైదరాబాదు ఇప్టా స్వర్ణోత్సవాలలో
రామోజీరావు - డా॥ సి నారాయణరెడ్డి - డా॥ మిక్కిలినేని - కె ప్రతాపరెడ్డి



రాష్ట్రస్థాయి పోటీలు 1993 ఆగస్టు - హైద్రాబాద్
డా॥ సి.నా రెడ్డి, గుమ్మడి, ప్రతాపరెడ్డి



బొంబాయిలో ప్రజానాట్యమండలి రాష్ట్రదళం ప్రదర్శించిన మాభూమి నాటకంలో
బి పురుషోత్తం - కోసూరు - నాజరు - డా॥ రాజారావు



బొంబాయిలో ప్రదర్శించిన మాభూమి నాటకంలో వీరారెడ్డి చెల్లెలు కమల వివాహం గురించి ముచ్చటిస్తున్న డా॥ మిక్కిలినేని, మిక్కిలినేని సీతారత్నం-దాదా- సూర్యకాంతం

ప్రజానాట్యమండలి-రాష్ట్రదళం బొంబాయిలో ప్రదర్శించిన మాభూమి నాటకంలో ఉత్తేజకర సన్నివేశం "ఆంధ్రుడా లేవరా" పాట కుడినుంచి - డా॥ మిక్కిలినేని - కోసూరు పున్నయ్య - కోగంటి - ఉమామహేశ్వరరావు





బొంబాయిలో ప్రదర్శించిన ప్రజానాట్యమండలి రాష్ట్రదళం మాభూమి నాటకంలో ఒక సన్నివేశం ఎడమనుంచి - కోసూరు పున్నయ్య - డా॥ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి - భూపతిరాజు సూర్యకాంతం-మిక్కిలినేని సీతారత్నం


మాచినేని మాభూమిలో
దాదాసాహెబ్


మాభూమి నాటకంలో
యల్లమంద కోసూరు పున్నయ్య


వెంపటి రాధాకృష్ణ మాభూమి
నాటకంలో అమన్


హైదరాబాదు రాష్ట్ర సభలలో
జానపదకళల ఉపన్యాసం
డా॥ మిక్కిలినేని



# ప్రజానాట్యమండలి



ప్రజానాట్యమండలి ఉజ్వలచరిత్ర -ప్రాచీన కళారూపాల పునరుద్ధరణ-చేపట్టిన కళారూపాలు: ముందడుగు నాటకం - చారిత్రకమైన మాభూమి నాటకం - ఒకేరాత్రి రెండు ప్రదర్శనాలు-స్త్రీల బుర్రకథ దళం

# ప్రజానాట్యమండలి ఉజ్వల చరిత్ర

## నాటకరంగంలో నవచైతన్యం :

నాటకరంగ స్థలంలో నవశకాన్ని ఏర్పరచి ప్రజలను జాగృతమొనర్చి దేశభక్తిని రగుల్కొల్పిన నాటకసంస్థ ప్రజానాట్యమండలి.

కంట్రాక్టు నాటకాల దుస్థితితో శిధిలమైపోతున్న ఆంధ్రనాటక చరిత్రలో 1943 వ సంవత్సరంలో ఒక నూతన చైతన్యం కలిగింది. ప్రపంచమంతా ఫాసిస్టుల ప్రళయ ఆర్భాటాలతో మారుమ్రోగిపోతోంది. అటు యూరపులో హిట్లరు చిన్నరాజ్యాలన్నిటినీ కబళించుతున్నాడు. ఇటు ఇటలీనియంత ముసోలినీ ఆఫ్రికా నంతా మ్రింగజూచాడు. తూర్పు ప్రాంతాలలో జపాన్‌చే దురాక్రమణకు ప్లానులు వేయబడ్డాయి. ఫాసిస్టులకూ ప్రజాస్వామిక శక్తులకూ మధ్య తీవ్రమైన సంఘర్షణ చెలరేగింది. ధర్మానికి-అధర్మానికి, శాంతికి-అశాంతికి సంఘర్షణ దినాలవి. దేశ దేశాల ప్రజాసామాన్యమంతా అట్టుడికిపోతోంది. మానవసమాజం యొక్క యుగయుగాల విజ్ఞానం, సంస్కృతీ పశుబలానికి బలైపోతూవున్నాయి. ఈరోజు నున్న పట్టణాలు రేపటికి భస్మీపటలమై పోతున్నాయి. అనేక దేశాలలో ప్రజలు-స్త్రీలు, పురుషులు, పిల్లలు ఫాసిస్టుల బలానికి, వారి చిత్రహింసలకు బలైపోతున్నారు. ఆ దేశాలన్నీ పీనుగుపెంటలతో నిండిపోయాయి. పాడిపంటలు శూన్యమైనాయి. ఒక్కమాటలో చెప్పాలంటే యుద్ధం జరిగే ప్రాంతాలన్నీ శ్మశానాలైనాయి. మనదేశంలో కరువు పిశాచి కరాళనృత్యంతో రాయలసీమ, బెంగాల్ నలిగిపోయాయి. రేపో మాపో అటు కలకత్తామీదో, ఇటు కాకినాడమీదో, మద్రాసు మీదో, విశాఖమీదో బాంబులు పడేటట్టున్నాయి. ఇండియా తూర్పుకోస్తా అంతా అతిప్రమాదమైన స్థితిలో పడిపోయింది. ఆ ఛాయలే ఆంధ్రదేశంమీద పడ్డాయి. ఆనాడు ఆంధ్రప్రజలు అరచేతిలో ప్రాణాలు బిగబట్టుకుని బ్రతకాల్సి వచ్చింది. చివరకు అనుకున్నంత పనీ జరిగింది. కాకినాడ, విశాఖపట్టణాలపై బాంబులు పడనేపడ్డాయి. ఈ స్థితిలో ఆంధ్రప్రజల స్థితి ఏమిటి ? ఒక్క ఆంధ్రప్రజల స్థితే

కాదు-ఏ దేశమైనా, ఏ ప్రజలైనా ఈ భయంకరమారణహోమంనుంచి, ఈ అగ్ని జ్వాలలనుండి బయటపడాలని తహతహలాడే భయంకర దినాలవి.

## కంఠాలెత్తి కవులూ, కళాకారులూ కదిలారు :

ఈ స్థితిలో కళాకారులూ, కవులూ, కథా రచయితలూ, గేయకవులూ, గాయకులూ, వాద్యకులూ - మొత్తం కళాకారులంతా ఈ హోమగుండంనుంచి ప్రజలను విముక్తి చేయాలనుకున్నారు. మన కుండాల్సిన రాజకీయాలూ, రాజకీయపార్టీలూ అన్నీ వున్నాయి. అయినా కళాకారులు వారివారి బాధ్యతలతో నవచైతన్యంతో ప్రజానీకాన్ని కళాయుధం ద్వారా మేల్కొల్పచూచారు.



## యువచైతన్యం, నవచైతన్యం :

ఆనాటి యువకులందరూ వేయికంఠాలెత్తి పిడికిళ్ళను బిగించారు. ఆంధ్రదేశపు నాలుగు చెరగులనుంచీ యువకులందరూ సమీకరించ బడ్డారు. ఆంధ్రరాజకీయ జీవితంలో ఒక నవ చైతన్యం, ఒక అభ్యుదయ యుగం ప్రారంభ మైంది. ఊరూరా యువకులందరూ వయోజన పాఠశాలలను నెలకొల్పారు. రాబోయే యుద్ధ ప్రమాదాన్నిగూర్చి దళాలు దళాలుగా బయలుదేరి ప్రచారం చేయ సాగారు. ఈ స్థితిలో స్త్రీలుమాత్రం వూరుకున్నారా? వారూ మహిళా శిబిరాలను నెలకొల్పారు. బాలురంతా బాలసంఘాలను, రైతులు, కూలీలు వారివారి సంఘాల ద్వారా ఒక్కుమ్మడిగా ఫాసిస్టు వ్యతిరేకప్రచారం జరిపారు.

## ఉరకలు వేస్తూ ముందుకు నడిచిన యువజనోద్యమం :

ఈ తీవ్ర సంచలనంలో ప్రతి కళాకారుడూ దేశభక్తిప్రపూరితుడై పోయాడు. కవులు గేయాలు వ్రాశారు. గాయకులు కంఠాలెత్తారు. ఆంధ్రప్రజాసామాన్యా న్నంతా గాఢనిద్రలోంచి మేల్కొల్పారు.

ఈ పరిస్థితుల్లో ఆంధ్రదేశంలో ఆయా జిల్లాలలో వయోజనోద్యమం పుర కిలు వేస్తూ ముందుకు పోతూంది. అనేకమంది యువకులు వైజ్ఞానికకార్యక్రమాలు కూడా ప్రారంభించారు. కృష్ణాజిల్లా దివితాలూకాలో కీ॥ శే॥ పెండ్యాల వెంకటేశ్వరరావు, పరచూరి రామకోటయ్యగార్లు దేశభక్తిని పురికొల్పుతూ యువజనసభలలో వైజ్ఞానిక కార్యక్రమంగా బుర్రకథ కార్యక్రమాలు చెప్పడం ప్రారంభించారు. వీరి కార్యక్రమాన్ని చూచి పుత్తేజితులైన కోసూరు పున్నయ్య, సిరివిశెట్టి సుబ్బారావు, గోవర్ధన మొదలైన కొత్తపాలెంకు



సంబంధించిన యువకులు దేశభక్తిని పురికొల్పుతూ బుర్రకథలు ప్రారంభించారు. సిరివిశెట్టి సుబ్బారావు కధకుడుగానూ,కోసూరి పున్నయ్య హాస్యపాత్రనూ, గోవర్ధన రాజకీయాలనూ నిర్వహిస్తూ వుండేవారు. వంతగా కోసూరి పున్నయ్య సున్నితమైన హాస్యంతో గ్రామీణ సామెతలతో రాజకీయవిషయాలను ప్రజలకు అర్థమయ్యే శైలిలో చెపుతూ వుండేవారు. ముఖ్యంగా యువజనసభల్లో ఈ కార్యక్రమాలు జరుగుతూ వుండేవి.

## గుంటూరు యువకుల
## గొప్ప బుర్రకథ :

అదేసమయంలో అటు గుంటూరుజిల్లాలో దావులూరు వాస్తవ్యులు చింతల సూర్యనారాయణ. కాకుమాను సుబ్బారావు మొదలైన వారు రష్యన్ వీరనారి టాన్యా, ఝాన్సీ లక్ష్మీబాయి మొదలైన వీరవనితల కథలను చెప్పుతూ వుండేవారు.

1943 జనవరి ప్రాంతంలో బొంబాయిలో అఖిల భారత కమ్యూనిస్టుపార్టీ మహాసభ జరిగింది. ఆ మహాసభకు వివిధ రాష్ట్రాలనుండి వైజ్ఞానిక దళాలనుకూడా ఆహ్వానించారు. అన్ని రాష్ట్రదళాలు ప్రదర్శన లిచ్చాయి. ఆంధ్రవైజ్ఞానికదళం అంత కట్టుదిట్టంగా లేకపోయినా ఆంధ్రజాతీయ జానపద కళారూపాలను ప్రదర్శించి అందరి ప్రశంస లందుకుని ప్రథమ బహుమతిని ఆనాడే సంపాదించింది.

## ప్రజానాట్యమండలికి ప్రథమ బహుమతి :

ఆ సమయంలోనే బొంబాయిలో ప్రోగ్రెసివ్ రైటర్స్ అసోసియేషన్ కాన్ఫరెన్సు జరిగింది. అప్పుడే అఖిల భారత ప్రజానాట్యమండలికి అంకురార్పణ జరిగింది.

బొంబాయి వైజ్ఞానిక ప్రదర్శనాల్లో ప్రథమ బహుమతిని సంపాదించిన ఆంధ్రవైజ్ఞానిక దళాన్ని బొంబాయి ఆంధ్రులు ఘనంగా సన్మానించి రజతపాత్ర లను బహూకరించారు. ఆనాడు బొంబాయి వెళ్ళిన కళాకారుల్లో కోగంటి గోపాల కృష్ణయ్య, కోసూరి పున్నయ్య, డాక్టరు రాజారావు, సిరివిశెట్టి సుబ్బారావు, మానికొండ సూర్యావతి, కాట్రగడ్డ హనుమాయమ్మ, ముక్కామల నాగభూషణం, టి. సావిత్రి మొదలైనవారు పాల్గొన్నారు.

## కోగంటి కోయవేషపు ప్రతిభ :

ఆనాడు అన్ని దళాలను, కళాకారులను ఆకర్షించిన వ్యక్తి కోగంటి గోపాలకృష్ణయ్య. కోయవేషంతో అందర్నీ ఆశ్చర్యచకితుల్ని చేశాడు. కోయ వేషంలో కోయభాషను వుపయోగించాడు. కోయభాషలో రాజకియాలు చెప్పారు. కోయభాషలో రచన చేశాడు. కోయవాని వేషధారణను ముచ్చటగా చిత్రించుకున్నాడు. బక్క వ్యక్తులను చూచి "ఓ సామి ఏం ఈతపిక్కలాగ ఇంత బక్కంగ వుండావు. ఒక్క ఏరుముక్క గట్టినా నంజే ఇంత లావైపోతావు ఏరుముక్కంజే ఏటను కున్నావు. జాపనోడు గీపనోడు తుప్పున పోవాల. కొండవాళ్ళం మేం" అంటూ హాస్యంతో ప్రేక్షకులను కడుపుబ్బ నవ్విస్తూ వ్యాజకానికి వుపయోగించే కోయవేష కళారూపానికి దేశహితమైన రాజకీయ ఇతివృత్తాలను జోడించి, నూతన విధానాలను సృష్టించాడు ఆనాడు బొంబాయి క్రానికల్, పీపుల్సు వార్‌లాంటి ప్రముఖ పత్రిక లన్నీ కోగంటి కోయవేష చిత్రాలను ప్రముఖంగా చిత్రిం చాయి.



## యువకులు నిర్మించిన వైజ్ఞానికోద్యమం :

ఈ పరిస్థితుల్లో 1943 మార్చిలో కృష్ణాజిల్లా యువజన సంఘం ఆధ్వ ర్యాన తాతినేని ప్రకాశరావు, వేములపల్లి దాసు, కొండపల్లి దశరథరామయ్య, తమ్మారెడ్డి సత్యనారాయణ, బి. వి. రావు మొదలైన ఆనాటి యువనాయకుల పర్య వేక్షణలో దివితాలూకా కొడాలి గ్రామంలో ఫాసిస్టు వ్యతిరేక శిక్షణా శిబిరం ప్రారంభించబడింది. అన్ని తాలూకాలనుండి ప్రతినిధులు ఆ శిబిరానికి శిక్షణ నిమిత్తమై వచ్చారు. ఆ శిబిరంలోనే మిక్కిలినేని, మాచినేని, చదలవాడ కుటుంబ రావు, తుమ్మల కేశవరావు, యస్. యల్. పెరుమాళ్ళు, కోసూరు పున్నయ్య, సిరివిశెట్టి సుబ్బారావు, అమృతయ్య మొదలైన కళాకారులంతా వైజ్ఞానిక శిక్షణ పొందారు. ఈ శిక్షణా శిబిరంలో బొంబాయి మహాసభల నుండి వచ్చిన కోగంటి, కోసూరి పున్నయ్య ప్రముఖ బాధ్యతలను నిర్వహించారు. నాలుగు బుర్రకథ దళాలను, మరికొన్ని వివిధ చిత్ర విచిత్ర జానపద కళారూపాలను ప్రదర్శించే కళా కారులను తయారుచేశారు.

## ఉత్తేజపర్చిన కోగంటి గేయాలు :

ఆ శిబిరంలో కోగంటి కొన్ని కళారూపాలకు సంబంధించిన కొన్ని గేయాలను రచించాడు. ఐదు నిమిషాల్లో ఏదో ఒక ప్రజా సమస్యను తీసుకుని పాటలు వ్రాసేవాడు. ఆయనకు మంచి లయజ్ఞానం వుండేది. ప్రతి పాటకూ ఏదో ఒక ప్రాచీన జానపద గేయానికి సంబంధించిన విధానంతో చిటికెలువేస్తూ కొత్త పాటను వినిపించి ముగ్ధుల్ని చేసేవాడు. ప్రేక్షకుల్ని ఆకర్షించి వుత్తేజపర్చేవాడు.

## ప్రజానాట్యమండలి నిర్మాతలు :

ఈ శిబిరంలో ప్రప్రథమంగా కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరు పున్నయ్య, సిరివిశెట్టి సుబ్బారావు ఒక బుర్రకథ దళంగాను.

మిక్కిలినేని, మాచినేని, దావులూరు నారాయణ ఒక బుర్రకథ దళంగాను.

పెరుమాళ్ళు, కీ॥శే॥ చదలవాడ కుటుంబరావు, తుమ్మల కేశవరావు మరో బుర్రకథ దళంగాను-

పురుషోత్తం, వెంకటేశ్వరరావు మొదలైన దివితాలూకాకు చెందిన బాలురు ఒక బాల బుర్రకథ దళంగానూ ఏర్పడ్డారు.

అటు గుంటూరుజిల్లాలో మోటూరు ఉదయం, చింతల కోటేశ్వరమ్మ, మహంకాళి లక్ష్మి మొదలైనవారితో మహిళా బుర్రకథ దళం ఏర్పడి రష్యన్ వీరనారి నాట్యా కథను హృదయాలు ద్రవించేటట్లు చెప్పేవారు.

## వీరోచితంగా బుర్రకథ చెప్పిన ఏలూరు దళం :

పశ్చిమ గోదావరిజిల్లా ఏలూరులో మాణిక్యాలరావు, చంద్రు సూర్య నారాయణ, చిన్నబ్బాయి మొదలైనవారితో బుర్రకథ దళం ఏర్పడింది. మాణిక్యాల రావు పకీరువేషాలు ప్రదర్శించడంలో ప్రముఖపాత్ర వహించారు. చంద్రు సూర్య నారాయణ గంభీరమైన గొంతుతో శ్రావ్యంగా పాటలు పాడేవారు. బుర్రకథలో రాజకీయాలు చెప్పేవారు.

కర్నూలుజిల్లా గిద్దలూరు ప్రాంతంలో తుపాకుల బసవయ్య దళం పని చేస్తూ వుండేది.

నెల్లూరుజిల్లాలో రాజగోపాల్ బుర్రకథ దళం బుర్రకథలు చెపుతూవుండేది.

కడపజిల్లా, జమ్మలమడుగు తాలూకాలో హుస్సేన్ బాబా వైజ్ఞానిక దళం పని చేస్తూవుండేది.

గుంటూరుజిల్లా వైజ్ఞానికదళంలో బి. గోపాలం ఫిడేలు వాయిద్యంతో శ్రావ్యంగా పాటలుపాడి ప్రజల ను త్తేజపరుస్తూ వుండేవారు

ఈ విధంగా ఆంధ్రదేశం అన్ని మూలలకూ వైజ్ఞానికవుద్యమం వ్యాపిస్తూ వుంది. వైజ్ఞానికదళాల్లో వున్న కోగంటి, సుంకర, కోసూరి, మిక్కిలినేని, మాచి నేని మొదలైనవారంతా కళారూపాలకు సంబంధించిన గేయాలను వ్రాయడం మొదలుపెట్టారు.

### విజయవాడ

### వైజ్ఞానిక శిక్షణాశిబిరం :

1943 జూన్‌లో విజయవాడలో ఒక పెద్ద వైజ్ఞానిక శిక్షణా శిబిరం ఏర్పాటై కొంతమంది కళాకారులను తయారుచేసింది. 1943 లో విజయవాడలో ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ మహాసభ జరిగింది. ఆ మహాసభకు కృష్ణా, గుంటూరు జిల్లాల నుండి వైజ్ఞానిక దళాలు వచ్చాయి.

ఆ సభలో ప్రప్రథమంగా కృష్ణాజిల్లా వైజ్ఞానికదళం కొన్ని ప్రదర్శనల నిచ్చింది. ప్రజా నాట్యమండలి ఏర్పడేముందు తొలి దశలో ఏర్పడిన ప్రజానాట్యమండలి ఇదే. ఈ దళంలో కోగంటి గోపాలకృష్ణయ్య, కీ॥శే॥ చదలవాడ కుటుంబ రావు, మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, తుమ్మల కేశవ రావు, మృతవీరుడు చింతపల్లి పాపారావు, సుంకర వీర భద్రరావు, రాఘవాపురపు అప్పారావు, వెంకటేశ్వరరావు, ఖమ్మం వాస్తవ్యుడు బుర్రపంతులు, కొండపల్లి కోటేశ్వ రమ్మ, పరచూరు సూర్యాంబ, తాపీ రాజమ్మ మొదలైన వారు ప్రదర్శనల్లో పాల్గొన్నారు. ఈ దళం ప్రదర్శించిన ప్రదర్శనలు పున్నయ్య దళం బుర్రకథ, కోగంటి కోయ వేషం, బుర్రకథ, చెంచువేషాలు, ఫకీరువేషాలు, దేవరపెట్టె, సై. సై. భారత వీర, ఓయ్ హోయ్‌హోయ్ జపాన్ హోయ్ అనే గెరిల్లా కళారూపం, సమిష్టి గానాలూ ప్రదర్శించబడ్డాయి.



ఈ ప్రదర్శనం విజయవాడ గాంధీనగరం జింఖానా గ్రౌండ్సులో కొన్నివేల మంది ప్రజల సమక్షంలో ప్రదర్శింపబడి వేనోళ్ళ పొగడబడ్డాయి.

### నాజరు అవతరణ :

ఈ మహా ప్రదర్శనంలో గుంటూరు జిల్లా నుండి నాజరు ఒక కోలాట దళాన్ని తీసుకుని వచ్చాడు. 'మాస్కో పొలిమేరలోనా, మారణ యంత్రాలు నిలిపి' అనే గేయాన్నీ, "జాయింగే కయ్యూరు జాయింగే"అనే కయ్యూరు కామ్రేడ్సు మీద గేయాన్ని వినిపించి, సభాసదుల నందరినీ ద్రవింపజేయడమే గాక ఉత్తేజపర్చాడు. ఆయన గాత్రం ప్రేక్షకులను ముగ్ధులను గావించింది. ఈ దళంలోనే నాజరు,



గుంటూరుజిల్లా ప్రజానాట్యమండలి బుర్రకథ దళం
పురుషోత్తం - నాజరు - రామకోటి

రామకోటి, పురుషోత్తం చెంచు వేషాలు ధరించారు. దుగ్గిరాలకు చెందిన డాక్టరు చలమయ్యకూడ కళారూపాన్ని ప్రదర్శించాడు.

ఆ ప్రదర్శనంలో నాజరు కోలాటం, కోగంటి కోయవేషమూ, మిక్కిలినేని హిట్లరు వేషమూ ప్రత్యేక ప్రశంస లందుకున్నాయి.

## ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం :

ఈ మహాసభ తరువాత అన్ని జిల్లాలలో వైజ్ఞానికదళాలు విరివిగా ఏర్పడ్డాయి. ఇతర రాష్ట్రాల్లోకూడా వైజ్ఞానిక దళాలు ఏర్పడి పని చేస్తున్నాయి. ఈ దశలో ఆనాటి అఖిల భారత కమ్యూనిస్టుపార్టీ ఈ వైజ్ఞానిక వుద్యమానికి అండగా నిలబడింది. ఆంధ్రదేశంలో ఆనాటి కమ్యూనిస్టు పార్టీలో ముఖ్యులైన మద్దుకూరి చంద్రశేఖరరావు. పొట్లూరు సుందరం మొదలైనవారు వైజ్ఞానిక దళాలపట్ల శ్రద్ధతీసుకుని అడుగడుగునా సలహాలనిస్తూ వైజ్ఞానిక వుద్యమానికి అండగా నిలబడ్డారు. వైజ్ఞానికోద్యమం వురకలు వేస్తూ ముందుకు నడిచింది. ఈ తరుణంలో ఓ మిట్టిపడే హిట్లరయ్యా ఏటికి ఎదురీదుచుంటివా అనే సుంకరగేయం, హోయ్ జపాన్ హోయ్, మలయ బర్మా మ్రింగిన రాక్షసి భారతభువిపై గవిసెనురా అన్న కోగంటి గేయం వెలువడి బహుళ ప్రసంస లందుకున్నాయి. ఊరూరా వైజ్ఞా

నిక దళాలు ఏర్పడ్డాయి. దేశభక్తి గేయాలు కొల్లలుగా వచ్చి పడుతున్నాయి. ఏదో ఒకమూల, ఏదో ఒకచోట, ఏదో ఒక గేయం వినబడుతూ వుండేది. ఒక ప్రక్క ఫకీరువేషాలతో దేశంలో హిందూ ముస్లిం ఐక్యతను నెలకొల్పడం, రెండవ ప్రక్క కోయ వేషాలతో వెనుకబడిన అడవుల్లో నివసించే ఆదివాసుల్ని కూడా మీలో చేర్చుకోండని. "జాపనోడు గేపనోడు తుస్సున పోవాల. ఒక్క ఏరుముక్క కట్టినానంటే హిట్లరూ, గిట్లరూ ఎగిరిపోవాల, ఏటనుకున్నారో" అంటూ వీధులవెంట బయలుదేరారు.

## పునరుద్ధరించిన ప్రాచీన కళారూపాలు :

మరోప్రక్క క్వారీ కూలీపాటలతో—

ఓ సాయీ బన్నయ్యా, ఓ సాయీ బన్నయ్యా
నీవూ నే కలుసుండీ నిలిచిపోరాలన్నా.

అనీ. పకీరువేషాల్లో—



పాడివంటల్, సల్‌గుండాలి "అల్లాకే నాం"
తల్లిపిల్లల్ వల్‌గుండాలి "అ"
హిందు ముస్లింలంత "అ"
వారి హేకం కావాలండి "అ"

అంటూ అన్ని మతములవారు, అన్ని జాతులవారు ఐక్యముగా వుండాలని అల్లాకే నాం ద్వారా ఆశీర్వదించారు.

ఇక పల్లెల్లో కూలీ స్త్రీలు వూరుకున్నారా? పంటచేల రొదలలో తుమ్మెదల్లా మెరుస్తూ తుమ్మెదపాటలు పాడారు.

పాడవే పాడవే తుమ్మెదా మంచి
పాటలెన్నో పాడు తుమ్మెదా॥

జర్మనీ జపాను తుమ్మెదా గొప్ప
జనహంతకులు వారు ॥తు॥
స్త్రీల హింసించారె తుమ్మెదా, పంట
చేలు అగలెట్టారె తుమ్మెదా॥

అని కోకిల కంఠాలతో పొలాలన్నిటా మారు మ్రోగించారు. ఆ పొలాల ప్రక్కనుంచి ప్రవహించే కాలువల్లో నడిచే పడవ సరంగుల పాటల్నికూడ విని పించారు.

పడవెళ్ళిపోవుచున్నదీ
ఐక్యతా పడవెళ్ళిపోవుచున్నదీ
అన్ని జాతులవారి కందుతుం దీ పడవ
స్వయంనిర్ణయసూత్రం
చాటుతుందీ పడవ ॥పడవెళ్ళి॥

అని దేశ ఐక్యతనూ, స్వయంనిర్ణయం సూత్రాన్ని గూర్చి ప్రబోధాలు విని పించేవారు.

అనేకమంది యువకులు రాత్రిళ్ళు జేగంట స్థంభాలను పట్టుకుని-

ఎందుకయ్యా జాగుసేయ భరతవీరుడా
ఇండియాను మ్రింగివేయ హీనులౌ జపానువాళ్ళు
పరుగు పరుగు నొస్తున్నారు
పట్టి తన్నరారా నీవు ॥ఎందు॥

ఈ విధంగా యాచక వేషధారణతో ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం చేశారు. పగలంతా కష్టించి రాత్రిపూట సంద వెన్నెట్లో ఆంధ్రదేశపు కూలి బాబులు--

శివ శివ మూర్తివి గణనాథా నీవు
శివుని కుమారుడవు స్వామినాథా

అనే పాతపాటకు ప్రత్యామ్నాయంగా--

ఖండ ఖండాంతరాల భరతమాతా నీవు
ఖ్యాతిగన్న తల్లివమ్మ భరతమాతా
కూలిరైతు బిడ్డలమమ్మ భరతమాతా
మేము కూలదోస్తాం ఫాసిజాన్ని ॥భరతమాత॥

ఈ విధంగా నవ్య భావాలను మిళితంచేసి పల్లె ప్రజలందర్నీ ప్రబోధించారు.

అదేవిధంగా రైళ్ళలో అడుక్కునే బిచ్చగాళ్ళ పదాలరీతిలో—

అమ్మగారి యిళ్ళు భాగ్యలోగిళ్ళు
భాగ్యాన మాయిళ్ళు పరముగోరేదా
పంటలతొ మాయిళ్ళు బాగైనయిళ్ళు
కరువుతోడా నేడు కళతప్పినాయీ
కరువుదీర్పా మీరు కలసిరారమ్మా
కలసి మీరందరూ కరువుదీర్చండి ॥అమ్మ॥

ఈ విధంగా అనేక జిల్లాలలో వైజ్ఞానిక దళాలు ప్రచారం చేశాయి.

ఎంత దిరిగిన ఏమి దొరకదు
ఖర్మమేమిర అన్నయా

—అనే అన్నా చెల్లెలు పాత్రలు ధరించి గుంటూరుజిల్లా ప్రజా నాట్య మండలి విశేషంగా గ్రామాల్లో ప్రచారం చేసింది.

ఇలాగే కోయవేషాలు, హిట్లరు భాగవతం, సిమ్లా భాగవతం, తెలంగాణా భాగవతం, పేరిగాడి రాజ్యం మొదలైన వీధి భాగవతాలు, రేషనింగ్ రోజుల్లో ప్రజలస్థితిని తెలియజేసే రాములమ్మ దీనచరిత్ర, ఆకలి మంటల పేరుతో పిచ్చి గుంటల కథగా ప్రచారమైంది.

## ప్రజానాట్యమండలి ప్రసిద్ధ బుర్రకథలు :

రాక్షసకృత్యాలు గావించే నైజాము నవాబుకు చిహ్నంగా కన్యకా చరిత్రాన్ని జముకుల కథగాను, కష్టజీవి, స్టాలిన్ గ్రాడ్ యుద్ధం, నాట్యా, ఝాన్సీ లక్ష్మీబాయి, రైతు విజయం, అల్లూరి సీతారామరాజు, వీరేశలింగం, బెంగాల్ కరువు మొదలైనవాటిని చిత్రించే బుర్రకథలూ, సమిష్టిగానాలూ, సై. సై. భారతవీరా అనే వీర గేయాలు, డప్పుల వాయిద్యాలు. జంతరు పెట్టెద్వారా విషయబోధనా- ఇలా అనేక కళా రూపాలను రచయితలూ, కళాకారులూ సృష్టించారు. పైన వివరించిన ఒక్కొక్క

సందేశాన్ని తీసుకుపోయారు. ఈ మహత్తర కృషినీ, ఇంతటి కార్యభారాన్నీ నెత్తినేసుకుని ఒక అపూర్వమైన ప్రబోధంతో ఆంధ్రజాతిని నిస్తబ్దత నుంచి మేల్కొల్పడమే గాక, ఆసేతు హిమాచల పర్యంతం ఆంధ్ర ప్రజా నాట్యమండలి ప్రదర్శనలు గొప్ప సంచలనాన్ని తీసుకువచ్చాయి. కళా రూపాలద్వారా ఎలా ప్రజా సమీకరణనూ, ప్రజా ప్రబోధాన్నీ చేయవచ్చో కళ్ళు తెరిపించింది ప్రజా నాట్యమండలి. ప్రజా నాట్యమండలి కవులందరూ అతి బీద ప్రజా సామాన్యపు బిడ్డలు. ప్రదర్శన లిచ్చిన కళాకారులందరూ అతి సామాన్య కుటుంబాలనుంచి వచ్చిన రైతు కూలీ బిడ్డలు.

## నాలుగు చెరగులా వ్యాపించిన నాటకోద్యమం :

ఇలా ప్రజా నాట్యమండలి ప్రవేశపెట్టిన సుసాంప్రదాయాలు, ఆ వుద్యమ శాఖలు ఆంధ్రదేశమంతటా, ఆంధ్ర నాటకరంగంలో మొలకలెత్తాయి కళా రూపాల స్థాయినుంచి, నాటక ప్రదర్శనాల స్థాయికి చేరుకున్నాయి జమీందారీ యుగాన్ని చిత్రించే "ముందడుగు" నాటకం సుంకర వాసిరెడ్డి కలాల నుంచి బయటపడింది. సుశిక్షితమైన నాటకదళాలు రెండు మూడు తయారైనాయి.

## నాట్యమండలి శిక్షణాశిబిరాలు :

ఆనాడు ప్రజానాట్యమండలి రాష్ట్రదళం ఆంధ్రదేశంలో అనేక జిల్లాలలో క్యాంపులు పెట్టి బుర్రకథలనూ, వీధినాటకాలనూ, చిత్రవిచిత్రమైన జానపదకళా రూపాలనూ తరిఫీదు ఇచ్చేది. ప్రతి క్యాంపు 15 రోజులు నిర్వహించబడేది. క్యాంపుకు వచ్చిన కళాకారులందరికీ ప్రప్రథమంలో డాక్టరు రాజారావు వైద్యపరీక్షను జరిపేవారు. క్యాంపు జరిగినంతకాలమూ ఎవరెవరికి ఏయే మందులుకావాలో, టానిక్కులు కావాలో వాడబడేవి. ప్రతి కళాకారుడూ ఉదయం నాలుగు గంటలకే కాలకృత్యాలు ముగించుకుని సాధన ప్రారంభించేవారు. క్యాంపు పూర్తి అయ్యే లోగా దళాలు కట్టుదిట్టంగా తయారయ్యేవి. క్యాంపు జరిగినంతకాలమూ క్రమశిక్షణ ఖచ్చితంగా అమలు జరుపబడేది. ఈ శిక్షణాశిబిరాలను డాక్టరు రాజారావు, కోగంటి, కోసూరు పున్నయ్య, మిక్కిలినేని, మాచినేని, పట్టంశెట్టి ఉమామహే

శ్వరరావు మొదలైన కళాకారులు నిర్వహించేవారు. శిబిరంలో పొందుతున్న కళాకారులందరూ అన్నదమ్ముల్లా మెలిగేవారు. ఈ క్యాంపుల్లో స్త్రీల దళాలుకూడా తయారయ్యేవి. క్యాంపులో వున్న స్త్రీ పురుషులందరూ అన్నాచెల్లెళ్ళవలె ఆదర్శప్రాయంగా మెలిగేవారు. ఏమాత్రం అశ్లీలత రానిచ్చేవారు కాదు. క్యాంపులో ఆత్మవిమర్శ ఎక్కువగా వుండేది. ఎవరికివారే వారి తప్పులను సరిచేసుకుని ఇతరులకు ఆదర్శప్రాయులుగా వుండేవారు. ఈ క్యాంపులకు అయ్యే ఖర్చు ఆయా దళాలే భరించేవి. ఈ విధంగా రాష్ట్ర ప్రజా నాట్యమండలి అనేక క్యాంపులు నిర్వహించి రాష్ట్రవ్యాపితంగా ప్రజానాట్యమండలి వుద్యమాన్ని వ్యాపింపజేసింది. పైవిధంగా నడిపిన శిక్షణాశిబిరాలు 15 వరకూ వున్నాయి. పై శిబిరాల్లో శిక్షణ పొందిన కళాకారులందరూ అనేక గ్రామాల్లో మరికొన్ని దళాలను తయారు చేయడంద్వారా ప్రతి గ్రామంలో ప్రజానాట్యమండలి శాఖలు ఏర్పడ్డాయి.

**కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి :**

ప్రజానాట్యమండలి రాష్ట్రవ్యాపిత వుద్యమంలో కృష్ణాజిల్లా ప్రజానాట్య



కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి - బుర్రకథదళం
మిక్కిలినేని - ఉమామహేశ్వరరావు—మాచినేని.

మండలి ఆదర్శప్రాయమైన కృషిచేసింది. ఈ దశలో యస్. యల్. పెరుమాళ్లు, కీ॥ శే॥ చదలవాడ కుటుంబరావు, తుమ్మల కేశవరావు, వల్లం నరసింహారావు, వీరమాచనేని మధుసూదనరావు, పొట్లూరు వెంకట సుబ్బారావు, మిక్కిలినేని, మాచినేని, పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు, కోడూరు అచ్చయ్య, కర్నాటి లక్ష్మీనరస్సయ్య, కీ॥ శే॥ సుంకర గోపాలకృష్ణ, సాలార్, కోటిరెడ్డి, కృష్ణారెడ్డి, ప్రసాద్, శ్రీమతి టి. అన్నపూర్ణ, కొండేపూడి రాధ, వీరమాచనేని సరోజిని, బసవపున్నయ్య, కీ॥శే॥ ప్రేమానందం, టి. చలపతిరావు. (మ్యూజిక్ డైరెక్టర్), సజ్జల హనుమంతరావు (తబలిస్టు) మొదలైన కళాకారులు పనిచేస్తూవుండేవారు.

పెరుమాళ్ళు, చదలవాడ, కేశవరావు బుర్రకథ కార్యక్రమాలను జిల్లా వ్యాపితంగా విరివిగా ప్రదర్శిస్తూ వుండేవారు.

# ముందడుగు వేసిన 'ముందడుగు' నాటకం

ప్రప్రథమంగా కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి ముందడుగు నాటకాన్ని తీసుకుని కోడూరు అచ్చయ్య దర్శకత్వంలో అత్యద్భుతంగా ప్రదర్శించారు. అనతికాలంలోనే ఆంధ్రదేశంలో ప్రజాభిమానాలను చూరగొంది. ఈ నాటకంలో పెరుమాళ్ళు ఒక వృద్ధ స్త్రీ పాత్రను అత్యద్భుతంగా నటించేవాడు. వల్లం నరసింహారావు కథానాయకి విమలపాత్రను కడు సమర్థనీయంగా నటించి ప్రేక్షకుల హృదయాలను చూరగొన్నాడు. ఇతర నటీనటులందరూ సమిష్టికృషితో ఆదర్శప్రాయంగా ముందడుగు నాటకాన్ని ప్రదర్శించి అనేక అమెచ్యూర్ నాటకదళాలకు నూతనమార్గం చూపించారు. ఇదేదశలో అపనింద నాటకాన్ని కూడా కట్టుదిట్టంగా ప్రదర్శించారు. కాని ఈ నాటకానికి ప్రజాదరణ అంతగా లభించలేదు.

# ముందడుగు నాటకం గురించి

**శ్రీ ఖాసా సుబ్బారావు :**

"ప్రజానాట్యమండలి ముందడుగు నాటకం అత్యద్భుతప్రదర్శనం. కొన్ని కొన్నివేళల్లో నాకళ్ళవెంట కన్నీటిధారలు జల జలా రాలాయి. నేను పేదవాణి

## కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి దళసభ్యులు ఎడమనుంచి కూర్చున్నవారు



1 వీరమాచనేని సరోజిని-తాతినేని అన్నపూర్ణ-కొండేపూడి రాధ, వల్లం రుక్మిణి
2 పి.వి సుబ్బారావు-కోడూరు అచ్చయ్య-వాసిరెడ్డి భాస్కరరావు-సుంకర సత్యనారాయణ
3 చదలవాడ కుటుంబరావు-కృష్ణారెడ్డి-మిక్కిలినేని రాఘవేంద్రరావు-తుమ్మల కేశవరావు-వల్లం-బసవపున్నయ్య-పెరుమాళ్ళు-కోటారెడ్డి 4 జనార్ధన-సూర్యనారాయణ- తాతినేని చలపతిరావు-హనుమంతరావు-కృష్ణమూర్తి-రాఘవాపురపు అప్పారావు-ప్రేమానందం

# ప్రజానాట్యమండలి గ్రూపు ఫొటోలు



**ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రదళ సభ్యులు ఎడమనుంచి 3 వరుసలు**

1 మిక్కిలినేని సీతారత్నం - డా॥ మిక్కిలినేని - సి. మోహనదాసు - నాజరు - సుంకర - మాచినేని - పూర్ణచంద్రరావు - సిరివిసెట్టి - భూపతిరాజు సూర్యకాంతం, 2. (తబలిస్టు) సుబ్రహ్మణ్యం - ఉమామహేశ్వరరావు - బి పురుషోత్తం - వెంపటి - (ఆర్కెస్ట్రా) జయరాం - కోగంటి, 3. కోసూరి పున్నయ్య - ఏపూరు రామకోటి - డా॥రాజారావు - బి గోపాలం - శ్రీహరి (మైక్ ఆపరేటర్)



బందరు తాలూకా, కప్పలదొడ్డి ప్రజానాట్యమండలి దళ సభ్యులు


శ్రీ బెల్లంకొండ రామదాసు


శ్రీ గొల్లపూడి మారుతీరావు


శ్రీ కొప్పరపుసుబ్బారావు


శ్రీ కనకాల దేవదాస్


శ్రీ గుడిపాటి వెంకటచలం


శ్రీ కొడాలి గోపాలరావు


శ్రీ మోదుకూరి జాన్సన్


శ్రీ సాక్షి రంగారావు


శ్రీ సి.హెచ్. నాగభూషణం


'దృశ్యకావ్యధురీణ'
శ్రీ భమిడిపాటి రాధాకృష్ణ


శ్రీ రాచకొండ
విశ్వనాథ శాస్త్రి


పద్మభూషణ్
శ్రీ ఎ.ఆర్. కృష్ణ


శ్రీ కూర్మా వేణు
గోపాలస్వామి నాయుడు


శ్రీ అబ్బూరి రామకృష్ణారావు


శ్రీ ఆచార్య ఆత్రేయ


శ్రీ పులిగుండ్ల రామకృష్ణయ్య


శ్రీ అనిసెట్టి సుబ్బారావు


శ్రీ రామచంద్ర కాశ్యప


శ్రీ కొడాలి ఆదిశేషయ్య


శ్రీ ఎన్.ఆర్. నంది


శ్రీ కొర్రపాటి గంగాధరరావు


శ్రీమతి కొప్పరపు సరోజిని


శ్రీమతి నిర్మలమ్మ


శ్రీ కె. వెంకటేశ్వరరావు


డా॥ రాజారావు


డి.వి. నరసరాజు


ఆర్.వి. చలం


పినిశెట్టి


యన్.టి. రామారావు

అయినా 116 రూపాయలు ఇస్తున్నాను. ప్రజానాట్యమండలిని అభినందిస్తున్నాను.

**శ్రీ ఉప్పల లక్ష్మణరావు :**

"నేను అనేకమైన ప్రసిద్ధ నాటక ప్రదర్శనాలను ఐరోపా మొదలైన దేశాలలో చూశాను. కాని ఈ ముందడుగునాటకంమాత్రం నేను చూచిన అన్ని ప్రదర్శనాలకంటే ఎక్కువగా కదిలించివేసింది.

నిజంగా ప్రజానాట్యమండలిలో ఇంతటి సమర్థులైన నటులున్నారని నేనెప్పుడూ వూహించలేదు."

**శ్రీమతి కొమ్మూరి పద్మావతీదేవి :**

"ప్రజానాట్యమండలివారు ముందడుగు ప్రదర్శించి మా అందరికి దారి చూపించారు. నేను ఎన్నో నాటకాలు చూశాను. ప్రసిద్ధనటులతో నటించాను. కళను గురించి ప్రముఖుల ఉపన్యాసాలు విన్నాను. నటులున్నారుకాని నాటకాలు లేవన్నారు. ఈ ప్రజానాట్యమండలివారు మాత్రం క్రియారూపంగా ముందడుగు వేసి మరీ చూపించారు."

**స్త్రీల బుర్రకథ దళం :**

పురుషుల బుర్రకథ దళాలతోపాటు స్త్రీల బుర్రకథ దళాలుకూడ అత్యంత ప్రాముఖ్యాన్ని వహించాయి. ప్రథమంలో మోటూరు ఉదయం, చింతల కోటేశ్వరమ్మ, మహంకాళి పార్వతి మొదలైనవారితో ఒక దళం ఏర్పడి గుంటూరు జిల్లాలో ప్రజాప్రబోధాన్ని గావించింది. తరువాత కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో కొండేపూడి రాధ, తాపీ రాజమ్మ, వీరమాచనేని సరోజని మొదలైనవారు బుర్రకథ దళంగా ఏర్పడి, అల్లూరు సీతారామరాజు జీవితచరిత్రను సుంకర బుర్రకథగా వ్రాయగా, ఆ కథను ఎంతో రసవత్తరంగా ప్రదర్శించి ఆంధ్రప్రజానీకాన్ని వుర్రూతలూగించారు. ఆంధ్రదేశంలో అనేక ప్రాంతాల్లో ఈ కథను చెప్పడమేగాక, మద్రాసు నగరంలో మంత్రుల సమక్షంలో ప్రదర్శించి ఆనాటి కాంగ్రెసు మంత్రుల మన్ననలు పొందడమేకాక వారినుండి పారితోషికాలు కూడా పొందారు. కాని అనతికాలంలో ఈ కథను కాంగ్రెసు ప్రభుత్వం నిషేధించింది. ఆ తరువాత భీమవరం బాలికల బుర్రకథ దళం కూడా ప్రజామన్ననలు పొందింది.

# బుర్రకథ ప్రశంస

**శ్రీ నిడదవోలు వెంకటరావు :**

"ఇదివరలో బుర్రకథ అనుకోవడమేగాని దాని సంగతి నాకు తెలియదు. బుర్రకథ అని మామూలుగా వ్యవహరించేదానికి ఎంత లోతైన అర్థముందో! చెన్నపురిలో జరిగిన వీరేశలింగంగారి చరిత్ర, వంగదేశంలో కరువు బుర్రకథలుగా విన్నాను. మొదలుపెట్టిన దగ్గరనుండి తదేక ధ్యానముతో విన్నాను. తెనుగు మాట, తెనుగుపాట, తెనుగువేషము-ఈ మూడు మూర్తీభవించినవి. అచ్చు గ్రుద్దినట్లు మాటలు, పాటలు, గుండెలలో సూటిగా నాటుకొని పోయినవి. కన్నులార చూడడము, చెవులార వినడముచేత మనసార తెలుగుదనము హత్తుకొని పోయినది. హృదయము నాలుగు మూలలా కదిలించింది. జడత్వమును వదిలించినది. తెనుగురక్తము నాడులలో పూర్తిగా ప్రవహించడము మొదలుపెట్టినది. హృదయ కుహరములనుండి జలజల వచ్చే ప్రవాహరూపకమైన కరుణ రసము ఆపుటకు వీలులేని స్థితి వచ్చినది."

# చరిత్రాత్మకమైన 'మాభూమి' నాటకం

**సుంకర,**

**వాసిరెడ్డి ప్రతిభ :**

ముందడుగు, అపనింద నాటక రచయితలైన సుంకర సత్యనారాయణ, కీ॥ శే॥ వాసిరెడ్డి భాస్కరరావుగార్లే చరిత్రాత్మకమైన మాభూమి నాటకాన్ని కూడా రచించారు. నైజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా తెలంగాణా ప్రజలు జరిపిన పోరాట ఫలితమే మాభూమి నాటక ఇతివృత్తం. నైజాం కిరాతక పోలీసులూ, రజాకార్లూ, తెలంగాణా గ్రామాలను భస్మీపటలం చేశారు. ఈ పోరాటంలో 240 గ్రామాలపైన విపరీతమైన పోలీసుదాడులు జరిగాయి. 8500 మంది జైళ్ళలో త్రోయబడ్డారు. 12 లక్షల 25 వేల విలువగలిగిన ఆస్తులు లూటీ చేయబడ్డాయి. 52 మంది వీరులు ప్రాణాలను కోల్పోయారు. 64 గురు తెలుగు ఆడపడుచుల్ని

కిరాతకులు మానభంగం చేశారు. వీరిలో ఇద్దరు మరణించారు. నల్లగొండ జిల్లాలో జరిగిన ఈ మహోజ్వల పోరాటమే మమ్మల్నీ నాటకం రాయడానికి ప్రోత్సహించిందని మాభూమి రచయితలు పీఠికలో వ్రాసుకున్నారు. పైన వుదహరించిన వారే గాక, తెలంగాణా విముక్తి పోరాటంలో కొన్నివేలమంది వీరులు అమరులై నేల కొరిగారు.

తెలంగాణా ప్రజలు వీరోచిత పోరాటాలు భారతదేశాన్ని ఉర్రూత లూగించాయి. ప్రపంచమంతటా ఆనాటి తెలంగాణా పోరాటాన్ని గూర్చి కథలుగా చెప్పుకున్నారు. ఈ ఉజ్వల చరిత్ర ప్రతిబింబమైన మాభూమి నాటకం ముక్కోటి ఆంధ్ర ప్రజలకు కనువిప్పు కలిగించింది. ఆంధ్రదేశంలోనే గాక, రాష్ట్రేతర ప్రాంతాలైన మద్రాసు, షోలాపూరు, పూనా, బొంబాయి, అహమ్మదాబాద్ మొదలైన చోట్ల ప్రదర్శించి, తెలంగాణా వీరోచిత పోరాట గాథను ఇతర రాష్ట్రవాసులకూ తెలియజేశారు. ఈ ప్రచారంలో ఆంధ్ర ప్రజా నాట్యమండలి రాష్ట్రదళం, కృష్ణాజిల్లా దళం ప్రముఖపాత్ర వహించాయి. 1947 లో 125 ప్రజానాట్యమండలి శాఖలు సంవత్సరం తిరగకమునుపే వెయ్యి నాటకాలను ప్రదర్శించాయి. ఒక్క నాటకాన్ని 125 దళాలు సంవత్సరం తిరగకమునుపే వెయ్యి నాటక ప్రదర్శనాలివ్వడం వరల్డు రికార్డన్నాడు-క్వాజా అహమ్మద్ అబ్బాస్, బొంబాయిలో మాభూమి నాటకం చూచి.

మాభూమి నాటక ప్రదర్శనాలను ఆనాడు 20 లక్షలమంది ప్రజలు చూశారు. ఆంధ్రదేశంలో ఇంత తక్కువ కాలంలో ఇంతమంది ప్రజలు ఏ నాటకాన్నీ దర్శించలేదు.

మంత్రులు, రాజకీయ నాయకులు, కవులు, పండితులు, గాయకులు, పత్రికా సంపాదకులు, రచయితలు, ఎం. ఎల్. ఏలు మొదలైన అన్ని తరగతి ప్రజలూ, అన్ని వర్గాలవారూ మాభూమి నాటకాన్ని చూచి ఉత్తేజం పొందారు. సోదర తెలంగాణా ప్రజల కష్టాలనూ ఈ నాటకంద్వారా కళ్ళారా తిలకించారు.

మాభూమి నాటకంలోని ప్రతిపాత్రా - ఆ గడ్డలో పుట్టి పెరిగిన జీవితాలు. వాస్తవికమైన పాత్ర చిత్రణ - వారిలోవున్న అవినాభావ సంబంధం - తెలంగాణా యాస - మృదు మధురమైన మాండలిక సొగసులతో మాభూమి నాటకం ఒక మహా కావ్యంగా నిలబడింది.

**మాభూమి నాటకం,**

**పెద్దల ప్రశంసలు :**

**శ్రీ విశ్వనాథ సత్యనారాయణ :**

"ఈ నాటక రచన కొద్దిలో మిక్కిలి అందంగా వుంది. ఇందులో అచ్చమైన తెలుగు జాతీయము కుప్పలు కుప్పలుగా వుంది. మాభూమిలో వున్న భాష తెలుగు గడ్డలో పుట్టిన భాష. ఈ నాటకం జందగీ సమాధితో మొదలు పెట్టుతుంది. చివర సమాధులతో పూర్తి అవుతుంది. ఒక కావ్యానికి ఆద్యంతాలు ఇంత చక్కగా బిగించడం ఒక శిల్పపు నేర్పు."

తిక్కన తరువాత మళ్ళీ ఈ నాడు జాతీయమైన భాష విన్నాం. ఆనాటి తెలుగు ఔన్నత్యం పునరుద్ధరించ బడుతూ వుందని ఈ కవులు రుజువు చేశారు.... అని పింగళి లక్ష్మీకాంతంగారు కొనియాడారు.

మాభూమి తెలంగాణా ప్రజల్లో అసమర్థతను పారద్రోలి, తెలంగాణాలో ఒక విప్లవ జ్యోతిని వెలిగించుతోంది. ఆంధ్ర నాటకరంగంలో ఒక కొత్తశకం ప్రారంభమైంది అన్నారు కొప్పరపు సుబ్బారావుగారు.

....శ్రీ గురజాడ అప్పారావుగారే ఈ నాటకాన్ని చూచి వున్నట్లయితే తాముపడ్డ కష్టాలన్నీ ఫలించినాయి అని అనివుండేవారని నా భావం. ఇక్కడ కూర్చున్నంతసేపూ, నాటకం చూస్తున్నంతసేపూ నాటకం చూస్తున్నట్లు లేదు. ఈ దృశ్యాలన్నీ మన కళ్ళ ఎదుట జరుగుతున్నట్లే వుంది....అని గిడుగు సీతాపతిగారు అభినందించారు.

ఆంధ్ర ప్రజా నాట్యమండలివారు ప్రదర్శించిన "పరివర్తన" "మాభూమి" నాటకాలను చూశాను. ఈ నాటకాలు రెండూ, రెండే....ఈ ప్రదర్శనలు నేను మరవలేనివి అన్నారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

**శ్రీ శ్రీనివాస చక్రవర్తి ప్రశంస :**

1920 లో బళ్ళారి రాఘవ వెలిగించిన విప్లవజ్యోతిని ఆనాటి నటు లందుకోలేక పోయారు. కాని, 1940 తరువాత సాంస్కృతికంగా - రాజకీయంగా దేశంలో వచ్చిన చైతన్యం ఫలితంగా రాఘవ వెలిగించిన విప్లవజ్యోతిని అందుకుని ప్రజా నాట్యమండలి 1945 లో ఆవిర్భవించింది. ఇందులోని వారిది సాంస్కృతికంగా-

రాజకీయంగా ఒకటే ఆశయం. సుసంఘటిత శక్తితో నాటకరంగాన్ని సజీవం చేయడానికి ఒక పెద్ద వుద్యమం లేవదీశారు. దీనికి కమ్యూనిస్టుపార్టీ అండగా నిలిచింది. పల్లెపల్లెనా పట్టణ పట్టణానా దీనికి అనుబంధశాఖ లేర్పడ్డాయి. డా॥ రాజారావు - కోడూరు అచ్చయ్య దీనికి సన్నాహకర్తలు. వాసిరెడ్డి - సుంకర ప్రజా సమస్యలను నాటకరూపంలో చిత్రించి ఇచ్చారు. నటులు కష్టించి సాధన చేసి ఉత్తమ ప్రదర్శనాలిచ్చి, అటు కళావేత్తల - ఇటు ప్రజానీకం మన్ననల నందుకున్నారు.

ముఖ్యంగా మాభూమి నాటకం దేశాన్ని ఉర్రూత లూగించింది. అభినయంలో, రంగాలంకరణలో వాస్తవికతకు ప్రాధాన్యత చేకూర్చింది. ఫ్లాష్‌లైట్లు మొదలగు ఆధునిక పరికరాలను ప్రచారంలోకి తెచ్చారు. స్టేజి నాటకాలే కాక చెంఏతపాటలు - బుర్రకథలు - జముకులకథలు- వీధినాటకాలు మొదలైన తెలుగు జాతీయ గ్రామీణకళలను పునరుద్ధరించి, ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ప్రజా నాట్యమండలి నవ్యయుగం స్థాపించి, ఆంధ్ర జాతి ముందడుగు వేయడంలో ఎంతగానో తోడ్పడింది.

### శ్రీ పి.యస్.ఆర్. అప్పారావు :

ప్రజా నాట్యమండలివారి ప్రదర్శనాలన్నీ చక్కని శిక్షణతో జరిగి విరోధులను కూడ ఆకర్షించాయనడంలో అతిశయోక్తిలేదు. ప్రజా నాట్యమండలి పల్లె ప్రజలలో కలిగించిన సాంఘిక రాజకీయ చైతన్యం అపూర్వమైంది. అందుకు వారు చేపట్టని జానపద కళారీతియే లేదని చెప్పవచ్చు. నాటక కళను-కళా దృష్టి తొలిగి పోషికయే ప్రచార సాధనంగా చేశారు. ప్రజా నాట్యమండలికి ముందు నాటక ప్రదర్శనాలను చూడవలెనంటే పల్లె ప్రజలు పనికట్టుకుని పట్టణాలకు రావలసి వచ్చేది. కాని ప్రజా నాట్యమండలివారు పల్లెలకేపోయి అక్కడనే నాటకాలను ప్రదర్శించటం విశిష్ట విషయం.

### ప్రజానాట్యమండలి

### నాటక ప్రదర్శనం :

ప్రజానాట్యమండలి రాష్ట్రదళం, కృష్ణాజిల్లాదళం, ముందడుగు, అపనింద, పరివర్తన, మాభూమి మొదలైన నాటకాలనూ అనేక నాటికలనూ ప్రదర్శించాయి.

రాష్ట్రస్థాయికి డా. రాజారావు, జిల్లాదశానికి కోడూరు అచ్చయ్య దర్శకత్వబాధ్యతలను నిర్వహించారు. శిక్షణాశిబిరాల్లో ఈ నాటకాలు తయారయ్యేవి. రచయితలూ, దర్శకులూ, నటీనటులూ అందరూ సమిష్టిగా కథనుగురించి సావకాశంగా చర్చలు జరిపేవారు. ఒక నిర్ణయానికి వచ్చినతరువాత నాటకం వ్రాయబడేది. అందరి సమక్షంలో నటీ, నటులకు అర్థమయ్యేవిధంగా రెండుమూడుసార్లు నాటకాన్ని పఠించేవారు. చేయవలసిన మార్పులు చేసినతరువాత పాత్రవిభజన జరిగేది. పాత్ర విభజనానంతరం పాత్రల మనస్తత్వాన్ని తెలియజేసి, ఆయా పాత్రధారుల చేత సంభాషణలు చదివించేవారు. ఈ దశలో వాచికాభినయంలో కావలసిన మార్పులు చేసేవారు. పాత్రధారికి క్షుణ్ణంగా సంభాషణలు వచ్చినతరువాత నిలబెట్టి రిహార్సల్సు చేయించేవారు. ఆంగికాభినయం, రంగస్థల కదలికలన్నీ సరిచూడ బడేవి. ముందు ఒక్కొక్క సీనులోనూ, ఒక్కొక్క సన్నివేశాన్ని కట్టుదిట్టంగా బిట్ రిహార్సల్సు జరిపి, ఆ రంగానికి కావలసిన పరిపుష్టిని కలిగించేవారు. తరువాత నాటకానికి పూర్తి వద్దికలు జరిపేవారు. ఈ వద్దికల సమయంలో నటీనటులందరూ వారివారి పాత్రలను క్షుణ్ణంగా మననం చేసుకుని, వారి పాత్ర ప్రవేశానికి సిద్ధంగా వుండేవారు. ఇలా ప్రతిరోజూ నాటకాన్ని ఒకటి రెండుసార్లు రిహార్సల్సు జరిపేవారు. ఒక రిహార్సల్సులోకంటే, రెండవ రిహార్సల్సులో కావలసిన మెరుగులు దిద్దుతూ వుండేవారు. ఇలా అనేక రిహార్సల్సు జరిపి ఒకరోజున స్థానికంగావున్న విమర్శకుల ముందు ప్రదర్శించేవారు. ఈ ప్రదర్శనంలో వేషధారణ ఏమాత్రమూ వుండేదికాదు. ఆ ప్రదర్శనానంతరం విమర్శకుల సూచనలు తీసుకునేవారు. అందరూ సమిష్టిగా మంచిచెడులను పరిశీలించి చర్చలు జరిపేవారు. ఈ చర్చలు ఎంతో హుందాగా జరిగేవి. నటీనటులందరూ హృదయపూర్వకంగా విమర్శకుల సూచనలను స్వీకరించేవారు. తరువాత పూర్తి రిహార్సల్సు జరపడం ద్వారా విమర్శలో వచ్చిన లోపాలను సరిదిద్దుకుని డ్రస్సు రిహార్సల్సు జరిపేవారు. తద్వారా అలంకరణలో కావాల్సిన స్వల్ప మార్పులను అప్పుడే సరిచూచుకునేవారు. ప్రదర్శనానికి ముందే ఎవరి పాత్ర ఎలావుండాలో ప్రతి పాత్రధారికి ఒక అభిప్రాయాన్ని కలిగించేవారు.

## పక్కా రంగస్థలంలో ప్రదర్శన :

ఆ తరువాత పక్కా రంగస్థలంలో తెరలూ, లైటింగ్ ఎఫెక్ట్సు చూచుకో

వడానికి పూర్తి రిహార్సల్సు జరిపేవారు. ఈ సందర్భంలో మళ్ళీ కొంతమంది విమర్శకులనూ, ప్రేక్షకులనూ కూడ ఆహ్వానించి నాటకాన్ని పూర్తి హంగులతో ప్రదర్శించేవారు. ప్రదర్శనానంతరం తెరలు, రంగప్రదీపనంలో కావలసిన మంచి చెడులను విమర్శకులనుండీ, ప్రేక్షకులనుండీ సేకరించేవారు. ఇలా నాటకాన్ని ఒక ఉత్తమ ప్రదర్శనంగా తీర్చిదిద్దేవారు.

## ప్రదర్శనం రోజు :

ప్రదర్శనంరోజున అందరూ అన్ని పనులూ విభజించుకునేవారు. ఒకరు ఎక్కువ, మరొకరు తక్కువ అనే భేదాభిప్రాయాలకు తావుండేదికాదు. అందరూ ప్రదర్శనానికి రెండు గంటలముందు గ్రీన్‌రూమ్‌కు చేరుకుని ఎవరి అలంకరణను వారే సరిదిద్దుకునేవారు. ప్రదర్శనానికి ముందే అన్నిపాత్రలూ వేషధారణను ముగించుకుని ఆహ్లాదంగా వారి వారి పాత్రలను మరొకసారి వల్లెవేసుకుని ఎవరి సీనులో ఎవరెవరికి ఏయే సామానులు కావాలో, ఎవరు ఎటునుంచి ప్రవేశించాలో, ఎటు నిష్క్రమించాలో, వా రుపయోగించే చిన్నచిన్న పరికరాలను సైతం సరి చూచుకుని సిద్ధంగా వుంచుకునేవారు. ప్రదర్శనం రాత్రి 10 గంటలకు. ప్రేక్షకులు వచ్చినా రాకపోయినా 9-45 నిమిషాలకు మొదటిగంట మ్రోగేది. సరిగా పది గంటలకు నాటకం ప్రారంభమయ్యేది. ప్రదర్శనం పూర్తి అయ్యేవరకూ నాట్య మండలి సభ్యులందరూ ఒక్క త్రాటిమీద నడిచేవారు. రంగాలమధ్య విరామాలు, లేకుండా ఒక్క ప్రక్కనుండి సామాన్లు తీసివేస్తూంటే మరో ప్రక్కనుంచి ఆ రంగానికి కావలసిన పరికరాలు సర్దబడేవి. ఇలా సమిష్టికృషితో నాటకప్రదర్శనం జయప్రదమై ప్రేక్షకుల కరతాళధ్వనులను అందుకునేది. ఇలా ప్రజానాట్యమండలి నాటకప్రదర్శనం ముగిసేది.

ఈ ప్రదర్శనాన్ని చూడడానికి అనేక పట్టణాలనుండీ గ్రామాలనుండీ అనేక దళాలకు సంబంధించిన నటీ నటులు వచ్చేవారు. ఈ ప్రదర్శనాన్ని చూచిన తరు వాత అదే నాటకాన్ని ఆవశీలగా అన్ని దళాలు ప్రదర్శించేవి.

ప్రజా నాట్యమండలి ప్రదర్శించే ప్రదర్శనాలు ఏ పట్టణంలో ప్రదర్శించినా స్థానికంగా వున్న కళాకారులను, విమర్శకులను ఉచితంగా ప్రదర్శనానికి ఆహ్వా నించేవారు. ప్రదర్శనానంతరం వారి విమర్శలు తీసుకునేవారు. మంచి చెడులను

తిరిగి చర్చించి మరో ప్రదర్శనంలో వారిచ్చిన సూచనలు అమలుపర్చడంద్వారా ప్రతి ప్రదర్శనానికీ కొత్త మెరుగులు దిద్దుతూ వుండేవారు ఈ విధంగా ప్రదర్శనం రోజు రోజుకూ కొత్తరూపును సంతరించుకునేది.

## ఒకే రాత్రి రెండు ప్రదర్శనాలు :

అనాడు ప్రజా నాట్యమండలి నాటక ప్రదర్శనమంటే మూడు రోజులు ముందుగానే టికెట్లన్నీ ఐపోయేవి. చుట్టుప్రక్కల గ్రామాలనుండీ, దూరప్రాంతాల నుండీ తండోపతండాలుగా ప్రజలు వచ్చేవారు. ప్రతి ప్రదర్శనానికీ హాలు నిండి పోయి రెండవ ప్రదర్శనానికి సరిపడినంతమంది ప్రేక్షకులు మిగిలిపోయేవారు. అందువల్ల ప్రతి పట్టణంలోనూ ఒకేరాత్రి రెండు ప్రదర్శనలను ప్రదర్శించవలసి వచ్చేది. ఇలా ఒకే రాత్రి రెండు ప్రదర్శనలను ప్రదర్శించే సాంప్రదాయం ప్రప్రథమంగా ఆంధ్రదేశంలో ప్రజా నాట్యమండలే ప్రవేశ పెట్టింది. ఈ విధంగా ప్రజా నాట్యమండలి నాటక ప్రదర్శనలు ప్రజాదరణను పొందాయి.

## రాష్ట్రేతర ప్రదర్శనాలు :

ప్రజా నాట్యమండలి రాష్ట్రదళం ఆంధ్రదేశంలోనేకాక ఇతర రాష్ట్రాల్లో కూడా పర్యటించి ప్రదర్శనలనిచ్చి రాష్ట్రేతరుల ప్రశంస లందుకుంది.

రాష్ట్రదళ సభ్యులైన, మిక్కిలినేని- మాచినేని - ఉమామహేశ్వరరావు బుర్రకథదళంద్వారా ఖరగ్‌పూర్-కలకత్తా-ఖాన్‌నగర్-జగదల్-మహేష్-టిటాఘర్-హూగ్లీ మొదలైన చోట్ల బుర్రకథ ప్రదర్శనాలనిచ్చి అధిక ప్రశంసల నందుకుంది

## రాష్ట్రదళ సభ్యులు :

1948 జనవరిలో అహమ్మదాబాదులో జరిగిన అఖిల భారత ప్రజా నాట్య మండలి మహాసభకు రాష్ట్రదళ సభ్యులైన డా. రాజారావు-కోసూరు పున్నయ్య-మిక్కిలినేని-సి. మోహన్‌దాసు-నాజరు-సుంకర సత్యనారాయణ-మాచినేని పూర్ణ చంద్రరావు-సిరివిశెట్టి సుబ్బారావు - మిక్కిలినేని సీతారత్నం - చిరంజీవి సూర్య కాంతం-కోగంటి గోపాలకృష్ణయ్య-పట్టంశెట్టి ఉమామహేశ్వరరావు-వెంపటి రాధా కృష్ణ - ఏపూరు రామకోటి - పురుషోత్తం - బి. గోపాలం - జయరాం - సుబ్రహ్మణ్య - శ్రీహరి - అమృతయ్య - ఏసుదాసు - డాక్టరు చంద్రశేఖరం మొద

లైన కళాకారులందరూ హాజరైనారు. ఈ దళం అహమ్మదాబాదు, బొంబాయి, పూనా, షోలాపూర్ మొదలైన ప్రాంతాల్లో 15 కళారూపాలను ప్రదర్శించడమేకాక మాభూమి నాటకాన్ని ప్రదర్శించడంద్వారా రాష్ట్రీకరుల్ని వుత్తేజపర్చింది. ఆనాటి నిజాం నిరంకుశ పరిపాలనను కళ్ళకు కట్టినట్లు చూపింది.

అహమ్మదాబాదు మహాసభలో ఆంధ్రదళం ప్రదర్శనలు అగ్రశ్రేణిలో నిలిచాయి. అన్ని రాష్ట్రాల ప్రదర్శనలకంటే మిన్న అనిపించుకున్నాయి. క్వాజా మహమ్మద్ అబ్బాస్, బెంగాలీ నటుడు మనోరంజన్ భట్టాచార్య, బల్‌రాజ్ సహానీ, ప్రేమధావన్ మొదలైన కళాకారులు బొంబాయి ఖాల్సాకాలేజీలో రాష్ట్రదళ సభ్యులను ఘనంగా సన్మానించారు. మాభూమి నాటకం బొంబాయి, పూనా, అహమ్మదాబాదు, షోలాపూర్ నగరాలలో వరుసగా ప్రదర్శింపబడి అన్యభాషేతరుల ప్రశంసలు కూడా పొందింది. ఒక్క షోలాపూర్‌లో మాభూమి నాటక ప్రదర్శనం చూడడానికి 0-4 0 టిక్కెట్టుకొని 10 వేలమంది హాజరై ప్రదర్శనాన్ని తిలకించారు.

# ప్రజానాట్యమండలి చేపట్టిన కళారూపాలు

**జానపద కళారూపాలు :**

బుర్రకథ - జముకుల కథ - హరికథ - పిచ్చుగుంటుల కథ - వీధి భాగవతం - కోయవేషం - డప్పులకోలాటం- దేవరపెట్టె - పంటసిరి నృత్యం - సై సై నృత్యం - క్వారీపాటలు - పడవపాటలు-చిరతలకోలాటం-చెంచువేషాలు - ఫకీరువేషాలు - గొల్లసుద్దులు - హరిహరి పదాలు - సమిష్టిగానాలు - శాంతి మూకాభినయనం - చక్కభజన - జంతరుపెట్టె - షాడోప్లే - కనక తప్పెట్లు- పిట్టలదొర - సోదె మొదలైనవి.

**నాటకాలు :**

ముందడుగు - అపనింద - మాభూమి - పరివర్తన - కన్యాశుల్కము - వరవిక్రయం - ఆసామి - వీరేశలింగం ప్రహసనాలు - ఇంగా - అల్లూరి సీతారామరాజు - జైభవాని - ఈనాడు.

**నాటికలు :**

పశ్చాత్తాపం - ప్రతిమ - మబ్బుతెర - పరిష్కారం - ఇల్వా - దేశ

భక్తులు - ద్రోహి - ప్రెస్‌వర్కర్ - ప్రసూతి - ప్రగతి - జీతగాడు-వీరకుంకుమ.

## ఉత్సాహంకొద్దీ నిర్మించింది కాదు

## ప్రజానాట్యమండలి :

ఉత్సాహం కొద్దీ నిర్మించింది కాదు ప్రజా నాట్యమండలి. అది ఒక ఉధృతమైన వాతావరణంలో జన్మించింది.

కేవలం ఆర్థికలాభాలకొరకు నిర్మించింది కాదు. ఒక ఉన్నతాశయ ప్రబోధంతో దేశానికి ప్రజలకు సేవచేయడానికి పుట్టింది.

కళ కళకోసం కాదని, అది ప్రజలకోసమని నిరూపించింది.

కళ వ్యక్తులసొత్తు కాదనీ, అది ప్రజలకు చెందిన ఆస్తి అనీ చాటింది.

దేశంలో వచ్చిన రాజకీయ కల్లోల వాతావరణంలో రూపొందింది ప్రజా నాట్యమండలి. అదివరకు ఏనాడూ ఆంధ్ర నాటకరంగంలో కనీ వినీ ఎరుగనంతటి మహత్తర పరిణామాలను సృష్టించింది. గత చరిత్రకంటే ఈ యుగంలోనే నాట్యకళ సంపూర్ణంగా ప్రజాసామాన్యం మధ్యకు పోయిందని చెప్పవచ్చు. ప్రజలయొక్క స్థితిగతులకు అనుకూలంగా వారి కష్టాల్లో పాలు పంచుకుని పరిష్కారమార్గాలను కళారూపాలద్వారా పరిష్కరించింది. ప్రజలు నాటకరంగాన్ని తమ కన్నబిడ్డను ఆదరించినట్లు ఆదరించింది ఈ రోజుల్లోనే.

## ఎన్నో క్యాంపులు - ఎన్నో దళాలు - ఎందరో నటులు :

ఈ మహత్తర కృషిలో నాట్యమండలి సభ్యులందరూ కలిసికట్టుగా పని జేశారు. ప్రతి వ్యక్తి దేశభక్తితో నడుంకట్టి నిలబడ్డారు. అనతికాలంలో ఆంధ్ర దేశమంతటా కొన్నివేలమంది యువకుల్నీ, యువతుల్నీ, బాలబాలికల్నీ ప్రజా నాట్యమండలి ఆకర్షించింది. కొన్నివందలమంది కళాకారులను క్యాంపులు పెట్టి తరిఫీదు నిచ్చింది. అనతికాలంలో ఆంధ్రదేశంలో ప్రతి వ్యక్తికీ ప్రజా నాట్య మండలి మహత్తర ప్రబోధం తెలిసిపోయింది. ఊరూరా దళాలు ఏర్పడ్డాయి. ప్రతిరాత్రి ఏదో ఒక గ్రామంలో ఎక్కడో ఒక మహాసభలో ప్రదర్శనలు ఇవ్వ బడుతూ వుండేవి. ఆనాడు జరిగిన ప్రతి సభలోనూ వైజ్ఞానిక ప్రదర్శన లివ్వ బడాయి. ప్రతి వూరేగింపులోనూ నాట్యమండలి కళాకారులు గేయాలు

పాడారు. ప్రతి సాహిత్యసభలోనూ గురజాడ దేశమును ప్రేమించుమన్నా గేయం, వీరేశలింగం బుర్రకథ తప్పకుండా చెప్పబడేవి.

## ప్రజాశక్తిగా నిలబడిన ప్రజానాట్యమండలి :

ఆనాడు ప్రజావుద్యమాల్లో ప్రజానాట్యమండలి కూడా ఒక శక్తిగా నిలబడింది. నాట్యమండలి ప్రదర్శనలంటే ఎవ్వరికీ ఏవిధమైన భేదాభిప్రాయాలుండేవి కావు. ఉన్నత, మధ్యమ, పేదప్రజల వరకూ అందరూ ఏక దృష్టితో చూచి ఆనందించేవారు.

ఒక్కొక్క బుర్రకథకు 20 వేలమంది ప్రేక్షకులవరకూ హాజరయ్యారంటే నాట్యమండలి ప్రదర్శనలకు ప్రజాదరణ ఎంత వుందో బోధపడుతుంది.

## కళాకారుల కోలాహలం :

ఏదో ఒక గ్రామంలో ప్రజా నాట్యమండలి ప్రదర్శనం ఇస్తూ వుందంటే చుట్టుప్రక్కల గ్రామాలనుంచి తండోపతండాలుగా బళ్ళుకట్టుకుని బారులు తీర్చి వూరేగింపులద్వారా ఆటలతో పాటలతోఆబాలగోపాలం కదలివచ్చేవారు. ప్రదర్శనం ప్రారంభమై మరల పూర్తి అయ్యేలోగా ఒక వ్యక్తి కూడా మధ్యలో లేచేవాడు కాదు. ప్రతి ప్రదర్శనం అంత బాగా ప్రదర్శింపబడేది. ఏ ప్రదర్శనం చూచినా, ఏ పాటవిన్నా ప్రజలకు అర్థంకానిది ఒక్కటీ వుండేది కాదు. ప్రజల మనస్తత్వాల ననుసరించీ, వారి అభిరుచుల ననుసరించీ పాటలు ప్రదర్శనలు ఇవ్వబడుతూ వుండేవి.

ప్రజా నాట్యమండలి ప్రదర్శనలు కొన్ని లక్షలమంది ప్రజలు చూశారు. ఆనాటి తెలుగు జాతీయ జీవితంలో ప్రజా నాట్యమండలి ఒక ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. అట్టడుగున పడిపోయిన ప్రాచీన కళారూపాల నన్నిటినీ సంస్కరించి ఆంధ్ర నాటకరంగ చరిత్రలో ఒక మహావిప్లవాన్ని తీసుకు వచ్చింది. ప్రజా నాట్యమండలి దోపిడీదారుల్నీ, సంఘ విద్రోహుల్నీ, సంఘంలో వున్న కుళ్ళునూ కళారూపాలద్వారా కడిగివేసింది.

## విశాలాంధ్రలో వెల్లువగా సాగిన ప్రజానాట్యమండలి :

ఈ విధంగా అనతికాలంలో ఆంధ్ర ప్రజలలో నూతన చైతన్యం కలిగించింది ప్రజా నాట్యమండలి. ఇంత త్వరితంగా ఏదేశంలో వుదమ్యంకూడా-అందులో

నాటక వుద్యమం ఇంతగా అభివృద్ధి పొందలేదు. ప్రజా నాట్యమండలి కృషీ, దాని వుధృతం ప్రభుత్వానికి కింటకి ప్రాయమైంది. వెంటనే దీనిని కూడ రాజకీయ ఉద్యమంగా చిత్రించింది సమూలంగా ప్రజా నాట్యమండల్ని నాశనం చేయడానికి పూనుకొంది.

## మహత్తర ఉద్యమం :

కాని ప్రజా నాట్యమండలి ఉద్యమం మహత్తరమైంది. దాని ఆశయాలు గొప్పవి. దాని పోషకులు ప్రజలు. నాట్యమండలి సుసాంప్రదాయాలను దేశంలో అనేక నాటక సంస్థలు అనుసరించాయి. ఆంధ్ర నాటక రంగంలో వున్న ప్రతి నాటక సంస్థపైనా ప్రజా నాట్యమండలి ప్రభావం పడిందానాడు. ఆ ఛాయల్లోనే అనేక నాటక సమాజాలు వేర్వేరు అభ్యుదయ నాటక సమాజాలపేర్లతో నడిచాయి. ప్రజా నాట్యమండలి ఉద్యమం కొత్తరూపురేఖలను దిద్దుకుంది. దీనికి అనేకమంది అభ్యుదయ రచయితలు కళాకారులు దోహదమిచ్చారు. ప్రభుత్వం పైశాచికంగా తాండవిస్తున్న రోజుల్లో అనేక ఇతర నాటక సమాజాలద్వారా ప్రజా నాట్యమండలి సాంప్రదాయాలను ప్రజల ముందుకు తీసుకుపోయారు. ఆనాటికి ఈనాటికి ప్రజా నాట్యమండలి అజేయమైంది. అది స్థాపించిన బాటల్లో అనేకమంది కళాకారులు పెరిగి పెద్దవారై వున్నతస్థాయికి చేరుకున్నారు. ఆంధ్ర నాటకరంగ చరిత్రలో మరపురాని ఘట్టాలను సృష్టించింది నాట్యమండలి. ఆంధ్ర నాటకరంగంలో ఒక మహత్తర చైతన్యాన్ని తీసుకువచ్చింది. ముందు తరాలకు మార్గదర్శి నాట్యమండలి. నాటకరంగ చరిత్రలోనూ, ప్రజా ఉద్యమ చరిత్రలోనూ నాట్యమండలి కొరకు కొన్ని పుటలు ప్రత్యేకించాల్సి వుంటుంది.





# ఆంధ్ర నాటక

# కళాపరిషత్తు



విశాఖ నాటక కళాపరిషత్తు-ఆంధ్ర నాటక కళాపరిషత్తు - నాట్యకళ పత్రిక-అనేక నాటక కళాపరిషత్తులు -నాట్య విద్యాలయాలు

# ఆంధ్ర నాటక కళాపరిషత్తు

## విక్రమ దేవవర్మ,

## విశాఖ నాటక కళాపరిషత్తు :

విశాఖపట్టణంలో జయపూర్ మహారాజా విక్రమదేవవర్మగారి ఆధ్వర్యంలో, 1919 లో విశాఖపట్టణాంధ్ర నాటక కళాపరిషత్తు ఏర్పడింది. విశాఖపట్టణంలోని నాటక సమాజాలనన్నీ, ఒక్క త్రాటిమీద నడపాలన్న కోరికే ఈ పరిషత్తు స్థాపనకు దారితీసింది. ఈ పరిషత్తుకు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు కార్యదర్శిగా పనిచేశారు

1923 జనవరిలో మల్లాది విశ్వనాథ కవిరాజుగారి నాయకత్వంలో మిత్రులందరూ కలిసి "గంజాంమండల ఆంధ్ర నాటక కళాపరిషత్తు" వుత్సవాలను "పోలాకి" అనే గ్రామంలో జరిపారు. పరిషత్తు ఆధ్వర్యంలో "నాటక కళ" అనే మాసపత్రికను ఒక సంవత్సరంపాటు నడిపారు.

బందరులో 1924 లో, నాటకరంగ సమస్యలను చర్చించడానికి - రోజుల పాటు వియవంతంగా సభలు జరిపి నాటకరంగాని కొంక వుత్సాహాన్నిచ్చారు.

దక్షిణాంధ్ర దేశంలో, నెల్లూరులో 1927 లో నెల్లూరు నగరాజారావుగారి పర్యవేక్షణలో నాటకరంగం గురించి ఒక సభ జరిగింది.

## ఒకే ఆశయం - ఒకే ఆదర్శం :

ఆనాడు ప్రతి పట్టణంలోనూ నాటక సంస్థలు రాజులు, మహారాజులు, నాటక కళాపోషకుల ఆధ్వర్యంలో సుశిక్షితంగా నడుస్తున్నాయి. ప్రతివారూ నాటక రంగాన్ని ఎంతో పవిత్రంగా ఎంచేవారు. సమాజానికి నాటక రచయితలు అంటి పెట్టుకునుండేవారు. ప్రతి నాటకమూ, సర్వాంగసుందరంగా వద్దికలు తీర్చుకుని ప్రదర్శనానికి సిద్ధమయ్యేవి. ప్రతి ప్రదర్శనమూ జయప్రదమయ్యేది. విద్యావంతులైన నటీనటులు లవడంవల్ల సమిష్టి కృషి ద్యోతక మయ్యేది. నాటక రంగస్థలం ఒక పవిత్రదేవాలయంగా ఎంచబడేది. అందరూ నిస్వార్థంగా ఒక ఆశయంకోసం పని

చేసేవారు. ప్రేక్షకులు ప్రదర్శనాలను గౌరవించి, సుశిక్షితులై చూచేవారు. నాటకాలకు ఆదాయం కూడా బాగా వుండేవి. ఆర్ధిక ఇబ్బందులున్న వారందరికీ నెల సరి జీతాలు ఇవ్వబడేవి. అందువల్ల, నాటక సమాజాలు ఒక హద్దులో క్రమశిక్షణతో నడిచేయి. కాని దేశంలో ఆర్ధికమాంద్యం రావడంవల్ల, నాటకాలకు ఆదాయం తగ్గడం, జమీందారుల ఆస్తులు తగ్గడం, జీతాలకు అలవాటు పడ్డ నటులు, ఎవరు డబ్బిస్తే అక్కడకు పరుగులెత్తడంతో, నాటక సమాజాలు ఛిన్నాభిన్నామైనాయి.

## నాటక ధర్మాలన్నీ నాశనమయ్యాయి :

కంట్రాక్టు నాటకాలు బయలుదేరాయి. నటులందరూ తలొకదారీ అయ్యారు. కంట్రాక్టర్ల చేతుల్లో నటులు పడిపోయారు. నాటక ధర్మాలన్నీ నాశనమయ్యాయి. ప్రదర్శనాల రక్తి తగ్గిపోయింది. నటుల్లో ఈర్ష్యలు, క్రోధాలూ, పోటీలు ఏర్పడ్డాయి. ఒక్క మాటలో చెప్పాలంటే - కాంపిటీషన్ ఎక్కువై, ఒకరినొకరు దూషించుకునే స్థితికి వచ్చారు. రంగస్థలంపై ఒకరికొకరు పోటీపడి పాటలుపాడి నాటకరక్తిని నాశనం చేసేవారు. ప్రేక్షకులు కూడ ఈసడించారు. ఈ పరిస్థితుల్లో నాటకాలకు పోటీగా సినిమాప్రదర్శనాలు వచ్చాయి. నాటక మందిరాలన్నీ సినిమా హాల్సుగా మారిపోతున్నాయి. సినిమాలకు ప్రజాదరణ ఎక్కువైంది. నాటక రంగ నటులు సినిమాలకు ఎగబ్రాకారు. దీనితో సుశిక్షితంగా నడుస్తున్న నాటకరంగం వెన్నెముక విరిగింది. పోషకులూ, రాజపోషకులూ కూలిపోయారు. కళాకారులందరూ చెల్లాచెదరై పోయారు. ఈ పరిస్థితుల్లో కొంతమంది కళాకారులు కలవరం చెందారు. నాటక రంగాన్ని పునరుద్ధరించాలనే దీక్ష బయలుదేరింది.

## అఖిలాంధ్ర నాటక కళాపరిషత్తుకు అంకురార్పణ :

అఖిలాంధ్ర నాటక కళాపరిషత్తు స్థాపించాలని విశ్వనాథ కవిరాజుగారు అహోరాత్రాలు కృషిచేశారు. వారి కృషి ఫలించి, కవిరాజుగారు ఆహ్వానసంఘాధ్యక్షులుగా వుండి, ఆంధ్రనాటక రంగోద్ధారకులూ, సురభినాటక సమాజ స్థాపకులూ అయిన వనారస గోవిందరావు, కొత్తపల్లి లక్ష్మయ్యగార్ల సహకారంతో 1929 జూన్ నెలలో తెనాలిలో మూడురోజులపాటు ఆంధ్ర నాటక కళాపరిషత్తు మహా

## ప్రసిద్ధ నటులు



శ్రీ జె.యల్. నరసింహారావు



శ్రీ బ్రహ్మజోశ్యుల సుబ్బారావు



శ్రీ సి.యస్.ఆర్. ఆంజనేయులు

## ప్రసిద్ధ నటులు


శ్రీ పి. సూరిబాబు


శ్రీ ఈవెన లక్ష్మణస్వామి


శ్రీ నెల్లూరి నగరాజారావు


శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు

# ప్రసిద్ధ నటులు



శ్రీ బేతా వెంకటరావు



శ్రీ వి. కుమార్
(మేకప్ ఆర్టిస్ట్)



శ్రీ డి.వి.యల్. నరసింహం

## ప్రసిద్ధ నటులు



శ్రీమతి అంజలీదేవి



శ్రీమతి ఋష్యేంద్రమణి



శ్రీమతి సావిత్రి



శ్రీ వెంపటి చినసత్యనారాయణ

(కూచిపూడి ఆర్టు అకాడమి)

సభలు బ్రహ్మాండంగా జరిగాయి. ఈ సభలకు ఆంధ్రదేశం నాలుగు చెరగులనుండి ప్రసిద్ధనటులు, నాటక రచయితలు, కళాభిమానులు అందరూ విచ్చేశారు. ఈ సభలకు ఆచంట వేంకటరాయ సాంఖ్యాయన శర్మగారు, చట్టి చినపూర్ణయ్యపంతులు గారు, దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు వరుసగా రోజుకొకరు చొప్పున అధ్యక్షస్థానాన్ని అలంకరించారు. నాటకరచనను గూర్చి, నటననుగూర్చి, నాటకప్రయోగం గూర్చి చర్చలు జరిగాయి. ఆనాటినుండి, ఆంధ్రదేశపు ముఖ్య పట్టణాలలో, స్థానిక కళాకారుల ఆహ్వానాల ననుసరించి అనేక పరిషత్తులు జరిగాయి. ఈ సభల్లో పగటిపూట నాటకరంగానికి సంబంధించిన అనేక సమస్యల మీద చర్చలు జరిపేవారు. రాత్రిపూట ఉత్తమ నాటక, నాటికల పోటీలను నిర్వహించేవారు ఉత్తమ నాటక రచయితలకు, నటీనటులకు ఉత్తమ బహుమతుల నందచేసేవారు.

## నాట్యకళ పత్రిక ·

1933 లో మద్రాసు నాటక కళాపరిషత్తులో, పరిషత్తు అధ్వర్యాన, నాటక కళమీద ఒక పత్రికను స్థాపించాలనే నిర్ణయం తీసుకుని "నాట్యకళ" అనే పత్రికను ప్రారంభించి, దానికి ప్రధాన సంపాదకులుగా నీలంరాజు వేంకట శేషయ్యగారిని నిర్ణయించారు. ప్రథమ సంచిక 1934 డిసెంబరులో వెలువడింది. శేషయ్యగారి ఆధ్వర్యంలో పత్రిక, కళలకు సంబంధించిన వివిధ వ్యాసాలతో సర్వాంగ సుందరంగా నడిచింది. కొంతకాలం మాత్రమే జయప్రదంగా నడిచిన నాట్యకళ పత్రిక నిలిచిపోయింది. తరువాత శ్రీనివాస చక్రవర్తిగారి ఆధ్వర్యంలో నాలుగైదు సంవత్సరాలు జయప్రదంగా నడిచింది. ఆ తరువాత ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి ఇవ్వబడింది. పసల సూర్యచంద్రరావుగారి ఆధ్వర్యంలో పది సంవత్సరాలుగా నడుపబడుతూ వచ్చింది. ప్రస్తుతం నాట్యకళ సంపాదక బాధ్యతను శ్రీనివాస చక్రవర్తిగారు నిర్వహిస్తున్నారు.

ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఏర్పడిన తరువాత ఔత్సాహిక నటుల్లో మంచి పుత్సాహం ఏర్పడింది. కొత్త కొత్త రచయితలు బయలుదేరారు. పాత నాటకాలైన పౌరాణిక నాటకాలకూ, చారిత్రక నాటకాలకూ పరిషత్తు నిబంధనల ప్రకారం స్థానం లేకపోయింది. ఈ పరిస్థితుల్లో రచయితలు అభ్యుదయకరమైన అనేక సాంఘిక నాటకాలను రచించారు.

## స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలి :

అప్పటివరకూ నాటకాల్లో స్త్రీ పాత్రల్ని ఉద్దండులైన స్థానం, బండారు వెంకటేశ్వరరావు, ఉప్పులూరు సంజీవరావు, కడియాల రత్తయ్య, ముప్పిడి జగ్గరాజు, తోట వెంకటేశ్వరరావు, తోట నారాయణ, ఇందుపల్లి గోవిందరావు, చీరాల బాలకృష్ణశాస్త్రి మొదలైన మహామహులు ధరించేవారు, కాని పరిషత్తు నిబంధనల ప్రకారం స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించా లనడంతో అనేకమంది స్త్రీలు ముందుకువచ్చి పాత్రలు ధరించారు. ఈ విధంగా స్త్రీల ప్రవేశంతో నాటక ప్రదర్శనాలకు సజీవత చేకూరింది. కాని అనతికాలంలోనే ఇటువంటివారిని సినిమా ఆకర్షించటంతో నాటక రంగానికి కొంత దెబ్బ తగిలింది

అలాగే మంచి రచయితల నాటకాలు పరిషత్తులో ప్రదర్శింపబడి ప్రథమ బహుమతి పొందినవెంటనే సినిమా పరిశ్రమ అటువంటి రచయితల్ని కూడా లాగేసింది.

## నాటకరంగంలో
## నవచ్చైతన్యం :

ఏదీ ఏమైనా పరిషత్తు నాటకరంగంలో ఒక నూతన సంచలనాన్ని కలిగించింది. నూతన సమాజాలకు, రచయితలకు, స్త్రీలకు, ఔత్సాహికులకు ఉత్సాహాన్నిచ్చింది. ఎంతోకాలంగా సమాజాలను పీడిస్తున్న వినోదపు పన్నును రద్దు చేయించింది. బళ్ళారి రాఘవ పేర హాలు నిర్మించటానికి విజయవాడలో స్థలం సంపాదించి, దేశంలో వెంకటగిరి అమెచ్యూర్స్‌వారి నాటకాలద్వారా గూడవల్లి రామబ్రహ్మంగారు కొంతధనం సేకరించి. శాంతారాంతో శంకుస్థాపన చేయించారు. కాని ఆ ప్రయత్నం అలానే వుండిపోయింది.

పరిషత్తుకి విజయవాడ గుడివాడ బందరు మొదలైన శాఖల్ని స్థాపించి నాటకాలను ప్రదర్శించారు. ప్రతి పరిషత్తులోనూ, ఆంధ్ర నాటకరంగంలో ప్రముఖులైన వారందరినీ ఘనంగా సన్మానించారు. ప్రథమ బహుమతిని పొందిన వారికి రానుపోను ఖర్చులుకూడ పరిషత్తు భరించింది. ప్రథమ బహుమతిపొందిన నాటకాలను పరిషత్తే ప్రచురించాలనే పథకాన్ని చేపట్టి గోపాలరాయ శర్మగారి

ఎదురీత ప్రచురణతో ఆ ప్రయత్నం ఆగిపోయింది. నాటకరచనలో అంకాలు తగ్గి పోయాయి. 3 న్నర గంటలకాలం ప్రదర్శింపబడే నాటకాలు 2 గంటలకు కుదించ బడ్డాయి. పరిషత్తు నాటకాలద్వారా పాటలు ప్రాముఖ్యం తగ్గి, వచనానికి ప్రాముఖ్యం హెచ్చడంతో అనేకమంది నూతన నటులకు పరిషత్తు మార్గదర్శకమైంది. నటుల్లో క్రమశిక్షణ కలిగింది. సమిష్టి కృషితో నాటకాలను ప్రదర్శించారు. నాటక కళా పరిషత్తు ఇచ్చిన ఉత్సాహంతో ఈనాడు ఆంధ్రదేశంలో అనేక చిన్నచిన్న పరి షత్తు లేర్పడి, నాటక పోటీలు జరుపుతున్నాయి.

## నూతన రచయితలూ,
## నూతన నటులూ :

ఆనాటి ఉమ్మడి మద్రాసు ప్రభుత్వం ఆంధ్ర నాటకరంగ పునరుద్ధరణకు యం. ఆర్. అప్పారావుగారి అధ్యక్షతన ఒక సంఘాన్ని నియమించింది. ఆ సంఘం ఆంధ్రదేశం అంతటా పర్యటించి ఒక రిపోర్టు ప్రకటించింది. ఆ రిపో ర్టును ఇటీవల ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ప్రచురించింది. ఈ విధంగా ఆంధ్ర నాటక కళాపరిషత్తు బహుముఖాల నాటక రంగానికి సేవచేసింది

ఈనాడు సినిమారంగంలో ఉన్న రచయితలలో పింగళి, పినిసెట్టి, కొండముది గోపాలరాయశర్మ, ఆచార్య ఆత్రేయ, సుంకర, వాసిరెడ్డి, డి.వి. నరస రాజు, యన్. ఆర్. నంది, భమిడిపాటి రాధాకృష్ణ, దాసం గోపాలకృష్ణ, వీటూరి, అనిసెట్టి, రావూరు, ముద్దుకృష్ణ, కొడాలి గోపాలరావు, మల్లాది మొదలైన వారంతా పరిషత్తు నాటకాలవల్ల వచ్చినవారే.

అలాగే నటీనటులుగా ఎన్.టి. రామారావు, రామశర్మ, రామచంద్ర కాశ్యప, రమణమూర్తి, చలం, మిక్కిలినేని, పెరుమాళ్ళు, చదలవాడ, మల్లాది, రావి కొండలరావు, ఉదయలక్ష్మి, తిలకం, వల్లం నరసింహారావు, జగ్గయ్య, కె. వి. యస్. శర్మ మొదలైన అనేకమంది నటులు సినిమా రంగంలో ప్రవే శించారు.

## పరిషత్తుకోసం పాటుపడిన
## పెద్దలు :

ఆంధ్ర నాటక కళాపరిషత్తు స్థాపించిన నాటినుండీ మహామహులైన

రచయితలు, నటులు, కళాకారులు మొదలైన అనేకమంది పరిషత్తు అభివృద్ధి కొరకు అహోరాత్రాలు కృషిచేశారు.

ముఖ్యంగా ఈనాటి, ఆంధ్ర నాటక కళాపరిషత్తులో ప్రముఖ బాధ్యతలు వహిస్తున్న యం. ఆర్. అప్పారావు, పసల సూర్యచంద్రరావు, కాజ వెంకట రామయ్య, యజ్ఞోజు మాధవాచార్యులు, త్రిపురనేని శివప్రసాదరావు, దుక్కిపాటి మధుసూదనరావు, పోలవరపు సూర్యప్రకాశరావు, రావూరు వెంకట సత్యనారాయణ మొదలైనవారు దాదాపు 25 సంవత్సరాలుగా కృషి చేస్తున్నారు.

# ఆంధ్రదేశంలో అనేక నాటక పరిషత్తులు

ఆంధ్ర నాటక కళాపరిషత్తు నిర్మించిన బాటలో ఈనాడు ఆంధ్రదేశంతో వెల్లువగా నాటకాల పోటీలు జరుగుతున్నాయి. సంవత్సరాల తరబడిగా ప్రతి సంవత్సరము ఒక నిర్ణీత సమయంలో పరిషత్తులు జరుగుతూ వున్నాయి.

ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్ నాట్య సంఘం-రాజమండ్రి లలిత కళానికేతన్-గూడూరు సంస్కృతీ సమ్మేళనం - విజయనగరం రాఘవ నాటకోత్సవాలు - రాయల నాటక కళాపరిషత్తు, ప్రొద్దుటూరు-రైల్వేఇన్‌స్టిట్యూట్ నాటకోత్సవాలు. గుంతకల్లు - కొప్పరపు సుబ్బారావు స్మారక నాటక కళాపరిషత్తు, గొల్లప్రోలు - శ్రీ వెంకటేశ్వర నాట్య కళాపరిషత్తు, తిరుపతి-నరసాపురం నాటక కళాపరిషత్తు - కాళిదాసు కళారాధన సమితి, కావలి - నెఫ్జా నాటక కళాపరిషత్తు, నెల్లూరు - నెప్కా-నాటక కళాపరిషత్తు, నెల్లూరు - పాలకొల్లు కళాపరిషత్తు - మద్రాసు చెన్నపురి ఆంధ్రమహాసభ నాటకోత్సవాలు - విజయనగరం విజయరామ డ్రమెటిక్ అకాడమి మొదలైన అనేక సంస్థలు కట్టుదిట్టంగా కళాపరిషత్తులు జరుపుతూ వున్నాయి.

# నాటక కళాభివృద్ధికి నాట్యవిద్యాలయాలు

ఆంధ్ర నాటకరంగం అప్రతిహతంగా పురోగమించి మూడు పువ్వులు, నాలుగు కాయలు కాసే రోజుల్లో, సుశిక్షణతో కూడిన నాటకవిద్యాలయాలు ఎంతైనా

అవసరమని ఆనాటి నిస్వార్థ కళాకారులు భావించి అందుకు అంకురార్పణ చేశారు.

నిజంగా సంగీత, నృత్య, శిల్ప, చిత్రలేఖనాలకు గురుకులవిద్య, నిత్య సాధనా వుంటేనేగాని రాణించలేవు.

**భరతముని సంఘం :**

1924 సంవత్సరంలో ప్రప్రథమంగా బి. టి. రాఘవచార్యులుగారు భరత ముని సంఘం అనే పేరున నాట్యవిద్యాలయాన్ని స్థాపించారు. ఇందుకు ప్రసిద్ధ కళాశిల్పి గూడవల్లి రామబ్రహ్మంగారు దోహదం చేశారు. ఈ విద్యాలయంలో ప్రసిద్ధ నటులుగా వెలుగొందిన పారుపల్లి సుబ్బారావు, డి. వి. సుబ్బారావు, పంచాంగం రామానుజాచార్యులు, అద్దంకి శ్రీరామమూర్తి మొదలైనవారందరూ శిక్షణ పొందారు.

1938 లో ఏలూరులో బందా కనకలింగేశ్వరరావు ఆంధ్ర నాటక కళా శాలను ఏర్పాటుచేసి, అనుభవజ్ఞులైన నటులద్వారా ఉపన్యాసాలు ఇప్పించారు. ఈ విద్యాలయంలో అఖిల భారత నాటక రంగచరిత్ర, అభినయాలు, వివిధ స్థాయీ భావాలు - ప్రయోగాత్మకంగా నేర్పించారు. రెండు మాసాలపాటు నడిపి, ఉత్తము లైనవారికి పట్టాలను ఇప్పించారు. సంవత్సరంపాటు నడిచిన కళాశాల అంతలోనే ఆగిపోయింది.

1956 ఆంధ్ర నాటకసంఘ సమాఖ్యవారి ఆధ్వర్యంలో మూడు రోజుల పాటు విజయవాడ రామమోహన గ్రంథాలయంలో నిర్వహించారు.

స్థానం నరసింహారావు - కూర్మా వేణుగోపాలస్వామి - ఆదిశేషయ్య - శ్రీనివాస చక్రవర్తి -కొప్పరపు సుబ్బారావు - జమ్మలమడక మాధవరామశర్మ- మేకప్ వి. కుమార్ - ఆచార్య ఆత్రేయ మొదలైన అనుభవజ్ఞులు తరగతులు నిర్వహించారు. మూడురోజులపాటు జరిగిన ఈ పాఠశాలకు నూరుమంది విద్యా ర్థులు హాజరైనారు.

రాజమండ్రిలో 1958 జనవరిలో డాక్టరు గరికిపాటి రాజారావు పర్య వేక్షణలో వారం రోజులపాటు వీరేశలింగం హైస్కూల్లో నాటక విద్యాలయం ప్రారంభించబడి శిక్షణాతరగతుల్ని నడిపారు. శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి,

శ్రీనివాస చక్రవర్తి, దివాకర్ల వెంకటావధాని, డాక్టర్ పి. యస్. ఆర్. అప్పారావు, గిడుగు సీతాపతి, రోహిణి, కొర్రపాటి గంగాధరరావు, నండూరు కృష్ణమాచార్యులు, చాగంటి సన్యాసిరాజు మొదలైనవారు అధ్యాపకులుగా వుండి తరగతులను నిర్వహించారు.

## నాట్యసంఘ విద్యాలయం :

1959 వ సంవత్సరంలో ఆంధ్రప్రదేశ నాట్య సంఘం ఆనాటి విద్యామంత్రి పట్టాభిరామారావుగారి ప్రారంభోత్సవంతో, స్థానం నరసింహారావుగారి అధ్యక్షతను హైదరాబాదు న్యూసైన్స్ కాలేజీలో సాయంకాలంపూట నాట్యవిద్యాలయ తరగతులు ప్రారంభించారు. ఎ. ఆర్. కృష్ణ, పి. యస్. ఆర్. అప్పారావు, ఆర్. ఎం. జోషి, ఆర్. ఎన్. కోనెకార్, పి. ఎస్. ఆర్, శాస్త్రి, జ్యాఫె మొదలైన అధ్యాపకవర్గం పనిచేసింది. నటన, నాటకప్రయోగం, నాట్యశాస్త్రం, స్టేజిక్రాఫ్ట్, ఆహార్యం మొదలైన విషయాలు బోధింపబడినాయి. 45 మంది విద్యార్థులు శిక్షణ పొందారు. విద్యార్థులందరూ కలిసి చిత్రాంగి నాటకం ప్రదర్శించారు.

## నాలుగుప్రక్కలా
## నాటక విద్యాలయాలు :

ఆ తరువాత అబ్బూరి రామకృష్ణారావుగారి ఆధ్వర్యంలో ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనంలో నాట్య విద్యాలయం నడిచింది. మంత్రి శ్రీనివాసరావు, సముద్రాల గోపాలమూర్తి మొదలైనవారు అధ్యాపకులుగా పనిచేశారు.

ఈనాడు రవీంద్ర భారతిలో నడుస్తున్న నాట్యవిద్యాలయాన్ని ఎ. ఆర్. కృష్ణ, వసంతగాడ్సే మొదలైనవారు అధ్యాపకులుగా వుండి నడుపుతున్నారు. రెండు సంవత్సరాలకాలం నడిచే ఈ విద్యాలయంలో కోర్సు ముగిసినవెంటనే డిప్లొమాలను ఇస్తున్నారు.

1960 లో హైదరాబాదు వై. ఎం. సి. ఏ. హాల్లో నాటక పాఠశాల నొకదానిని పి. ఎస్. రామారావు. ఆర్. ఎం. జోషి, శ్రీమతి లీలాసుందరయ్య మొదలైనవారు 8 మాసాలపాటు నడిపారు.

1968 ఏప్రిల్ 15 నుండి జూన్ 15 వరకు ఆల్వాల్‌లో (సికిందరాబాదు)

నవ్య కళాకేంద్రం బక్షీ శ్రీరాం ఆధ్వర్యంలో నడిచింది. లీలాసుందరయ్య, హెచ్. వి. శర్మ, బక్షీ శ్రీరామ్ పనిచేశారు.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సహాయంతో, ఆంధ్ర నాటక కళా పరిషత్తు ఆధ్వర్యాన విజయవాడలో ఒక నాట్య విద్యాలయం 1960 ఆగస్టు 1 వ తేదీన శ్రీ పసల సూర్యచంద్రరావు అధ్యక్షతను, యం. ఆర్. అప్పారావు గారితో ప్రారంభించబడింది. శ్రీనివాస చక్రవర్తిగారు ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు.

ఈ విద్యాలయంలో విన్నకోట రామన్నపంతులు, కొడాలి ఆదిశేషయ్య, రామచంద్ర కాశ్యప, బసవరాజు సుబ్బారావు మొదలైనవారు అధ్యాపకులుగా పని చేశారు. నటన, నాటక లక్షణాలు, నాటక ప్రయోగం, నాటకరంగ చరిత్ర మొదలైన విషయాలను ప్రబోధించారు. ఈ విద్యాలయం సాయంకాలంపూట నడుస్తూ వుండేది. 25 మంది విద్యార్థులు శిక్షణ పొందేవారు. ఇటీవల మూసివేయబడింది.

ఈనాడు అనంతపురంలో శ్రీ రొద్దం హనుమంతరావుగారి ఆధ్వర్యంలో ఒక నాటక విద్యాలయం అకాడమీ సహాయంతో నడుస్తూవుంది.

కూచిపూడి, విజయవాడలలో నృత్య కళాశాలలూ-హైదరాబాదు, విజయవాడ, విజయనగరం, తిరుపతి మొదలైన పట్టణాలలో సంగీత పాఠశాలలూ-

చిలకలూరుపేట, నెల్లూరులో నాగస్వరం మొదలైన గురుకులాలు-ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి సహాయంతో నడుపబడుతున్నాయి.

# స్త్రీల నాటక సమాజాలు

ఆంధ్రదేశంలో అనేక పురుషసమాజాలతోపాటు స్త్రీల నాటకసమాజాలు కూడా అభివృద్ధి పొందాయి.

## గుంటూరు గోనెపట్టాల కంపెనీ :

1907 వ సంవత్సరంలో గుంటూరు గోనెపట్టాల కంపెనీ ఒకటుండేది. ఈ సమాజంలో పురుషులతోపాటు స్త్రీలుకూడా నటిస్తూ వుండేవారు. వీరి సమాజం పేరు "సుధీజన సమాజం" ఈ నాటక సమాజస్థాపకుడైన హనుమంత

రావుగారు నాయక పాత్రధారణలో మేటి. ప్రముఖ నాయకీపాత్రలు నాగరత్నం. నాగమణి ధరించేవారు. వీరి నాటకశాల ఆరుబయలు రంగస్థలం. చుట్టూ గోనె పట్టాలు కట్టడంవలన దీనికి గోనెపట్టాల కంపెనీ అని పేరు వచ్చింది.

## సంగీత మానినీ సమాజం :

విశాఖ పట్టణ నాటకరంగంలో ఈ సమాజం ఉదహరించబడింది. ఈ సమాజం 1902 లో స్థాపించబడి దేదీప్యమానంగా వెలిగింది. ఈ సమాజ స్థాపకులు మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు. వ్యభిచారవృత్తిని మాన్పించి జీవిత పోషణకు నాటక సమాజం ద్వారా ఆధారం కల్పించటానికి 1902 లో ఈ సమాజం స్థాపించ బడింది. ఈ సమాజం ఆంధ్రదేశమంతటా నాటకాలు ప్రదర్శించింది. ప్రముఖ పురుష పాత్రలను మద్దెల సూర్యనారాయణ ధరిస్తే. శ్రీమతి కొంకిపూడి చినచిట్టి. శ్రీమతి కొంకిపూడి పెదబుల్లి. శ్రీమతి కొంకిపూడి చినబుల్లి స్త్రీ పాత్రలు ధరించే వారు.

## నవలా నాటక సమాజం :

1928 లో నవలా నాటక సమాజాన్ని దంటు వెంకటకృష్ణయ్యగారు స్థాపించారు. ఈ సమాజంలో నాయకీ నాయకుల పాత్రల నన్నిటినీ స్త్రీలే ధరించేవారు. స్త్రీ నటీమణుల్లో ప్రఖ్యాతి వహించిన వారు శ్రీమతి దాసరి కోటిరత్నం, పసుపులేటి కన్నాంబ, యామినీపూర్ణతిలక

బందరు జగన్నాధపురంలో "ధీరామోదిని" అనే స్త్రీ నాటక సమాజం వున్నట్లూ. ఆ సమాజంలో రామాబాయి అనే ఆమె ప్రముఖ పాత్రలు ధరించేదనీ తెలుస్తోంది.

గుడివాడ తాలూకా సుబ్బచెరువు కళావంతుల కుటుంబానికి చెందిన రాముడు అనే ఆమె హరిశ్చంద్ర మొదలైన పురుషపాత్రల్ని అద్భుతంగా నటించేవట.

బందరు జగన్మోహినీ సమాజంలో అంకాలు, కోయిల అనే స్త్రీలు స్త్రీ పాత్రలు ధరించటమే గాక, అద్భుతమైన వారి అమరగానంతో ప్రేక్షకులను మైమరపించేవారట.

ఇక సురభి వారి నాటకాల్లో స్త్రీలే పురుష పాత్రలు. పురుషులే స్త్రీ పాత్రలు ధరించటం మనకు తెలిసిన విషయమే.

గౌరవ కుటుంబానికి చెందిన రాజమ్మ, వెంకమ్మ అనే ఇరువురు స్త్రీలు 1916 ప్రాంతంలో నెల్లూరుజిల్లా గూడూరులో ఒక నాటక సమాజాన్ని స్థాపించి అద్భుతంగా నాటకాలాడినట్లు వినికిడి.

---



# ప్రసిద్ధ నాటక రచయితలు



కోరాడ, వావిలాల, వేదం, తిరుపతి వెంకట కవులు, శ్రీపాద, కందుకూరి, పానుగంటి, గురజాడ, బలిజేపల్లి, రాజమన్నారు, నార్ల, సుంకర, వాసిరెడ్డి, ఆత్రేయ, గోపాలరాయశర్మ, పింగళి, కొప్పరపు, ముత్తరాజు మొదలైనవారు

# ప్రసిద్ధ నాటక రచయితలు

## కోరాడ రామచంద్రశాస్త్రి :

శ్రీకోరాడ రామచంద్రశాస్త్రి అమలాపురంతటా తాలూకా కేశనకుర్రులో మాతామహులఇంట క్రీ॥ శ॥ 1816 లో జన్మించారు. బాల్యమంతా అక్కడనే గడిపారు.



బందరు నోబుల్ పాఠశాలలోనూ, నోబుల్ కళాశాలలోనూ దాదాపు 43 సంవత్సరాలు తెలుగు పండితులుగా పనిచేసి 1900 సంవత్సరంలో మరణించారు. శాస్త్రిగారు 31 గ్రంథాలు రచించారు. వీటిలో సంస్కృత గ్రంథాలు 22, తెనిగించినవి 7, స్వతంత్ర తెలుగు రచనలు 2. వీటిలో గీర్వాణరూపకాలు 4. అవి శృంగార సుధార్ణవం (భాణం), కమనానందం (భాణం), రామచంద్రవిజయం (వ్యాయోగం), త్రిపురాసుర విజయం. ఉన్మత్తరాఘవం - ముద్రారాక్షసం - శాకుంతలం వేణీసంహారం - ఉత్తరరామచరిత్ర మొదలైన 5 నాటకాలను తెనిగించారు.

ఆయన స్వతంత్రించి మంజరీ మధుకరీయము అనే నాలుగు అంకాల తెలుగు నాటకాన్ని క్రీ॥ శ॥ 1860 లో రచించారు. ప్రథమ ముద్రణ 1908 లో జరిగింది. ఈ నాటక ఇతివృత్తం కల్పిత కథ. సంస్కృతరూపకాలను తెలుగులో వ్రాయడంగాని, యథాతథంగా అనువదించడం గాని శాస్త్రిగారికంటే పూర్వులెవ్వరూ ప్రయత్నించలేదు. ఆంధ్ర నాటకరంగాల్లో సాహసించి తెలుగు నాటకానికి తొలిపూజ చేసినవారు శాస్త్రిగారే.

## వావిలాల వాసుదేవశాస్త్రి :

1851 జూన్ 1 వ తేదీన, గుంటూరుజిల్లా రేపల్లెతాలూకా, కారుమూరు గ్రామంలో జన్మించారు. చిన్నతనంలోనే సంస్కృతాంధ్ర భాషల్ని ఆకళింపు చేసుకున్నారు. నోబుల్ కళాశాలలో చేరి, కోరాడ రామచంద్ర శాస్త్రిగారి వద్ద నాటకాలంకారశాస్త్రాన్ని అభ్యసించారు. శాస్త్రిగారు నాలుగు నాటకాలను రచించారు.



వీటిలో 3 అనువాద నాటకాలు. ఒకటిమాత్రం స్వతంత్ర రచన. ప్రథమంగా అనువదించిన ఆంగ్ల నాటకం జూలియస్ సీజర్ 1876 లో ముద్రణ పొందింది. తరువాత 1881 లో భవ భూతి ఉత్తరరామ చరిత్ర, 1892 లో శూద్ర కుని మృచ్ఛకటికను అనువదించారు. సంస్కృత నాటకాన్ని అనువదించిన వారిలో ప్రథములు కూడ శాస్త్రిగారే.

1880 లో తెలుగులో నందకరాజ్యం అనే నాటకాన్ని స్వతంత్రంగా రచించారు. ఈ నాట కంలో అధికారుల దౌర్జన్యాలను గురించీ, సైవి కుల అవస్థలను గురించీ వర్ణించారు. ఈ నాటకం ఎవరూ ప్రదర్శించలేదు. అంటే ఆనాటికి ప్రదర్శించే నాటకసమాజాలే ఉద్భవించలేదన్నమాట. ఇది పూర్తిగా పద్య నాటకం. శాస్త్రిగారి ఇతర రచనలు - బ్రాహ్మణీయం, పితారాధన, ముముక్షు తారకం, రుక్మిణీ స్మరణము, మాత్రారాధన, రఘువంశం మొదలైనవి జీవిత మంతా సాహిత్యసేవకే అంకితం చేసిన శాస్త్రిగారు 1897 జూన్ 13 వ తేదీన అస్తమించారు.

## కొండుభొట్ల సుబ్రహ్మణ్యకవి :

ప్రథమ నాటక రచయితలలో ముఖ్యులైనవారిలో కొండుభొట్ల సుబ్ర హ్మణ్యకవి ఒకరు. గుంటూరుకు చెందిన ఈ రచయిత 32 నాటకాలను రచిం చారు. కాని ముద్రించబడిన నాటకాలు 13 కన్నా ఎక్కువ లేవవి ప్రతీతి. వీరి నాటకాల్లో దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు స్త్రీ పాత్రలను ఎక్కు వగా ధరిస్తూ వుండేవారు. సుబ్రహ్మణ్యకవి నాటకాల్లో గణనకెక్కినవి ద్రౌపదీ వస్త్రాపహరణం, కీచకవధ, గయోపాఖ్యానం, హరిశ్చంద్రోపాఖ్యానం మొద లైనవి.

## కొక్కొండ వేంకటరత్నం :

కొక్కొండ వేంకటరత్నంగారు 1842 లో వినుకొండలో జన్మించారు. తరువాత చెన్నపట్నంలోనూ, రాజమహేంద్రవరంలోనూ నివసించారు. 1881 లో

నరకాసుర వ్యాయోగమనే నాటకాన్ని సంస్కృతం నుంచి అనువాదం చేశారు. ఆంధ్రభాషా సంజీవని అనే తెలుగు పత్రికను నడిపారు తమిళ, కన్నడ భాషలు తెలిసినవారు వీరికి కవిబ్రహ్మ అనే పేరుండేది. వాక్చాతుర్యం కలవారు. పూర్వాచార పరాయణులు. సరసమైన హాస్య రచయిత. అనర్గళంగా ఉపన్యాసా లీయగల ప్రతిభాశాలి. శుద్ధగ్రాంధికవాది, వ్యావహారిక భాషకూ, సంఘ సంస్కరణకూ వ్యతిరేకి. ఇంటిలోనూ, వీధిలోనూ కూడ గ్రాంధికభాషనే వాడేవారు. ఈ విషయంలో ఆనాడు వ్యావహారిక భాషావాదులతో నిరంతరం తగాదా పడుతూ వుండేవారు. 1915 వ సంవత్సరంలో చనిపోయారు. ప్రప్రథమంగా తెలుగులో ముద్రణపొందిన నాటకం వీరి నరకాసుర వ్యాయోగమే.

## మారేపల్లి రామచంద్రశాస్త్రి :

కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా కనకవల్లిలో 1874 లో జన్మించారు. కాకినాడ, విశాఖపట్టణాల్లో విద్యాభ్యాసం చేశారు. 1898 లో ఉపాధ్యాయ వృత్తిలో ప్రవేశించి తెలుగు పండితులుగా పనిచేశారు. గ్రంథాలయ ఉద్యమంలోనూ, అస్పృశ్యతా నివారణోద్యమంలోను, సహాయ నిరాకరణోద్యమంలోనూ పనిచేశారు. 1930 లో ఉప్పు సత్యాగ్రహంలో 6 మాసాలు జైలుకు వెళ్ళారు.

వీరు నాటక ప్రదర్శనాలద్వారా ప్రజల విజ్ఞానాభివృద్ధికొరకు 1895 లో విశాఖపట్టణంలో కలాభిలాషక సమాజాన్ని స్థాపించారు. తమ సమాజ సభ్యులు రచించిన నాటకాలనే ప్రదర్శించేవారు. నాటకాలలో ముఖ్యపాత్రలు ధరించేవారు. వీరు కత్తిసాములో ప్రజ్ఞావంతులు. రంగస్థలంలో నిషిద్ధాలైన శయ్యాగారం, దూరప్రయాణం, యుద్ధం మొదలైనవాటిని స్వతంత్రించి ప్రదర్శించేవారు

వేశ్యల పడుపు వృత్తి మాన్పించాలని 1912 లో సంగీతమానినీ సమాజం స్థాపించి, వారికి సంగీతశిక్షణ నిచ్చారు. వీరు వుత్తమనటులే గాక నాట్యాచార్యులు. నాటకకర్తగా అనేక నాటకాలను - హరికథలను - చాటువులను - పద్య కావ్యాలను-అనేక వచన గ్రంథాలనూ రచించారు. 1951 వ సంవత్సరంలో పరమపదించారు.

## వేదం వేంకటరాయశాస్త్రి :

ఆంధ్ర నాటకరంగానికి శిరోభూషణమూ, ఆంధ్ర భాషాభిమాని సమాజానికి

హృదయంలాంటివారూ శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు. జననం 1853 లో.



శాస్త్రిగారు దాదాపు 30 సంవత్సరాలు నాటక కళాసేవ చేశారు. స్వంత సమాజంకొరకు నాటకాలను వ్రాసి స్వయంగా దర్శకత్వం వహించారు. వీరి నాటకాలు ప్రతాపరుద్రీయం, బొబ్బిలియుద్ధ నాటకం, ఉషానాటకం, ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలం, మాళవికాగ్నిమిత్రం, విక్రమోర్వశీయం, శ్రీకృష్ణరాయ విజయ నాటకం, ప్రియదర్శిక, ఉత్తరరామచరిత్రం, రత్నావళి, ప్రతిమా నాటకం మొదలైనవి. వీరి ప్రతాపరుద్రీయం ఆంధ్రప్రజల మన్నన లందుకుంది. ప్రతాపరుద్రీయంలో పాత్రోచిత భాషను ప్రవేశపెట్టారు. శాస్త్రిగారు మహామహోపాధ్యాయులు ఆయన అనేక గ్రంథాలను రచించారు. నెల్లూరుజిల్లా నాటకరంగానికి, నెల్లూరు ఆంధ్ర భాషాభిమాని సమాజానికి ఎనలేని సేవచేసి ఘటికులైన నటకుల్ని తయారుచేశారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం కళాప్రపూర్ణ బిరుదును ప్రసాదించింది. 76 సంవత్సరాలు జీవించి 1929 లో కీర్తిశేషులయ్యారు.

## తిరుపతి వేంకటేశ్వరకవులు :

వేంకటశాస్త్రిగారు, తిరుపతి శాస్త్రిగారు జంటకవులుగా, పండితులుగా వర్ధిల్లారు. వేంకటశాస్త్రిగారి జననం 1870—తిరుపతి శాస్త్రిగారి జననం 1871. ఇరువురూ కవితాధార కలవారు. వీరు రచించిన నాటకాలు పాండవోద్యోగం, పాండవ విజయం, పాండవ అశ్వమేధం, పాండవ ప్రవాసం. పాండవ జననం, పాండవ రాజసూయం, మృచ్ఛకటికం, ముద్రారాక్షసం, బాలరామాయణం, ప్రభావతి ప్రద్యుమ్నం. పండితరాజం, సుకన్య మొదలైనవి. ఈ నాటకాలన్నిటిలోనూ శిఖరాగ్రా న్నందుకున్న నాటకాలు పాండవోద్యోగం, పాండవ విజయం. ఈ రెండూ ఆంధ్ర ప్రజల హృదయాలను చూరగొన్నాయి. ఈ ఇరువురు కవులూ అందరిచేతా పారితోషికాల నందుకొన్నారు. ఆశువుగా కవిత్వం చెప్పారు. ఏనుగులమీద వూరేగారు. ఆంధ్రదేశ కవితా సామ్రాజ్యాన్ని ఏలుకున్నారు. వేంకటకవిగారికి కళాప్రపూర్ణ బిరుదునిచ్చి ఆంధ్ర విశ్వవిద్యాలయం

గౌరవించింది. ఆంధ్రదేశం షష్టిపూర్తి జరిపింది. 18-1-1948 వ తేదీన ఆంధ్ర నాటక కళాపరిషత్తు విజయవాడ మహాసభలలో వేంకటశాస్త్రిగారికి మహా వైభవంగా పాదపూజ జరిపింది.

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి :

కీ॥శే॥ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఎర్నగూడెంవద్ద నున్న దేవరపల్లిలో 1866 లో జన్మించారు. అవసానదశవరకూ రాజమండ్రిలోనే స్థిరనివాసం ఏర్పాటు చేసుకున్నారు. వీరు ఎన్నో కావ్యాలను వ్రాశారు. చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రిగారు ఈయన శిష్యులు. మహాభారతాన్ని యావత్తు ఒక్కరే రచించారు. వాల్మీకి రామాయణాన్ని తెలుగులో రచించారు. అనేక ప్రహసనాలనూ, నాటకాలనూ రచించారు. శతాధిక గ్రంథకర్తలు. ఆంధ్రప్రభుత్వ ఆస్థానకవులు. ఆంధ్ర విశ్వవిద్యాలయంవారిచేత కళాప్రపూర్ణ బిరుదు నందుకున్నారు. ఆంధ్ర ప్రభుత్వం మహామహోపాధ్యాయ బిరుదునిచ్చి సత్కరించింది. వీరు రచించిన నాటకాలు బొబ్బిలియుద్ధం, వీరసేనవిజయం, యాజ్ఞవల్క్య నాటకం. వీరి నాటకాల్లో ఉత్తమ నాటకం బొబ్బిలియుద్ధం. ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడి వేనోళ్ళ పొగడబడింది. ఈనాటికీ ప్రదర్శింపబడుతూ వుంది.

## వడ్డాది సుబ్బరాయకవి :

కవులకూ, కళలకూ, పండితులకూ, సంఘ సంస్కర్తలకూ పుట్టినిల్లయిన రాజమహేంద్రవరమే వడ్డాది సుబ్బరాయకవిగారిది కూడాను. రాజమండ్రి కళాశాలలో ఎన్నో సంవత్సరాలు సంస్కృతాంధ్ర పండితులుగా వున్నారు. వేణీ సంహారం, మేఘసందేశం, అభిజ్ఞానశాకుంతలం, విక్రమోర్వశీయం, ప్రబోధ చంద్రోదయం, సూర్యశతకం, భామినీవిలాసం మొదలైన సంస్కృత గ్రంథాలను సరసంగా అనువదించారు. ఇవిగాక మల్లికామారుతం, చండకౌశిక నాటకం, ప్రబోధ చంద్రోదయం, వేణీసంహారం మొదలైన నాటకాలను రచించారు. వేణీ సంహార నాటకం ఈయన రచనలలోకెల్లా వుత్తమమైంది. భట్టనారాయణుని వేణీ సంహారాన్ని అనుకరించినా అనుసరణ చక్కగా చేయబడింది. సుబ్బరాయకవి కవిగానే గాక నటుడుగా కూడ పేరుపొందారు. వీరు రచించిన గ్రంథాలు ఇరువదికి పైగా వున్నా, కీర్తిప్రతిష్టలు చేకూర్చిపెట్టినవి వేణీసంహారం, భక్త చింతామణి మాత్రమే.

## కందుకూరి వీరేశలింగం :

సంఘసంస్కర్తగా యుగపురుషుడుగా వర్ధిల్లిన కందుకూరు వీరేశలింగం పంతులుగారి సాహిత్యసేవ ఎన్నదగినది. ఆయన శతాధిక గ్రంథకర్త. సంఘ సంస్కర్తగా ఆయన చేసిన సేవ ఎటువంటిదో ఆంధ్ర ప్రజానీకానికి తెలిసిన విషయమే. నాటకకర్తగా ఆయన కొన్ని నాటకాలను రచించారు. వాటిలో ముఖ్య మైనవి అభిజ్ఞానశాకుంతలం - రత్నావళి - మాళవికాగ్నిమిత్రం - కళ్యాణ కల్ప వల్లి-ప్రహ్లాద నాటకం - భక్త చొకామీళ - హరిశ్చంద్ర మొదలైనవి అయి నప్పటికీ అన్నింటిలోకీ ముఖ్యమైనవీ, ప్రజామన్ననలు పొందినవీ - అభిజ్ఞానశాకుంతలం - హరిశ్చంద్ర. బలిజేపల్లివారి హరిశ్చంద్ర వచ్చిన తరువాత వీరి హరిశ్చంద్రను ప్రదర్శించటం తగ్గిపోయింది. శకుంతలనాటకం మాత్రం వీరిదే ఎక్కువగా ప్రదర్శింపబడింది. కాళిదాసు శాకుంతలాన్ని తెలుగులోకి పంతులుగారు ప్రజారంజకంగా అనువదించారు. ఆంధ్ర సాహిత్యానికి బహు ముఖాల సేవజేసిన వీరేశలింగం పంతులుగారు ఆంధ్రనాటక వాఙ్మయానికి కూడ అభిజ్ఞాన శాకుంతలం లాంటి వుత్తమనాటకాన్ని అందించి ధన్యులయ్యారు,

## పానుగంటి లక్ష్మీనరసింహారావు :

జననం 1865 సంవత్సరం. ఆంధ్రనాటక రచయితలలో ముఖ్యులు. హాస్య రసాన్ని పోషించటంలో మేటి. పఞ్చభాషల్లో ప్రజ్ఞానిధి. పిఠాపురసంస్థాన ఆస్థాన కవిగా వుండి, రాధాకృష్ణ - సారంగధర - సరోజని - నర్మదాపురుకుత్సీయం - విప్రనారాయణ - కళ్యాణరాఘవం - పట్టభంగరాఘవం. వనవాసరాఘవం-విజయ రాఘవం - ప్రచండచాణక్యం - చూడామణి - కంఠాభరణం - రాతిస్తంభం - కోకిల-సరస్వతి-వృద్ధవివాహం మొదలైనవి వ్రాశారు. వీరి నాటకాల్లో రాధాకృష్ణ నాటకం మంచినాటకంగా పేరుపొందింది. రెండవది కంఠాభరణంగా పేర్కొన్నారు. కంఠాభరణం హాస్యవల్లరి - వృద్ధవివాహం - ఈ మూడు నాటకాలూ ప్రహస నాలుగా ప్రకటించారు. ఉపన్యాసాల ధోరణిలో సాక్షిగ్రంథాలను భాగాలుగా ప్రక టించారు. సంఘటనల్ని సృష్టించడంలోనూ, సంభాషణలను నడిపించడంలోనూ, కథాగమనాన్ని సాగించడంలోనూ సహజమైన పద్ధతిని అవలంబించి నాటకరంగా నికి సేవచేశారు.

## ప్రసిద్ధ నటులు



శ్రీమతి కొప్పరపు సరోజని



శ్రీ రొద్దం రాజారావు



శ్రీ మంగిపూడి రామలింగశాస్త్రి



శ్రీ పామర్తి సుబ్బారావు

# ప్రసిద్ధ నటులు



శ్రీ గోవిందరాజుల సుబ్బారావు



శ్రీ గిరిరాజు రామారావు



శ్రీ డి.వి. సుబ్బారావు

## ప్రసిద్ధ నటులు



శ్రీ కపిలవాయి రామనాథశాస్త్రి



శ్రీ కృత్తివెంటి సుబ్బారావు



శ్రీ అనుమకొండ వేంకటరామయ్య



శ్రీ నిడుముక్కల సుబ్బారావు

## ప్రసిద్ధ నటులు



శ్రీ ధూళిపాళ సీతారామశాస్త్రి



శ్రీ యడవల్లి సూర్యనారాయణ



శ్రీ వేమూరు గగ్గయ్య

### బలిజేపల్లి లక్ష్మీకాంతకవి :

జననం 1881 వ సంవత్సరం. కవిగా, నటుడుగా, సమాజసంస్థాపకుడుగా సినిమా రచయితగా అశేషమైన కీర్తి ఆర్జించారు. వీరి నాటకాల్లో బుద్ధిమతీ విలాసం - సాత్రాజితీయం - హరిశ్చంద్ర ముఖ్యమైనవి. వీటిలో హరిశ్చంద్ర ఆంధ్రదేశం ఆ అంచునుండి ఈ అంచువరకూ అందరూ ప్రదర్శించారు. ప్రజలు ఆదరించారు. పుస్తకాలను కొని చదువుకున్నారు. దాదాపు లక్ష ప్రతులు అమ్ముడుపోయాయి. హరిశ్చంద్ర పాత్రకు జీవం పోసినవారు బందరు డి. వి. సుబ్బారావుగారు. గుంటూరు హిందూ నాటక సమాజంలో ప్రథమంగా బాల వేషాలు వేశారు. ఆయన నక్షత్రపాత్ర వేనోళ్ళ పొగడబడింది. వారి హరిశ్చంద్ర తెలుగు నాటకరంగంలో ఒక మైలురాయి. 1930 లో రంగూన్‌లో కవితాకళానిధి బిరుదు ప్రసాదించబడింది. తరువాత చలనచిత్రరంగంలో ప్రవేశించి, అనేక చిత్రా లకు మాటలు పాటలు వ్రాశారు. కొన్ని చిత్రాలలో పాత్రలు ధరించి మెప్పించారు. 1942 సంవత్సరంలో చలనచిత్రసీమలో పుంభావసరస్వతి అనే బిరుదును పొందారు. కాళహస్తిలో 1953 లో స్వర్గస్థులైనారు.

### చిలకమర్తి లక్ష్మీనరసింహం :

జననం 1867. అనేక గ్రంథాలను రచించి, ఆంధ్రభాషామతల్లికి ఇతోధిక సేవచేసినా ఇక్కడ మనం వారిని నాటక రచయితగా పరిశీలించడమే మంచిది.



వీరు రచించిన నాటకాలు గయోపాఖ్యానం, ప్రసన్నయాదవం, పారిజాతాపహరణం, చతుర చంద్రహాసం, తిలోత్తమ, ప్రచండయాదవం మొదలైనవి.

వీరి నాటకాలన్నిటిలోకీ గయోపాఖ్యానం బహుళ ప్రచారంపొందింది. పేరుపడిన ఆంధ్ర నాటక సమాజాలన్నీ ఈ నాటకాన్ని ప్రదర్శించాయి. లక్షన్నరకాపీలు గయోపాఖ్యానం అమ్ముడు పోయిందంటే, అది ఎటువంటి ప్రజాదరణను పొందిందో మనం అర్థం చేసుకో

వచ్చు. చమత్కారమైన కథావస్తువు, సులభమైన శైలి. ప్రసంగాలూ, పద్యాలూ అందరికీ అర్థమయ్యేలా వుంటాయి. కృష్ణార్జునుల సంవాదానికి చెందిన పద్యాలన్నీ ఇట్టే ప్రేక్షకులను పట్టేస్తాయి. అన్ని రంగాలలోనూ అమూల్య సేవచేసిన పంతులుగారు 1946 వ సంవత్సరంలో మనల్ని వదలి వెళ్ళిపోయారు.

## ముత్తరాజు సుబ్బారావు :

ముత్తరాజు సుబ్బారావుగారు కృష్ణతులాభారం, భక్త మార్కండేయ, కచ దేవయాని, రణతిక్కన మొదలైన నాటకాలను రచియించారు. వీరు యం. ఏ. పట్టభద్రులు. వీరి నాటకాలు నాలుగైదు అముద్రితంగానే వుండిపోయాయి. వీరి నాటకాలలో బహుళప్రచారం పొందిన నాటకం శ్రీకృష్ణ తులాభారం. ఆనాటి నుంచి, ఈనాటివరకూ ప్రదర్శింపబడుతూనే వుంది. ఈ కథను మూడుసార్లు చలన చిత్రంగా చిత్రీకరించారు. కృష్ణతులాభారం నాటకాన్ని తెనాలి రామవిలాస సభవారు విశేషంగా ప్రదర్శించారు. స్థానం సత్యభామగా ప్రసిద్ధిపొందింది ఈ నాటకంలోనే. తరువాత సూరిబాబు, మాష్టర్ కళ్యాణి, యస్. పి. లక్ష్మణస్వామి, నాగలింగం, రామలింగం, కె. రఘురామయ్య మొదలైనవారు ఎన్నో ప్రదర్శనలిచ్చారు. వీరి అముద్రిత నాటకం రాజ్యశ్రీ మార్గాభ్యుదయం, చిత్రకళాభివర్ధనీ సంఘంద్వారా ఆంధ్రదేశంలో చెదురు మదురుగా ప్రదర్శించారు. ఆయన కీర్తిశేషులైనా వారి కృష్ణతులాభారం నాటకం సజీవంగానే వుంది.

## కొప్పరపు సుబ్బారావు :

జననం 29-4-1896. నాటకరంగానికి సంబంధించిన రచన, సంగీతం, రంగాలంకరణ, నటన, ఆహార్యం, రంగప్రదీపనం మొదలైన శాఖల్లో సిద్ధ హస్తులు. తారాశశాంకం, రోషనార, నూర్జహాన్, వసంతసేన, ఇనపతెరలు మొదలైన నాటకాలనూ, నేటి నటుడు, చేసినపాపం, ఆల్లీముతా మొదలైన నాటికలనూ వ్రాశారు.

ఆయన ఆంధ్రదేశంలో పెద్ద హార్మోనిస్టు. మరాఠీ, హిందూస్తాని సంగీతంతో పరిచయమున్నవారు. నాటక కళను గురించి అనేక వ్యాసాలను వ్రాశారు. తెలుగు లిటిల్ థియేటర్‌ను స్థాపించి, దానిపేర 2500 గ్రంథాలను సేకరించారు. ఆయన అనేక రేడియో నాటికలను వ్రాశారు. జీవితాంతంవరకూ ఉత్తమ నాటక

సమాజాలకొరకు ఉత్తమ రంగస్థలంకొరకు అహర్నిశలు పనిచేశారు. నాటక రంగం కొరకు విరామ మెరుగని కళాసేవకుడుగా ఫిరంగిపురంలో రంగస్థలంపై నే ప్రాణాల్ని కోల్పోయారు.

## పద్మశ్రీ వి.వి.యల్. నరసింహారావు :

కవి, సంస్కర్త, సుప్రసిద్ధపండితుడు, నాటక కర్త, నటుడు, ఆదర్శ ఉపాధ్యాయుడు అయిన వింజమూరు వెంకటలక్ష్మీనరసింహారావుగారు, కాకినాడ మెక్లారెన్ హైస్కూలులో ఉపాధ్యాయుడుగా 36 సంవత్సరాలు పని చేశారు. వివిధ సాహిత్య ప్రక్రియలలో చాలగ్రంధాలు రచియించారు. వీరి అనార్కలీ నాటకం ఆంధ్ర దేశంలో అనేకసార్లు ప్రదర్శింపబడి ప్రేక్షకుల హర్షధ్వానాల నందుకుంది. వీరి అనార్కలీ, నరసన్నభట్టు నాటకాలను కళాశాల తరగతులకు ఆంధ్ర విశ్వవిద్యాలయం నిర్ణయించింది.



నరసింహారావుగారు బాల్యంనుండి చారిత్రక పౌరాణిక నాటకాలలో ప్రముఖపాత్రలు ధరించారు. 1913 లో బెజవాడలో జరిగిన గయోపాఖ్యానం నాటక ప్రదర్శనపోటీలలో గయునిపాత్రకు సువర్ణపతకం లభించింది. వీరు పత్రికాసంపాదకత్వంలో ఆరితేరినవారు. వీరు, వీరి భార్య వెంకటరత్నమ్మగారు కలిసి, 1916 లో అనసూయ పత్రికను స్థాపించి చాలా సంవత్సరాలు నడిపారు. వీరి గృహం కళాకేంద్రం. వీరి కుమార్తెలే సుప్రసిద్ధగాయనీమణులు వింజమూరు సీత, అనసూయలు, వీరి బావమరిది శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు. నరసింహారావుగారి బహుముఖసేవకు భారతప్రభుత్వం 1967 లో పద్మశ్రీ బిరుదు నిచ్చి సత్కరించింది. 82 సంవత్సరాలు జీవించిన నరసింహారావుగారు 1969 జనవరి 12 వ తేదీన పరమపదించారు.

## సోమరాజు రామానుజరావు :

కీర్తిశేషులు సోమరాజు రామానుజరావుగారు భద్రాచల నివాసి. దేశముఖు, దేశపాండ్యా మొదలైన బిరుదులు కలవారు. వీరు అనేకమైన తెలుగు నాటకాలను రచించారు. రంగూన్‌రౌడి - ధరణికోట - గంగావతరణం - దానవీర కర్ణ - కాలకేతనం - సతీ అనసూయ - మహాభక్తవిజయం - ప్రతాపరుద్రీయం - సంగీతసావిత్రి - పద్మవ్యూహం - స్వరాజ్యరథం - భీష్మబ్రహ్మచారి - తాజ్ మహల్ మొదలైన నాటకాలను రచియించారు. ఆంధ్ర నాటకరంగంలో వీరి నాటకాలుకూడ బహుళ ప్రచారాన్ని పొందాయి. వీరి 'రంగూన్‌రౌడి' ఆంధ్రదేశం అన్ని మారుమూలల్లోనూ ప్రదర్శింపబడింది. రంగూన్‌లో కూడ ప్రదర్శించారు. వీరి నాటకాల్లో ప్రదర్శింపబడినవి ధరణికోట - గంగావతరణం - కాలకేతనం మొదలైనవి.

## పింగళి నాగేంద్రరావు :

ఆంధ్ర నాటకరంగంలో ప్రముఖపాత్ర వహించిన నాటక సమాజాల్లో బందరు ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ అతిముఖ్యమైంది. ఆ కంపెనీ నాటకరచయితగా వుండి, నాటకాలను వ్రాసిఇచ్చి, ఆ సమాజంద్వారా ప్రదర్శింపచేసి, అఖిలాంధ్రదేశంలోనూ ప్రముఖ నాటకరచయితగా వెలుగొందిన పింగళి నాగేంద్రరావు గారు 1901 సంవత్సరంలో బొబ్బిలి దగ్గరున్న రాజాంలో జన్మించారు. 6 వ సంవత్సరంలో బందరు ఆంధ్రజాతీయ కళాశాలలో చేరారు. 16 వ ఏట బడిపంతులయ్యారు. 1922 లో డి. యల్. రాయ్ మేవాడ రాజ్యపతనాన్ని వచన నాటకంగా ఆంధ్రీకరించారు. ఈ నాటకాన్ని 1924 లో బందరులో డి. వి. సుబ్బారావుగారు ప్రదర్శించారు. 1323 లో డి. యల్. రాయ్ మరొక నాటకాన్ని పాషాణి అనే పేరుతో అనువాదం చేసి, కృష్ణాపత్రికలో ప్రచురించారు.

నాటక రచనలో అనుభవం సంపాదించిన నాగేంద్రరావుగారు 1928 లో వింధ్యరాణి రచియించారు. ఈ నాటకం డి. వి. సుబ్బారావు వింధ్యరాజుగా, కోట వెంకటేశ్వరరావు అవంతిగా, పది సంవత్సరాలు అజరామంగా ప్రదర్శించారు.

వింధ్యరాణి తరువాత నారాజు నాటకన్ని రచించారు. ఇది కృష్ణదేవరాయలకు సంబంధించిన గాథ. నారాజు రచనాకాలం 1929. ఆ తరువాత

1955 లో ఒకే కుటుంబం సాంఘిక నాటకాన్ని రచియించారు. నాగేంద్రరావుగారు నాటక రచయితలేకాక మంచి ప్రయోక్త. ఆయన సినిమారంగంలో ప్రవేశించి ఎన్నో చిత్రాలకు, కథలను, సంభాషణలను, పాటలను వ్రాసి రచయితగా ఒక ప్రముఖస్థానాన్ని సంపాదించుకున్నారు.

## కాళ్ళకూరి నారాయణరావు :

ప్రముఖాంధ్ర నాటక కర్తలలో కీ॥ శే॥ కాళ్ళకూరి నారాయణరావు గారొకరు. చింతామణి, మధుసేవ, పద్మ వ్యూహం, వరవిక్రయం, చిత్రాభ్యుదయం (లేక సారంగధర) మొదలైనవి వీరి నాటకాలలో అత్యున్నత స్థానాన్ని పొందినవి. చింతామణి, మధుసేవ, వరవిక్రయం ఈ మూడు నాటకాలూ, రంగస్థలంమీద అనేక సమాజాలు, అనేక ప్రాంతాల్లో ప్రదర్శించాయి. వీరి మూడు నాటకాలూ సాంఘికాలే. సమాజానికి నీతినినేర్పే నాటకాలు, చింతామణిలో వేశ్యసమస్య, మధుసేవలో మద్యపానసమస్య, వరవిక్రయంలో వర కట్నాలు. అభ్యుదయకరమైన సమస్యలు తీసుకునే నాటకాలను రచించారు. అన్నింటిలోకి ఈ నాటికీ సజీవంగా ఆడబడుతూ ప్రాచీనాంధ్ర నాటకాల్లో మణిగా చింతామణి నాటకం వెలుగొందుతూ వుంది. చింతామణి రెండుసార్లు చలన చిత్రంగా చిత్రీకరించబడింది.

## మల్లాది విశ్వనాధకవిరాజు :

1894లో శ్రీకాకుళంలో కవిరాజుగారు జన్మించారు. మెట్రిక్యులేషన్ ప్యాసైనారు. భళ్ళమూడి దక్షిణామూర్తిశాస్త్రిల వారివద్ద సంస్కృత కావ్య నాటకాలను



అభ్యసించారు. ఆనాడు శ్రీకాకుళంలో సురభి రామయ్య ప్రదర్శించిన నాటకాలను చూశారు. నాటక కళమీద అభిరుచి ఏర్పడి, 15 ఏట "లాక్షా గృహం" అనే ఏకాంకికను రచియించారు. 23 వ ఏట తెలుగు పండితుడుగా పనిచేశారు. సురభి పాపాబాయి నాటక కంపెనీకి కొన్ని పౌరాణిక నాటకాలను వ్రాసి ఇచ్చారు. చట్టి పూర్ణయ్య పంతులుగారితో కలిసి "పోలాకి" అనే గ్రామంలో నాటక కళా పరిషత్తును చిన్న స్థాయిలో స్థాపించారు. విజయనగరంలో బుర్రా శేషగిరిరావు, అడిదం నారాయణమూర్తిగార్లతో

కలిసి "నాటక కళ "పత్రికను స్థాపించారు. ఆంధ్ర నాటక కళ పరిషత్ స్థాపకుల్లో ఒకరు. వ్యవహారికభాషలో 50 వరకూ వినోద నాటికలను రచించారు. వాటిలో దొంగాటకం, నేపథ్యం, పిల్ల జమీందారు, నాటికినేడు, క్రిగానుగ మొదలైనవి పుస్తకాలుగా వెలువడ్డాయి. 1936 లో సినిమారంగంలో ప్రవేశించారు. భక్త మార్కండేయకు సంభాషణలు, పంతులమ్మ, సౌదామిని చిత్రాలకు కథలూ వ్రాశారు. వీరి అముద్రిత గ్రంథాలు శివమహాపురాణం, వివిధ వ్యాసాలు 100, నాటికాలు 50, వసంతసేన, హంస, మహాత్మాకబీరు, జమీందారు, పాలఘాటు పెళ్ళి, మహానంద, కృష్ణమాయ, మార్జహాన్ మొదలైనవి. 1946 లో మద్రాసులో మరణించారు.

## మల్లాది అచ్చుతరామశాస్త్రి :

అచ్యుతరామశాస్త్రిగారి జననం 1872 లో. 1903 లో బందరు గొడుగుపేట జగన్మోహిని థియేటర్‌లో పనిచేశారు. నాటక రచయితగా, నటుడుగా నాటక రంగానికి బహుముఖాల సేవచేశారు. శాస్త్రిగారు దాదాపు ముప్పై నాటకాలను వ్రాశారు. ఆంధ్రదేశంలో ఆనాటి అనేక సమాజాలు వీరి నాటకాలను ప్రదర్శించాయి. వీరి నాటకాల్లో పేరుప్రతిష్ఠల్ని సంపాదించుకున్న నాటకాలు ద్రౌపదీ వస్త్రాపహరణం, సతీ సక్కుబాయి. సక్కుబాయి నాటకం దైతా గోపాలంగారి దర్శకత్వంలో తుంగల చలపతిరావు సక్కుబాయిగా ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడింది. కొంతకాలం బెజవాడ హిందూ థియేటర్లో పనిచేశారు. 1922 లో విజయనగరంలో ఘనంగా సన్మానించి, నాటకచక్రవర్తి అనే బిరుదు నిచ్చారు తరువాత కొంతకాలం సినిమాలలో పనిచేశారు. 1943 లో పరమపదించారు.

## శ్రీరాముల సచ్చిదానందశాస్త్రి :

సచ్చిదానంద శాస్త్రిగారు 1888 వ సంవత్సరంలో జనించారు వీరు సంస్కృతాంధ్రభాషల్లో ఉత్తమ పండితులు. 1915 వ సంవత్సరంలో సావిత్రి నాటకాన్ని వ్రాశారు వీరి రచనల్లో సావిత్రినాటకం ప్రసిద్ధమైంది. సావిత్రి నాటకాన్ని ఆనాడు బెజవాడ మైలవరం థియేటరువారు అత్యద్భుతంగా ప్రదర్శించారు. గురజనాయుడు, నిడుముక్కల, ఉప్పలూరి సంజీవరావు మొదలైనవారు ఈనాటకం ద్వారా ఆంధ్ర ప్రజాహృదయాలలో సుస్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నారు.

శాస్త్రిగారు 1939 లో లలిత, 1941లో బృంద, 1851లో డివోదాసు మొదలైన నాటకాలను కూడా రచించారు. వీరు 1954 లో మరణించారు.

## సోమంచి యజ్ఞన్నశాస్త్రి :

బొంబాయి కార్పొరేషన్‌లో డిప్యూటీ కమిషనర్‌గా పనిచేస్తున్నారు. వీరికి నాటక కళ అంటే అపారమైన అభిమానం. వీరు విశ్వంపెళ్ళి- కళ్యాణి- న్యాయం- మహానుభావులు మొదలైన అనువాద నాటకాలను రచించారు. స్వంత రచనలు పెద్దమనుషులు - ఈ సంసారం - లోకులు కాకులు - నాలుగు నాటికలు - కట్నం కోరని కళ్యాణం - రంగభూమి మొదలైనవి. వీరి నాటికలూ, నాటకాలూ ఎప్పుడో ఒకప్పుడు అన్నీ ప్రదర్శింపబడి పేరు పొందాయి. రేడియోలో ప్రసారమైన నాటికలు సత్యానికి సరిహద్దులు - ముతకచీర - జరీచీర - నిత్యానందం మొదలైనవి. వీరు బొంబాయిలో వుంటూ ఆంధ్రుల పురోభివృద్ధికి పాటుపడుతున్నారు.

## కీ॥శే॥ పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రి :

యజ్ఞనారాయణశాస్త్రిగారి జన్మస్థలం దివితాలూకా మోపిదేవి. చాలాకాలం బందరులో నివాసం. ఆంధ్ర నటప్రకాశిక అని నాట్య నాటక రంగాలను గురించి ఒక వుద్గ్రంథాన్ని రచించి 1930 లో ప్రచురించారు. ఈ యువ పండితుడు నాటక కర్త, గాయకుడు, నాట్యాచార్యుడు నట. ప్రకాశకగ్రంధంలో సంగీతం, నాయకీ, నాయక విధులను గురించీ, సంచారీ, పరకీయ మొదలైన భావాలను గురించీ, నాటక రచనను గూర్చి, నాటకప్రయోగం, రంగస్థలం నటుల బాధ్యతలను గురించీ విపులంగా చర్చించారు. ఆంధ్ర నాటకరంగానికి సంబంధించిన 130 మంది నటుల రచయితల చిత్రపటాలను ఆ గ్రంథంలో ముద్రించారు. ఈ గ్రంథం ఈనాడు మనకు మార్కెట్‌లో లభ్యంకాదు. శాస్త్రిగారు ఒక వుత్తమగ్రంథాన్ని ఆంధ్ర నాటక లోకానికి ప్రసాదించారు.

## గుండిమెడ వెంకటసుబ్బారావు :

సుబ్బారావుగారు 25-7-1901 వ తేదీన గంజాంజిల్లా ఛత్రపురంలో జన్మించారు. మంచిస్ఫురద్రూపి. అనేక నాటకాలను రచించి ప్రదర్శింపచేశారు. అనేక నవలలను వ్రాశారు. వీరు మంచినటులేకాక, వుత్తమ చిత్రలేఖకులు. వీరి నాటకా

లన్నీ విశ్వవిద్యాయాల్లో పఠనీయగ్రంథాలుగా వెలుగొంధాయి. వీరి కలంనుండి 1927 లో రాణాప్రతాప్, 1938 లో మేవాడుపతనం, 1933 లో ఖిల్జీరాజ్య పతనం, 1946 లో పృధ్వీపుత్రి, 1949 లో దుర్గాదాసు మొదలైన చారిత్రక నాటకాలు వెలువడ్డాయి.

## మల్లాది అవధాని :

అవధానిగారు 1915 వ సంవత్సరం సెప్టెంబరు 15 వ తేదీన శ్రీకాకుళం జిల్లా టెక్కలిలో జన్మించారు. ప్రసిద్ధ ఏకాంకికా రచయిత. అనేక నాటకాలు నాటికలు రచించారు. వీరు హైస్కూలు హెడ్‌మాస్టరు. గాలివాన - ఆనందో బ్రహ్మ - నాదిర్షా-నాటికలు: యవ్వనం-దిగంబరి-ఆంధ్రరాష్టం-అసంపూర్ణ రామాయణం మొదలైనవి రచించారు. ఖడ్గ తిక్కన - పీష్వా - సుల్తానారజియా మొదలైన నాటికలు హిందీలోకి అనువదించబడ్డాయి.



## చల్లా లక్ష్మీనారాయణశాస్త్రి:

ఈ మధ్యనే కీర్తిశేషులైన చల్లా లక్ష్మీనారాయణశాస్త్రిగారు పెక్కు కావ్యాలనేకాక, పౌరాణిక నాటకాలనుకూడా వెలయించారు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి గారి శిష్యులైన వీరు ప్రబంధ కవిశిరోమణి బిరుదాంకితులు. అష్టావధానాలు చేశారు. కృష్ణాజిల్లాకు చెందినవారైనా వీరు చాలాకాలం చెంగల్పట్టు జిల్లాలోని పొన్నేరి బోర్డు హైస్కూలులో తెలుగుపండితులుగా పనిచేశారు. శ్రీ శాస్త్రిగారి కళ్యాణ రాధామాధవం - భక్త కన్నప్ప - విశ్వజ్యోతి (బుద్ధుడు) - ప్రచండభార్గవము మొదలైనవి ముద్రింపబడినాయి. ప్రభావతి - విశ్వమోహిని - గోరాకుంబార్ - జనాబాయి - గిరికుమారి మొదలైనవి అముద్రితాలు.

పైన వుదహరించినవాటిలో భక్త కన్నప్ప, జనాబాయి, గోరాకుంభార్ మొదలైనవి చాలాసార్లు రంగస్థలంమీద ప్రదర్శింపబడి, ప్రేక్షకుల ఆదరాభిమానాలు చూరగొన్నాయి.

## వేదాంతకవి :

ఈయన చెళ్ళపిళ్ళవారి శిష్యుడు. అనేక నాటకాలనూ, కావ్యాలనూ వ్రాశారు. ఈయన రచనలన్నీ యువకుల్ని ఎక్కువగా వుత్సాహపరుస్తాయి. మంచి భాషాజ్ఞానమున్నవారు. కవిత్వంలో మంచి పట్టున్నవారు ఈయన వ్రాసిన నాటకాలు తెలుగుతల్లి, యుద్ధభూమి, కష్టకాలం, ఆకలిమంట విశ్వస్వరాజ్యం, మహారథికర్ణ, ఛలో హైదరాబాదు, సర్వోదయం, తంతులు, గండపెండేరం మొదలైన నాటకాలను రచించారు. వీటిలో ప్రజామోదాన్ని పొందిన నాటకం తెలుగుతల్లి. ఆంధ్రజాతిని వుత్తేజపర్చగల్గిన ఈ నాటకాన్ని ముదినేపల్లి సమాజంవారు వెలుగులోకి తెచ్చారు. ఈ సమాజానికి వెన్నెముక మిక్కిపాటి మధుసూదనరావు ఈ నాటకంలో సుప్రసిద్ధ సినీనటులు ఎ. నాగేశ్వరరావు నటించారు. ఈ నాటకం ద్వారానే ఆయన ఆంధ్రదేశానికి పరిచయమయ్యారు. వేదాంత కవిగారి ఇతర రచనలు అంతగా రాణించలేదు. ఈయనకు మహాకవి, ఆంధ్ర బెర్నార్డుషా, జగజ్జనని అనే బిరుదులుకూడా వున్నాయి. 1957 సంవత్సరం ఏప్రిల్ నెలలో మద్రాసు వాణీమహల్లో వీరికి సన్మానం జరిగింది.

## మల్లాది వేంకటకృష్ణశర్మ :

విశ్వనాధ కవిరాజుగారి తమ్ముడు వేంకట కృష్ణశర్మగారు. ప్రసిద్ధ నాటక రచయిత. ముఖ్యంగా సురభివారికి ఎన్నో నాటకాలను వ్రాసి ఇచ్చారు. ఈనాడు సురభి నాటక సమాజ శాఖలన్నీ వారి నాటకాలనే ఎక్కువగా ప్రదర్శిస్తున్నారు. శర్మగారి నాటకాలన్నీ ప్రదర్శనయోగ్యంగా విలబడ్డాయి. వీరి 'వారసత్వం' ఏకాంకిక బహుళప్రచారం పొందింది. ప్రత్యక్షదైవము, సుబ్బమ్మవిరహం, నామకరణం, గతిలేనిదేశంలో మతిలేని మనుష్యులు మొదలైన హాస్య నాటికలుకూడ ప్రేక్షకుల ఆదరాభిమానాలను పొందాయి.

## భమిడిపాటి కామేశ్వరరావు :

కామేశ్వరరావుగారు ప్రసిద్ధాంధ్ర హాస్య నాటక రచయితలు. 1897 వ సం॥రం ఏప్రిల్ 28 వ తేదీన ఆకివీడులో జన్మించారు. పట్టభద్రులు. రాజమంద్రి

వీరేశలింగంగారి స్కూలులో ఉపాధ్యాయులుగా పనిచేశారు. వీరి రచనలు అప్పుడు-ఇప్పుడు, కాలక్షేపం. పెళ్ళిట్రైనింగు, గుసగుసపెళ్ళి. త్యాగరాజు ఆత్మవిచారం. నిజం, అన్నీ తగాదాలే. వీరి నాటకాలన్నీ హాస్యప్రధానమైనవి. వీరి ప్రసంగంకూడా హాస్యప్రధానమైనది. వీరు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీలోనూ, కళా పరిషత్తులోనూ పనిచేశారు.

## గురజాడ అప్పారావు :

గురజాడ అప్పారావుగారు 1865 వ సంవత్సరంలో విశాఖజిల్లా ఎలమంచిలి తాలూకా రాయవరంలో జన్మించారు. చిన్నతనంలోనే సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లభాషలు నేర్చారు. 1872 లో విజయనగరం మహారాజా కళాశాల విద్యార్థిగా చేరారు. గిడుగు రామమూర్తిగారికి సహాధ్యాయిగా చదివారు. 1886 లో బి. ఏ. పట్టం పొందారు. ఎన్నెన్నో ఉద్యోగాలు చేశారు. 1892 లో కన్యాశుల్కం నాటకం రచించి, 1897 జనవరి 1 వ తేదీన పీఠిక వ్రాశారు. 1906 లో కొండుభట్టీయం అనే సాంఘిక నాటకం రచించారు. ఆ సంవత్సరంలోనే ముత్యాల సరాలు గేయాలను రచించి, గురజాడ వాల్మీకి అనే పేరుపొందారు తెలుగు దేశంలో ప్రజాహృదయాలను చూరగొన్న దేశభక్తి గేయం 1910 లో వ్రాశారు. లవణరాజు కల, పూర్ణిమ, కన్యక, దేశభక్తి, నీలగిరి పాటలు-సుభద్ర మొదలైన ఖండకావ్యాలను రచించారు.

నాటకరచనలో వ్యావహారిక భాషను ప్రయోగించి, సంఘ సంస్కరణ దృష్టితో కన్యాశుల్కాన్ని రచించి, నాటక రంగంలో ఒక నూతన విప్లవాన్ని తీసుకువచ్చారు. కన్యాశుల్కం ఆనాటి నుండి ఈనాటి వరకు రచనలో ఉత్తమ నాటకంగా వెలుగొందుతూ వుంది.

కన్యాశుల్కం 1892 లో విజయనగరం జగన్నాధవిలాసినీ నాటక సమాజం వారు ప్రదర్శించారు. ఈనాటివరకు ఇంగ్లీషు, కన్నడ, రష్యన్ భాషల్లో కన్యాశుల్కం నాటకం వెలువడింది.

కన్యాశుల్కం నాటకంలో అప్పారావుగారు ఆంధ్ర ప్రజాజీవితాన్ని, సాంఘిక సమస్యల్నీ, సమాజంలోని వైరుధ్యాలను కళ్ళకు కట్టినట్లు చిత్రించారు. ముఖ్యంగా స్త్రీ పునర్వివాహాలను ప్రోత్సహించారు. వృద్ధ వివాహాలను ఖండిం

చారు. ఛాందస పండితుల్నీ, దొంగ బైరాగుల్నీ, గ్రాసుదోతుల్నీ, న్యాయవాదుల్నీ, పోలీసుల్నీ, పండితుల్ని సహజ సుందరంగా చిత్రించింది. కన్యాశుల్కం నాటకాన్ని ఉత్తమనాటకంగా తీర్చిదిద్దారు. బహుముఖాలు ఆంధ్రజాతికి భాషకు, నాటక రంగానికి సేవచేసిన గురజాడ వాల్మీకి 1915 నవంబరు 30 వ తేదీన విజయనగరంలో కన్నుమూశారు.

## పాకాల వెంకటరాజమన్నారు :

1901 సంవత్సరం మే 10 వ తేదీన పాకాల వెంకటరాజమన్నారుగారు రాజమహేంద్రవరంలో జన్మించారు. బి. యల్. డిగ్రీని పొందారు. మద్రాసు హైకోర్టు ఛీఫ్ జస్టిస్‌గా పనిచేశారు ఆయన న్యాయవాదవృత్తిలో వుంటూనే నాటక కళకు మహత్తరమైన సేవచేశారు. కళ అనే సాంస్కృతిక పత్రికను నడిపారు. అనేక అభ్యుదయ సాహిత్య సంస్థలతో సంబంధం కలిగివున్నారు.

1930 లో ఆయన వ్రాసిన తప్పెవరిది నాటిక తెలుగు నాటక రంగంలో ఒక నూతన అధ్యాయాన్ని స్థాపించింది. వీరి రచనలన్నీ సాంఘిక సమస్యల్ని ప్రతిబింబిస్తాయి. సంఘంలోవున్న మాలిన్యాన్ని కళ్ళకు కట్టినట్లు చూపించటం వీరి ఆశయం. వీరిమీద గాల్స్‌వర్దీ, ఇబ్సన్ లాంటి పాశ్చాత్యనాటక రచయితల ప్రభావం వున్నప్పటికీ, వీరి రచనల్లో ఏమాత్రం పాశ్చాత్యవాసనలు కానరావు. ఏ నాటికకు ఆ నాటికే ఒకప్రత్యేకితను సంతరించుకుంది. వీరి నాటికల్ని ఆంధ్రదేశంలో అనేక ఔత్సాహిక సమాజాలు ప్రదర్శించాయి.

రాజమన్నారుగారు ప్రప్రథమంగా అఖిల భారత సంగీత నాటక అకాడమీకి అధ్యక్షులుగా పనిచేశారు లలితకళలపట్ల అపారమైన ప్రేమాభిమానంగల కళాభిమాని. ఆయన వుత్తమనాటక రచయితగా ఆంధ్ర నాటక రంగంలో గణనీయమైన స్థానాన్ని సంపాదించుకున్నారు. వారి నాటికలు తప్పెవరిది, మనోరమ, ఏమి మగవాళ్ళు, మాతృప్రేమ, దయ్యాల లంక, వృథాయాసం మొదలైనవి. వీటిలో తప్పెవరిది నాటిక నాటకరంగంలో గొప్ప సంచలనాన్ని కలిగించింది. ఆ ఒక్క మాటలో చెప్పాలంటే ఆయన గొప్ప కళావేత్త.

## నార్ల వెంకటేశ్వరరావు

ఆంధ్రప్రభ సంపాదకులుగా ఆంధ్రదేశానికి పరిచితులైన నార్ల వెంక

ేశ్వరరావుగారు 1908 సంవత్సరం డిసెంబరు 1 వ తేదీన జన్మించారు. బి. ఏ. పట్టభద్రులు. అనేక పత్రికల్లో సంపాదకులుగా పనిచేశారు. నేటి రష్యాలాంటి రాజకీయ గ్రంథాన్ని రచించి, ఆంధ్రదేశంలో అనేకమంది యువకుల్లో సోషలిస్టు భావాల్ని కలిగించారు. అనేక గేయాలను, వ్యాసాలను రచియించారు. వీరి సంపాదకీయం ఒక ప్రత్యేకతను సంతరించుకుంది. దేశీయ, అంతర్జాతీయ నాటక కళను ఆకళింపు చేసుకున్నవారు, ప్రపంచ నాటకరంగానికి సంబంధించిన అనేక నాటకాలను, సాంకేతిక గ్రంథాలను సేకరించిన మహనీయుడు. ఆంధ్ర నాటకరంగం నిత్యనూతనంగా వెలుగొందాలని తహతహలాడే మహావ్యక్తి. ఎక్కడ, ఏ పరిషత్తు జరిగినా అక్కడ ఆయన కళాహృదయ ముంటుంది. ఆంధ్ర నాటికా రచయితల్లో నార్లవారు ముఖ్యులు. ఆయన గ్రామీణ వాస్తవికతను. సమాజవాస్తవికతను కళ్ళకు కట్టినట్లు కొత్తగడ్డ అనే పేరుమీద ఒక సంపుటిగా ఈ క్రింది నాటికలన్నిటినీ వెలువరించారు: "పైపంట" "ప్రారబ్ధం" "దాంపత్యం" "శకున పక్షి" "కొత్తగడ్డ" "వెలుగునీడలు" "ద్రోహం" "ఏకాభిప్రాయం" "భంగపాటు" "ఇంటిగుట్టు" "నవకవి" "అర్థాంగి" "జీవజ్వాల" "అడబ్రతుకు" "దొంగ-దొర" "వంతెన". నార్లవారి ప్రతి నాటికా ఒక నూతన పంథా సూచిస్తుంది. ఆయన అనేక సంవత్సరాలు ఆంధ్ర నాటక కళాపరిషత్తుకు కార్యనిర్వాహకసభ్యులుగాను, సలహా సంఘసభ్యులుగాను ఎనలేని కృషిచేశారు.

## దామరాజు పుండరీకాక్షుడు :

దామరాజు పుండరీకాక్షుడుగారు గుంటూరుజిల్లా, సత్తెనపల్లి తాలూకా పాటిబండ గ్రామంలో 1898 జూన్ 5 వ తేదీన జన్మించారు. 1920 వ సంవత్సరంలో మద్రాసు పచ్చయప్ప కళాశాలలో బి. ఏ. ప్యాసైనారు. తరువాత న్యాయశాస్త్రంలో పట్టభద్రులైనారు. కాశీ కృష్ణాచార్యులు, శిష్టా హనుమచ్ఛాస్త్రిల వారిద్వారా కవితాశక్తి పెంపొందించుకున్నారు.

పుండరీకాక్షుడుగారు ఆంధ్రదేశంలో నాటకంద్వారా జాతీయోద్యమాన్ని - స్వాతంత్ర్యకాంక్షను పెంపొందించి ప్రజలలో విప్లవభావాలను వెదజల్లిన ప్రప్రథమ జాతీయకవి; దేశభక్తుడు. వీరి "రణభేరి" నాటకం ప్రజాభిమానాన్ని పొందింది. ఆనాటి తెల్లప్రభుత్వం రణభేరి నాటకంలో గాంధి పాత్రను తొలగిస్తే గొప్ప

పారితోషికం ఇస్తామని ఆశ చూపించింది. కాని దానిని తిరస్కరించి దాయన. గాంధీ విజయం - పాంచాలీ పరాభవం - స్వరాజ్యమహాసభ - ఓట్ల ప్రప సనం - క్విట్ ఇండియా - నిలువీత - కమల్‌పాషా జీవితం - సంస్కారిణి మొ లైన అనేక అభ్యుదయ నాటకాలను రచించారు.

## కొండముది గోపాలరాయశర్మ :

గుంటూరుజిల్లా రేపల్లె తాలూకా భట్టిప్రోలు గ్రామంలో 17-10-1920 వ తేదీన జన్మించారు 1935 లో తురిమెళ్ళ గ్రామంలో ఎస్. ఎస్. ఎల్. సి. చదు వుతూ వివిధ వేషధారణతో ప్రదర్శనం ఇచ్చారు. 1936 లో మద్రాసు లయోలా కాలేజీలో ప్రవేశించారు. యుగంధరుడు (పిచ్చివాడుగా) - శకుంతలలో విదూష కుడు బెస్తవాడుగా-చంద్రగుప్తలో చాణక్యుడుగా - రంగూన్ రౌడీగా నటించి పేరుప్రతిష్ఠలు సంపాదించుకున్నారు 1940 లో సంస్కృత ఏకపాత్రాభినయ పోటీలలో మృచ్ఛకటికలో మైత్రేయుడుగా బహుమతుల నందుకున్నారు. 1941లో అంతర్విశ్వ విద్యాలయ ఆంధ్రభాషా వక్తృత్వ పోటీలలో ప్రథమ బహుమానాన్ని అందుకున్నారు. 1942 లో రాణీ రుద్రమ నాటకాన్ని రచించారు. 1943 నుండి 1946 వరకు ఆంధ్రప్రభ సంపాదకీయ వర్గంలో వుండి. నాటక రంగంమీద పరం పరగా వ్యాసాలను వ్రాశారు. 1944 నుండి 1954 వరకు ఆంధ్ర నాటక కళాపరిషత్ కార్యవర్గ సభ్యులుగా పనిజేశారు. 1945 డిసెంబరులో గుడివాడ పరిషత్తులో ఎదురీత నాటకానికి ప్రథమ బహుమానం అందుకున్నారు. 1952 లో గౌతమబుద్ధ నాటకానికి ఆంధ్ర సారస్వత పరిషత్తు బహుమానాన్ని అందుకున్నారు. ఇదీలోకం మొదలైన నాటకాలను, మరికొన్ని నాటికలనూ రచించారు. 1946 నుంచి సినిమా రంగంలో ప్రవేశించి అనేక చిత్రాలకు మాటలు - పాటలు వ్రాశారు.

## ఆచార్య ఆత్రేయ :

ఆత్రేయ ఆధునిక ఆంధ్ర నాటక రచయితలలో ముఖ్యులు. వీరి నాటకాలు ఆంధ్రదేశంలో నాటక సమాజాలకు నటులకు ఒక కొత్త ఉత్సాహాన్నిచ్చాయి. వీరి నాటకాలు ప్రజాసమస్యలకు సంబంధించిన సాంఘికాలు. ఆయన రచయితే కాక మంచి నటుడు. నటుడే రచయిత కావడంవల్ల నాటకానికి కావలసిన అంద చందాల నన్నిటినీ కూర్చిపెట్టారు. ఆత్రేయ నాటకాల్లో సంభాషణలకు ఒక ప్రత్యే

కత వుంది. వివిధ నాటక కళాపరిషత్తుల్లో వీరి నాటకాలు అనేక ఉత్తమ బహుమానాలను అందుకున్నాయి. ఈనాడు - యన్. జి. ఓ - పరివర్తన- విశ్వశాంతి - కప్పలు - భయం - వాస్తవం - తిరపతి - గౌతమబుద్ధ - ప్రగతి - ఎవరుదొంగ - వరప్రసాదం - త్రిశూలమ్ - మాయ - కళకోసం - చస్తే యేం - చావకూడదు - అంతర్యుద్ధం - ఓటు నీకే - ఆత్మార్పణ మొదలైన నాటకా నాటికలను రచియించి ఉత్తమ నాటక రచయితగానూ, ఉత్తమ నటుడుగానూ, చలనచిత్ర రచయితగాను ప్రఖ్యాతి వహించారు. ఆత్రేయ వెంకటగిరి అమెచ్యూర్సు అసోసియేషన్ సభ్యులుగా వుండి, ఆ సమాజం ద్వారానే పరిషత్తులలో ప్రదర్శించి బహుమానాల నందుకున్నారు. తరువాత ప్రజా నాట్య మండలిలో చేరి వెలుగులోకొచ్చారు.

## వాసిరెడ్డి భాస్కరరావు :

సుంకర, వాసిరెడ్డి అనే పేర్లతో ప్రచారంలో కొచ్చినవారిలో వాసిరెడ్డి భాస్కరరావుగా రొకరు. మాభూమి - ముందడుగు - అపనిందలాంటి నాటకాలు సుంకర సత్యనారాయణతో కలిసి రచించారు. తెలుగువిద్వాన్. ఆంగ్ల, హిందీ సాహిత్యాలతో విశేషంగా సంబంధమున్నవారు. పత్రికా సంపాదకత్వంలో అను భవం వుంది. స్వయంగా పోతుగడ్డ నాటకాన్ని రచించారు. అభ్యుదయ రచయితల తోను సంబంధమున్నవారు. తన యావదాస్తినీ కమ్యూనిస్టు పార్టీకి విరాళంగా ఇచ్చిన రాజకీయవాది. పుట్టిల్లు, పల్లెటూరు, కన్నతల్లి మొదలైన చిత్రాలకు పాటలు, మాటలు వ్రాశారు. జన్మస్థానం కృష్ణాజిల్లా, వీరులపాడు. జననం 1914 సెప్టెంబరు 2 వ తేదీ. వీరి మాభూమి నాటకాన్ని కొన్నివందల ప్రజానాట్యమండలి నాటక సమాజాలు కొన్నివేల ప్రదర్శనాలను ప్రదర్శించాయి. చివరికి ప్రభుత్వ నిషేధానికి గురైంది.

## సుంకర సత్యనారాయణ :

1909 వ సంవత్సరం కృష్ణాజిల్లా ఈడుపుగల్లులో జన్మించారు. జాతీయ వుద్యమంలో కాంగ్రెసులో ప్రవేశించి, తీవ్రమైన లాఠీచార్జీకి గురై, కారాగారవాసాన్ని అనుభవించారు. అలహాబాదులో హిందీ విద్యాభ్యాసం చేశారు. ప్రపంచ ప్రఖ్యాతి వహించిన మాభూమి నాటక రచయితల్లో ఒకరు. మాభూమి-ముందడుగు - అప

నింద మొదలైన నాటకాలను వాసిరెడ్డితో కలిపి రచించారు. వీరు స్వయంగా భూమికోసం నాటకం. జీతగాడు - వీరకుంకుమ - ప్రతిఫలం మొదలైన అభ్యుదయ నాటికలను రచియించారు. వీరి నాటకాలను ఆంధ్ర ప్రజానాట్యమండలి అన్ని దళాలూ కొన్నివేల ప్రదర్శనాలను ప్రదర్శించాయి ఇంతేగాక కష్టజీవి - రైతు విజయం - వీరేశలింగం - అల్లూరు సీతారామరాజు - అమరజీవి మొదలైన ప్రసిద్ధ బుర్రకథలను రచియించారు. వీరి కథలు ఆంధ్రదేశమంతటా ప్రజా నాట్య మండలి దళాలు ప్రచారం గావించాయి. ఈయన అనేకమైన అభ్యుదయగేయాలనూ రచించారు. అనేకసార్లు జైలుజీవితాన్ని అనుభవించారు. రష్యా పర్యటన చేసి వచ్చారు. అభ్యుదయ ప్రజావాది ఈయన.

## పినిశెట్టి శ్రీరామమూర్తి :

పినిశెట్టి శ్రీరామమూర్తిగారిది పాలకొల్లు. వీరు ప్రముఖ సాంఘిక నాటక రచయిత, నటుడుకూడాను. వీరు రచించిన నాటకాలు పల్లెపడుచు - అన్నా చెల్లెలు - కులంలేని పిల్ల - కన్నకొడుకు - ఆత్మీయులు - పంజరంలో పక్షులు. నాటికలు ఆడది - రిక్షావాడు మొదలైనవి. వీరు పాలకొల్లులో ఆదర్శ నాట్య మండలి అనే స్వంతసమాజాన్ని స్థాపించి, వారి నాటకాలనూ, నాటికలనూ ఆంధ్ర దేశపు ముఖ్య ప్రాంతాలన్నిటిలోనూ ప్రదర్శించారు. వీరి రచనలు నాటక కళా పరిషత్తు వారి బహుమానాల నందుకున్నాయి. పాత్రల మధ్యసంభాషణలు నడిపించ డంలో ప్రత్యేకత వీరిది. వీరి నాటికా. నాటకాలను ఆంధ్రదేశంలో అనేక నాటక సమాజాలు ప్రదర్శించాయి. వీరు చిత్రపరిశ్రమలో అనేక చిత్రాలకూ కథలూ సంభాషణలనూ వ్రాశారు. నిత్యకళ్యాణం - పచ్చతోరణం చిత్రానికి దర్శకత్వం వహించారు.

## అనిసెట్టి సుబ్బారావు :

అనిసెట్టి సుబ్బారావుగారు నవ్యసాహిత్య పరిషత్తు ఏర్పడిన నాటినుంచి సభ్యులు. ఆ సంస్థ పత్రిక ప్రతిభ సంపాదకవర్గంలో ఒకరు. గేయ రచయిత. అనేక కథలనుకూడా రచించారు. అభ్యుదయ రచయితగా అభ్యుదయ రచయితల సంఘంలో పనిచేశారు. గాలిమేడలు - మావూరు - జీవనయాత్ర - చెప్పుకింద

పూలు - శాంతి మూకాభినయం మొదలైనవి వీరి రచనలు. గాలిమేడలు-మావూరు నాటకాలను విజయవాడ ఆంధ్ర ఆర్టు థియేటరువారు అనేక ప్రదర్శనాలను ప్రదర్శించారు. వివిధ కాలేజి విద్యార్థులు ప్రదర్శించారు. వీరి శాంతి మూకాభినయ నాటిక ఆంధ్రదేశమంతటా ప్రదర్శింపబడి, కొన్ని లక్షలమంది చూశారు. సోవియట్ ఫిలిమ్ డెలిగేషన్‌వారు 1200 అడుగుల ఈ మూకాభినయ నాటికను కలరు చిత్రంగా రూపొందించారు. అనిసెట్టి నేడు చిత్రపరిశ్రమలో వుండి అనేక చిత్రాలకు మాటలు, పాటలు, కథలూ వ్రాస్తున్నారు. వర్ధమాన ఆంధ్ర నాటక రచయితలలో అనిసెట్టి ఒకరు.

## డాక్టరు కొర్లపాటి గంగాధరరావు :

ఆధునిక ఆంధ్రనాటక యువ రచయితల్లో గంగాధరరావుగారు ముఖ్యులు. ఆయన నాటకాలనూ, నాటికలనూ దాదాపు 20 వరకూ రచించారు. వారి నాటకాలూ, నాటికలూ పరిషత్తులోనూ, ఆంధ్రదేశంలో జరుపబడిన అనేక కళా పరిషత్తుల పోటీల్లోనూ, అనేక కాలేజీ పోటీల్లోనూ బహుమతులను పొందాయి. వీరి నాటికా నాటకాలు అన్నీ సాంఘికాలే. వీరి రచనలు : విషకుంభాలు - గుడ్డిలోకం - లోకంపోకడ - నిజరూపాలు - తెరలోతెర - కమల - భవబంధాలు - అందరి ఆనందం - నాబాబు. నాటికలు: డిటెక్టివ్ - ప్రార్థన - పెళ్ళిచూపులు - గులాబీముళ్ళు - భయం - విగతి - తోడుదొంగలు - విధివశం - తెలుగుకోపం - బంగారుసంకెళ్ళు - పవిత్రసంకల్పం - కొత్త పుత్తరం - తనలోతాను - మేజోళ్ళు- మొదలైనవి. వీరు ప్రసిద్ధ నాటక రచయితే గాక, ప్రసిద్ధ నటుడు, దర్శకుడు కూడా.

## శ్రీనివాస చక్రవర్తి :

జననం 13-3-1911 కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా హనుమంతపురంలో. బి. ఎ. పట్టభద్రుడు, కవీ, నటుడూ, కళాపిపాసీ, నాటకకర్తా - స్నేహపాత్రుడూ అయిన చక్రవర్తిగారు నాట్య నాటక లక్షణాలన్నిటినీ జీర్ణించుకున్న ప్రతిభాశాలి. బాల్యంనుంచీ నాటకాలంటే అభిమానం. విద్యార్థి దశలో గిరీశం-యుగంధరుడు - చాణక్యుడు మొదలైన పాత్రలను అభినయించారు. మీజాన్ తెలుగు దినపత్రికలోనూ - తెలుగుదేశం వారపత్రికలోనూ సహాయసంపాదకులుగా పనిజేశారు.

# ప్రసిద్ధ నటులు



శ్రీ పీసపాటి నరసింహమూర్తి

కృష్ణపాత్ర

డాక్టర్ శ్రీ జి. రాజారావు



## ప్రసిద్ధ నటులు



శ్రీ యస్.వి. కృష్ణమాచార్యులు



శ్రీ పుచ్చా పూర్ణానందం



శ్రీ బసవరాజు సుబ్బారావు

## ప్రసిద్ధ నటులు



శ్రీమతి సూర్య రత్నకుమారి



శ్రీ అట్లూరి రామారావు



శ్రీ యాసంరెడ్డి వెంకటరావు

# ప్రసిద్ధ నటులు



మా భూమి నాటకంలో నాయికా నాయకులు

శ్రీ మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి - శ్రీమతి మిక్కిలినేని సీతారత్నం

అభినయం అభిమాన కళ. 'యాన్ యాక్టర్ ప్రిపేర్స్' అనే స్టానిస్లావిస్కీ గ్రంథాన్ని అభినయం అనే పేరుమీద? ఒక అమూల్యగ్రంథాన్ని ఆంధ్ర నాటక రంగానికి అర్పించారు. 1946 లో నాట్యశాల గ్రంథాన్ని రచియించారు. నటన. నాటక పోటీలు-ఆంధ్రనాటక సమీక్ష - ఆంధ్ర నాటకదర్శిని - నటశిక్షణ మొదలైన నాటక కళకు సంబంధించిన గ్రంథాలను రచించారు. వీరు నాటకాలను నాటికలను కూడ రచించారు. గోర్కీ పతితజీవులు - ఛెకోవ్ నీటికాకి - మావో జైత్ర యాత్ర - పుష్కిన్ లోభి - అతిథి - కిలాడి - ఠాగూరు నందిని - పోస్టాఫీసు ముక్తధార - మహాకవి పుష్కిన్ మొదలైనవి. చక్రవర్తిగారు నాటక కళమీద 50 వ్యాసాలు వ్రాశారు. నాట్యకళ పత్రికకు ప్రధాన సంపాదకులుగా పనిజేశారు. అనేక నాటక కళాపరిషత్తుల నాటకపోటీలలో న్యాయనిర్ణేతగా వ్యవహరించారు. ప్రస్తుతం విజయవాడ నాటకపాఠశాల ప్రిన్సిపాల్‌గా పనిచేస్తున్నారు. నిరాడంబరుడూ- నిస్వార్థకళాకారుడూ.

## డి.వి. నరసరాజు :

సాంఘిక నాటక రచయితల్లో నరసరాజుగా రొకరు. వీరు పట్టభద్రులు. కాలేజీ నాటకాలతో పరిచయముంది. కొన్నేళ్ళుగా ఆంధ్ర నాటకకళా పరిషత్తుకు సహాయ కార్యదర్శిగాను, కార్యవర్గ సభ్యులుగాను పనిచేశారు. వీరి నాటికా, నాటకాలు, పరిషత్తుల నాటక పోటీలలో ప్రదర్శింపబడి బహుమానా లందుకున్నాయి. స్వంత రచనలకంటే, అనుసరణ రచనలు ఎక్కువ. వీరి అనుసరణలో జాతీయత వుట్టిపడుతూ వుంటుంది. నాటక రచయితయేగాక నటుడు. ఈనాడు చలనచిత్ర పరిశ్రమలో ప్రముఖ రచయితగా పేరుపొందారు. వీరి రచనలు నాటకం - వీలునామా - స్వర్గసీమ - అంతర్వాణి - ఆత్మహత్య - ఇల్లు అమ్మకం మొదలైనవి.

## బెల్లంకొండ రామదాసు :

1923 వ సంవత్సరం, ఆగష్టు 23 వ తేదీ నరసరావుపేట తాలూకాలో పమిడిపాడులో జన్మించారు. పట్టభద్రులు. పత్రికావ్యాసంగంలోనూ, సంపాదకత్వంలోనూ అనుభవమున్నవారు. అభ్యుదయవాది. ఈయన పటుత్వంగా అనేక గీతాలను రచించారు. పునర్జన్మ - ఆకాశరామన్న - అతిథి అనే నాటకాలను రచియించారు. పునర్జన్మ హైదరాబాదు నాటక కళాపరిషత్తులోనూ, ఆకాశ

రామన్న విజయనగరం రాఘవ నాటకోత్సవాలలోనూ ప్రదర్శింపబడి, ప్రశంసలందు కుని బహుమానాలను పొందాయి.

## అమంచర్ల గోపాలరావు :

జననం 1907. భారతజాతీయోద్యమంలో పనిచేశారు. సత్యాగ్రహ వుద్య మంలో పాల్గొనడంవల్ల విద్యావ్యాసంగాలకు అంతరాయం కలిగింది. కారాగృహ వాసం అనుభవించారు. భారతీయకళ-ఆంధ్ర శిల్పదర్పణం అనే పరిశోధక వ్యాసాలు వ్రాశారు. విశ్వాంతర నాటకం - మాటపట్టింపు - మల్లమదేవి ఉసురు - మొదలైన నాటకానాటికలను రచించారు. మల్లమదేవి ఉసురు 1957 లో కూర్మా వేణుగోపాలస్వామిగారు ప్రసిద్ధ నాటికల్లో ప్రచురించారు. 1936 లో గుంటూరులో హరీంద్రనాథ ఛటోపాధ్యాయ సమక్షంలో ప్రదర్శించారు. తరువాత అజంతా ఎల్లోరాలపై పరిశోధనచేసి విశ్వాంతర నాటకాన్ని ప్రదర్శించారు. రేడియోలో ప్రొడ్యూసరుగా వున్నారు.

## ముదు కృష్ణ :

జననం 1899 ఫిబ్రవరి 27. బి. ఎ. బి. యల్ పట్టభద్రులు, నాటికా నాటక రచయిత జ్వాల పత్రికకు సంపాదకులుగా పనిచేశారు. ప్రసిద్ధ వైతాళిక కవితాసంపు టికి సంపాదకులు. వీరినాటకాలు. నాటికలు ఎక్కువగా విద్యార్థికుల నాటకసంఘాలూ, కాలేజీ విద్యార్థి నాటక సమాజాలూ ప్రదర్శించాయి. వీరి నాటకాలు: అనార్కలి-టీకప్పులో తుఫాను - ఆడవాళ్ళ తెలివి - ఆలోకం - అడయిక్కప్పపిళ్లై. నాటి కలు భీమావిలాపంలో భామాకలాపం - అపవాదు - ఎత్తుపై ఎత్తు మొదలైనవి. నాటకరంగానుభవం. పత్రికా సంపాదకత్వంలో అనుభవం సంపాదించినవారు. వీరి అనార్కలి ప్రసిద్ధ నాటికలలో చేర్చబడింది.

## బోయి భీమన్న :

భీమన్నగారు తూర్పు గోదావరిజిల్లా రాజోలు తాలూకా, మామిడి కుదు రులో జన్మించారు. బి.ఎ., బి. యిడి పట్టాన్ని పొందారు. పత్రికాసంపాదకత్వంలో అనుభవ మున్నవారు. మధుబాల - రాగోదయం లాంటి కావ్యాలేగాక - పాలేరు - కూలిరాజు - అమరబాల - రాగవాశిష్టం - అసూయ మొదలైన నాట కాలను రచించారు. పాలేరు - కూలిరాజు నాటకాలు ఆంధ్రదేశంలో పలుచోట్ల

ప్రదర్శింపబడి పలువురి ప్రశంస లందుకున్నాయి. ప్రస్తుతం హైదరాబాదులో ప్రభుత్వోద్యోగులుగా వున్నారు.

## బుచ్చిబాబు :

అసలుపేరు శివరాజు వెంకటసుబ్బారావు. 1916 జూన్ 14 వ తేదీన ఏలూరులో జన్మించారు. మద్రాసు, విజయవాడ, హైదరాబాదు రేడియోలలో పని చేశారు. నవల, కథ, నాటకరచనలో సిద్ధహస్తులు. వీరు వ్రాసిన నాటకాలు ఆత్మ వంచన - ఉత్తమ ఇల్లాలు - ఆదర్శాలు - దారినపోయే దానయ్య - ఉమర్ ఖయామ్ మొదలైనవి, దారినపోయే దానయ్య - ఆత్మవంచన బాగా ప్రచారం పొందాయి. చిత్రలేఖనం, సాహిత్యం, నాటక కళ వీరికి అభిమాన పాత్రమైన విషయాలు.

## రెంటాల గోపాలకృష్ణ :

1922 సంవత్సరం సెప్టెంబరు 5 వ తేదీన గుంటూరుజిల్లా పలనాడు తాలూకా రెంటాలగ్రామంలో పుట్టారు. సాహిత్యపు అన్నిశాఖలలోనూ పనిచేశారు. శిక్ష అనే నాటికను - ఇన్‌స్పెక్టర్ జనరల్ అనే గొగోల్ నాటకాన్ని అనుసరించి చక్కగా రచియించారు. అభ్యుదయకవి, కవేగాక నటకుడు. విజయవాడ ఆంధ్ర ఆర్ట్స థియేటరులో కొన్ని సంవత్సరాలుగా సభ్యులు.

## సీతంరాజు వెంకటేశ్వరరావు :

విజయవాడ వాస్తవ్యులైన సీతంరాజు వెంకటేశ్వరరావు అనేక నాటకాలనూ, నాటికలనూ రచించారు. వీరి నాటకాలను నాటికలను ఆంధ్రదేశంలో అనేక అమెచ్యూరు నాటక సమాజాలు ప్రదర్శించాయి. 35 నాటకాలను రచించారు. వీటిలో పెళ్ళి అయ్యాక చూడు-పెళ్ళిచూపులు-సంసారి - నిరపరాధి - ఈరోజు - పేదపడుచు మొదలైన నాటకాలు పేరు సంపాదించాయి. వీరు ఇంకా 24 నాటికలనూ, 5 సాంఘిక నవలలనూ, 60 జానపద నవలలనూ, పిల్లల నవలలు 10, మొత్తం 134 గ్రంథాలను రచించారు. సినీప్రభ - తెలుగుతెర పత్రికల్లో సంపాదకుడుగాను, సినీరమకు సహకార సంపాదకులుగాను పనిచేశారు వీరి జననం 1924.

కొడాలి గోపాలరావు :

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా పెదరావూరు వాస్తవ్యులు ఆంధ్ర నాటకరంగంలో అనేక అమెచ్యూర్ నాటక దళాలు వీరి నాటకాలను విస్తృతంగా ప్రదర్శిస్తున్నాయి. ముఖ్యంగా వీరు గ్రామీణ సమస్యలను చిత్రిస్తూ, రైతు కూలీ ఇతివృత్తాలను తీసుకుని, భూస్వాముల, అధికారుల పెత్తనానికి వ్యతిరేకంగా నాటకాలూ, నాటికలూ వ్రాశారు. వీరి నాటకాల్లో పేదరైతు - తిరుగుబాటు - కూలి - లంకెల బిందెలు - దొంగవీరుడు - నిరుద్యోగి-ఛైర్మెన్ మొదలైన వాటిని రసవత్తరంగా, ప్రయోగాత్మకంగా రచించారు. వీరు వస్తుతః రైతుబిడ్డ అవడంవల్ల వీరి నాటకాలు సజీవంగా వుంటాయి.





# కళాకారుల జీవితాలు



స్థానం- యడవల్లి - పులిపాటి - అద్దంకి-హరి ప్రసాదరావు-ఉప్పులూరి-పంచాంగం- రాజా రావు-గోవిందరాజుల-గురజనాయుడు-మాధవ పెద్ది-గగ్గయ్య ముంజులూరి - నగరాజారావు

మొదలైనవారు

# కళాకారుల జీవితాలు

## పద్మశ్రీ స్థానం నరసింహారావు :

గుంటూరుజిల్లా బాపట్లలో 1902 లో జన్మించారు. గత 38 వ సంవత్సరాలుగా తెలుగు నాటకరంగంమీద దేదీప్యమానంగా వెలుగొందారు. ఇప్పటికి వీరు 1500 నాటక ప్రదర్శనాలలో పాల్గొన్నారు. స్త్రీ పాత్రలో సహజత్వాన్ని ప్రదర్శించి, అచ్చంపు ఆడదని భ్రమింపజేసి అనేకమైన పతకాలను పొందారు. చిత్రాంగి, మధురవాణి, రోషనార పాత్రలు వీరిసొమ్ము. ఒక్క ఆంధ్రలోనే కాక, రాష్ట్రేతరాంధ్ర ప్రాంతాల్లోనూ నాటకాలు ప్రదర్శించి వేనోళ్ళ పొగడబడ్డారు. బర్మాలో కూడా నాటకాలను ప్రదర్శించి మెప్పును పొందారు. నటకావతంస - ఆంధ్ర బాల గంధర్వ - నటశేఖర మొదలైన బిరుదులు పొందారు. వీరు అనేక పౌరాణిక,



స్త్రీ పాత్ర

చారిత్రక, సాంఘిక నాటకాల్లో పాత్రలు ధరించారు. 1949 లో ఆంధ్ర నాటకకళా పరిషత్తు మహాసభలకు అధ్యక్షత వహించారు. వీరి నటనా కౌశల్యానికి భారత ప్రభుత్వం పద్మశ్రీ బిరుదునిచ్చింది. పద్మశ్రీ బిరుదుపొందిన నటులలో వీరే ప్రథములు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ నిర్వహించిన నాటక సద

స్సుకు శ్రీ స్థానం అధ్యక్షత వహించారు. అకాడమీ వీరికి ఫెలోషిప్, నాటక కళా ప్రపూర్ణ బిరుదు ఇచ్చి గౌరవించింది. కేంద్ర సంగీత నాటక అకాడమీవారు వీరికి రాష్ట్రపతి పతకం ఇచ్చారు. ప్రస్తుతం హైదరాబాదు రేడియోలో నాటక ప్రయోక్తగా పనిచేస్తున్నారు

## బందా కనకలింగేశ్వరరావు

జననం 1907. బి ఏ బి యల్. ప్యాసై కొన్నాళ్ళు న్యాయవాద వృత్తిని అవలంబించారు 1939 లో మొదటిసారి 'కాలేజీ ఆఫ్ డ్రమెటిక్స్' స్థాపించారు. ముప్పది సంవత్సరాలకుపైగా ప్రభాత్ థియేటరు అనే పేర జీవిక నాటక సమాజం నడిపారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం నాటక కళలో వీరికి గౌరవపట్టం బహూకరించింది. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ ఫెలోషిప్ పొందారు. యూరప్ రాజ్యాలు, సోవియట్ రష్యా పర్యటించి నాట్యకళపైన వుపన్యాసాలిచ్చారు. కొంతకాలం భారతీయ నాట్యసంఘం ప్రాంతీయ కార్యదర్శి. వీరు నాటకాల్లో కృష్ణ, సారంగధరుడు, రాముడు, బిల్వమంగళుడు, కాళిదాసు మొదలైన పాత్రలను అద్వితీయంగా నటించి, పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. చలన చిత్ర రంగపు ప్రారంభదినాలలో 5 చిత్రాల్లో నటించారు. అనేక సంస్థలతో వీరికి సంబంధముంది. విజయవాడ రేడియోలో నాటకశాఖ ప్రొడ్యూసరుగా పని చేశారు. ఉత్తమ నటనకు 1963-64 లో రాష్టపతి బహుమతి పొందారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యవర్గ సభ్యులుగాను, సంగీత నాటక అకాడమీ సభ్యులుగాను పనిచేశారు. ముఖ్యంగా కూచిపూడి నాట్యకళోద్ధరణకు విశేషంగా కృషి చేశారు.

## సి.యస్. నటేశంగారు :

సి. యస్. నటేశంగారి కంపెనీ ఆంధ్రదేశంలోనే కాక, రాష్ట్రేతర ప్రాంతాలలోనూ, రంగూను మొదలైన దూరదేశ ప్రాంతాల్లోనూ సంచారం చేసింది. నటేశంగారు అభినవ ఆంజనేయుడుగా బిరుదు పొందారు. వీరు వీరాంజనేయోపాసకులు. వీరు ప్రదర్శించిన నాటకాలన్నీ భక్తిరస ప్రధానమైనవి. ముఖ్యంగా రామాయణ నాటకాలనే ప్రదర్శించేవారు. వీరి అభిమాన నాటకం లంకాదహనం. అందులో వీరిపాత్ర ఆంజనేయపాత్ర. రామాయణ నాటకాలలో ఆంజ

నేయ పాత్ర ఎక్కడ వచ్చినా ఆ పాత్ర వీరిదే ఆంజనేయ పాత్రను అతిభక్తి శ్రద్ధలతో పోషించాడాయన. ఈ పాత్రను చూచిన ప్రేక్షకులు ముగ్ధులైపోయేవారు. ఒకసారి మైసూరు మహారాజువారి సమక్షంలో లంకాదహనం నాటకం పదర్శిస్తూ వుండగా నటేశంగారు ఆంజనేయ పాత్రలో రామ రామ రామసీతా అనే కీర్తన పాడుతూ రంగంలో ప్రవేశించినప్పుడు, భక్తిభావంలో తన్మయత్వాన్ని పొందిన ఒక పెద్ద కోతిగంతులు పెట్టుకుంటూ, రంగస్థలంమీద గంతులువేసి ప్రేక్షక స్థానాల మీదుగా పోయి అదృశ్యమైనదట. ఈ విచిత్రాన్నిచూచి మహారాజావారు పరమా నందంతో నటేశంగారిని ఘనంగా సన్మానించారట. నటేశంగారు 80 దీర్ఘ సంవత్స రాలు జీవించి, ఆంజనేయోపాసన జేస్తూనే 1950 వ సంవత్సరంలో కీర్తిశేషు లైనారు

## యడవల్లి సూర్యనారాయణ :

యడవల్లి శ్రీమంతుల కుటుంబంలో 1888 వ సంవత్సరంలో గుంటూ రులో జన్మించారు. విద్యాభ్యాసం అక్కడే సాగింది. హరిప్రసాదరావు, బలిజేపల్లి గార్ల నటనా వైదుష్యంతో ఆకర్షింపబడి రంగస్థలిపై నటననుగురించి ఎన్నో విషయాలు నేర్చుకున్నారు. గుంటూరు నాటక రంగస్థలంలో యడవల్లి ఎప్పుడు ప్రవేశిస్తారా అని ప్రేక్షకులు ఎదురుచూచే వారు. ఆయన ఆంధ్రదేశంలోనే కాకుండా తమిళ, కన్నడ ప్రాంతాల్లో దిగ్విజయంగా నాటకాలు ప్రదర్శించారు. అఖండమైన కీర్తి గడించి సువర్ణపతకాలు, కంకణాలు బహుమతులుగా పొందారు.



దుష్యంతుడు

విజయవాడ మైలవరం బాలభారతీ నాటక సమాజంలో 15 సంవత్సరాలు ప్రధాన పాత్రలు దరించారు. గుంటూ రులో హరిప్రసాదరావు తరువాత అంతటి ఉన్నతస్థానం అధిరోహించ గలిగిన వ్యక్తి శ్రీ యడవల్లి ఒక్కరే. కొంత కాలం ఏలూరు మోతేవారి సీతారామాంజ

నేయ నాటక సమాజంలో పనిచేశారు. సావిత్రిలో "సత్యవంతుడు". శకుంతలలో "దుష్యంతుడు", గయోపాఖ్యానంలో "అర్జునుడు", చిత్రనళీయంలో "నలుడు", "బాహుకుడు", వేణీసంహారం, ద్రౌపదీ వస్త్రాపహరణం, పాండవోద్యోగవిజయా లలో "దుర్యోధనుడు", పాదుకలో "శ్రీరాముడు", సారంగధరలో "సారంగ ధరుడు" మొదలైన పాత్రలు ధరించడంలో శ్రీ యడవల్లి చూపిన ప్రజ్ఞా ప్రాభ వాలు అద్వితీయాలు. చలన చిత్రసీమలో ప్రవేశించి, పాదుకలో "రాముడు", శకుంతలలో "దుష్యంతుడు"గా పాత్రలు నిర్వహించారు. జీవించిన 52 సంవత్స రాలలో 35 సంవత్సరాలు నాటకరంగంలో పనిచేశారు.

## పులిపాటి వెంకటేశ్వర్లు :

15-9-1900 సం॥రంలో తెనాలిలో జన్మించారు. 12 వ సంవత్సరంలోనే నాటకాలలో పాత్రలు ధరించడం ప్రారంభించారు. ఇప్పటికి దాదాపు 4 వేల నాటక ప్రదర్శనాలలో పాల్గొన్నారు. 50 సంవత్సరాలకు పైగా నాటకానుభవం సంపా దించారు. ఆయన అభిమానపాత్రలు రాయబారంలో "అర్జునుడు", హరిశ్చంద్రలో "నక్షత్రకుడు", చింతామణిలో "భవాని శంకరుడు", సారంగధరలో "సుబుద్ధి" ఇంకా సుదేవుడు, చెకుముకిశాస్త్రి, వెంగళరాయుడు, భరతుడు మొదలైనవి.

చలన చిత్రరంగంలో ప్రవేశించి "చింతామణి ' "హరిశ్చంద్ర "సారంగ ధర" "మోహినీ రుక్మాంగద" "తులసి" "చంద్రహాస" "చూడామణి" "తల్లి ప్రేమ" "విష్ణుమాయ" మొదలైన చిత్రాలలో నటించారు. రాష్ట్రేతర ప్రాంతా లలో నాటకాలు ప్రదర్శించి సన్మానాలందుకున్నారు. "నటకిరీటి" "నటశేఖర" అని బిరుదులు పొందారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తులోనూ, సంగీత నాటక అకాడమీ లోనూ సభ్యులుగా పనిచేశారు 1960 లో సంగీత నాటక అకాడమీ "ఫెలో షిప్పు"ను బిరుదుగా ఇచ్చి సన్మానించింది. ఆంధ్రదేశంలో అనేకచోట్ల సన్మానాలు జరిగాయి. పత్రికలలో వ్యాసాలువ్రాసి నాటక కళకు ఇతోధికంగా సేవ చేశారు.

## వైతా గోపాలం :

కృష్ణాజిల్లా శ్రీకాకుళం వాస్తవ్యులు గోపాలంగారు. మైలవరం కంపెనీలో ఎన్నో రసవత్తరమైన పాత్రలను ధరించారు. భావయుక్తంగా పాడగల నేర్పు వీరిది. భక్తిరస ప్రధానమైన పాత్రలను అద్భుతంగా పోషించేవారు. ద్రౌపదీ

వస్త్రాపహరణ నాటకంలో విదురపాత్రను ధరించి ఆ పాత్రకు జీవంపోశారు. వీరు తుంగల చలపతిరావుతో కలిసి సతీ సక్కుబాయి నాటకాన్ని రసవత్తరంగా తయారుచేసి, దానికి దర్శకత్వం వహించి, పాటలు వ్రాసి, ఆ పాటలకు బాణీలను కూర్చి, ఆంధ్రదేశమంతటా పర్యటించి, అఖండమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించారు. సక్కుబాయిలో ఆయన ధరించిన శివయోగి పాత్ర ఏనాటికి మరువ తగిందికాదు. అనేకమందికి తరిఫీదునివ్వడంలో దిట్ట. అలా తయారుచేసినవారిలో ఈనాటి చలనచిత్ర సంగీతదర్శకుడు పెండ్యాల నాగేశ్వరరావుగారు ముఖ్యులు. గోపాలంగారు చలనచిత్రరంగంలో కూడా చాలారోజులు పనిచేశారు.

## అద్దంకి శ్రీరామమూర్తి :

అభిజ్ఞానశాకుంతలంలో కణ్వమహర్షిగా, హరిశ్చంద్రలో హరిశ్చంద్రుడుగా, వీరబాహుడుగా, పాదుకలో దశరథుడుగా, కురుక్షేత్రంలో ధర్మరాజుగా నటించి అఖండమైన పేరుప్రఖ్యాతులు సంపాదించుకున్న సుప్రసిద్ధ రంగస్థల చలనచిత్రనటుడు. సంగీత విద్వాన్ అద్దంకి శ్రీరామమూర్తి గారు. 1911 వ సంవత్సరంలో గయోపాఖ్యాన నాటకంలో సహదేవునిపాత్ర ధరించి, ఆనాడే తమ



నటజీవితానికి పునాదులు వేసుకున్నారు ఆయన. కొంతకాలం బందరు బాలభరత సంఘం మైలవరం బాలభారతి, ఏలూరు సీతారామాంజనేయ నాటకసమాజాల్లో ఉద్దండులైన నటులతో నటించారు. ఆయన అనేక గ్రామఫోనురికార్డుల నిచ్చారు. ఆయన సంగీతవిద్వత్తు అద్వితీయమైంది. నాటకరంగంనుంచి సినిమారంగంలో ప్రవేశించి 25 చిత్రాల్లో నటించారు. ఆయన అనేకసభల్లో సువర్ణఘంటాకంకణాలను అందుకున్నారు. ఆయన అభిమానపాత్రలు పాదుకలో దశరథుడు-శకుంతలలో కణ్వమహర్షి - పాండవోద్యోగ విజయాలలో ధర్మరాజు మొదలైనవి ఆయన ప్రజ్ఞావంతుడని నిరూపించాయి. ప్రజ్ఞావంతుడు కావడంవల్లనే 50 సంవత్సరాలు నాటకరంగంలో స్థిరమైన స్థానాన్ని సంపాదించుకున్నారు.

## పంచాంగం రామానుజాచార్యులు :

బందరు బాలభారతసంఘంలో చేరి శిక్షణపొంది, పేరెన్నికగన్న పంచాంగం రామానుజాచారి స్ఫురద్రూపి. సుందరమైన తన విగ్రహంతో ఏపాత్ర ధరించినా ప్రేక్షకులను ఇట్టే ఆకర్షించేవారు. నాటకాలలో నాయకీ నాయక పాత్రలు రెంటినీ అభినయించారు. శాస్త్రీయసంగీతాన్ని కట్టుదిట్టంగా నేర్చుకుని రంగస్థల నాటకాల సంగీత మెళుకువలు తెలుసుకుని పద్యభావాన్ని రసాన్వితంగా వెలువరించేవారు పతివ్రతలైన సీత, సావిత్రి, దమయంతి, రుక్మిణి పాత్ర లనేకాక, సత్యభామ, చింతామణి, చిత్రాంగి, కైక, కమల మొదలైన వగలమారి పాత్రలను కూడా నటించేవారు. రాముడు, కృష్ణుడు, నలుడు మొదలైన ఉదాత్త కథానాయకపాత్రల్ని ధరించేవారు. కొంతకాలం ఏలూరు మోతేనారాయణరావుగారి సీతారామాంజనేయ నాటక సమాజంలోనూ, అనేక వృత్తినాటకసమాజలలోనూ, పాత్రలు ధరించి ప్రజామన్ననల నందుకున్నారు.

## డి.వి. సుబ్బారావు :

ఆంధ్రదేశంలో ఇండియన్ డ్రమెటిక్ కంపెనీ అనేక నాటక సమాజాలకూ, నటులకూ, క్రమశిక్షణలో మార్గదర్శకంగా వుంటూ తెలుగు నాటక రంగస్థలికి గౌరవప్రతిష్ఠలు సంపాదించింది. ఆ సంస్థను నిర్వహించిన మహనీయులు దేవరకొండ వెంకట సుబ్బారావుగారు. సామాన్య కుటుంబంలో జన్మించారు. కొంతకాలం ప్లీడరు గుమస్తా వుద్యోగం చేశారు. బందరు భువనరంజినీ థియేటరులో వివిధ పాత్రల్ని ధరించారు ప్రథమంగా ఆయన సంస్థ నిర్వహించిన నాటకం గులేబకావళి, కృష్ణలీల నాటకంలో ఒక్కొక్కసారి యశోదగా, కంసుడుగా, వసుదేవుడుగా చిన్న పాత్రలు నిర్వహిస్తూ వుండేవారు. అదేవిధంగా లవకుశలలో రాముడు, లక్ష్మణుడు, సారంగధరలో సారంగధరుడు, నారాజు నాటకంలో విశ్వపతి, తిమ్మరుసు పాత్రల్ని ప్రతిభావంతంగా పోషించారు. అయితే ఆయనకు అసమానకీర్తిగడించిపెట్టిన పాత్ర హరిశ్చంద్ర. 1917 లో గుంటూరు హరిశ్చంద్ర నాటక పోటీల్లో ప్రథమ బహుమతి అందుకున్నారు. 36 సంవత్సరాలు ఆయన కంపెనీని క్రమశిక్షణతో నడిపారు. నెల జీతాలమీద నటుల్ని పోషించారు. అనుకున్న సమయానికి నాటకం ప్రారంభించేవారు.

ప్రాంప్టర్ ఆయన నాటకంలో వుండేవాడు కాదు. హిందీ నాటకాలను కూడ ప్రదర్శించారు. నాటక కళనూ, జీవితాన్నీ సమన్వయించి, 40 సంవత్సరాల కాలం ఆయన నాటక రంగ సేవ చేశారు. ఆయన 54 పాత్రలు ధరించి నటుడుగా అఖండమైన కీర్తి గడించారు.

## ఉప్పలూరి సంజీవరావు :

సంజీవరావుగారు మైలవరం బాలభారతీ నాటక సమాజంద్వారా అఖిలాంధ్ర దేశంలో పేరు సంపాదించారు. ప్రథమంగా బందరులో డి. వి. సుబ్బారావుగారి నాటకాల్లో పాత్రలు ధరిచేవారు. సంజీవరావుగారి కంఠం మృదుమధురమైన కోకిలకంఠం. చిత్రాంగి మోహిని మొదలైన శృంగార పాత్రల నభినయించడంలో అందెవేసిన చెయ్యి. మైలవరం వారి సావిత్రి నాటకంలో సావిత్రి పాత్ర సంజీవరావుగారికి ఎక్కువ పేరు తెచ్చిపెట్టింది. మైలవరం కంపెనీవారి సావిత్రి నాటకమంటే మూడురోజులు ముందుగానే టిక్కట్లన్నీ అయిపొయ్యేవి. యడవల్లి సూర్యనారాయణ దుష్యంతుడైతే, సంజీవరావుగారు శకుంతల పాత్రను ధరించేవారు.



సత్యభామ

సావిత్రి, దమయంతి, చంద్రమతి మొదలైన సాత్విక ప్రధానమైన పాత్రలనుకూడా అద్భుతంగా నటించేవారు. కట్టులో, బొట్టులో, నడకలో, వద్దికలో స్త్రీలను మరపించేవారు సంజీవరావుగారు.

## రంగమార్తాండ, కపిలవాయి

## రామనాథశాస్త్రి :

ఆంధ్రనాటకరంగంలో ఒక దశాబ్దంపాటు ఉజ్వలతారగా ప్రకాశించిన రామనాథశాస్త్రిగారి గాత్రం అతిగంభీరమైంది. మధురమైనది. శ్రావ్యమైనది. పద్యాన్ని భావయుక్తంగా విరిచి పాడగలిగిన ఒక ప్రత్యేక విధానాన్ని ప్రవేశపెట్టిన ప్రజ్ఞాశాలి ఆయన. రామనాథశాస్త్రిగారు ప్రసిద్ధ నటుడుగా పేరు తెచ్చుకున్న సమాజం మైలవరం

బాలభారతి. ఆ సమాజంలోనే ఆయన గయోపాఖ్యానంలో అర్జునుడు. పాదు కలో రాముడు, భరతుడు, సావిత్రిలో సత్యవంతుడు. తులాభారంలో నారదుడు, విప్రనారాయణలో విప్రనారాయణుడు మొదలైన పాత్రలను అద్భుతంగా నటించి ప్రసిద్ధనటు డనిపించుకున్నారు. ఆనాడు ఆయ నిచ్చినన్ని గ్రామఫోను రికార్డులు మరేనటుడూ ఇవ్వలేదు ప్రఖ్యాతి వహించిన ఆయన రికార్డుల్లో, "స్థిరమైన నడ వడీ జనులకందరకు""సర్వేశ్వరుండగు శౌరి కింకరుజేయు" "సీతాధరాజాత"మొద లైన పద్యాలు, కోరీభజింతున్ గోవిందున్ మది. ఏదీగతీ నాకు. నమస్తే నా ప్రాణనాథా మొదలైన పాటలు బహుజనాదరణను పొందాయి. మైలవరం బాల భారతిలో యడవల్లివారి తరువాత అంతటి స్థానాన్ని సంపాదించగలిగినవారు శాస్త్రి గారే. ఆయన పాటకుడేకాక వాచికాభినయంలో ప్రత్యేకపద్ధతిని అనుసరించారు. అనతికాలంలోనే ఆంధ్రదేశమంతటా పేరు ప్రఖ్యాతుల్ని సంపాదించుకున్న శాస్త్రి గారు 1935 సంవత్సరం మే నెలలో కీర్తిశేషులయ్యారు.

## డాక్టరు గరికిపాటి రాజారావు :

ఆంధ్ర నాటకరంగంలో ఆంధ్ర ప్రజా నాట్యమండలి ద్వారా వెలుగులో వచ్చిన కళాకారుడు గరికిపాటి రాజారావు. వైద్యవృత్తినీ, కళాప్రావీణ్యాన్నీ ప్రజలసేవకే అంకితంచేసిన వుత్తమవ్యక్తి. ఆయన వైద్యవృత్తిలో కృష్ణాజిల్లాలో స్థిరపడి ఆంధ్ర ప్రజా నాట్యమండలి ఆర్గనైజరుగా నిర్ణయింపబడి రాష్ట్ర ప్రజా నాట్యమండలిని ఏర్పాటు చేశారు. ఆ దళానికి ఆర్గనైజరుగా, డాక్టరుగా, డైరె క్టరుగా పనిచేశారు. ప్రజానీకాన్ని కళాయుధం ద్వారా చైతన్యవంతులుగా చేయ డానికి ఒక నూతన వుత్సాహాన్నిచ్చారు. ప్రజా నాట్యమండలిలో 1948 వరకూ విరామంలేకుండా పనిచేశారు. ప్రజా నాట్యమండలి సందేశాన్ని రాష్ట్రేతర ప్రాంతా లకూ తీసుకుపోయి, ఆంధ్రనటుల ఔన్నత్యాన్ని చాటారు. రచయితగా నాటకాలు వ్రాశారు. ప్రజా నాట్యమండలి నాటకాలలో పాత్రలు ధరించారు. ఆయన మంచి నర్తకుడు. ప్రజల నుత్తేజపర్చే అద్భుత నృత్యాలను చేసేవారు, డాక్టరుగా ప్రజ లకు ఉచితవైద్యం చేశారు. ఆయన కొంతకాలం రాజమండ్రిలో వైద్యవృత్తిలో వుంటూ రాఘవ కళానిలయం స్థాపించి, ఆదర్శంగా నాటకాలాడారు. భయం నాట కాన్ని ఢిల్లీలో ప్రదర్శించి, అంతర్జాతీయ ప్రశంసలను అందుకున్నారు. నటన లోనూ దర్శకత్వంలోనూ నాటకప్రయోగంలో, రంగప్రక్రియల ద్వారా, నాటక రంగస్థలాన్ని ప్రజల కత్యంత సన్నిహితంగా తీసుకుపోయారు. ఆయన అఖిల భారత ప్రజా నాట్యమండలి కార్యవర్గ సభ్యులుగా పనిచేశారు, సినిమారంగంలో ప్రవేశించి, పుట్టిల్లు చిత్రం నిర్మించి, తద్వారా అభ్యుదయ భావాలను ప్రవేశపెట్టారు.

ఆ చిత్రం అపజయం పొందడంతో, తిరిగి రాజమండ్రి వెళ్ళిపోయి, తిరిగి నాటక ప్రదర్శనాలను సాగించారు. బలరాజ్ సహానీని ఆహ్వానించి రాజమండ్రిలో, ఆంధ్ర థియేటర్సు ఫెడరేషన్ మహాసభ జరిపారు. తరువాత తిరిగి మద్రాసు వచ్చి చిత్ర నిర్మాణం సాగించారు. కాని అది కొనసాగలేదు. ఆ సమయంలో అల్లూరి సీతారామ రాజు-జై భవాని నాటకాలను ఆంధ్రదేశంలో ప్రదర్శించారు. ఈనాడు చలనచిత్ర రంగంలో ప్రకాశిస్తున్న జమున, టి. చలపతిరావు, పి. మోహన్‌దాసు, మేకప్ కుమార్, నృత్యదర్శకుడు వేణుగోపాల్, కుమారి దేవిక, పబ్లిసిటీ ఆర్టిస్టు కేతా, అల్లు రామలింగయ్య, నవీనలక్ష్మి, రాజబాబు, కృష్ణ, కాకరాల, కె. వి. చలం, రామకోటి మొదలైనవారందరూ రాజారావుద్వారా ప్రవేశపెట్టబడినవారే, జీవితాంతం ప్రజాసేవకే అంకితంచేసి, ఆంధ్ర ప్రజా నాట్యమండలి ద్వారా నాటక రంగానికి సేవచేసి, 49 సంవత్సరాల వయసులో మద్రాసులో మరణించారు.

## గోవిందరాజుల వెంకటసుబ్బారావు :

శ్రీ సుబ్బారావు పొట్టివారైనా, గంభీరమైన విగ్రహం. స్ఫురద్రూపి, మంచి వ్యక్తి చమత్కారాలతో, ఛలోక్తులతో సభికుల్ని రంజింపచేసేవారు. ఆయన డాక్టరుగా, యాక్టరుగా, దాటీగా, దర్జాగా మీసాలు దువ్వుకుంటూ, 64 సంవత్సరాలు జీవించారు. ఆయన ఎక్కడ జన్మించిందీ తెలియదుకాని, ఆయన నాటకాలు ఆడిందిమాత్రం తెనాలి రామవిలాస సభలో. బొబ్బిలినాటకంలో, హైదర్‌జంగ్, బుస్సీ పాత్రలు నిర్వహించేవారు. అదే విధంగా ఒక్క కన్యాశుల్కం నాటకంలో గిరీశం, సూత్రధారుడు, పుటోగ్రాపు పంతులు, బంట్రోతు, కరటకశాస్త్రి, పోలిశెట్టి, అసిరిగాడు ఇన్ని పాత్రల్నీ, అద్భుతంగా నిర్వహించేవారు. కాని ఎక్కువ పేరు తెచ్చుకున్న పాత్ర గిరీశం. తరువాత రాణించిన పాత్ర ప్రతాపరుద్రీయంలో యుగంధరుడు. ఆయన ఆంధ్రనాటకరంగంలో ప్రముఖ నటుడనిపించుకున్నారు. తెనాలిలో వైద్య



పిచ్చివాడు

వృత్తి జోరుగా సాగుతూవుండేరోజుల్లో సినిమారంగంలో ప్రవేశించి, మాలపిల్లలో సుందరరామశాస్త్రి పాత్రను అద్భుతంగా నటించి పేరు తెచ్చుకున్నారు. ఆతరువాత షావుకారులో చంగయ్య, బాలనాగమ్మలో మాయాలమరాఠి పాత్రలకు కొత్తరూపం సంతరించారు. గుణసుందరి కథ - ధర్మాంగద-ముగ్గురు మరాఠీలు-మాయలోకం - పల్నాటియుద్ధం - శాంతి-కన్యాశుల్కం చిత్రాలు ఆయనకు వన్నె తెచ్చాయి. ఆయన 1959 అక్టోబరు 29 న మద్రాసులో నిర్యాణం చెందారు.

## గురజనాయుడు :

ఆంధ్ర నాటకరంగంలో మైలవరం బాలభారతి నాటక సమాజం అసమానమైన పేరు ప్రతిష్టల్ని గడించుకున్నది. ఉప్పులూరి సంజీవరావు సావిత్రిగాను, యడవల్లి సూర్యనారాయణ సత్యవంతుడుగాను నటించే సావిత్రి నాటకంలో గూడ పాటి నరసింహారావు నాయుడనే ఆనాటి గురజనాయుడు యమధర్మరాజు పాత్రను ధరించేవారు. ఈనాటికీ యమునిపాత్రలో గురజనాయుడుకు సాటి మరొకరు లేరనడంలో అతియోక్తి లేదు. కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా గురజలో జన్మించడం వల్ల ఆయనకు గురజనాయుడనే పేరు వచ్చింది. ఆయన బందరు రామమోహన థియేటరులో వివిధ పాత్రలు ధరించి, 1917 లో మైలవరం బాలభారతిలో ప్రవేశించి, 1928 వరకూ అఖండమైన పేరు ప్రఖ్యాతులు సంపాదించి, అదే నాటకాలలో నటిస్తూ పరమపదించారు. ఆజానబాహువైన విగ్రహం, ఆరు అడుగులఎత్తు, నిండైన అంగసౌష్ఠవంతో, బుగ్గమీసాలతో, అతి గంభీరంగా కనిపించేవారు. ఆయన గొంతు నిండైనది. పాటలు, పద్యాలు మందరస్థాయిలో గంభీరంగా పాడేవారు. సావిత్రిలో యముడు, ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు, కృష్ణలీలలో కంసుడు, కనకతారలో క్రూరసేనుడు మొదలైన భీకరపాత్రలతోపాటు, దశరథుడు, ధర్మరాజు మొదలైన సాత్వికపాత్రలనుకూడ ప్రశంసనీయంగా నటించేవారు,

## మాధవపెద్ది వెంకటరామయ్య :

**తెనాలి రామవిలాస సభకు చెందిన మాధవపెద్ది వెంకటరామయ్య, గుంటూరు జిల్లా బ్రాహ్మణకోడూరులో జన్మించారు. రామవిలాస సభలో చేరి చిన్నా పెద్దా**

## ప్రసిద్ధ నటులు



శ్రీ ఘంటసాల రాధాకృష్ణయ్య (కబీరు)



శ్రీ లక్కరాజు విజయగోపాలరావు



శ్రీ కోరాడ నరసింహారావు

## ప్రసిద్ధ నటులు



నాట్య కళాప్రపూర్ణ

శ్రీ తాడిపత్రి రాఘవాచార్యులు

శ్రీమతి ఎ. పూర్ణిమాదేవి





"ఆంధ్రుడా లేవరా" - మా భూమి నాటకంలో ఒక సన్నివేశం

ఉమామహేశ్వరరావు - కోగంటి - కోసూరి పున్నయ్య - మిక్కిలినేని



ఆంధ్ర ప్రజానాట్యమండలి (రాష్ట్రదళం సభ్యులు)


దుర్యోధనుడు

అనుకోకుండా అన్నిపాత్రలూ ధరించారు. ఏపాత్ర తీసుకున్నా భావయుక్తంగా నటించేవారు. పాటకు ప్రాముఖ్య మివ్వక పదాలను విడగొట్టి, ఒకసారికి రెండుసార్లు తరచి తరచి ప్రేక్షకులకు అర్థమయ్యే రీతిలో పద్యాన్ని పాడి ప్రేక్షకుల మన్ననలు పొందేవారు. ప్రతిపాత్రకూ ఏదో ఒక ప్రత్యేక వ్యక్తిత్వాన్నీ, సహజత్వాన్నీ సృష్టించేవారు. వీరు ప్రతాపరుద్రీయం, పాండవోద్యోగం, పాండవ విజయం, కురుక్షేత్రం, బొబ్బిలియుద్ధం, రోషనార, శివాజీ, షోరాబు రుస్తుం మొదలైన నాటకాల్లో బొబ్బిలిలో రంగారాయుడుగా, ప్రతాపరుద్రీయంలో ప్రతాపరుద్రుడు, వల్లీఖానుగా, షోరాబురుస్తుంలో షోరాబుగా ప్రజాహృదయాలను చూరగొన్నారు. ముఖ్యంగా వీరిపాత్రల్లో ప్రఖ్యాతి పొందిన పాత్ర దుర్యోధనుడు.

కేవలం ఆర్థికదృష్టేకాక, కళాదృష్టితో నాటక కళకు సేవచేశారు. కళాపరిషత్తు సభలకు అనేకపర్యాయాలు హాజరయ్యారు. 60 సంవత్సరాల వరకూ వ్యాయామం చేస్తూవుండేవారు. కళాశీలి, పరోపకారపరాయణుడు. అమృతహృదయుడైన వెంకటరామయ్యగారు 1957 మార్చి 19 వ తేదీన మనలను వదలి వెళ్ళిపోయారు.

## వేమూరు గగ్గయ్య :

గుంటూరుజిల్లా తెనాలి తాలూకా వేమూరు గ్రామంలో 1895 సంవత్సరం మే 15 వ తేదీని జన్మించారు. చిన్నతనంలోనే సురభి నాట్యమండలిలో చేరి నాటకాల్లో వేషాలు వేశారు. కొంతకాలం రంగూన్‌లో వుండి నాటకాల్లో వేషాలువేశారు. తరువాత తెనాలి ఫస్టు కంపెనీలో చేరారు. ఆతరువాత మైలవరం థియేటరులోనూ, మహానందరెడ్డి కంపెనీలోనూ వుండి ముఖ్యపాత్రలు ధరించారు. ఆరోజుల్లోనే గ్రామఫోను రికార్డులద్వారా ఆయన కంచుకంఠం ఆంధ్రదేశమంతటా ప్రచారమైంది. తరువాత చలనచిత్రరంగంలో ప్రవేశించారు. మొదటిచిత్రం సతీసావిత్రిలో యమధర్మరాజు పాత్రను ధరించారు. తరువాత కృష్ణలీలలో "కంసుడు", సతీతులసిలో

''జలంధరుడు'', జరాసంధలో, ''జరాసంధుడు'', మార్కండేయలో ''యముడు'', ద్రౌపదీ వస్త్రాపహరణంలో ''శిశుపాలుడు'', దక్షయజ్ఞంలోదక్షుడు, మైరావణలో ''మైరావణుడు'', ప్రహ్లాదలో హిరణ్యకశిపుడు, సీతారామ జననంలో''రావణుడు'' మొదలైన పాత్రల్ని అద్భుతంగా నటించి ఆంధ్రప్రజల హృదయాల్లో శాశ్వత స్థానాన్ని ఏర్పరచుకున్నారు. గగ్గయ్య పేరు వినగానే ధిక్కారమును సైతునా అన్నపాట జ్ఞాపకానికి వస్తుంది. గగ్గయ్యగారి గంభీర, రౌద్రగీతాలు ఆంధ్రదేశ మంతా మారుమ్రోగాయి. రసానుభూతిని అనుభవిస్తూ, పద్యాలు, పాటలు పాడే వారు. రౌద్రపాత్రల్లో ఆనాడు ఆయనను మించినవారు మరొకరు లేరు. రంగస్థల నటుడుగా, సినీనటుగా ప్రఖ్యాతి నార్జించిన గగ్గయ్యగారు కాన్సర్‌వ్యాధితో 1955 డిసెంబరు 30 వ తేదీన కన్ను మూశారు.

## వెంపటి వెంకటేశ్వర్లు :

బందరు వాస్తవ్యులైన వెంపటి వెంకటేశ్వర్లుగారు నేషనల్ థియేటరనే బుట్టయ్యపేట కంపెనీలో నటుడుగా పైకొచ్చారు. వీరు ఈవెన లక్ష్మణస్వామిగారి శిష్యులు. రాజవేషధారణలో పేరు సంపాదించు కున్నారు. స్వశక్తితో నటు దనిపించుకున్న వ్యక్తి. చిత్రనళీయం నాటక పోటీలలో నలుని పాత్రను అద్వితీయంగా నటించి బంగారు పత కాన్ని పారితోషికంగా పొందారు. రసపుత్ర విజయ నాటకంలో దుర్గాదాసు పాత్రను సమర్థ వంతంగా అభినయించేవారు. ముంజులూరి, డి. వి. సుబ్బారావుగార్లతో సమకాలిక నటుడుగా వర్థిల్లారు. లక్ష్మణస్వామిగారు చనిపోయిన తరు వాత పీష్వా నారాయణరావు వధ నాటకంలో సుమేరుసింగ్ పాత్రను ధరించి, లక్ష్మణస్వామి గారి పేరును నిలబెట్టారు. ప్రతాపరుద్రీయ నాట కంలో విద్యానాధపాత్రను అత్యద్భుత చాక



నలుడు

చక్యంతో స్వభావసిద్ధంగా అభినయించి ప్రజల నీరాజనాలను అందుకున్నారు. వీరు పెద్దవిద్యావంతులు కాదు. ప్లీడరుగుమాస్తా ఉద్యోగం చేసుకుంటూ, నాటకళా సేవ

చేశారు. అనాడు బందరు నాటకరంగ ప్రముఖనటులలో వెంకటేశ్వర్లుగారుకూ ఒకరు.

## ఘంటసాల రాధాకృష్ణయ్య :

ఘంటసాల రాధాకృష్ణయ్యగారు నెల్లూరు సుగుణవిలాస సభకు చెందిన నటులు. కబీరు పాత్రధారణలో పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి తరువాత అంతటి పేరును గడించినవారు. ముఖ్యంగా వీరి కబీరుపాత్ర ప్రేక్షకుల్ని భక్తి పార వశ్యంలో ముంచేది. కబీరు పాత్రలో వీరి అంగసౌష్టవం, వేషధారణ ప్రేక్షకులన ఆకర్షించేది. కబీరు పాటల్లో అద్భుతమైన రాగాలాపన చేసి ప్రేక్షకులను రసా నంద డోలికల్లో ముంచేవారు. వీరు ఎన్ని పాత్రలు ధరించినా అన్ని పాత్రల్లో మకుటాయమానమైనది కబీరు పాత్ర మాత్రమే.

## వెదురుమూడి శేషగిరిరావు :

కాకినాడ నాటకరంగంలో వెదురుమూడి శేషగిరిరావుగారు నటుడుగా, రచ యితగా వెలుగొందారు. కాకినాడలో పింగళం అబ్బాయి స్థాపించిన నాటక సమా జంలో పాత్రలు ధరించడమే గాక, హిందీ, తెలుగు భాషల్లో నాటకాలు వ్రాసి ప్రధాన పాత్రలు ధరించేవారు. 1900-1906 ప్రాంతంలో ఆంధ్రదేశ మంతటా సంచారంచేసి, అభినయ చాతుర్యంతో ప్రసిద్ధ నటుడుగా వెలుగొందారు. వీరి అభినయస్థాయి విద్యావంతులను, విమర్శకులను ముగ్ధులను చేసేటంత గొప్పగా, గంభీరంగా వుండేవి.

## నేలనూతుల రామకృష్ణయ్య :

నెల్లూరు ఆంధ్రసభకు చెందిన నేలనూతుల రామకృష్ణయ్య నెల్లూరు నాటక రంగంలో ప్రముఖ నటుడుగా వెలుగొందారు. శ్రీకృష్ణ తులాభారంలో కృష్ణుడు, నారదుడు, భరతుడు మొదలైన పాత్రలను సమర్థనీయంగా నటించేవారు. వీరికి ఎక్కువ పేరు గడించిపెట్టిన పాత్ర నారద పాత్ర. ఆ పాత్రకు కావలసిన ఆట, పాటలో మేటి రామకృష్ణయ్యగారు.

## అంకరాజు రామారావు :

రాజమహేంద్రవర నాటకరంగంలో ప్రముఖ నటుడుగా వెలుగొందిన అంక రాజు రామారావు ఎమెచ్యూర్ కంపెనీలో శ్రీపాద కామేశ్వర రావుగారి పర్య

వేషణలో అభినయ కళను ఆకళింపు చేసుకుని వుత్తమ నటుడుగా పేరు తెచ్చుకున్నారు. వీరు నటించిన పాత్రల్లో చిత్రనళీయంలోని నలుని పాత్ర ప్రత్యేకతను సంతరించుకున్నది. దమయంతి పమిటెకొంగు చించుకొని పోవునప్పుడు వీరి అభినయము, భావగంభీరత ప్రేక్షకులను ముగ్ధుల్ని చేసేదట.

## పర్వతరెడ్డి రామచంద్రారెడ్డి :

కొందరు నటులు అనేక పాత్రలను ధరించి తద్వారా గొప్ప నటులనిపించుకుంటారు. మరి కొందరు నటులు ఒకే పాత్రతో తారాపథాన్నందుకుంటారు. అటువంటి వారిలో పర్వత రెడ్డి రామచంద్రా రెడ్డి గారొకరు. నెల్లూరు జిల్లా అల్లూరు వాస్తవ్యులైన రామచంద్రా రెడ్డి గారు శ్రీ కృష్ణవిలాస సభను స్థాపించి, నెల్లూరు నాటకరంగంతో సరిసమానంగా నాటకాలను ప్రదర్శించడమే కాక, రామదాసు నాటకాన్ని ఆంధ్ర దేశ మంతటా ప్రదర్శించి, కబీరు పాత్రలో జీవించి, అభినవ కబీరని కీర్తించబడ్డారు. బళ్ళారి రాఘవాచార్యులుగారు రామదాసు పాత్రను, రెడ్డిగారు



కబీరు

కబీరు పాత్రమ ధరించి పలుతావుల్లో రామదాసు నాటకాన్ని సమర్థనీయంగా నటించారు. కబీరు పాత్రకు కావలసిన అంగసౌష్ఠవం, సాత్విక ప్రధానమైన నమ్రత, స్వచ్ఛమైన ఉరుదు ఉచ్చారణ, తన్మయత్వాన్ని కలిగించే సంగీత మాధుర్యం ఆయనకు పెట్టిన సొమ్ములు. కొంతమంది నటులు ఎన్నో పాత్రలు ధరించినప్పటికీ నటులుగా ప్రఖ్యాతి వహించలేక పోయారు. కాని రామచంద్రా రెడ్డిగారు ఒక్క కబీరు పాత్రతోనే ఆంధ్ర నాటకరంగంలో ప్రసిద్ధ నటుడుగా ప్రఖ్యాతి వహించారు.

## ఈవెన లక్ష్మణస్వామి :

లక్ష్మణస్వామిగారు కృష్ణాజిల్లా బందరు వాస్తవ్యులు. వీరు 1884 సంవత్సరంలో బందరులో నేషనల్ థియేటరును స్థాపించి హిందీలో స్వయంగా నాటకాలను రచించి ప్రదర్శిస్తూ వుండేవారు. పీష్వా నారాయణరావు వధ హిందీ నాటకంలో షమేరు సింగుపాత్రను, బొబ్బిలిలో "హైదరుజంగ్", శివాజి నాటకంలో శివాజి, రామరాజు నాటకంలో పఠాను మొదలైన పాత్రల్ని అద్భుతంగా పోషించేవారు. ఒకసారి శివాజి పాత్రాభినయంలో బిపిన్ చంద్రపాల్‌గారి ప్రశంసలనుకూడా అందుకున్నారు. భావ ప్రకటన చేయడంలో అందెవేసిన చెయ్యి. గంభీరమైన విగ్రహం, వివిధభావాలను వివరించగల సుందరమైన ముఖారవిందం, క్రోధాన్ని, శాంతాన్ని సమపాళ్ళతో నటించగల ప్రతిభాశాలి. స్ఫుటమైన ఉచ్ఛారణ గలవారు. పాటలో ప్రతిభావంతుడు కాకపోయినప్పటికీ, వాచికాభినయనంతోనూ, సాత్వికాభినయంతోనూ, తీవిగా భావప్రకటన చేయగలిగిన ఉత్తమ నటుడు. వీరు హిందీ నాటక పాత్రాభినయంలో పూనా సమాజ నటుల స్థాయిని మించిపోయారు. ఆంధ్ర దేశంలోనేకాక, అఖిల భారతదేశంలోకూడ ప్రముఖనటుడుగా పేరుతెచ్చుకున్న లక్ష్మణస్వామిగారు ఆంధ్ర నాటకరంగానికి బహుముఖాల సేవచేశారు.

## హరిప్రసాదరావు :

కూచిపూడి భాగవతుల వంశమునకు చెందినవారు హరిప్రసాదరావుగారు. వీరు వెలనాటి బ్రాహ్మణులు. వీరి నివాసస్థానం గుంటూరు. మెట్రిక్యులేషన్‌వరకు చదువుకున్నారు. కొంతకాలం టెలిగ్రాఫ్ సిగ్నలర్ ఉద్యోగాన్ని, మరికొంతకాలం గుంటూరుజిల్లా కోర్టులో కాపియిస్టు ఉద్యోగాన్ని చేశారు. 1882 - 84 సంవత్సరాలలో గుంటూరులో స్థాపించబడిన ఫస్టు కంపెనీ నాటకాలలో ప్రధానపాత్రలు ధరిస్తూ వుండేవారు.

ప్రసాదరావుగారు వేణీసంహారం నాటకంలో దుర్యోధనుడు, చిత్రనళీయంలో నల, బాహుక పాత్రలు, హరిశ్చంద్రలో హరిశ్చంద్ర పాత్రను, సారంగధరలో సారంగధరుని పాత్రను, చంద్రహాసలో చంద్రహాసుని పాత్రను, శకుంతల నాటకంలో దుష్యంతుడు మొదలైన పాత్రలను అద్వితీయంగా పోషిస్తూ వుండేవారు. నట పితామహ అనే బిరుదును పొందారు. హరిశ్చంద్ర, దుష్యంత మొద

లైన ధీరోదాత్త పాత్రలను అఖండంగా అభినయించేవారు. పద్యపఠనంలో, నటనా వైదుష్యంలో సాటిలేని మేటినటుడు హరిప్రసాదరావు. ఆయన నిగర్వి. పాటి నటుల గొప్పదనాన్ని మెచ్చుకుని వారి నుత్సాహపర్చేవారు. 60 సంవత్సరాల వయస్సులో కూడా ఎంతో ఉత్తేజంగా పాత్రల నభినయిస్తూ వుండేవారు. ఆంధ్ర నాటక రంగంలో అఖండమైన పేరుప్రతిష్ఠ లార్జించిన హరిప్రసాదరావు 1936 అక్టోబరు 7 వ తేదీన స్వర్గస్థులయారు.

## ముప్పిడి జగ్గరాజు :

రాజమండ్రి నాటక రంగంలో, స్త్రీ పాత్రధారణలో నిరుపమానమైన పేరు ప్రతిష్టలను గడించుకున్నారు. రాజమహేంద్రవరంలో మానేపల్లి కంపెనీ అని పిలువబడే నేషనల్ థియేటరు నాటకాలలో అంబడిపూడి కోటయ్యగారి ప్రక్కన చంద్రమతి, దమయంతి మొదలైన స్త్రీపాత్రలు ధరించి అభిలాంధ్రదేశంలో పేరు గడించుకున్నారు. కొంతకాలం విశాఖపట్టణం ఆంధ్ర అమెచ్యూర్ నాటక సంస్థలో పార్థి నారాయణరావుగారి ప్రక్కన కూడ స్త్రీపాత్రలను ధరించారు. వీరు స్త్రీ పాత్రధారణలో చక్కని వద్దికలనూ, లావణ్యాన్నీ, పాతివ్రత్య లక్షణాలను ముచ్చటగా ఒప్పించేవారు. రంగ స్థలంలో వున్నంతసేపూ ప్రేక్షకులకు స్త్రీయా, పురుషుడా అనేటంత ఆశ్చర్యాన్ని కలిగించేవారు. ముఖ్యంగా ఠీవిగా, మృదుమధురమైన గాత్రంతో, చతుర్విధ అభినయాలనూ అత్యద్భుతంగా ప్రదర్శించేవారు. స్త్రీ పాత్రధారణలో ఆనాడు ఆయనకు ఆయనే సాటి.



స్త్రీ పాత్ర

## ముంజులూరి కృష్ణారావు :

కృష్ణారావుగారి జన్మస్థలం కృష్ణాజిల్లా బందరు. ఈయనకు నాటక కళంటే

పంచప్రాణాలు. కాలాన్నంతా నాటకమందిరంలోనే గడిపేవారట. ప్రారంభంలో బందరు రాయల్ థియేటర్‌లో చిలకమర్తివారి గయోపాఖ్యానంలోనూ, ప్రసన్న యాదవ నాటకంలోనూ పాత్రలు ధరించేవారు. తిరుపతి కవుల పాండవోద్యోగ నాటకంలో కృష్ణ పాత్రను కడు సమర్థనీయంగా నటించేవారట. వేదంవారి ప్రతాప రుద్రీయంలో యుగంధరుడు పిచ్చివాని పాత్రను అద్భుతంగా నటించి, శాస్త్రిగారి ప్రశంస అందుకున్నారు. రసపుత్ర విజయం నాటకంలో ఠాకూర్ దుర్గాదాసు పాత్రకు సువర్ణ పతకాన్ని పారితోషికంగా పొందారు. ఏలూరు మోతే నారాయణ రావుగారి నాటకసమాజంలో మృచ్ఛకటిక నాటక ప్రదర్శనంలో శర్విలకుని పాత్రను కడు సమర్థవంతంగా పోషించారు. ప్రత్యేకించి వీరు రంగస్థలంలో పద్యాన్ని భావ ప్రకటనతో రసవంతంగా చదివేవారట.

## కందాడై శ్రీనివాసన్ :

శ్రీనివాసన్‌గారు చిన్నతనంలోనే నటుడుగా ప్రఖ్యాతి వహించారు. 1890 సం॥రంలో మర్చంట్ ఆఫ్ వెనీస్‌లో "పోర్షియా"గా మొదట నెల్లూరు నాటక రంగంలో ప్రవేశించారు. 1893 లో "శాకుంతల"లో దుష్యంతుడు భూమికను ధరించి ప్రశంసనీయంగా నిర్వహించారు 1894 నుండి 1898 వరకు మద్రాసు సుగుణవిలాస సభ తెలుగు నాటకాలలో పాత్రలు ధరించారు. భావ ప్రకటనలో శ్రీనివాసన్ గారు అతీతుడని ప్రఖ్యాతి వహించారు.



విషయ

1900 మొదలు 1915 వరకూ నెల్లూరు ఆంధ్ర భాషాభిమాని సమాజంలో వేదంవారి పర్యవేక్షణలో ఉత్తమ పాత్రలను ధరించారు. ఆయన ధరించిన పాత్రల్లో ఉషలో అనిరుద్ధుడు, ప్రతాపరుద్రీయంలో 'ప్రతాపరుద్రుడు', నాగానందంలో 'బోధిసత్వుడు', శకుంతలలో 'దుష్యంతుడు', శకుంతల మొదలైన పాత్రలు పేరుపొందాయి. 1910 లో మద్రాసు పచ్చయప్ప కళాశాలలో ఉపాధ్యాయుడుగా పనిచేశారు. సుమనోరంజనీ సమాజంలో చేరి అరవ నాటకాల్లో

పాత్రలు ధరించారు. 30 సంవత్సరాలు నెల్లూరు నాటక రంగంలో కృషిచేసినందుకు ఘంటాయుత కాంచన కంకణాన్ని బహూమతిగా పొందారు.

ఆ కాలంలో శ్రీనివాసకల్యాణంలో 'శ్రీనివాసుడు', మానవతిలో 'గోపాల వర్మ', సావిత్రిలో 'యముడు', చిత్రనళీయంలో 'నల' బాహుక పాత్రలు ధరించ డంలో వారికి మరియొకరు సాటి లేరనిపించుకున్నారు. జాతీయ ఉద్యమంలో పని చేశారు.

## రంగోద్ధారక
## నెల్లూరు నగరాజారావు :

రంగోద్ధారక నెల్లూరు నగరాజారావుగారు 1915 వ సంవత్సరంలో ప్రథ మంగా జ్ఞానోదయ సమాజంవారి ప్రహ్లాద నాటకంలో ఇంద్రుని పాత్ర ధరించారు. ఆయన డ్రాయింగ్ టీచరు. చిత్రకళలో అభినివేశముండేది. తమ పాత్రలకు స్వయంగా రూపకల్పన చేసుకునేవారు. ఆయన దశరథుడు, రాజరాజు, నందుడు, వీర నాయకుడు, కీచకుడు మొదలైన పాత్రల్ని కళాఖండాలుగా తీర్చి దిద్దారు. మద్రాసు రాఘవాచారి గారి నాటకాలను చూసి, ఆయన పాత్రల నుండి అనుభవాలను సంపాదించారు. ఆనాడు బంద రులో జరిగిన చిత్రనళీయం నాటక పోటీలలో నల-బాహుక పాత్రలు ధరించి బంగారు మెడలు బహూమతిగా అందుకున్నారు. బుచ్చిరెడ్డిపాలెంలో ఉపాధ్యాయు లుగా వుంటూ దొడ్లవారి సహాయంతో 'లవకుశ' 'కృష్ణలీలలు' 'సారంగధర' 'పాదుక' 'విజయనగర పతనం' మొదలైన నాటకాలను ప్రదర్శించి ప్రేక్షకుల



తాండ్ర పాపారాయుడు

ప్రేమాదరాభిమానాలను పొందారు. రావుగారికి మంచి పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టిన మరికొన్ని పాత్రల్లో ముఖ్యమైనవి- యుగంధరుడు, పాపారాయుడు, అక్బరు, దుష్టబుద్ధి, నక్షత్రకుడు. రావుగారిని బందరు రప్పించి డి. వి. సుబ్బారావు గారు రంగోద్ధారక బిరుదునిచ్చి గౌరవించారు. ఆయన సినిమారంగంలో ప్రవేశించి రామదాసులో 'తానీషా', వస్త్రాపహరణంలో 'శకుని', జలంధరలో 'ఇంద్రుడు' పాత్రలను ధరించారు. ఆయన నెల్లూరు నాటకరంగానికి అపారమైన సేవచేశారు. అసమాన నటుడని పేరు తెచ్చుకున్నారు.

## జమ్మలమడక మాధవరామశర్మ :

మాధవరామశర్మగారు తెనాలి తాలూకా కోరుతాడిపర్రు అగ్రహారంలో జన్మించారు. విజయనగరంలో సంస్కృతాభ్యాసం. శ్రీ తాతారాయుడుగారి వద్ద అభ్యసించారు. సర్వ విద్యాగురువుల్ని సేవించారు. పీఠాధిపతుల ఆశీస్సుల నందుకున్నారు. మంత్ర, తంత్ర, వేదాంత శిక్షణను పొందారు. సాహిత్యభాషాలంకారులు కూడా, తెనాలి, నెల్లూరు, గుంటూరు కళాశాలల్లో అధ్యాపకులుగా పనిచేశారు. శతాధిక గ్రంథాలకు పీఠికలు వ్రాశారు. పత్రికల్లో వ్యాసాలను వ్రాశారు. రేడియో ప్రసంగాలు చేశారు. ఆంధ్ర ప్రతాపరుద్రీయం,ధ్వనిసారం, రసగంగాధరం, అలంకార సూత్రము, నాట్యవేదము మొదటిభాగము, నాట్యవేదము రెండవ భాగము, రసభారతి, నాటక మీమాంస, లక్షణాలంకారం మొదలైన నాట్యశాస్త్రానికి ఉపయుక్తమైన గ్రంథాలను రచించారు. ఆంధ్ర నాటక కళాపరిషత్తులో అనేక సంవత్సరాలుగా పనిచేస్తున్నారు. ఆంధ్ర నాటక రంగానికి బహుముఖాల సేవ చేశారు. గుంటూరు ఎ. సి. కాలేజీలో అధ్యాపకులుగా పనిచేస్తున్నారు.

## యస్వీ జోగారావుగారు :

ఆంధ్ర యక్షగాన వాఙ్మయచరిత్ర వ్రాసి, ఆంధ్ర నాటక రంగానికి ఎనలేని సేవచేసిన యస్వీ జోగారావుగారు 1949 సంవత్సరం నుండి 1966 వరకూ ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఉపాధ్యాయవృత్తిలో వుంటూ, కళాపరిషత్తు నాటక కర్తగా, కార్యదర్శిగా, నాటక దర్శకుడుగా, నాటక శాఖలో అధ్యాపకుడుగా పని చేశారు. నాటక విమర్శకుడుగా అనేక పత్రికలలో వ్యాసాలు వ్రాశారు. యక్షగానా

లను గురించీ, కళలను గురించి అనేక ఉపన్యాసాల నిచ్చారు. తెలుగు భాషాబోధకుడుగా కొంతకాలం రష్యాలో వున్నారు.

## పసల సూర్యచంద్రరావు :

జననం 1909. చదువు మెకానికల్ ఇంజనీరింగు. సంగీతం, సాహిత్యం, నృత్యం, నాటకం వీరి అభిమాన కళలు, విద్యార్థిదశలో ప్రేమవిలాసినీ నాట్యమండలిని స్థాపించి కొంతకాలం జయప్రదంగా నిర్వహించారు. హిందీలో, తెలుగులో చారిత్రక నాటకాలతో ఆంధ్రదేశమంతటా ప్రదర్శించారు. చంద్రగుప్త, తానీషా, ఔరంగజేబు, అక్బరు మొదలైనవి వీరి అభిమానపాత్రలు. క్విట్ ఇండియా సమయంలో రాజకీయాలలో ప్రవేశించారు. ఆంధ్ర కాంగ్రెసు వ్యవస్థలో వివిధ పదవులు నిర్వహించారు. ఆంధ్ర శాసన సభకు డిప్యూటీ స్పీకరుగా ఎన్నికై ఆపదవిని చక్కగా నిర్వహించారు. హిందీ రచనలను కొన్నిటిని తెలుగులోకి అనువదించారు. తప్తహృది వారి ముద్రిత తెలుగు గ్రంథం. అనేక సాహిత్యవ్యాసాలు వ్రాశారు. అనేక సభలకు అధ్యక్షస్థానాన్ని అలంకరించారు. అనేక వుపన్యాసా లిచ్చారు. అనేక సంవత్సరాలనుండీ ఆంధ్ర నాటక కళాపరిషత్తు కార్యదర్శిగా వుండి నాటక రంగానికి సేవచేస్తున్నారు. నాటక అభివృద్ధికి మద్రాసు ప్రభుత్వం ఏర్పాటుచేసిన (1948) పునరుజ్జీవన సంఘంలో సభ్యులు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీకి కార్యదర్శిగా పనిచేశారు. 1964 సంవత్సరంలో సంగీత నాటక అకాడమీ అధ్యక్షులుగా ఎన్నికైనారు.

## కూర్మా వేణుగోపాలస్వామి :

జననం 1910 లో. మద్రాసు క్రిష్టియన్ కాలేజీలో పట్టభద్రులై, ఆక్స్‌ఫర్డులో ఎం. ఏ. పట్టం పొందారు. బార్ ఎట్ లా. మద్రాసులో కొన్నాళ్ళు చరిత్రోపన్యాసకులుగా పనిజేశారు. మద్రాసు హైకోర్టులో వకీలుగా పనిచేశారు. 1937 లో స్వతంత్ర సభ్యుడుగా మద్రాసు శాసన సభకు ఎన్నికయ్యారు. 1942 నుంచి ఆంధ్ర విశ్వవిద్యాలయం రిజిష్ట్రారుగా పనిచేస్తున్నారు. 1961 లో ప్రప్రథమంగా థియేటరు ఆర్టును గురించి విశ్వవిద్యాలయం గౌరవ వుపన్యాసకులుగా నియమింపబడ్డారు. ఇండియన్ కౌన్సిల్ ఫర్ కల్చరల్ ఎఫైర్సులో సభ్యులు. 1954 నుండి 1957

వరకు కేంద్ర సాహిత్య అకాడమీ సభ్యులుగా వున్నారు. 1960 నుంచి సాహిత్య అకాడమీ సభ్యులు. ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ సభ్యులు.

ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రయోగాత్మక నాటకశాలకు నిర్మాతగాను, విజయవాడ తెలుగు లిటిల్ థియేటరు అధ్యక్షులుగాను, 1951లో ఆంధ్రనాటక కళా పరిషత్తు అధ్యక్షుడుగాను పనిచేశారు. కేంద్రప్రభుత్వం ప్రచురించిన ఇండియన్ డ్రామా అనే గ్రంథంలో వీరు తెలుగు నాటక రంగం గురించి వ్రాశారు. 1957లో వీరి సంపాదకత్వాన ప్రసిద్ధ తెలుగు నాటికల సంపుటి వెలువడింది. వీరు అనేక నాటికలు వ్రాశారు. 1963 లో న్యూయార్కులోని ఏషియా పబ్లిషింగ్ హౌస్ ప్రచురించిన జెనరల్ ఎడ్యుకేషన్ రీకన్సిడర్డ్ అనే గ్రంథంలో లలిత కళలు - సంగీతం - నాటకం విభాగం రచించారు. ఆంధ్ర నాటకరంగాభివృద్ధికి ఇతోధికంగా కృషిచేస్తున్నారు.

### బెజవాడ గోపాలరెడ్డి :

ఆంధ్రదేశంలోని రాజకీయ సాహిత్య రంగాలలో శ్రీ గోపాలరెడ్డిగారికి విశిష్టస్థానం వుంది. రవీంద్రుని ప్రియశిష్యులు, శాంతినికేతనంలో విద్యాభ్యాసం చేశారు. టాగూరు రచనలు తెలుగులోకి అనువాదం చేశారు. తెలుగు భాషా సమితి, సంగ్రహ ఆంధ్ర విజ్ఞానకోశ సమితి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సంస్థలకు అధ్యక్షులు. ఆంధ్ర రచయితల పురోభివృద్ధికి శ్రీ గోపాలరెడ్డి కల్పవృక్షం వంటివారు. కేంద్ర సాహిత్య అకాడమీ ఆర్థిక సంఘ అధ్యక్షులు. విజ్ఞానం, వివేకం, విచక్షణ సమ్మేళనమైన శ్రీ గోపాలరెడ్డి, ఆంధ్రసాహితీ సరస్వతికి పెన్నిధి. రాజకీయాలలో చిన్నతనంలోనే చేరి, రాజాజీ ఆశీర్వచనంతో మద్రాసు రాష్ట్ర మంత్రివర్గంలో అనేక పదవులు అలంకరించి, రాష్ట్ర కాంగ్రెసు కార్యక్రమాలలో, నిరంతర ప్రజాసేవలో నిమగ్నులై, తరువాత ఆంధ్ర రాష్ట్ర ముఖ్యమంత్రి పదవి నలంకరించారు. తరువాత కేంద్ర నాటక రంగాభివృద్ధికి ఎనలేని కృషిచేశారు. సాహిత్యాది లలిత కళలకు అండగా నిలబడి వారి సానుభూతి సహకారాలను అందజేస్తున్నారు. రాజకీయాలలో సహృదయతకు, త్యాగానికి శ్రీ రెడ్డిగారు ఒక ప్రత్యేక నిదర్శనం.

**ఆర్.బి. రామకృష్ణంరాజు :**

రాజా బొప్పరాజు రామకృష్ణం రాజుగారు. కార్వేటి నగర సంస్థానాధీశుల పౌత్రులు. జననం 10-2-1891. బి. ఏ., బి. ఎల్. పట్టభద్రులు. 1936లో కాంగ్రెసు అభ్యర్థులుగా మద్రాసు శాసన మండలికి సభ్యులుగా ఎన్నికైనారు. 1940 లో 1942 లో స్వాతంత్ర్య సమర సైనికుడుగా జైలుశిక్ష పొందారు. 1949 సం॥రంలో ద్వారం వెంకటస్వామి నాయుడుగారికి అఖండమైన సన్మానం జరిపించారు. 6 సంవత్సరాలు ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ అధ్యక్షులుగా పనిచేశారు. వీరి ఆధ్వరంలో ఆకాడమీ సంగీత నృత్య నాటకరంగాలలో విశిష్టమైన కృషి చేసింది. వీరు స్వయంగా నటులు, గాయకులు. వాయులీన వాద్యంలో ప్రత్యేక నిపుణులు. చిత్తూరు రామవిలాస సభ జీవితాధ్యక్షులు. కేంద్ర సంగీత నాటక అకాడమీ సభ్యులు. కళాభిమానులుగా, కళాపోషకులుగా అనేక సంస్థల నాదరించి పోషించారు.

**డాక్టరు పోణంగి**

**శ్రీరామ అప్పారావు :**

పశ్చిమ గోదావరిజిల్లా కొవ్వూరు తాలూకాలోని బందాపురం వీరి జన్మస్థలం. కొవ్వూరు బోర్డు హైస్కూలులోను, విజయవాడ యస్. ఆర్. ఆర్. కాలేజీలోను, ఆంధ్ర విశ్వవిద్యాలయం ఆర్ట్సు కాలేజీలోను విద్యాభ్యాసం జరిగింది. యం. ఏ. పూర్తిచేసి, తెలుగు నాటకరంగం ప్రథమదశ నుంచి క్రమవికాస పరిణామాలన్నీ సమీక్షించే పరిశోధన చేసి ఉస్మానియా విశ్వవిద్యాలయం నుంచి పి. హెచ్. డి. పొందారు. వివిధ ప్రభుత్వ కళాశాలల్లో 7 సంవత్సరాలు అధ్యాపకులుగా పని చేశారు. పరిశోధన సాహిత్యంలో వీరికి ఎక్కువ ఆసక్తి. వీరి ప్రచురణలు తాజ్ మహల్ (నాటకం), విశ్వభారతి (నవల), వేణువు (వచన కవిత). నాట్యశాస్త్రం వివిధ పత్రికల్లో వ్యాసాలుగా ప్రచురించారు. నాట్యశాస్త్ర గ్రంథానికి 1961 లో వీరికి జాతీయ బహుమతి లభించింది. తెలుగు నాటక రంగంలో ప్రప్రథమంగా పరిశోధన చేసిన గౌరవం వీరికే దక్కింది. సంగీత నాటక అకాడమీ సభ్యులుగా పనిచేశారు.

**ఆచంట వెంకటసాంఖ్యాయన శర్మ :**

శర్మగారి జననం 1864 లో. వీరిపూర్వులు గోదావరిజిల్లా ఆచంట గ్రామవాస్త

వృలు. తరువాత వీరు తండ్రిగారితో విశాఖమండలంలో నాగావళి ప్రాంతంలోవున్న కిచ్చాడగ్రామంలో నివసించారు. శర్మగారు మంచి స్ఫురద్రూపి. బహుముఖ ప్రజ్ఞా వంతులు. సంస్కృతాంధ్రభాషల్లో ఉద్దండపండితులు. కవిత్వం. చిత్రలేఖనం. సంగీతం. నాట్యశాస్త్రం - ఈయనకు అభిమాన విద్యలు. 1929 లో ప్రథమంగా ఆంధ్రనాటక కళాపరిషత్తు సంస్థాపకులలో ఒకరుగా వుండి. ప్రథమ పరిషత్తు మహా సభకు అధ్యక్షత వహించారు. వీరు కొన్ని పత్రికలను నడిపారు. అనేక విషయాలపై వ్యాసాలను రచించారు. పార్థపరాజయం - అవదాతకలభకం నాటకాలను స్వతం త్రంగా రచించారు. ఉత్తరరామచరితం నాటకాన్ని అనువాదం చేశారు. వీరు 1933 లో కాలధర్మం చెందారు.

## కృత్తివెంటి నాగేశ్వరరావు :

నాటకకళే బహి ప్రాణమైన కృత్తివెంటి నాగేశ్వరరావుగారు 1886 సంవ త్సరంలో బందరులో జనించారు. పుట్టింది బందరైనా, పెరిగింది రాజమండ్రిలో.



అక్కడే పార్సీనాటకాలు చూశారు. వృత్తేజి తులై, హిందూనాటక సమాజంలో స్త్రీ పాత్రలు ధరించారు. సీత, శకుంతల, ద్రౌపది, చిత్రరేఖ, దమయంతి మొదలైన పాత్రలు ధరించారు. మహమ్మదీయులతో కలిసి ఉర్దూ నాటకాలాడారు. 1908 లో సత్యవోలు గున్నే శ్వరరావుగారి కంపెనీలో చేరి, సమాజనిర్వ హణ బాధ్యతలు నిర్వహించారు. కలకత్తా వెళ్ళి ఆంగ్ల నాటకాలను చూశారు. తరువాత స్వంత నాటక సమాజాన్ని స్థాపించి నాటకాలు ప్రదర్శించారు. ఆయన సమాజాన్ని ఎంతో కట్టుదిట్టంగా నడిపారు. 12 సంవత్సరాలు 150 మంది నటులను పోషించారు. కాలేజి గరల్ నాటకాన్ని ఆంధ్రదేశమంతటా ప్రదర్శించారు. రంగూన్ వెళ్ళి నాటకాలు ప్రదర్శించారు. నైజాం ప్రాంతమంతా పర్యటించారు. నాటక కళకోసం ఆయన ఆస్థినంతా వ్యయపర్చారు. ఏ కార్యం తలపెట్టినా పట్టుదల, సాహసం, క్రమశిక్షణ ప్రదర్శించేవారు. నిష్కళంక దేశభక్తుడు. కళకు తన జీవితాన్ని

అంకితంచేసిన నిస్వార్థ కళాప్రపూర్ణుడు, కళాతపస్వి. ఆంధ్ర నాటక కళాచరిత్రలో, సమాజాల నిర్మాణంలో ఆయన కళోద్ధారక నిర్మాత.

**ఏకపాత్రాభినయం :**

**నేరెళ్ళ వేణుమాధవ్ :**

ధ్వన్యనుకరణం, ఏకపాత్రాభినయం, బహుపాత్రాభినయం, వెంటిలాక్విజం, మిమిక్రీ మొదలైన భిన్న కళారూపాలద్వారా అఖిలాంధ్ర దేశాన్ని ఉఱ్ఱూతలూగించి రంజింపచేసిన యువకళాకారుడు, వరంగల్లు వాస్తవ్యులు శ్రీ నేరెళ్ళ వేణుమాధవ్.

వేణుమాధవ్ బాల్యంలో స్కూలు నాటక ప్రదర్శనాలలో వివిధ పాత్రలు ధరించారు. ఆనాటి నుంచి ఆయన జీవితాన్ని నాట్యకళకు అంకితం చేశారు. ఈ నాడు ఆయన వయస్సు 33 సంవత్సరాలు. ఉస్మానియా యూనివర్శిటీ పట్టభద్రులు. తెలుగు, ఉర్దూ, ఆంగ్ల, హిందీ భాషల్లో ఆయనకు బాగా పరిచయంవుంది.

**బహుపాత్రాభినయం :**

బహుపాత్రాభినయంలో సిద్ధహస్తులు శ్రీ వేణుమాధవ్. స్త్రీ పురుష పాత్రలకు పాత్రోచితమైన కంఠాలు, వాటి సహజమైన స్వరాలతో వినిపించడం ఒక గొప్ప సాధన. వేషధారణ, ముఖాలంకారాలు లేకుండా కేవలం కంఠస్వర మార్పులతో, సాత్విక, వాచిక, ఆంగికాభినయాలలో నవరసాలు తొణికిస లాడించడం ఒక అసామాన్యమైన ప్రజ్ఞ. ఈ సాధన ఆయన స్వయంకృషి.

బహుపాత్రభినయంలో హేమ్లెట్, హేమ్లెట్ తల్లి, పోలనిస్‌లు, ఆలివర్ ట్విస్ట్‌లో బిల్‌సైక్స్‌నాన్‌సీ, జూలియస్‌సీజర్, కల్‌పర్నియా, బ్రూటస్, కాషియస్ మొదలైన ఆంగ్ల నాటకాలలోని పాత్రలనూ- తెలుగు నాటకాల్లో ప్రహ్లాదుడు, హిరణ్యకశిపుడు, సారంగధరుడు, చిత్రాంగి, గిరీశం, మధురవాణి, శివాజి, రోషనార మొదలైన వివిధ పాత్రల సంభాషణలు అతిసహజంగా ఆయన ఏకకాలంలో అభినయం చేస్తారు,

**మిమిక్రీ :**

మిమిక్రీ అంటే అనుకరించి నవ్వించటం అని నిఘంటువు నిర్వచనం. ఆయన ఊహించి ప్రత్యేక రూపకల్పన చేసిన ప్రజల విభిన్న మనస్తత్వాలను

చూపరులయెదుట యథాతథంగా ప్రదర్శిస్తారు. ఉదాహరణకు ఇంగ్లీషు లెక్చరర్ ధోరణి, ఫోటోలో కూర్చున్న వివిధ వ్యక్తుల రూపురేఖా విలాసాలు, వివిధ భంగిమలు, వీధుల్లో వివిధవ్యక్తుల నడకల సరళి, పాఠశాలల్లో ఉపాధ్యాయుల బోధనా పద్ధతులు అనుకరించడంలో ఆయనకు ఆయనే సాటి.

## ధ్వన్యనుకరణ :

ఈ ధ్వన్యనుకరణలో వేణుమాధవ్ విశేషమైన కృషిచేశారు. ప్రఖ్యాతి చెందిన నాయకులను, నటులను, రచయితలను అనుకరిస్తారు. మహాత్మాగాంధి, జవహర్‌లాల్ నెహ్రూ, రాధాకృష్ణన్, సుభాస్ చంద్రబోస్, కెనడీ ప్రభృతుల ఉపన్యాసాలు యధాతథంగా వారి కంఠస్వరాలతో, ఉచ్చారణలశైలి-తీరులతో ఆయన వినిపిస్తారు.

హిందీ నటీనటులు పృథ్వీరాజ్, దిలీప్, రాజకపూర్, బలరాజ్‌సహానీ, సొహారాబ్ మోడీ, రాధాకిషన్, జానీవాకర్, చంద్రమోహన్, అశోక్‌కుమార్, మీనారాయ్, సంధ్యలను. ఆంగ్లనటులు సర్‌లారెన్సు ఆలివర్, చార్లటన్‌హెస్టన్, పాల్‌ముని, పీటర్‌వూటోల్, జెర్రీలూయిస్, యూల్‌బ్రెన్నర్, చార్లెస్‌బోయర్, గ్రెగరిపెక్, ఇంగ్రిడ్ బెర్గ్‌మన్, గ్రేటాగార్బో, హెడీలామర్‌ల సంభాషణా విధానాలను, తెలుగు నటీనటులు ఎన్. టి. రామారావు, ఏ. నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు, గుమ్మడి, నాగయ్య, రంగారావు, భానుమతి, ఇంకా-సి. నారాయణరెడ్డి, దేవులపల్లి, అవధాని, దుర్గయ్య, రామరాజు మొదలైన రచయితల వాగ్ధోరణినీ సహజ కంఠస్వరాలతో, ముఖభంగిమలతో చక్కగా వినిపిస్తారు.

## వెంటిలాక్విజం :

వెంటిలాక్విజం ఒక ప్రత్యేకమైన కళ. విదేశాల్లో దీనికి తగిన ప్రాబల్యం వుంది. మనదేశంలో ఇది అంతగా వ్యాపించలేదు. వేణుమాధవ్ తొలిసారిగా దీనిని ఆంధ్రప్రదేశ్‌లో ప్రవేశపెట్టారు. దూరం నుంచి వినిపిస్తున్న గుఱ్ఱపు డెక్కల చప్పుడు-క్లారినెట్ - బిగుల్ ట్రంపెట్ - ఫిడేలు మొదలైన వాయిద్యాల ధ్వనులను నేపథ్య సంగీతంగా మిళితంచేస్తూ ఘట్టాలు అభినయిస్తారు. కళ్ళు మూసుకుని ప్రేక్షకులువింటే-వారు ఒక చిత్రం చూస్తున్న అనుభూతి పొందుతారు.

## ఇతర కళాకారులు .

ఆంధ్రదేశంలో రాళ్ళబండి కామేశ్వరరావుగారు షేక్స్పియర్ నాటకాల లోని పాత్రలను అద్భుతంగా చిత్రిస్తూ, అనేక కాలేజీలలో ప్రదర్శనలిస్తున్నారు.

20 సంవత్సరాలక్రితం విజయనగరంలో ఇమిటేషన్ ఆచార్యులు - వింతల వీరారెడ్డిగారు బహుపాత్రాభినయంలో కృషిచేశారు.

గరిమెళ్ళ కృష్ణమూర్తి, మాడా వెంకటేశ్వరరావుగార్లు కూడ ఇమిటేషన్ చేయడంలో సమర్థతను నిరూపించుకున్నారు.

## విచిత్ర వేషధారణ :

## వైద్యుల చంద్రశేఖరం :

వైద్యుల చంద్రశేఖరంగారి విచిత్ర వేషధారణను గురించి చాలమంది వినే వుంటారు. వీరిది నెల్లూరు. ప్రసిద్ధ నటకుడు. సుందరరూపం. ఈయన సాంస్కృతిక రాయబార వర్గంలో మనదేశం తరపున చైనా వెళ్ళి వచ్చారు. విచిత్ర వేషధారణలో ఆంధ్రదేశంలో వీరికి సాటి మరొకరు లేరని చెప్పవచ్చు. ముఖ్యంగా వేషధారణలో ప్రజ్ఞావంతుడు. పది నిమిషాల్లో ఎలాంటి వేషాన్నయినా ఇట్టే ధరించగలరు.

ఆయనకు కావలసిన సామగ్రి కొంచెం రోజ్‌కలర్ గ్రీజు, ఒక బ్లాకు పెన్సిల్, అద్దమూ వుంటే చాలు-ముఖాన్ని కొద్దినిమిషాల్లో మార్చేస్తారు. కాశీనాధుని నాగేశ్వరరావురుగారు- జవహర్‌లాల్ - మదన మోహన మాలవ్యా - మహాత్మాగాంధి-వీరేశలింగం పంతులు - వినోబాభావే - అరవిందఘోష్ - రవీంద్రనాధ ఠాగూర్ మొదలైన జాతీయ నాయకుల ఆకారాల నన్నిటినీ మనల్ని నమ్మించేటంత బాగా మేకప్ చేసుకుని వచ్చి స్టేజిమీద నిలబడతారు. ఈయన ముఖంలో మార్పు చాల తేలికగా కలుగుతుంది. అదే ఆయన ఆస్తి. చంద్రశేఖరంగారు చైనా-రష్యాదేశాల్లో పర్యటించి, వారి ప్రతిభావిశేషాలను చూపించి, ఆ దేశీయుల్ని ఆశ్చర్యచకితుల్ని చేశారు. ఆంధ్రదేశంలో చంద్రశేఖరంగారిది ఒక ప్రత్యేక కళ.





# కళా సాహిత్యం



కళాసాహిత్యం - నాట్యకళ పత్రిక - చక్రవర్తి
చరిత్రాత్మక కృషి - నటరాజ రామకృష్ణ నాట్య
కళా సేవ - కళోపాసకులూ, కళాపోషకులూ

# కళా సాహిత్యం

ప్రతి దేశంలోనూ నాటక కళకు సంబంధించిన కళా సాహిత్యం ఎంతో వుంది. కాని మన తెలుగు నాటకరంగానికి అలాంటి కళా సాహిత్యం అరుదుగానే



వుందని చెప్పాలి. పూర్వ సాహిత్యమైన సంస్కృత వాఙ్మయంలో నాట్యశాస్త్ర ప్రముఖులు, లాక్షణికులు వ్రాసిన భరత నాట్యశాస్త్రం, కావ్యానుశాసనం, భరతార్ణవం, సాహిత్య దర్పణం, రసగంగాధరం, కావ్యాదర్శం భరతరస ప్రకరణం, నందికేశ్వర అభినయ దర్పణం, గాన భాస్కరం, దశరూపకం మొదలైన గ్రంథాలు ప్రచారంలో వున్నాయి. కాని ఇవి ఈనాడు క్రమాభివృద్ధి పొందుతూ వున్న నాటక రంగానికి తగినంతగా వుపయోగపడలేక పోతున్నాయి

ఇంగ్లీషులో నాటకరంగానికి సంబంధించిన అన్ని శాఖల్లోనూ, అనేక గ్రంథాలు వెలువడ్డాయి ఈనాడు అక్కడక్కడ అనుభవజ్ఞులైనవారు వ్రాసే వ్యాసాలు తప్ప మనకు కళాసాహిత్యం చాల తక్కువగా వుంది.

ఆంధ్ర నాటకరంగ ప్రథమదశలో బందరు వాస్తవ్యులు పురాణం సూరి శాస్త్రిగారు, నాట్యోత్పలం, నాట్యాంబుజం, నాట్యానుశాసనం, నాట్యపారిజాతం అనే నాలుగు పుస్తకాల ద్వారా, నాటక రంగానికి సంబంధించిన అనేక విషయాలను తెలియజేశారు

1924 లో ఆంధ్ర నాటక రంగము అనే గ్రంథంద్వారా, చిత్తూరు రాజకీయోన్నత పాఠశాల ప్రధానాంధ్రోపాధ్యాయులు గొల్లపూడి శ్రీరామశాస్త్రిగారు నాటకరంగ విజ్ఞానాన్ని కొంతవరకు అందించారు.

1930 లో బందరు వాస్తవ్యులు పసుమర్తి యజ్ఞనారాయణశాస్త్రిగారు ఆంధ్ర నట ప్రకాశిక అనే మహత్తర గ్రంథంద్వారా పది ప్రకరణాలలో ఆనాటి నాటక రంగాభివృద్ధిని గురించి వివరించారు.

## నాట్యకళ పత్రిక :

నాట్యకళ పత్రిక మద్రాసు నుంచి శ్రీ నీలంరాజు వేంకటశేషయ్య, కీ॥ శే॥ కొత్తపల్లి లక్ష్మయ్యగార్ల సంపాదకత్వాన త్రైమాస పత్రికగా వెలువడేది. కీ॥ శే॥ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావుగారు నాట్యకళకు ప్రధాన పోషకులుగా వుండే వారు. ఆ పత్రిక రెండు సంవత్సరాలు నడిచి ఆగిపోయింది. తిరిగి 1940వ సంవత్సరంలో శ్రీమతి కొమ్మూరు పద్మావతి, బందా కనకలింగేశ్వరరావుగార్ల సంపాదకత్వాన కొంతకాలం నడిచి ఆగిపోయింది. తరువాత 1957 లో శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు నాట్యకళను త్రైమాస పత్రికగా ప్రారంభించి నాటక ప్రయోగానికి సంబంధించిన అనేక విషయాలతో 1961 వరకూ నడిపారు. తరువాత 1963 అక్టోబరులో సంగీత నాటక అకాడమీ అధ్వర్యాన ద్వైమాస పత్రికగానూ, తరువాత మాస పత్రికగానూ సంగీత, నృత్య నాటక రంగాలకు అపూర్వమైన కళాసేవ చేస్తూవుంది.

బళ్ళారి వాస్తవ్యులు కీ॥ శే॥ కోలాచలం శ్రీనివాసరావుగారు ఇంగ్లీషులో ప్రపంచ నాటక చరిత్రను రచియించారు.

ఈ కృషిలో ఆంధ్ర పత్రిక, భారతి, ఆంధ్ర పత్రిక సంవత్సరాది సంచికలూ ఎన్నో వ్యాసాలను కళలకు సంబంధించిన వాటిని ప్రకటించాయి.

ఇరువది సంవత్సరాల క్రితం ఆంధ్రప్రభ దినపత్రికలో కొండముది గోపాలరాయశర్మగారు కొన్ని వ్యాసాలద్వారా నటీ నటుల వికాసానికి తోడ్పడ్డారు.

## చక్రవర్తి చారిత్రాత్మక కృషి :

శ్రీ శ్రీనివాస చక్రవర్తిగారు నాట్యశాల, ఆంధ్రనాటక సమీక్ష, ఆంధ్ర నాటక దర్శిని, నట శిక్షణ, నాటక పోటీలు, తెలుగు నాటక కర్తలు మొదలైన గ్రంధాలను రచించడమేగాక, నటన, అభినయం అనే రెండు స్టానిస్లోవస్కీ గ్రంధాలను అనువదించారు. బి. టి. రాఘవాచార్యులుగారి నాటకానుభవాలను నాటక దీపికగా ప్రచురించారు.

## నటరాజ రామకృష్ణ

## నాట్యకళాసేవ :

నటరాజ రామకృష్ణగారు నృత్యరేఖ, నృత్యమంజరి, నర్తన మురళి, దేవ

నర్తకి, ఆలయ నృత్యములు, ఆంధ్రులు-నాట్యకళ, ఆంధ్రులు-భరతనాట్యము, నర్తనబాల మొదలైన నృత్యశాస్త్రానికి సంబంధించిన గ్రంథాలను వెలువరించారు.

పి. యస్. ఆర్. అప్పారావుగారు భరతనాట్య శాస్త్రాన్ని సంస్కృతం నుండి తెలుగులోకి అనువదించి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతిని పొందారు.

జమ్మలమడక మాధవరామశర్మగారు సంస్కృత భరత నాట్యశాస్త్రానికి అనువాదంగా నాట్యవేదమని రెండు భాగాలను వెలువరించారు.

ఆంధ్రదశరూపకాన్ని మల్లాది సూర్యనారాయణశాస్త్రి, ధనికుని దశరూపకం కొమండూరు అనంతాచార్యులు, భరతరస ప్రకరణం నీడామంగళం తిరువేంకటాచార్యులు, చంద్రశేఖరకృతి భరతసారాన్ని లంకా సూర్యనారాయణశాస్త్రి మొదలైన వారు తెలుగులోకి అనువదించారు.

బాలాంత్రపు రజనీకాంతరావుగారు ఆంధ్ర వాగ్గేయకారుల చరిత్రను వ్రాసి తెలుగుభాషాసమితి వారి బహుమానాన్నీ, కేంద్ర సాహిత్య ఆకాడమీ బహుమానాన్ని అందుకున్నారు.

**కళోపాసకులూ,**

**కళాపోషకులూ :**

కందుకూరి రుద్రయ్య వ్రాసిన సుగ్రీవ విజయాన్ని, శ్రీనాథుని క్రీడాభిరామాన్నీ కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు వ్యాఖ్యానించారు.

మన యక్షగాన వాఙ్మయాన్ని పరిశోధించి యస్వీ జోగారావుగారు ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్రను రచియించి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారిచే పి. హెచ్. డి. డిగ్రీని పొందారు.

బి. రామరాజుగారు మన జానపద వాఙ్మయాన్ని, జానపద కళలను పరిశోధించి, జానపదగేయ సాహిత్యమనే గ్రంథాన్ని రచియించి ఉస్మానియా విశ్వవిద్యాలయం వారిచేత పి. హెచ్. డి. డిగ్రీని పొందారు.

శ్రీవాత్సవగారు ఆంధ్రనాటక సాహిత్య ప్రగతిని గురించి పరిశోధించి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఆకాడమీవారి బహుమానాన్ని అందుకున్నారు.

భారతా, భారత రూపక మర్యాదలు అనే గ్రంథాన్ని వేదం వెంకటరాయశాస్త్రి గారు రచించారు.

చింతా దీక్షితులు ప్రజావాఙ్మయం, తుమ్మలపల్లి సీతారామారావు దక్షిణ దేశములు-నాట్యములు, చాగంటి సన్యాసిరాజు కళ స్వరూప నిర్ణయము, ఎల్లోరా మన ప్రాచీనకళలు-పుట్టుపూర్వోత్తరాలు, బిందాన నారాయణరావు మన శ్రీరంగం, పాలెం రఘుపతి నటశిల్పం, రోహిణి నాటక శిల్పం, పులిపాటి వెంకటేశ్వర్లు నటీనటలోకం, ఆదర్శ సాహిత్యమాల వారి ఆంధ్రనాటక కర్తలు, కొమండూరి పార్థసారధి అయ్యంగారి నెల్లూరు నాటక కళ, జి. రాజారావు నాటక ప్రయోగము, డి. వి. ఎ. ఆచార్య ఆంధ్రలో నాటకము- నాటకరంగము, శ్రీమతి బాల సరస్వతి- డాక్టర్ రాఘవన్‌గారల భరతనాట్యము, పైడిపాటి సుబ్బరామశాస్త్రి నృత్య భారతి వెలువడ్డాయి.

ఈ విధంగా ఆంధ్రనాటకరంగంలో అనేకమంది మహామహులు నాటక రచనమీదా, నాటక ప్రయోగంమీదా వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానాలు ఆంధ్ర నాటక రంగ పురోగమనానికి ఎంతగానో తోడ్పడ్డాయి.

పానుగంటి వారు సాక్షిలో నాటక రంగ విమర్శకు సంబంధించిన వ్యాసాలను వ్రాశారు.

శ్రీపాద కామేశ్వరరావుగారు ఆంధ్ర పత్రికలో నాటక రంగంలో రావలసిన మార్పులను గురించి అనేక విమర్శనా వ్యాసాలను వ్రాశారు.

కొండిపర్తి సూర్యనారాయణగారు 1910 ప్రాంతంలో నాటక సంఘ మార్గ ప్రదర్శిని అనే గ్రంథాన్ని వెలువరించారు.

తణికెళ్ళ వీరభద్రుడుగారు చిత్రాంగి పాత్రపోషణను గూర్చి 1915 ఆంధ్ర పత్రిక ఉగాది సంచికలో ఒక వ్యాసాన్ని వ్రాశారు.

తల్లాప్రగడ సూర్యనారాయణరావుగారు 1913 లో ఆంధ్ర నాటకములు అనే వ్యాసాన్ని సాహిత్య పరిషత్తు పత్రికలో ప్రకటించారు.

భమిడిపాటి కామేశ్వరరావుగారు నాటకాల్లో పద్య పఠనంవల్ల పద్యాలు నాశనమౌతున్నాయనీ, నాటకాలు వచనంలోనే వుండాలనీ చర్చిస్తూ, ఆంధ్రనాటక పద్య పఠనాన్ని ప్రచురించారు.

శ్రీపాద కామేశ్వరరావుగారు నాటకమీమాంస గ్రంథాన్ని ప్రచురించారు.

చేకుమళ్ళ అచ్యుతరావు ఆంధ్ర నాటకాలు అనే ఒక గ్రంథాన్ని వ్రాశారు.

కిన్నెర పత్రికలో భూపతి లక్ష్మీనారాయణశాస్త్రిగారు నాటక లక్షణాలను గురించి పరంపరగా వ్యాసాలను వ్రాశారు.

1935 ప్రాంతంలో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు నాటకోపన్యాసములు అనే శీర్షికమీద భారతిలో వ్యాసాలు వ్రాశారు.

ఏకాంకికా నాటిక ప్రదర్శనాన్ని గూర్చి రచనను గూర్చి శ్రీపాద గోపాల కృష్ణమూర్తిగారు భారతిలో ఉత్తమమైన వ్యాసాలను వ్రాశారు.

1954-55 ల్లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు భాషాసమితి ద్వారా నడిపిన నాటక కళ గ్రంథాల పోటీలో మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి రచించిన నాటక కళ అనబడే ఈ ఆంధ్ర నాటకరంగ చరిత్ర ఉత్తమ బహుమానాన్ని అందుకుంది.

మేకప్ కళలో ప్రసిద్ధులైన శ్రీ వి. కుమార్ ఆహార్యం- మేకప్ కళను గురించి 1958 లో ఒక గ్రంథాన్ని ప్రచురించారు.

తిరుమల రామచంద్రగారు తమ పరిశోధన పత్రిక ఆంధ్రనాటక పితామహ ధర్మవరం కృష్ణమాచార్యులుగారి సంస్మరణ సంచికలో అమూల్యమైన వివరాలను ప్రచురించారు.

## యం.ఆర్. అప్పారావు :

1944 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలో శ్రీ యం. అర్. అప్పారావుగారి అధ్యక్షతను ఆంధ్రదేశమంతటా పర్యటించి ఒక రిపోర్టును తయారుచేశారు. ఆ రిపోర్టును 1959 లో సంగీత నాటక అకాడమీ ప్రచురించింది.

శ్రీనివాస చక్రవర్తిగారు సమగ్రమైన నాటక దర్శినిని ప్రచురించారు. దీనిలో ప్రయోగాత్మకమైన ప్రచార నాటకాలను పేర్కొన్నారు.

సురభి నాటకరంగ స్వర్ణోత్సవ సంచికలో సురభి వారి పుట్టుపూర్వోత్తరాలూ, సమాజాల చరిత్ర మొదలైన వివరాలన్నీ ప్రచురించబడ్డాయి.

ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ కూచిపూడి నాట్య సదస్సు జరిపి ఆ సదస్సుకు సంబంధించి వివరాలన్నీ ఒక సంచికగా ప్రచురించారు.

ఆంధ్ర నాటక కళా పరిషత్తు రజతోత్సవ సందర్భంలో సుందరంగా రజతోత్సవ సంచికను ప్రచురించారు.

శ్రీనివాస చక్రవర్తిగారు నాటక సమీక్ష, నాటక పోటీలు, నాటక శిక్షణ, నాటక కవులు మొదలైన గ్రంథాలను రచించారు.

తెలుగు నాటక వికాసమను గ్రంథాన్ని రచించి పి. యస్. ఆర్. అప్పారావుగారు పి. హెచ్. డి. డిగ్రీని సంపాదించారు.

జమ్మలమడక మాధవరామశర్మగారు నాట్యవేదాన్ని రెండు భాగాలుగా ప్రచురించారు.





# రాష్ట్రేతర
# ఆంధ్ర నాటకరంగం



ఢిల్లీ ఆంధ్ర నాటకరంగం, బొంబాయి ఆంధ్ర అసోసియేషన్, షోలాపూర్ ప్రజా నాట్యమండలి, కలకత్తా ఆంధ్ర నాటక సంఘం, మదరాసు సుగుణ విలాస సభ, బెంగుళూరు, జంషెడ్పూర్, ఖర్గపూర్, భిలాయ్, పూనా, నైవేలి నాటక రంగాలు

## ది ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ (మద్రాసు)

మద్రాసులో 1879, 80 ప్రాంతాల్లో శ్రీమాన్ గోమఠం పి. వి. శ్రీనివాసాచార్యులుగారు ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ అనే నాటక సమాజాన్ని స్థాపించారు. ఆ సమాజానికి ఆయన అధ్యక్షులు. ప్రధాన పాత్రలు ధరించేవారు. సంస్కృత నాటకాలను అనువదించి దృశ్య నాటకాలుగా ప్రదర్శించేవారు. 1880 సంవత్సరంలో, విజయనగరం మహారాజా ఆనంద గజపతి, ఆనాటి మద్రాసు గవర్నర్‌గార్ల సమక్షంలో ఆచార్యులవారు దుష్యంత పాత్రను అద్భుతంగా అభినయించి "ది ఇండియన్ గారిక్" అనే బిరుదును పొందారు. శ్రీనివాసాచార్యులుగారు "కమలాపహరణం" మొదలైన నాటకాలను వ్రాశారు.



### ఆంగ్ల నాటక ప్రదర్శనాలు :

ఆనాడు ఆంగ్ల దేశం నుండి వచ్చిన అనేకమంది ఆంగ్ల ఉద్యోగుల వినోదం కొరకు ఇంగ్లండునుంచి అనేక నాటక సమాజాలు నాటకాలు ప్రదర్శిస్తూ వుండేవి. ఈ నాటకాలను చూచిన మన దేశీయులు నాటక సమాజాలను స్థాపించి నాటకాలాడారు. అలా ఏర్పడిన సమాజాలు పార్శీ నాటకసమాజాలు, వంగ నాటకసమాజాలు. ఈ సమాజాలు, భారతీయ నాటకాలతోపాటు, ఇంగ్లీషు నాటకాలను కూడా ప్రదర్శించేవారు. పై సమాజాల కోవకు చెందిందే ది మద్రాసు డ్రమాటిక్ సొసైటీ. ఈ సమాజం మద్రాసులో ఇంగ్లీషు నాటకాలను ప్రదర్శించేది. ఈ సమాజం 1875 లో స్థాపించబడింది. తరువాత దీనికి ప్రతిగా స్థాపించబడిందే ఓరియంటల్ డ్రమాటిక్ కంపెనీ.

ది మద్రాస్ డ్రమెటిక్ సొసైటీ ప్రదర్శనాల్లో ఆనాడు - అంటే 1885 ప్రాంతాల్లో యూరోపియన్‌ల హార్మోనియం, హిందుస్తానీ గజల్స్, ఇంగ్లీషు గేయాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఆర్. కె. యాజ్ఞిక్ ఇండియన్ థియేటర్‌లో పేర్కొనదగినవారు.

# సుగుణ విలాస సభ

బళ్ళారిలో ధర్మవరం కృష్ణమాచార్యులుగారు సరసవినోదినీసభను స్థాపించి విజయవంతంగా నడుపుతున్న రోజుల్లో వారి ప్రదర్శనలు చూచిన మద్రాసు కళాకారులు ఉత్తేజితులై సరస వినోదినీసభ (ఎస్. వి. ఎస్.)- ఈ మూడు అక్షరాలు కలిసి వచ్చేటట్లు సుగుణ విలాస సభను పి. సంబంధ మొదలియార్ ఆధ్వర్యంలో 1-7-1891 న స్థాపించారు. ఈ సభలో ఇంగ్లీషు - అరవం - తెలుగు - సంస్కృతంలో కూడా నాటకాలను ప్రదర్శించేవారు. వీరి ప్రదర్శనాలు ఉత్తమోత్తమంగా, మంచి క్రమ శిక్షణతో ప్రదర్శింపబడేవి. ఆనాడు మద్రాసులో శుద్ధ సంగీత కచ్చేరీలలాగా, పచ్చి శృంగార నాటకాలను బాలామణి, కల్యాణ రామయ్యరు మొదలైనవారు ప్రదర్శిస్తూ వుండేవారు. కాని సుగుణవిలాససభ ప్రదర్శనాలు మాత్రం నాటక ధర్మాల ననుసరించి, అభ్యుదయకరంగా ప్రదర్శించేవారు. ఆనాటి సుగుణ విలాస సభ ఈనాటివరకూ పని చేస్తూనే వుంది. ఈ సభలో ఒక్క నాటకాలే కాక వివిధ వ్యాయామ క్రీడలు కూడా ప్రాముఖ్యం వహించేవి. ధర్మవరంవారి నాటకాలు, రాఘవాచార్యులుగారి నాటకాలు ఈ సభలో అనేక పర్యాయాలు ప్రదర్శింపబడ్డాయి. తెలుగు నాటకాలలో వేదం వేంకటాచల అయ్యర్, డి. వెంకటరమణయ్య, వి. సి. గోపాలరత్నం, పి. వి. రామానుజంశెట్టి మొదలైన నటులుండేవారు. ఈ సభద్వారా "ఇండియన్ స్టేజి" అనే పత్రికను కొంతకాలం నడిపారు. ఒక పెద్ద గ్రంథాలయాన్ని నిర్వహించారు. సంబంధమొదలియారు ఈ సభద్వారా ఎన్నో ఉత్తమ నాటకాలను రచించారు. నిజంగా సుగుణ విలాస సభకు ఉత్తేజాన్ని కలిగించింది ఆనాటి బళ్ళారి సరస వినోదినీసభే.



రావు సా॥ డి. వెంకటరమణయ్య గారు (మదరాసీ) సుగుణవిలాసనభ మద్రాసు.

# చెన్నపురి ఆంధ్ర మహాసభ

చెన్నపురి ఆంధ్రమహాసభ 1916 వ సంవత్సరంలో స్థాపించబడి, 1939 వరకూ, మదరాసు గిడ్డంగి వీధిలో నిర్వహింపబడి, ఆ సంవత్సరంలోనే విక్టోరియా పబ్లిక్ హాలుకు మార్చబడింది.



శ్రీ కామాక్షి సుందరరామ శాస్త్రిగారు (కీచకుడు) ఆంధ్రమహాసభ

## నిస్వార్థ కళాజీవులు :

ఆనాటినుండి ఈనాటి వరకు ఆంధ్రదేశంలోవున్న ప్రసిద్ధ నాయకులు, జమీందారులు, ధనవంతులు, న్యాయమూర్తులు, మంత్రులు, సుప్రసిద్ధ కళాకారులు ఎందరో దీని అభివృద్ధికి పాటుపడ్డారు. వారిలో పేర్కొనదగినవారు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు, బులుసు . సాంబమూర్తి, గుమ్మడిదల దుర్గాబాయమ్మ మొదలైనవారు,

ఆంధ్రమహాసభ కార్యకలాపాల్లో గ్రంథాలయ నిర్వహణ, విద్యాశాఖ, నాటకశాఖ మొదలైనవి ముఖ్యమైనవి.

ముఖ్యంగా ఆంధ్రదేశం నుండి అనేమంది ప్రసిద్ధ నటీనటులు వచ్చి, ఆంధ్రమహాసభలో నాటక ప్రదర్శనా లిచ్చి కీర్తింపబడ్డారు.

వారిలో బళ్ళారి రాఘవాచారి 1921 వ సంవత్సరానికి పూర్వమే ఆంధ్ర మహాసభలో నాటకాలను ప్రదర్శించారు.

## రాఘవ నటనలో
## రాణించిన పాత్రలు :

ఆ నాటకాలలో, "ప్రహ్లాద"లో హిరణ్యాకశిపుడు, "చిత్రనళీయం"లో బాహుకుడు, "రామరాజు పతనం"లో పఠాను, "చంద్రహాస"లో దుష్టబుద్ధి, "రామదాసు"లో రామదాసు, "పాదుక"లో, దశరథుడు, చంద్ర గుప్తలో చాణక్యుడు మొదలైన పాత్రలు ధరించి పాత్రాభినయంలో నూతన

మార్గాల నవలంబించి, ఆనాటి నటులకు నాటక సమాజాలకు కనువిప్పు కలిగించారు.

రాఘవాచారితోపాటు, నెల్లూరు నగరాజారావు, సరస్వతి రంగస్వామి అయ్యంగారు, స్థానం నరసింహారావు, బెంగుళూరు శ్రీనివాసరావు, కొమ్మూరి పద్మావతి, గుళ్ళపల్లి విశ్వేశ్వరమ్మ, కందాడై శ్రీనివాసన్, నేలనూతల రామ కృష్ణయ్య ఆదిగాగల నటులందరూ ఆంధ్రమహాసభలో నాటకాలను ప్రదర్శించారు.

ఆనాడు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి వహించిన నాటక సమాజాలు అన్నీ ఆంధ్రమహాసభలో ప్రదర్శనా లిచ్చాయి.

ఆంధ్ర మహాసభ అభివృద్ధికొరకు పాటుపడిన వారిలో ముఖ్యులు శ్రీ నీలం రాజు వెంకటశేషయ్యగారు. ఆయన నాటక శాఖను నిర్వహించడమే కాక ప్రసిద్ధ నటుడుగా పేరుపొందారు. ఆంధ్రమహాసభకు ధనం సేకరించటానికి స్థానం నర సింహారావు, పువ్వుపాటి వెంకటేశ్వర్లు, పిల్లలమఱ్ఱి సుందరరామయ్య మొదలైన ప్రసిద్ధ నటులను రప్పించి, వి. పి. హాలు మిద్దెపైన నాటక ప్రదర్శనాలను ప్రద ర్శించారు. ఈ విధంగా నీలంరాజు వెంకట శేషయ్యగారు ఆంధ్రమహాసభ కార్య కర్తగా, నాటకశాఖ నిర్వాహకుడుగా, నటుడుగా బహుముఖ సేవచేశారు.

## చంద్రబాబు, కమలాదేవి :

ఆ తర్వాత సభా నాటకాల్లో ప్రముఖపాత్ర వహించిన వ్యక్తుల్లో ఆవుల చంద్రబాబునాయుడు, ఆయనభార్య కమలాదేవి ముఖ్యులు. చంద్రబాబు స్ఫురద్రూపి, ఉత్సాహ వంతుడు. నాటకశాఖ అంటే పంచప్రాణాలు. ఉత్తమ నటుడు. ఆయన సభకు కార్యదర్శిగా వున్నకాలంలో నాటక శాఖ ఎంతో అభివృద్ధి పొందింది. చంద్రబాబు, కమలాదేవి అహ ర్నిశలూ ఆంధ్రమహాసభ నాటకశాఖను తీర్చి దిద్దారు. వీరిరువురి పర్యవేక్షణలో ఎన్నో పౌరాణిక, చారిత్రక, సాంఘిక నాటకాలు ప్రదర్శించబడ్డాయి. దంపతు లిరువురూ పాత్రలు ధరించటమేకాక, దర్శకత్వ బాధ్య తలను నిర్వహించి ప్రదర్శన విజయానికి తోడ్పడేవారు. కమలాదేవి, చంద్రబాబు ఆంధ్రమహాసభ అభివృద్ధికి ఎంతగానో కృషి చేశారు.



మంగిపూడి రామలింగ శాస్త్రిగారు
శ్రీకృష్ణుడు

ఆంధ్రమహాసభ అభివృద్ధికి తోడ్పడినవారిలో మరోవ్యక్తి జె. వి. సోమ యాజులుగారు. ఆయన మదరాసు ఆంధ్రుల సంస్కృతికి, అభివృద్ధికి కృషిచేసిన ప్రముఖవ్యక్తి. ఇలా ఆంధ్రమహాసభకు ఎందరో మహానుభావులు కృషిచేశారు.

### సభకు పేరుతెచ్చిన సహచర నటులు :

ఆంధ్రమహాసభ నాటకరంగంలో పనిచేసినవారిలో శ్రీ గోపాలాచార్యులు, కె. జ్ఞానానందులు, వేమూరు వెంకటశేషయ్య, బి. వి. రమణారావు, హరిహరనాధ్, అన్నపూర్ణయ్య, బి. ఎస్. గోవిందరాజులు నాయుడు, ఎ. వి. కృష్ణ, రావిపాటి సుబ్బారావు, స్వర్గీయ మోహనరంగయ్య, బాలకృష్ణ, సంజీవినాయుడు, రామానుజదాసు, రంగప్రసాద్, గాడేపల్లి శంకరం, డాక్టరు గిరి, వేదం వేంకటరాయశాస్త్రి, వి. ఎల్. రెడ్డి మొదలైనవారు ముఖ్యులు. మురళీ రాజాగారు నాటకరంగానికి ఎంతో దోహదం చేశారు. ఈ విధంగా ఆంధ్రమహాసభ నాటకరంగం నిత్యనూతనంగా వెలుగొందింది.

## మద్రాసు ప్రజానాట్యమండలి

ఆంధ్రదేశంలో 1948 లో ప్రభుత్వదమననీతి ఫలితంగా ఆంధ్రప్రజా నాట్యమండలి అణచివేయబడడంతో ప్రజా నాట్యమండలి కళాకారులు 1949 - 50 ప్రాంతాల్లో మద్రాసు సినీరంగంలో ప్రవేశించారు. ఇంతకుముందే యువజనోద్యమంలో కాకలు తీరిన తాతినేని ప్రకాశరావు సినిమారంగంలో వున్నారు.

చదలవాడ, మిక్కిలినేని, పెరుమాళ్ళు, వల్లం నరసింహారావు, వీరమాచనేని మధుసూదనరావు, వి. సరోజిని, మిక్కిలినేని సీత, సాలార్, ఆచార్య ఆత్రేయ, సుంకర, వాసిరెడ్డి, సి. మోహన్‌దాస్ (మ్యూజిక్ డైరెక్టరు), టి. చలపతిరావు (మ్యూజిక్ డైరెక్టరు), ప్రత్యగాత్మ, కొండేపూడి లక్ష్మీనారాయణ, రాజారావు, వెంపటి, రామకోటి, అల్లు రామలింగయ్య, పొట్లూరు వెంకటసుబ్బారావు, బి. గోపాలం, వేణుగోపాల్ మొదలైన కళాకారులందరూ మద్రాసు సినీరంగంలో ప్రవేశించారు.

ప్రజానాట్యమండలి మీదనున్న ప్రభుత్వ త్తిడి ఫలితంగా ఆ సాంప్రదాయాలతో అభ్యుదయ కళాసమితిని స్థాపించి ప్రప్రథమంగా ఆంధ్రదేశంలో 1953 ఎన్నికలలో వైజ్ఞానికప్రదర్శనల నిచ్చి ప్రచారం చేశారు.

## చరిత్ర ప్రసిద్ధికెక్కిన
## శాంతి మూకాభినయం :

సోవియట్ ఫిలిమ్ డెలిగేషన్ మద్రాసు వచ్చినప్పుడు వారి సమక్షంలో హిట్లరు వీధి భాగవతం. అనిసెట్టి రచించిన శాంతి మూకాభినయ నృత్యం వాణీ మహల్లో ప్రదర్శింపబడి రష్యన్ కళాకారుల ప్రశంస లందుకోవడమేగాక రూసో కలర్‌లో చలనచిత్రంగా తీయబడి, తూర్పు యూరపు రాజ్యాలలో ప్రదర్శింపబడింది.

తరువాత మద్రాసుకు చైనీస్ డెలిగేషన్ వచ్చిన సందర్భంలోనూ, సోవియట్ అగ్రికల్చర్ డెలిగేషన్ వచ్చిన సందర్భంలోనూ, బుల్గానిన్, కృశ్చేవ్ మద్రాసు సందర్శించినప్పుడు రాజభవన్‌లో పంటసిరి నృత్యాన్ని ప్రదర్శించి ప్రశంస లందుకుంది. తరువాత అఖిల భారత శాంతిమహాసభ సందర్భంలో మైలాపూర్ రసిక రంజని సభ హాలులో శాంతి మూకాభినయ నృత్యం ప్రదర్శింపబడి ప్రథమస్థానాన్ని ఆక్రమించింది.

ఆంధ్రదేశంలో ఏలూరులో జరిగిన శాంతిమహాసభలోనూ, హైదరాబాదులో జరిగిన ఏషియన్‌పీస్ సొలిడారిటీ కాన్ఫరెన్సు సందర్భంలోనూ వివిధ కళారూపాలను ప్రదర్శించింది.

కీ॥ శే॥ వాపిరెడ్డి భాస్కరరావు రచించిన పోతుగడ్డ నాటకాన్ని ఆంధ్ర దేశపు ముఖ్యపట్టణాల్లో ప్రదర్శించి తిరిగి అనేక ప్రజా నాట్యమండలి దళాలకు వుత్సాహాన్నిచ్చింది.

మద్రాసు త్యాగరాయనగరులో ప్రతివారం వైజ్ఞానిక సమస్యలమీద సంగీత, నృత్య, నాటక, చిత్రలేఖన, శిల్పకళలమీద వుపన్యాసాలు జరుగుతూ వుండేవి.

1957 లో జరిగిన ఎన్నికలలో పెద్దపెట్టున రెండు దళాలుగా ఏర్పడి అనేక ముఖ్యకేంద్రాలలో ప్రదర్శనలిచ్చి గొప్ప సంచలనాన్ని కలిగించింది.

# బెంగుళూరు అమెచ్యూరు సభ

ఆంధ్ర నాటకరంగం బహుముఖాల విజృంభిస్తున్న రోజుల్లో బెంగుళూరు ఆంధ్రుల అమెచ్యూర్ నాటక సమాజాలలో తెలుగు నాటకాలు ఎంతో అద్భుతంగా ప్రదర్శింపబడుతూ వుండేవి. బెంగుళూరు అమెచ్యూర్ కంపెనీలో పేరెన్నికగన్న నాటకాలు రోషనార, రామదాసు మొదలైనవి. ఈ సభలో బళ్ళారి తాడిపత్రి రాఘవాచార్యులుగారు నటిస్తూ వుండేవారు. వీరిప్రక్కన రోషనార, ఆషాబీ మొద లైన స్త్రీ పాత్రలను కె. యస్. వాసుదేవరావుగారు సమర్థనీయంగా నటించే వారు. బళ్ళారి రాఘవాచారిగారు, మద్రాసు సుగుణవిలాస సభలోనూ, బెంగుళూరు అమెచ్యూర్ సభలోనూ నాటకాలను ప్రదర్శించి పేరుప్రతిష్ఠలు సంపాదించిన తరు వాతే ఆంధ్రదేశంలో నాటకాలను ప్రదర్శించారు. బెంగుళూరు అమెచ్యూర్ సభలో ఆనాడు బి. యే. రాఘవాచారి అనే పేరుగల నటుడు కబీరు పాత్రధారణలో పేరు తెచ్చుకున్న నటుడు.

**ఖర్గపూర్ :**

ఖర్గపూర్‌లో దాదాపు 10 వేల మందికి పైగా ఆంధ్రులు నివసిస్తున్నారు. అనేకమంది ఉన్నత వుద్యోగాల్లో పని చేస్తున్నారు. ఇక్కడ ఆంధ్ర విజ్ఞాన సమితి పనిచేస్తూ వుంది. ప్రతి సంవత్సరం ఉగాదికో, శ్రీరామనవమికో వార్షికోత్సవాలు జరుపుతూ వుంటారు. ఈ సందర్భంలో నాటక, నాటికల పోటీలు, లలిత సంగీత పోటీలు జరుపుతూ వుంటారు. అనేక ప్రాంతాలనుండి నాటక సమాజాలు వచ్చి ఈ పోటీల్లో పాల్గొంటాయి

**భిలాయ్ :**

భిలాయ్ స్టీల్ ఫ్యాక్టరీలో ఆంధ్రులు దాదాపు 5 వేలమందివరకూ వున్నారు. ఇక్కడ వెంకటేశ్వర బృందం ఏర్పడి పనిచేస్తూంది. ఇక్కడ ఉత్సాహ వంతు లైన యువకులు అనేకమంది పనిచేస్తూ, ప్రతి సంవత్సరం ఉగాది వేడుకలు జరు పుతూ వుంటారు. నాటకాలు, నాటికలు, బుర్రకథలు చెపుతూ వుంటారు.

ఇక్కడ జాలాది జగన్మోహనరావు, సింగ్, టి. ప్రకాశరావు, కె. ముఖ లింగేశ్వరరావు, కె. ప్రభాకరరావు, ఎమ్. రాజు, సింహాద్రి మొదలైన కళాకారులు పని చేస్తున్నారు. వీరు వుగాది వుత్సవాలతోపాటు, శ్రీరామనవమి వుత్సవాలు కూడా జరుపుతూ వుంటారు.

## పూనా :

పూనాలో చిరకాలంగా ఆంధ్ర అసోసియేషన్ ఏర్పడి పని చేస్తూ వుంది. ఇక్కడ ఉగాది, శ్రీరామనవమి మొదలైన పండుగలకు ఆంధ్రు లందరూ సమావేశమై వేడుకలతో వినోదాలతో కాలక్షేపం చేస్తూ వుంటారు. ఉన్నత ఉద్యోగాల్లో వున్న ఆంధ్రులు అనేకమంది వున్నారు. అసోసియేషన్ తరపున నాటక ప్రదర్శనాలు జరుగుతూ వుంటాయి. ఇక్కడ రోహిణి కళామండలి అనే మహిళామండలి కూడా ఏర్పడి పని చేస్తూవుంది. కల్నల్ బి. డి. పి. రావు, యం. వి. యోగి, కె. సాంబశివరావు, యస్. మహేశ్వరరావు మొదలైన కళాభిమాను లందరూ ఆంధ్ర అసోసియేషన్ పురోభివృద్ధికి పని చేస్తున్నారు.

## నైవేలి :

నైవేలీలో కూడా వుద్యోగాల్లో వున్న ఆంధ్రులు ఉగావి, శ్రీరామనవమి వేడుకలు వైభవంగా జరుపుతున్నారు. ఆంధ్ర కుటుంబాలన్నీ ఆ వుత్సవాల్లో పాల్గొనడమేకాక, వైజ్ఞానిక ప్రదర్శనాలలో పాల్గొని కార్యక్రమాలను నిర్వహిస్తున్నారు. ఇతర చోట్లనుండి ప్రసిద్ధాంధ్రులను రప్పించి, వారితో నాటకాలను ప్రదర్శింపచేయడమే గాక వారిని సన్మానించి గౌరవించి పంపుతూ వుంటారు.

# ఢిల్లీ ఆంధ్ర నాటకరంగం

## తొలి నాటక ప్రదర్శనం :

1941 - 42 ప్రాంతాల్లో కొంతమంది వుత్సాహవంతులైన తెలుగుసోదరులు చింతామణి నాటకం ప్రదర్శించారట. ఆ చింతామణి నాటకంలో ఆనాడు ఢిల్లీలో తెలుగువార్తలు చెప్పేవారిలో ఒకరైన కీ॥ శే॥ యండమూరి సత్యనారాయణ (శ్రీవాత్సవ) శ్రీహరిపాత్రను ధరించి పలువురి ప్రశంస లందుకున్నారు. అదే

నాటకాన్ని తిరిగి 1944 లో ప్రదర్శించగా ఢిల్లీ ఆంధ్రులతో హాలంతా కళకళ లాడింది.

## కీ॥శే॥ ఉపద్రష్ట సీతారామయ్య :

ఢిల్లీ నాటకరంగానికి తన జీవితాన్ని ధారపోసిన కళాజీవి కీ॥ శే॥ ఉపద్రష్ట సీతారామయ్యగారు. 1940 కి ముందునించి పెద్ద పదవుల నలంకరించిన ఆంధ్రుడు. ప్రప్రథమంగా తెలుగు అమెచ్యూర్ డ్రమెటిక్ అకాడమీ అనే సంస్థను స్థాపించారు. నాటక కళకోసం స్వార్జితాన్ని మంచినీళ్ళప్రాయంగా ఖర్చుపెట్టిన నిస్వార్థ కళాకారుడు. ఆయన దాదాపు 30 నాటకాలను రచించాడు. వ్రాసిన నాటకాలలో 10 నాటకాలను అతి కష్టంమీద ప్రదర్శించారు. కాని ఏ ప్రదర్శనానికీ దమ్మిడీ ఆదాయం లేదు. అన్నీ ఉచితప్రదర్శనాలే. వారి నాటకాలలో చెప్పుకోతగిన నాటకం "అసూయ" ఢిల్లీలో వారి నాటకాలను ప్రదర్శించడమేకాక ఆంధ్రదేశం నుంచి అనేక నాటక సమాజాలను రప్పించి కూడ ప్రదర్శనాలను ఇప్పించారు.

వారితోపాటు రేడియోవార్తలు చెప్పే కలపటపు గోపాలరావుగారు "సాధన" అనే నాటకాన్ని వ్రాయగా అమెచ్యూర్ డ్రమెటిక్ అకాడమీ ప్రదర్శించింది. ఢిల్లీ నాటకాలకు స్త్రీ పాత్రధారులు దొరకపోతే ఆంధ్రదేశంనుంచి స్త్రీ పాత్రధారుల్ని స్వంత ఖర్చులమీద రప్పించి నాటకాలను ప్రదర్శించారు.

ఆ తరువాత వారు ప్రదర్శించిన నాటకాల్లో ముఖ్యమైంది సత్య హరిశ్చంద్ర. ఈవిధంగా సీతారామయ్యగారు ప్రతి నాటకాన్ని కట్టుదిట్టంగా తరిఫీదు చేయించి ప్రదర్శించి, ఢిల్లీ ఆంధ్రుల ఆదరాభిమానాలను చూరగొన్నారు.

## ఢిల్లీ ఆంధ్రసంఘం :

ఢిల్లీ ఆంధ్రసంఘం ఎంతో కాలంనుంచి పనిచేస్తున్నప్పటికీ నాటకాల విషయం అంతగా పట్టించుకోలేదు. కాని, జగత్పతిగారని ఐ.ఎ.ఎస్.కు చెందినవారు కొన్నాళ్ళు ఆంధ్ర సంఘానికి అధ్యక్షులుగా వుండి ఆచార్య ఆత్రేయ గుమాస్తా నాటకాన్ని జయప్రదంగా ప్రదర్శింపచేశారు. ఈ కార్యక్రమంలో క్రొవ్విడి లక్ష్మన్న, భాగవతుల నారాయణమూర్తిగార్లు ఎంతగానో సహకరించారు. క్రమేపీ ఆంధ్ర సంఘం ఆధ్వర్యంలో నాటకాలు వేయించటానికి కృషి బాగా జరిగింది. ఆంధ్ర దేశంలో వరదలు వచ్చి బాధపడుతున్న వరద బాధితుల సహాయార్థం "వర

విక్రయ" నాటకాన్ని రెండుసార్లు ఆంధ్రసంఘం ప్రదర్శించి నిధి వసూలు చేసింది.

ఢిల్లీలో తెలుగు నాటక ప్రదర్శనాలను ఆంధ్రులతోపాటు అన్యభాషల వారంతకూడ చూసి ముగ్ధులైపోయేవారట. వారిలో ముఖ్యులు తమిళ సోదరులు.

ముఖ్యంగా ఆంధ్రసంఘంచే డా॥ కే. యల్. రావు, పింగళి వీరరాఘవరావు గార్ల ఆధ్వర్యంలో అనేక తెలుగు నాటకాలు జయప్రదంగా ప్రదర్శించబడ్డాయి.

రానురాను స్త్రీ పాత్రలను కూడా ఢిల్లీలో వున్న ఆంధ్ర స్త్రీలే ధరిస్తూ ఆ కొరతనుకూడా తీర్చుకున్నారు.

## దక్షిణ భారత నటీ

## నట సమాఖ్య :

ఢిల్లీలో దక్షిణ భారత నటీ నట సమాఖ్యను గురించి తెలియని ఆంధ్రుడు లేడు. ఈ సమాఖ్యలో ప్రసిద్ధ నటుడు కె. వెంకటేశ్వరరావు అనేక నాటకాలు కట్టుదిట్టంగా ప్రదర్శింపచేశాడు. ఈ సమాఖ్యను కేవలం ఆంధ్రులేకాక దక్షిణాది నాలుగు భాషలకు చెందినవారితో, కె. వెంకటేశ్వరరావు, టి. రామచంద్రరావు మరి కొంతమంది వుత్సాహవంతులు స్థాపించారు.

ఈ సమాఖ్యలో కె. వెంకటేశ్వరరావు శిక్షణలో ప్రదర్శించిన తెలుగు నాటకాలు ఇతర భాషలవారు ఆశ్చర్యచకితు లయ్యేటంతగా మెప్పుపొందాయి. అటువంటి వాటిలో ముఖ్యమైనవి "కప్పలు", "రాగరాగిణి", "ఫణి" మొదలైనవి. వెంకటేశ్వరరావు ఢిల్లీలో వున్నంతకాలమూ నాటకాలు జనరంజకంగా ప్రదర్శింపబడి ఆంధ్రులందర్నీ ఆకర్షించాయి.

వెంకటేశ్వరరావు ఢిల్లీ వదలి వెళ్ళినతరువాత అయ్యగారి వీరభద్రరావు, కలపటపు రామగోపాలరావు మొదలైనవారు ప్రదర్శించిన "కీర్తిశేషులు" నాటకం గొప్ప పేరు తెచ్చుకుంది.

ముఖ్యంగా ఢిల్లీలో తెలుగు నాటకాలకు ప్రాణం పోసినవారు టి. రామచంద్రరావు, న్యాయపతి రాఘవేంద్రరావు. తెలుగువారికి నాటక కళలో ఒక ప్రత్యేక విశిష్టత వున్నదని సమాఖ్య నాటకాలు ఋజువుచేశాయి. ఈనాటికీ ద॥ భా॥ నటీ నట సమాఖ్య వర్ధిల్లుతూనే వుంది.

# బొంబాయి తెలుగు నాటకరంగం

## కామాటిపురం :

బొంబాయి నగరంలో ఆంధ్రుల నివాసం నూరు సంవత్సరాల క్రితమే ప్రారంభమైంది. బొంబాయి వచ్చిన తెలుగు వారందరూ తెలంగాణా ప్రాంతం నుంచీ వచ్చినవారే. ఇలా వచ్చినవారికి స్థిరనివాసం కల్పించే నిమిత్తం విశాల మైన ఒక పేట నిర్మించడానికి ప్రభుత్వం అవకాశాలు కల్పించింది. ఆనాటికి లభ్య మైన సౌకర్యాలతో తెలుగు ప్రజలకోసం, తెలుగు ప్రజలచే నిర్మితమైన పేట కామాటిపురం.

## ఆంధ్ర అసోసియేషన్ స్థాపన :

1926 వ సంవత్సరంలో బొంబాయి ఆంధ్ర అసోసియేషన్ స్థాపించ బడింది. ఇదికాక కొన్ని గ్రంథాలయాలు, స్థానిక తెలుగు సమాజాలు కూడా తయారయ్యాయి. ఆంధ్రు లందరికీ ప్రాతినిధ్యం వహించగల సంస్థ నిర్మించే పథకంలో 1943 వ సంవత్సరంలో బొంబాయి ఆంధ్రమహాసభ స్థాపించబడింది. అది ఈనాడు పెరిగి మహావృక్షమై ఆంధ్రుల సాంస్కృతిక కార్యక్రమాలకు అండగా నిలుస్తూంది.

## నాటక ప్రదర్శనాలు :

బొంబాయి ఆంధ్రమహాసభ యాజమాన్యం క్రింద సమాజ సభ్యులు అప్పు డప్పుడు నాటకాలు ప్రదర్శిస్తూ వుండేవారు. మహాసభ ఆధ్వర్యంలో పెద్ద పెట్టున శ్రీరామనవమి ఉత్సవాలు జరుపబడేవి. ఆ ఉత్సవాల్లో నాటకాలు ప్రదర్శిస్తూ వుండేవారు. రామదాసులాంటి పౌరాణిక నాటకాలే కాక, కన్యాశుల్కం, కంఠా భరణంవంటి హాస్య సాంఘిక నాటకాలు కూడా బొంబాయిలో ప్రదర్శింపబడ్డాయి.

## రెండవ యుద్ధం తర్వాత :

రెండవ ప్రపంచయుద్ధం తరువాత విరివిగా మధ్య తరగతి ఆంధ్రులు, విద్యావంతులు, ఉద్యోగస్తులు బొంబాయికి రావడం ప్రారంభించారు. వానితో

నాటక ప్రదర్శనాలు ఎక్కువయాయి. సాంప్రదాయ నాటకాలే కాక, ఆధునిక నాటకాల ప్రదర్శన ప్రారంభమైంది. ఇదేసమయంలో ఇండియన్ పీపుల్స్ థియేటరు బొంబాయి శాఖ ఏర్పడినప్పుడు, దానికి అనుబంధంగా ఆంధ్ర ప్రజా నాట్యమండలి స్థాపించబడి కొన్ని సంవత్సరాలు ఎంతో ఉత్సాహంగా నాటకాలు ప్రదర్శించింది. గుమాస్తా—పరివర్తన వంటి సాంఘిక నాటకాలు బొంబాయి ప్రజా నాట్యమండలి ప్రదర్శించింది.

## ఆంధ్ర ప్రజానాట్యమండలి :

1943 వ సంవత్సరంలో బొంబాయిలో అఖిల భారత ప్రజా నాట్యమండలి మహాసభ సందర్భంలో అన్ని రాష్ట్రాల నాటక బృందాలమధ్య జరిగిన పోటీలో ఆంధ్ర ప్రజా నాట్యమండలి ప్రథమ బహుమతి సంపాదించుకున్న సమయంలో బొంబాయి ఆంధ్రమహాసభ వారిని గౌరవించి రజత పాత్రను బహూకరించింది.

తరువాత 1948 జనవరిలో ఆంధ్ర ప్రజా నాట్యమండలి ఆంధ్రశాఖ తరపున డాక్టరు రాజారావు, మిక్కిలినేని, కోగంటి గోపాలకృష్ణయ్య, కోసూరి పున్నయ్య మొదలైనవారు వచ్చి, మాభూమి మొదలైన నాటకాలను, ఉత్తేజాన్ని కలిగించే అనేక జానపద కళారూపాలను ప్రదర్శించి, బొంబాయి ప్రజా నాట్యమండలిని ఉత్తేజపర్చారు. ఆ తరువాత 1949-50 లో వచ్చిన రాజకీయ పరిణామాలవల్ల ప్రజానాట్యమండలి కార్యకలాపాలు కొంతవరకు క్షీణించాయి.

## ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసైటి :

బొంబాయిలో ఆంధ్ర విద్యార్థులకు విద్యావసతులు కలిపించే నిమిత్తం ఆంధ్ర ఎడ్యుకేషన్ సొసైటీ ఏర్పాటైంది. ఈ సొసైటీకి సొమ్ము సమకూర్చే నిమిత్తం ఆంధ్రదేశం నుంచి శ్రీమతి లక్ష్మీరాజ్యం, పులిపాటి వెంకటేశ్వర్లు మొదలైనవారి ఆధ్వర్యంలో నాటకాలు ఏర్పాటుచేశారు. ప్రతిసంవత్సరం పండుగ దినాల్లో నాటినుండి నేటివరకూ నాటకాలు ప్రవర్శిస్తూనే వున్నారు.

## కళాక్షేత్రం :

1950 వ సంవత్సరంలో ఆంధ్రమహాసభ స్వంత భవనాన్ని నిర్మించుకుని, ఆ భవనంలో కళాక్షేత్రమన్న పేరుతో చక్కని బహిరంగ నాటకశాలను ఏర్పాటు చేసింది. ప్రతిసంవత్సరం ఆంధ్రదేశంనుంచి సూరిబాబు బృందం, శ్రీ రాజ

రాజేశ్వరీ నాటకసమాజం వారిచేత సాంప్రదాయక నాటకాలూ, 'పాండవ ఉద్యోగ విజయాలు' 'చింతామణి' 'బొబ్బిలియుద్ధం' 'పాదుకా పట్టాభిషేకం' 'తారాశశాంకం' మొదలైన నాటకాలు ప్రదర్శింపచేశారు. తరువాత విజయవాడ నవ్యకళా సమితి వారు ప్రఖ్య శ్రీరామమూర్తి ఆధ్వర్యంలో ఆధునిక నాటకాలు ప్రదర్శింపచేశారు.

'దొంగవీరడు' 'ఫణి' 'ఆడది' 'ఆకాశరామన్న' మొదలైన నాటకాలుకూడ కళాక్షేత్రంలో ప్రదర్శింపబడ్డాయి.

స్థానిక రచయితలైన అవసరాల వెంకటనర్సుగారి 'కీలుబొమ్మ', సోమంచి యజ్ఞన్న శాస్త్రిగారి 'పెద్దమనుషులు' ప్రప్రథమంగా బొంబాయిలోనే ప్రదర్శిత మయ్యాయి. ఇవికాక స్థానిక సభ్యులు నార్ల వెంకటేశ్వరరావు, భమిడిపాటి కామేశ్వరరావు, భమిడిపాటి రాధాకృష్ణ మొదలైన రచయితల నాటికలు, ఆధునిక నాటకాలూ చాలాసార్లు ప్రదర్శించారు. పి. డి. నాగేశ్వరరావు దర్శకత్వంతో సంగీత నృత్య నాటకాలు ప్రదర్శింపబడ్డాయి.

ఈమధ్య 'రూపక' అన్న పేరుతో ఉత్సావంతులైన ఆంధ్ర యువకులు మరో అసోసియేషన్ ప్రారంభించి, నాటకాలను ప్రదర్శిస్తున్నారు.

ఎడ్యుకేషన్ సొసైటీ నిర్మిస్తున్న స్కూలు భవనంలో విశాలమైన నాటక ప్రదర్శనా మందిరాన్నికూడా నిర్మించారు.

## షోలాపూర్ ప్రజానాట్యమండలి

రాష్ట్రేతర ప్రాంతాలకు ఆంధ్రులందరూ ఎలా వెళ్ళారో అలాగే షోలాపూర్ కూడా ఆంధ్రులు చేరుకున్నారు. ఇళ్లా చేరుకున్నవారిలో ఎక్కువ మంది తెలంగాణాకు సంబంధించినవారు. నూటికి 90 మంది మిల్లుల్లో పనిచేసే కార్మికులు. తాత్కాలిక వినోదంకోసం కాకతాళీయంగా అప్పుడప్పుడు వారు ప్రదర్శించే జానపద కళారూపాలు, పౌరాణిక నాటకాలు తప్ప, నాటకరంగం అంతగా అభివృద్ధి చెంద లేదని చెప్పవచ్చు. తెలుగు దేశంనుండి కొంతమంది వృత్తినాటక సమాజాలవారు అప్పుడప్పుడు వచ్చి నాటకాలు ప్రదర్శించి వెళుతూ వుండేవారు.

1948 వ సంవత్సరంలో ఆంధ్ర ప్రజానాట్యమండలి రాష్ట్రవ్యాప్తం నన్ను

మాభూమి నాటకాన్ని, జానపద కళారూపాలను ప్రదర్శించి వెళ్ళింది. ఆ తరువాత యువకుల్లో నవ చైతన్యం కలిగి షోలాపూర్ ప్రజానాట్యమండలిని స్థాపించారు.

## ప్రజానాట్యమండలి :

ప్రప్రథమంగా షోలాపూర్ మునిసిపాలిటి సభ్యులు, ప్రముఖ కళాకారులు ఆయిన శ్రీ విఠల్‌రావు ఫల్‌మారిగారు ప్రజా నాట్యమండలికి ప్రారంభోత్సవం చేశారు. అధ్యక్షులుగా శీదుంపేట నారాయణ, కార్యదర్శిగా పోతుల లక్ష్మణగార్లు ఎన్నుకోబడ్డారు. 12 మంది సభ్యులతో కార్యవర్గం ఎన్నుకోబడింది.

ప్రథమంగా 'తెలంగాణా వీరయోధులు' బుర్రకథను ప్రదర్శించారు. ఈ ప్రదర్శనం షోలాపూర్‌లోని తెలుగు ప్రజానీకాన్ని విశేషంగా ఆకర్షించింది. ఆ రోజుల్లో ఇతర నాటక సమాజాలున్నప్పటికీ బుర్రకథకే ప్రజలు ఎక్కువ ప్రాముఖ్య మిచ్చారు. ప్రభుత్వానికి సంబంధించిన "కాంగార్ కళ్యాణకేంద్రం", కార్మిక వికాస కేంద్రం మొదలైన ఇతర సంస్థలు కూడా ప్రజా నాట్యమండలిని ఆహ్వానించి ప్రదర్శనాలు చూచి ఆనందించారు.

తరువాత ప్రథమంగా బాలనాగమ్మ నాటకం ప్రదర్శించి తద్వారా నాటక ప్రదర్శనానికి కావలసిన డ్రస్సులు, తెరలు మొదలైనవి సంపాదించి, వరుసగా 'కనక తార' 'ద్రౌపదీ స్వయంవరం' 'సుగుణావతి' 'భద్రసేన' 'సారంగధర' 'శశిరేఖా పరిణయం' 'భక్తమార్కండేయ' 'అభినవ కిరాతార్జున' మొదలైన పౌరాణిక నాటకాలను అనేకం ప్రదర్శించారు.

## బుర్రకథ దళం :

ప్రజా నాట్యమండలి అధ్వర్యాన 'కుమారి ముత్య' 'రాము' 'రవి' మొదలైన బాలికలతో ఒక బుర్రకథ దళం ఏర్పాటుచేసి, 'అమరజీవి' 'వీరేశలింగం' 'అల్లూరి సీతారామరాజు' 'రుద్రమదేవి' 'చైతువిజయం' 'ఝూన్సీ లక్ష్మీబాయి' 'గొల్లకథలు' 'నేటి రాయలసీమ' మొదలైన ప్రబోధాత్మక బుర్రకథలద్వారా ప్రజల మన్ననలు పొందుతూ సాగించి కర్తవ్యబోధ చేశారు.

## సాంఘిక నాటకాలు :

'నేతబిడ్డ' 'కష్టజీవి' 'నేటిన్యాయం' 'తిరుగుబాటు' 'అల్లూరి సీతారామరాజు' మొదలైన నాటకాలను ప్రజా నాట్యమండలిద్వారా ప్రదర్శించారు.

ప్రజా నాట్యమండలి కార్యకర్తలుగాను, నటులుగాను వుండి ఈ క్రిందివారు అపారమైన సేవ చేశారు: వీరన్న గోరంట్ల, దోమప రాజయ్య, ఎ. సుదర్శన్, గుండేటి మొగిలి, మేర్గు రాజయ్య, డి. రమణయ్య, ఆనేంద్ సూర్యం, పి. వీరయ్య, నల్ల మల్లయ్య, వి. లింగయ్య, మామిండ్ల వెంకటేశ్, గోలి దుర్గయ్య, వి. శంకర్, దోర్నా విఠల్, ఎలిగేటి కొమరయ్య, గుడ్డెళి కొండయ్య, ఎ. నారాయణ, జి. వీరయ్య, బి. వెంకటయ్య, యం. నారాయణ, వీరప్ప కామూర్తి, దత్తు కోమల్, వెంకటయ్య, మాణిక్, సామల్ గౌరయ్య, సి. హెచ్. బాలాజీ, దుర్గయ్య మొదలైనవారు.

మండలిలో ముఖ్యంగా, విలన్‌గా శ్రీహరి, మాణిక్‌గార్లు మంచిపేరు తెచ్చుకున్నారు. గాయకులుగా శ్రీ మొగిలి రమణయ్య, మామిండ్లగార్లు, నాటకాల్లో కథానాయకుడుగా ఎ. సుదర్శనగార్లు ప్రజాదరణ పొందారు.

# కలకత్తా ఆంధ్ర నాటకరంగం

ఉద్యోగరీత్యా బ్రతుకుతెరువుకోసం రాష్ట్రం వదలిపోయిన ఆంధ్రులు ఇతర రాష్ట్రాల్లో కొన్ని లక్షలమంది నివసిస్తున్నారు. అలా నివసిస్తున్నవారిలో కలకత్తా నగరం, దాని పరిసరాల్లో కలిసి దాదాపు రెండు లక్షలమంది వున్నారు.

ఆంధ్ర నాటకరంగాభివృద్ధితోపాటు ఆంధ్రులు నివసించే ప్రతిచోటా ఔత్సాహిక నాటక సంఘాలు పనిచేస్తున్నాయి. పరిశ్రమల్లో పనిచేసే కార్మికుల బృందాలు పండుగదినాల్లో జాతీయమైన తెలుగు జానపద కళారూపాలను ప్రదర్శిస్తున్నారు. ఇలా ప్రదర్శించే నాటక బృందాలు దాదాపు కలకత్తా చుట్టుప్రక్కల 60 సంఘాల వరకూ పనిచేస్తున్నాయి.

ముఖ్యంగా కలకత్తా నగరంలో ఆంధ్రా అమెచ్యూర్స్, ఆంధ్రసంఘం, నారాయణ నాట్యమండలి, సంస్కృతీ సమాఖ్య మొదలైనవి చురుకుగా పనిచేసే నాటక సంఘాలుగా పేర్కొనవచ్చు.

**కాళిదాసుని శాకుంతల నాటకం :**

1931-32 సంవత్సరాలలో ప్రప్రథమంగా 'మధుసేవ' నాటకం ప్రదర్శింపబడటం

జరిగింది. ఆ తరువాత 1938 ఫిబ్రవరి 13 న వుత్తమస్థాయిలో శకుంతల నాటకం మదన్ థియేటరులో పార్శీథియేట్రికల్ కంపెనీవారి దుస్తులతో ప్రదర్శింపబడింది. ఈ ప్రదర్శనం కళకళలాడింది. ఈ ప్రదర్శనంలో చిరకాలంగా కలకత్తా నివాసులైన వేదాంతం సుబ్రహ్మణ్యంగారు దుష్యంతపాత్ర ధరించినందుకు సువర్ణ పతకాన్ని బహుమతిగా పొందారు. ఈ ప్రదర్శనానికి కీ॥శే॥ కొప్పరపు సుబ్బారావు, మాసి సూర్యనారాయణ మొదలైనవారు హాజరైనారు.

ఈ నాటక ప్రదర్శనం కలకత్తా ఆంధ్రుల్ని ఉత్సాహపర్చింది. వరుసగా నాటకాలు వేయడం ప్రారంభించారు. భమిడిపాటివారి ప్రహసనాలు, 'ఆంధ్రజ్యోతి' 'విడాకులా' 'రామదాసు' 'కృష్ణరాయబారం' 'నందనార్' మొదలైన నాటకాలను ప్రదర్శించారు.

ఉత్సాహవంతులైన ఆంధ్రులకు ఆంధ్రసంఘ భవనాన్ని నిర్మించాలనే కోరిక కలిగి నాటకాలను ప్రదర్శించి, రెండువేలరూపాయల నిధిని సేకరించారు.

ఆంధ్రరాష్ట్ర అవతరణ దినోత్సవ సందర్భంలో 'కన్యాశుల్కం'నాటకాన్నీ, సుభద్రాపరిణమం నృత్యనాటకాన్ని ప్రదర్శించారు.

## ఖిల్జీ రాజ్యపతనం :

కలకత్తా థియేటరు సెంటరువారు ఏర్పాటుచేసే ప్రదర్శనాల్లో పాల్గొని 1956 వ సంవత్సరంలో ప్రప్రథమంగా గుండిమెడ వెంకటసుబ్బారావుగారి ఖిల్జీ రాజ్యపతనం ఎంపైర్ థియేటరులో ప్రదర్శించి పలువురి మన్ననలందుకున్నారు. ఈ ప్రదర్శనానికి డా. రాధాకృష్ణన్‌గారు హాజరైనారు. ఈ ప్రదర్శనం వుత్తమ స్థాయి ప్రదర్శనంగా ఎంచబడి బెంగాల్ ప్రముఖులచేత అల్లావుద్దీన్ పాత్రధారియైన వేదాంతం సుబ్రహ్మణ్యం, కమల పాత్రధారి పార్వతి రుక్మిణీదేవి పతకాలను పొందారు.

## ప్రదర్శించిన నాటకాలు :

గడచిన దశాబ్దంలో ప్రతి పండుగకూ, తెలుగు నాటకాలను కొల్లలుగా ప్రదర్శించారని చెప్పవచ్చును. వీరు ప్రదర్శించిన నాటకాలు 'చింతామణి' 'బొబ్బిలి' 'గయోపాఖ్యానం' 'పంజరం' 'సినిమాగరల్' 'నాటకం' 'గుమాస్తా' 'ఈ సంసారం' 'ఖడ్గతిక్కన' 'మాష్టర్జీ' 'కమల' 'కప్పలు' 'స్వర్గసోపానం' 'తెలుగుకోపం'

'అనంతం' 'పెళ్ళిచూపులు' 'బంగారుసంకెళ్ళు' 'గాలివాన' మొదలైనవి... ఈ విధంగా కలకత్తా ఆంధ్ర కళాకారులు బహుముఖాల ఆంధ్ర నాటక రంగానికి సేవచేశారు.

వేదం వెంకటరాయశాస్త్రిలవారి ప్రతాపరుద్రీయం నాటకమూ, ఖిల్జీరాజ్య పతనమూ ఉన్నతస్థాయిలో ప్రదర్శింపబడి, రాష్ట్రేతరులైన బెంగాలీ ప్రముఖుల ప్రశంస లందుకున్నాయి.

**తుఫాన్ :**

వేదాంతం సుబ్రహ్మణ్యం వివిధ జాతుల సమైక్యతను దృష్టిలో వుంచుకుని తూర్పు బెంగాల్ కాందిశీకుల దుస్థితిని వివరిస్తూ తుపాను నాటికను వ్రాసి ప్రదర్శించారు. ఈ నాటిక కలకత్తాలో నున్న అన్ని భాషల ప్రజల మన్ననలందుకుంది. నటీ నటులు వారివారి పాత్రలను ఉత్తమస్థాయిలో నటించారు. ఈ నాటకానికి సాంకేతిక నిపుణులు ఎంతగానో సహాయం చేశారు. ఈ నాటకంలో తెలుగు, బెంగాలీ, హిందీ, ఇంగ్లీషు, అరవం మొదలైన భాషలు వాడబడ్డాయి. ఒక బెంగాలీ యువతి నటించింది. ఈ ప్రదర్శనంతో ఆంధ్రుల గౌరవ ప్రతిష్ఠలు బాగా పెరిగాయి. తుపాన్ నాటిక తరువాత హంహిందూస్తాన్, కదంకదం బడాతే జావ్ మొదలైన నాటకాలు వెలువడి ఉత్తమంగా ప్రదర్శించబడ్డాయి.

ధనంజయ బైరాగి విరచిత రజనీగంధ అనే బెంగాలీ నాటకాన్ని వేదాంతం సుబ్రహ్మణ్యం అనువాదంచేసి ఆశాదేవి అనే పేరుమీద ప్రదర్శించారు. ఈ నాటకాన్ని బెంగాలీ నాటకాలకు ఏమాత్రం తీసిపోని రీతిలో ప్రదర్శించారు.

**స్త్రీ పాత్రల సమస్య :**

ప్రదర్శించే నాటకాల్లో స్త్రీ పాత్రలు ధరించేవారు లేకపోవడంవల్ల స్త్రీ పాత్రలను పురుషులే కొంతకాలం ప్రదర్శిస్తూ వచ్చారు. మరికొన్ని స్త్రీ పాత్రలు లేని నాటకాలను ప్రదర్శించటం ప్రారంభించారు. కాని 15 సంవత్సరాలనుండి విశాల దృక్పథమూ, సంస్కారమూ గల సభ్యుల భార్యలు స్త్రీ పాత్రల్ని, పిల్లలు బాలవేషాలనూ వేయడంవల్ల ప్రదర్శనాలను కనులపండువుగా ప్రదర్శిస్తున్నారు. ఇందువల్ల స్త్రీ పాత్రలకొరత చాలవరకు తగ్గింది. ఇందుకు ఆ పాత్రలు ధరించే సోదరీమణులు ఎంతో అభినందించతగివున్నారు.

### రంగస్థలం దొరకలేదు :

ఇంతటి వుత్సాహంతో నాటకాలు ప్రదర్శించేవారికి నాటకాలు ప్రదర్శించు కోవడం ఆనాటికానాడు కష్టమైపోయింది. అనుకున్న రోజుకు హాలు దొరకడమే కష్టమైపోయింది. ఇందుకు వుత్సాహవంతులైన కలకత్తా ఆంధ్ర కళాకారులు నడుం బిగించారు. కార్యాన్ని సాధించారు. 25 సంవత్సరాల వారి కృషి ఫలితంగా ఈనాడు స్వంత రంగస్థలాన్ని సంపాదించుకోగలిగారు. ఆనాడు ప్రారంభించిన నిధి దినదిన ప్రవర్ధమానమైంది. రెండున్నర లక్షరూపాయలు వెచ్చించి సుందరమైన రంగస్థలాన్ని నిర్మించుకున్నారు. ఈనాడు ప్రదర్శనాలన్నీ ఆ హాలులో ప్రదర్శింపబడుతూ వున్నాయి.

### బాల నాటక సమాజాలు :

కలకత్తా ఆంధ్రనాటకోద్యమంలో పురుషులూ, స్త్రీలూ, ఎంతటి సమాన బాధ్యతల్ని నిర్వహించారో బాలబాలికలు కూడ అంతటి స్థానాన్ని సంపాదించారు. వారి ప్రత్యేకతను చాటుకున్నారు. పెద్దల ప్రోత్సాహంతో పాత్రలు ధరించడమేకాక అనేక పిల్లల నాటకాలు ప్రదర్శించబడ్డాయి. కేవలం మహిళలు 'అసంపూర్ణ రామాయణం' 'అమ్మలక్కలు' మొదలైన నాటకాలను కూడ ప్రదర్శించారు. పిల్లలూ, పెద్దలూ కలిసి ప్రదర్శించిన చెప్పుకోదగ్గ నాటకం రవీంద్రుని పోస్టాఫీసు.

ఈవిధంగా ఈనాడు వంగదేశంలో రాష్ట్రేతరులైన ప్రవాసాంధ్రుల నాటకోద్యమం మూడు పువ్వులు-ఆరుకాయలు కాస్తూ, పరవళ్ళుత్రొక్కుతూ ముందుకు పోతోంది. ఇందుకు మూలకారకులు ఆనాటినుంచీ ఈనాటివరకూ కృషిచేస్తున్న కళాజీవి వేదాంతం సుబ్రహ్మణ్యం.

# జంషెడ్‌పూర్ ఆంధ్ర నాటకరంగం

### ఆంధ్ర నాటక సాహిత్య సంఘం :

రాష్ట్రేతర ప్రాంతమైన జమ్‌షెడ్‌పూర్‌లో బహు పురాతనంగా అంటే దాదాపు 40 సంవత్సరాలక్రితం ఆంధ్ర నాటక సాహిత్య సంఘం ఏర్పడింది. ముఖ్యంగా బాలబాలికల విద్యకు అపారమైన సేవచేస్తూ వుంది. పెద్ద భవనం,

చక్కని నాటకరంగం, పెద్ద గ్రంథాలయం, లేబరేటరీని ఏర్పాటుచేసుకుని ఎంతో ఆదర్శవంతంగా పనిచేస్తూ వుంది.

స్థానికంగా అనేక పౌరాణిక చారిత్రక సాంఘిక నాటకాలు ప్రదర్శించడమే కాక విజయనగరం రాఘవ నాటకోత్సవాల్లో ఆర్. వి. చలం దర్శకత్వాన అనేక పర్యాయాలు అనేక నాటకాలు ప్రదర్శించి పేరుగడించుకుంది ఆంధ్ర నాటకసాహిత్య సంఘం.

జంషెడ్‌పూర్‌లోనే మాధ్యమిక పాఠశాల, గ్రంథాలయం, మరొక నాటక సమాజమూ ఏర్పాటుచేసుకున్న 'ఆంధ్ర అసోసియేషన్' కూడ ఆదర్శవంతంగా నాటకాలు ప్రదర్శిస్తూ వుంది. స్వంత భవనాలుగల ఈ రెండు సంస్థలేగాక నాటక కళలో అత్యంత శ్రద్ధాభక్తులుచూపే సమాజాలు కూడా వున్నాయి. వాటిలో కేవలం నాటక కళకే అంకితమైన సమాజం 'చలనసమితి' స్థానిక పోటీల్లోనూ, విజయనగరం నాటకపోటీల్లోనూ, నర్సాపురం నాటక కళాపరిషత్తులోనూ, రాజమహేంద్రవరం లలితకళా నికేతన్ నాటకపోటీల్లోనూ పాల్గొని అనేక బహుమతులూ అంతకుమించి కీర్తినీ గడించుకున్నది.

జెంషెడ్‌పూర్ నాటకరంగంలో ప్రఖ్యాతి వహించిన నటులు ఆర్. వి. చలం, వి. వి. చలపతిరావు, ఎ. సత్యనారాయణ, మార్నూరి సత్యనారాయణ, జి. యన్. మూర్తి, శ్రీపాద జగన్నాధరావు, మంగుపూడి వెంకటరావు, రామ నరుసు మొదలైనవారు.

**ఆర్.వి. చలం :**

రావి వెంకటచలం, జమ్‌షెడ్‌పూర్‌లో 1938 నుండి నేటివరకూ దాదాపు యాభై నాటకాలు ప్రదర్శించారు. పౌరాణిక నాటకాల్లో 'భక్తకుచేల', చారిత్రకాల్లో 'చాణక్య', సాంఘికాల్లో 'ఫణి' మొదలైన పాత్రలు అతనికి వన్నెతెచ్చాయి.

నాలుగుసార్లు విజయనగరం రాఘవ నాటకోత్సవాల్లో ఉత్తమ నటుడుగా ఎన్నికైనారు. మూడుసార్లు అతని స్వంతనాటకాలు ఉత్తమ ప్రదర్శనాలుగా ఎన్నికైనాయి.

ఇటీవల 1964 లో రాజమహేంద్రవరం లలిత కళా నికేతన్ పోటీల్లో

మరొకసారి ఉత్తమనటుడుగా ఎన్నిక అవడమేగాక, అతను రచించిన 'మాటతప్పకు' నాటకం ఉత్తమ రచన బహుమతి సంపాదించుకున్నది.

ఆయన రచించిన నాటకాలు 'డెబ్బైఏళ్ళ జీవిత ఫలితం' 'ఉసురు' 'నియంత పతనం' 'స్వర్గసోపానం' 'మాటతప్పకు' 'రాంగ్‌నెంబరు.'

మాటతప్పకు నాటకం విజయనగరంలోను, రాజమహేంద్రవరంలోను ఉత్తమ రచనగా, నర్సాపురం నాటక కళాపరిషత్తులో ద్వితీయ ఉత్తమ రచనగా ఎన్నికైనది.

**రావి సీత :**

రావి వెంకటచలంగారి అమ్మాయి రావి సీత 7 సంవత్సరాల ప్రాయంలో భక్తకుచేలలో రాఘవుని పాత్ర ధరించింది.

పది సంవత్సరాల ప్రాయంలో బాలికల 'కృష్ణతులాభారం'లో సత్యభామ పాత్ర అత్యంత జయప్రదంగా నిర్వహించి సువర్ణపతకం బహుమతిగా పొందింది. రాజమండ్రి లలిత కళా నికేతన్ నాటక పోటీల్లో 'మాటతప్పకు' నాటకంలో కథా నాయకి పాత్రధరించి, ఉత్తమనటిగా ఎన్నికై అనేకమంది కళాభిమానుల ప్రశంస లను అందుకుంది. జంషెడ్‌పూర్ నాటక రంగంలో రావి సీత ఒక మణిపూస.

**బిందాన నారాయణరావు :**

జంషెడ్‌పూర్ నాటక రంగంలో నాటక విమర్శకులుగా పేరుపొందినవారు బిందాన నారాయణరావుగారు. ఆయన కళాప్రియుడు జంషెడ్‌పూర్ ఆంధ్ర విజ్ఞాన సమితి నడిపిన 'ప్రవాసి' పత్రికలో నాటక కళమీద అనేక వ్యాసాలను రాశారు. స్థానిక నాటక సమాజ కార్యకలాపాల సందర్భంలో అనేక ఉపన్యాసాల నిచ్చారు. వాటినన్నిటినీ గుదిగుచ్చి ఇటీవలనే 'మన శ్రీరంగం' అనేక గ్రంథంగా వెలువ రించారు. ఈ గ్రంథానికి వేలూరు శివరామశాస్త్రిగారు పీఠిక వ్రాశారు. ఈ గ్రంథం నటీ నటులకు అత్యంత ఉపయోగకరమైనది.





# హిందీ నాటకరంగం



ఆంధ్రులు ప్రదర్శించిన హిందీ నాటకాలు, హిందీ వ్యాప్తికి హిందీ నాటకాలు, రాష్ట్ర వ్యాపిత హిందీ నాటకరంగం, హిందీ నాటకాల్లో ఆంధ్ర నటుల ప్రతిభ, శ్రోత్త్రాహుల ప్రశంసలు, తెలుగునుంచి హిందీలోకి

# ఆంధ్రులు ప్రదర్శించిన హిందీ నాటకాలు

భారతీయ జాతీయోద్యమాన్ని గురించి వ్రాయాలంటే మొట్ట మొదట మహాత్మాగాంధీ పేరు ఉదహరించవలసి వుంటుంది. నిర్మాణ కార్యక్రమంలో హిందీప్రచారం ఒక భాగంగా ప్రకటించారాయన. ఆ ప్రాతిపదికమీద దక్షిణ హిందీప్రచారసభ మద్రాసులో ఏర్పడింది. ఏ వుద్యమమైనా ప్రజల్లో చొచ్చుకుపోవడానికి, వారి హృదయాలను ఆకర్షించడానికి నాటకరంగం ఎంతో వుపయోగపడుతుంది. దీన్ని పురస్కరించుకుని ఆంధ్ర దేశంలో హిందీ ప్రచారం విరివిగా జరగడానికి హిందీ నాటక ప్రదర్శనాలు చాలవరకు ఉపయోగపడ్డాయి.



## జాతీయ ఉద్యమం-హిందీ :

ఆ రోజుల్లో జాతీయోద్యమంలో జైలుకు వెళ్ళడం ఎంత గౌరవమో, హిందీ నేర్వడం కూడా అంత గౌరవంగానూ వుండేది. హిందీప్రచారకుల భాషాప్రచారంతో పాటు ప్రజల్లో హిందీ అంటే ఆసక్తి అభిరుచి కలుగచేయడానికి హిందీనాటక ప్రదర్శనాలు ముఖ్యమైన సాధనాలుగా వుపయోగపడ్డాయి.

## హిందీ వ్యాప్తికి హిందీ నాటకాలు :

గాంధీజీ ప్రబోధం - జాతీయ భాషాభిమానం, ఇవి రెండూ హిందీ ప్రచారకులను ఉత్తేజపరచాయి. తత్ఫలితంగా ఆంధ్రదేశంలో అనేక హిందీ నాట్య సంఘాలు ఏర్పడ్డాయి. ఈనాడు వేరువేరు రంగాల్లో ప్రసిద్ధికెక్కిన గొప్ప గొప్ప వ్యక్తు లెందరో ఆ నాట్యసంఘాలలో చేరి హిందీ నాటక ప్రదర్శనలద్వారా హిందీ ప్రచారోద్యమానికి ఎనలేని సేవజేశారు. ఇది మనకు గర్వకారణం. అటువంటివారిలో శ్రీ దాడి గోవిందరాజులు, శ్రీ శిష్ల బ్రహ్మయ్య, శ్రీ వసల సూర్యచంద్ర

రావు, శ్రీ నండూరి రామకృష్ణారావు, శ్రీ గాదేపల్లి సూర్యనారాయణ, శ్రీ ఎస్. యల్. పెరుమాళ్ళు, శ్రీ ఆట్లూరు రామారావు, శ్రీ తోట వెంకటేశ్వరరావు మొదలైన వారు ముఖ్యులు.

## మూడు సంవత్సరాలూ మొదటి బహుమతి :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ మద్రాసులో 1938 - 39 - 40 సంవత్సరాలలో నాలుగు ప్రాంతాల మధ్యా హిందీ నాటక ప్రదర్శపోటీలు జరిపింది. అందులో వరుసగా మూడు సంవత్సరాలు ప్రథమ బహూమతి సంపాదించిన ఆంధ్ర రాష్ట్ర హిందీప్రచార నాట్యమండలికే షీల్డు దక్కింది. ఈ మండలి చంద్రగుప్త, భాగ్యచక్ర, షాజహాన్ నాటకాలు ప్రదర్శించింది. వీటిలో దాడి గోవిందరాజులు, ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, చిట్టూరు లక్ష్మీనారాయణశర్మ, బాలచంద్ర ఆప్టే, నండూరు రామకృష్ణారావు మొదలైన ప్రముఖులు అద్భుతంగా నటించి ప్రశంసాపాత్రులయ్యారు చాణక్య పాత్రధారి వున్నవజీకి, కాకాకలేల్కర్, ప్రేమచంద్ ల ప్రశంసా పత్రాలు లభించాయి.

## రాష్ట్రవ్యాపిత హిందీ నాటకరంగం :

అ తరువాత నూతనోత్సాహంతో అనేక జిల్లా, పట్టణ, తాలూకా హిందీ ప్రేమీమండలుల తరపున నాట్యసంఘాలు ఏర్పడ్డాయి. వేమూరి అంజనేయశర్మ గారి ఆధ్వర్యంలో ఏక్ హీ కబ్రీమే, ప్రాయశ్చిత్, ఏక్ ఘూంట్ నాటికలు చక్కగా ప్రదర్శించబడ్డాయి.

## ఏలూరు హిందీ నాటకాలు :

ఏలూరులో శీర్ల బ్రహ్మయ్యగారి నాయకత్వంలో ఒక నాట్యమండలి ఏర్పడి, చంద్రగుప్త, షాజహాన్ నాటకాలను ప్రజారంజకంగా ప్రదర్శించింది. శ్రీ మున్షీ సయ్యద్ అబ్దుల్ గనీ, తూము వెంకటేశ్వరరావు, పచ్చిగోళ్ళ ఆదిరామారావు, ప్రకాశరావుగార్లు. ఈ నాటకాల్లో ప్రముఖపాత్రలు నిర్వహించేవారు. శీర్ల బ్రహ్మయ్యగారి షాజహాన్ పాత్రాభినయం అద్వితీయంగా వుండేది. భీమవరం ప్రేమీమండలి పూజారిణి (శరత్ రచన) నాటకంగా రచించి సుమారు పది

కేంద్రాల్లో ప్రదర్శించింది. ఇదేవిధంగా కృష్ణాజిల్లా హిందీ నాట్యమండలి మేవాడ పతన్, రాజముకుట్, మహాత్మా ఈసా (ఏసు) నాటకాలు ప్రదర్శించి ప్రజల మన్ననలు పొందింది. కీ॥ శే॥ గుత్తా నరసింహం, గుత్తా సుబ్బారావు, పి. హనుమంతరావు, పొట్లూరు నాగభూషణం, యస్. యల్. పెరుమాళ్ళు, యలమంచిలి లక్ష్మయ్య, అడ్సుమిల్లి కృష్ణయ్య, మూర్తి, వల్లభ్, అర్జునరావు, కొల్లిపర రామచంద్రయ్యగార్లు విశేషంగా కృషిచేసి నాటకాలు రక్తి కట్టించేవారు.

ఆంధ్రరాష్ట్ర హిందీ నాట్యమండలి విజయవాడవారి హిందీ నాటక ప్రదర్శనాలు విశేషమైన ప్రజాదరణను పొందాయి. దేవదాసు నాటకం కథావస్తువుతో పాటు ప్రదర్శనరీత్యా ఒక కళాఖండంగా వుండేది.

## హిందీ నాటకాల్లో

## ఆంధ్ర నటుల ప్రతిభ :

వేమూరు ఆంజనేయశర్మ, వున్నవ రాజగోపాల కృష్ణయ్య, చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ, వేమూరు రాధాకృష్ణమూర్తి, అట్లూరి రామారావు, యలమంచిలి లక్ష్మయ్య, ఆర్. రామచంద్ర, మిక్కిలినేని సుబ్బారావు, గుత్తా నరసింహం మొదలైనవారు దేవదాసు నాటకంలో ముఖ్య భూమికలు ధరించారు. దేవదాసు నాటకం సుమారు 20 కేంద్రాల్లో ప్రదర్శింపబడింది.



ఈ విధంగా అటు శ్రీకాకుళం మొదలుకొని ఇటు గూడూరు వరకు, బందరు మొదలుకొని చిత్తూరు వరకు అనేకచోట్ల హిందీ నాటక సంఘాలు ఏర్పడ్డాయి. నాటకాలు, నాటికలు, చిత్ర విచిత్ర వేషాలు ప్రదర్శింపబడ్డాయి. హైదరాబాదులో దక్షిణ భారత హిందీప్రచారసభ తరపున నాట్యకళాసంఘం హిందీ నాటక, నాటికల పోటీలను జరిపింది. ఈ విష

యంలో వేమూరు ఆంజనేయశర్మగారు విశేషమైన కృషి చేశారు. నాట్యకళా సంఘం తరపున తెలుగులో ఆత్రేయ గుమాస్తా నాటకానికి హిందీ అనువాదమైన 'బాబూ' నాటకాన్ని రజత జయంతి సభల సందర్భంలో ప్రదర్శించారు.

## ఔత్తరాహుల ప్రశంసలు :

పరాయిభాషలో నాటకాలు ప్రదర్శించి మెప్పించడం చాలాకష్టం. ముఖ్యంగా భాషా, ఉచ్చారణ స్వచ్ఛంగానూ, భావప్రకటన ఉదాత్తంగానూ వుండాలి. ఇందుకు ఎంతో కృషి, సాధన, అవసరం, చంద్రగుప్త, షాజహాన్, దేవదాసు, పూజారిణి, మేవాడపతన్ నాటకప్రదర్శనాలు చూసి హిందీలో దిగ్దంతులైన పండితులు, రచయితలు, ప్రేమచంద్, కాకాకలేల్కార్, రామానందశర్మ, ప్రజనందనశర్మ, అవధనందన్, రఘువీరదయాళమిత్ర మొదలైనవారు హృదయపూర్వకంగా అభినందించారు. కొందరు తన్మయులై యోగ్యతాపత్రాల నిచ్చారు, ఈ నాటక ప్రదర్శనాల్లో పాల్గొన్న ప్రముఖ నటులందరు ఎన్నో కష్టనష్టాలకోర్చి భాషాభిమానంకొద్దీ నిస్వార్థంగా సేవజేసినవారే. ఇది ఆ నాటికి, ఈ నాటికి, ఏనాటికి కూడా జాత్యాభిమానం నేర్పే గుణపాఠం.

హిందీ నాటక ప్రదర్శనాలద్వారా ప్రజల్లో హిందీభాష యెడల ఆసక్తి అభిరుచి కలిగించడం సులభంగా వుండేది ఆ రోజుల్లో హిందీలో సంస్కృత శబ్దాలు అధికంగా వుండడంవల్ల తెలుగువారికి దృశ్యకావ్యంలో స్వచ్ఛమైన హిందీ వుచ్చారణ, సంభాషణల అభినయంద్వారా తేలిగ్గా అర్థమౌతాయి. ఈ విధంగా నాటక ప్రదర్శనాల్లో హిందీ భాషా మాధుర్యాన్ని స్వయంగా చూపిన ఆంధ్రులు, తమంతట తామే హిందీ నేర్చుకోవడానికి, తమ బిడ్డలకు నేర్పించడానికి ముందుకు వచ్చారు. అంతేకాక నాటక ప్రదర్శనాల ద్వారా అనేక పట్టణాల్లో పల్లెల్లో దాతలు ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘానికి విరాళాలు వసూలుచేసి ఇచ్చారు. ఈ విధంగా విరాళాలతో నిర్మింపబడిందే విజయవాడలోని నాగేశ్వరరాయ భవనం.

## తెలుగు నుంచి హిందీలోకి :

హిందీకంటే తెలుగు నాటకరంగం బాగా అభివృద్ధి చెందింది. అందువల్ల తెలుగులో ప్రసిద్ధిజెందిన ఆచార్య ఆత్రేయ నాటకాలు ఈనాడు, యన్. జి. ఓ హిందీలోకి అనువదించి ఉత్తమంగా ప్రదర్శించడమే కాకుండా వాటిని హిందీ

వారికి అందించి సాహిత్య సేవకూడా చేసిన ఆంధ్రరాష్ట్ర హిందీ నాట్యమండలి పేర్కొనదగినది. ఈనాడు నాటకాన్ని వేమూరు ఆంజనేయశర్మ, యస్. టి. ఓ. నాటకాన్ని ముగనీ అమరోహి హిందీలోకి అనువదించారు.

ఈ హిందీ నాటక ప్రదర్శనాలను చూసిన తెలుగు రచయితలు, స్వయంగా హిందీలో నాటకాలు వ్రాసి గొప్ప కృషిచేశారు. చోడవరపు రామశేషయ్యగారు మంత్రి రామయ్య, రాణీ మల్లమ్మ, గృహిణి, బొబ్బిలి అనే నాటకాలను వ్రాశారు. అరిగెపూడి రమేష్ చౌదరి ఉత్తమ నవలలతోపాటు ఎన్నో ఏకాంకికలు హిందీలో వ్రాసి బహుమతులు పొందారు. ఈ విధంగా తెలుగు రచయితలెందరో స్వయంగా హిందీలో వ్రాయడమో లేక తమ రచనను హిందీలోకి అనువదింపచేయడమో జరిగింది. దీనికి హిందీ నాటక ప్రదర్శనాలు ఒక ప్రేరణగా పనిచేశాయనడంలో అతిశయోక్తిలేదు.

# రేడియో నాటకాలు

**ఆంధ్ర నాటకరంగంలో రేడియో నాటకాలు కూడ ప్రాముఖ్యమైన పాత్రనే నిర్వహిస్తున్నాయి. నాటక ప్రదర్శనాలకు రేడియో నాటకాలకు చాల వ్యత్యాస ముంది. నాటక ప్రదర్శనానికి తెరవుంటుంది. రేడియో ప్రదర్శనానికి తెర అవసరం లేదు. ఒకటి దృశ్యమైతే, రెండవది శ్రవ్యం.**

నాటక ప్రదర్శనంలో సముఖానే ప్రేక్షకులుంటారు. రేడియోకి అలాంటి అవకాశంలేదు. నాటక ప్రదర్శనానికి రంగస్థలం కావాలి. రేడియో ప్రదర్శనానికి ఒక్క రేడియో సెట్ వుంచేచాలు. ఇలాగే చిత్రకళ, శిల్పకళ, రంగాలంకరణ, వేషధారణ మొదలైనవేవీ రేడియో నాటకానికి అవసరంలేదు. ఒక నాటక ప్రదర్శనాన్ని ఒకే దశం దేశవ్యాపితంగా ప్రదర్శించాలంటే ఎంతోకాలం పడుతుంది. కాని రేడియో ద్వారా ఒక నాటకాన్నిగాని, ఒక పాటనుగాని ప్రసారం చేస్తే మన దేశంలోగాని విదేశాల్లోగాని రేడియో సెట్టు వున్న ప్రతివ్యక్తి వాటిని విని సంతృప్తి పడగలడు. అంటే రేడియోద్వారా ఎంతటి ప్రబోధానైనా కొన్ని క్షణాల్లో వేలాది శ్రోతలకు వినిపించవచ్చు.

దృశ్యానికి, శ్రవ్యానికి వున్న తారతమ్యాన్ని పైనే చర్చించాం. ప్రేక్షకుల సాన్నిధ్యంలో నాటకం ప్రదర్శించి వారిని మెప్పించటం ఎంతకష్టమో మనకు

తెలుసు. కాని ప్రేక్షకులు లేకుండా కేవలం రేడియో లౌడ్ స్పీకరుద్వారా ప్రత్యక్షంగా నాటకాన్ని చూచినంత రసానుభూతిని రేడియో ప్రదర్శనంద్వారా పొందాలి.

నాటక ప్రదర్శనంలో వేషధారణా ఆంగికచలనాదులూ, రంగాలంకరణ, ప్రత్యక్షంగా ప్రేక్షకులూ మొదలైన హంగు లుండడంవల్ల చూసేవారికి ఇందులో ఏదో ఒకటి సంతృప్తి నిస్తుంది. కాని రేడియోలో మాత్రం, సంభాషణ పటుత్వం వెలితిలేని వేగం, విషయస్పష్టత, హృదయరంజకంగా అన్ని రసాలను, వాచికం ద్వారానూ, గొంతుమార్పులద్వారానూ, మాధుర్యం ద్వారాను మెప్పించాల్సి వుంటుంది.

సినిమాకు, రేడియోకు లేని ప్రేక్షకులతో సంబంధం ఒక్క స్టేజి డ్రామాకు మాత్రమే వుంది. రేడియో నాటికల ద్వారా ప్రజలను మెప్పించాలంటే అనేక రసాల నుత్పన్నంచేసే మృదుమధురమైన సంగీతవాయిద్యాలనూ (స్పెషల్ సౌండ్ ఎఫెక్ట్సునూ) ఇచ్చి శ్రోతకులను మెప్పించవచ్చు. కాని, నటీనటులకు రేడియో నాటకం రక్తి కట్టించడమే కష్టం. అంతేగాక రేడియోకి అందరూ నటులుగా పనికి వస్తారనికూడ చెప్పలేం. కొన్ని గొంతులు మైక్‌కు అద్భుతంగా సరిపోతాయి.

ఈనాడు రేడియో నాటక ప్రదర్శనాలు అంత రసవంతంగా జరగడంలేదు. ఒక స్టేజి నాటకాన్ని ప్రదర్శించాలంటే ఎంతోకాలం తీసుకుంటుంది. కాని రేడియో నాటకాలు ఒకటి రెండు రిహార్సల్సుతో ప్రసారం చేస్తున్నారు. రేడియో నాటకాల రిహార్సల్సు సరిగా జరుగవు. ఒకరువస్తే మరొకరు రారు. నటీ నటులమధ్య సన్నిహిత తత్వంకూడ శూన్యమే. రేడియోవారు ఎవరికి కంట్రాక్టులు పంపిస్తే వారే వస్తారు. వచ్చిన నటులకు కనీస పరిచయాలుకూడా కొంతమందికి వుండవు. ఎవ్వరి సంభాషణలను వారు చూచే చదువుతారు. ఎదుటి పాత్రను చూచి చదివినంత స్వాభావికత ఇలా కాగితాలు చూచి చదవడంలో రాదు. సంభాషణలు క్షుణ్ణంగా కంఠస్థం చేసినప్పుడే సరళంగా వుంటాయి. ఇలా చూచి చదవడంవల్ల సరియైన హావభావాలు, సరళ సంభాషణ వుండదు.

రేడియో నాటకాలు వినగలమే కాని ఏ పరిస్థితుల్లోనూ చూడలేం. కాని రేడియో ద్వారా తక్కువ ఖర్చుతో అఖిల ప్రపంచానికి ఎలాంటి సందేశాన్నిగాని, పాటలద్వారా ప్రబోధంకాని సులభంగా చేయగలం, ఏ పత్రికా, ఏ వుపన్యాసకుడూ, మరే కళారూపమూ జేయలేనంతటి గొప్ప ప్రచారసాధనం రేడియో.

---

# ఆధునిక నాటకరంగ వైభవానికి వెలుగులు విరజిమ్మిన నాటికాలు

ఏ కావ్యసృష్టికైనా  కాలం ప్రమాణం. సమాజం మూలాధారం. కాలం అంటే మనుషులే! మనుషుల తాత్విక చింతనకు ఒక సమష్టి రూపమే కాలం. కాలం మారుతున్నది అంటే మనుషులు మారుతున్నారని. మనుషుల భిన్నప్రవృత్తుల సంఘర్షణకు కళాత్మక రూపం నాటకం. ఏ కాలం రచయితలు ఆ కాలం సాహిత్యాన్ని కళారూపాలను సృష్టించుకొంటారు. మావనజాతి, ముఖ్యంగా సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యావలయాలను, సుఖదు.ఖాలను, జయాపజయాలను, కష్టాలను, కన్నీళ్ళను ఆవిష్కరిస్తుంది నాటకం. అంతే కాదు మనిషిలో ఉత్తమ సంస్కారాన్ని ప్రోదిచేయడానికి దోహదం చేస్తుంది. అందుచేతనే సాహిత్య ప్రక్రియల్లో నాటకానికి అగ్రతాంబూల మిచ్చారు లాక్షణికులు.

సాహిత్యం, సంగీతం, నాట్యం, చిత్రలేఖనం, శిల్పం వంటి కళల సమాహారం నాటకమైతే నాటక రచన కూడా కొన్ని అంశాల సమిష్టి రూపమే విశిష్ట వస్తు స్వీకరణ, ఇతి వృత్త నిర్మాణం, సంవాద కౌశలం, సన్నివేశ కల్పన, శిల్పం ఇవన్నీ నాటక రచనలో అంతర్భాగాలే. వీటిలో ఏ ఒక్కటి లోప భూయిష్టంగా వున్నా అటువంటి నాటకం సమగ్రతను సంతరించుకోలేదు. అందుకని ప్రతి తరంలోనూ నాటక రచయితలు కాలానుగుణమైన రచనలతో నాటక సాహిత్యాన్ని పరిపుష్టం చేస్తూ వచ్చారు. రచనా విధానంలోనూ, ప్రదర్శనా వైఖరిలోనూ కొత్త కొత్త ప్రయోగాలు చేస్తూ వచ్చారు. ముఖ్యంగా నలభయ్యవ దశకం ఉత్తరార్థంలో నాటకం యొక్క వస్తు, రూప, శిల్పాల తీరులో విశేషమైన మార్పులు చోటు చేసుకున్నాయి, నాటక రచనలో సుంకర సత్యనారాయణ, వాసిరెడ్డి భాస్కరరావు, ఆచార్య ఆత్రేయ గార్లు పెట్టిన ఒరవడి తెలుగు నాటక స్వరూపాన్నే మార్చివేసింది

# ప్రజా నాటకకర్తలు సుంకర, వాసిరెడ్డి

1946 లో రచించిన ముందడుగు, 1947 లో వ్రాసిన మాభూమి నాటకాలు సుదీర్ఘ చరిత్రను సంతరించుకున్నాయి. కథా సంవిధానంలో, సన్నివేశ కల్పనలో, పాత్రోచిత సంభాషణలు నడపడంలో, పాత్ర చిత్రణలో, రసపోషణలో, జాను తెనుగు ప్రయోగంలో విశిష్టత, విప్లవతత్వం వీరి నాటకాల్లో గోచరిస్తాయి. ఆలోచనలోనూ, ప్రదర్శనలోనూ నవచైతన్యం కలిగిస్తుంది.

## ముందడుగు వేయించిన 'ముందడుగు' నాటకం

వేళ్ళూనుకున్న జమీందారీ వ్యవస్థలో నలిగిపోయే రైతుల సముద్ధరణకు సాగిన జమీన్ రైతుల పోరాటానికి దోహద మిచ్చిన నాటకం, అనేక దళాలు వందల ప్రదర్శనలతో రాష్ట్రవ్యాప్తంగా లక్షలాది ప్రజలను తరింప చేసిన నాటకం ముందడుగు. వీరు రచించిన రెండవ నాటకం అపనింద, సాధారణ సాంఘిక నాటకంగానే మిగిలిపోయింది

## చరిత్రాత్మక నాటకం మా భూమి

కృష్ణాజిల్లా ప్రజానాట్యమండలి రాష్ట్రదళం ప్రదర్శించిన చరిత్రాత్మక నాటకం మా భూమి. నైజాం నిరంకుశత్వాన్ని ఎదిరించి నల్లగొండ జిల్లాలో జరిగిన ప్రజా పోరాటమే మా భూమి ఇతివృత్తం. నాటకరంగంలో ఒక కళాఖండంగా మిగిలి పోయిన మా భూమి గురించి వ్రాయడం చర్విత చర్వణమవుతుంది. 1943 నుంచి 1948 వరకు ప్రజా నాట్యమండలి ఒక మహోధృతమైన ఉప్పెనలా కళారంగంలో సంచలనం రేపింది. సాంఘికంగా, రాజకీయంగా నిద్రాణమైన జాతిని జాగృతం చేసింది. కనుమరుగై కాలగర్భంలో కలిసిపోతున్న అనేక జానపద కళారూపాలను పునర్జీవింపచేసి వ్యాప్తిలోకి తెచ్చింది. కళారంగంలో కొత్తకాంతులు విరిజిమ్మింది. ఆంధ్ర ప్రజానాట్యమండలి సాగించిన అలాంటి మహోజ్వల నాటకోద్యమం చరిత్రగతిలో పునరావృతమయ్యే మంచి రోజులు వస్తాయా? మళ్లీ వసంతం ఎప్పుడో !?

## అభ్యుదయ నాటక వైతాళికుడు ఆత్రేయ

కాగా, ఆంధ్ర నాటకరంగంలో అనేక కొత్త ప్రయోగాలు చేసి నాటక రచనలో ప్రదర్శనలో నూతనత్వాన్ని ఆవిష్కరించి తెలుగు నాటక రంగానికి దిశానిర్దేశం చేసిన ఘనత ఆచార్య ఆత్రేయ గారికి దక్కుతుంది. 1943 నుంచి 1963 వరకు ఆత్రేయ 10 నాటకాలను 15 నాటికలను రచించారు

ఆత్రేయకు పూర్వం సంప్రదాయ నాటకాల హోరులో చర్విత చర్వణమైన ఇతి వృత్తాలతో నిస్తేజంగా సాగిపోతున్న కళావాహిని మరో మలుపు తిప్పి, నూతన ప్రయోగాలతో వెలుగుదారులు చూపి, ఉన్నత ప్రమాణాలు నెలకొల్పి కొత్త ఒరవడి సృష్టించిన మేధావి, కళాస్రష్ట, వైతాళికుడు ఆచార్య ఆత్రేయ. కవి ఎప్పుడూ కష్టజీవుల పక్షాన ఉండాలని, అప్పుడే కవిత్వానికి సార్థకత అని ఉద్బోధించారు పరివర్తన నాటకంలో ఆత్రేయ

## వాస్తవికతే ఆత్రేయ నాటకాలకు ఊపిరి

తొలిరచనలైన గౌతమబుద్ధ (1943) అశోక్ సామ్రాట్ (1944) నాటకాలలో కొంతమేరకు పరివర్తన (1946) నాటకంలోను కాల్పనిక ఛాయలు కనిపించినప్పటికీ క్రమక్రమంగా వాటి నుంచి విడివడి ఎన్‌జిఓ (1948) నాటకం రచించేనాటికి పూర్తిగా వాస్తవికతావాదంలోకి ప్రవేశించారు. వాస్తవం (1946) ఈనాడు (1947) నాటకాలు ఆత్రేయ ఎంచుకొన్న మార్గాన్ని సుగమం చేశాయి. విశ్వశాంతి (1951) భయం, (1954) నాటక రచనతో ఆత్రేయ సృజనా శిల్పం విశ్వరూపం ధరించింది. ఎన్ జి వోలో మధ్య తరగతి మనిషిని కథా నాయకుణ్ణి చేసి అతని చుట్టూ సమాజ పరిస్థితుల్ని విశ్లేషించాడు. ప్రదర్శనలో పచ్చివాస్తవికత నాటకానికి నిండు తనాన్నిచ్చి ఎన్.జి.వో (అప్పటిపేరు-అద్దెకొంప) నాటకాన్ని అగ్రస్థానంలో నిలబెట్టింది. సమకాలీన రాజకీయాలు కూడా నాటక రచనకు స్వీకార యోగ్యమేనని నిరూపిస్తూ వాస్తవం, ఓటునీకే, అంత్యార్పణ వంటి నాటక నాటికలు రాసి కొత్త దారి చూపారు రచయిత.

## 'భయం' నాటకం, ఒక నూతన ప్రయోగం

మానవ జీవితంలో భయం అనే లక్షణం నిర్వహించే విచిత్ర విన్యాసాన్ని భయం నాటకంలో హృద్యంగా వివరించారు. ప్రతిమనిషినీ భయం వెంటాడుతుంది. భయం చేతిలో మనిషి బందీగా వున్నంత కాలం కొందరు జీవితంలో అనేక విషయా

లలో రాజీపడి బ్రతకడం నేర్చుకుంటారు. రకరకాల మనుషుల్ని భయం ఒక్కో రూపంలో వేధిస్తూ జీవితాన్ని నడిపిస్తూ ఉంటుందని వివరించారు. ఈ నాటకంలో భయం నాటకాన్ని ఒకే అంకంగా వ్రాశారు ఆత్రేయ. ఇది ఆనాటికి రచనాపరంగా ఒక కొత్త ప్రయోగం.

## హాస్యప్రధానమైన కప్పల నాటకం

ఎక్కడ బెల్లం వుంటే అక్కడికి చీమలు చేరినట్టు బంధుమిత్రులు, యితర మంది మాగదులు ధనవంతుని చుట్టూ చేరి ఉపగ్రహాల్లా తిరుగుతూ, ఇంద్రుడూ చంద్రుడూ అని పొగడ్తలతో ముంచెత్తుతూ పబ్బం గడుపుకుంటారు. అదే వ్యక్తి కష్టాల్లో పడితే ఎక్కడ వారక్కడ జారుకుంటారు. ఈ లోకరీతికి హాస్యప్రధానమైన అక్షర రూపం ఆత్రేయగారి కప్పలు నాటకం. రెండంకాలతో ఈ నాటకం వ్రాసి ప్రేక్షకులను రంజింప చేశారు. వాస్తవికత ఆత్రేయగారి నాటకాలకు ఊపిరి. వస్తుస్వీకరణలోనూ అనంతవైవిధ్యం కనబడుతుంది. ఆత్రేయగారి హాస్యంలో నైశిత్యం దాగివుంటుంది. కేవలం హాస్యోత్పత్తి కోసం పాత్రలను సృష్టించకపోవడం కూడా ఆత్రేయ రచనా విధానంలో మరో ప్రత్యేకత. చెవిటి పెళ్ళాం, జబ్బుతో మూలిగే తాత, హెవీ డైలాగులతో పాటు తానూ ఏడ్చే తండ్రి, గొడుగుతో ప్రత్యక్షమయ్యే కరణంగారు, ముక్కుపొడి పీల్చే తెలుగు మాస్టారు, అన్నిట్లో కలగజేసుకొంటూ అడ్డమైన సలహాలిచ్చే సర్వెంటు, మీసాలు మెలేస్తూ కర్రతో వచ్చే రౌడీ రంగడు. గుడ్లు మిటకరిస్తూ హూంకరించే విలను, తాగి స్టేజంతా బీభత్సం చేసే తాగుబోతు ఇలాంటి రెడీమేడ్ మూసపాత్రలకు తొలిసారి స్వస్తి పలికింది ఆత్రేయ గారే. మత కలహాలు మానుకొని అందరూ సహజీవనం చేయాలని ఈనాడు నాటకంలో శక్తివంతమైన సన్నివేశాలతో అభివ్యక్తం చేశారు.

## ప్రపంచశాంతికి మార్గం చూపిన విశ్వ శాంతి నాటకం

యుద్ధం మానవాళికి వినాశహేతువనీ, పెట్టుబడి దారులు, సామ్రాజ్య వాదులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం శాస్త్ర వేత్తలను పురికొల్పి మారణాయుధాలను తయారు చేసి మారణహోమం సృష్టించి ప్రపంచశాంతికి విఘాతం

కల్గించే ప్రయత్నాలు చేస్తారు. వారి దుర్మార్గాన్ని, ఎత్తుగడలను అభ్యుదయ వాదులు ప్రతిఘటించాలనీ, తద్వారా విశ్వశాంతిని పరిరక్షించాలని ఉద్బోధిస్తుంది విశ్వశాంతి నాటకం. ఒక్కొక్క వర్గానికి ప్రాతినిధ్యం వహించే పాత్రలకు భూదేవి, విశ్వం, శాంతి, సమత అని ప్రతీకాత్మకంగా పేర్లు పెట్టడంలోనే కావ్యార్థంలోని గాంభీర్యం, ప్రేక్షకుల దృష్టిని ఆకర్షిస్తుంది. విశ్వజనీన సమస్యను ఒక మారుమూల గ్రామంలో జరిగిన సంఘటనలతో ముడివేసి విశ్వశాంతి ప్రాముఖ్యాన్ని రచయిత ఈ నాటకంలో వ్యక్తం చేసిన తీరు అద్భుతం, అనన్యసాధ్యం ఈ నాటకంలో సాంకేతికపరమైన ఏర్పాట్లు చేయడం సాధారణ ఔత్సాహిక సమాజాలకు సాధ్యమయ్యే పనికాదు. పైగా మూడు స్త్రీ పాత్రలున్న ఈ నాటకాన్ని ఆర్థిక స్తోమత అంతంత మాత్రంగా వున్న సమాజాలు ప్రదర్శనకు చేపట్టడం చాలా కష్టమైనపని. అందుకే విశ్వశాంతి ప్రదర్శనకు నోచుకోలేదు. నిజానికి ఇది మేధావులు మెచ్చిన నాటకంగానే ప్రసిద్ధి చెందింది.

## మానవత్వమా? మారణ హోమమా? 'ప్రగతి 'నాటిక ప్రబోధం

ఆచార్య ఆత్రేయ రచించిన నాటికలలో ప్రగతి (1950) ఎవరు దొంగ? అత్యంత ప్రజాదరణ పొందినవి. శాస్త్ర పరిశోధనల పేరిట మానవత్వాన్ని నిర్లక్ష్యం చేయడం తగదని ఉద్బోధిస్తుంది ప్రగతి నాటిక శాస్త్ర పరిశోధనలు, మానవ కల్యాణం కోసమేగాని మారణహోమం కోసం కాదు. పెట్టుబడిదారుల ప్రోద్బలంతో మారణాయుధాలు తయారు చేసే ఫార్ములా కనిపెట్టి తన్మూలంగా మానవజాతికి తీరని నష్టాన్ని కలిగించబోతున్న తమ్ముడ్ని (సైంటిస్టుని) చేజేతులా హత్య చేస్తుంది అక్క. ఆత్రేయ గారి ప్రగతి నాటికలో కొండను అద్దంలో చూపించినట్టు ఎంత పెద్ద సమస్యనైనా క్లుప్తంగా, స్పష్టంగా, మనసుకి హత్తుకునేలా చెప్పడంలో అసాధారణ ప్రజ్ఞావంతుడు ఆత్రేయ. ఆంధ్రదేశంలో ఈ నాటిక ప్రదర్శించబడని రంగస్థలం లేదేమో. సెంట్ జార్జి జి ఇర్విన్ వ్రాసిన 'ప్రోగ్రెస్' అనుసరణ ఈ నాటిక 1951లో అభ్యుదయం పేరుతో మొక్కపాటివారు కూడా ఈ నాటికను అనువదించారు.

## నిజమైన దొంగల్ని ఎత్తి చూపిన 'ఎవరు దొంగ' నాటకం

ఎవరు దొంగ నాటకం ఆంధ్ర దేశంలో గొప్ప సంచలనం కలిగించింది ఒక పేదవాడు ఆకలికి తట్టుకోలేక, భార్యా పిల్లల బాధ చూడలేక ఒక హోస్టల్లో దూరి పట్టెడు అన్నం దొంగతనం చేస్తాడు. జనం అతని వెంట బడతారు అలా ప్రారంభమౌతుంది నాటిక. నిజాయితీ పరుడైన పోలీస్ఇన్స్పెక్టర్ విచారణలో అన్నం పేదవాడికి దక్కకుండా, కరువై పోవడానికి కారకులెవరో స్పష్టమవుతుంది. పట్టెడు మెతుకులు దొంగిలించిన వాడికి దొంగ అనే ముద్రవేస్తే సంఘాన్ని నిలువు దోపిడీ చేస్తున్న వ్యాపారస్తులను, అధికార గణాన్ని ఏమని పిలవాలి? నిజమైన దొంగలు వీళ్ళే అని నిరూపిస్తాడు ఇన్స్పెక్టర్ ఇదిగో మీ అన్నం మీకే యిచ్చేశాను ఇంకా నేను దొంగనేనా బాబూ అని గుండెలు కరిగేలా సభ్య ప్రపంచాన్ని ప్రశ్నిస్తూ ప్రాణాలు విడుస్తాడు దొంగ . అయితే ఈ దొంగలు మాత్రం పై అధికారులతో లాలూచీపడి ఇన్స్పెక్టర్ను నిమిషాల మీద ట్రాన్స్ఫర్ చేయించి చట్టానికి దొరక్కుండా హాయిగా తప్పించుకొంటారు. సంచలనాత్మకమైన ఈ నాటికను ప్రభుత్వం ఆ రోజుల్లో నిషేధించింది ప్రేక్షకుల్లో నుంచి పాత్రలు ప్రవేశించడం, ప్రేక్షకులతో మాట్లాడటం వంటి కొత్త ప్రయోగాలు చేశారు ఈ నాటికలో ఆత్రేయగారు.

## మానవత్వం మూర్తీభవించిన 'అంత్యార్పణ'

దాస్యశృంఖలాలను ఛేదించి దేశానికి స్వాతంత్ర్యాన్ని తేవాలనే మహదాశయంతో అహర్నిశలు కృషిచేసిన త్యాగధనులు కొందరైతే, వారి త్యాగఫలాన్ని స్వప్రయోజనాలకు వాడుకునే స్వార్ధపరులు పెక్కుమంది. గాంధేయసిద్ధాంతానికి కట్టుబడి నిరాడంబరంగా జీవించే తల్లికి, మంత్రి పదవిని అంటిపెట్టుకుని పెట్టుబడి దారులకు అండగా నిలిచిన తనయుడికి మధ్య జరిగిన సంఘర్షణే ఆత్రేయ రచించిన మరో నాటిక అంత్యార్పణ(1955). ప్రజా సమస్యలను గాలికి వొదిలి శ్రీమంతుల ప్రయోజనాలను పరిరక్షించే కొడుకుతో వాగ్వివాదం జరిపి చివరికి కత్తిపీటతో ప్రజాకంటకుడ్ని అంతం చేస్తుంది తల్లి. రాజకీయ పరిస్థితుల్ని ప్రజలకు తేటతెల్లం

చేయటానికి ఆ రోజుల్లో ఎన్నికల ప్రచారం కోసం రాసిందే అయినా, ఈ దేశపరిస్థితుల దృష్ట్యా ఈనాటికీ ప్రదర్శనయోగ్యంగా వుందీ నాటిక.

## నేటి కళాపరిషత్తుల మాతృమూర్తి ఆంధ్ర నాటక కళా పరిషత్తు

1940-50 మధ్య కాలంలో తెలుగు నాటక రంగాన్ని పునరుద్ధరించడానికి నాలుగు సంస్థలు శక్తి వంచన లేకుండా కృషి చేశాయి. 1. ఆంధ్రనాటక కళా పరిషత్తు, 1929 లో స్థాపించబడి 1943 లో పునర్ వ్యవస్థీకరించబడింది ప్రతి ఏటా రాష్ట్రస్థాయి నాటక పోటీలు నిర్వహిస్తూ నాటక రచనలో ప్రదర్శనలో ఉత్తమ ప్రమాణాలు నెలకొల్పి సాంఘిక నాటక వికాసానికి అనితర సాధ్యమైన కృషి చేసింది. దీనిమూలంగా ఎందరో నటీనటులు, రచయితలు వెలుగులోనికి వచ్చారు. అంతేకాదు ఆంధ్ర దేశంలో మారుమూల ప్రాంతా లలోకూడా నాటక పరిషత్తులు ఏర్పడి నాటక పోటీలు నిర్వహించే సంప్రదాయానికి ఆంధ్ర నాటక కళాపరిషత్తే మార్గదర్శి అయింది. స్త్రీ పాత్రలు స్త్రీలే ధరించాలన్న పరిషత్తు నిబంధన వల్ల అనేకమంది నటీమణులు రంగస్థల ప్రవేశం చేసి నాటక రంగాన్ని జేగీయమానంగా వృద్ధి చేశారు. విధిగా స్త్రీ పాత్రలు పురుషులు ధరించే సంప్రదాయానికి కాలం చెల్లింది. పరిషత్తుల వల్ల దర్శకుడికి తొలిసారిగా గుర్తింపు వచ్చింది. నాటక ప్రదర్శనలో అతని ప్రాముఖ్యం పెరిగింది. తెలుగు నాటకం సాంకేతిక పరంగా ఎన్నో కొత్త మెలకువలు నేర్చుకొంది. నాటకానికి ప్రదర్శన యోగ్యతే మొదటి లక్షణమని నాటక రచయితలు దృఢంగా విశ్వసించారు. పరిషత్తు వల్ల పద్య నాటకానికి గట్టి దెబ్బ తగిలింది. పరిషత్తు పోటీలలో పద్యనాటకాల ఊసే లేనందువల్ల అంతంత మాత్రంగా బ్రతుకుతున్న పద్య నాటకానికి ఆదరణ కరువైంది.

## ఆంధ్ర విశ్వవిద్యాలయం, ఆరు బయలు రంగస్థలం

2. ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రయోగాత్మక నాటక సమితి 1943లో అప్పటి రిజిస్ట్రార్ డా. కె.వి. గోపాలస్వామి నేతృత్వంలో స్థాపించబడింది. దీని ప్రధాన ఆశయాలు 1. రంగస్థల కళలకు సంబంధించిన అన్ని శాఖలలోను శిక్షణ యివ్వడం, 2. కొత్త నాటకాలను ప్రదర్శించడం, 3. రంగస్థల కళలకు సంబంధించిన వివిధ శాఖలలో

ప్రయోగాలు జరపడం, 4. వివిధ రకాల నాటక ప్రదర్శనలకు అనువైన రంగస్థలం కోసం, ప్రేక్షకాగారం కోసం డిజైన్‌లు తయారు చేయడం, 5. వినోదం సమకూర్చడం యూనివర్శిటీ స్థాయిలో నాటక పోటీలు నిర్వహించడమే కాక, అంతర్విశ్వ విద్యాలయ నాటక పోటీలు కూడా జరిపి విద్యార్థుల్లో నాటక కళపట్ల ఆసక్తిని పెంచి విద్యార్థి నాటకరంగానికి మూల పురుషుడయ్యాడు గోపాలస్వామి నిజానికి విద్యార్థి నాటక రంగ వైభవం గోపాలస్వామి గారితోనే అంతరించడం నాటక రంగంలో ఒక విషాద ఘట్టం.

## తెలుగు లిటిల్ థియేటర్

3.లిటిల్ థియేటర్ ఉద్యమం ఇంగ్లాండు, అమెరికా దేశాలలో ఉధృతంగా సాగిన లిటిల్ థియేటర్ ఉద్యమ లక్ష్యాలను దృష్టిలో వుంచుకుని ఆంధ్రప్రదేశ్‌లో కూడా లిటిల్ థియేటర్‌ను కొప్పరపు సుబ్బారావు గారు 1947 లో స్థాపించారు. కళాకారులలో సహజంగా వుండే ప్రతిభా పాటవాలకు తోడు నాటకకళను శాస్త్రీయ దృక్పథంతో అభ్యసిస్తే బంగారానికి తావి అబ్బినట్లు అవుతుందనీ, సుశిక్షితులైన కళాకారుల వల్లనే నాటక రంగం ప్రగతి పథంలో సాగుతుందనీ, ఈ ఉద్యమ నిర్మాతల విశ్వాసం. నాటక ప్రదర్శన కళాత్మకంగా ఉండాలంటే ఆహార్యం, రంగోద్దీపన, సంగీతం, కొన్ని యితర హంగులు కూడా ఉండాలి ఇలాంటి సాంకేతిక విషయాలలో నటీనటులకు కొంత పరిజ్ఞానం, అవగాహన అవసరం. అలాంటి పరిజ్ఞానాన్ని శిక్షణ ద్వారా అందించాలన్నదే లిటిల్ థియేటర్ పరమ లక్ష్యం. ఈ దిశలో కొప్పరపు వారు ఎంతో శ్రమించారు.

## కొప్పరపు ఒంటరి పోరాటం

4.లిటిల్ థియేటర్ ప్రాముఖ్యాన్ని ఆనాటి పెద్ద పెద్ద నటులే గుర్తించ లేదు. తత్ఫలితంగా తగిన ప్రోత్సాహం లభించలేదు. సుబ్బారావుగారిది ఒంటరిపోరాట మైంది కొప్పరపు సుబ్బారావుగారి మరణంతో లిటిల్ థియేటర్ కాలగర్భంలో కలిసిపో యింది. అయితే ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్‌లో కొన్ని విశ్వవిద్యాలయాల్లో రంగస్థల కళల శాఖలు ఏర్పడిన తర్వాత కొప్పరపు వారి ఆశయాలు పరోక్షంగా కార్యరూపం ధరించడం గమనార్హం.

పైన పేర్కొన్న నాలుగు సంస్థల కృషి ఫలితంగా నాటక రంగం 40వ దశకం నుంచీ ఎంతో పురోభివృద్ధిని సాధించింది. ఈ దశాబ్దిలో సాంఘిక నాటకాలు, నాటికలు పద్యనాటక రచన కొనసాగుతూనే వచ్చింది.

## స్వాతంత్ర్యోద్యమానికి స్ఫూర్తినిచ్చిన నాటకాలు

స్వాతంత్ర్యోద్యమానికి స్ఫూర్తి నిచ్చి ప్రజలను కర్తవ్యోన్ముఖుల్ని చేయడానికి కొందరు నాటకకర్తలు గద్యపద్యాత్మకాలైన నాటకాలు రాశారు. వాటిలో వేదాంత కవిగారి తెలుగు తల్లి (1940) గుళ్ళపల్లి నారాయణమూర్తి గారి ఆంధ్రజ్యోతి (1941), జాస్తి వెంకట నరసయ్య గారి కాంగ్రెస్ విజయం (1946), యడ్లపల్లి కోటయ్య గారి గాంధేయ విజయం (1946), అచ్చిరాజు రంగారావు గారి స్వాతంత్ర్య సమరం (1946)తదితర నాటకాలు పేర్కొనదగినవి.

## మానవత్వానికి మచ్చుతునక శాపవిమోచనం

గాంధీ మహాత్ముని సిద్ధాంతాలలో ఒకటైన అస్పృశ్యత ఇతివృత్తంగా చేసుకుని శ్రీ ఊటుకూరు సత్యనారాయణ రావు రచించిన శాపవిమోచనం (1943) ఆనాటకం, గాంధేయ స్ఫూర్తికి ప్రతీక. కులమతాలు అడ్డుగోడలై నిలిచి, మానవ త్వానికి సమాధి కడుతున్న దుర్ధశలో, సర్వమానవ సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ వచ్చిన ప్రబోధాత్మక నాటక సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ వచ్చిన ప్రబోధాత్మక నాటక శ్రేణి లోనిదే శాపవిమోచనం. అస్పృశ్యత అనే దురాచారాన్ని సంఘంలో రూపుమాపాలని కంకణం కట్టుకున్న అగ్రజాతి వారికి ఎదురయ్యే సమస్యలు ఈనాటకంలో చిత్రించ బడినాయి. హరిజన పక్షపాతి, సంఘసేవకుడు అయిన ఓ పురోహితుని (శంకరయ్య) తల్లి చనిపోతుంది. అంత్యక్రియలు జరపడానికి బ్రాహ్మణులు నిరాకరిస్తారు. కులం కట్టుబాట్లకు తలవొగ్గి శవవాహకులెవరూ ముందుకురారు. కులపెద్దల ప్రతిఘనటకు భయపడక, తల్లి శవాన్ని భుజాల మీద మోసుకుపోవడానికి సిద్ధపడతాడు శంకరయ్య. ఈ నాటకంలో పాటలు, పద్యాలు సరళసుందరంగా ఉన్నాయి.

## ఊటుకూరివారి ఉత్తమ దేశభక్తి నాటకాలు

ఊటుకూరు వారి ఇతర పద్యనాటకాలలో ద్రౌపది (1943) నాటకంలో ద్రౌపది పాత్ర చిత్రణ రచయిత ప్రతిభకు బంగారు పతకమనీ, అనార్కలి (1941) ప్రణయ సుందర ప్రపంచానికి పరిమళ ప్రసూనమనీ, ఛత్రపతి శివాజి (1943) నాటకం దేశాభిమానానికి దీనారటంకం అనీ రసజ్ఞుల చేత కీర్తించబడిన ఉత్తమ రంగస్థల నాటకాలు

మల్లాది అచ్యుత రామశాస్త్రి గారి సక్కుబాయి (1946) కొప్పరపు సుబ్బారావు గారి తారా శశాంకం (1948) తాండ్ర సుబ్రహ్మణ్య శాస్త్రి గారి శ్రీరామాంజనేయ యుద్ధం (1949) రంగస్థలం మీద స్వైర విహారం చేసిన పౌరాణిక నాటకాలలో కొన్ని.

కణ్వశ్రీగారి ఆనాడు (1948) అజాతశత్రు (1948) కోటగిరి వెంకటకృష్ణారావు గారి పాదుషా పరాభవం (1943) మొదలైన చారిత్రక నాటకాలు ప్రేక్షకుల అభిమానాన్ని దోచుకొన్నాయి.

## ముద్దుకృష్ణ అశోకం, టీ కప్పులో తుపాను

సుప్రసిద్ధ పౌరాణిక కథను హేతువాద దృక్పధంతో పరిశీలించి భిన్నమైన వ్యాఖ్యా నంతో అశోకం అనే నాటకాన్ని రాసి, సంప్రదాయవాదుల ఆగ్రహానికి గురైన ముద్దు కృష్ణగారి కలం నుండి ఈ దశాబ్దిలో రెండు హాస్య ప్రధాన సాంఘిక నాటకాలు వెలువడటం విశేషం, టీ కప్పులో తుపాను (1940) అనే నాటకం ఆ రోజుల్లో విరివిగా ప్రదర్శించబడింది. ప్రేమించిన అమ్మాయిని పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు కొడుకు. తండ్రి పూర్వాచార పరాయణుడు కావడం వల్ల ఆ మాట తండ్రి చెవిని వెయ్యడానికి జంకుతూ వుంటాడు. అతని పిరికితనాన్ని పసిగట్టిన ప్రియురాలు తనే చొరవ తీసు కుని మామగారిని తన వాక్చాతుర్యంతో బుట్టలో వేసుకుని, ప్రేమ వివాహానికి మార్గం సుగమం చేస్తుంది. అలాగే ముద్దుకృష్ణ రాసిన అడయికప్ప పిళ్ళై (1940) నాటకం కూడా పూర్తిగా హాస్యరచన. బీమా ఏజెంటు రావు నీరసంగా మందకొడిగా సాగుతున్న తన వ్యాపారాన్ని వృద్ధిపరుచుకోవడానికి ప్రభావతి అనే వేశ్య సహాయం

తీసుకుంటాడు. తన స్వార్థ ప్రయోజనం కోసం అమెను తెచ్చుకుంటే ఏకుమేకై కూచుంటుంది పాలసీ తీసుకోవడానికి వచ్చిన పిల్ల జమిందారును వల్లో వేసుకుని తన వ్యవహారం చక్కబెట్టుకొంటుంది ప్రభావతి. రావు సమస్య మళ్ళీ మొదటి కొస్తుంది. ఈ నాటకంలో సన్నివేశగత హాస్యమూ, సంభాషణ గతహాస్యమూ రెండూ పుష్కలంగా ఉన్నాయి ప్రదర్శన ఆద్యంతమూ గిలిగింతలు పెడుతుంది. బోయి భీమన్న గారి పాలేరు (1947) వ్యవసాయ కూలీల దుర్భర జీవితాలను ప్రతి బింబి స్తుంది. కోడూరు రాఘవగారి 'సాని సంసారి' వైవాహిక జీవితంలో అనైతిక కోణాన్ని తులనాత్మకంగా విశ్లేషించి వివరించే నాటకం.

## గోపాలరాయశర్మ 'ఎదురీత' నాటకం

కులాంతర వివాహం చేసుకున్నవారిని సంఘంలో ఎదుర్కొనే సమస్యలు కొండముది గోపాల రాయశర్మ గారి ఎదురీత (1947) నాటకంలో సహజసుందరంగా చిత్రించబడ్డాయి. సమస్యలను ఎదుర్కోగల మనస్థైర్యం, పట్టుదల, సంయమనం వుంటే తప్ప అలాంటి కులాంతర వివాహం చేసుకున్న వారు ఏటికి ఎదురీదవలసి వస్తుందనీ, అటువంటి ఓర్పూ, దృఢ నిశ్చయం గల వారు ఏ పనైనా సాధించగలరని వ్యక్తం చేస్తుంది ఈ నాటకం.

ఈ దశాబ్దిలో నాటికా రచన కూడా పుంజుకొంది. శ్రీయుతులు బుచ్చిబాబు, నార్లవెంకటేశ్వరరావు, పులుగుండ్ల రామకృష్ణయ్య, పి.వి. రాజమన్నార్, కొప్పరపు సుబ్బారావు భమిడిపాటి కామేశ్వరరావు, జివి కృష్ణారావు ప్రభృతులు కొన్ని మంచినాటికలు అందించారు.

## బుచ్చిబాబు అత్యుత్తమ రచన 'తిష్యరక్షిత'

తిష్యరక్షిత (1943) బుచ్చిబాబుగారి రచన. అశోకచక్రవర్తి అర్ధాంగి సవతి కొడుకు కునాళుని కామించి వెంటబడుతుంది. అతనిచే తిరస్కరింపబడి, అతని కళ్ళు పీకించి కక్ష తీర్చుకుంటుంది. విచారణ జరిపి అశోకుడు ఆమెకు శిక్ష విధిస్తాడు. మరణదండన అమలు పరచకముందే తిష్యరక్షిత ఆత్మహత్య చేసుకుని మరణిం

చడం ఈ నాటికలోని ఇతివృత్తం. సాహితీ మూల్యం వున్న ఒక మంచి నాటిక వయోవృద్ధులు, యవ్వనోద్రేకంలో వున్న యువతులను పెళ్ళాడితే కోర్కెలు చల్లారక స్త్రీలు అనుభవించే మానసిక వ్యధ, విషయవాంఛలు తీరక వారు పడే తపన ఈ నాటికలో చిత్రితమైంది. కోర్కెలు ఈడేరనపుడు కట్టుబాట్లు తెంచుకొని, వావివరసలు మరచి నైతిక ధర్మాన్ని ఎలా విస్మరిస్తారో, ఎలాంటి తెగువ చూపిస్తారో సాంఘిక ధర్మాల మీద ఎలా తిరుగుబాటు చేస్తారో తిష్యరక్షిత పాత్ర ద్వారా విశదం చేశారు రచయిత.

## గ్రామీణ జీవితాన్ని తెలుగుతనాన్ని ముమ్మూర్తులా ప్రతిబింబించిన నార్ల నాటికలు

తెలుగులో నాటికా రచనకు బలమైన పునాదులు వేసినవారిలో నార్ల వెంకటేశ్వరరావు గారొకరు. 1940-50 మధ్య కాలంలో సుమారు 20 నాటికలు రచించారు. గ్రామీణ జీవితాన్ని నేపథ్యంగా తీసుకుని తెలుగుతనం ఉట్టిపడేలా రచించించడం నార్ల రచనా విధానంలోని ప్రత్యేకత. పల్లె ప్రాంతాలలో సాధారణ రైతు కుటుంబాల ఆర్థిక దుస్థితి, వారి కోర్కెలు, వైఫల్యాలు, భవిష్యత్తు మీద పెన వేసుకునే ఆశాలతలు, ఈ చక్రభ్రమణంలో తల్లడిల్లిపోయే రైతు కుటుంబాల దైన్య స్థితిని నార్లవారు చిత్రించినంత హృదయంగమంగా (నాటికలకు సంబంధించినంత వరకు) ఈ దశాబ్దంలో ఏ రచయితా వ్రాయలేదంటే అతిశయోక్తి కాదు.

## నార్లవారి నాటిక 'పైపంట'

పంట చేతికొస్తే రైతుకి పండుగ .ఎండనకా వాననకా కష్టించి పని చేసినందుకు భూదేవి యిచ్చే ఫలితం అది. ఆ పంట అమ్మి ఆ డబ్బుతో ఇంటిల్లిపాదినీ సంతోష పరచాలని కలలు కంటాడు. కాని పంట యింటి దాకా రాకముందే చేసిన అప్పులు తీర్చడానికి ఆ పంట సరిపోతుంది. రిక్తహస్తుడై నిలుస్తున్నాడు రైతు. చిన్న పిల్లల కోరికలు కూడా నెరవేర్చలేక పోతాడు. మరి వారి కోర్కెలు తీరేదెప్పుడు? పై పంట వచ్చినపుడు! పై పంట కోసం అన్ని కోరికలు వాయిదా పడతాయి. ఇదే నార్లవారి 'పై పంట'.

## పై పంట నాటిక ఇతివృత్తం

ఈ కథ ఒక్క తెలుగు ప్రాంతానికే కాదు. ఈ దేశంలో ఏ ప్రాంతానికైనా వర్తిస్తుంది. కూతురు రోగంతో మంచానపడి అటో యిటో అని క్షణాలు లెక్కపెడుతున్న సమ యంలోకూడా కర్మ సిద్ధాంతాన్ని పట్టుకు దేవులాడే ఛాందసుని నిష్క్రియాపరత్వానికి రూపకల్పన'ప్రారబ్ధం' నాటిక. పాతతరం భావాలకు కొత్తతరం ఆలోచనలకు సంఘర్షణ 'కొత్తగడ్డ' (1947) నాటిక. మారుతున్న కాల పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని కొత్తతరంతో పాతతరం రాజీపడటం అనివార్యమని వివరిస్తుంది. కొత్తగడ్డ నాటిక. ఒళ్ళు ముక్కలు చేసుకుని అరవ చాకిరీ చేసి పైసా పైసా కూడబెట్టి పట్నంలో చదువుకొంటున్న కొడుక్కి పంపిస్తే, డబ్బు మంచినీళ్ళ ప్రాయంగా ఖర్చుపెడుతూ తల్లి జీవితంలో చీకటి మిగిల్చిన తనయుని కథ: ద్రోహం' నాటిక, పల్లెటూరి మామగారిని బుట్టలో వేయబోయి బస్తీ అల్లుడు భంగపాటు పడటం'భంగపాటు' నాటికలో లలిత హాస్యంతో చిత్రించబడింది. చిన్న కుటుంబాలలో ఎవరికైనా ఒక చిన్న ఆపద కలిగినపుడు తమలో వున్న వైషమ్యాలను ప్రక్కకు నెట్టి ఎలా ఆప్యాయతల వర్షం కురిపిస్తారో, ఆ రసాత్మక సన్నివేశానికి ఒక అక్షరమాలిక.

## గ్రామ రాజకీయాలపై 'ఏకాభిప్రాయం'

ప్రజల మనస్తత్వాన్ని 'వంతెన' నాటికలో మనోజ్ఞంగా చిత్రించారు. గ్రామ రాజకీయాలు ఒకరి మీద ఒకరు కక్షలు తీర్చుకోవడానికే పరిమితమౌతున్నాయి. వారి ఊరికి ఉపకారం చేయడానికి కాదు. ఒక మనిషికి కీడు చెయ్యడానికి గ్రామస్తుల్లో ఏకాభిప్రాయం కుదిరినంతగా, మేలు చేయడంలో ఏర్పడదు. ఇదే 'ఏకాభిప్రాయం' నాటిక. మొత్తం మీద నార్లవారి నాటికలు సాహిత్య దృష్ట్యా, ప్రయోగ దృష్ట్యా, పరిశీలించినపుడు ప్రారబ్ధం, కొత్తగడ్డ, ద్రోహం, ఏకాభిప్రాయం, వంతెన ఉత్తమ నాటికలుగా నిలబడగలవు అది నార్ల వారి నాటికల విశిష్టత.

## తుపాన్ రేపిన పులుగుండ్ల 'తుపాను' నాటిక

ఒకే ఒక నాటికను రాసి నాటకరంగంలో ప్రఖ్యాతిపొంది ప్రత్యేకత గడించిన వారు పులుగుండ్ల రామ కృష్ణయ్య గారు. వీరు రాసిన తుపాన్ నాటిక 1948లో వెలువడింది. అబ్బాయి ప్రేమించిన అమ్మాయి, తండ్రి సంబంధం కుదిర్చిన అమ్మాయి ఒక్కరే అని తెలియక తండ్రి చివరికి అసలు విషయం తెలుసుకుని ఆనందించడం 'తుపాను' కథ దీనిలో రాఘవరెడ్డి ప్రేక్షక హృదయాల్లో శాశ్వతంగా నిలిచిపోయే పాత్ర. నెల్లూరు మాండలికంలో వ్రాయబడిన మొట్టమొదటి నాటికగా నాటకరంగంలో ఒకప్రత్యేక స్థానాన్ని సంపాదించుకుంది.

## అద్భుతమైన అల్లీ మురా గేయ నాటిక

తెలుగు నాటక సాహిత్యంలో ప్రప్రథమంగా గేయసంగీత నాటికను వ్రాసిన ఘనత కొప్పరపు సుబ్బారావు గారి అల్లీమురా (1944) అనే పేరుతో వీరు రచించిన గేయరూపకం చాలా చోట్ల ప్రదర్శింపబడి బహుళ ప్రచారం పొందింది. 1950 నాటికి వెయ్యి ప్రదర్శనలకు పై బడ్డదని కె.వి. గోపాలస్వామిగారు' ప్రసిద్ధ నాటికలు' పీఠికలో పేర్కొన్నారు. మారుతున్న సామాజిక విలువలకు, లోకరీతికి అద్దం పడుతుంది. అల్లీమురా బృందగానంతో విషయ వివరణ చేసే తీరు ఆసక్తికరంగా వుంటుంది. పొట్ట గడవక దారి దోపిడీ చేసే రాత్రి దొంగలకన్నా పట్టణాల్లో ప్రజలను దోచుకుతినే పెద్ద మనుషులు, పగటి దొంగలు ప్రమాదకారులని వ్యంగ్యంగా చెప్పబడింది ఈ నాటికలో.

## రాణించిన రాజమన్నారు 'ఏమిమగవాళ్ళు'

పాకాల వెంకట రాజమన్నారుగారు 1946-48 ప్రాంతాలలో కొన్ని చక్కని నాటికలు, వ్రాశారు. వాటిలో ఏమి మగవాళ్ళు, నిష్ఫలం, నాగుబాము, పరకీయ అనే నాలుగు నాటికలు ప్రదర్శన సౌలభ్యం కలిగిన రచనలు. రాజమన్నారు గారి రచనల్లో అత్యధిక భాగం స్త్రీ సమస్యాత్మకాలు కావడం గమనించదగిన అంశం. నిజానికి భిన్న కోణాల నుంచి స్త్రీ సమస్యలను స్పృశించిన తొలినాటికా కర్త రాజ మన్నారు గారేనని చెప్పడం సత్యదూరం కాదు.

వేశ్యలను, వేశ్యావృత్తిని అసహ్యించుకునే మగజాతి అవకాశం దొరికితే వేశ్యా సంపర్కానికి అర్రులు చాచటం వారి మన ప్రవృత్తిలో దాగివున్న సహజ గుణం అనే భావ వ్యక్తీకరణతో కూడిన నాటిక 'ఏమి మగవాళ్ళు' ఎదుటివారి ప్రవర్తనను, సంస్కారాన్ని అంచనా కట్టేముందు మనలోని సంస్కారం ఏపాటిదో ఆత్మవిమర్శ చేసుకోవలసిన ఆవశ్యకత వుందని ప్రబోధిస్తుంది ఈ నాటిక. వేశ్యలకు ప్రేమాభిమానాలు త్యాగనిరతి ఉండవనీ నిరసిస్తుందీ సంఘం కాని అవి నిష్ఫలాలని విశదీకరిస్తుంది నిష్ఫలం నాటిక (1946) జమిందారు రంగారావు ఉంపుడుకత్తె చిత్రరేఖ వృత్తి రీత్యావేశ్య అయినా నీతి, నిజాయితీలకు కులాంగనకు తీసి పోదు. జమీందారును అప్పుల వాళ్ళు పీడిస్తున్నారని తెలుసుకుని తన సర్వస్వం ధారబోసి అతనిని రుణ విముకుణ్ణి చేస్తుంది కాని ఏం లాభం? ఆమెపట్ల కృతఘ్నత చూపి ఆమె ను నిస్సహాయంగా విడిచి తన దారిన వెళ్ళిపోతాడు ఆ జమీందారు. చిత్రరేఖకు రంగారావు భార్యకు మధ్య జరిగిన వాగ్యుద్ధం నిష్ఫలం నాటిక అంతరార్థాన్ని ప్రస్ఫుటం చేస్తుంది.

## నలుగురూ మెచ్చిన 'నాగుబాము' నాటిక

నాగుబాము నాటిక బుచ్చిబాబుగారి తిష్యరక్షితను గుర్తు చేస్తుంది. తిష్యరక్షిత నిషిద్ధ ప్రణయాన్ని ఆక్షేపిస్తుంది. తిరస్కృతిని పొంది, ప్రేమను పగగా మార్చుకొని, ప్రతీకారం చేసి పర్యవసానంగా చివరికి తానే భస్మమవుతుంది. కానీ ఈ నాటికలో నాగసుందరుని ప్రేమించిన జయశ్రీ అతనిచేత తిరస్కరింపబడినప్పటికీ, ఆపత్సమయంలో ప్రియుడి ప్రాణాల్ని కాపాడేందుకు తన ప్రాణాలర్పించి త్యాగంతో అమరత్వం పొందుతుంది. ప్రతీకారవాంఛతో పాపపుటంచుల్లోకి ఎగబ్రాకి సానుభూతితో అపారంగా సానుభూతిని సంపాదించుకొంది. జయశ్రీ, రాజమన్నారు గారు అందంగా నగిషీలు చెక్కిన రమణీయ దృశ్యకావ్యం నాగుబాము. ప్రేమ తత్వానికి సంబంధించిన నాటిక.'పరకీయ' మోహం తాత్కాలికం, ప్రేమ శాశ్వతం అనే ప్రాతిపదిక మీద నిర్మించిన నాటిక యిది. స్త్రీకి, స్త్రీయే శత్రువని చాటిచెప్పే నాటిక 'దయ్యాల లంక'.

## అన్నీ సందేశాత్మక నాటికలే

రాజమన్నారు గారి నాటికలన్నీ సందేశాత్మకాలు. కేవలం హాస్యం కోసం వ్రాసిన వైకుంఠాచార్యులు అనే నాటికలో కూడా అలాంటి దొంగ భక్తుల్ని చూసి మోసపోవద్దు అనే సందేశం ఉంది. రాజమన్నారు నాటికలలో మృదువైన సంభాషణలు, సంఘటనల కుదింపు వల్ల ఏర్పడే వేగం, సంక్షిప్తత, సందేశ గౌరవం, మొదలైనవి వీరి నాటకాల్లో సాధారణంగా కన్పించే లక్షణాలు, నాటికకున్న చిన్న పరిధిలోనే పాత్రల నిండుతనాన్ని ఆవిష్కరించే శిల్ప చాతుర్యం రాజమన్నారుగారిలో వున్న ప్రత్యేకత. వీరి నాటికల ముగింపు అనూహ్యంగా అద్భుతంగా వుంటుంది. మాతృప్రేమ, విముక్తి ,నాగుబాము, సంకల్పం, పర్యవసానం,చక్కని ఉదాహరణలు

## హాస్యరసాన్ని పండించిన భమిడిపాటి నాటికలు

తొలినాటికాకర్తలలో ప్రసిద్ధులు భమిడిపాటి కామేశ్వరరావుగారు. 1923 నుంచీ ప్రహసనాలు, నాటికలు సుమారు 40 దాకా వెలువరించారు. వీరి రచనలు హాస్య రసభరితాలు. అందుచేతనే వీరికి హాస్యబ్రహ్మ బిరుదు సార్థకం. భమిడిపాటి వారి స్వతంత్ర రచనలు అత్యల్పంకాగా అనుసరణలు 80 శాతం వుంటాయి. మేటం లింక్, మోలియర్, షెరిడాన్, గోల్డ్‌స్మిత్, రచనలకు అనువాదాలు అనుసరణలు వీరి రచనలు. భాసుని సంస్కృత నాటకాలను కూడా అనువదించారు. తెలుగు నాటక సాహిత్యంలో ఇన్ని అనువాద గ్రంథాలను రచించిన వారు భమిడిపాటివారే అనవచ్చు. ఎప్పుడూ యింతే, కచటతపలు, బాగుబాగు వీరి స్వతంత్ర్య రచనలు. రంగస్థలం మీద విరివిగా ప్రదర్శింపబడినవి కూడా వీరి స్వతంత్ర రచనలే ! సుంకర పిరెడ్డి గార్ల నాటకాలను భూస్వాముల దౌర్జన్యాలు కష్టజీవుల కడగళ్ళు జీవధార, కొడాలి గోపాలరావు నాటకాలకు వస్తువు వివాహం కావడం ఒక సాధారణ లక్షణం.

దశాబ్దిలో భమిడిపాటి వారి కలం నుంచి 5 నాటికలు వెలువడ్డాయి. అన్నీ అనుసరణలే, ఇతివృత్తం వివాహమే ! ఆ నాటికలు పెళ్ళి ట్రయినింగ్ (1946), నామాటే నెగ్గింది, రెండు రెళ్ళు నాలుగు, ఎవళ్ళ గొడవ వాళ్ళది, పెండ్చి కంట్రోల్(1949).

## హేతువాద నాటక రచయిత జి.వి. కృష్ణారావు

డా. జి వి కృష్ణారావుగారి ఆదర్శశిఖరాలు (1949) పేర్కొనదగిన నాటిక. మహాశిల్పి జక్కన కుమారుడు (కేదారుడు) తండ్రి చెక్కిన శిల్పంతో దోషం చూపించిన ఫలితంగా రాజు తన ప్రతిష్ట నిలుపుకోవడానికై జక్కన చేతులు నరికించడం, కేదారుని పశ్చాత్తాపం, ఈ నాటికలో హృదయంగమంగా చిత్రించబడింది. హేతువాద దృక్పథంతో నాటికలు వ్రాసిన వారిలో జి.వి కృష్ణారావు గారొకరు వీరి నాటికలు ఆలోచనాత్మకాలు. కానీ వీటిలో ప్రదర్శన విలువలు లేనందు వల్ల రంగస్థల నాటికలుగా రాణించకపోయాయి అందుకు ప్రయత్నించిన ఔత్సాహిక సమాజాలు కూడా వున్నట్లు కనబడవు.

బెజవాడ గోపాలరెడ్డి గారు విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ రచించిన చిత్రాంగద కచదేవయాని, విసర్జన వంటి నాటకాలను ఆంధ్రీకరించారు. కాని ఆ నాటకాలు రంగస్థలం మీద ప్రదర్శించబడిన ఆనవాళ్ళు మృగ్యం.

## ఎన్నో నాటకాలు వెలువడిన దశాబ్దం

ఆంధ్రనాటక రంగం 1950-60 సంవత్సరాల మధ్య శరవేగంతో పురోగమించింది. ఈ దశాబ్దిలో సుమారు 300 నాటకాలు, 500 నాటికలు వెలువడి ఆంధ్ర నాటక ప్రాశస్త్యాన్ని దిగంతాలకు విస్తరింపజేసాయి. ఇన్ని నాటికలు మరే కాలంలోనూ రాలేదనటం నిర్వివాదాంశం.

## జాతి చైతన్యానికి జేజేలు పలికిన మేటి నాటక రచయితలు

ఈ దశాబ్ది ఎందరోకొత్త రచయితలు వెలుగులోనికి వచ్చారు. అట్టివారిలో కణ్వశ్రీ, కొడాలి గోపాలరావు, కొర్రపాటి గంగాధరరావు, బెల్లంకొండ రామదాసు, రాచకొండ విశ్వనాథశాస్త్రి , పినిశెట్టి శ్రీరామమూర్తి, కె.ఎల్. నరసింహారావు, భమిడిపాటి రాధాకృష్ణ అవసరాల సూర్యారావు, షేక్ నాజర్, డివి నరసరాజు, ప్రఖ్య శ్రీరామమూర్తి, కావ్యశ్రీ, కారెపు అప్పలస్వామి, యన్ ఆర్. నంది, రావి కొండలరావు,

అనిసెట్టి సుబ్బారావు, ముదిగొండ లింగమూర్తి, రెంటాల గోపాలకృష్ణ, గన్నిశెట్టి వెంకటేశ్వరరావు, సోమంచి యజ్ఞన్న శాస్త్రి ప్రభృతులు ముఖ్యులు వీరందరు వైవిధ్యంగల రచనలతో కళాక్షేత్రంలో బంగారు పంటలు పండించారు.

## గద్యపద్యాత్మక నాటకాలూ అనువాదనాటకాలూ

ఈ కాలంలో వచ్చిన నాటకాలలో అధికభాగం సాంఘిక నాటకాలే అయినప్పటికీ, సంప్రదాయ పద్ధతిలో గద్య పద్యాత్మకంగా సుమారు 50 పౌరాణిక, జానపద, చారిత్రక నాటకాలు కూడా వెలువడక పోలేదు.

ఇంతేకాకుండా ఇతర భాషలనుంచి ఆంధ్ర నాటక సాహిత్య ప్రవంతిలో వచ్చి కలిసిన అనువాద, అనుసరణ నాటకాలు సుమారు 60 దాకా ఉన్నాయి. ఈ అనువాద నాటకాలలో కొన్ని స్వతంత్ర నాటకాల కంటే ఎక్కువ పేరు ప్రఖ్యాతులు గడించడం పరిశీలనార్హం. ఈ దశాబ్దానికి పూర్వం కానీ తర్వాత కానీ అనువాద నాటకాలకు ఇంత గుర్తింపు, ప్రశస్తి రాలేదనటం కూడా సత్యదూరం కాదు.

## దోపిడీ దౌర్జన్యాలను వ్యతిరేకించిన నాటకాలు

దాస్య విమోచనతో భారత దేశానికి మంచి రోజులు వస్తాయని, సగటు మనిషి జీవన విధానంలో ఎన్నో మార్పులు వస్తాయని, ఇక సమస్యలు విడిపోతాయని ఆశించిన ప్రజలకు 1947 తర్వాత నిరాశే మిగిలింది. బలహీనులపై బలవంతుల దౌర్జన్యాలు, దోపిడీ సాగుతూనే వుంది. సన్నకారురైతుల మీద, వ్యవసాయ కార్మికుల మీద గ్రామీణ ప్రాంతాలలో జరుగుతున్న అన్యాయం, నిరక్షరాస్యుల అజ్ఞానాన్ని ఆసరా చేసుకుని వారి మీద స్వారీ చేసే భూకామందుల, పెత్తందార్ల ఆగడాలు పెచ్చు పెరిగిపోయాయి. ఈ పరిస్థితుల్ని చూసి హృదయం ద్రవించి, ఆవేశపూరితులైన కొందరు రచయితలు ప్రజలలో చైతన్యం, ప్రభుత్వానికి కనువిప్పు కలిగించాలనే సంకల్పంతో ముందుకు వచ్చి శక్తి వంతమైన నాటకాలు రాశారు. ఈ దశాబ్దంలో అలాంటి నాటకాలు రాసిన వారిలో శ్రీయుతులు కణ్వశ్రీ, బోయిభీమన్న, సుంకర వాసిరెడ్డి, పడాల రామారావు, బిఎన్. సూరి, షేక్ నాజర్, పినిశెట్టి శ్రీరామమూర్తి ప్రముఖులు.

## ప్రభోదాత్మక నాటకం 'ఇదా ప్రపంచం'

కణ్వశ్రీ గారి 'ఇదా ప్రపంచం' 1950లో వెలువడింది. ఆ రోజుల్లో సంచలనాత్మక నాటకంగా పేరు తెచ్చుకుంది పల్లెప్రాంతాలలో భూస్వాములు పేద రైతులకు అప్పులిచ్చి వారిని తమ కబంధహస్తాలలో ఇముడ్చుకుని లొంగతీసుకోవాలని యత్నించడం, తిరగబడ్డ వారిని తమ కర్కశపాదాల కింద అణగద్రొక్కేయడం ఈ నాటిక ఇతివృత్తం. మనిషిని మనిషి వేటాడి చంపి తినే మనుషులు కార్యోన్ముఖులు కావాలి అనే ఆర్తనాదం. ప్రభోధం ,పిలుపు ఈ నాటకంలో ప్రధానంగా ధ్వనిస్తుంది. సమస్యకు పరిష్కారం చూపకపోయినా సమస్యలో అంతర్లీనంగా వున్న తీవ్రతను వేడిని బలమైన సన్నివేశాల ద్వారా ప్రేక్షకుల రక్తనాళాల్లోకి అందించి ఆలోచింప చేయడంలో కృతకృత్యులయ్యారు రచయిత. కణ్వశ్రీ మాయాబజారు (1953) అనే పౌరాణిక నాటకాన్ని బాలనాగమ్మ (1950) జానపద నాటకాన్ని కూడా రచించారు. ఇవి రెండూ సుప్రసిద్ధ నాటకాలే.

## రైతు జీవితానికి దర్పణాలు కొడాలి నాటకాలు

కొడాలి గోపాలరావుగారు రచించిన పేద రైతు నాటకంలో (1952)పెద్ద భూస్వాముల చేతుల్లో పేద రైతులు పడే కష్టాలు చిత్రించబడ్డాయి. అనుభవం నేర్పిన పాఠంతో పేద రైతులు చైతన్యవంతులై తిరుగుబాటు చేసి విజయం సాధించినట్లు చూపించడంలో ఒక వ్యక్తి సాధించలేని పనిని సమష్టిగా సాధించవచ్చునని, నేటి సమాజంలో అనేక దుండగాలను అరికట్టడానికి ఇదే మార్గమని హితబోధ యిమిడి ఉంది. కొడాలి వారి నాటకాలలో సహజమైన సంభాషణలు, సన్నివేశ కల్పనలో బిగువు, భావప్రకటలో సారళ్యం, కధాగమనంలో వేగం పండిత పామరుల్ని అలరిస్తాయి. కొడాలివారి నాటకాలలో అత్యధిక భాగం గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబించేవి కావడం విశేషం. రచనలో తెలుగు నుడికారం, తెలుగుతనం ద్యోతకమవుతుంది. ఊత పదాలతో హాస్యాన్ని ఉత్పత్తి చేయడం

ఈయనకు సరదా. కూలి (1953), తిరుగబాటు (1954)నాటకాలు కూడా రైతు జీవితానికి దర్పణాలు.

## మానవత్వం మూర్తీభవించిన 'దొంగవీరడు'

ఆస్తికోసం రక్తస్పర్శను కూడా ఖాతరు చెయ్యకుండా స్వార్థం వైపు యజమాని సాగిపోతుంటే ఒక దొంగ మానవత్వం వున్న మనిషిగా నిలబడి ఆ ప్రమాదాన్ని నివారించడం దొంగవీరడు (1958) నాటకంలో కథావస్తువు. నాటక పోటీలలో విస్తృతంగా ప్రదర్శించబడి గోపాలరావుకు ఖ్యాతి తెచ్చిపెట్టింది ఈ నాటకం. లంకెలబిందెలు నాటకం ఎ శివరామిరెడ్డిగారి దర్శకత్వంలో ప్రదర్శితమై ప్రశంసలు అందుకొంది

## మరికొన్ని సమస్యాత్మక నాటకాలు

బోయి భీమన్నగారి కూలిరాజు (1951) వాసిరెడ్డి భాస్కర రావుగారి పోతుగడ్డ (1953) సుంకరగారి భూమికోసం (1953) పి.లక్ష్మీకాంత మోహన్‌గారి సమ్మెపిలుపు, బి యన్. సూరిగారి రైతు భూమి (1953) నాటకాలు బలహీనులు సంఘటిత శక్తితో తమ సమస్యల్ని పరిష్కరించుకొన్న ఉదంతాలను ప్రస్ఫుటం చేస్తాయి.

## ప్రజలను ఉర్రూతలూగించిన పినిశెట్టి నాటకాలు

గ్రామీణ జీవితాన్ని నేపథ్యంగా తీసుకుని నాటకాలు వ్రాసిన వారిలో పినిశెట్టి శ్రీరామమూర్తిగారు ప్రముఖులు. వీరు రచించిన పల్లె పడుచు (1950) ఆంధ్రనాటక రంగ స్థలం మీద నిగ్గుతేలిన మంచి నాటకాలలో ఒకటి. పేరు వినగానే పల్లెపడుచు చుట్టూ పరిభ్రమించే కథ అనుకోవచ్చు. కాని ఇందులో ఇతివృత్తానికి పల్లె పడుచు అనే పేరుకి అంతగా సమన్వయం కుదరదు. గ్రామీణ ప్రాంతంలో నీతికి మంచితనానికి కట్టుబడిన ఒక పేదరైతు అనుభవించే కష్టాలకు యిందులో ప్రాధాన్యం యివ్వబడింది. తమకు దగ్గర బంధువైన ఒక స్వార్థపరుడి చేతిలో కుటుంబం ఛిన్నాభిన్నం కావడం, చివరికి కష్టాల కడలినుంచి బయట పడటం ఇది నాటకంలో కథ.

## ఏడుసార్లు పునర్ముద్రణ పొందిన 'పల్లెపడుచు'

నాటకం 8 రంగాలతో వున్నప్పటికీ రంగాలు చిన్నవిగా వుండటం చేత ప్రదర్శన వేగంగా సాగిపోతుంది. నాటకంలో పల్లెటూరి వాతావరణ చిత్రణ (నేటివిటీ), ఏడెనిమిది పాటలు, మెలోడ్రామా, హాస్యం, శృంగారం వీటన్నిటి మేళవింపు తగుపాళ్ళలో వుండటం చేత సమగ్ర నాటకం (టోటల్ థియేటర్) రూపంలో జనబాహుళ్యానికి ఈ నాటకం బాగా దగ్గరైంది 1950లో కాకినాడలో ఆంధ్రనాటక కళాపరిషత్తు నాటక పోటీలలో ప్రథమ బహుమతి పొందింది. 7 సార్లు ఈ నాటకం పునర్ముద్రణ పొందిందంటే దీనికి లభించిన ప్రజాదరణ గురించి ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు.పల్లెపడుచు నాటకానికి టిక్కెట్లు పెట్టి ప్రదర్శించేవారు పినిశెట్టి శ్రీరామమూర్తి గారు పల్లెపడుచు నాటకంలో ఒక నూతనాధ్యాయాన్ని సృష్టించారు' ' ఔత్సాహిక నాటకానికి ప్రొఫెషనల్ స్టేటస్‌ని ఈ నాటకం ద్వారా సృష్టించగలిగారాయన. ఆ తరువాత ఆయన సినిమా రంగానికి వెళ్ళిపోకుండా వుంటే నాటకరంగానికి ఈ స్టేటస్‌ని పటిష్టపరచడానికి తప్పక కృషి చేసి వుండేవారు అన్నారు ఒకచోట చాట్ల శ్రీరాములుగారు. (నూరేళ్ళ తెలుగు నాటకం ప్రదర్శన రీతులు పే. 39.)

## అందర్నీ ఆకట్టుకున్న అన్నాచెల్లెలు

పెద్దలు కుదిర్చిన పెళ్ళిళ్ళకంటే మనసులు కలిసిన ప్రేమ బలవత్తర మైందనీ, మనసులు కలిసినపుడే సంసారం సుఖమయం అవుతుందనీ, కట్టుబాట్లు సంప్రదాయాల పంజరంలో నేటి యువతరాన్ని బంధించలేమని ప్రబోధించే నాటకం పంజరంలో పక్షులు కూడా పినిశెట్టి గారి నాటకమే. కాని ఇది పరిమిత సంఖ్యలోనే ప్రదర్శించడినట్లు తెలుస్తుంది. పినిశెట్టిగారి అన్నాచెల్లెలు(1952) ప్రసిద్ధ నాటకం. నేటి సమాజంలోని ఆర్థిక అసమానతల వల్ల ఆశలు ఒకవైపు అనుభవాలు ఒకవైపు తిరోగమిస్తుంటే జీవన పోరాటంలోపడి నలిగిపోతున్న మధ్య తరగతి కుటుంబంలోని వ్యక్తులు, వారి దయనీయ పరిస్థితులు, చెదరిపోతున్న అనుబంధాలు, సడలిపోతున్న ఆత్మవిశ్వాసం ఈ నాటకంలో సహజ గంభీరంగా చిత్రించబడ్డాయి. శ్రీరామమూర్తి

గారి నాటకాలు పల్లె ప్రజలను విశేషంగా ఆకర్షించడానికి గల కారణం పల్లె ప్రజల ఆలోచనాస్థాయికి తగినట్టు రచన చేయడమే సంభాషణలు, సన్నివేశాలు పల్లెటూరి జీవితానికి అతి సన్నిహితంగా వుంటూ ఈ నాటకం మనదే అనే ఆత్మీయ జీవితానికి అతి సన్నిహితంగా వుంటూ, ఈ నాటకం మనదే అనే ఆత్మీయ భావాన్ని వారిలో కలిగింపచేయడమే. కులంలేని పిల్ల (1951) నాటకంలో వర్ణాంతర వివాహం చేసుకున్న కొడుకు మీద సనాతన పరుడైన తండ్రి కత్తిగట్టడం దాని పర్యవసానం ప్రేక్షకుల గుండెల్లోకి దూసుకుపోతూ కర్తవ్యబోధ చేస్తుంది.

పినిశెట్టి రాసిన ఆడది (1950) నాటికను ప్రదర్శించని హైస్కూలు గాని, కళాశాలగాని ఆ రోజుల్లో లేదని చెప్పవచ్చు. ఆడది లేకపోయినా సంసారం సవ్యంగా సాగిపోతుందనే అహంభావంతో వున్న మగవాడు, ఆ సమయం వస్తే ఎన్ని అగచాట్ల పాలవుతాడో ఆ పరిస్థితిని 'ఆడది' నాటికలో హాస్య స్ఫోరకంగా చిత్రించారు రచయిత. ఈ నాటికలో స్త్రీ పాత్ర లేకపోవడం విశేషం.

## పతిత జీవితానికి అద్దం పట్టిన పునర్జన్మ

గడచిన దశాబ్దిలో స్త్రీ సమస్యలపై పెక్కు నాటికలొచ్చాయి. 50వ దశాబ్దిలో నాటికలే గాక నాటకాలు కూడా గణనీయ సంఖ్యలో వచ్చాయి. వాటిలో తొలుత పేర్కొనదగినది బెల్లంకొండ రామదాసుగారి పునర్జన్మ (1956) నాటకం. కొన్ని పరిస్థితుల కారణంగా అవినీతి ఊబిలో చిక్కుకుని అధః పాతాళానికి క్రుంగిపోతున్న స్త్రీ, ఒక దశలో తానూ ఒక గృహిణిగా సాంసారిక జీవితం సాగించాలని ప్రయత్నించడంలో తప్పులేదు. అలాంటి స్త్రీ పట్ల సంఘం సానుభూతి చూపాలి. చేయూత నివ్వాలి. అలాంటి పతితల జీవితాలలో వెన్నెల కురిపించగల విశాల హృదయాలు ముందుకు రావాలి. అలాంటి స్త్రీలకు పునర్జన్మ ప్రసాదించాలని ఈ నాటకం సందేశమిస్తుంది.

నాకు కావాల్సింది నువ్వు. నీ గత చరిత్ర కాదు అనే విశాల హృదయంతో వివాహం చేసుకున్న యువకుడు ఒక దశలో పరులు చెప్పే మాటలు విని ఆందోళన చెందుతాడు. సంసారం చెయ్యడమా మానడమాఅనే సందిగ్ధంలోపడి ఊగిసలాడుతూ చివరకు పశ్చాత్తాపంపడి నిర్మలను స్వీకరిస్తాడు.

## దశాబ్దం పాటు సంచలనం కలిగించిన నాటకం

ఆశయాలు ఆదర్శాలు అనే ఆవేశంలో కొట్టుకుపోయే వయసులో మనోపరిపాకం లేని యువకులు కొందరు త్వరపడి నిర్ణయాలు చేసుకొంటారు. ఆచరణలో ఎదురయ్యే కష్టాల ధాటికి ఎదురు నిల్చి నిలదొక్కుకోగల సంయమన శక్తి ,స్థిర చిత్తం వారిలో కొరవడుతుంది. ఆ స్థితిలో కర్తవ్యాన్ని గాలికి వదిలేసి వెనక్కి తిరిగిపోయే యువకులు వుంటారు. తాము నమ్ముకొన్న ఆదర్శాలకుఆచరించగల చిత్తసంస్కారం కూడా వున్నప్పుడే సంస్కరణ వివాహాలు విజయవంతమవుతాయి. అలాంటి సంస్కారాన్ని దృఢచిత్తాన్ని అలవరచుకోవాలని పునర్జన్మ నాటకంలో రచయిత తన సందేశాన్ని బలంగా ప్రతిపాదించారు. ఒక దశాబ్దం పాటు ఈ నాటకం ప్రతి నాటక పరిషత్తు పోటీలలోను ప్రదర్శింపబడి రచయిత కీర్తిని ఇనుమడింపచేసింది

## విశ్వనాథ శాస్త్రి విప్లవాత్మక నాటకం 'తిరస్కృతి'

స్త్రీ సమస్య మీద ఈ కాలంలో వెలువడిన నాటకాలలో రాచకొండ విశ్వనాధ శాస్త్రి గారి తిరస్కృతి (1957) విప్లవాత్మక నాటకం. జీవితంలో ఒక గమ్యం, నీతి నియమాలు, మానవత్వం యివేవీ లేకుండా, స్త్రీని భోగవస్తువు కింద జమకట్టి విశృంఖలంగా విహరించే శ్రీమంతుడైన ఒక యువకుని వలలో చిక్కుకుని మోసపోతుంది ఒక పడుచుపిల్ల. చీకటి తప్పు వెలుగులోకి వచ్చి తన బ్రతుకును భయపెట్టే తరుణం ఆసన్నమైందని తెలుసుకుని పెళ్ళి చేసుకోమని ఆ యువకుణ్ణి ప్రాధేయపడుతుంది. వేడి కన్నీళ్ళకు వేటగాడు కరగకపోగా కసిరికొడతాడు. దిక్కుతోచని పరిస్థితుల్లో ఆత్మహత్యే శరణ్యం అనుకొంటుందా పిల్ల. తన తండ్రి స్నేహితుడు అడ్డుపడి ఆమెకు ధైర్యం చెబుతాడు. మోసం చేసిన యువకుణ్ణి అదిలించి బెదిరించి ఆమెతో వివాహం జరిపించడానికి తీవ్రంగా ప్రయత్నిస్తాడు. కాని బలవంతంగా మోసగాడి చేత మూడు ముళ్ళు వేయించుకోవడానికి ఎదురుతిరిగి ఆ పెళ్ళి తిరస్కరిస్తుంది కామేశ్వరి. బ్రతుకు పోరాటం తన కుటుంబానికి కొత్త కాదనీ, తానూ కష్టాలకు ఎదురు నిల్చి బతకగలననీ ఆత్మస్థైర్యాన్ని ప్రకటించి

వెళ్ళిపోతుంది. 1980 ప్రాంతంలో తెలుగు సాహిత్యంలో స్త్రీవాదం ప్రవేశించింది. 1990 నుంచీ దాని ప్రభావం తెలుగు సాహిత్యం మీద కూడా ప్రసరించింది. అయితే 1957 నాటికే తిరస్కృతి నాటకంలో స్త్రీవాద ఛాయలుండటం గమనించదగిన అంశం.

## ప్రతిష్టాత్మక నాటకం ఇనపతెరలు

స్త్రీ సమస్యపై ఈ దశాబ్దంలో వెలువడిన నాటకాలలో ఇనపతెరలు (1950) సుప్రసిద్ధం. రోషనార, రాణాప్రతాప్, నూర్జహాన్ వంటి చారిత్రక నాటకాలను, తారాశశాంకం వంటి పౌరాణిక నాటకాలను గద్య, పద్య సహితంగా వ్రాసి ప్రేక్షకులను రంజింపచేసిన కొప్పరపు సుబ్బారావు గారు కాలానుగుణంగా సాంఘిక నాటకాలను, నాటికలను కూడా రచించారు. ఇనప తెరలు,జె.బి. ప్రీస్ట్లీ రచించిన యాన్ ఇన్‌స్పెక్టర్ కాల్స్ అనే నాటకానికి అనుసరణ అయినప్పటికీ రచనా శిల్పాన్ని బట్టి చూస్తే, పూర్తిగా స్వతంత్ర నాటకం అనిపిస్తుంది.

స్వార్థంతో కరడుగట్టుకుపోయిన ఈ సంఘంలో అనాథలు పడుతున్న కష్టాలు, కార్చే కన్నీళ్ళు, ఒక అనాథ జీవితం పతనమై పోవటానికి తామే కారకులం అని తెలిసి కూడా పశ్చాత్తాపపడని, ఒక కన్నీటి బొట్టయినా రాల్చని నరరూప రాక్షసుల మనస్తత్వం ఈ నాటకంలో శక్తిమంతమంగా చిత్రించబడింది. అసంఖ్యాకులైన అనాథలపై ఆర్థిక, సాంఘిక నైతిక రంగాలలో దోపిడీదార్ల నియంతృత్వానికి వ్యతిరేకంగా మానవాళి ప్రతీక ఈ నాటకం

## అఖండ జ్యోతిని తెచ్చిన అగ్రశ్రేణి నటవర్గం

కొప్పరపు వారి దర్శకత్వంలో ఈ నాటకం 1950లో కాకినాడలో జరిగిన ఆంధ్రనాటక కళాపరిషత్తు నాటకపోటీలలో రాఘవ కళాకేంద్రం వారిచే ప్రదర్శింపబడి బహుమతి పొందింది. శ్రీయుతులు కె. పార్థసారథి, వెంపటి రాధాకృష్ణ, పి. రామచంద్ర కాశ్యప, మాచినేని వెంకటేశ్వరరావు, డి.వి. నరసరాజు, వి. రామన్న పంతులు, ఎం.ఎస్. మూర్తి, కొంగర జగ్గయ్య, కె.వి.ఎస్.శర్మ, శ్రీమతి కొప్పరపు సరోజిని, శ్రీ మతి టి. సీతాలత వంటి ఉద్దండులైన నటీనటులు ఈ నాటకంలో పాత్రలు ధరించి నాటకానికి అఖండ ఖ్యాతిని సంపాదించి పెట్టారు.

ఆర్థిక అసమానతలు తొలగనంతకాలం, నైతిక విలువలు నీరసించి పోయిన ఏ కాలంలోనైనా కరుణాకుమారీలు, కరుణకుమారులు ఉండనే ఉంటారు అంతకాలమూ ఈ నాటకం కూడా సజీవమే.

## మనోధైర్యంతో నిలబడ్డ మనోరమ

యాన్ ఇన్‌స్పెక్టర్ కాల్స్ నాటకాన్ని చిన్నదిగా కుదించి' చావకూడదు' అనే పేరుతో అన్నీ స్త్రీ పాత్రలతో ఒకనాటిక రాశారు. 1959 ప్రాంతంలో వెలువడిన పి.వి. రాజమన్నారు గారి మనోరమ కూడా స్త్రీ సమస్యాత్మకమే. మిన్ను విరిగి మీద పడినా చలించని స్థిర చిత్తంతో, సడలిపోని విశ్వాసంతో పరిస్థితుల్ని ఎదుర్కోవడానికి సిద్ధపడే యువతిగా మనోరమ ఈ నాటకంలో సాక్షాత్కరిస్తుంది. మారుతున్న ఈ సమాజంలో స్త్రీ, పరిస్థితులతో రాజీపడే సహజశక్తిని అలవరచుకొంటేనే చాలదు. అవసరమైనపుడు అపరకాళికలా అవతారం దాల్చి సమస్యలను తానే పరిష్కరించు కోగల సాహసం ప్రదర్శించక తప్పదని హెచ్చరిస్తుంది ఈ నాటకం. స్త్రీ సమస్యల మీద వచ్చిన నాటకాలలో 'ఇబ్సన్ డాల్స్‌హౌస్' అనుసరణలు కొన్ని. వ్యక్తిత్వాన్ని చంపుకొని భర్త చేతిలో కీలుబొమ్మగానో, ఆటబొమ్మగానో పడి వుండటానికి సహించలేని ఒకయువతి అతనిని ఎదిరించి ఇల్లు విడిచి పోతుంది డాల్స్‌హౌస్ నాటకంలో. దీనిని బొమ్మరిల్లు పేరుతో దేశరాజు రామదాసుగారూ సంక్రాంతి పేరుతో కొర్రపాటి గంగాధరరావుగారూ అనువదించారు. కాని ఈ నాటకాలు రంగస్థలం మీద రాణించిన దాఖలాలు లేవు.

## రసజ్ఞుల ప్రశంసలు అందుకున్న ఆత్మవంచన

1950-60 మధ్యకాలంలో వెలువడిన నాటకాలలో బుచ్చిబాబు గారి 'ఆత్మవంచన కె.యల్. నరసింహారావు గారి 'క్రీనీడలు' ప్రేమతత్వాన్ని విశ్లేషించే నాటకాలు. ఆత్మవంచనలో రాణి పేదవాడైన రాజశేఖరాన్ని ప్రేమిస్తుంది. ఆ విషయం అతనికి తెలియనివ్వదు. అతను తన అంతస్తుకి తగినవాడు కాదనే ఆధిక్యతా భావం ఆమెలో గూడుకట్టుకొని వుంటుంది. అందువల్ల తన పరిధిని దాటి ఒక్క అడుగైనా ముందుకు వెళ్ళలేదు. రాజశేఖరం పూర్ణిమను పెళ్ళి చేసుకొంటాడు. ఆ దంపతుల్ని కాపురం

## సంచలనం కలిగించిన పంజరం నాటకం

ఈ దశాబ్దంలో ఔత్సాహిక సంఘాల చేత ఆదరించబడిన ప్రసిద్ధ నాటకం పంజరం (1956) రచన అవసరాల సూర్యారావుగారు ఒక కాలేజి లెక్చరర్ పుకార్లు విని భార్య శీలాన్ని శంకించి ఆమెను పరిత్యజిస్తాడు తన నిర్దోషిత్వాన్ని నిరూపించుకొనే అవకాశం లేని పరిస్థితుల్లో ఆమె గత్యంతరం లేక జీవన భృతికోసం ఒక హాస్పిటల్లో నర్సుగా చేరి పనిచేస్తూ వుంటుంది అక్కడ ఆదర్శవాది అనుకున్న ఒక డాక్టరు వలలో చిక్కుకుని అతనితో కలిసి వుంటుంది. అతను మోసగాడని, సంఘానికి చీడపురుగని కొద్దిరోజుల్లోనే గ్రహిస్తుంది. పంజరంలో పక్షిలా తల్లడిల్లిపోతూ ఉంటుంది. ఆ స్థితిలో పశ్చాత్తాప్తుడైన భర్త చిత్తచాంచల్యం చెందిన రోగిలాగా ఆ డాక్టరు దగ్గరకు చికిత్స కోసం వచ్చి, డాక్టరును సంఘ విద్రోహిగా నిరూపించి భార్యను స్వీకరిస్తాడు పోలీసులకు పట్టుబడిపోకముందే ఆ డాక్టరు ఆత్మహత్య చేసుకొంటాడు. ఇదీ పంజరంలో ఇతివృత్తం.

## షేక్‌నాజర్ ఆసామి నాటకం

బుర్రకథ సామ్రాట్టుగా యావదాంధ్ర కీర్తినార్జించిన శ్రీ షేక్ నాజర్ రచించిన ఆ సామి (1954) నాటకం దున్నేవాడికే భూమి దక్కాలని వ్యక్తం చేస్తుంది. నేటి మధ్య తరగతి మనస్తత్వంనే అతని ఆశలు, కోర్కెలు, ఊహలు, యదార్థజీవితంలో ఎలా విచ్ఛిత్తై నానాట తను ఆసామిగా మనలేక కూలీగా, పాలేరుగా కడకు బికారిగా ఏ గోడ నీడనో రాలిపోయే స్థితికి ఎలా దిగజారిపోతున్నాడో చెప్పాలని నాప్రయత్నం అన్నారు తన ముందు మాట లో రచయిత. ఆమేరకు సఫలీకృతులయ్యారు కూడా. ఈ నాటకంలో ప్రతిరంగంలోనూ పాటలు భావస్ఫోరకంగా వుంటూ రసావిష్కరణకు ఆలంబనగా వుంటాయి.

## నలుగుర్నీ మెప్పించిన నరసరాజు 'నాటకం'

డి.వి. నరసరాజు గారు ఫెరన్స్ మెల్నార్ దీప్లే ఈజ్ ద థింగ్ నాటకం ఆధారంగా నాటకం (1950) అనే నాటకం రచించారు. అపార్థం చేసుకున్న కారణంగా

ప్రమాదంలో పడిన ప్రేమికుల జంటను రక్షించడానికై ఒక నాటక రచయిత ఒక నాటకం వ్రాసి, తద్వారా అపార్థాలకు తొలగింపచేసి వారి ప్రణయానుబంధాన్ని, నిలపడం ఈ నాటకంలోని కథావస్తువు ఆంధ్రనాటక కళాపరిషత్తులో ఈ నాటకానికి బహుమతి లభించింది

ఒకరి ఆస్తి తనకు వీలునామా వల్ల సంక్రమించ బోతుందని తెలుసుకున్నప్పుడు మధ్య తరగతి మనిషిలో సంభవించే భౌతిక మానసిక పరిణామాలు, వింత ప్రవర్తన హాస్య ధోరణిలో చిత్రింపబడిన నాటకం. వీలునామా (1955). సీన్ఒకాసి జూనోఅండ్ పీకాక్ కు అనుసరణ ఈ నాటకం. నరసరాజుగారు 'వాపస్ హౌస్ఫర్సేల్' అనే నాటికలను కూడా రచించారు

## అవినీతిని అంతంచేసిన ఆకాశరామన్న నాటకం

'గోగోల్ ఇన్స్పెక్టర్ జనరల్' నాటకాన్ని అదే పేరుతో రెంటాల గోపాలకృష్ణగారు ఆకాశరామన్న పేరుతో బెల్లంకొండ రామదాసుగారు 1956లో అనువదించారు.

పురపాలక సంస్థలో వున్న అవినీతి, అవకతవకలు తనిఖీ చేయడానికి ఇన్స్పెక్టర్ జనరల్ వస్తున్నాడని తెలుసుకుని, అతనిని వలలో వేసుకోవడానికి చతుర్విధోపాయాలు ప్రయోగించడం, ఆ ప్రయత్నంలో మొదటి నకిలీ అధికారి చేతిలో మోసపోవడం, చివరి క్షణంలో అసలు అధికారి వస్తున్నాడన్న వార్త విని హతాశులు కావడం ఇలాంటి సన్నివేశాలతో పురపాలక సంఘంలోని లొసుగుల్ని, పాలకుల ముసుగుల్ని ఎత్తి చూపే హాస్యప్రధానమైన నాటకం యిది.

## ప్రఖ్యాతి వహించిన ప్రఖ్యశ్రీరామమూర్తి ఫణి, కాళరాత్రి నాటకాలు

తెలుగులో మొదటి సారిగా అపరాధ పరిశోధక నాటక రచనకు శ్రీకారం చుట్టినవారు ప్రఖ్యశ్రీరామమూర్తిగారు ఫ్రెడరిక్ నాట్ డయల్ యమ్ ఫర్ మర్డర్ నాటకానికి అనుసరణ ఫణి (1957) నాటకం. భార్యను అనుమానించి ఆమెను హత్య చేయించాలని భర్త విఫల ప్రయత్నం చేయటం ఈ నాటికేతి వృత్తం. హెవార్ట్ ఇర్వింగ్ రచించిన "దిహాక్ ఐలెండ్" నాటకాన్ని అనుసరించి "కాళరాత్రి" అనే

నాటకాన్ని వ్రాశారు. దీనిలో కథా వస్తువు కూడా భార్యను అనుమానించే భర్త దారుణ కృత్యం గురించే. ఏ సన్నివేశంలోనూ సుదీర్ఘ సంభాషణలుండవు సస్పెన్స్ నాటకం నిండా ఆవరించి వుంటుంది. కాళరాత్రి నాటకాన్ని జె వి రమణమూర్తి బృందంవారు "ఫణి'', నాటకాన్ని కె. వెంకటేశ్వరరావు బృందం (ర.స.న సమాఖ్య) వారు అద్భుతంగా ప్రదర్శించేవారు

## నూరు నాటికా, నాటకాల రచయిత, డా. గంగాధరరావు

ఆంధ్ర నాటక చరిత్రలో డా. కొర్రపాటి గంగాధరరావు గారికి ఒక ప్రత్యేక స్థానంవుంది. వందకు పైగా నాటక నాటికలు వ్రాసిన వారు ఆంధ్రనాటక సాహిత్య రంగంలో ఇంకెవరూ లేరంటే అతిశయోక్తి కాదు. ద్వితీయ స్థానం కొడాలి గోపాలరావు గారిది వీరు కూడా సుమారు వంద నాటక నాటికలు వెలువరించారు వీరిద్దరి రచనల గురించి తెలుగులో సిద్ధాంత గ్రంథం వెలువడక పోవడం ఆశ్చర్యావహం. 1950-60లో కొర్రపాటి వారి నాటికలు ఆంధ్రదేశాన్ని ఊర్రూతలూగించాయి. వీరి నాటికలు సంవత్సరం పొడవునా ఏ పరిషత్తులోనో, ఉత్సవాలలోనో, కాలేజీలోనో, హైస్కూలు వార్షికోత్సవంలోనో ప్రతిరోజు ఏదో ఒక మూల ప్రదర్శించబడుతూ వుండేవి. ఇలాంటి అసాధారణ గౌరవం ఆంధ్రదేశం లోనే కాదు భారతదేశంలో మరే రచయితకు లభించలేదు.

## ఎన్నో సమస్యలు, ఎన్నో ఇతివృత్తాలు

'తెలుగుకోపం' క్షణం మాత్రమేనని తెలుగువారి కోపంలో వున్న వైలక్షణ్యాన్ని ఆవిష్కరించే హాస్యనాటిక 1957లో వెలువడింది. సంసార బంధం బంగారు సంకెళ్ళవంటివని "బంగారు సంకెళ్ళు" నాటికలో వివరించారు. ఈ రెండు నాటికలు వరసగా ప్రదర్శిస్తే నాటకం అవుతుంది. అంటే మొదటి నాటిక పెళ్ళికి పూర్వం అయితే రెండవ నాటిక పెళ్ళి తర్వాత. ఇలా గొలుసు నాటకం వ్రాసే పద్ధతికి గంగాధర రావుగారే ఆద్యులని చెప్పవచ్చు. పెళ్ళి చూపులు కోసం స్నేహితునితో కలిసి బయలు దేరిన ఓ యువకుడు తప్పు అడ్రసుకు వెళ్ళి పిచ్చి డాక్టరు చేతిలో

పడటం దాని పర్యవసానం హాస్యసన్నివేశాల కదంబం 'పెళ్ళిచూపులు' కడుపుబ్బనవ్విస్తుంది. 1954లో కొర్రపాటి నాబాబు నాటిక వెలువడింది. దీనిని నాటకంగా కూడా కొందరు ప్రదర్శించారు. పితృవాత్సల్యం ఇతివృత్తంగా తీసుకుని మలిచిన 'నాబాబు' ప్రయోగపరంగా పేరు తెచ్చుకుంది. యుద్ధోన్మాదుల దురాశకు, స్వార్ధపరత్వానికి సంకేతం యుద్ధం. యుద్ధం వల్ల బాగుపడేది పెట్టుబడిదారులు. కష్టాలకులోనయ్యేది సామాన్య ప్రజలు. ప్రపంచమంతా ఒకే జాతి అనే భావంతో యుద్ధరాకాసిని భూస్థాపితం చేయాలి విశ్వశాంతిని కాపాడాలి అనే ప్రభోధం వుంది. కొర్రపాటి వారి ప్రార్ధన (1954) నాటికలో.

## బడుగు జీవితాలకు కనువిప్పు కలిగించిన అప్పలస్వామి నాటకాలు

అట్టడుగు వర్గాలను యీ సమాజంలో పట్టి పీడించే సమస్యల మీద దృష్టినిలిపి, కనువిప్పు కలిగించే రీతిలో రచనలు చేసిన వారిలో కారెపు అప్పలస్వామి గారు గణనీయులు. డబ్బు సులభంగా సంపాదించాలనే ఆశతో కూలి డబ్బులు సహితం బ్రాకెట్టు కోసం ఖర్చుపెట్టి జీవితాలను దు:ఖమయం చేసుకునే అమాయకుల బలహీనతను వర్ణించే ఈరోజు బ్రాకెట్ (1957) పేకాట దుర్వ్యసనం వల్ల కలిగే అనర్ధాలను "కట్ జోకర్" నాటిక వ్యక్తం చేస్తుంది. "పెండ్లి కొడుకులు' ' (1959) కళాకారులు (1959) "సంఘర్షణ" (1959) నేరస్తుడెవరు బలపీఠం మొదలైనవి అప్పలస్వామి గారి రచనాపరం పరలో కొన్ని.

## హితశ్రీ గారి విముక్తుడు

హితశ్రీగారి విముక్తుడు (1958) నాటిక చిన్నదే అయినా ప్రదర్శనానుకూలత, సందేశ గౌరవం వున్న నాటిక ఒక నిరుద్యోగి పరిస్థితుల వొత్తిడి కారణంగా దొంగతనం చేస్తాడు. ఆనేరానికి తన అంతరాత్మ ఎదురుతిరగటం వల్ల తస్కరించిన సొమ్మును అదే స్ధానంలో వుంచి ఆ ప్రలోభం నుంచి తాను విముక్తుడైనట్లు గాలి పీల్చుకుంటాడు. మనోదౌర్బల్యానికి లోనైన మనిషి చేత అవసరం చేయించే వింత విన్యాసం "విముక్తుడు" నాటికలో నేర్పుగా చిత్రించబడింది.

## కండగలిగిన, గండవరపు నాటికలు ఏది మార్గం,పెళ్ళి చూపులు

ఈ దశాబ్దిలో వెలుగులోకి వచ్చిన నాటక కర్తలలో గండవరపు సుబ్బరామిరెడ్డి ఒకరు. 1954 లో రచించిన ఏది మార్గం. నాటికకు ఆంధ్రప్రదేశ్ ప్రాథమికోపాధ్యాయ ఫెడరేషన్ మహానభల సందర్భంలో నెల్లూరులో నిర్వహించబడిన రాష్ట్ర స్థాయి నాటికల పోటీలలో ప్రథమ బహుమతి లభించింది. కష్టాలలో పుట్టి, కష్టాలలో పెరిగి, కష్టాలతోనే అంతమయ్యే బడిపంతులు దైన్య జీవితం, ఈ నాటికలో చిత్రించబడింది. పెండ్లి చూపులు, నాటిక 1958 లో వెలువడింది. పెళ్ళి చూపుల కోసం వచ్చిన యువకులిద్దరు పాత నేరస్తులుగా పట్టుపడటం యీ నాటికలోని యితివృత్తం. 1958లో హైదరాబాదులో జరిగిన ఆంధ్రాభ్యుదయోత్సవాలలో ఈ నాటికకు ప్రథమ బహుమతి లభించింది. విజయవాడ, బి.జి. తిలక్ ఆర్ట్ థియేటర్స్ వారిచే సాంబశివరావుగారి దర్శకత్వంలో ఈ నాటిక పలుతావుల్లో విజయవంతంగా ప్రదర్శించబడింది. డా. పి. వేణు ఈ కాలంలోనే నాటక రచయితగా పరిచయమయ్యారు."నిరాశాప్రొడక్షన్ నెం.1" అనే హాస్యనాటికతో ప్రారంభమైన వీరి రచనా జీవితం"రాజీవం" వంటి కరుణ రసాత్మక దృశ్యకావ్యం రాసే వరకూ విస్తరించింది. వేణుగారు రచించిన "దిష్టిబొమ్మలు" అధిక్షేపజాతికి చెందిన నాటిక. సాంఘిక సమస్యకు నిశిత విమర్శను, వ్యంగాన్ని జోడించి ఆకర్షణీయంగా ఆసక్తికరంగా చెప్పడంలో వేణూ కలం పదును తేలింది. సినిమాలో చేరాలని ఉబలాటపడే నటీనటులకు కవులకు, సంగీత కళోపాసకులకు అవకాశం కల్పిస్తామని పత్రికా ప్రకటనలు చేసి, వారి బలహీనతను ఆధారం చేసుకుని వారిని వంచించాలని ప్రయత్నించే బోగస్ సినిమా కంపెనీల బండారం బట్టబయలు చేస్తుంది. నిరాశాప్రొడక్షన్ నెం.1 నాటిక. న్యాయాన్ని, ఆరోగ్యాన్ని, ప్రజాశ్రేయస్సును పరిరక్షించ వలసిన న్యాయవాది, డాక్టరు, ప్రజా నాయకుడు ఒకరి చేతిలో ఒకరు కీలు బొమ్మలై స్వార్థపరులుగా తయారైతే అటువంటి వాళ్ళు సంఘం దృష్టిలో దిష్టిబొమ్మలంటారు. "దిష్టిబొమ్మలు "(1955) నాటికలో హైదరాబాద్‌లో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్ పోటీలలో దీనికి ప్రథమ బహుమతి లభించింది.

## నంది నాటకం మరో మొహంజుదారో

యన్.ఆర్. నందిగారు వ్రాసిన నాటికల సంఖ్య చాల స్వల్పమే అయినా అద్భుతమైన ఖ్యాతిగడించారు వీరు రచించిన నాటికలు కంటే మరో "మొహంజుదారో" వంటి నాటకాలు ద్వారా వీరికి యావద్భారత కీర్తి లభించింది.

నందిగారి నాటికల్లో "మనిషి చావకూడదు " (1952) "వానవెలిసింది" అనే రెండు నాటికలు ఆంధ్రప్రేక్షకుల ప్రశంసలు పొందాయి.

## పేరు తెచ్చుకున్న పుణ్యస్థలి నాటిక

మనిషిలోని సహనశక్తిని, ఆత్మవిశ్వాసాన్ని పరిరక్షించే కష్టాలు, అపనిందలు యిలాంటివి వస్తుంటాయి. వాటికి ధైర్యంగా నిలబడాలి కాని ఆత్మస్థైర్యాన్ని కోల్పోయి "మనిషి ఆర్థికంగా, మానసికంగా, నైతికంగా మాత్రం చావకూడదు" అని ప్రబోధిస్తారు రచయిత మనిషి చావకూడదు (1952) నాటికలో, నందిగారి నాటికల్లో విస్తృతంగా ప్రదర్శించబడిన వాటిలో పుణ్యస్థలి ఒకటి కాగా వానవెలిసింది. మరొకటి పుష్కరాలలో తప్పిపోయిన కూతురు కోసం తండ్రి పడే వేదన ఈ నాటికలో దృశ్యమానమైంది.

## కావ్యశ్రీ సందేశాత్మక నాటికలు

ఔత్సాహిక సమాజాల చేత అపురూపంగా ఆదరించబడిన నాటికలలో కావ్యశ్రీగారి "మానవుడు" (1956) "స్వీకారం" (1957) ప్రత్యేకంగా పేర్కొనదగిన నాటికలు కావ్యశ్రీ గారి నాటికలన్నీ సందేశాత్మకాలే కాక మానవత్వంతో తొణికిసలాడేవి. తాను చెయ్యని నేరానికి జైలుశిక్ష అనుభవించి వచ్చిన వ్యక్తి తన బ్రతుకు అలా కావడానికి కారణభూతులైన వ్యక్తులను అంతం చేయాలని దృఢ నిశ్చయంతోఉంటాడు. ఒకరోజు రైల్వేస్టేషన్ వెయిటింగ్ రూమ్‌లో ఆ వ్యక్తులు ఒక్కొక్కరు యాదృచ్ఛికంగా తారసపడతారు. వారిగోడు, విన్నపాలు అన్నీ విన్న తర్వాత హృదయమున్న మానవుడుగా వాళ్ళందరినీ క్షమించి వదిలేస్తాడు. నలభై నిమిషాలలో ముగిసే మానవుడు నాటికను ఉదాత్త గంభీరంగా మలిచారు రచయిత. అలాగే

స్వీకారం (1957) నాటిక కూడా త్రికరణ శుద్ధిగా భర్తతో దాంపత్యజీవితం సాగిస్తున్న ఒక స్త్రీని గతంలో ప్రేమికుడైన ఒక యువకుడు ఆమెను బ్లాక్‌మెయిల్ చేస్తూ తనతో లేచిరమ్మని బెదిరిస్తూ వుంటాడు. భయంతో చలించిపోతూ మానసిక సంఘర్షణతో కుంగిపోతూ ఉంటుందామె. ఆమెలో వచ్చిన మార్పులకు ఆందోళన చెందిన భర్త, స్వయంగా అన్ని విషయాలు గ్రహించి, ఆయువకుడ్ని తిట్టి తరివేసి విశాలహృదయాన్ని ప్రదర్శిస్తాడు. ఇదే స్వీకారం (1957) నాటికలో కథ. సమర్పణ (1959) శ్రేయోభిలాషి (1960) ఆటకట్టింది. (1950) మొదలైనవి రంగస్థలాన్ని అలరించిన నాటికలే

## కొండలరావు కుక్కపిల్ల దొరికింది

రావికొండలరావు గారి "కుక్కపిల్ల దొరికింది" ప్రజాభిమానాన్ని చూరగొన్న హాస్యనాటిక అభిమానధనుడు అయిన మధ్య తరగతి మనిషి అప్పుల్లో కూరుకుపోయి, జబ్బుతోమూలుగుతున్న భార్యతో నిరుద్యోగులైన పుత్రరత్నాలతో, గుదిబండలా వేధించే దశమ గ్రహంతో జీవచ్ఛవంలా మారిపోయి ఎలా పరితపిస్తాడో ఎలా క్రుంగిపోతాడో, అతని మన: ప్రవృత్తికి అద్దం పడుతుంది ముదిగొండ లింగమూర్తి గారి వెంకన్న కాపురం (1958) నాటిక ఆంధ్రదేశంలో విస్తృతంగా ప్రదర్శించబడిన నాటికలలో యిదొకటి. హాస్యప్రధానమైన నాటికలు రాసిన వారిలో అంగరసూర్యారావు గారు పేర్కొనదగినవారు."కళోద్ధారకులు", పురపాలకులు, స్త్రీలకు ప్రత్యేకం, "ఎవరోపిలిచారు" వంటి నాటికలు రచయితకు పేరు తెచ్చాయి. స్త్రీలకు ప్రత్యేకం నాటికలో అన్నీ స్త్రీ పాత్రలే ఉండటం విశేషం.

## ప్రయోగాత్మక నాటక రచయిత అనిసెట్టి

నాటకరంగంలో ప్రయోగాత్మక నాటకాలు, నాటికలు వ్రాసిన వారిలో అనిసెట్టి సుబ్బారావు ప్రముఖులు. దైనందిన సమస్యల సుడిగుండంలో పడి తల్లడిల్లిపోతూ, నిరాశా నిస్పృహలతో కొట్టుమిట్టాడే మధ్య తరగతి మనిషిని అతని ఆలోచనా సరళిని, పరిమితుల్ని 'చరమాంకం' నాటికలో కవితామయంగా ప్రతీకాత్మకంగా వివరించారు మేధావి వర్గం మెచ్చిన ఈ నాటికలో అన్వయ క్లిష్టత

సామాన్యప్రేక్షకుని అవగాహనా శక్తికి పరీక్షపెడుతుంది అనిసెట్టి గారి చెప్పుకింద పూలు(1956) అనే నాటికలో, నిరుద్యోగంతో బాధపడుతూ, దయావిహీనమైన నేటి సమాజవ్యవస్థ అనే చెప్పుకింద నలిగిపోయే పూలు ఎన్నో అనే ఆర్తి కనిపిస్తుంది 'బ్రతుకుభయం' (1957) అనే నాటిక ఈ భావాన్ని మరింత ధృవపరుస్తుంది

# గాలి మేడలు

వీరు రచించిన 'గాలిమేడలు' నాటకంలో వాస్తవ జగత్తులో సుఖం పొందలేని సగటు మనిషి ఊహాజగత్తులోనైనా సౌఖ్యం అనుభవించాలని ప్రయత్నిస్తాడు "శాంతి" అనే ముకాభినయ నాటికను తొలిసారిగ ప్రవేశపెట్టిన ఖ్యాతి అనిసెట్టిగారిదే. యుద్ధోన్మాదులను తరిమికొట్టడంలో కర్షకులు, యువకులు సంఘటితం కావాలని శాంతి నాటికలో అభివ్యక్తం చేశారు ఈ కాలంలోనే రెంటాల గోపాలకృష్ణగారు "ఆటం" అనే మూకాభినయ నాటికను వెలువరించారు.

బుచ్చిబాబుగారి "దారినపోయే దానయ్య"సోమంచి యజ్ఞన్నశాస్త్రిగారి" ఆంధ్రనాటక రంగానికి జై గొల్లపూడి మారుతీరావుగారి అనంతం ఈ దశాబ్దిలో ప్రజాదరణ పొందిన నాటికా పరంపరలో కొన్ని

# ఎందరో రచయితలు , ఎన్నో నాటకాలు

రాయప్రోలు సుబ్రహ్మణ్యం గారి "కొండవీడు" (1950) నండూరి రామకృష్ణమాచారి గారి ధర్మచక్రం (1950) నండూరి బంగారయ్య గారి "ఆంధ్రతేజం"(1955) చిల్లర భావనారాయణ గారి "ఉమర్ ఖయ్యాం" వంటి చారిత్రక నాటకాలు, తాండ్ర సుబ్రహ్మణ్య శాస్త్రి గారి "జండాపై కపిరాజు" (1951) ఊటుకూరి సత్యనారాయణరావు గారి "వీరాభిమన్య" (1955) కర్ణధారి (1957) కావ్యశ్రీగారి కౌరవ పాండవీయం వంటి పౌరాణిక నాటకాలు ఈ కాలంలోనే వెలువడ్డాయి. కానీ వీటి ప్రదర్శన సంఖ్య అత్యల్పం. పద్యనాటక రచన యధావిధిగా సాగుతున్నా ప్రదర్శనలు బాగా సన్నగిల్లిపోయాయి. రానురాను పాండవోద్యోగం, హరిశ్చంద్ర శ్రీ కృష్ణ తులాభారం, రామదాసు, గయోపాఖ్యానం వంటి కొన్ని నాటకాలకే పద్యనాటక ప్రదర్శనలు పరిమితమై పోయాయి. ఆధునిక యుగంలో కూడా యించుమించు యిదే పరిస్థితి కొనసాగుతూ వుంది.

# 1960 నుంచి 1970 వరకూ రాసిలో చిన్నవైనా వాసిలో వన్నెకెక్కిన నాటకాలు, నాటికలు

1960-70 మధ్యకాలంలో వెలువడిన నాటకాలు, నాటికలు రాశిలో చిన్నవైనా వాసిలో మిన్నగా పేర్కొనదగినవి 1960 నుంచి 1964 వరకే ఎక్కువ నాటకాలు వెలువడ్డాయి. 1965 నుంచి 70 వరకు నాటకరంగంలో స్తబ్ధత ఏర్పడింది. ఈ పదేళ్ళలో వచ్చిన నాటకాలు వస్తువైవిధ్యం కలవేకాక, ప్రయోగాత్మకాలు కావడం పరిశీలనార్హం.

ప్రయోగాల పేరుతో సాహిత్య విలువలను నిర్లక్ష్యం చేయడమూ, జాతీయ భావాలపై శీతకన్ను వేయడము, చెప్పే విషయం కంటే చెప్పే విధానమే ప్రధానం అన్నట్టుగా నాటక సృష్టి చేయడము మొదలైనవి ఈ దశాబ్దంలో మొదలైన వింత లక్షణాలు.

## ఈ దశాబ్దపు విశిష్టరచయితలు, రచనలు

ఈ దశాబ్దంలో నాటక రచన ఆరంభించి చక్కటి నాటకాలు, నాటికలు వ్రాసిన శ్రీయుతులు గొల్లపూడి మారుతీరావు దాసం గోపాలకృష్ణ, ఆర్.వి.ఎస్ రామస్వామి, మోదుకూరి జాన్సన్, గన్విశెట్టి వెంకటేశ్వరరావు, భీసెట్టి లక్ష్మణరావు, కప్పగంతుల మల్లిఖార్జునరావు, చింతపల్లి హనుమంతరావు మొదలైన రచయితలు వెలుగులోకి వచ్చారు.

1960-70 సంవత్సరాలలో ఆంధ్రదేశంలో అనేక చోట్ల నాటక పోటీలు జరిపే సమాజాలు అవతరించాయి. వాటి కృషి ఫలితంగా ఎన్నో ఔత్సాహిక నాటక సంస్థలు ఆవిర్భవించాయి. ఇవి నాటక కళ సర్వతోముఖాభివృద్ధికి బాటలు వేశాయి.

## నిజాన్ని నిరూపించిన రావిశాస్త్రి నిజం నాటకం

నవలా రచయితగా సుప్రసిద్ధులైన రాచకొండ విశ్వనాథ శాస్త్రి గారు 1962లో నిజం అనే నాటకం రాశారు. నేటిన్యాయ వ్యవస్థలో పేదవాడికి న్యాయం జరిగే అవకాశాలు మృగ్యమనీ, డబ్బులేకపోతే నిరపరాధి కూడా అపరాధిగా శిక్షింపబడే

సందర్భాలున్నాయని గుర్తు చేస్తుంది ఈ నాటకం. ఒక శ్రీమంతుని కొడుకు తాగిన మైకంలో ఒకరిని హత్య చేస్తాడు. అతని తండ్రి డబ్బు ఖర్చు చేసి దొంగసాక్ష్యాలతో నిజాన్ని అబద్ధంగా తారుమారు చేస్తాడు తత్ఫలితంగా హత్యచేసిన వాడు అసలు రంగంలోకే రాకపోగా ఆహత్యతో ఏ విధంగానూ సంబంధం లేని ఓ అభాగ్యుడు ఉరికంబం ఎక్కుతాడు. అలా న్యాయం చిత్రవధకు గురికావడమే 'నిజం' నాటకంలో సువ్యక్తమైంది. 30 పాత్రలతో వున్న ఈ నాటకాన్ని బాగా కుదించుకుంటేగాని ప్రదర్శనకు అనువుగా వుండదు. అలా ప్రదర్శన యోగ్యంగా మార్చుకుని కొన్ని సమాజాలు ఈ నాటకాన్ని ప్రదర్శించాయి. నిజం ఆ నాటికీ ఈ నాటికీ సంచలనం కలిగించే ఒక గొప్ప నాటకం.

## సంచలనం కలిగించిన "కీర్తిశేషులు"

ఈ దేశంలో కవులూ, కళాకారులు తమ జీవిత కాలంలో సుఖంగా బ్రతకలేరు. వారి కళాకౌశలాన్ని ఎంతో గొప్పగా కీర్తిస్తుందే తప్ప వారి బాగోగులు పట్టించుకోదు ఈ సమాజం నాటక కళకోసం చదువు చట్టుబడంలు చేసుకుని కళా ప్రపంచాన్ని నమ్ముకొని దగా పడిన ఒక మహానటుడు (మురారి), తన సాహిత్య సృష్టిని మెచ్చి ప్రజలు తనపై అమృతవర్షం కురిపిస్తారని అమాయకంగా ఆశలు పెంచుకున్న ఒక మహాకవి (వాణీనాదం) ఇవి ప్రధాన పాత్రలు కీర్తిశేషులు నాటకంలో ఈ పాత్రల చుట్టూ తిరిగే ఉపపాత్రలు కొన్ని. తెరతీసింది. మొదలు సన్నివేశాలు ఒకదాని వెంట మరొకటి వేగంగా సాగిపోతూ ప్రేక్షకులను తమతో నడిపించుకు పోతాయి. ఈ నాటకరచనతో భమిడిపాటి రాధాకృష్ణ కు నాటక రంగంలో సుస్థిరమైన కీర్తి లభించింది. ఒక దశాబ్దం పాటు నాటక రంగాన్ని ఏలిన నాటకం"కీర్తిశేషులు"

లంచం తీసుకోవడం అనే రుచి మరిగిన ఉద్యోగి ఎంతవాడైనా ఆ వలయంలో నుంచి బయటికి రాలేడు సర్వ నాశనం కాకపతప్పదు అది దైవ శాసనం, అనే ఇతి వృత్తంతో భమిడిపాటి రాసిన మరోనాటకమే"దైవశాసనం"(1962) కథలో, సన్నివేశ కల్పనలో, సంభాషణల్లో అంతగా చెప్పుకోదగిన విశిష్టత కనబడదు ఈ నాటకంలో.

# చిల్లరకొట్టు చిట్టెమ్మ

దాసం గోపాలకృష్ణగారి"చిల్లర కొట్టు చిట్టెమ్మ" (1962) నాటకం గ్రామీణ వాతావరణం నేపధ్యంలో రాసిన నాటకం. నలుగురితో చనువుగా మాట్లాడే స్వభావం గల చిట్టెమ్మ , తన భర్త చేతిలో విషాదమరణం పొందడం ఈ నాటికేతివృత్తం. పల్లె ప్రాంతాలలో వ్యక్తుల మాటల ధోరణి, హాస్యోక్తుల తీరు స్వాభావికంగా రూపుదిద్దుకున్నాయి ఈ నాటకంలో. చిట్టెమ్మ దత్తుడు, పువ్వుల పున్నయ్య సజీవ పాత్రలు ప్రేక్షకుల హృదయాలలో నిలిచిపోగలట్టివి.

కొర్రపాటి గంగాధరరావు గారు "ఇబ్సన్ ఎనిమీ ఆఫ్‌ద పీపుల్" నాటకాన్ని ఈ రోడ్డు ఎక్కడికి? (1967) అనే పేరుతో అనువదించారు ప్రజల ఓట్ల బలంతో ఎన్నికయిన గ్రామ పంచాయితీ సభ్యులు తమలో తాము కీచులాడుకోవడం తప్ప ప్రజల క్షేమాన్ని గురించి పట్టించుకోవడం అరుదు ఒకవేళ ఎవరైనా ప్రజాశ్రేయస్సు కోసం నిస్వార్ధంగా పాటుపడే వాడుంటే అలాంటివాడ్ని సంఘవిరోధిగా, దేశద్రోహిగా చిత్రించి తమస్వార్థ ప్రయోజనాలను పరిరక్షించుకొంటారు ఆ పెద్ద మనుషులు. ఈ నాటకంలోని కధాంశం ఇది. కథా వస్తువులో ఉదాత్తతవున్నా చౌకబారు హాస్యం చాటున అది వెలవెలబోతున్నట్లు కన్పిస్తుంది. ఎనిమీ ఆఫ్‌ద పీపుల్ నాటకాన్ని గొల్లపూడి మారుతీరావు గారు "సత్యంగారిఇల్లెక్కడ?" అనే పేరుతో వ్రాశారు. ఈ రెండు నాటకాలు కూడా ఎక్కువగా ప్రదర్శింపబడినట్లు కనబడదు.

బెర్నార్డ్‌షా "పిగ్మాలియన్" నాటకానికి అనుసరణ"పూలదోసిళ్ళు" (1968) నాటకం. పేరుకి అనుసరణ అయినా స్వతంత్ర నాటకంగా రూపొందించారు దీన్ని. ప్రేమ తత్వాన్ని వివరించే నాటకంగా యిది రూపుదాల్చింది. యువతీ యువకుల మధ్య ప్రేమానుబంధం ఏర్పడి వర్ధిల్లడానికి కనిపించే కారణాల కంటే కనిపించని కారణాలుంటాయనీ, వాటిని అర్థం చేసుకోవడం అంత సులభం కాదని వ్యక్తం చేస్తుంది ఈ నాటకం. హాస్య ప్రధానంగా వున్న యీ నాటకానికి గూడూరు, సంస్కృతీ సమ్మేళనం నాటక పోటీలలో ప్రధమ బహుమతి లభించింది. పరిస్థితుల ప్రభావంతో అనురాగమే ద్వేషంగా మారి విషాదానికి దారి తీస్తుందనే లోకసత్యానికి రూపకల్పన "రాగద్వేషాలు" (1962) నాటకం.

## సామాజిక సమస్యలకు నిలువుటద్దాలే- కొడాలి నాటకాలు

1960-70 మధ్య కాలంలో కొడాలి గోపాలరావు గారివి 7 నాటకాలు వెలువడ్డాయి. అవి: అపరాధి (1961), సుఖదు:ఖాలు, రక్తసంబంధాలు, వైకుంఠ భవనం(1960), పాపంపది రకాలు, చేసిన పాపం కాశీకి పోయినా (1960) చైర్మన్ (1961) ఓ నిరుద్యోగి నిస్పృహ చెంది హత్య చెయ్యడానికి పాల్పడటం దాని పర్యవసానం అపరాధి నాటకంలోని కధాంశంకాగా, సుఖ దు:ఖాలు, రక్తసంబంధాలు, వైకుంఠ భయం, పాపం పది రకాలు నాటకాలలో డబ్బు అనే ప్రలోభంలో పడి మానవులు చేసే దగుల్బాజీ పనులు కుట్రలు, కుతంత్రాలు ద్రోహం మొదలైనవి వర్ణించబడ్డాయి. ఇది వరకే పేర్కొన్నట్లు గోపాలరావుగారి నాటకాలకు డబ్బు కేంద్రబిందువు! చేసిన పాపం కాశీకి పోయినా నాటకంలో ప్రేమించి మోసం చేసినందుకు ఫలితం అనుభవించడం కధావస్తువు.

ప్రజా ప్రతినిధుల పేరుతో అందలాలెక్కిన మహానుభావులు ప్రజల్ని మరచిపోయి ఎలా ప్రవర్తిస్తారో హాస్యప్రధానంగా వివరించారు కొడాలివారు. "చైర్మన్" నాటకంలో స్త్రీ పాత్ర లేని సౌలభ్యాన్ని గుర్తించిన నాటకసంఘాలు దీన్ని విరివిగా ప్రదర్శించాయి. కధావస్తువు దృష్ట్యా" చైర్మన్" నాటకంలో సందేశం వున్నా, హాస్యం పాలు ఎక్కువై సందేశం పల్చబడి జావగారిపోయింది.

## ప్రయోగాత్మ, ప్రయోజనాత్మక మారుతీరావు నాటకాలు

దశాబ్దంలో ప్రధమ శ్రేణి రచయితగా ప్రసిద్ధులైన వారిలో గొల్లపూడి మారుతీరావు గారొకరు. వీరి నాటకాలలో నూతన ప్రయోగాలు కనబడవు. కధావస్తువు స్వీకరించడంలో వైవిద్యం విలక్షణతా గోచరిస్తాయి. ఈ రచయితలో పాశ్చాత్య రచయితల నాటక కర్తల ప్రభావం ఎక్కువగా కనిపిస్తుంది. మారుతీరావుగారికి పేరు తెచ్చిన నాటకం రాగరాగిణి (1960) అంతరాంతరాలలో అనుమానం ఎక్కడో మిణుకుమిణుకుమంటుంటే, తనచేత కానితనం ఒక వైపు కుంగదీస్తుంటే - ఈ స్థితి ఎన్ని భయంకర పరిస్థితులకు దారితీస్తుందో అందులోనూ విశిష్ట వ్యక్తిత్వంగల వ్యక్తులమధ్య ఆ వ్యక్తి ఎలా తల్లడిల్లిపోతాడో, సహజ గంభీరంగా చిత్రించిన విషాదనాటకం "రాగరాగిణి".

## రాణకెక్కిన రాగరాగిణి

రాగరాగిణిలో పాత్ర చిత్రణ అద్భుతంగా చేశారు రచయిత. ఏ సన్నివేశానికి ఆ సన్నివేశం సహజత్వం వుట్టిపడుతూ, యిలాంటప్పుడు ఎవరైనా యిలాగే ప్రవరిస్తారు, యిలాగే మాట్లాడతారు అని సంతృప్తి పడేంత ఖచ్చితంగా వుంటాయి. వివిధ ఘట్టాలలో పాత్రల మనోభావాలను రచయిత విపులంగా సూచించడం వల్ల నాటకం వేసేవారికే కాక చదివేవారికి కూడా రసానుభూతి కలుగుతుంది. యూజినీ ఓ నీల్ వ్రాసిన "బియాండ్ ది హారిజిన్" అనే నాటకం దీనికి ఆధారం. కాని ఆ మాట నాటకంలో చదివినప్పుడు తప్ప మరెక్కడా స్ఫురణకు రాదు. కె. వెంకటేశ్వరరావుగారి దర్శకత్వంలో ఈ నాటకం ర.స.న. సమాఖ్య వారిచే అద్భుతంగా ప్రదర్శింపబడేది. వెంకటేశ్వరరావుగారి తర్వాత ఈ నాటక ప్రదర్శనకు పూనుకొన్న సమాజం లేదనడం సత్యదూరం కాదు.

## మరికొన్ని మచ్చుతునకలు

గొల్లపూడి కలం నుంచి "మహానటుడు", "కరుణించని దేవతలు" నాటకాలు వెలువడినాయి. నటుడు దైనందిన జీవితంలో ఎదుర్కొనే 'సమస్యలుమహానటుడు' వస్తువు కాగా, అన్నాచెల్లెలు ప్రేమానుబంధంలో చిక్కుబడిపోయి నందువల్ల ఏర్పడిన వైపరీత్యం విషాద మరణానికి దారి తీయడం 'కరుణించని దేవతలు' నాటకేతివృత్తం.

ఈ దశాబ్ది నాటకాలలో మోదుకూరి జాన్సన్ వ్రాసిన 'నటనాలయం' నాటకానికి ఒక విశిష్ట స్థానం వుంది. ఒక కళాతపస్వి కళకోసం పడే తపన, ఆవేదన, లక్ష్యసాధనలో బాహ్యపరిస్థితులతో పడే ఘర్షణకు నిలువుటద్దం'నటనాలయం' (1966) ఎ. శివరామిరెడ్డి దర్శకత్వంలో ఈ నాటకం రాష్ట్రం నలుమూలలా ప్రదర్శించబడి రచయిత కీర్తిని యినుమడింపచేసింది.

రావికొండల రావు రచించిన 'పట్టాలు తప్పిన బండి' నాటకాన్ని స్వంత ట్రూప్‌తో ప్రదర్శించి ప్రశంసలందుకున్నారు. పిల్లలను అతిగారాంబంతో ముంచెత్తితే అప్రయోజకులుగా తయారు కావడమేకాక వారిజీవితం పట్టాలు తప్పిన బండి అవుతుందనే సందేశమిచ్చారు ఆ నాటకంలో.

## ప్రవాసాంధ్ర నాటకరంగ వైతాళికుడు ఆర్.వి.చలం

గతంలో 'మాట తప్పకు' వంటి మంచి నాటకాలను రచించి రంగస్థలంపై ప్రదర్శింపజేసి, ప్రేక్షకాదరణ చూరగొన్న ప్రవాసాంధ్రుడు రావి వెంకటచలం గారు విరజాజి అనే నాటకం వెలువరించారు. స్త్రీ యొక్క మనస్తత్వపు లోతులను ప్రేమతత్వాన్ని విశ్లేషించే నాటకం యిది. జీవితాన్ని ఒక రంగుల హరివిల్లులా ఊహించుకొని కలల్లో తేలిపోతూ, నేలమీద పాదం దృఢంగా మోపకుండానే, ఆశలూ ఆదర్శాల వెంట పరుగులు తీసే స్త్రీ జీవిత గమనం నల్లేరుపై బండిలా మృదువుగా సాగదనీ, ఎన్నో గతుకుల్లో పడి వ్యథలు భరించాల్సివస్తుందనీ, వాటికి తట్టుకోలేని స్త్రీ చివరికి విషాదాన్ని చవిచూడాల్సివస్తుందనీ ఈ నాటకంలో సందేశం ధ్వనిస్తుంది ఈ నాటకంలో స్త్రీ పాత్రకే ఎక్కువ ప్రాముఖ్యం వుంది. కేవలం నాలుగు పాత్రలతోనే నాటకం నడిపించారు రచయిత. నాటకంలో సంఘటనలు తక్కువ నాటక ప్రదర్శన యావత్తూ ఒక స్త్రీ మీదే ఆధారపడి వుంటుంది. సాత్వికాభినయం ఈ నాటకానికి ప్రాణం. విరజాజి ఒక మరాఠీ నవలకు నాటకీకరణ.

## గన్నిశెట్టి రచనలు

ఈ దశాబ్దిలో ప్రదర్శన యోగ్యమైన నాటకాలు రచించి ప్రజాభిమానం చూరగొన్న రచయితలలో గన్నిశెట్టి వెంకేటశ్వరరావుగారొకరు. వీరు రచించిన "భలేపెళ్ళి" పూర్తిగా హాస్యనాటకం. మరొక రచన "శారద" విషాద నాటకం. ప్రేమించిన వ్యక్తిని వివాహం చేసుకోవ డానికి పెద్దలు తిరస్కరించడంతో శారద ఆత్మహత్య చేసుకుంటుంది. ఇతివృత్తంలో కొత్తదనం లేకపోయినా, నాటకం నడిపించిన తీరు ఆకర్షణీయంగా ఆసక్తి జనకంగా వుంటుంది.

## బాల గంగాధర తిలక్ "సుశీల పెళ్ళి"

దేవరకొండ బాలగంగాధర తిలక్ రచించిన సుశీలపెళ్ళి (1961) ఈ కాలంలో వచ్చిన మంచినాటకాలలో ఒకటి కుటుంబ క్షేమం కోసం తన ప్రేమను త్యాగం చేస్తుంది ఒక యువతి. త్యాగఫలం ఎవరికీ దక్కకపోగా, అందరికీ తాను

దూరమై దుర్భర పరిస్థితిని ఎదుర్కోవలసి వస్తుంది. సుశీలపెళ్ళి కథాంశం యిదే ప్రదర్శన విలువల దృష్టితో చూసినా, సాహిత్య పరంగా చూసినా ఇది ఒక ఉత్తమ నాటకం.

తన కోపమే తన శత్రువు అన్నట్టుగా తనలో రేగిన ద్వేషంతో తానే పతనమై పోతాడు. ప్రియురాలుపై పగబట్టిన ఓ యువకుడు కసి తీర్చుకునే ప్రయత్నంలో తానే సర్వసం పోగొట్టుకొంటాడు "సంఘర్షణ" నాటకంలో కారెపు అప్పల స్వామిగారికి పేరు తెచ్చిన నాటకం ఇది

# మరికొన్ని అభ్యుదయ నాటకాలు, రచయితలు

ఈ కాలంలో విజయవంతంగా ప్రదర్శించబడిన కొన్ని నాటకాలలో మద్యపానం గురించి పడాల రామారావు రచించిన "సంకెళ్ళు" (1961) పదవుల కోసం స్త్రీ పెదవులను ఎరవేసే వింత మనస్తత్వాన్ని చిత్రించిన చిలర్ల భావనారాయణగారి "పదవులు-పెదవులు" బంజరు భూమికై పోరాటాన్ని వర్ణించే "అన్నపూర్ణ" (కె.వి. రమణారెడ్డి, వేణుగార్ల రచన) సోమంచి యజ్ఞన్న శాస్త్రి గారి, "కట్నం కోరని కళ్యాణం" బి.యన్.సూరి "కూలిపిల్ల", ప్రఖ్యశ్రీ రామమూర్తి గారి "మనిషిలో మనిషి" మొదలైనవి రంగస్థలం మీద రాణించిన నాటకాలు

# మానవత్వాన్ని మేలుకొల్పే మొహంజుదారో నాటకం

ఈ దశాబ్దిలో వెలువడిన నాటకాలలో యన్.ఆర్. నంది గారి "మరో మొహెంజుదారో" నాటకం నాటక రంగంలో చరిత్ర సృష్టించింది. ప్రయోగంలో నూతన శిల్పాన్ని ఆవిష్కరించి ప్రేక్షకలోకాన్ని అబ్బురపరిచింది. ఓ విలక్షణ నాటక శిల్పంతో ఈ నాటకాన్ని ఆకర్షణీయంగా, అపూర్వంగా మలిచారు. ఆధునిక మానవుడు నీతినియామాలను నిర్లక్ష్యం చేసి నైతిక పతనానికి దగ్గరవుతున్నాడనీ, ఈ పరిస్థితులు యిలాగే కొనసాగితే మనిషి మనుగడ కష్టమవుతుందనీ, మారణహోమం తప్పదనీ, మానవ నాగరికత మరోమొహెంజుదారో అయితీరుతుందనీ, ఆ ప్రమాదాన్ని ఆ కాళరాత్రిని ఎదుర్కోకముందే మనిషి తన ప్రవర్తనను సరిచేసుకోవలసిన అవసరం వుందని హెచ్చరించారు ఈ నాటకంలో. మానవ స్వభావాన్ని, బలహీనతలను,

చిత్తవృత్తుల వైవిధ్యాన్ని విపులంగా విశ్లేషించారు. ఆధునిక మానవుడ్ని తరగతులుగా విభజించారు స్వార్థం చేతిలో మనుషులు బందీలై ఎంతనైచ్యానికి పాల్పడతారో సన్నివేశాల ద్వారా వ్యక్తీకరించారు. సంఘంలో కీలక పాత్ర వహించే కూకటి వేళ్ళతో సహా సమాజ వృక్షం కూలిపోవడం జరుగుతుందని అభివ్యక్తీ కరించారు రచయిత నాటకంలో భావాన్వయ క్లిష్టత ప్రేక్షకుని మెదడుకి పని పెరుగుతుంది.

## ఫ్రీజ్ టెక్నిక్‌ను ప్రవేశపెట్టిన మొదటి నాటకం

ఈ నాటకాన్ని కొత్తపంథాలో నడపడంలో "ఫ్రీజ్" అనే పద్ధతిని ప్రవేశపెట్టారు రచయిత. నాటక రంగంలో ఫ్రీజ్ అనే టెక్నిక్‌కు నందిగారే ఆద్యులు. మరోమొహెంజుదారో వెలువడిన తర్వాత ప్రీజ్ టెక్కిక్ నాటకరంగంలో స్థిరపడి పోయింది. నాటక ప్రదర్శనలో అంతర్భాగమై పోయింది. ఈ నాటకాన్ని జె.ఎల్. నరసింహారావు సారథ్యంలో, విద్యాసాగర్ కల్చరర్ అసోసియేషన్, హైదరాబాద్ వారు రాష్ట్రంలో అనేకచోట్ల జనరంజకంగా ప్రదర్శించి ప్రశంసలు పొందారు. ఈ నాటకంలో ప్రొఫెసర్ పాత్రలో చాట్ల శ్రీరాములుగారి వాచికాభినయం మరుపురానట్టిది. మరో మొహెంజుదారో అనేక భారతీయ భాషల్లోకి అనువదింపబడి యావద్భారత కీర్తిని ఆర్జించింది.

## అసమానమైన ఆర్.వి.ఎస్. రామస్వామి నాటకాలు

నాటక కళను ఒక పవిత్ర యజ్ఞంగా భావించి మూడు ధశాబ్దాలపైగా నటుడుగా, నాటకకర్తగా, సమాజ నిర్వాహకుడుగా కళాసేవకు అంకితమైన కళోపాసకుడు ఆర్.వి.ఎస్. రామస్వామి వీరు సుమారు 12 నాటకాలు, 25 నాటికలను రచించారు.వీరి నాటక చక్రంలో "గాలి వాన" ఒక మైలు రాయి. వలయం, సుడిగాలి, కెరటాలు, వెల్లువ, కళారాధన, కళామయి మొదలైన నాటకాలు, పైడిరాజు, గాలిపటం, జిందాబాద్ మొదలైన నాటికలు రామస్వామి గారి రచనలు వీరి నాటకాలన్నీ ''కళారాధన'' (హైదరాబాద్) సంస్థ ద్వారా ప్రప్రథమంగా ప్రదర్శించబడ్డాయి. అన్ని నాటకాలకూ భాను ప్రకాష్ గారే దర్శకత్వం వహించడం విశేషం. "గాలివాన" నాటకం ద్వారానే నూతన ప్రసాద్ వెలుగులోకి వచ్చారు.

## 1960 నుండి 70 వరకు పౌరాణిక, చారిత్రక నాటకాలకు పట్టాభిషేకం

1960-70 సం.లలో కొన్ని పౌరాణిక, చారిత్రక నాటకాలు కూడా వెలువడ్డాయి. భూపతి లక్ష్మీనారాయణరావు రచించిన "ధర్మరక్షణము" (1960) కె.వి. నాగేంద్రా చార్యులు గారి "మోహినీ భస్మాసుర" మొదలైన పౌరాణిక నాటకాలు పెమ్మరాజు వేణుగోపాల కృష్ణమూర్తి గారి "నాగమనాయకుడు" చిల్లర భావనారాయణరావుగారి "వీరచెన్నమ్మ" ఎ.కె. ప్రసాద్ గారి పల్నాటి వీరులు, కె.వి. రామరాజుగారి "శాక్యసింహ" మొదలైన చారిత్రక నాటకాలకు ఈ దశాబ్ది ఆహ్వానం పలికింది.

## ప్రచార నాటకాలు

పంచవర్ష ప్రణాళికలు, సహకారోద్యమం, సర్వోదయ ఉద్యమం వంటి అంశాల మీద కూడా కొన్ని ప్రచార నాటకాలు వచ్చాయి. గిద్దలూరు గోపాలరావు రచించిన "బంగారుభూమి", ఆముజాల నరిసింహమూర్తి గారి"సర్వోదయ" తిమ్మిరాజు వెంకటశివరావుగారి "సహకారం" ముఖ్యంగా పేర్కొనదగినవి.

ఈ దశాబ్దిలో వెలువడిన నాటకాలలో ఉత్తమ ప్రమాణాలుగల నాటకాలు పదికి మించిలేవు. కాని నాటికలు 30 దాకా వున్నాయనడం అతిశయోక్తి కాదు.

## రాజీవం నాటికలో మూగపిల్లను చెరచిన ముష్కరులు

రచనా రీతిలోను, ప్రదర్శనా విధానంలోనూ ఉన్నత ప్రమాణాలు నెలకొల్పి నాటికలలో కె.వి. రమణారెడ్డి డా. వేణూగారు రచించిన "రాజీవం" (1960) నాటిక అగ్రశ్రేణికి చెందింది.

నిండు యవ్వనంతో అప్పుడే వికసించిన అనాఘ్రాత పుష్పంలా వున్న ఒక మూగ పిల్లను, ఆమె పరిస్థితిని ఆసరా చేసుకుని పెడత్రోవ పట్టించి ఆమె అందాన్ని కొల్లగొడతారు. కొందరు ధూర్తులు ఆమె యౌవనాన్ని హరించిన వాళ్ళలో రోడ్ సైడ్ రోమియోలే కాదు. ఘరానా రాజకీయ నాయకులు, పెద్ద మనుషులుగా చెలామణీ అయ్యేవారూ వున్నారు. జరగుతున్న దౌష్ట్యాన్ని చూస్తూ మిన్న కుంటుంది సమాజం,

చెప్పుకోవడానికి నోరు లేదు. చెప్పుకుందామన్నా వినే నాధుడు లేడు. రోజురోజుకీ ఆమె ఆరోగ్యం క్షీణించి పోతుంది. జవసత్వాలు వుడిగి రోగగ్రస్తురాలవుతుంది ఈగలు ముసురుకొంటున్న కాయంతో రోడ్డు ప్రక్క చెట్టునీడన దిక్కులేకుండా పడివుంటుంది ఆమె జీవితం అలా ఘోర నరకంలో పడిపోవడానికి ఆదీనావస్థకు బాధ్యులైన వారు అమె వైపు కన్నెత్తయినా చూడరు. అసహ్యించుకొంటూ ప్రక్కకి తప్పుకు పోతుంటారు మనిషి రూపంలో దానవత్వం వేసిన విషపుకాటు ఫలితంగా ఆమె జీవితం చిత్రహింసల పాలయింది. నేరం ఒకరిదైతే ఫలితంగా శిక్ష అనుభవించేది యింకొకరా! ఈ సమస్యను పరిష్కరించేదెవరు? మానవత్వం కళ్ళు విప్పేదెప్పుడు? అని సభ్యప్రపంచం మీదికి ప్రశ్నల వర్షం కురిపిస్తుంది ఈ నాటిక, కావ్యార్థాన్ని కమనీయ సన్నివేశాల ద్వారా శక్తివంతమైన సంభాషణల ద్వారా ద్యోతకం చెయ్యడంలో కృత కృత్యులయ్యారు రచయితలు.

వేలూరి శివరామ శాస్త్రి గారు చెళ్ళ పిళ్ళ వెంకటశాస్త్రి గారి శిష్యులు శతాధిక గ్రంధకర్త. బహుభాషాకోవిదులు ప్రాచీన అధునాతన సాహిత్యాలను సమదృష్టితో సమాదరించిన వారు. కావ్య రచన చేసిన కలంతోనే కధలూ, నవలలు కూడా వ్రాశారు. శాస్త్రిగారు స్పృశించని సాహిత్య ప్రక్రియ లేదు. శతావధానం చేసిన ప్రజ్ఞాశాలి. ఒక నాటికను వ్రాశారంటే నాటక సాహిత్యంపై వారికున్న అభిమానం ద్యోతకమవుతుంది.

## వేలూరి శివరామశాస్త్రి సుల్తానీ నాటిక

నిరక్షరాస్యులుగా వుంటూ, ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా తన కాళ్ళ మీద నిలబడలేని దైన్యావస్థలో స్త్రీలు నేటి మన సమాజంలో పడుతున్న కష్టాలను "సుల్తానీ" నాటికలో హృదయంగమంగా చిత్రించారు రచయిత. తెలంగాణా మాండలికంలో వున్న సంభాషణలు ఈ నాటికకు మరింత సహజత్వాన్ని సంతరించిపెట్టాయి.

ఏ సుఖానికి నోచుకోకుండా బ్రతుకంతా కష్టాలతో మునిగితేలే దురదృష్ట జాతకులు (నిజానికి ఈ దేశంలో కొన్ని కోట్ల మంది నిస్సహాయకులకు) ప్రతినిధి "సుల్తానీ"ప్రతివూళ్ళో ప్రతివీధిలోఒక సుల్తానీ మన కళ్ళకు కన్పిస్తుంది. సుల్తాని

వంటి స్త్రీలకు కన్నీరు యింకిపోయినా సమస్యలు మాత్రం అపరిష్కృతంగానే వుండిపోతున్నాయి. ఇది మన సాంఘిక వ్యవస్థలోని ఒక భయంకర పరిస్థితి మగవారి దౌష్ట్యానికి బలియైపోయే సుల్తానీలు యీ సమాజంలో వున్నంతకాలం సుల్తానీ నాటిక బతికే వుంటుంది.

## తెలంగాణా మాండలికానికి పెద్దపీట

అమ్మ, అయ్యల ఆదరణకు నోచుకోక గాలికి పెరిగింది సుల్తానీ ఒక దయాత్ముడు ఆమెను పరమానందం కిచ్చి పెళ్ళి చేసి పుణ్యం కట్టుకున్నాడు. గాలెన్న స్నేహ ప్రభావంతో కొత్త చిలకల వెంట పడటం నేర్చుకున్నాడు పరమానందం. చీటికీ మాటికీ భార్యను గొడ్డును బాదినట్టు చితగ్గొడుతూ వుంటాడు. ఆమెను ఎలాగైనా వొదిలించుకోవడానికి గుడిసెతగుల బెట్టిందన్న సాకుతో ఆమెను ఇంట్లో నుంచి వెళ్ళగొడతాడు. మంగళసూత్రం తెంపుకుని నిర్దాక్షిణ్యంగా తరిమేస్తాడు ఆ మూర్ఖుడు. సుల్తాన్ అనే అతను ఆమెను చేరదీస్తాడు. కొన్నాళ్ళకు పశ్చాతాపం చెందిన పరమానందం సుల్తానీ దగ్గరకు ఒకసారి రావటంతో పొరుగింటి జోగులక్క దానికి చిలవలు పలవలు కల్పించి సుల్తానీ అప్పుడప్పుడే నిలబెట్టుకొంటున్న కాకిగూడులో చిచ్చుపెడుతుంది. చివరకు సుల్తాన్ మూలంగానే తిరిగి రాని లోకాలకు వెళ్ళిపోయి కష్టాల కడలి నుంచి కడతేరిపోతుంది. సామాజిక జీవితంలోని కఠోర సత్యాలను రసార్ద్రంగా చెప్పగల నాటకాలు మన సాహిత్యంలో ఎడారిలో ఒయాసిస్‌లా అరుదుగా కన్పిస్తాయి. అలాంటిదే సుల్తానీ నాటిక.

1962లో గుడివాడలో జరిగిన ఆంధ్ర నాటక కళాపరిషత్ పోటీలలో సుల్తానీ నాటికకు ప్రథమ బహుమతి లభించింది. పామర్తి సుబ్బారావు గారి దర్శకత్వంలో ఈ నాటిక ఒక కళాఖండంగా రూపుదిద్దుకొంది.

## ఉత్తమ నాటిక గన్నిశెట్టి చీకటి తెరలు

గన్నిశెట్టి వెంకటేశ్వరరావు గారు సుమారు 12 నాటికలు రచించారు. అధిక భాగం హాస్య రచనలే. చీకటి తెరలు వంటి కరుణరసభరిత నాటికలు కూడా

లేకపోలేదు. వీరికి పేరు తెచ్చిన నాటికలలో చీకటి తెరలు అగ్రభాగాన నిలుస్తుంది.

తనను మనసారా ప్రేమించే భర్త, స్ఫోటకం వల్ల అంధుడుగా, కురూపిగా మారిపోవడంతో నవయౌవనంలో వున్న భార్య అతనికిద్రోహం తలపెడుతుంది. స్నేహితుడైన మురళితో లేచిపోవడానికి సంసిద్ధమవుతుంది. ఆమెలో వచ్చిన మార్పును ప్రవర్తనను అర్థం చేసుకోలేని అజ్ఞానికాడు శంకర్ ,"మెరిసే దంతా బంగారం కాదు. మేడి పళ్ళుంటాయి. త్యాగబుద్ధి, త్యాగం చేసే శక్తి మనుషులందరిలో వుండటం కష్టం జాగ్రత్త. నా బ్రతుకు ఎలాగూ మంట గలిసింది. నీవైనా సుఖంగా వుంటే నాకు కొంతైనా మనశ్శాంతి" అంటాడు భార్యతో. సమయం వచ్చేసరికి నిర్మల ప్రియుడు మురళి ఆమెతో లేచిపోవడానికి నిరాకరిస్తాడు. శంకర్ ఆత్మహత్య చేసుకొంటాడు. నిర్మలజీవితాన్ని చీకటి తెరలు కప్పేస్తాయి ఇదే క్లుప్తంగా చీకటి తెరలు ఇతివృత్తం. పాత్రల మానసిక సంఘర్షణను హృందాగా, గంభీరంగా చూపించగలిగారు రచయిత ఆంధ్ర నాటక కళాపరిషత్ పోటీలలో ఈ నాటిక ప్రథమ బహుమతిని అందుకొంది.

## ప్రియునితో లేచిపోయిన లలితాంగి జ్వలిత జ్వాల

**చింతపల్లి హనుమంతరావు గారికి పేరు తెచ్చిన నాట"జ్వలిత జ్వాల" (1962) కన్నూమిన్నూ కానని యవ్వనోద్రేకంలో, మాతృహృదయాన్ని కూడా అణచిపెట్టి భర్తను పసిపాపను విడిచిపెట్టి ప్రియునితో లేచిపోయిన ఓ లలితాంగి యవ్వనపు పొంగు చల్లబడిన తర్వాత లోకరీతులు అవగాహన చేసుకున్న తర్వాత ఒక విచిత్ర సంఘటన వల్ల భర్తను, తన పాపను చూడటం తటస్థిస్తుంది. పిల్లను చూడగానే ఆమెలో మాతృహృదయం విలవిలలాడిపోతుంది. పాపను ఒక్కసారి చూడనివ్వండి కాగే నీటిలా పొంగేనా మాతృత్వాన్ని సంతృప్తి పరచుకోనివ్వండి అని భర్తను ప్రాధేయపడుతుంది. చివరికి పాపను చూడగలుగుతుంది. కాని పాపను వదలి ఆ యింటిని విడిచిపోలేక మేడ మీద నుంచి దూకి ఆత్మహత్య చేసుకుంటుంది. ఇదే కథ వస్తు బలంతో పాటు దీనిలో పరిపుష్టిని చేకూర్చింది. అనంతపురంలో జరిగిన ఆంధ్రనాటక పరిషత్తులో ఈ నాటిక ప్రథమ స్థానంలో నిలిచింది.**

## మరికొన్ని మంచి నాటికలు

యువకులు తలపెట్టిన ప్రజాహిత కార్యాలను సాగనీయ కుండా స్వార్థ బుద్ధితో అభివృద్ధి నిరోధకులు ఎలా అడ్డుపడతారో అలాంటి మనస్తత్వం గల వారి ప్రతినిధిగా ఒక "ఉలిపికట్టెను" సృష్టించారు ఆవుల శ్రీనివాసరావుగారు. మారుతున్న కాలంతో పాటు మారలేక కాలచక్రాన్ని వెనక్కి త్రిప్పాలని వ్యర్థ ప్రయత్నం చేసే మూర్ఖులకు 'ఉలిపికట్టె' నాటిక ఒక గుణపాఠం. ఎ. శివరామరెడ్డి గారి బృందం ఈ నాటికను ఆంధ్ర నాటక కళాపరిషత్, హైదరాబాద్‌లో ప్రదర్శించి ప్రథమ బహుమతి పొంది, అనేక నాటక పోటీలలో విజయపరంపరను సాధించారుప కొర్రపాటి వారి 'పెండింగ్ ఫైల్' నాటికలో ప్రభుత్వ కార్యాలయాల్లో లంచం యిస్తే కాని ఫైలు కదలని పరిస్థితిని హాస్యస్ఫోరకంగా వివరిస్తూ ప్రభుత్వ యంత్రాంగం మీద చురకవేశారు.

## సమాజాన్నీ, మనిషినీ మార్చే మల్లిఖార్జున రావు నాటికలు

కప్పగంతులు, మల్లికార్జునరావుగారు సుమారు 25 నాటక, నాటికలు వెలువరించారు. వాటిలో నీలినీడలు, యాచకులు, దూరపు కొండలు, సప్తపది, మారని మనిషి, నాటకాలు, సాలెగూడు, ఉద్ధారకులు, దాగుడు మూతలు, పరిష్కృతి జ్వాల, నూట పదహారు నాటికలు ఈ దశాబ్దానికి చెందినవి.

మల్లిఖార్జునరావు నాటకాలన్నీ మనిషి సమాజం ఈ పరిధిలోనే సంచరిస్తాయే గాని, ఆకాశమార్గాన విహరించిన ఆనవాళ్ళు కనిపించవు. వీరు రచించిన మొదటి నాటకం నీలినీడలు (1961) కుటుంబ సభ్యుల్లో పరస్పరావగాహన లోపించినప్పుడు అనివార్యంగా ఏర్పడే అపోహలకు పర్యవసానం విషాదమే అన్న సత్యానికి అక్షర రూపం ఈ నాటకం. ధర్మపీఠం ముందు చట్టబద్ధంగా ఉదాత్తమైన తీర్పులిచ్చిన న్యాయమూర్తి మాధవరావు, తన కుటుంబానికి న్యాయం చేయలేకపోతాడు. కుటుంబంలో ఎవరికి వారు తమ చుట్టూ అగడ్తలు నిర్మించుకుని ఒంటరి జీవితంతో క్రుంగిపోతూ వింత ప్రవర్తనకు లోనౌతారు నిజానిజాలు బయటపడిన తర్వాత జీవిత చరమాంకంలో పశ్చాత్తాపం ఎవరికి మేలు చేస్తుంది?

## విరివిగా ప్రదర్శించిన మారని మనిషి నాటకం

ఔత్సాహిక నాటక సంఘాల చేత విస్తృతంగా ప్రదర్శించ బడిన నాటకాలలో మారని మనిషి (1966) ఒకటి సంఘ విద్రోహక చర్యలకు పాల్పడే వారిని పట్టుకుని శిక్షించి లేదా పరివర్తన కలిగించి నంత మాత్రాన సంఘానికి కలిగే లాభం లేదనీ, నేరాలు చేయించే మూలవిరాట్టు ఆగడాలను అరికట్టగలిగిన నాడే సంఘంలో మార్పు తేవడానికి సాధ్యమవుతుందని ప్రభోధించారు. రచయిత మారని మనిషి నాటకం ద్వారా కాగా సప్తపది (1965) నాటకంలో వర్ణాంతర వివాహాల వల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు ఆయా వ్యక్తులకు అగ్ని పరీక్ష పెడతాయనీ, తీరని మానసిక వ్యధకు గురి చేస్తాయనీ, అలాంటి సంక్షోభాలకు తట్టుకుని నిలబడగలిగినపుడే వర్ణాంతర వివాహాలు ఫలవంత మవుతాయని వివరించారు. నాటక కర్త యాచక వృత్తిని నిర్మూలించి ఆ "యాచకులకు" జీవనోపాధి కల్పించడం జాతి శ్రేయస్సు దృష్ట్యా ఎంతో అవసరమని యాచకులు (1964) నాటకం ద్వారా ఉద్భోధించారు. అంతే కాదు యాచకులను ఉత్పత్తి సాధనాలుగా వాడుకొంటూ లబ్దిపొందాలనుకునే స్వార్ధపరులను కూడా ఒక కంట కనిపెట్టాలని హెచ్చరించారు ఈ నాటకంలో నవనాగరికత వ్యామోహంలో పడి, మిధ్యా సంస్కృతిని ఆరాధిస్తూ, కూచొన్న కొమ్మ నరుక్కొనే వారిపై చురక వేశారు "దూరపు కొండలు" (1964) నాటకంలో.

## ప్రశంలందుకున్న "నూట పదహారు"

మల్లిఖార్జునరావు గారిని రచయితగా నాటక రంగానికి పరిచయం చేసిన నాటిక "సాలెగూడు" (1960) పరిస్థితుల ప్రాబల్యంతో పతితగా మారి, పాప పంకిలంలో కొట్టు మిట్టాడుతూ విముక్తి కోసం పోరాటం సాగించే ఓ అబల విషాద జీవితానికి అద్దం పడుతుంది సాలెగూడు నాటిక. పోలీస్ శాఖలోపనిచేసే కానిస్టేబుల్ నీతికి నిలబడి తన ధర్మాన్ని తు.చ. తప్పకుండా నిర్వహించాలనుకున్నప్పుడు కాలప్రవాహాన్ని ఎలా ఎదురీదవలసి వస్తుందో "నూట పదహారు" (1962) నాటిక వ్యక్తం చేస్తుంది. ఈ నాటిక జవ్వాది రామారావుగారి దర్శకత్వంలో అనేక చోట్ల ప్రదర్శించబడి బహుళ ప్రశంసలూ, బహుమతులూ అందుకొంది. సత్యమూర్తి ఒక

డాక్టర్ అసాధారణ మేధావి ఎవరికీ అంతుపట్టని కేసులెన్నో కుదిర్చారు. కాని, లేని డిగ్రీలు పెట్టుకుని వైద్యం చేస్తూ ప్రభుత్వం కళ్ళు కప్పిన నేరం కింద న్యాయస్థానంలో అతనికి జైలు శిక్ష విధిస్తుంది. ఒకరోజు తీవ్రమైన ప్రమాదావస్థలో వున్న తన కొడుకును కాపాడమని న్యాయమూర్తి ఆ డాక్టరును ప్రాధేయపడతాడు. డాక్టర్ మొదట్లో నిరాకరించినా, మానవతా దృష్టితో చివరికి అంగీకరిస్తాడు"పరిష్కృతి" (1962) నాటికలో.

## హాస్య నాటికలు అందించిన అగ్రగణ్యుడు ఆదివిష్ణు

ఔత్సాహిక నాటక రంగానికి హాస్య నాటికలు అందించిన వారిలో ఆదివిష్ణు అగ్రగణ్యులు. హాస్య నాటికలే కాక కొన్ని సీరియస్ నాటకాలు కూడా వారి కలం నుండి వెలువడ్డాయి. అలాంటి వాటిలో మంచుతెర (నాటిక) ఒకటి తన భార్య పూర్వాశ్రమంలో మరొకరికి ప్రేయసి అని తెలుసుకున్నపుడు భర్త మనసు ఎలా వికలమవుతుందో, యింకా తన భార్య మనసు ఆమె ప్రియుని మీదే లగ్నమై వుందని గ్రహించినపుడు అతనిలో మానసిక సంక్షోభం ఎలా చెలరేగుతుందో, బిగువైన సన్నివేశాలతో, శక్తివంతమైన సంభాషణలతో మంచుతెర నాటికను రచించాడు ఆదివిష్ణు గారు. ఇది సాహిత్య విలువలున్న నాటిక కూడా. ఈ దశాబ్ది చివరలో కొసమెరుపుగా వచ్చిన రాచకొండవారి విషాదం నాటిక రసజ్ఞుల ప్రశంసలు అందుకొంది. ఏటి ఒడ్డున ఒంటరిగా వున్న స్త్రీని అల్లరపెడుతున్న కుర్రవాళ్లను పట్టుకొంటాడు పోలీసు ఇన్‌స్పెక్టర్ స్టేషన్‌కి తీసుకెళ్ళి వాళ్ళని బ్రెయిన్ వాష్ చేసి పంపిస్తాడు."మీకు శక్తుంటే అన్యాయాన్ని ఎదిరించండి. అన్యాయం మీద తిరగబడండి. అన్యాయాన్ని నాశనం చెయ్యండి. ప్రజల్ని, దేశాన్ని బాగుచేయండి. దేశాన్ని రక్షించుకొందుకు పాటుపడి పోరాడండి". అని హితబోధతో కూడిన హెచ్చరిక చేయడంతో విషాదం నాటిక ముగుస్తుంది.

ఇంకా ఈ దశాబ్దిలో దివ్యప్రభాకర్ గారి''శిరోమణి''విడియాల చంద్రశేఖరరావు గారి ఇంటిదీపం మోదుకూరి సులేమాన్"రైలుప్రమాదం" యర్రంనేని చంద్రమౌళిగారి "న్యాయం- చట్టము" మొదలైన నాటికలు రంగస్థలం మీద విరివిగా ప్రదర్శించబడి ప్రజాభిమానాన్ని చూరగొన్న రచనలు.

# 1970-80 దశాబ్దంలో .
# ప్రయోగాత్మకపోకడలతో ..
# పతనమైన నాటకరంగం...

1970-80 దశకంలో నాటకరచన మందకొడిగా సాగింది. ప్రదర్శనా విధానంలో మార్పులొచ్చాయి. కొత్తతరం నూతన ప్రయోగాల (ఎక్స్‌పిరిమెంట్స్) వైపు దృష్టి సారించింది. పాశ్చాత్యదేశాలలో నాటక రంగంలోయదార్ధతావాదం (నేచురలిజమ్) వాస్తవికతా వాదం(రియలిజం) ప్రతీకవాదం(సింబలిజమ్)అభివ్యక్తివాదం (ఎక్స్‌ప్రెషనిజమ్) అస్తిత్వ వాదం(ఎగ్జిస్తలిజమ్) అసంబద్ధ నాటకం (అబ్‌సూర్డ్ డ్రామా) ఐతిహాసిక నాటకరంగం(ఎపిక్ థియేటర్) వంటి నాటక శైలులు (థియేటర్ స్టయిల్స్) ప్రచారం పొందాయి వాటిని స్వీకరించి తెలుగు రచయితలు, దర్శకులు కొత్తపంథాలో నాటకాలను రచించి ప్రదర్శించడానికి పూనుకున్నారు. అర కొరగా అక్కడక్కడా ఒకటి రెండు ప్రదర్శనలు విజయవంతమైనప్పటికీ తెలుగు నేలపై విదేశీ నాటక రీతులు ఏవీ నిలదొక్కుకోలేక పోయాయ నటం ఒక చేదు నిజం.

## నూతనత్వాన్ని మూర్తీభవింపచేసిన ముగ్గురు మూర్తులు

ప్రదర్శనా విధానంలో నూతనత్వాన్ని తెచ్చిపెట్టాలని అహరహం కృషి చేసిన వారిలో ఎ.ఆర్.కృష్ణ, మంత్రి శ్రీనివాసరావు, చాట్ల శ్రీరాములు ప్రభృతులు

ముఖ్యులు. హైదరాబాద్‌లో 'నాట్య విద్యాలయ' ను ప్రారంభించి, శాస్త్రీయ పద్ధతిలో అనేకమందిని నటశిక్షణ ద్వారా సుశిక్షితులైన నటీనటులుగా తీర్చిదిద్దిన ఖ్యాతి ఎ.ఆర్.కృష్ణా గారికి దక్కుతుంది. కాలక్రమంలో విశ్వవిద్యాలయ స్థాయిలో రంగస్థలకళల శాఖలు ఆవిర్భవించడానికి యీ నాట్యవిద్యాలయం మార్గం చూపిందనీ, స్ఫూర్తినిచ్చిందనీ చెప్పవచ్చు ఈ కృషిలో రామకృష్ణారావు గారి భాగస్వామ్యం కూడా ఉంది. నూతన ప్రయోగాలను ప్రజలు ఆదరించారా లేదా అన్న విషయం ప్రక్కనపెట్టి ఆలోచిస్తే మూస పద్ధతిలో నాటకాలు ప్రదర్శించరాదు,కొత్త తరహాలో ప్రదర్శించాలనే ఆలోచనకు ప్రాణం పోసింది. పాశ్చాత్య నాటక ధోరణుల సంపర్కమే.

## ప్రతిభావంతులైన యువదర్శకులు

పూర్వోక్తమైనట్టుగా నాటక రచన ఈ దశాబ్ధిలో విస్తృత స్థాయిలో లేకపోయినా లభించిన నాటకాలనే ఆకర్షణీయంగా మలిచి జనరంజకంగా ప్రదర్శింపచేశారు. ప్రతిభావంతులైన కొందరు దర్శకులు. పామర్తి సుబ్బారావు, రామచంద్ర కాశ్యప, కె.వెంకటేశ్వరరావు, అయితా బలరామయ్య, నాగేశం, దేశిరాజు హనుమంతరావు, సింగరాజు నాగభూషణరావు, పి వేణు, సిద్దప్పనాయుడు, భానుప్రకాష్, ఎ.శివరామి రెడ్డి, చాట్ల శ్రీరాములు, దేశిరాజు హనుమంతరావు, అబ్బూరి గోపాలకృష్ణ వంటి నిష్ణాతుల నేతృత్వంలో తెలుగు నాటకం కొత్త అందాలు దిద్దుకొంది.

## సామాజిక స్పృహకు నిలువెత్తు సందేశాలు

ఇంతకు పూర్వం వెలువడిన నాటకాలలో ముఖ్యంగా మూఢవిశ్వాసాలు, సాంఘికదురాచారాలు, వేశ్యాలోలత్వం, ప్రేమ విజయం, వైఫల్యం,పెళ్ళి, ఆర్థిక అసమానతల వల్ల ఉత్పన్నమయ్యే సమస్యలు, నిరక్షరాస్యత, మద్యపానం, అంటరానితనం, పేదలపై ధనిక వర్గాల దౌర్జన్యం పోలీసుజులుం, నిరుద్యోగం, ఆకలి, దారిద్ర్యం మొదలైనవి కథావస్తువులు. వీటి మీద వందల కొద్దీ నాటకాలు, నాటికలు ఉత్పత్తి అయ్యాయి.

## చైతన్య దీపాలు వెలిగించిన రచయితలు

1970 తర్వాత వస్తు స్వీకరణలో కొత్త పుంతలు తొక్కారు నాటక కర్తలు ఈ దేశంలో రాజకీయ చైతన్యం లేని గ్రామీణులు, దేవుడి పేరుతో దోపిడి చేసే స్వాములు, ఈ సమాజంలో కొన్ని నోరులేని వర్గాలు అనుభవి స్తున్న బాధలు, స్త్రీలపై అత్యాచారం, స్త్రీ వ్యక్తిత్వవికాసం, న్యాయవ్యవస్థలో ఉన్న లోటుపాట్లు, సగటుమనిషిని కొల్లగొట్టే సాటి మనుషులు, లంచ గొండితనం, కులవ్యవస్థ, మనస్తత్వ విశ్లేషణ -ఇట్లాంటి కథా వస్తువులను నేటి కాలం రచయితలు చేపట్టారు అయితే అత్యధికంగా వచ్చిన నాటకాల లో రాజకీయవ్యవస్థను నాయకులను దుయ్యబట్టడం అనేదే ప్రధాన ఇతివృత్తం కావడం పరిశీలనార్హం

## ప్రజాదరణను చూరగొన్న పలువురు రచయితలు

1970-80 మధ్యకాలంలో పౌరాణిక, చారిత్రక, జానపద నాటకాల సంఖ్య బాగా తగ్గిపోయింది వచ్చిన కొద్ది నాటకాలు కూడా రంగస్థలాన్ని స్పృశించలేదు. బహుశా ఈ పౌరాణిక, చారిత్రక నాటకాలు విశ్వ విద్యాలయాల్లో, కళాశాలల్లో పాఠ్యగ్రంధాలుగా పెట్టించే నిమిత్తం తయారు చేసినవి కావచ్చు.

ఈ దశాబ్దిలో కొత్తగా నాటక రంగంలోకి ప్రవేశించిన గణేశ్ పాత్రో, యండమూరి వీరేంద్రనాథ్, పరుచూరి వెంకటేశ్వరరావు, హరనాధరావు, యం.సంజీవి, పూసల వెంకటేశ్వరరావు, కాశీవిశ్వనాధ్, సి.యస్. రావు ప్రభృతులు బహుళ జనాదరణ పొందిన నాటకాలు సృష్టించి ప్రధమ శ్రేణి రచయితలుగా ప్రసిద్ధులయ్యారు.

## కొర్రపాటి సంచలనాత్మక నాటకం, యధా ప్రజా తధా రాజా

ఇక ఈ దశాబ్ది నాటకాల తీరు తెన్నులు పరిశీలిస్తే డా.కొర్రపాటి గంగాధరరావుగారి 'యధా ప్రజా - తధా రాజా' సంచలనాత్మక నాటకంగా విశేష ప్రచారం పొందింది. దండధరం ఆ వూళ్ళో డబ్బు, పలుకుబడివున్న ఆసామి, సహకార సంఘానికి ప్రెసిడెంటు. అన్నీ నామమాత్రంగా కాగితాల మీద ప్రభుత్వం యిచ్చే ఋణాల తాలూకు పెద్ద మొత్తాలు స్వాహాచేస్తుం టాండు. ఉక్కు పిడుగులాంటి

ఆఫీసరు ఆ మేరకు రిపోర్టుకూడా తయారు చేస్తాడు. దండధరం జిత్తులకు అతను లొంగడు దండధరం అతనిని బెదిరిస్తాడు ఆఫీసరుకి దండధరం పాలేరు అండగా నిలిచి ధైర్యం చెప్తాడు. ఆగ్రహం పట్టలేక పాలేరుని నిలువునా తగలబెట్టి చంపేస్తాడు దండధరం. విచారణకు పోలీసులొస్తే సాక్ష్యం చెప్పడానికి ఎవరూ ముందుకురారు న్యాయదేవత స్తంభించి పోయి దిక్కుతోచక చూస్తుండగా దండధరం హత్య చేయబడతాడు. ఆ క్షణంలో అతనిని చంపింది ఎవరో కాదు దండధరం కూతురే, "పది రూపాయలిస్తే ఓట్లు వేసే జనానికి పదికోట్లిస్తే దేశాన్ని అమ్మేసే ప్రభుత్వం వస్తుంది". అని హెచ్చరించాడు నాటకంలో ఒక పాత్రచేత రచయిత.

# సమాధి కడుతున్నాం, చందాలివ్వండి

పరుచూరి వెంకటేశ్వరరావు రచించిన 'సమాధికడుతున్నాం-చందాలివ్వండి' నాటకం ప్రజాస్వామ్యం లో నెలకొన్న పరిస్థితిని సరికొత్త కోణం నుంచి వ్యాఖ్యానిస్తుంది. బలహీన వర్గాలను ఉద్ధరించడమే మా ప్రధాన లక్ష్యమని గొంతు చించుకుని అరిచే నాయకులు, నిజంగా ఆ బడుగువర్గాలనుంచి విద్యావంతుడైన ఒక యువకుడు ఒక్క మెట్టు పైకి పోవడానికి ప్రయత్నిస్తే సహించరు. తమ మార్గానికి అడ్డంకులు కల్పించి ప్రతిఘటిస్తారు. సామదానభేద దండోపాయాలు ప్రయోగించి ఆ మనిషిని లొంగదీయడానికి ప్రయత్నిస్తారు అప్పటికీ సాధ్యంకాకపోతే అతన్ని ఖర్చుకింద లెక్క రాసి సమస్యను పరిష్కరించుకుంటారు. ఓట్లు కొనుక్కుని గద్దె లెక్కేపెద్దలు, ఓట్లు అమ్ముకునే ప్రజలూ వున్న నేటి ప్రజాస్వామ్య వ్యవస్థలో ఏదీ అసంభవంకాదని వ్యక్తం చేస్తుంది. ఈ నాటకం.

# విమర్శలు రేకెత్తించిన "సిద్ధార్థ నాటిక"

ఆది విష్ణు రచించిన 'సిద్ధార్థ' గుంటూరు శాస్త్రి, కె యస్. టి.శాయి బృందాలచే విజయవంతంగా ప్రదర్శితమైన నాటకం. కార్మికుల శ్రమను దోపిడి చేసి, స్వర్గ సౌఖ్యాలు అనుభవిస్తున్న బాస్‌ని చూసి అనుక్షణం ద్వేషంతో బుసలుకొట్టే కార్మికనాయకుడు చెన్నయ్య - పేదలకు పంచమని 'బాస్'కొడుకు తన కిచ్చిన డబ్బుతో పరారై తానొక బాస్‌గా తయారౌతాడు. ఇదీ కథ 'సిద్ధార్థ'లో కార్మికోద్యమ

ప్రతిష్టను దెబ్బతీసే విధంగా వుందని అప్పట్లో యీ నాటకం పై విమర్శలు కూడా వచ్చాయి.

మధ్యతరగతి కుటుంబం కట్నాల విషవలయంలో చిక్కుకొని తల్లడిల్లి పోవడం, దాని పర్యవసానాన్ని ఇతివృత్తంగా చేసుకొని బి.ఆర్. రంగారెడ్డి రాసిన 'జీవన సంధ్య' (1975) రచన, ప్రదర్శన రీత్యా ఒక మంచి నాటకం.

## ఇసుకపల్లి మోహనరావు, ఓ బూతు నాటకం

70వ దశకంలో నాటక రచయితగా, నటుడుగా వెలుగులోకి వచ్చిన వారిలో ఇసుకపల్లి మోహనరావు పేర్కొనదగినవారు. ఈయన రచించిన ' ఓ బూతు నాటకం' (1978) 'డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్' 'పురుషార్థం' నాటకాలు సుప్రసిద్ధాలు. యౌవనోద్రేకంలో యువతీ యువకులు పరస్పరాకర్షణకు లోనైతే స్త్రీ వైపే వేలెత్తి చూపుతుంది సంఘం. కాని పురుషుణ్ణి వదిలేస్తుంది. సాంఘిక న్యాయం, నీతీ స్త్రీ పురు షులపట్ల సమంగా వర్తింపచేయాలని ప్రబోధించే నాటకం ' ఓ బూతు నాటకం'. నాటక రంగంలో స్త్రీ వాదాన్ని ప్రతిబింబించే నాటకాలలో దీని ని ప్రముఖంగా పేర్కొనవచ్చు. రాజకీయ వ్యాపారులు పదవికోసం ఎంతకైనా దిగజారుతారనీ, అధికారంలో వున్న మంత్రులు వ్యక్తిగత జీవితాలలోకి కూడా చొరబడి, వాళ్ళని బ్లాక్ మెయిల్ చేసి బెదిరించి ఎలాగైనా తమవని చక్కబెట్టుకొంటారని వివరించారు. 'పురుషార్థం' అనే నాటకంలో. రంగస్థలంపై మూడుగదుల్లో ఏక కాలంలో కథ నడవడం విశేషం; మనిషి చిత్తవృత్తిలోని ద్వైదీబావానికి, హిపోక్రసీ కి ప్రతీక 'డియర్ ఆడియన్స్ సిన్సియర్లీ యువర్స్'అనే నాటకం.

## హరనాథరావు, 'జగన్నాథ రథ చక్రాలు'

'జగన్నాథ రథ చక్రాలు' నాటకంలో నాటక రచయితగా గుర్తింపు పొందిన యం.వి.యస్. హరనాధరావు గారి 'క్షీరసాగర మధనం'(1979) నాటకం ఈ దశాబ్దిలో వెలువడిన ఉత్తమ శ్రేణి నాటి నాటకాలలో ఒకటి. కులమతాల అడ్డుగోడలు కూలిపోతున్న ఈ రోజుల్లో ఇంకా బ్రాహ్మణ్యాన్ని పట్టుకు వ్రేలాడే సంప్రదాయబద్ధులు,

పూర్వాచారపరాయణులు ఉన్నారు. అలాంటివారికి అడుగడునా ఎదురు దెబ్బలే తప్ప జీవితం సజావుగా సాగిపోవడం దుష్కరం. కాలాన్ని బట్టి జీవన విధానంలో మార్పులు చేసుకోవడం అవసరం. అలా జీవితంలో రాజీపడలేని వారి జీవితాలు విషాదాంతాలవుతాయని వివరిస్తుంది 'క్షీరసాగర మధనం' నాటకం. ఈ నాటకానికి 1982 లోఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి బహుమతి లభించింది. 'యక్షగానం' అనే నాటికను కూడా హరనాధరావుగారు రచించారు. ప్రాచీన కళారూపమైన యక్షగానం వృత్తిగా స్వీకరించి ఆరాధించే కళాకారుల స్థితిగతులు ఎంత దయనీయంగా ఉన్నాయో యక్షగానం నాటికలో హృదయంగమంగా చిత్రించారు రచయిత. ఒంగోలు 'అభినయ' సమాజం వారిచే ఈ నాటిక విస్తృతంగా ప్రదర్శింపబడి ప్రజాభిమానాన్ని చూరగొన్నది.

## వీరేంద్రనాధ్, విలువైన నాటికలు

యండమూరి వీరేంద్రనాధ్‌గారు ప్రసిద్ధ నవలా రచయిత, సినిమా రచయితే కాకుండా మౌలికంగా ఆయన నాటక రచయిత. ఈ దశాబ్దిలో నాలుగు నాటకాలను, పది పన్నెండు నాటికలను వెలువరిం చారు. పుట్ట, రఘుపతి రాఘవ రాజారామ్, డామిట్ కథ అడ్డం తిరిగింది. జలతరంగిణి అనే నాటకాలను, చరిత్ర రుద్రవీణ, కుక్క, మని+షి మొద లైన నాటికలను రచించారు. నాటకాలకంటే రుద్రవీణ, కుక్క, చరిత్ర వంటి నాటికలే శ్రీ యండమూరిని నాటక రచయితగా నిలబెట్టాయని చెప్పవచ్చు.

మారుమూల పల్లెటూళ్ళో రిటైర్ అయిన బడిపంతులు పెన్షను కోసం పడేపాట్లు 'రుద్రవీణ' లో చిత్రితం. దర్శకులు దేశిరాజు హనుమంత రావు ఈ నాటికలో యక్షగాన పద్ధతిని ప్రవేశపెట్టి కొత్త అందాలు దిద్ది ప్రదర్శనను చిరస్మరణీయం చేశారు. అణగివున్న బలహీనుడి మీద ధనగర్వంతో మరింత స్వారి చెయ్యాలను కుంటే ప్రతిఘటన అనివార్య మౌతుందని ప్రతీకాత్మకంగా చెప్పిన నాటి 'కుక్క'. యండమూరి నాటక నాటికలను ప్రప్రథమంగా దర్శకత్వం వహించి ప్రదర్శింపజేసిన ఘనత దేశిరాజు గారికి దక్కుతుంది.

## గొప్ప నాటకం "ఎర్ర గులాబీ"

గొల్లపూడి మారుతీరావుగారి 'లావాలో ఎర్ర గులాబీ' (1972) నాటకం శ్రీచాట్ల శ్రీరాములు గారి దర్శకత్వంలో వినూత్న పద్ధతిలో ప్రయోగించబడింది. మనిషి కదలికల్ని ఒక చోట నుండి మరొక చోటికి నడుస్తూ కాక ఒక ఇన్‌వాలీడ్స్ వీల్ చైర్ లో కదిలే ఏర్పాటు చేసి, ఒక పాత్రలో ఉన్న భావోద్రేకాన్ని, వీల్ ఛైర్ మూమెంట్ ద్వారా చూపించడం ఈ నాటక ప్రదర్శనలోని కొత్త ప్రయోగం.

## ప్రొఫెసర్ పరబ్రహ్మం

రావి కొండలరావుగారి, ప్రొఫెసర్ పరబ్రహ్మం (1977) హాస్యప్రధాన నాటకం. ప్రొఫెసర్ తయారుచేసిన మందుసేవిస్తే వయస్సుతో నిమిత్తం లేకుండా ఎంతటి వాడైనా అమాంతం బాల్యదశలోకి వెళ్ళిపోవచ్చు. మళ్లీ మందు తాగితే యధాస్థితికి రావచ్చు. అతని ప్రయోగం బెడిసి కొట్టిన ఫలితంగా ఉత్పన్నమయ్యే సమస్యలతో హాస్య సన్నివేశాలతో ప్రేక్షకుల్ని కడుపుబ్బ నవ్విస్తుంది, ఈ నాటకం. రావికొండలరావు లోగడ రచించిన 'నాలుగిళ్ళ చావడి' 'పట్టాలు తప్పిన బండి' నాటకాలు, కుక్కపిల్ల దొరి కింది నాటిక హాస్యప్రధానమైనవే! అత్తిలి పద్మావతీకృష్ణ మరాటీ నుంచి అనువదించిన 'సంధ్య-ఛాయ' నాటకం కె. శ్రీహరి మూర్తి గారి దర్శకత్వంలో ఆంధ్రదేశం నలుమూలల్లో విస్తృతంగా ప్రదర్శించబడి ప్రశంసలు అందుకుంది. దూరదేశాల్లో వున్న కొడుకు రాక కోసం తల్లి దండ్రుల నిరంతర ప్రతీక్షణ, అనుభవించే మానసికక్షోభ, ఆర్తి ఈ నాటకం నిండా పరచుకుని ఉంది. కరుణరస పూరితమైన ఈ నాటకంలో శ్రీహరిమూర్తి, శకుంతల ప్రధాన భూమికలు ధరించి నాటకానికి ప్రాణం పోసి రచయిత్రి కీర్తిని ఇనుమడింపచేశారు.

## పేరుతెచ్చుకున్న పి.వి.రమణ నాటికలు

ప్రసిద్ధ నాటక విమర్శకులు డా. పి.వి. రమణ గారి కలం నుంచి 'అకురాలిన వసంతం' 'వెంటాడే నీడలు' 'దేవతలెత్తిన పడగ', 'చలిచీమలు' 'మృత్యునీడ' 'మహస్సు' మొదలగు నాటకాలు, మానవతకూ నిండాయి నూరేళ్ళు,

న్యాయమే గెలుస్తుంది. ధర్మదేవత, పగ మొదలైన నాటికలు వెలువడినాయి. ఆకురాలిన వసంతం, చలిచీమలు, వెంటాడే నీడలు వీరికి పేరుని తెచ్చాయి వందలాది ప్రదర్శనలకు నోచుకున్న నాటకాలు

## చిల్లర భావనారాయణ నాటకాలు

తెలంగాణాలో నాటక రంగానికి ప్రశంసనీయమైన సేవచేసిన వారిలో శ్రీ చిల్లర భావనారాయణ పేర్కొనదగినవారు వీరు సుమారు 20 నాటకాలను ఔత్సాహిక నాటక రంగానికి అందించారు.వాటిలో చారిత్ర కాలు, పౌరాణికాలు, సాంఘిక నాటకాలూ ఉన్నాయి. అన్నీ రంగస్థలం మీద ప్రదర్శితమైనవే. పర్షియన్‌కవి, తత్వవేత్త అయిన ఉమర్ ఖయ్యామ్ జీవితం చుట్టూ అల్లిన రమణీయ చారిత్రకనాటకం 'ఉమర్‌ఖయ్యామ్' యస్.కె.ఆంజనేయులుగారి దర్శకత్వంలో ఈ నాటకం అద్భుతంగా ప్రద ర్శించబడేది. భావనారాయణగారి 'భావనా శాకుంతలం' నాటకాన్ని జె. సిద్ధప్పనాయుడు గారి దర్శకత్వంలో ఆంధ్రప్రదేశ్ సచివాలయ సాంస్కృతిక సంఘం వారు రాష్ట్ర, రాష్ట్రేతర ప్రాంతాలలో కూడా ప్రదర్శించి జనామోదం పొందారు. శ్రీ చిల్లర రచించిన సాంఘిక నాటకం 'పదవులు - పెదవులు' స్త్రీని ఎరవేసి పదవులు పొందాలనే ప్రబుద్ధులను ఎండగట్టే నాటకం.

## గండవరపు నాటకం" కలిసిబ్రతుకుదాం"

నెల్లూరు మాండలికంతో, గ్రామీణ జీవితాన్ని చిత్రించే కలిసి బ్రతుకుదాం' (1979) నాటకాన్ని శ్రీ గండవరపు సుబ్బరామిరెడ్డి రచించారు. హైదరాబాద్ శ్రీ కళాభారతి సమాజం ఈ నాటకాన్ని సిద్ధప్పనాయుడుగారి దర్శకత్వంలో జనరంజకంగా ప్రదర్శించింది. దూరదర్శన్ లోనూ, ఆకాశవాణిలోను 'మన ఊరు పేరు తో ప్రసారం చేయబడింది. ప్రశంసలు అందుకుంది. కాలం ఎంత మారినా కాలంతోపాటు తాము మారలేక మారడం ఇష్టంలేక ఏటికెదురీదుతూ బలహీనులపై ప్రభావం చూపుతూ గ్రామాన్ని తన గుప్పెట్లో ఉంచుకోవాలనుకునే ధూర్తులు కొందరైతే మంట చల్లారిపోకుండా కట్టెలు ఎగదోసే స్వార్థపరులు కొందరు. కలసి బ్రతుకుదాం, గ్రామాన్ని అభ్యుదయ పథంలోకి నడిపించుకుపోదాం, పేదవారి బ్రతుకుల్లో

వెలుగులు నింపుదాం అనే మహదాశయంతో సేవచేసే మహనీయులు కొందరు. వీరి మధ్య సంఘర్షణ, దాని పర్యవసానం ఇదే 'కలిసి బ్రతుకుదాం' నాటకం.

## చెప్పకోదగిన సి.యస్.రావు, నాటికలు

నాటకరంగానికి ఉన్నత ప్రమాణాలుగల నాటికలను అందించిన వారిలో శ్రీ సి.యస్.రావు ఒకరు. వీరి నాటికలలో ఊరుమ్మడి బతుకులు (1974) ప్రాణం ఖరీదు (1977) సుప్రసిద్ధాలు, అట్టడుగువర్గాల బ్రతుకు బాధల్ని నగ్నంగా వివరించే నాటికలివి. ఊరుమ్మడి బతుకులులో హరి శ్చంద్రుడి పాత్రను నూతనప్రసాద్ అద్భుతంగాపోషించి నాటికకు ప్రాణం పోసేవారు. 'ఈ దేశంలో ఒక పేదపిల్ల శీలం ఖరీదు పాతిక రూపాయలు -గొప్పింటి ఆడదాని అవినీతి ఖరీదు ఒక పేదవాడిప్రాణం' అనే నగ్న సత్యానికి రూపకల్పన 'ప్రాణం ఖరీదు'నాటిక.

## ఆదరణపొందిన "మీరైతే ఏం చేస్తారు?"

70వ దశకంలో వెలుగులోకి వచ్చిన నాటక కర్తలలో కాశీవిశ్వనాధ్ ఒకరు. ఇరవై కి పైగా నాటక నాటికలు వ్రాసి నాటకరంగాన్ని సుసంపన్నం చేశారు. నిజానికి ఈ దశాబ్దిలో అధిక సంఖ్యలో రచనలుచేసిన వారు విశ్వనాధ్ గారే. వీరు రచించిన 'మీరైతే ఏం చేస్తారు?'అత్యంత ప్రజాదరణ పొంది, రచయిత స్థానాన్ని సుస్థిరం చేసిన నాటిక అని చెప్పవచ్చు. రాజకీయ నాయకులు తమ పబ్బం గడుపుకోవడానికై తమకింద నమ్మకంగా పనిచేసేవారిని పావుల్లా వాడుకొంటారు. ఆగర్భ శత్రువుల్లా ఒకర్ని ఒకరు ద్వేషించుకునే నాయకులు, సమయం వస్తే ఏకమవుతారు. తమకోసం తలలు పగులకొట్టుకొన్న విశ్వాసపాత్రులని గురించి పట్టించుకోరు. వారు నాశనమై పోయినా అయ్యో పాపం అనరు ఆ నాయకమ్మన్యులు. ఇది అనాదిగా జరుగుతున్న తంతు. అజ్ఞానంలో పడి, రాజకీయనాయకులకు కనువిప్పు కలిగిస్తుంది 'మీరైతే ఏం చేస్తారు?' నాటిక. పామరజనానికి రాజకీయచైతన్యం కలిగించడానికి ఈ రచన ఎంతో దోహదం చేస్తుంది. విశ్వనాధ్ రచించిన 'ఇక్కడ ప్రేమ లేఖలు వ్రాయబడును' 'ఒకదీపం వెలిగింది' 'గరీబీ హఠావో' 'ఇప్పుడు వీస్తున్న గాలి' మొదలైన నాటికలు

కూడా విజయవంతంగా ప్రదర్శింపబడి రచయిత కీర్తిని ఇనుమడింప చేశాయి.

డా.పి.వేణు రచించిన 'వంశవృక్షం' నాటిక 1972లో వెలువడింది. బాధాసర్పదష్టుడైన నిరుద్యోగి మనోవ్యధనుంచి జాలువారిన చిత్త వృత్తికి దర్పణం 'వంశ వృక్షం' నాటిక. నిరుద్యోగి మనోవీధిలో విహరించే వూహలు నేపథ్యంలోంచి విన్పిస్తుంటే, రంగస్థలం మీద నటుడు ఆ ఆలోచనా తరంగాలకు అనుగుణంగా అభినయిస్తూ ఉండడం ఈ నాటికలో రచయిత ప్రయోగించిన కొత్త టెక్నిక్.

## విజయరత్నం "కేండిల్స్" నాటిక

ఉపాధ్యాయ వర్గం మీద ప్రశంసా వాక్కులు కురిపించే మన సమాజం ఉపాధ్యాయుల స్థితి గతుల్ని పట్టించుకోదు. ఊరుకాని ఊళ్ళో ఉద్యోగం చెయ్యడానికి వెళ్ళిన ఒక ఉపాధ్యాయిని మీద పయోముఖవిష కుంభంలాంటి ఆ గ్రామ సర్పంచ్ అత్యాచారం చేస్తాడు. ఏమీ జరగనట్టు ఊరు మౌనం వహిస్తుంది. ఉపాధ్యాయిని ఆత్మహత్య చేసుకొంటుంది. ఆమె భర్త కూడా ప్రాణాలు విడుస్తాడు. ఈ నిస్సహాయస్థితి, ఈ దారుణ పరిస్థితులు సంఘంలో ఇంకా కొనసాగవలసిందేనా, వాటికి అంత మెప్పుడు? అని ప్రశ్నిస్తాడు రచయిత 'కేండిల్స్' అనే నాటిక ద్వారా. దీని రచయిత జి విజయరత్నం. వివిధ పరిషత్ పోటీలలో బహుమతులు అందుకొంది ఈ నాటిక.

## వెలుగొచ్చింది నాటిక

రత్నగిరి జగన్నాథం రచించిన 'వెలుగొచ్చింది' నాటిక అయితా బలరామయ్యగారి దర్శకత్వంలో అనేక తావుల్లో ప్రదర్శితమైంది. పెద్ద భూస్వామి ఎన్నికల్లో పోటీ చేస్తుంటే అతనికి పోటీగా అభ్యుదయ భావాలు న్న ఒక సామాన్యుడు నిలబడతాడు. త్రాగుడుకు బానిసై యజమాని చెప్పుచేతల్లో ఉన్న తండ్రి, ఆవేశంలో తన కొడుకునే హత్య చేస్తాడు. పరి స్థితుల్ని అర్థం చేసుకుని ఆ కత్తితోనే భూస్వామిని అంతం చేసి ఆ పల్లెకు వెలుగొచ్చిందని చాటుతాడు. ఆశ్రితుల ఆర్థిక దుస్థితిని, అజ్ఞానాన్ని ఆసరా చేసుకుని తన స్వప్రయోజనాలకు వాడుకునే పెద్ద మనుషుల పట్ల పల్లె ప్రజలు అప్రమత్తంగా ఉండాలని ప్రబోధిస్తుంది ఈ నాటిక. దీనికి ముందు

రత్నగిరి 'దేవుడు' అన్న పేరుతో మరొక నాటికను కూడా రచించారు దీనిలో ఇతివృత్తం కూడా ఇంచుమించుగా ఇదే. ఆర్థికంగా చితికిపోయి దీనావస్థలో ఉన్న కష్టజీవుల్ని కాల్చుకుతినే ధనమదాంధుల దౌష్ట్యాలను, బడుగువర్గాల బాధల గాధలను చిత్రించే నాటికలు ఈ కాలంలో అధిక సంఖ్యలోనే వచ్చాయి.

## విశేష ఆదరణపొందిన ఎన్నో నాటికలు

యం దివాకరబాబు రచించిన 'అసురగణం' యం.సంజీవి గారి 'కదలిక' దీన్ బద్రుగారి 'చైతన్యతరంగం' సుకమంచి కోటేశ్వరరావుగారి 'మా సమాధులే మీ పునాదులు' గణేష్ పాత్రోగారి 'ఆగండి కొంచెం ఆలోచించండి' వి.యస్.కామేశ్వరరావుగారి 'సర్పయాగం' డి. ప్రభాకర్‌గారి 'పల్లె మేల్కొంది' మొదలైనవి విశేష ప్రజాదరణ పొందిన ఉత్తమ నాటికలు. ఇక్కుర్తి నరసింహారావు రచించిన 'పిడికిలి' నాటిక కూడా ఈ కోవలోనిదే. సమాజంలో అంటరానివారుగా అస్పృశ్యులుగా అణగదొక్కబడిన నిమ్న కులాల మధ్య సంఘర్షణకు, అనైక్యతకూ అద్దం పడుతూ, వారి బలహీనతలను మత్తుగా మార్చి, స్వంత లాభం కోసం పెనుగులాడే పెద్ద కులాల స్వార్థానికి సమగ్ర రూపకల్పన 'పిడికిలి' నాటిక.

విద్యతోపాటు సంస్కారం పెరిగినప్పుడే విద్యకు విలువ వుంటుందనీ, సంయమన శక్తిని కోల్పోయిన విద్యావంతుడు పశుప్రాయు డని ప్రబోధిస్తుంది. పి.వి రావుగారి 'ఛీఛీ' నాటిక ప్రదర్శనపరంగా, సాహిత్య పరంగా కూడా ప్రశంసలు అందుకొన్న నాటిక ఇది.

## అందర్నీ మెప్పించిన ఆది విష్ణు హాస్య నాటికలు

హాస్య రచయితగా ముద్రపడిన ఆదివిష్ణు గారు ఈ దశాబ్దిలో అయిదారు నాటికలు వెలువరించారు. వాటిలో అతిధి దేవుళ్లొస్తున్నారు సుప్రసిద్ధమైంది. ఒక మహా పట్టణంలో పెళ్ళయి కొత్తగా కాపురం పెట్టుకున్న నవ దంపతులు తియ్యని ఊహల్లో తేలిపోయే తరుణంలో అటు వైపునుంచి కొందరు ఇటువైపునుంచి కొందరు అతిథులొస్తుంటే ఆ యువ జంట పరిస్థితి ఎలా ఉంటుందో ఆ సంకట పరిస్థితిని

హాస్యప్రధానంగా చిత్రించారు రచయిత 'అతిథి దేవుళ్ళొస్తున్నారు'(1973) నాటికలో, నిజం చెప్పడంలో ఎన్నో కష్టాలున్నాయి. కనుకనే మనుషు లు అనేక సందర్భాల్లో అబద్ధాన్ని ఆశ్రయించి కష్టాలు తప్పించుకోవడం జగమెరిగిన సత్యమే. ఒకవేళ ఎవరైనా శాస్త్రజ్ఞుడు మనిషి చేత నిజాన్ని మాత్రం పలికించే యంత్రం కనిపెట్టి అమల్లోకి తెస్తే మనుషుల పరిస్థితి ఏమిటి? ఈ ఊహ మీద హాస్యరసస్ఫోరకంగా ఆదివిష్ణు అల్లిన నాటిక 'నథింగ్ బట్ ట్రూత్' ప్రదర్శన ఆద్యంతమూ గిలిగింతలు పెడుతుంది. ఆదివిష్ణుగారి హాస్య నాటికలలో శాబ్దిక హాస్యం ప్రధాన పాత్ర వహించడం పరిశీలనార్హం.

## తారక రామారావు నాటికలు, నాటకాలు

ప్రముఖ కథా, నవలా రచయితగా ఖ్యాతి గడించిన శ్రీ యన్. తారక రామారావు 1976 ప్రాంతాలలో నాటక రచనకు ఉపక్రమించి, ఇప్పటికి 30 నాటికలను, నాటకాలను రచించారు. వీరి నాటకాలన్నీ ప్రప్రథమంగా శ్రీ కళానికేతన్ (హైదరాబాద్) వారిచే ప్రదర్శించబడి దరిమిలా రాష్ట్ర మంతటా ప్రదర్శితమైనాయి. శరణం గచ్ఛామి, కురుక్షేత్రం, సప్తపది, ఆత్మసాక్షి, మహాప్రస్థానం, చరమాంకం, ప్రమధ ,వీరి ప్రసిద్ధ నాటకాలు. వరుడుకావాలి, వీధినాటకం, షరామామూలే, ఇదీలోకం వీరికి పేరు తెచ్చిన నాటిక . వీరి చరమాంకం నాటకానికి 1987లో రాష్ట్ర ప్రభు త్వం వారి అవార్డు లభించింది.

## అనేక హాస్య రచనలు

ఈ దశాబ్ది లో పెక్కు హాస్య రచనలొచ్చాయి. డి.వి.రమణమూర్తి గారి 'వశీకరణం' 'ఉత్తరం' రత్నగిరి గారి 'ఊహా జీవులు' సుబ్బరామిరెడ్డి 'పన్నీటి జల్లు' ఆగండి నేనూ వస్తున్నా', కె.యస్.టి. శాయిగారి 'కలియుగపురుషుడు', సముద్రాల అప్పలాచార్యుల 'తులసి తీర్థం' 'మంచం మీద మనిషి', ధవళ సన్యాసిరావుగారి 'క్యూ'జంధ్యాలగారి 'గుండెలు మార్చబడును', బలరామమూర్తిగారి 'ఇల్లు అలికిన ఈగ' మొదలైన హాస్య నాటికలు ప్రేక్షక లోకాన్ని అలరించాయి.

## భీసెట్టి, ఛాయనాటిక

ప్రతీకారవాంఛ మనిషిని ఉన్నతుడిగా మార్చి విచక్షణా శక్తిని హరిస్తుందనీ, మానవత్వాన్ని నశింప చేసి మనిషిని మృగంగా మారుస్తుందనీ భీసెట్టి లక్ష్మణరావుగారి 'ఛాయ' నాటికలో వివరించబడింది. తనకుటుంబానికి తీవ్రమైన ద్రోహం చేశాడన్న కోపంతో, అపకారం చేసినవాని పిల్లల మీద పగబట్టి వాళ్ళని చిత్రహింసలపాలు చేస్తాడొక వ్యక్తి అమానుషంగా హింసిస్తాడు. కాని ఆ పిల్లలు పగవాడి పిల్లలు కారనీ తన పిల్లలేనని నిజం తెలుసుకొన్న తర్వాత గుండెలు అవిసిపోయేటట్లు ఏడుస్తాడు. ప్రదర్శనపరంగా దిగ్విజయాన్ని సాధించిన నాటిక ఇది.

## వివిధ సమస్యలు వివిధ రచనలు

చెయ్యని నేరానికి తప్పుడు కేసులో ఇరికించి, అమాయక స్త్రీలను ఎలా వేధిస్తారో, స్త్రీలకు పోలీస్ స్టేషన్లో కూడా రక్షణ లేని స్థితిని, కంచేచేను మేసే దారుణ పరిస్థితులకు అద్దం పడుతుంది పెందుర్తి యువరాజ్ రచించిన 'నాగులు తిరిగే కోనలో' అనే నాటిక.

శశిమోహన్ రచించిన 'ఫర్‌సేల్' నాటికలో " ఈ దేశంలో ఒక ఉద్యోగాలే కాదు మనుషులు తమనీ, తమ సిద్ధాంతాలనీ, తమ అనుచరుల్నీ, ఆఖరికి తమ ఆత్మలని కూడా 'అమ్మేస్తున్నారు' అనే ఆర్తికి దృశ్య రూపమే 'ఫర్‌సేల్' నాటిక.

మధ్యతరగతి సంసారంలో బాదలకు అవతలిగట్టు అంటూ వుండదనీ, చక్రనేమి క్రమంలో కష్టపరంపరలు వచ్చి పడుతూ మనుషుల్ని భయపెడుతూనే వుంటాయనే ఇతివృత్తంతో కరుణ హాస్యరసాల మేళవింపుతో చిత్రించిన నాటిక రాళ్ళపల్లి వారి 'ముగింపులేని కథ'

సునిశిత వ్యంగ్యంతో నాటికలు వ్రాసిన వారిలో తనికెళ్ళ భరణి గణనీయులు. నేటి ప్రజాస్వామ్యంలో దిజ్యూర్, దిఫ్యాక్టోసోవిరన్ (అధికారంలో ఉండే దొకరు నిజమైన అధికారం చెలాయించేది ఇంకొకరు) అనేవి రాజకీయ శాస్త్రంలో వ్యర్థ పదాలు కాదనే సత్యాన్ని 'గార్ధ భాండం'అనే నాటికలో సువ్యక్తం చేశారు రచయిత.

## ప్రజలను ఆకట్టుకున్న పాత్రో నాటకాలు

1970 ప్రాంతంలో కలం పట్టిన శ్రీ గణేశ్ పాత్రో అయిదేండ్లయినా గడవక ముందే ప్రథమశ్రేణి నాటకకర్తగా లబ్ధ ప్రతిష్ఠులయ్యారు. రచనలు పదికి మించక పోయినా రాసిన ప్రతి నాటకమూ, నాటికా రంగస్థలం మీద రక్తి కట్టి రసజ్ఞుల మెప్పు పొందింది. కథావస్తువును పరిగ్రహించడంలో, కథనంలో, పాత్రచిత్రణలో, సన్నివేశాలమేళవింపులో, మాటల కూర్పులో-అంతటా నిత్యనూతన పరిమళాన్ని వెదజల్లిన ప్రతిభాశాలి గణేశ్ పాత్రో. ఈయన రచించిన తరంగాలు, అసురసంధ్య, త్రివేణి నాటకాలు, కొడుకు పుట్టాల, పావలా, లాభం, ఆగండి కొంచెం ఆలోచించండి మొదలైన నాటికలు ఆంధ్రప్రేక్షకుల అభిమానాన్ని దోచుకున్న ఉత్తమ రచనలు.

## అలరించిన తరంగాలు నాటకం

అనాది నుంచీ మానవ సమాజంలో మూడు తరగతులున్నాయి పై తరగతి, మధ్యతరగతి, కింది తరగతి. ఈ విభజనను శాసించే శక్తి పేరే డబ్బు. ఈ మూడు తరగతుల నైతిక ప్రవర్తనకు దిక్సూచి డబ్బు. డబ్బు విషయంలో మూడు తరగతుల వారు ప్రవర్తించే తీరు ఎలా వుంటుందో 'తరంగాలు' నాటకంలో మనస్సుకి హత్తుకునేలా చిత్రించారు. అన్నీ కోల్పోయినా కింది తరగతి వారిలో నీతినిజాయితీలు చెక్కుచెదర కుండా మిగిలేవుంటాయనీ, అవే మానవజాతి మనుగడకు శ్రీరామరక్ష అని ధ్వనింప చేశారు నాటకంలో ప్రతి నటుడు మూడు వేషాలు వేసి నటనలో వైవిధ్యాన్ని ప్రదర్శించటానికి ఈ నాటకం వీలు కల్పిస్తుంది. ఆలిండియా సివిల్ సర్వీసస్‌లో 'తరంగాలు' ఉత్తమ ప్రదర్శనకు బహుమతి అందుకొంది. ఆలిండియా బెస్ట్ ఏక్టర్‌గా జె.సిద్దప్ప నాయుడు ఎన్ని కయ్యారు.

పాత్రో రచించిన 'అసురసంధ్య' నాటకంలో నెలవులు తప్పిన మనుషుల గతులు ఎలా ఉంటాయో హృద్యంగా చిత్రితమయ్యాయి. చిన్న చేపను పెద్ద చేప కబళించడం, పెద్దచేపను అంతకన్నా పెద్దచేప హరించటం - ఈ చక్రనేమిక్రమాన్ని దృశ్యరూపంలో ఆవిష్కృతం చేశారు రచయిత.

## కె. వెంకటేశ్వరరావుకు పేరు తెచ్చిన కొడుకు పుట్టాల

గణేశ్ పాత్రో గారిని మొదటి సారిగా వెలుగులోకి తెచ్చిన నాటిక 'కొడుకు పుట్టాల' (1970) పధ్నాలుగు భాషలలోకి అనువదింపబడి యావద్భారతకీర్తి సంపాదించిపెట్టిన ఉత్తమ దృశ్య కావ్యంఇది. విశాఖపట్నం మాండలీకంలో ఉండటం ఈ రచనలో ఉన్న ఒక ప్రత్యేకత. కుటుంబ నియంత్రణ మీద వచ్చిన నాటికలలో ఇంత ప్రాచుర్యం పొందిన నాటిక తెలుగు నాటక సాహిత్యంలో ఇంతవరకూ లేదు ఈ నాటికలో తారసిల్లే గంగులు, ఫకీరు సిమ్మాద్రి, శరభయ్య, కొర్లమ్మ-ఒక్కొక్కటి ఒక్కోకోణంలో వ్యక్తితత్వాన్ని సంతరించుకున్న సజీవ పాత్రలు. కొడుకు పుట్టాలని ప్రతీక్షిస్తూ జీవితాన్ని దు:ఖభాజనం చేసుకునే వారికి కనువిప్పు కల్గిస్తుందీ నాటిక గంగులు పాత్రలో మహానటుడు కె వెంకటేశ్వరరావు ప్రేక్షకులను తనతో నడిపించుకు పోయేవారు. వెంకటేశ్వరరావు నట జీవితంలో చివరి నాటిక కూడా ఇదే;

## విశిష్టనాటిక "కళ్ళు"

1970-80 మధ్యకాలంలో వచ్చిన మంచి రచనల్లో గొల్లపూడి మారుతీరావుగారి 'కళ్లు' రచన, ప్రదర్శన దృష్ట్యా కూడా విలక్షణమైన నాటిక కళ్ళులేని మనిషి మనసుతో చూడగలడు కాని కళ్ళున్న మనిషి మాత్రం మనసుతో చూడలేక పోతున్నాడు అనే ఆర్తి ప్రధానంగా ధ్వనిస్తుంది ఈ నాటికలో. ప్రజలు ఓట్లిచ్చి ప్రజాప్రతినిధిగా ఒక వ్యక్తికి అధికారం యిస్తే, ఆ వ్యక్తి సమాజానికి ఉపయోగపడకపోగా స్వార్ధానికి ప్రతిరూపంగా తయారైతే, ప్రజలు నెత్తిన చేతులు పెట్టే ఆ వ్యక్తిని పదవీచ్యుతుడ్ని చేసి అతని స్థానాన్ని గుర్తు చేయవలసిన అవసరం ఉందనే వాస్తవాన్ని ఉద్దీపింపచేస్తుంది 'కళ్ళు' నాటిక. కొంతమంది గుడ్డివాళ్ళు తమ కష్టార్జితా న్నంతా ధారపోసి ఒక యువకునికి కంటి ఆపరేషన్ చేయిస్తారు కంటి చూపు వస్తుంది అతను తమను ఆదుకుంటాడని ఆసరాగా ఉంటాడని ఆశలు పెట్టుకున్న గుడ్డి వాళ్ళని దారుణంగా మోసం చేస్తాడు ఆయువ కుడు. చివరికి వావివరసలు మరచిపోయి తమతో తిరిగే సీతాలుపై అత్యాచారం చేయబోతాడు. ఆత్మరక్షణ చేసుకునే ప్రయత్నంలో శూలంతో రంగడి కళ్ళ నుంచి వెలుగును

శాశ్వతంగా దూరం చేస్తుంది సీతాలు రంగడు మళ్ళీ అంధుడుగా మారిపోతాడు. కావ్యార్థాన్ని కళ్ళు అనే సింబల్ తో అభివ్యక్తం చేశారు రచయిత.

## ఇవేకాక మరెన్నో

ఇవేకాక ఈ దశాబ్దిలో ఆర్.వి.యస్. రామస్వామి రచించిన 'పైడిరాజు' యస్ మునిసుందరం గారి 'సింగారం' పూసల వెంకటేశ్వర రావుగారి 'వల' కొమ్మనాపల్లివారి 'కేటు-డూప్లికేటు' వి.యస్.కామేశ్వర రావుగారి 'కంచికి చేరని కథ', జయప్రకాష్ 'గారడి' దీన్ బద్రూగారి 'ఆ ఉదయం ఎప్పుడో' మున్నగు నాటికలు రంగస్థలిపై విస్తృతంగా ప్రదర్శింపబడి ప్రేక్షకలోకాన్ని అలరించాయి.

## జనచైతన్యానికి జండాలెత్తిన 1980 దశాబ్దా సందేశాలు 1980 లో వెలువడిన 400 నాటికలు, 70 నాటకాలు

1980 నుండి నేటి వరకు తెలుగు నాటక సాహిత్యంలో సుమారు 400 నాటికలు 70 నాటకాలు వచ్చిచేరాయి. నాటకాల పరిస్థితి నానాటికీ నిరాశాజనకంగా ఉంది. ఆ వచ్చే నాటకాలలో 20 మించి మంచి నాట కాలు లేవని చెప్పడం సత్యదూరం కాదు. దీనికి కారణాలు రెండూ రెండున్నర గంటలసేపు నాటకాలు చూపకపోవడం ఒక కారణమైతే నాటక పరిషత్తులు ఏవో నాలుగైదు మినహాయిస్తే అన్నీ నాటకాల పోటీలు జరిపే పరిషత్తులు కావడం రెండో కారణం.

## పరిషత్తులకే పరిమితమైన నాటక రంగం

1980 నుంచీ నాటకరంగం పరిషత్తు పోటీలలోనే తన ఉనికిని సమర్థించుకొంటూ మనుగడ సాగిస్తోంది. విడిగా నాటకాలు ఎక్కడో అరుదుగా జరిగే సంఘటనగా మారింది. ఒకప్పుడు నాటికలు హైస్కూలు నుంచీ విశ్వ విద్యాలయాల వరకూ వార్షికోత్సవాల్లో ప్రదర్శించబడేవి. ఇప్పుడు పరిస్థితి పూర్తిగా మారిపోయింది.

ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లోవివిధ ప్రాంతాలలో 66 నాటక పరిషత్తులున్నాయి. ఆ పోటీల కోసమే నాటక రచయితలు నాటికలు రాస్తున్నారు. పోటీల కోసమే

నటీనటులు నాటికలను చేపట్టి సాధన చేస్తున్నారు. మరికొందరు సినిమాల్లో చేరడానికో, టివి సీరియల్స్‌లో ప్రవేశార్హత గడించడానికో ఒక స్టెప్పింగ్ స్టోన్‌లా నాటక రంగాన్ని తాత్కాలిక మజిలీగా చేసుకొంటున్నారు. ఏది ఏమైనా పరిషత్తులు నేటి నాటకరంగానికి ప్రాణవాయువు అందిస్తున్నాయనటం నిర్వివాదం. పరిషత్తుల వల్లనే కొత్త నాటకాలు, నాటికలు ఉత్పత్తి అవుతున్నాయి. కొత్త రచయితలు వెలుగులోకి వస్తున్నారు. కొత్త నటీనటులు రంగప్రవేశం చేస్తూ నాటక రంగాన్ని సుసంపన్నం చేస్తున్నారు. పరిషత్తులకు ప్రత్యామ్నాయం ఏర్పడే వరకు మార్గాంతరం లేదు. పరిషత్తుల నీడలోనే సేద తీర్చుకోకతప్పదు.

## ప్రగతికి బాట చూపిన వైవిధ్య రచనలు

ఇక ఈ ఇరవై ఏళ్లలో నాటక నాటికల తీరు తెన్నులు పరిశీలిస్తే ప్రధానంగా మనల్ని ఆకర్షించే లక్షణం కథావస్తువులో గోచరమయ్యే అనంత వైవిధ్యం. సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యల్ని, భిన్నకోణాల నుంచి పరిశీలించి కొందరు రచయితలు మనోజ్ఞమైన నాటక సృష్టి చేశారు, గడిచిన రెండు దశాబ్ధాలలో (1980-2000 సం.లలో) వెలువడిన ఈ క్రింది నాటక సాహిత్యం మన ప్రగతిని, నాటక రంగవైభవాన్ని దృగ్గోచరం చేస్తుంది.

## ప్రతిభావంతులైన వర్ధమాన రచయితల రచనలు రచయితలు

| | |
|---|---|
| తపస్సు | పల్లేటి లక్ష్మీకులశేఖర్ |
| కాలజ్ఞానం | నుసుము నాగభూషణం |
| జారుడు మెట్లు | కావూరి సత్యనారాయణ |
| రావణకాష్టం | కావూరి సత్యనారాయణ |
| అమ్మ | ఆకెళ్ళ |
| రేపటి శత్రువు | ఆకెళ్ళ |
| పక్కింట్లో పుట్టింది | వై.ఎస్. కృష్ణేశ్వరరావు |
| ఏడవకండేడవకండి | మారెళ్ల |
| హింసధ్వని | వల్లూరి శివప్రసాద్ |

| | |
|---|---|
| ఎడారి కోయిల | వల్లూరి శివప్రసాద్ |
| హిమాగ్ని | ఎ.భాస్కర చంద్ర |
| కొయ్యగుర్రం | ఎ.భాస్కర చంద్ర |
| వామనవృక్షం | ఎ.భాస్కర చంద్ర |
| వఱడు | కందిమళ్లసాంబశివ రావు |
| ఇప్పుడు | పి.ఆర్. రామకుమార్ |
| యజ్ఞఫలం | బీనీడు కృష్ణయ్య |
| భేతాళ ప్రశ్న | కంచర్లసూర్య ప్రకాశరావు |
| రాయి | యస్ ఎం వి. గోపాలరాజు |
| బహురూపి | శిష్ట్యాచంద్రశేఖర్ |

## నాటక రచయితలు

| నాటకం | రచయిత |
|---|---|
| పడమటిగాలి | పాటిబండ్ల ఆనందరావు |
| కాకిఎంగిలి | ఆకెళ్ల |
| క్రాస్ రోడ్స్ | ఆకెళ్ల |
| ఒంటెద్దుబండి | ఎల్.టి. శ్రీరామ్ |
| కుర్చీ | డి. విజయ్‌భాస్కర్ |
| అమృతం తాగిన రాక్షసులు | శ్రీశైలమూర్తి |

పైన పేర్కొన్న నాటక నాటికలు నేటి మన నాటక సాహిత్యంలో వస్తు వైవిధ్యాన్ని వైశిష్ట్యాన్ని ప్రస్ఫుటం చేసే మచ్చు తునకలు.

## మణిదీపాలు వెలిగించిన మహిళా రచయితలు

1980-2000 సం.ల మధ్య 220 మంది నాటక కర్తలు నాటక నాటికలు వ్రాయటం అపూర్వం. బహుశా ఏ భారతీయ భాషల్లో కూడా ఇంతమంది నాటక రచయితలు ఏకకాలంలో కలాలు కదిలించిన ఆధారాలు కనబడవు. శ్రీమతి శారదా అశోక్‌వర్ధన్ (మబ్బుతెర, మళ్ళీ వసంతం) శ్రీమతి అత్తలూరి విజయలక్ష్మి (మ్యాచ్

ఫిక్సింగ్) మాదిరెడ్డి సులోచన (అమ్మకానికో అబ్బాయి) శ్రీమతి అత్తిలి పద్మావతీ కృష్ణ (సంధ్యా-ఛాయ) వంటి రచయిత్రులు రంగస్థల నాటకాలు, నాటికలు రచించడం తెలుగు నాటకరంగం గర్వించదగిన విషయం.

నాటకరంగాన్ని తమ రచనలతో పరిపుష్టం చేసిన వారిలో ఈ క్రింది నాటకకర్తలు ప్రముఖంగా పేర్కొనదగినవారు

పి టి.మాధవ్, వీరపల్లి వీణావాణి, వై.సాయిబాబా, మార్గశీర్ష యం సంజీవి, కె కె.ఎల్ స్వామి, బత్తుల రామకృష్ణ, గోళ్ళపాటి నాగేశ్వరరావు, శంకరమంచి పార్థసారధి, పి.వి. కృష్ణమూర్తి, తనికెళ్ల భరణి, ఉదయభాను ప్రభృతులు తమ రచనలతో రసజ్ఞ లోకాన్ని అలరించారు.

ఈ ఇరవై ఏళ్ళలో వివిధ రచయితలు రాసిన నాటక నాటికలను స్థూలంగా ఈ కింది విధంగా వర్గీకరించవచ్చు.

1 కుటుంబ వ్యవస్థ, 2. విద్యావ్యవస్థ 3. పోలీస్ వ్యవస్థ, 4. బడుగు వర్గాల సమస్యలు, 5. స్త్రీల సమస్యలు, 6. హాస్యరచనలు, 7. వివిధాంశాలు

## మరోశతాబ్దానికి పరిగెత్తుతున్న ఈ దశాబ్దపు చివరి దశ

భారతీయ జీవన విధానంలో గతానుగతికంగా వస్తున్న ఉమ్మడి కుటుంబ వ్యవస్థ బీటలువారి, శిధిలమై క్రమక్రమంగా అంతరించి పోతున్న ఈ దశలో, కుటుంబ సభ్యుల్లో సఖ్యతను అనురాగబంధాన్ని మమతానురాగాలను ఏకోన్ముఖం చేసి పట్టినిలపగల మరో వ్యవస్థ ఏదీ ఆవిర్భవించలేదు. విద్యావంతులు ఉద్యోగాల వేటలో పల్లెటూళ్ళు విడిచి పట్టణాలకు తరలిపోతున్నారు. కొందరు విదేశాలలో స్థిరపడిపోతున్నారు. వివాహం కాగానే వేరు కుంపటి పెట్టే తత్వం సర్వసామాన్యమైపోయింది. పుట్టిన గడ్డను, పరిసరాలను ప్రేమించేవారు సెంటిమెంటల్‌ఫూల్స్ కింద పరిగణింపబడుతున్నారు. కుటుంబం నుంచి దూరంగా వుంటూ ఉద్యోగాలు చేసుకొంటున్నవారు తల్లిదండ్రుల పట్ల శీతకన్ను వేయడం నిర్లక్ష్యం చేయడం, నిరాదరించడం వల్ల మధ్యతరగతి కుటుంబాలలో ఉత్పన్నమయ్యే భయంకర సమస్యలను వివిధ కోణాలనుంచి పరిశీలించి నాటికల రూపంలో ఆవిష్కృతం చేసారు. రచయితలు శ్రీ ఆకెళ్ళ రచించిన ' అమ్మ రేపటి

శత్రువు' కంచెర్ల సూర్యప్రకాశరావుగారి' భేతాళ ప్రశ్న', వి.ఎస్.కామేశ్వరరావుగారి, 'నత్వం శోచితుమర్హసి', కాశీవిశ్వనాధ్‌గారి 'జీవనసంధ్య' దాట్లనారాయణమూర్తిరాజు గారి 'మేలుకొలుపు' మున్నగు నాటికలు నేటి కుటుంబ వ్యవస్థలో దైన్యాన్ని హైన్యాన్ని నగ్నంగా అభివ్యక్తం చేసే ఉత్తమ ప్రమాణాలు గల నాటికలు, జీడిగుంట రామచంద్రమూర్తి గారి అశ్రుఘోష నాటకం, కావూరి సత్యనారాయణగారి జారుడుమెట్లు, ఎ. భాస్కరచంద్రగారి వామనవృక్షం నాటికలు ఈ కోవకు చెందినవే.

## వ్యాపార విద్యాసంస్థల రుగ్మతలను, వివరించే వీధి నాటికలు

అత్యాధునిక యుగంలో విద్యారంగాన్ని కూడా నాటక రచయితలు విడిచిపెట్టలేదు.విద్యావ్యవస్థలో నెలకొన్న అస్తవ్యస్థ పరిస్థితులు, తలిదండ్రుల నిర్లక్ష్య ధోరణి, ఉపాధ్యాయుల బాధ్యతా రాహిత్యం, సంస్కారాన్ని ప్రోది చెయ్యలేని చదువులు, విజ్ఞానం కంటే ధనార్జనే జీవిత ధ్యేయంగా రాజ్యం చేస్తున్న పరిస్థితుల ప్రభావం ఇవన్నీ నేటి రచయితలకు కధావస్తువులయ్యాయి ఇటీవల కాలంలో విద్యవ్యాపారంగా మారిన దారుణ పరిస్థితుల్ని చిత్రిస్తూ వచ్చిన మొట్టమొదటి నాటిక, పెద్దబాలశిక్ష, రచయిత ఆకెళ్ళ సత్యనారాయణ మూర్తి గారు. దీని తర్వాత గోళ్ళపాటి నాగేశ్వరరావుగారి సరస్వతీ నమస్తుభ్యం నాటిక వచ్చింది. ఇవి రెండూ ఆధునిక వీధి నాటకశైలిలో మలచబడిన నాటికలు. కావూరి సత్యనారాయణగారి శ్వేతపత్రం, రివర్స్‌మార్చ్' నాటికలు, శ్రీకంఠా హనుమంతరావుగారి ధర్మాగ్రహం, గోళ్లపాటి "పుట్టలో వేలెడితే కుట్టనా" వల్లూరి శివప్రసాద్‌గారి ఓనమాలు విద్యావ్యవస్థను చిత్రించిన మంచినాటికలు.

## విద్యారంగంలో తల్లిదండ్రుల పాత్రలను చిత్రించిన రాజ్యహింస నాటిక

విద్యారంగంలో తలిదండ్రుల పాత్రను గుర్తుచేస్తూ, వల్లూరి శివప్రసాద్ శక్తిమంతంగా చిత్రించిన హింసధ్వని నాటిక అత్యంత ప్రజాదరణ పొందింది. ఈ నాటిక అన్నీ భారతీయ భాషల్లోకి అనువదించ బడింది గంగోత్రి పెదకాకాని సమాజం శ్రీ నాయుడు గోపి దర్శకత్వంలో ఈ నాటిక వందలాది ప్రదర్శనలిచ్చి పండిత పామరుల ప్రశంసలు అందుకొంది. ఈ నాటిక ప్రదర్శించబడని నాటక పరిషత్తు

లేదు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంచే బంగారు నంది బహుమతిని కూడా అందుకొన్న ఉత్తమ నాటిక హింసధ్వని శ్రీయుతులు నాయుడుగోపి, డి సాయికుమార్, సి హెచ్. రజితమూర్తి, బి. బాబూరావు, చంటి, శ్రీమతి బి భార్గవి, శ్రీమతి ఎం రత్నకుమారి, తదితర నటబృందం ఈ నాటికకు అఖండ విజయాన్ని చేకూర్చింది

## ఉన్నవాడికి వత్తాసు పలికే పోలీసుల వికృతచేష్టలను చూపే నాటికలు

ప్రజలకు రక్షకులుగా ఉండాల్సిన పోలీసులు అధికారగణం చెప్పు చేతల్లో వుంటూ, ఉన్నవాడికి వత్తాసు పలికే నైజాన్ని కొన్ని వేళల రాక్షస ప్రవృత్తిని ప్రదర్శించే ఉదంతాలను నాటకకర్తలు నిర్భయంగా ఎండ గట్టారు.

రక్షణ కోసం పోలీస్ స్టేషన్ మెట్లు ఎక్కడం కన్నా, గూండాల దౌర్జన్యానికి తలవొగ్గడం కొంతలో కొంతమేలు అనుకొనే మానసిక స్థితికి చేరుకున్నారు సామాన్యప్రజలు బ్రిటీష్ ప్రభుత్వంలో కన్నా స్వేచ్ఛా భారతంలోనే పోలీసుల చేతుల్లో కష్టజీవులు, బడుగు వర్గాల చిత్రహింసలకు ఎక్కువ గురి అయ్యారనే అభిప్రాయం ప్రజల్లో ఉంది లాకప్‌డెత్‌లు, బూటకపు ఎన్‌కౌంటర్లు, పోలీస్ లాకప్‌లో ఆత్మహత్యలు స్వాతంత్ర్యానంతరం పోలీస్ రాజ్యంలోనే వింటున్నాం!

## పోలీసుల అత్యాచారాలకు ప్రతిబింబం రాజ్యహింస

ఒక మంత్రిగారి మనవడు, తాగినమైకంలో ఒకర్ని దారుణంగా హత్య చేస్తాడు. రాజుతలుచు కొంటే దెబ్బలకు కొదవా? హంతకుణ్ణి విడిచి పెట్టి ప్రత్యక్ష సాక్షిని లాకప్‌లో పెట్టి చిత్రహింసలు పెడతారు పోలీసులు, చివరకి అతను పిచ్చివాడుగా మారిపోతాడు. ఇదీ ఇతివృత్తం యం. సంజీవిగారి రాజ్యహింస నాటికలో పోలీస్ అత్యాచారాలను ఇంత నిర్భయంగా, వెల్లడించిన నాటిక తెలుగులో రాలేదు. పోలీసుల ఏక పక్ష నిర్ణయాలను, నిరంకుశత్వాన్ని పాశవికతను వివిధ కోణాల్లో విశ్లేషిస్తూ మరికొన్ని నాటికలొచ్చాయి యస్వీ సుబ్బారెడ్డిగారి జాతి స్మరామి, ప్రార్థన, కప్పగంతుల మల్లికార్జునరావుగారి ఆశయబద్ధత, కె.శరత్ చంద్రారెడ్డిగారి శవోహం పి.బి.కె.శర్మ రచించిన దిరూట్ మొదలైనవి పోలీస్ అక్రమాలపై సంధించిన విమర్శనాస్త్రాలే!

## మూడు తరగతుల స్త్రీల సమస్యలను ప్రభోధాత్మకంగా తీర్చిదిద్దిన 'నాటికలు'

1980-2000 మధ్య కాలంలో సంఘంలో స్త్రీల ఎదుర్కొంటున్న సమస్యలను విశ్లేషిస్తూ అత్యధిక సంఖ్యలో నాటికలు, కొన్ని నాటకాలు వెలుగుచూసాయి. వాటిలో మూడు వర్గాల స్త్రీ జీవితాలను ఆవిష్కరిం చడం జరిగింది. పురుష్యాధిక్య సమాజంలో పురుషుని నిరంకుశ ధోరణికి తలొగ్గిపోతూ పాస్సివ్ సఫరర్స్‌గా జీవితంలో రాజీపడి బ్రతికే స్త్రీలు ఒక వర్గమైతే, చదువు సంధ్యలు తెలివి తేటలు ఉన్నా సంఘానికి కట్టుబాట్లకూ భయపడి నిస్సహాయంగా నిష్క్రియాపరులుగా వుండి పోయే స్త్రీలు రెండవ వర్గం కాగా, పరిస్థితుల్ని ఎదురించి కార్యాన్ని సాధించే స్త్రీలు మూడవ వర్గానికి చెందిన వారు ఇలా సాంప్రదాయబద్ధులు నిష్క్రియాపరులు, కార్యసాధకులు అనే మూడు తరగతుల స్త్రీల జీవిత సమస్యల తోరణాలతో మన నాటక కర్తలు ప్రబోధాత్మకంగా నిర్మాణాత్మకంగా నాటక నాటికలు రచించి స్త్రీ జనాభ్యుదయానికి చక్కని బాటలు వేసారు . ప్రజలను ఆలోచింపజేసారు.

## కొందరు రచయితలు వారి రచనలు

ఎస్.కె. ఆంజనేయులు గారి "రాధికా స్వాంతం" నాటిక ఈ దశలో తొలిమెట్టు అయింది. మార్గశీర్షరచించిన" శ్వేత పత్రం" నాటకం, నుసుము నాగభూషణంగారి" కాలజ్ఞానం" నాటిక, మారెళ్ల "సతి శమీవహ్ని" ఏ భాస్కరచంద్ర "హిమాగ్ని"," కొయ్యగుఱ్ఱం", నాటికలు స్త్రీ సమస్యల తీవ్రతను హృద్యంగా అభివ్యక్తం చేసినా "చైతన్య తరంగాలు" అత్తిలి కృష్ణారావు రాసిన "జోగు జాతర" నాటకం ఎస్ఎ. రావుగారి హరిత దీన్‌బంధు గారి "తాళి" తనికెళ్ల భరణి"గో గ్రహణం' 'మున్నగు నాటికలు స్త్రీ సమస్యలను బలంగా, సూటిగా ఆవిష్కృతం చేసి ఆలోచింపజేసాయి.బడుగు వర్గాల బాధల్నీ, గాథల్నీ చిత్రిస్తూ కర్తవ్యాన్ని ప్రబోధించిన ఎన్నో నాటికలు

సమాజంలో ఆర్థిక అసమానతల వల్ల ఉత్పన్నమయ్యే సమస్య లను, బడుగువర్గాలు జీవన పోరాటంలో అనుభవిస్తున్న కష్టాలున్న ఇతి వృత్తంగా స్వీకరించి అనేక మంది నాటక నాటికలు రాశారు కాని అధిక శాతం మధ్యతరగతి జీవితాలను

చిత్రించడంతోనే నాటక రచన పరిమితం కావడం విశేషం. ఆనాటి గురజాడ మొదలు ఈనాటి ఆకెళ్లవరకూ, మధ్య తరగతికే ప్రాధాన్యమిచ్చారు పై తరగతి, మధ్య తరగతి, కింది తరగతే కాక, కింద తరగతి కింద మరో అట్టడుగు వర్గం వుందని గుర్తించి, వారి జీవితాలు కూడా పరామర్శించాలని ప్రయత్నం చేసిన రచయితలు అరుదుగా కన్పిస్తారు. లోగడ పినిశెట్టి శ్రీరామమూర్తి, కొడాలి గోపాలరావు, బోయిభీమన్న, కారెపు అప్పలస్వామి వంటి రచయితలు అట్టడుగు వర్గాల జీవిత సమస్యలను నాటకీకరించారు. నేటి తరంలో యం. సంజీవి, గణేశ్ పాత్రో,దీన్ బంధు, మారెళ్ల వంటి రచయితలు బలహీనవర్గాల వైపు దృష్టిసారించి ప్రయోజనాత్మకమైన నాటక సృష్టి చేస్తున్నారు. ఎం. సంజీవి కదలిక గణేశపాత్రో "పావలా", డీన్‌బంధు "పులీమేకలోస్తున్నాయి జాగ్రత్త", మారెళ్ల "ఏడవకండేడవకండి", మోదుకూరి జాన్సన్ , "దిక్కులేనోడు", న్యాయం వీరాపోతన "నాలుగుకాళ్ల మనిషి" పల్లేటి లక్ష్మి కుల శేఖర్, "ధృతరాష్ట్ర కౌగిలి", మొదలైనవి ఈ కోవకు చెందిన నాటికలు. భారతదేశం పల్లె జీవితంలో మమేకమై ఉంది. (ఇండియన్ లీవ్స్ ఇన్ విలేజస్) అన్నారు మహాత్మాగాంధీ. దేశానికి పట్టుగొమ్మ అయిన గ్రామీణప్రాంతాలను మన రచయితలు నిర్లక్ష్యం చేస్తున్నారు. గ్రామీణ జీవితం మీద, వారి సమస్యల మీద మరెన్నో నాటకాలు రావలసివుంది. ఇకనైనా నాటకకర్తలు ఆ పనికి పూనుకుంటారని ఆశిద్దాం.

## పాటిబండ్ల ఆనందరావు పడమటిగాలి నాటకం

వివిధాంశాలమీద వస్తువైవిధ్యంతో ఎన్నో నాటక నాటికలొచ్చాయి. పాశ్చాత్య దేశాల ప్రభావంతో భూమికీ రైతుకీ ఉన్న అనుబంధం సన్నగిల్లిపోతోందనీ, నేలతల్లిని వ్యాపార దృష్టితో అమ్ముకునే దుస్థితి దాపురించిందనీ, ఈ ప్రమాదాన్నుంచి బయట పడకపోతే మానవాళి అన్నంకోసం అలమటించే రోజులొస్తాయని, పాటిబండ్ల ఆనందరావు పడమటిగాలి నాటకం ద్వారా బలంగా చాటిచెప్పారు. 1998లో ఆటా (అమెరికా) వారు నిర్వహించిన అంతర్జాతీయ నాటక రచన పోటీలలో ఈ నాటకం ప్రథమ బహుమతిని గెల్చుకొంది. సమాజాన్ని తప్పుతోవ పట్టించే రచనలు రచయితలు చెయ్యరాదని ఉద్బోధించే సారీ నేను మరణించాను అనే నాటకాన్ని వై. సాయిబాబా రచించారు. ఇది కూడా ఆటా నాటక పోటీలలో ద్వితీయ బహుమతి పొందింది.

## ఈ తరపు వింతపోకడల ప్రతిబింబాలు

కన్నబిడ్డల్ని అష్టకష్టాలకోర్చి పెంచి పోషించి విద్యాబుద్ధులు చెప్పించి ప్రయోజకుల్ని చేసిన తల్లిదండ్రులు వృద్ధాప్యంలోకి చేరుకున్నా, యింకా వారిపై బాధ్యతల బరువు మోపి వారిని కష్టాలకు గురిచేసే పిల్లల స్వార్థ చింతనకు అక్షరరూపం వల్లూరి శివప్రసాద్ గారి "వానప్రస్థం" నాటకం. ఉపకారం చేసిన మనిషికి ప్రత్యుపకారం చెయ్యకపోగా అపకారం చేసే ధూర్త మానవుణ్ణి చిత్రిస్తుంది,"వరదు" నాటిక దీని రచయిత డా. కందిమళ్ల సాంబశివరావు, నంది నాటకోత్సవాలలో ప్రథమ బహుమతిని అందుకొన్న విలక్షణ నాటిక ఇది. ప్రజాదరణ లేక కాలగర్భంలో కలిసి పోతున్న అపురూప జానపద కళలను సముద్ధరించి కాపాడుకొనకపోతే మన సంస్కృతి వైభవానికి భావితరం వారికి ఆనవాళ్ళేమి గలవనీ, వాటిని పరిరక్షించుకోవడం మన బాధ్యత అని హెచ్చరిక చేస్తూ కనువిప్పు కలిగించే రసార్ద్ర భావ సమన్వితమైన నాటిక బహురూపి రచన శ్రీ శిష్టా చంద్రశేఖర్.

## సంచలనం కలిగించిన "కుర్చీ నాటకం"

రిజర్వేషన్ల మూలంగా అధికార పీఠం దళితులకు దక్కినా అసలైన అధికారం తమ చెప్పుచేతల్లో పెట్టుకుని భూకామందులు దళిత ప్రతినిధిని కీలు బొమ్మగా ఆడించే వైనం డి. విజయభాస్కర్‌గారి 'కుర్చీ' నాటకంలో సంఘటనాత్మకంగా వివరించబడింది. నంది నాటకోత్సవాలలో ఉత్తమ రచనకు బహుమతి నందుకొన్న ఒక మంచి నాటకం ఇది.

సుకమంచి 'కలహాల కాపురం' శంకరమంచి పార్థసారథి 'సైలెన్స్ ప్లీజ్' వరికూటి శివప్రసాద్ 'చిటారు కొమ్మన మిరాయిపొట్లం' గోళ్లపాటి 'మాయాబజార్ వీర్లవరప్రసాద్ 'గ్యాసొచ్చింది' మొదలైన హాస్యనాటికలు కూడా ఆంధ్రప్రేక్షక లోకాన్ని అలరించాయి. ఇంకా ఎందరో మహానుభావులు తమ కల్పనాశక్తితోఉత్తమ శ్రేణి నాటకాలను, నాటికలను రచించి తెలుగు నాటక కళావికాసానికి ఎంతో శ్రమించారు, శ్రమిస్తున్నారు. రచనా పరంగా ప్రదర్శనా పరంగా కూడా తెలుగునాటకం ముందంజ వేస్తోంది. నాటక రంగానికి ఇప్పుడు కావలసింది ప్రజాదరణ. అదే ఏ కళావికాసాని కైనా మూలాధారం. ప్రాణవాయువు.

# ప్రసిద్ధ నాటక దర్శకులు

**శ్రీయుతులు**

1.చాట్ల శ్రీరాములు
2. దేశరాజు హనుమంతరావు
3. డి. రాజేశ్వరరావు
4 బి. భానుప్రకాష్
5. కె.ఎస్.ఎన్ మూర్తి
6. తాళ్ళూరి శివరామకృష్ణారావు
7.డిఎస్ఎన్ మూర్తి
8. భాస్కరశివాల్కర్
9. కె. విద్యాసాగర్
10. జే సిద్దప్ప నాయుడు
11. బి.పి. ప్రసాద్
12 తల్లావఝుల సుందరం
13. డీన్‌బద్రూ
14.పి.వి.ఎస్.ఎన్. పాత్రో
15. యం.జి. ప్రసాద్
16. బి. అమరేంద్ర
17. బి. శశాంకరావు
18. చీకోటి వినోద్‌కుమార్
19. రాంకుమార్ (బి.హెచ్.ఇ.ఎల్)
20. జి.ఎస్.ఆర్.కె. శాస్త్రి
21. శిఖరం సాంబశివరావు
22. జి. ఉదయభాను
23. ఉప్పులూరి సుబ్బరాయశర్మ
24 డి సోమేశ్వరరావు
25. శ్రీ కంఠ హనుమంతరావు
26. రమణప్రభు
27. విగ్రహాల రామారావు
28. కే.శే. కే శ్రీహరిమూర్తి
29. కే.జి. రాంప్రసాద్
30. యన్. రవీంద్రరెడ్డి
31. యస్. మోహన్
32. తులసి బాలకృష్ణ
33. కంచర్ల సూర్యప్రకాశరావు
34. కే.కే.ఎల్. స్వామి
35. పి. రాజ్‌కుమార్
36. టి. మురళి కృష్ణ
37. అబ్బూరి గోపాలకృష్ణ
38. రావూజీ (కోట అప్పారావు)
39. కే. మందులు
40. కే. వెంకటేశ్వరరావు
41. పి.టి. మాధవ్
42. కొత్తుర్తి భాస్కరరావు
43. యస్. కె. మిశ్రో
44. పిళ్లా సన్యాసిరావు
45. యల్. సత్యానంద్
46. పి. కృష్ణ చైతన్య

47 కీ శే అత్తిలి కృష్ణారావు
48. నిమ్మకాయల సత్యనారాయణ
49 కొత్తపల్లి బంగారు రాజు
50 గంటా సత్యనారాయణ
51. పి. రాంకుమార్
52. నానిబాబు
53. నండూరి భీమశంకరం
54. పరివాడ శ్యామ్‌ప్రసాద్
55. కొండవలస లక్ష్మీరావు
56. ఎం ప్రసాదమూర్తి
57. టి. వి. మణికుమార్
58. కీ.శే. టి.జె. రామనాధం
59. ఆర్.వి. చలం
60. జి. వెంకట్రావు
61. ఎం.జి. షహన్‌షా
62. కీ.శే. బాబీ
63 కే. రాజబాబు
64. ఏ.ఎన్. మూర్తి
65. పంతం సత్యానంద్
66. ఆర్.వి.రమణరావు
67. పి.ఆర్.శరణ్
68. జి. భరద్వాజ్
69. కత్తుల రామమోహన్‌రావు
70. జె.డి.ప్రసాద్
71. నందిరాజు సుబ్బారావు
72. అనంతహృదయరాజ్
73. యం. సంజీవి
74 ఏ శివరామిరెడ్డి
75 టి మధుకుమార్
76. తుర్లపాటి బాబ్జీ
77 డా బ్రహ్మానందరావు
78 ఏ. భాస్కరచంద్ర
79. కే.పి. రాజు
80. ఎన్. రామారావు
81 మళ్ల నాగేశ్వరరావు
82. ఏ వివిఎస్ స్వామి
83. కే.ఎస్ టి. శాయి
84. వై. చంటి
85. వై ఎస్. కృష్ణేశ్వరరావు
86. నుసుము నాగభూషణం
87. నుసుము కోటశివ
88 వరికూటి శివప్రసాద్
89. కావూరి సత్యనారాయణ
90. నాయుడు గోపీ
91. కే.వీ. ప్రసాద్
92. పాములయ్య
93. గోళ్ళపాటి నాగేశ్వరరావు
94. కీ.శే. కే. మధుబాబు
95. ధవళ సత్యం
96. కీ.శే. తాతాజీ
97. ఎస్.వి.ఆర్. చిన్ని
98. బి.వీ. చంద్రశేఖర్‌రావు
99. ఆర్. రామారావు
100. కొల్లా రాధాకృష్ణ

101. ఐ రాజ్‌కుమార్
102. జలకం రాధాకృష్ణయ్య
103 కే. బాలచందర్
104. జె.ఎస్. రాజశేఖర్
105 కే శాంతిబాబు
106. ఏ వీ. మల్లేశ్వరరావు
107. వి.బి.కే.శర్మ
108. నవనాథరావు
109. జి.ఎస్.ఆర్. ఆంజనేయులు
110. ఎం.ఏ. ఖాదర్. (జీవనశ్రీ)
111. జి. చంద్రశేఖర్
112. మారెళ్ల
113. డా. వేణు
114. జి. సీతారామయ్య
115. ఎస్. కృష్ణకుమార్
116. పల్లేటి లక్ష్మీ కులశేఖర్
117. ఏ. నాగరాజాచారి
118. పి.వి. భవానీప్రసాద్
119. సయ్యద్ అహమ్మద్
120. సంజన్న
121. బలదేవ్ సింగ్
122. పి. దాస్
123. జరుగుల రామారావు
124. ఎం.వి.ఎస్. హరనాథరావు
125. ఇసుకపల్లి మోహనరావు
126. వి.ఎస్. కామేశ్వరరావు
127. వేముల మోహన్‌రావు
128. నాంపల్లి మధుబాబు
129 రాజిరెడ్డి
130 అన్నమనేని ప్రసాద్
131. శాయన్న
132. శ్రీరాముల సత్యనారాయణ
133. పి. తిరుమలయ్య
134. దయానందబాబు
135. అడవయ్య
136. సమ్మెట సుబ్బారావు
137. మొదలి నాగభూషణశర్మ
138 నిట్టల శ్రీరామమూర్తి
139. ఎం. అప్పారావు నాయుడు
140. చింతా కబీర్‌దాస్
141. ఎస్.కె. ఆంజనేయులు
142. పీసాపటి శేషుబాబు
143.వల్లూరి ఆనందరావు
144. జవ్వాది రామారావు,మొదలైనవారు .



# ఆంధ్రప్రదేశ్‌లో నాటకపోటీలు నిర్వహించే కళా సంస్థలు

1 లలిత కళాసమితి
2 ప్రొద్దుటూరు కళాపరిషత్
3. కళాసమితి
4. ప్రభాకరనాటక కళాపరిపత్
5. ఆంధ్రనాటక కళాపరిపత్
6. ఆఫీసర్స్ క్లబ్
7. కె.ఎస్.ఆర్. మూర్తి కళాపరిపత్
8. జిఎస్ఆర్ మూర్తి కళాపరిపత్
9 నగర పాలక సంస్థ యువజనోత్సవాలు
10. రైల్వే ఇన్‌స్టిట్యూట్
11. ఆంధ్ర ఆర్ట్సు అకాడమి
12. వంగవీటి రంగాస్మారక పరిషత్
13. సుమధుర కళానికేతన్
14. విజయలక్ష్మీ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్
15 జీవిత బీమా ఉద్యోగుల లలిత కళాసమితి
16. కే.వి.ఆర్.నటసమాఖ్య
17 సుత్తి వీరభద్రరావు నాటక కళాపరిషత్
18. లలిత కళా సమితి
19. ఆళ్ల కృష్ణారావు మెమోరియల్ నాటక కళాపరిషత్
20. అనవేమా క్లబ్
21. ఆంధ్రవిజ్ఞాన సమితి
22. గుంటూరు కళాపరిషత్
23. ఇందిరాగాంధీ నాటక కళాపరిషత్
24. ఆలపాటి వెంకటరామయ్య స్మారక కళాపరిషత్
25. ఉషోదయా కళాపరిషత్
26 కోన ప్రభాకరరావు స్మారక కళాపరిషత్
27 కళ్యాణం రఘురామయ్య నాటక కళాపరిషత్
28. టి. కృష్ణ కళాపరిషత్
29 కక్కి వెంకటసుబ్బయ్య స్మారక కళాపరిషత్
30. కమలనాధుడి కళాపరిషత్
31. కర్షక కళాసమితి
32. చెన్నకేశవ నాటక పరిషత్
33. చైతన్య నిలయం
34. దొడ్డపనేని ఇందిరా కళాపరిషత్
35. నన్నపనేని కళాపరిషత్
36. నటరాజ కళాసమితి
37. ఆంధ్ర లలిత కళాసమితి (రైల్వే)
38. అన్నమయ్య కళాకేంద్రం
39. అ.జో.వి.భో. ఫౌండేషన్
40. అభ్యుదయ కళాసమితి
41. బి.హెచ్.ఇ.ఎల్. కమ్యూనిటీ సెంటర్
42. చెన్నమల్లేశ్వర కళాపరిషత్
43. ద్రాక్షారామ కళాపరిషత్
44. సంస్కృతి సమ్మేళనం
45. జ్యోతుల కళాపరిషత్
46. కాకతీయ కళాపరిషత్
47. కాళిదాస కళారాధన సమితి
48. కళాసాగర్
49. కళాసమితి ఎస్.సి. రైల్వే
50. లలిత కళాంజలి నాటక అకాడమీ

51. శ్రీ మూలాస్థానేశ్వర నల్లమిల్లి
మూలారెడ్డి నాటక కళాపరిషత్
52. మునగపాక కళాపరిషత్
53. నటరాజ కళాపరిషత్
54 ఎన్.టి.ఆర్ కళాపరిషత్
55 పరుచూరి రఘుబాబు కళాపరిషత్
56. రావుగోపాలరావు స్మారక నాటకోత్సవాలు
57 శ్రీశ్రీ ఎక్కలి దేవుడమ్మ నాటక కళాపరిషత్
58. తాతపూడి కళాపరిషత్
59. విశ్వశాంతి కళానికేతన్
60. నరసరావుపేట నాటక కళాపరిషత్
61. రంగస్థలి
62 సి ఆర్.క్లబ్ నాటక కళాపరిషత్
63. కళావాహిని
64. నటసమాఖ్య
65. యంగ్‌మెన్ హ్యాపి క్లబ్
66. సౌజన్య ఆర్ట్స్
67. కనకమహాలక్ష్మి నాటకోత్సవాలు
68. భారతీయ నాటక కళాపరిషత్
69. చైతన్య కళాభారతి
70. ఖమ్మం కళాపరిషత్
71. అక్కినేని నాగేశ్వరరావు కళాపరిషత్
72. కళా స్రవంతి
73. పాల్వంచ నాటక కళాపరిషత్
74. దేవబత్తుని నందీశ్వరుడు స్మారక
కళాపరిషత్ మొదలైన సంస్థలు...

## ప్రసిద్ధ నటీమణులు

1 శ్రీమతి కె. రాజేశ్వరి
2.శ్రీమతి కె. విజయలక్ష్మి
3. శ్రీమతి ఎం. జగదీశ్వరి
3. కుమారి శ్రావ్య
4. శ్రీమతి శ్యామల (పావలా)
5. శ్రీమతి రమాకుమారి ధార్మి
6 శ్రీమతి ఎన్. హేమ
7. శ్రీమతి ఉమ
8. శ్రీమతి వై. సరోజ
9. శ్రీమతి శ్రీదేవి
10 శ్రీమతి పద్మలత
11. శ్రీమతి వాసంతి
12. శ్రీమతి ఎస్. సుజాత
13. శ్రీమతి వై. శాంతాదేవి
14. శ్రీమతి భానుమతి
15. శ్రీమతి రమణ (సుజాత)
16. శ్రీమతి రజని
17. శ్రీమతి భార్గవి
18. శ్రీమతి చంద్రిక
19. శ్రీమతి శ్రీలక్ష్మి
20. శ్రీమతి పి. సీతాలత
21. శ్రీమతి లక్ష్మీ కనకాల
22. శ్రీమతి ఉమాకనకాల
23. కుమారి వి. రాజేశ్వరి (కళ్ళు)
24. శ్రీమతి నాగమణి

